# లక్షణ శిరోమణి

సంపాదకుడు:
విద్వాన్,
రావూరి దొరసామిశర్మ,
ఎం.ఏ., బి.ఓ.ఎల్.,




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

**LAKSHANA SIROMANI** — A classical work on Telugu prosody and grammar by Pothapi Venkata Ramana Kavi of 18th century A. D. Edited by Prof: Ravoori Doraswami Sarma.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు - 500 004

ప్రథమ ముద్రణ 1979

ప్రతులు 1000

వెల రూ. 18-50




ప్రకాశకులు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకా
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004

ముద్రణ
వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,
మద్రాసు - 1

# తొలిపలుకు



లక్షణశిరోమణి ఛందోలక్షణ వ్యాకరణగ్రంథం. పద్దెనిమిదో శతాబ్దంలో ఉన్న పొత్తపి వేంకటరమణకవి సమగ్రమైన లక్షణ గ్రంథాన్ని రచించే ఉద్దేశంతో ఈ గ్రంథాన్ని నిర్మించినాడు. ప్రాచీన ఆంధ్రలాక్షణికులు చెప్పని ఎన్నో అంశాలను ఈయన చెప్పడానికి ప్రయత్నించినాడు. చిత్రకవితనుగూర్చికూడా వివరించినాడు. ఈ గ్రంథం ఎన్నో అజ్ఞాతగ్రంథాలను, రచయితలను తెలియజేస్తున్నది. లక్షణాలకు లక్ష్యంగా ఏరుకున్న పద్యాలను చూపిస్తూనే ఆ ప్రయోగం ఏ పాదంలో ఉందో చూపించడం ఈ గ్రంథంలోని విశేషం. ఎన్నో కొత్త అంశాలను, ముఖ్యంగా ఛందస్సంబంధమైన విశిష్టతలను, తెలియజేసే ఈ గ్రంథం తెలుగు పాఠకలోకానికి ఇప్పటికైనా అందుబాటులోకి రావడం హర్షించదగ్గ విషయం. తెలుగు వ్యాకరణాంశాలనుకూడ రమణకవి అంతవివరంగా కాకపోయినా విశ్లేషించడానికి ప్రయత్నం చేసినాడు. తెలుగు ఛందస్సులనుగూర్చి వెలసిన గ్రంథాలలో ఇది శిరోమణివంటిది. ఈ గ్రంథంలో కవి ప్రతిపాదించిన అంశాలు, చెప్పిన తీరు, పేరుకు తగినట్లుగానే ఉన్నవి. పండితులకు సహృదయులకు ఇది మిక్కిలి ఉపయుక్తమైన గ్రంథంగా అకాడమి భావించి ప్రచురించడానికి పూనుకున్నది.

సుప్రసిద్ధ విమర్శకులు, ఛందోవ్యాకరణాది లాక్షణిక రహస్యాలను తలస్పర్శిగా అవగాహన చేసుకొన్న పండితులు శ్రీ రావూరి దొరసామిశర్మగారు, ఈ "లక్షణశిరోమణి" కి శుద్ధపాఠాన్ని సమకూర్చి చక్కగా పరిష్కరించి విపులమైన, విజ్ఞానప్రదమైన పీఠికను రచించి అకాడమితో సహకరించినారు. అకాడమి పక్షాన శ్రీ శర్మగారికి కృతజ్ఞతాపూర్వకమైన అభివందనలను సమర్పించుకుంటున్నాను.

హైదరాబాదు,
తేది: 6-1-1979.

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి.

# కృతజ్ఞత



ఈ లక్షణశిరోమణి వైశిష్ట్యమును నావలన నెఱింగి నాకోరిక మన్నించి దీనిని బ్రకటింప సమ్మతించి, యనేకాంతరాయములచే సకాలమునకు శుద్ధప్రతి నందింపక చేసిన యాలస్యమును సహృదయతతో సహించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కార్యదర్శులు మాన్యులు నగు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, ఏతద్గ్రంథ ప్రచురణ కంగీకరించిన అకాడెమీ కార్యనిర్వాహకసభ్య మహాశయులకు, మఱి యందులకు సహకరించిన మిత్రసత్తములు ఆంధ్రప్రదేశాస్థానకవులు డా. దాశరథిగారికి, పరిష్కరణ నాచేఁ జేయింప నేర్పాటుగావించి సహకరించుటయేకాక, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధకసంస్థలోని లక్షణశిరోమణి లిఖితప్రతులతో సంప్రతింపించి పాఠభేదములను వ్రాయించి పంపుట మున్నగు ముఖ్యకార్యములలో నవ్యాజప్రీతితోఁ దోడ్పడిన సహృదయులు సుహృదయులు మాన్యమిత్రులు నగు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుఁగు శాఖాధ్యక్షులు ఆచార్య, డా. జి. ఎన్. రెడ్డిగారికి, నా హార్ద ధన్యవాదములు.

మఱియుఁ బరిష్కరణ ప్రారంభించినది మొదలు సంపూర్తి యగువఱకు నెన్నోయాటంకములు సంభవించుచుండఁగా అండనిలిచి చేదోడువాదోడుగానుండి, సవరణ, వివరణ, అనుక్రమణిక, విషయ

సూచిక, అధస్సూచిక మున్నగు పరిష్కరణ సంబంధ కార్యాంగ నిర్వహణలో సంపూర్ణముగ సహకరించి, తొలుత చిత్తుప్రతిని, తదుపరి శుద్ధప్రతిని సిద్ధముచేసి యిచ్చిన మా శిష్యురాలు, మదరాసు క్వీన్ మేరీ కళాశాల తెలుఁగుశాఖాధ్యక్షురాలు, ప్రొఫెసరు డా॥ జి. లలితమ్మకు నా శుభాశాసనములు.

సాహిత్యమందిరము,
28, బండ్ల వేణుగోపాలనాయుడు వీధి,
తిరువల్లిక్కేణి, మదరాసు - 600005,
20-9-1978.

రావూరి దొరసామిశర్మ,
అసిస్టెంటు ప్రొఫెసర్ (రిటైర్డ్)
ప్రెసిడెన్సీకాలేజి, మదరాసు.

# విషయానుక్రమణిక

## ప్రధానవిషయములు

# విషయానుక్రమణిక

**లక్షణశిరోమణి :**

**ప్రథమాశ్వాసము - వరాధికారము :**

## తృతీయాశ్వాసము – వృత్తాధికారము :

# విషయానుక్రమణిక

పుట

ఉపరివృత్తములు :

శ్రీరస్తు

# లక్షణ శిరోమణి

## పీఠిక

ఆంధ్రభాషకు లక్షణగ్రంథము లాదికవియనఁబడు నన్నయభట్టారకుని కాలమునుండి యవతరింపఁజొచ్చినవి. నన్నయరచిత వ్యాకరణమగు నాంధ్రశబ్ద చింతామణి సుప్రసిద్ధము. మఱి భట్టారకుఁడు లక్షణసారమను ఛందోలక్షణగ్రంథమును నయితము సంతరించినట్లు ఆంధ్రప్రయోగరత్నాకరము రంగరాట్ఛందము మున్నగు గ్రంథములలోని యుదాహృతులవలన విదితమగుచున్నది. నన్నయ సమీపకాలమున నుదయించిన కవిజనాశ్రయమను భీమనఛంద మతిప్రచారము గలదై యున్నది.

ఆనాఁటినుండి నేఁటివఱకు రచితములయిన లక్షణగ్రంథము లసంఖ్యాతములు. అందుఁ గొన్నింటి వివరములు ముందు తెలుపఁబడును.

లక్షణగ్రంథములలోఁ గతిపయముమాత్రమే ముద్రితము. ముద్రణభాగ్యము నోఁచుకొనక యసూర్యంపశ్యములై యనేక లక్షణగ్రంథము లప్రకాశములై గ్రంథాలయములం దటనట శిథిలావస్థలో మూలఁబడియున్నవి. ప్రతికృతిలోను నేదో యొక విశిష్టత లేకపోలేదు. అయ్యవి వెలుఁగునకు వచ్చిననే వాని విలువ విదితమగును. అట్టి యాంధ్రలక్షణ గ్రంథములలో లక్షణశిరోమణి శిరోమణి వంటిది.

### కవి - తద్వృత్తాంతము

లక్షణ శిరోమణిని పొత్తపి వేంకటరమణకవి రచించెను. ఇతనికి రమణకవి యని వ్యవహారనామము. (1-12) రమణకవి నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు

(నందవరవంశోత్తంస - గద్య). ఆశ్వలాయనసూత్రుఁడు, గౌతమగోత్రుఁడు, పసింధి కొండ దుర్గ(ర్గ)రాజు వెంగనమంత్రి పౌత్రుఁడు, రామయామాత్యుని పుత్త్రుఁడు, మదూరి కొండార్య తనయుఁడైన రఘునాథమంత్రి దౌహిత్రుఁడు.

నందవరమున దశగ్రంథాలవారను నింటిపేరు గలవారు కాలక్రమమున రాయన ప్రెగ్గడవా రనఁబరఁగి, పొత్తపి గ్రామమునుజేరి, యందుఁ బ్రఖ్యాతిగాంచుటచే పొత్తపి వారన విఖ్యాతు లయిరఁట. (1-15) మనకవికాలమున వారియింటిపేరు పొత్తపివా రని రూఢికెక్కినది.

కవినివాసము పొత్తపియని యెంచవనగును. [1]ఈ పొత్తపి గ్రామము కడప మండలములో రాజంపేట తాలూకాలో చెయ్యేరు నదీతీరమున నున్నది. కవి పూర్వులు నందవరములోనివారు. నందవరముపేరి గ్రామము కడప నెల్లూరు జిల్లాలలోఁ గలదని తెలియవచ్చెడు. కవిగారి గురువు నింటిపేరు తరు(ర)ణివాయి. ఈ గ్రామము నెల్లూరు జిల్లా కోవూరు తాలూకాలో నున్నది. వీటి నన్నింటిని బరిశీలింప మనకవి కడప మండలములోనివాఁడని నిర్ణయించుట సహేతుక మనఁదగును.

*కవిగారి గురువు తర(రు)ణివాయి నరసింహకవీంద్రుఁడు, సకలవిద్యాపరిణతుఁడు, వివిధకవనశబ్దతర్కాది నిఖిలశాస్త్రప్రవీణుఁడు, కవిజనబ్రహ్మ, సుకవిసార్వభౌముఁడు. కవిసార్వభౌముఁడగు నీ గురుపాదుఁడు సంతరించిన యుద్గ్రంథములేవో శిష్యుఁడు పేర్కొనియున్నఁ బ్రశస్తి కాస్పదమైయుండును. కవికిఁగల గురుభక్తి యపారము నవ్యాజముననుట స్పష్టము. మన యాంధ్రకావ్యముల యవతారికా సంప్రదాయములలో గురుస్తుతిగూడ నొక యంశము. కాని గురుస్తుతిఁ గావించిన కవులు కొందఱే. గురునామస్మరణ గద్యలోఁజేసినవారు కొందఱు. అవతారికలోఁ బ్రత్యేకము గురువందన మాచరించిన ధన్యులగు కవిమూర్ధన్యులు - నన్నిచోడుఁడు, పాల్కురికి సోమన, ఎఱ్ఱాప్రెగ్గడ, అల్లసాని పెద్దన, అయ్యలరాజు రామభద్రుఁడు, తెనాలి రామకృష్ణుఁడు, అప్పకవి, గణపవరపు వేంకటకవి, అహోబల పండితుఁడు, కూచిమంచి తిమ్మకవి మున్నగువారు. మనకవి యీ గురుస్మరణను నవతారికలోనే కాక ప్రత్యాశ్వాసాంతగద్యలో మఱి ప్రత్యాశ్వాసాదిని సంతరించెను.

---

1. చూ. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము - కుందూరి ఈశ్వరదత్తు.

## కవి పాండిత్యాదులు

ఇతఁడు 'శ్రీమ ద్వేంకటరమణ కరుణాకటాక్షవీక్షణసంప్రాప్త సహజసారస్వతుఁడు, నిఖిలసుకవిజనాంగీకృతదత్త నిశ్శంకలక్షణ చక్రవర్తి' బిరుదాంకుఁడు (గద్య) ఈ లక్షణచక్రవర్తి బిరుదము నవతారికలోను బ్రస్తావించినాఁడు. (1-14) మఱి యాశుఁదాశు మధుర చిత్ర విస్తరము లనుచతుర్విధకవితారచనలో ధురంధరుఁడు, జ్యోతిష గ్రంథైకసారజ్ఞుఁడు, వాస్తు గణిత భరతాది శాస్త్రరసజ్ఞుఁడు. (ఇతని కవితాదికచాతుర్యమునకు అవతారిక - 'తత చిత్రబంధ సంధాన ధౌరంధర్య' - 1-14 అను పద్యము చూచునది.) ఈ పద్యమున్నతీరు నారయ నీ కవి కనేకవిద్యలు శాస్త్రములు నభ్యస్తములనియు, నవధానికూడ నయియుండుననియుఁ దోఁచెడు. మీఁదు మిక్కిలి శ్రీనాథ భీమ శబ్దశాస నానంత భాస్కర సోమ - మాఘ మురారి భారవి ప్రముఖోభయ భాషాకవుల కవితాప్రక్రియల సంతరింపఁగల పుంభావ సరస్వతియని సమకాలీన కవిరాజ ప్రశంసలకుఁ బాత్రుఁడైనవాఁ డఁట (1-12). ఇందలి 'శ్రీనాథు చక్రప్రసిద్ధ బంధాళిజ్ఞ భీముని ఫణిబంధ పేశలంబు' (1-12) అను పద్యము, 'బాణువేగంబును భవభూతి సుకుమారతయు' నను మూర్తికవి నరసభూపాలీయ పద్యమును (1-15), 'అల విన్నకోటపెద్దన లక్షణజ్ఞత శబ్దశాసనకవి శబ్దశుద్ధి' అను గణపవరపు వేంకటకవి ప్రబంధరాజ పద్యమును (అవతారిక - 34) దలఁపించుచున్నది.

ఈ కవి కృత్యంతరములున్న ట్లిందుఁ జెప్పఁబడలేదు. ఇతని గ్రంథ మీయొక్కటే మనకు లభించుచున్నది. ఇతఁడు బహుగ్రంథపరిశోధకుఁ డనుట యిందుదాహృత లక్ష్యలక్షణ ప్రపంచమువలనఁ దెల్లమగును.

### కాలము

ఈ కవి కాల మాలోచనీయము. కవిగాని యాతని వంశీయులుగాని యే ప్రసిద్ధ రాజాస్థానమున నున్నవారుగారు. ఇఁక గ్రంథస్థవిషయమే కాలనిర్ణయమున కేకైక సాధనము.

లక్షణశిరోమణిలో ననేక లక్ష్యలక్షణ గ్రంథముల పద్యము లుదాహృతములు కావుటంజేసి వాటినిబట్టి కాలము నొకరీతిగా నిర్ణయింపవలసియున్నది.

లక్షణశిరోమణిలో వార్తాకవి రఘునాథయ్యగారి లక్షణదీపిక యుదాహృతము. దీపికలో విజయవిలాస (క్రీ. శ. 1614-33) పద్య ముదాహృతము. కాన దీపిక

విజయవిలాసానంతర రచన యగును. దీపికలో అప్పకవీయ స్వీయపద్యములు లక్ష్యలక్షణములు కొన్ని గానవచ్చెడు. (అప్పకవి చెప్పిన అనునాసికప్రాస-3 ఆ-341, 342. పరరూపయతి-3-126, ఇవి దీపికలోఁ గలవు). లక్షణదీపికలో నుదాహృత పద్యములకుఁ బెక్కింటికి నాకరములు జెప్పఁబడలేదు. అట్లు చెప్పఁబడకుండుట లేఖకుల యుపేక్షాప్రమాదములు కారణము గానోపును. అప్పకవీయగ్రంథ రచనా కాలము క్రీ. శ. 1656-1660. దీనినిబట్టి దీపిక 1660 తర్వాతిది యగును.

దీపికను గణపవరపు వేంకటకవి తన యాంధ్రప్రయోగరత్నాకరమున నుదాహరించెను. వేంకటకవి విద్యావతీ దండకమును క్రీ. శ. 1673 లో రచించెనని చరిత్రకారుల నిర్ణయము. వేంకటకవి యీ దండకమును దన [1]ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసములోఁ బేర్కొనియె. ఆంధ్రప్రయోగరత్నాకరము ప్రబంధరాజములోఁ గవిరచితపూర్వకృతులలోఁ బేర్కొనఁబడినది. కాని ప్రబంధరాజము ప్రయోగరత్నాకరమున నుదాహరింపఁబడినది. ఇది వింతగాఁ దోఁపవచ్చును. రత్నాకరము పూర్వరచనయేయయ్యును బ్రబంధరాజరచనానంతరము, కవి, యయ్యది లక్షణగ్రంథమగుటచే, దానిని గొంత సవరించి సంవర్ధితము చేసియుండును. అప్పుడు ప్రబంధరాజ పద్యముల లక్ష్యములుగా సంగ్రహించి ప్రదర్శించియుండునని యూహించుటలో వ్యతిక్రమముండదు. అట్లేని విద్యావతీదండకము (1673 సం॥) తరువాత రూపొందిన [2]ప్రయోగరత్నాకరము క్రీ. శ. 1680 ప్రాంతమునందలిది కాఁదగును.

---

1. ఈ ప్రబంధము తొలుత అముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతి శ్రీ పూండ్ల రామకృష్ణయ్యచే క్రీ. శ. 1892 సం లోఁ బ్రకటితము. ఇటీవల 1977 సం। లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీచేఁ బునః ప్రకటితము.

2. అకాడెమీ ప్రకటిత ప్రబంధరాజము నుపోద్ఘాతములో (XI పుట) 'ఇక్కవి కృతులలో నొక్క వేంకటేశ్వర నిఘంటువుతప్పఁ దక్కిన గ్రంథములు నామమాత్రావశిష్టములై యున్నవి' ఇత్యాదిగాఁ దద్గ్రంథ సంపాదకు లుగ్గడించిరి. (XI పుట) ఈ వ్రాఁత చింత్యమనక తప్పదు. వేంకటకవి యితర కృతులు కొన్ని లభించుచున్నవి. వేంకటకవి యాంధ్రకౌముది కాకినాడ యాంధ్రసాహిత్య పరిషత్తుచేఁ బ్రకటితము (1935). మఱి యీతని ద్విరూపకోశము వ్రాఁతప్రతి (R. No. 134) మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునుండి తరలింపఁబడి ప్రస్తుతము తిరుపతి విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధకసంస్థలోఁ బదిలపఱుపఁబడి

అప్పకవీయ పద్యములను దీపిక సంగ్రహించుటచేతను దీపికాపద్యములు రత్నాకరమున నుదాహృతము లగుటచేతను లక్షణదీపికారచన క్రీ. 1660-1680 మధ్యకాలమని తలంపవలెను. దీపికను సంగ్రహించిన లక్షణశిరోమణి క్రీ. 1680 తర్వాతి దగును. అదియునుగాక ప్రబంధరాజమునుండి యుద్ధరించిన చక్రబంధాది చిత్రకవితా పద్యము లొకనాల్గు లక్షణశిరోమణి గ్రంథాంతమునఁ దల్లిఖిత తాళప్రతి యొకదానిలో (R 679) కాననగుచున్నది. అందుచేతఁ బ్రబంధరాజరచనకు (క్రీ 1673-1680) తరువాతిది కావలె శిరోమణి. అనఁగా 17-వ శతాబ్ది తుదిలో శిరోమణి వెలసిన దన్నమాట.

కాని యీ క్రింది యంశములు సయితము గమనింపఁదగును.

'అరు దొక్కొ కకవి యిపు డిరు
గురు ముమ్వురు నలుగు రైదుగురు నార్వురు నే
డ్గురు తొమ్మండ్రు పదుగురై
ధరఁ గైతరు లింటనింటఁ దఱచగఁ గృష్ణా'

ఈ పద్యము సుప్రసిద్ధమైన అడిదము సూరకవి యీ క్రింది చాటు పద్యమున కనుకరణ మనఁదగును. ఆపద్య మిది —

'దేవునానమున్న దేశానకొకకవి
యిప్పుడూరనూర నింటనింట
నేగు రార్గు రేడ్గు రెనమండ్రు తొమ్మండ్రు
పదుగు రేసి కవులు పద్మనాభ'

సాధారణముగఁ బ్రసిద్ధి ప్రచారములుగల చాటుపద్యముల ఛాయానుకరణములు తరువాతి కావ్యములయందుఁ గానవచ్చుట పరిపాటియే. కావ్యగతములైన

---

యున్నది. ఇతని యాంధ్ర ప్రయోగరత్నాకరము తంజావూరి సరస్వతీమహాలు లైబ్రరీలో నున్నది (D. No. 695). మఱి యితని సర్వలక్షణ శిరోమణిలోని కొంత భాగము (1-5 ఉల్లాసములు) కాకినాడ యాంధ్రసాహిత్య పరిషత్తునఁ గలదు (సంఖ్య - 31). ఈ విషయములు నా తెలుఁగుభాషలో ఛందోరీతు లను గ్రంథమున వివరింపఁబడియున్నవి (ముద్రణ - 1962 - పుటలు 398 - 99).

పద్యముల ననుకరించి చాటువులు రూపొందుట యసహజము. పద్యగతిని సూక్ష్మముగాఁ బరిశీలించినఁ బొత్తపికవి పద్యము సూరకవిచాటువు నెఱింగి వ్రాసినదని స్ఫురింపఁ జేయును. ఈ పద్యచ్ఛాయనుబట్టి పొత్తపి వేంకటరమణకవి యడిదము సూరకవి (క్రీ. శ. 1720 - 1785) సమకాలికుఁడో తర్వాతివాఁడో యగును.

ఇఁక మరొక యంశము. కస్తూరి రంగకవిగారి యానందరంగరాట్ఛందము నకును మన లక్షణశిరోమణికిని బెక్కు పోలికలు పొడచూపుచున్నవి.

లక్షణవిషయానుక్రమణిక రెంటను నించుమించు సమానమే. వృత్తముల యందుఁ గొన్నిఁ యితరులు పేర్కొననివి, రెండిటను నామభేదములతో నున్నవి.

భాసురవృత్తము (కోమలవృత్తము), సలలిత (లత), బాలకౌముది (గజరాజ), చక్రవాక (చంద్రభాను), రతిరాజ (సురభూజరాజ), కుముద (కుసుమ), సురభి (సురుచి), విభవ (విజయ) - ఇందు మొదటివి లక్షణశిరోమణిలోనివి, కుండలీకృత ములు రంగయఛందములోనివి. ఇం దెవ రెవరి ననుసరించిరో ?

కాని రంగయఛందములో కందసీసభేదములు (ఉత్సాహవేదంతసీసము, గీత రహిత చతుష్ప్రాసపీసము), కందవృత్త సీసమాలికలు, తురంగ శంఖ ఉండిమ వృత్తములు, సూళాదులు, అత్వేత్వోత్వ కందములు, ఓష్ఠ్యనిరోష్ఠ్యచలజిహ్వాచల జిహ్వ, పాదభ్రమక, సౌగంధిక కుసుమమంజరీగర్భితోత్పలమాలికా, కందగర్భిత చంపకమాలికా, పంచవిధగద్యభేద, వివిధబంధాది చిత్రకవితావిశేషములు, లక్ష్యలక్షణ రహితముగఁ బేర్కొనఁబడినవి మాత్రమే. (రంగ - IV - 137 వచనము)

లక్షణశిరోమణిలో 3-426 వచనములో వియ్యావి నిర్దేశింపఁబడుటయేకాక వీని లక్ష్యలక్షణము లీ యాశ్వాసమునను మీఁది యాశ్వాసమునఁ గొంత ప్రదర్శితములు. (కొంత యీ యుపలబ్ధ ప్రతులలో నష్టమయ్యెను). రంగకవి పొత్తపికవి గ్రంథము నుండి సంగ్రహించి యుండునేమోయని యూహింపనగును. అట్లైనిఁ పొత్తపికవికి (క్రీ. 1750) పూర్వుఁడు కాఁదగును. పొత్తపి కవిది లక్షణశిరోమణి, కస్తూరి కవిది లక్షణచూడామణి (నామాంతరము).

లక్షణశిరోమణి తాళపత్ర లిఖితప్రతియందు (D. No. 3034) లేఖన కాల మిట్లున్నది —

'. విక్రమ సంవత్సర మార్గశిర శు ౨ దారభ్య ఆ మాఘ శు ౫ బుధవారం వరికి కామరుసు గోపాలయ్య వ్రాసిన లక్షణశిరోమణి.'

దీనికి సరియగు క్రీస్తుశకపు తేదులు రెండు గానవచ్చెడు.

1) 5-11-1640 నుండి 9-1-1641 వఱకు.

2) 7-12-1820 నుండి 7-2-1821 వఱకు.

ఇందు రెండవది మన కాలనిర్ణయమున కనుకూలము ననుగుణము నగును.

ఆదిదము స్ఫూరకవి ఛాటుపద్యఛ్ఛాయను తాళపత్రప్రతిలేఖనకాలమును రెంటిని సమన్వయించిన శిరోమణికాలము క్రీ. శ. 1740-1800 కాఁదగును.

శిరోమణి కాలనిర్ణయమునకు మఱొకమార్గము స్ఫురించుచున్నది.

రమణకవి తన యీ కృతిప్రదానముహూర్తము నిట్లు వక్కాణించెను :

'రాహుగ్రహము ఉత్తరాషాఢా నక్షత్రమున నుండుఁ గావున కృతిభర్త నక్షత్రము మృగశిర జీవనక్షత్రము మంచిదగునట్లేను. సూర్యాంగారక శశిరాహువులుత్తరాషాఢ శ్రవ ణాశ్వినీ నక్షత్రముల నున్నారుగనుక ........ ఫాల్గున శుద్ధ ౧౦ శుక్రవారము పూర్ణచంద్రుఁడు కృతిభర్త రాశి గ్రహగణ గృహములైన శుక్రబుధులు ఉచ్చస్థానగతులై శుభావస్థలనుండఁగా చంద్రతారాబలోపేతమై ........ పంచకరహిత మైన సుముహూర్తాన మత్కావ్యకన్యకను ........ శ్రీవేంకటేశ్వరునకు సమర్పితము చేసియున్నది (2-180).

పై వచనమున మాస తిథి వారములు పేర్కొనఁబడినవి. సంవత్సరము గూడఁ దెలిసియున్నఁ గాలమును నిర్ణయింప వీలగును. కాలనిర్ణయమునకు సంవత్సర మాస తిథి వారములు నాలుగు అవశ్యకములు. కాలసూచన లేకుండుటచే డొంకతిరుగుడు మార్గముననుఁ దన్నిర్ణయమునకుఁ బ్రయత్నింపవలెను. పైని నిర్ణయించిన క్రీ. 1740-1800 మధ్యలో ఫాల్గున శు - ౧౦ - శుక్రవారము ఏ యే సంవత్సరములలో వచ్చునో పరిశీలించి యా సమయమున రాహుగ్రహ ముత్తరాషాఢలో నున్న కాలముతో సమన్వయించిన కృతిప్రదానకాలము దెలిసికొన వీలగును.

మఱియు, తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధక సంస్థలోని లక్షణశిరోమణి నెం. 7616 తాళపత్ర లిఖితప్రతి కట్టలో కవిచింతామణి, అనంతుని ఛందము, లక్షణశిరోమణి (కొంతభాగము), ఆంజనేయాక్షరమాలిక, ఆంధ్రకౌముది కలవు. లేఖకుఁడు చిత్రకవి బుచ్చయాచార్యుల తమ్ముఁడు రామాచార్యులు. కవి చింతామణి సౌమ్య సం॥ లో, అనంతుని ఛందము సాధారణ సం॥ లో, అక్షరమాలిక కీలక సం॥ లో వ్రాసినట్లు పేర్కొనఁబడియె. అసమగ్ర మగుటచే శిరోమణి లేఖన కాలము దెలియరాదు. పై లేఖన కాలములలో సంవత్సర మాస తిథు లున్నవి. వారము చెప్పఁబడనందునఁ గాలనిర్ణయము సుసాధ్యముగాదు.

ఆంధ్రసాహిత్యపరిష త్ప్రకటిత మగు చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము నుపోద్ఘాతములో దాని తాళపత్రప్రతిలేఖకుఁడు, చిత్రకవి బుచ్చయాచార్యుల తమ్ముఁడు, రామాచార్యులు, దుర్ముఖి సం॥ పుష్య శు ౬ లో వ్రాసిన ట్లున్నది. ఆ తాళపత్రములు మిక్కిలి ప్రాఁతవి యగుటచే నందు సూచింపఁబడిన దుర్ముఖి సం॥ మొన్నటిదిగాక యాపై దానిపైదుర్ముఖి యగును. కావున నిది యిప్పటికి 150 సం॥ పూర్వమే వ్రాయఁబడిన దని చెప్పనొప్పును ' అని యభిప్రాయపడినారు శ్రీ నిడుదవోలు వేంకట రావుగారు (గ్రంథ ముద్రణ క్రీ. 1940). ఈ వ్రాఁతనుబట్టి యీ దుర్ముఖి క్రీ. శ. 1776-77 కాఁదగును.

దీనినిబట్టి తిరుపతి లైబ్రరీలోని శిరోమణిప్రతి లేఖనము కీలక - సౌమ్య మధ్య కాలము 1788-89 కాఁదగును. అట్లైన శిరోమణి కృతిప్రదానకాలము క్రీ. 1740-1788 మధ్య జరిగియుండు ననవచ్చును. చిత్రకవి రామాచార్యులు రఘునందనవిలాస మను పేరఁ జంపూరామాయణమును దెనిఁగించెనఁట. ఆ కృతిని బరిశీలించినఁ గవి కాలము దెలియఁగలదేమో ?

ఇఁక శిరోమణి కృతిప్రదాన ముహూర్త నిర్దేశానుసారము ఈ కాలములో రాహుగ్రహ ముత్తరాషాఢలో నుండఁగా ఫాల్గున శుద్ధ ౧౦ శుక్రవారము రావలెను.

శిరోమణికృతిప్రదానకాలముగా నూహింపఁబడిన క్రీ 1740-1788 మధ్యలో ఫాల్గున శు. ౧౦ శుక్రవారము వచ్చు ఇంగ్లీషు తేదీలు 5-3-1742, 21-2-1755, 5-3-1762, 17-3-1769, 22-2-1782, 18-2-1785 ' (స్వామికన్నుపిళ్లె గారి ' ఇండియన్ ఎఫిమెరిస్ ' ప్రకారము).

పై సంవత్సరములలో రాహుగ్రహ ముత్తరాషాఢలో నెప్పుడుండునో కనుఁగొనవలెను. అయ్యది పంచాంగ గణన చేతనే నిశ్చయింపనగును. స్థూలముగా నిట్లు నిర్ణయింపవచ్చును. 15-8-1977 లో పింగళ సం॥ శ్రావణ శుద్ధ ౧ సోమవారము హస్త ౪ లో రాహు ప్రవేశమని ఆ సం॥ పంచాంగము దెలుపుచున్నది. రాహువు రాశిచక్రము (12 రాసులు) ఒకసారి చుట్టివచ్చుటకు 18 సం॥ అగును. అనఁగా ఒక్కొక్క నక్షత్రమున 8 నెలలుండును. రాహు గమనము అప్రదక్షిణము. హస్త నుండి ఉత్తరాషాఢకు (19 నక్షత్రములు గడచి) వచ్చుటకు (19 X 8 నెలలు) 12 సం॥ 8 మాసము లగును. అనఁగా 1990 సం॥ అగును. ఈ కాలమునుండి మన మూహించిన శిరోమణి కాలమునకు 18 సం॥ గుణిజములను తగ్గించినచో (18 X 13 = 234). 1990 - 234 = 1756 అగును. గ్రహగతులలో నెక్కువ తక్కువ లుండును గాన 1756 సం॥ ను, ఫాల్గున శు ౧౦ శుక్రవారము వచ్చు క్రీ. శ. 1755 ఫిబ్రవరి 21 తేదిగా నెన్నవచ్చును. ఈ గణనాప్రసంగమును బట్టి శిరోమణి కృతిప్రదానకాలము 21-2-1755 అని స్థూలముగా నిర్ణయింపవచ్చు. దీనిని సూక్ష్మముగాఁ బంచాంగ గణనచేసి జ్యోతిష పండితులు నిష్కృష్టముగాఁ గాలము నిర్ణయముచేసి నా కెఱుక పఱచినఁ గృతజ్ఞతతో సంగ్రహింపఁగలవాఁడ నని విన్నపము.

శిరోమణి కాలనిర్ణయప్రసంగ సారము—

1) ఉదాహృతగ్రంథములను బట్టి ప్రబంధరాజానంతరకాలము క్రీ. 1680 తర్వాత, అనఁగా 1700 ప్రాంతము.

2) అడిదము సూరన చాటుపద్యానుకృతిని బట్టి 1740 ప్రాంతము.

3) లేఖన కాలమును బట్టి 1740-1821, 1740-1788.

4) తిథి నిర్దేశ గ్రహమునుబట్టి క్రీ. 21-2-1755 కృతిప్రదాన కాలము.

ఈ సూక్ష్మనిర్ణయముల సాధక బాధకత లెట్లున్నను వేంకటరమణకవి క్రీ. శ. 18 వ శతాబ్దివాఁ డనుట సిద్ధాంతము.

## లక్షణ గ్రంథ నిర్వచనము

సాహిత్యలక్షణ గ్రంథములలో సాధారణముగ గావ్యాలంకార చ్ఛందో వ్యాకరణాంశములు వివరింపఁబడును. తెలుఁగులోఁ గావ్యాలంకార చూడామణి

యట్టిది. కొన్నిట ఛందస్సు, కొన్నిట వ్యాకరణము మాత్రమే చెప్పఁబడును. భీమన ఛందము మొదటి తెగకు, ఆంధ్రభాషాభూషణము రెండవ తెగకుఁ జెందును. తెనుఁగు లక్షణగ్రంథములలోఁ దఱచుగ ఛందోవ్యాకరణ లక్షణద్వయము చెప్పఁబడును. కొన్నిట ఛంద స్సధికముగఁ గొన్నిట వ్యాకరణ మెక్కువగ నుండును. ఇం దనంతుని ఛందము మొదటి పద్ధతికి, కూచిమంచి తిమ్మన లక్షణసారసంగ్రహము రెండవ పద్ధతికిఁ జెందినవి. తెలుఁగులో ఛందోవ్యాకరణముల కున్న యవినాభావ సంబంధమే యీ మిశ్రరచనకుఁ గారణము. తెలుఁగు శబ్ద రూప నిర్ణయమునకు యతిప్రాసస్థల నిబద్ధ ప్రయోగములే ప్రధానాధారములు కావుటంజేసి, కేతన యాంధ్రభాషాభూషణము (1250 సం.) తరువాతి తెలుఁగులక్షణగ్రంథము లెల్లఁ దఱచుగ నిట్లు మిశ్ర లక్షణ గ్రంథములుగా రచితములయ్యె. పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణియు నిట్టి మిశ్రరచనయే. ఇందు ఛందోభాగమే యధికము. తుదిలోఁ గొంత వ్యాకరణముగలదు.

## లక్షణశిరోమణి పేరి గ్రంథములు

1) యాదవామాత్యచ్ఛందమునకు లక్షణశిరోమణి యని నామాంతరము. ఇందలి పద్యము సులక్షణసారమున (1550) నుదాహృతము.

2) గణపవరపు వేంకటకవి కృత సర్వలక్షణశిరోమణికి లక్షణశిరోమణి యనియుఁ బేరుగలదు. (1675 సం॥ ప్రాంతము) ఇది 10 ఉల్లాసముల గ్రంథము. 6 ఉల్లాసములు మాత్రమే యుపలబ్ధములు. (కాకినాడ, తిరుపతి గ్రంథాలయములలో నున్నది) (చూ. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిష త్పుస్తక భాండాగారము 3-వ భాగము. గ్రంథ సంఖ్య-31.) ఇందు 2, 3 ఉల్లాసములు (ఆంధ్ర కౌముది, వేంకటేశాంధ్ర నిఘంటువు) ముద్రిత ములు.

3) వార్తాకవి రఘునాథయ్య లక్షణదీపికలో — 'లక్షణాన్వితముగ నక్షశబ్దము మీఁదఁ దనరు నూహినీపదంబు వెలయ' అను నఖండవడి లక్షణ పద్యము లక్షణశిరోమణి లోనిదిగా నుదాహృతము. శిరోమణికవిపే రం దెందును గానరాదు. ఇది ప్రకృతము ప్రకటితమగుచున్న శిరోమణిలో లేదు. కవిజనసంజీవని లోనిదిగా సులక్షణసారము దెల్పుచున్నది. ముద్రిత సంజీవనిలో నీ పద్యము గానరాదు. ఉపలబ్ధ సంజీవని యసమగ్రము.

4) కవిజనాంజనములో (నన్నయ చింతామణి వివరణము - గద్యపద్యాత్మకము - కిమ్మూరి నరసింహరాజకృతి - 1911 ముద్రణ) లక్షణశిరోమణి నుండి పద్యముదాహృతము. ఉదాహృత లక్షణపద్యము 'ఉత గాక గత లును గావుతయును నాశీర్వచోకపుందెలుఁగు....' (పుట 1:7) - పొత్తపి లక్షణశిరోమణిలో మృగ్యము. గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణిలోని వ్యాకరణోల్లాసమగు ఆంధ్ర కౌముది సీసమాలికాత్మకము, కాన నీ కంద పద్యమునకు నవకాశము లేదు. కాన నది యీ పేరుగల గ్రంథాంతరము కానోపును.

5) లక్షణశిరోమణి - పొత్తపి వేం. రమణకవి రచన - ప్రకృత గ్రంథము.

## లక్షణగ్రంథములలో నితర గ్రంథోదాహృతులు

ప్రాచీనాంధ్ర లక్షణగ్రంథములలోఁ దత్కర్తృ స్వీయ లక్షణ లక్ష్యములు మాత్రమే రచితములు. అట్టివి ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకారచూడామణి, అనంతునిఛందము, చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము మున్నగునవి. లక్షణము లకుఁ గవి స్వీయలక్ష్యములుమాత్ర మున్న నయ్యవి ప్రామాణికతకు నిర్ధారకము కాఁజాలవు. ఇతర మహాకవి ప్రయోగములు ప్రమాణములగును. తన లక్షణములకుఁ బూర్వకవి గ్రంథస్థలక్ష్యములఁ బ్రదర్శించిన యుదాత్త పద్ధతికి మార్గదర్శకుఁడైన యాదిలాక్షణికాగ్రణి కవిచింతామణిని సంతరించిన వెల్లంకి తాతంభట్టు, అతని నను సరించి ముద్దరాజు రామన, అప్పకవి, గణపవరపు వేంకటకవి, కూచిమంచి తిమ్మకవి, రంగకవి, మన పొత్తపికవి మున్నగువారు తమ లక్షణ గ్రంథములలో బహు లక్ష్య లక్షణ గ్రంథస్థ పద్యముల నుదాహరించిరి. మీఁదు మిక్కిలి పొత్తపికవి కొన్నిపట్టుల లక్షణములు సయితము తాను వ్రాయక యితర కృతములను సంగ్రహించి తనివి పెందెను.

లక్షణశిరోమణిలో సుమారు 36 లక్షణగ్రంథములు, 55 లక్ష్య గ్రంథములు, ఇతరుల పద్యములు మొత్తము 682. ఉదాహృతములు. అందపూర్వములు నలభ్యములు ననేకము లున్నవి.

## లక్షణశిరోమణిలో నుదాహృత లక్షణ గ్రంథములఁగూర్చి సంగ్రహ వివరణము

**ఆంధ్రశబ్దచింతామణి : ( క్రీ. శ. 1022 - 63 )**

ఇయ్యది నన్నయభట్టారకునిచే సంస్కృత భాషలో శ్లోకరూపమున రచితమైన ప్రథమాంధ్ర వ్యాకరణము. ఇందు సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియలను 5 పరిచ్ఛేదములు గలవు. ఇందలి శ్లోకములు ఆర్యాగీతి భేదములు. ఇది కేవలము వ్యాకరణ మయ్యును, నిందు సంజ్ఞా పరిచ్ఛేదాంతమున 6 శ్లోకములచేఁ దెలుఁగు ఛందోలక్షణము (గణ, యతి, ప్రాసములు) సూత్రప్రాయముగాఁ జెప్పఁబడెను. దీని ననుసరించి పెక్కు వ్యాకరణములు, మఱి దీని కనేక టీకా వ్యాఖ్యలవతరించెను.

చింతామణి నన్నయ కర్తృకము గాదనియు, టీకాకర్త బాలసరస్వతియే దానిని వ్రాసి గ్రంథ గౌరవముకై నన్నయపేరు పెట్టెననియు, మఱి యథర్వణకారికావళిగూడ నహోబల పండితకృత మనియు వీరేశలింగము పంతులు తమ యాంధ్ర కవుల చరిత్రలో సిద్ధాంతము చేసిన నాఁటినుండి చింతామణీ కర్తృత్వము వాదప్రతివాదములకు లోనై నేఁటికి నిదమిత్థమని నిర్ణయింపరాని సందిగ్ధస్థితిలో నిలిచియున్నది. ప్రాచీన లాక్షణికు లెల్లరు చింతామణి నన్నయ భట్టీయముగానే నిర్దేశించిరి. నన్నయ కర్తృకమనియే మా మతము. మన మతము లెట్లున్నను శిరోమణికర్తృమతము మాత్రము చింతామణి ఆదికవి ఆంధ్రమహాభారతకర్త శబ్దశాసనుఁ డనఁబడు నన్నయభట్టారక రచన యనుట గమనింపఁదగినది. అందులకీ గ్రంథములోని యీ క్రింది నిర్దేశము లాధారములు - చూ.

"శబ్దశాసనుఁడు ఆదిపర్వము (4-37, 44)
నన్నయభట్టు ఆదిపర్వము (4-71)
శబ్దశాసనుఁడు నన్నయభట్టు (4-321)
శబ్దశాసనుఁడు ఆంధ్రశబ్ద చింతామణియందు ఆర్యావృత్తము ;
ఆంధ్రకవనమునకు శబ్దశాసనుఁడే ముఖ్యము (4-510)
నన్నయభట్లుగారు ఆంధ్రకవి చింతామణి (4-566)."

ఆంధ్రశబ్దచింతామణికి ఆంధ్రకవిచింతామణి యను వ్యవహారము కలదేమో!

[1]భీమన ఛందము : (1080 - 1150)

వేములవాడ భీమకవి రచించిన యీ ఛందమునకుఁ గవిజనాశ్రయమని పేరు. కాని భీమనఛంద మనియే సకల లాక్షణికులు పేర్కొనిరి. అప్పకవి రెంటిని బేర్కొనెను.

కవిజనాశ్రయ బిరుదాంచితుఁడగు రేచన కిది యంకితము.

ఉపలబ్ధ చ్ఛందోగ్రంథములలో నిది ప్రాథమికము. ఇందు సంజ్ఞా, వృత్త, జాతి, షట్ప్రత్యయ, దోషాధికారములు గలవు.

'భీమనగారు కవిజనాశ్రయమను ఛందంబున ... ఎక్కటియతి ప్రయోగము' అని యీ లక్షణశిరోమణిలోఁ బ్రస్తావితము (4-331).

వాదాంగచూడామణి

మల్లనకృతిగా రంగయ ఛందమునఁ బేర్కొనఁబడినది.

గోకర్ణచ్ఛందము : (12 శతాబ్ది)

ఇది గౌరన లక్షణదీపికలో (1385-1445) నుదాహృతము. క్రీ. శ. 1127 లో నున్న వర్ధమానపురాధీశుఁడు గోకర్ణదేవుఁ డీ కృతికి భర్తయనుటకుఁ గవిజనాశ్రయ పీఠికలో శ్రీ విదదవోలు వేంకటరావుగా రుద్ధరించిన 'భాస్కర విలసిత వార్ధి చంద్ర గోకర్ణనృపా' యను పద్యపాదము నిర్ధారకమగును. (చూ. వావిళ్లవారి కవిజనాశ్రయ ప్రతి - పుట 9).

అథర్వణ వ్యాకరణము : (12 శతాబ్ది)

దీనికి అథర్వణ కారికావళి, వికృతివివేకము అనివ్యవహారము. ఇది నన్నయ చింతామణికి శేషగ్రంథము. సంస్కృత శ్లోకాత్మకము. లక్షణశిరోమణికారుఁడు 'అథర్వణాచార్యులు ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానము' అని పేర్కొన్నాఁడు.

---

1. చూ. నా వ్యాసము - 'కవిజనాశ్రయము - భీమనఛందము' — సాహితీ వాఙ్మయము, మొదటి భాగము. తణుకు : శ్రీనరేంద్రనాథ సాహిత్యమండలి, 1968

అథర్వణాచార్యుఁడు వ్యాకరణమునే కాక అథర్వణ చ్ఛందమును, అథర్వణ భారతమును రచించెను. ఈ రెంటినుండి లక్ష్యములు ఈ శిరోమణియందును ననేక లక్షణ గ్రంథములందును నుదాహృతములు.

**అథర్వణచ్ఛందము :**

ఇందలి పద్యములు పెక్కులు గౌరన, అప్పకవి,రంగకవి మున్నగు లాక్షణి కులచే నుదాహృతములు.

**ఆంధ్రభాషాభూషణము : (1250)**

దశకుమారచరిత్రను దిక్కనసోమయాజి కంకితముగా రచించిన మూలఘటిక కేతన దీని కర్త. కేతన యభినవదండి బిరుదాంచితుఁడు. భాషాభూషణము తెలుఁగు పద్యములలో వ్రాయఁబడిన తొలి వ్యాకరణము.

**శ్రీధరచ్ఛందము : (1350)**

కర్త శ్రీధరుఁడు. ఈ ఛందమును గౌరన ప్రభృతు లుదాహరించిరి. ఈ యుద్ధారములలో 'అరిరాయవిఫాల సోమ యవనీపాలా, పిన్నసోమ యవనీపాలా, పిన్న భూవరువిసోమ (ల. శిరో. 4-116) అని సంబోధన యుంటచే, నీ ఛందము అళియ రామరాయల వంశీయులలోఁ బూర్వుఁడగు పిన్నసోమభూపతి కిది యంకితమని తెలియుచున్నది.

**అగస్త్య వ్యాకరణము :**

ఇది యీ లక్షణశిరోమణియందు మాత్రమే యుదాహృతము (4-514). కాల కర్తృత్వములు దెలియరావు. ఇందలి యుద్ధారమునుబట్టి యిది సంస్కృతభాషలో సూత్రరూపమున రచితమని తెలియుచున్నది. ఇం దథర్వణాచార్యులు పేర్కొనఁబడి యున్నారు. దీనింగూర్చిన వివరములకు నిందే IV - ఆ. తుదివ్యాకరణ విభాగ పరా మర్శలోఁ జూచునది.

**కావ్యాలంకారచూడామణి : (1402 - 07 మధ్యకాల రచన)**

దీని కర్త విన్నకోట పెద్దన. ఇది చాళుక్య విశ్వేశ్వరభూపతి కంకితము. ఇందు 9 ఉల్లాసములున్నవి. 7, 8 ఉ. ఛందస్సు, 9 ఉ. వ్యాకరణము. దీనినే పూర్వ

లాక్షణికులు కొందఱు పెద్దిరాజు ఛందము, పెద్దిరాజు అలంకారము అని పేర్కొనిరి. చిన్నకోటకు బదులొకచోట సీ శిరోమణిలో వ్రాఁతప్రతిలో 'పీర్ణకోట' అని కలదు (4.461). 'పిన్నకోట' అని లక్షణదీపిక, ఆంధ్రప్రయోగ రత్నాకరము.

### కవిరాజ గజాంకుశము : (1410-60)

కవిగజాంకుశమని కొందఱు పేర్కొనిరి. దీనిని ముద్దరాజు రామన, లింగము గుంట తిమ్మన, అప్పకవి ప్రభృతు లుదాహరించిరి. దీని కర్త గౌరన పుత్త్రుఁడు భైరవుఁడు. ముద్రితమైన యీ చిన్న కృతియందు గణవర్ణ లక్షణ శుభాశుభ ఫలాదులు చెప్పఁబడియున్నవి.

### [1] ఛందోదర్పణము : (15 శతాబ్ది పూర్వార్ధము)

దీని కనంతుని ఛందమని ప్రసిద్ధ వ్యవహారము. అనంతామాత్యుఁడు దీనికర్త. ఇందు గణయతిప్రాసములు, వృత్తములు, జాతులు, సంధిసమాసాది వ్యాకరణాంశములు చెప్పఁబడెను. ఇది 4 ఆశ్వాసముల గ్రంథము.

### [2] కవిచింతామణి : (1480-1520)

కర్త : వెల్లంకి తాతంభట్టు. ఇందు భాషాలక్షణ, వర్ణనిర్ణయ. వళిప్రాస, దోష, గణాధికారములు గలవు. కవి యిందు స్వీయలక్షణముల కితర గ్రంథ లక్ష్యములఁ బ్రదర్శించెను. ఈ కృతికిఁ గావ్యచింతామణి, కావ్యానుశాసనమని నామాంతరములు గలవు.

### రేఫ ఱకార నిర్ణయము :

దీని కర్త తాళ్ళపాక పెదతిరుమలయ్య (1460-1547). ఇతఁడు తాళ్లపాక అన్నయాచార్యుల పుత్త్రుఁడు. ఇందలి పద్యమొకటి లక్షణశిరోమణిలో (4-520)

1. ఛందోదర్పణము వావిళ్ల వారిచే మూఁడు ముద్రణము లందెను. అందుఁ గడపటి తృతీయ ముద్రణమునకుఁ బరిష్కర్త : రావూరి దొరసామిశర్మ (1958).

2. కవిచింతామణి - ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స లైబ్రరీ అండ్ రిసర్చి ఇన్స్టిట్యూట్ (హైదరాబాదు) పక్షమున ముద్రితము కానున్నది. పరిష్కర్త : రావూరి దొరసామిశర్మ.

నుద్ధృతము. శిరోమణిలో గ్రంథము పేరు చెప్పఁబడలేదు. ఆ పద్యము తాళ్లపాక చిన్నన్నగారిదని వ్రాయఁబడినది. ఇది పొరపాటు. చిన్నన్న రేఫ అకార నిర్ణయ గ్రంథకారుఁడగు పెదతిరుమలయ్య కొడుకు. చిన్నన్న యష్టమహిషీకల్యాణ గ్రంథ కర్త.

**కవిసర్పగారుడము : (1480-1530)**

కర్త: కావన బసవన. చిత్రకవి పెద్దన యీ బసవనను బూర్వ లాక్షణికకవి ప్రస్తుతిలోఁ బేర్కొనెను. ఇందు గణవర్ణ యతిప్రాస వృత్త ప్రకరణములు గలవు.

**లక్షణసారసంగ్రహము :**

కర్త: చిత్రకవి పెద్దన (1510-1570). దీనినే పెద్దిరాజు ఛందమని లాక్షణికులు పేర్కొనిరి. ఇందు ఛందోలక్షణమే కాక రేఫ అకార నిర్ణయము, నాటకలక్షణము రచితము. ఇందలి రేఫ అకార నిర్ణయ పద్యము లన్నింటిని వరుసగా నీ శిరోమణి కారుఁడు సంగ్రహించెను.

**లక్షణతిలకము : (16 శతాబ్ది)**

లింగమగుంట రామన్న లక్షణతిలకములోని వని యొక యైదు పద్యము లుదాహృతములు. (1-117, 2-177, 181, 186, 188. — ) ఇందుఁ గొన్ని లింగమగుంట తిమ్మన సులక్షణసారములోనివి. లిం. తిమ్మన్న కన్న రామన్న ఆనందకానన, చతుర్వాటికామాహాత్మ్యముల రచించె. లక్షణతిలకమునకు లక్షణసారమను నామాంతరముగూడఁ గలదని శిరోమణి విశేషమువలనఁ దెలియుచున్నది.

**[1]సులక్షణసారము : (16 శతాబ్ది)**

లింగమగుంట తిమ్మన ప్రణీతము. ఛందములలో దీని కత్యంత ప్రచారము గలదు. కాని యిది 1862 సం. మొదలుకొని తాతంభట్ట కృతముగాఁ దప్పుల తడకగా ముద్రితమగుచుండినది. 1950 లోఁ దిమ్మనకృతిగా సుపరిష్కృతమైనది.

---

1. సులక్షణసారము - పరిష్కర్త: రావూరి దొరసామిశర్మ.

బాలసరస్వతీయము : (1600 ప్రాంతము)

ఎలకూచి బాలసరస్వతి నన్నయ చింతామణికి రచించిన టీక యిది. ఇందలి ప్రారంభ నన్నయభట్ట స్తుతిశ్లోకము (వాచా మాంధ్రమయీనాం యః) అథర్వణాచార్యుల పేర నుద్ధరింపఁబడియున్నది (4-514).

నరసభూపాలీయము : (16 శతాబ్ది)

కర్త : రామరాజ భూషణ నామాంతరము గల మూర్తి కవి. వసుచరిత్ర కర్త యితఁడే. కొందఱు మూర్తి రామరాజభూషణులు భిన్నులని యభిప్రాయ పడెదరు. ఆ సందేహ మీ శిరోమణి దీర్చుచున్నది. 1.46 పద్యము నరసభూపాలీయ రామరాజ భూషణము లోనిదిగాఁ జెప్పఁబడినది. మఱి 4.462 పద్యముకడ 'నరసభూపాలీయము మూర్తి' యని కలదు. ఈ గ్రంథము సంస్కృత ప్రతాపరుద్రీయము ననుసరించి తెనుఁగున గొబ్బూరి నరసరాజున కంకితముగా రచింపఁబడిన కావ్యాలంకార శాస్త్రము.

కవిజనసంజీవని : (1580-1650)

కర్త : ముద్దరాజు రామన. ఇందు ఛందోవ్యాకరణాంశములు చెప్పఁబడినవి. భారతాది గ్రంథములనుండి లక్ష్యము లొసఁగఁబడినవి. ఈ రామన కగ్రజుఁడు పెద రామన రాఘవ పాండవీ యాదర్శవ్యాఖ్యా రచయిత. ఈ యన్నదమ్ముల సరిగా నరయక ముద్దరాజు రామనయే వ్యాఖ్యాత యని కవుల చరిత్రలో వీరేశలింగముగారు పొరపాటున వ్రాసిరి. ఈ ప్రమాదపు వ్రాఁత నట్లే కవితరంగిణీ కర్తయు మఱి నేటి పరిశోధకులు ననువదించిరి.[1]

లక్షణదీపిక : (17 శతాబ్ది యుత్తరార్ధము)

కర్త : వార్తాకవి రఘునాథయ్య (రఘురామయ్య, రాఘవయ్య అను పేళ్లు గూడ నితనికిఁ గలవు) దీపిక ఛందోవ్యాకరణములఁ దెల్పు లక్షణ గ్రంథము. ఇందుఁ బ్రాచీన గ్రంథోదాహృతులు పెక్కులు గలవు. అప్పకవీయ పద్యము లిందుఁ గలవు

1. ఈ ముద్దరాజుసోదరుల విషయిక ప్రమాదమును గూర్చి పరిశోధన పత్రికలో (1954 ఆగస్టు - సెప్టెంబరు) సమీక్షించియున్నాను.

(1656). ఆంధ్ర ప్రయోగ రత్నాకరము (1680) దీని నుదాహరించెను. కాన దీపిక '1660-1680' మధ్యకాలములోనిదిగా నూహింప నగును. శిరోమణి యీ దీపిక ననుసరించెను.

## ఉత్తమగండచ్ఛందము : (15 శతాబ్ది)

ఉత్తమగండ బిరుదము గల ఔబళరాజపుత్త్రుఁడగు కంపభూపతి కంకితము. ఈ కంపరాజు (1442-1459) మనుమంచిభట్ట రచిత హయలక్షణవిలాస కృతిభర్త. ఇందలి పద్యములు కవిసర్పగారుడమున (1480-1530) నుదాహృతములు. ఇయ్యుత్తమ చ్ఛందోరచయిత చిత్రపుభీమన యని యీ శిరోమణి ద్వారా తెలియుచున్నది.

## ఆంధ్రకవితాపితామహుని యలంకారము :

ఇందలి పద్యమొకటి (4-183) యీ శిరోమణిలో నుదాహృతము. ఆ పద్యము వృద్ధి యతిలక్షణము. (ఇందు రేఖావతంస లోకైకసేవ్య). రఘునాథయ్యగారి దీపిక యందలి ప్రయోగమని శిరోమణి పేర్కొన్నది. దీపికలో నీ పద్యమున్నది గాని యాకరము చెప్పఁబడలేదు. ఆ భాగము లుప్తమై యుండును. ఇందలి నిర్దేశము వలన అల్లసాని పెద్దన యలంకారశాస్త్రమును (ఛందో వ్యాకర ణాలంకారలక్షణ గ్రంథము) రచించెనని తెలియఁగలదు.

## ఈ క్రిందివి కాలాదికములు దెలియరానివి

## ఉభయకవి లక్కాభట్ల ఛందము :

శిరోమణిలో (4-16) లక్కాభట్ల ఛందములోని యతుల ప్రస్తావన గలదు. ఆ ఛందము పేరేమో ? (4-348) లో లక్కాభట్ల శతపక్షిసంవాద ముదాహృతము. లక్కాభట్లకు క్షేమేంద్రుఁడను బిరుదనామము గలదు.

## కవికంఠపాశము :

ఈ పేరి లక్షణ గ్రంథము సంస్కృత భాషలో రచితమైనదీ యొకటి గలదు. గౌరన లక్షణ దీపికలో రంగయ ఛందములోను నయ్యది యుదాహృతము. ఈ

సంస్కృత కృతిని గూర్చి మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.[1] శిరోమణి చూపిన కవికంఠపాశ పద్యము (4-236) తెనుఁగు. కాన నియ్యది సంస్కృత కృతికి భిన్నము. కర్త యెవరో? కాల మెయ్యదియో?

కౌస్తుభాభరణాంకము :

శిరోమణిలో (4 503) 'కౌస్తుభాభరణాంకుఁడు లక్షణము' అని శషసప్రాస మైత్రిని దెలుపు లక్ష్యలక్షణపద్య ముదాహృతము. గ్రంథ తత్కర్తృ నామములు దెలియరావు.

ఛందస్సార సంగ్రహము :

ఇందుండి కొన్ని పద్యములు శిరోమణిలో నుదాహృతములు (4-263, 267, 272) కర్తృనామ కాలాదు లెఱుఁగరావు.

నాగాభరణము :

ఇందలి పద్యమొకటి (1-56) శిరోమణిలో నుదాహృతము. కర్త? కాలము?

భాస్కరచ్ఛందము :

శిరోమణిలో (4.36) సహజ స్వరయతిక్రింద 'భాస్కరుఁడు' అను నిర్దేశముతో గీత మొకటి గలదు. భాస్కరరామాయణమున నా పద్యము గానరాదు. అది కేవలము కవి స్వీయ లక్ష్యపద్యముగాఁ దోఁచెడు. కాన నిది ఛందో గ్రంథములోని దగును. భాస్కరదేవ చ్ఛందము ఆంధ్రప్రయోగరత్నాకరములో నుదాహృతము.

వరకవి వెంకట్రామన్న లక్షణము :

శిరోమణిలోఁ గొన్ని పద్యము లుదాహృతములు. ఈ లక్షణ గ్రంథము పేరు దెలియరాదు. 'వేంకటాచలధామ, అహిగిరీశ' అను సంబోధనలఁబట్టి యిది వేంకటేశ్వరస్వామి కంకితమని తెలియును.

---

1. చూ. మానవల్లి కవి రచనలు - కవి కంఠపాశము (పుటలు 273-288) అకాడెమీ ప్రచురణ.

విశ్వేశ్వరచ్ఛందము :

ఇందలి పద్యములు రంగకవియు నుద్ధరించెను. కర్త, కాలము దెలియరావు.

శిరోమణి కారుఁడు పేర్కొనని లక్షణ గ్రంథము లనేకములు గలవు. అందుఁ గొన్ని యతనికిఁ బ్రాచీనములు, కొన్ని సమకాలికములు, మఱికొన్ని యర్వాచీనములు. పౌత్త్రపికవి ముందు వెనుకల వెలసిన నా యెఱిఁగిన లక్షణ గ్రంథముల పట్టిక జిజ్ఞాసూపయోగార్థము అకారాదిక్రమమున వ్రాయుచున్నాను.

అప్పకవీయము, ఆంధ్రకౌముది (గణపవరపు వేంకటకవి కృతి - 17 శతాబ్ది, మండ లక్ష్మీనృసింహకవి కృతి - 18 శతాబ్ది), ఆంధ్ర ప్రయోగ రత్నాకరము, ఆంధ్ర వ్యాకరణము (శేషసుమతి), ఆనందరంగరాట్ఛందము, కవికంఠాభరణము, కవిజనాం జనము, కవితాలక్షణసారము, కవిదర్పణచ్ఛందము, కవిరాక్షసచ్ఛందము, కవివాగ్బంధ నము, కవిశిరోభూషణము, కవిసంశయవిచ్ఛేదము, కృష్ణభూపాలీయము (చంద్రకవి), గరళపురీఛందము (లక్షణమంజరి), ఛందోనిరంకుశము, జయదేవచ్ఛందము, త్రిలింగ శబ్దానుశాసనము (అథర్వణాచార్యులు (1), మండ లక్ష్మీనృసింహకవి (2),) నీలకంఠ చ్ఛందము, ప్రయోగసారము, బాలబోధచ్ఛందము, యతిప్రాసవిలాసము, యాదవా మాత్యచ్ఛందము, లక్షణచంద్రిక, లక్షణదీపిక (గౌరన), లక్షణరాజీయము, లక్షణ సారము (నన్నయభట్టు), లక్షణసారసంగ్రహము (దంతిని అప్పకవి,) వీరనఛందస్సు, వీరభూపాలీయము[1] (కళువె వీరరాజాన కంకితముగా మాదయామాత్య ప్రణీతము) వైకృతచంద్రిక, శారదాదర్పణము, సకలలక్షణసారము (అద్దనూరి రామదాసు), సకల లక్షణసారసంగ్రహము (వేంకటరెడ్డి), సకలలక్షణసార సంగ్రహచింతామణి (రత్నా కరము గోపాలకవి), సరసాంధ్రవృత్త రత్నాకరము, సర్వలక్షణ శిరోమణి (గణప వరపు వేంకటకవి), సర్వలక్షణసారము (రంగయ), సర్వలక్షణసారసంగ్రహము (కూచిమంచి తిమ్మకవి), సుకవి కర్ణామృతము, సుకవిజన మనోరంజని — ఇంకను గలవు.

---

1. వీరభూపాలీయకర్త మాధయామాత్యుఁడని మైసూరు విశ్వవిద్యాలయమున నకు జి. లలిత సమర్పించిన "తెలుఁగు వ్యాకరణ సంప్రదాయసమాలోచన" మను సిద్ధాంత వ్యాస గ్రంథమునఁ దెలియవచ్చుచున్నది. (July 1977)

ఈ లక్షణ గ్రంథములలోఁ గతిపయము ముద్రితము. కొన్ని నేఁ డలభ్యములు, నష్టములు, నామమాత్రావశిష్టములు. మఱి కొన్ని శైథిల్య గ్రంథపాతములు గలిగి తుది మొదలు లేని యసమగ్రరూపములలో లిఖిత గ్రంథాలయములలో శోచనీయ స్థితిలో నున్నవి. ఇవి యెల్లఁ బ్రకటితములగునేని భాషాసాహిత్యమున కత్యంతోప కారకమగును.

లక్షణశిరోమణిలో ఛందశ్శేఖరము, కేదారభట్ట వృత్తరత్నాకరము, కాళిదాసు శ్రుతబోధము అను సంస్కృత చ్ఛందో గ్రంథము లుదాహృతములు. ఇందు ఛందశ్శేఖరము పింగళ ప్రణీతముగా సంగ్రహింపఁ బడినది (2.24) కాని పింగళచ్ఛందము సూత్రాత్మకము. ఇందలి యుద్ధారము శ్లోకాత్మకము. ఇది ఛందశ్శేఖరములోనిదిగా (పింగళ కృతికి భిన్నము) వృత్తరత్నాకర వ్యాఖ్యలోఁ బ్రదర్శితము.

శిరోమణి సంగ్రహించిన యుదాహృతులలో సంస్కృతాంధ్ర లక్ష్యలక్షణగ్రంథములేకాక గణితజ్యోతిషాది శాస్త్రగ్రంథములు నయితమున్నవి.

## లక్షణశిరోమణి గ్రంథరచనోద్దేశము

కవి తనకు మున్ను నంతరింపఁబడిన లక్షణగ్రంథములలోఁ గొన్నిట లక్షణములు, కొన్నిట లక్ష్యములు, కొన్నిట జ్యోతిషము,[1] కొన్నిటఁ గృత్యాది గణవర్ణ ప్రయోగ శుభాశుభ ఫలములు మాత్రము చెప్పఁబడెనని, తా నన్నిటం గలుగు శాస్త్ర రహస్యము లన్నిటిని దేటసేతు నన్నాఁడు (1-8). ఆంధ్ర కవితాలక్షణరీతుల శాస్త్ర పద్ధతివి గృతిరూపమున వివరింతుననియె (1-19). తన గ్రంథములో నితర లక్షణ గ్రంథములఁగల లక్షణంబులన్నియు నున్నవని, యందుచేఁ గొన్ని గ్రంథములను వలెఁ దన గ్రంథము నించుకయు చూచి వదలిపెట్టలేరని, యామూలాగ్ర మవశ్యపఠనీయమని యెఱుఁగఁగలరని తన కవిత్వ చమత్కృతి మహత్త్వము నుగ్గడించినాఁడు (1.21). మఱి యొక్క-యక్షీణ లక్షణలక్ష్యాపేక్ష్య ప్రబంధసంధాన ధురంధర నితాంత

1. గౌరన లక్షణదీపికలోను కవిగజాంకుశములోను జ్యోతిష విషయములలో గణవర్ణ లక్షణ శుభాశుభ ఫలములు మాత్రము దెలుపఁబడినవి. [illegible] ప్రాసంగిక సంబంధి విషయములు.



కుతూహలాక్రాంత స్వాంతుండై యగణితగుణగణాలంకారాభిజ్ఞ తజ్జ్ఞ విజ్ఞాతవ్య బంధుర గ్రంథ సంవిధాన సావధానంబుగా' స్వగ్రంథంబును సంతరింప సమకట్టినాఁడు (1-16). ఇవి యన్నియు నవతారికోక్తులు.

మఱి గద్యలో 'సకల లక్షణ సంయుత సుధాబ్ది సంపూర్ణ చంద్రోదయంబగు లక్షణశిరోమణి'[1] అని వచించినాఁడు. తన లక్షణములనేకాక ప్రసిద్ధ పూర్వలాక్షణికుల లక్షణములను గూడ సంగ్రహించి మహాకవుల గ్రంథములనుండి లక్ష్యములఁ బ్రదర్శించినాఁడు. లక్షణమత భేదములున్నప్పుడు మధ్యమధ్య వానిని బరామర్శించుచుఁదన సిద్ధాంతమును బ్రతిష్ఠించినాఁడు.

తన గ్రంథ (లక్షణ) ప్రామాణ్యమునకై స్వీయలక్షణములతోఁబాటు ప్రాచీన ప్రసిద్ధ లాక్షణికుల గ్రంథములలోని లక్షణముల నుద్ధరించుటేకాక, తానేమియు వ్రాయక కొన్ని పట్టులఁ బూర్వుల లక్షణముల మార్పులేక వరుసగా సంగ్రహించి ప్రదర్శించెను. ఇందీ రెండవ మార్గమును బూర్వ లాక్షణికు లెవ్వరుఁ జేపట్టలేదు. దీని కీతఁడే యాద్యుఁడనవలె. దీన నీ కవికిఁ బూర్వుల యం దెంతటి గౌరవ మున్నదో వ్యక్తమగును.

కవి తనకుఁ బూర్వము తెలుఁగున వెలసిన లక్షణ గ్రంథజాలమును బరిశీలించి, యందలి లక్షణము లన్నింటిని సంగ్రహించి మఱి తాఁగనుఁగొన్న నూతన లక్షణముల లక్ష్యసమన్వితముగఁ బ్రదర్శించి, యితర కవికృత లక్షణదిదృక్షాపేక్షావశ్యకత లేనట్లు (ఇట్లు కవి వాచ్యము చేయలేదు కాని గతార్థము) సకల లక్షణ సంయుతముగా లాక్షణిక శిరోమణి (లక్షణ చక్రవర్తి) యగు తాను లక్షణ శిరోమణిని సార్థక నామధేయముగా సంతరింప సంకల్పించినాఁడని యవతారికా విశేషము వలనను గ్రంథగత విషయ బాహుళ్యము వలనను నరయనగును.

---

1. చెన్నూరి శోభనాద్రి రచించిన యాంధ్రభిల్హణీయ కావ్యమునకు 'శృంగార సుధాసముద్ర సంపూర్ణ చంద్రోదయ'మని పేరు. ఈ ప్రబంధము 18 శతాబ్ది తరువాతిది. శిరోమణి గద్యలోని యీ పేరిని దిలకించి యీ ఛాయలో శోభనాద్రి కవి తన కృతికి 'సుధా...చంద్రోదయ' మని నామకరణముచేసియుండు నని యూహ్యము.

అదియునుగాక యీ ఛందము సప్తసంతానములలోఁ బ్రశస్తి గన్న యారవి సుధాకరమై వెలుఁగొందు కృతి యనియు లోకోపకారక మగు శాస్త్రగ్రంథ మనియు నిహపరసాధన మనియు నిశ్చయించి కవి దీనిని రచింప నుద్దేశించెనని గ్రంథావతారిక వలన విదితమగుచున్నది.

'ఛందోహీనో న శబ్దోఽస్తి న చ్ఛంద శ్శబ్ద వర్జిత' మ్మని కదా శాస్త్రకారుల యుపదేశము !

## లక్షణశిరోమణి విషయపరిశీలనము

లక్షణ శిరోమణిలో 4 అధికారముల పేర 4 ఆశ్వాసములు గలవు.

అవి: (1) వర్ణాధికారము, (2) గణాధికారము, (3) వృత్తాధికారము, (4) విశ్రమాధికారము.

అధికార మనఁగా శాస్త్రవిభాగము. శ్రీమన ఛంద మధికారములుగా విభజింపఁ బడినది. శిరోమణియందలి యధికారముల పేరిని బట్టి యాయాయి విభాగముల విషయములు సూచితములగును. కాని నాలవ విశ్రమాధికారము తుద ననుస్యూత ముగా వ్యాకరణ భాగము గలదు. దానిని బ్రత్యేకాధికారమునఁ జెప్పియుండవలసినది. తెలుఁగు లాక్షణికు లెల్లరు తమ కృతులలో ఛందస్సు, వ్యాకరణము ప్రత్యేక ప్రక రణములలోనే చెప్పిరి. కవి స్పష్టముగా 'లక్షణశిరోమణి యందు వర్ణగణవృత్త విశ్రమాధికారమ్ము లనుచతుర్విధాశ్వాసమ్ములు వి స్తరిల్లు' నని గద్యలో వచించినాఁడు. ఉపలబ్ధ గ్రంథములో నా వ్యాకరణభాగ మసంపూర్ణమైయున్నది. శబ్దస్వరూప నిర్ణయ మునకుఁ దెలుఁగులో యతిప్రాసస్థల నిబద్ధ ప్రయోగములే ప్రమాణములు కావుటంజేసి విశ్రమాధికారముననే యా యతిప్రాసముల వెంబడి వ్యాకరణ విషయ మువన్యసింపఁ బడెఁ గావలయు.

ఇందుఁ బ్రథమాశ్వాసావతారికలో నిష్టదేవతావందనాదుల యనంతరము గ్రంథ విషయారంభమునకుఁ బూర్వము ఛందశ్శాస్త్రావతార కథనము గావించి, ఛందః కర్తలఁ బేర్కొని ప్రసిద్ధ సంస్కృత చ్ఛందశ్శాస్త్ర నిర్మాతఁ బింగళాచార్యుని బ్రస్తు తించి తన గ్రంథము నాదరింపఁ గవులకు విజ్ఞప్తి యొనర్చినాఁడు శిరోమణికర్త. కవి జ్యోతిషికుల కైక్యము వచించి కవి జ్యోతిషశాస్త్రవేత్తగా నుండవలెనని యుగ్గ డించినాఁడు.

'లక్షణ గ్రంథములఁ గల లక్షణంబులన్ని యున్నవి చూడుఁడీ' అని తన గ్రంథ ప్రాముఖ్యత నప్పకవివలెఁ జెప్పినాఁడు. కాని తనది చదివిన పిమ్మట వే తెదియుఁ జదువఁ బనియుండ దనలేదు. అందులకు మాఱు శిరోమణి కర్త యిట్లు పలికెను :

'గ్రంథ విస్తర మగును లక్ష్యముల ననుచు
వ్రాయలే దిందు బహుగాను వసుధఁగల్గు
లక్షణము లున్న వన్ని పరీక్షఁజూడుఁ
డఖిల లక్షణములయందు నార్యులార.' (2-198)

రమణకవి సహృదయత కిది తార్కాణము.

ప్రాచీన కవులు కృతిరచనము పరమ పవిత్ర కృతి (కార్యము) గా భావించిరి. సప్తసంతతులలోఁ గృతి శిలముగానిది, కృతి కర్తకు భర్తకుఁ జిరస్థాయి కీర్తి నాపాదించునది.

కృతిని కన్యగా నెంచిన యా మహాశయులు తత్కృతి భర్త నెన్నుకొని కృతి నతని కంకిత మొనర్చుట వరునికిఁ గన్యాదానము గావించు సత్కృతిగా సంభావించిరి. అందుచే శుభముహూర్తమున మాతృకాపూజలు వాగీశ్వరీ ధ్యానాదులు చేసి కృతి ప్రారంభ మొనరింతురు. మఱి కృత్యాది వర్ణము కృతి నాయక వర్ణమున కనుగుణముగా నుండవలెను. అనఁగా ఆ వర్ణద్వయ నక్షత్రములు పరస్పరము పొంది పొసఁగి యుండవలెను. కన్యావరుల వివాహ నిర్ణయమునకువలెఁ గృత్యాద్యక్షర తత్కృతి పతినామాద్యక్షరముల నక్షత్రాదులకుఁ బొంతనములు సరిచూడవలెను. ఈ వర్ణమైత్రీ శోధనలోఁ జాలఁ బట్టింపుగలవారు మన ప్రాచీనకవు లనుటకుఁ దెలుఁగు ఛందో గ్రంథములలోఁ బ్రపంచితములైన యీ వర్ణ లక్షణ నిర్ణయములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఇట్టిదే గణప్రయోగ విషయముగూడ.

ఈ వర్ణగణ లక్షణములను ఆదిమకవి భీమన మొదలుకొని ఛందః కర్తలు తమ లక్షణ గ్రంథములం దంతో యింతో ప్రదర్శించిరి. గౌరన రఘునాథయ్యల లక్షణదీపికలు, చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము, అప్పకవీయము, మన లక్షణ శిరోమణి, రంగరాట్ఛందము మున్నగు లక్షణ గ్రంథములలో నీ విషయము సవిస్తరముగ విరచితమైయున్నది.

మన శిరోమణి వర్ణలక్షణమున కొక యాశ్వాసము, గణలక్షణమున కొక యాశ్వాసము వినియోగించెను.

ఈనాఁడు కవులు ప్రాచీన సంప్రదాయములలోఁ బెక్కింటినివలె నీ కృతి ముఖ వర్ణగణ పరిశోధనక్రమము త్రోసిరా జన్నారు.

'కాలం బొక్క తెఱంగున నుండక పెక్కు ప్రకారములనుండు భిన్నావస్థ' నన్నాఁడుగదా నన్నయభట్టు.

ఇఁక ఆశ్వాసక్రమమున విషయపరామర్శ:

## ప్రథమాశ్వాసము : వర్ణాధికారము

ఇందుఁ బ్రారంభమున —

కావ్యరచనారంభమునఁ గవినియమము, మాతృకాపూజావిధానము, కవితా కావ్య ప్రశస్తి, కావ్య కృతినాయక స్వరూపలక్షణము సుకవిలక్షణము దెలుపఁబడినవి.

ప్రబంధోపక్రమమునఁ గృతికర్త భర్తలకు శ్రేయఃప్రాప్తి నుద్దేశించి కృత్యాది వర్ణశుద్ధిఁ బాటింపవలయుఁ గావునఁ దద్వర్ణమైత్రీశోధనకు నకలారువడచక్రలక్షణము (అప్పకవి దీనిని అరివర్ణశోధనచక్రమని పేర్కొన్నాఁడు) వివరింపఁబడినది సంపత్కరాక్షరములఁ గృతిముఖమున నిలుపవలెనని కవి యుపదేశించినాఁడు. కావ్యఫలములలో నొకటి శివేతరక్షతిగదా?

తదుపరి వర్ణోత్పత్తిక్రమము, వర్ణసంఖ్య, వర్ణముల కుల గృహ నక్షత్రాది పతులు, అమృత విషాక్షరములు, అక్షరములం దల్పప్రాణ మహాప్రాణ స్నిగ్ధరూక్ష త్వాదిభేదములు, అక్షర స్వరగణలింగాది సంగతులు, అక్షరములలో నన్యోన్య మిత్ర శత్రు సమత్వరీతులు ఆదిలో సంయుక్తాక్షర ప్రయోగశుద్ధి, విషమాక్షర ప్రయోగము మున్నగు కృతిముఖ ప్రశస్త వర్ణప్రయోగ లక్షణము లుపన్యసింపఁబడెను.

తుదిని 'ఈరీతి శాస్త్రోక్తప్రకారంబున నేజాతివారి కాజాతి మాతృకాసరస్వతీ ధ్యాన పూజలుచేసి, యాయాజా త్యక్షరములనె పద్యగద్య ప్రబంధము మొదలఁ

గ్రథియించి కృతులు రచియింపఁ గర్తభర్తలు సౌభాగ్యాయురారోగ్యముల వర్ధిల్లుదురు గావున నీ ప్రకారంబునఁ గృతు లుపక్రమింపవలయు నిది ముఖ్యపక్ష' మని (1-140) యుగ్గడింపఁబడినది.

## శిరోమణి వర్ణసంఖ్యానిర్దేశము

ఇందు మనము గమనింపఁదగిన యంశము శిరోమణికారుని వర్ణసంఖ్యా నిర్దేశము.

'గీర్వాణమ్మునకు అకారాది క్షకారాంతంబై పంచాశ ద్వర్ణంబులు, ప్రాకృత భాషకు నలువది వర్ణంబులు, ఆంధ్రభాషయందు ముప్పదె. ననం జెలంగె ... ఆంధ్ర తద్భవ జనితంబులైన ళకార లకారంబులను గూడి ముప్పదేడు వర్ణంబులు శుద్ధాం ధ్రంబునకయ్యె' (1.81) అని సంస్కృత ప్రాకృ తాంధ్ర భాషాక్షరసంఖ్యలు పేర్కొనఁబడినవి.

సంస్కృతభాషకు - 50, ప్రాకృతమునకు - 40, శుద్ధాంధ్రమునకు - 37 అక్షరము లని వైత్తపికవి మతము.

సంస్కృత భాషాక్షరములలో క్షకారము గైకొనఁబడి ళకారము విడువఁబడి నది. ఇది యనంతామాత్యమతము. (చూ. ఛందోదర్పణము-IV 126, 127). ళకార మాదిలో సంస్కృత వర్ణ సమామ్నాయములోఁ బరిగణితముగాదు. పాణినీయ మాహేశ్వర సూత్రములలో ళకారము సంగ్రహింపఁబడలేదు. ప్రాకృతభాషా ప్రభావ మునఁ గాలక్రమమున సంస్కృతములో ళకారమునకుఁ బ్రవేశముగలిగె - క్షకారము సంయుక్తవర్ణము. ఇది ప్రత్యేకాక్షరముగాదు. అప్పకవి ళకారమును జేర్చుకొని క్షకారము నుజ్ఝగించి 50 వర్ణముల సరిపుచ్చెను.

నన్నయ చింతామణివలె శుద్ధాంధ్రమునకు 36 అక్షరము లనక 37 అక్షరములని శిరోమణికారుఁడు నిర్దేశించెను. ఇయ్యది యప్పక వ్యహోబలపండితుల మతము. 'షట్త్రింశ దత్రతే' అను బాలసరస్వతీయ చింతామణి పాఠమునకు 'సప్త త్రింశ దిహాన్యే' అన్నది యప్పకవీయ చింతామణి పాఠము. 'అప్పకవి పుస్తక పాఠోఽపి ప్రాథురేవ' అని యహోబలపండితుని యాశయము.

పొత్తపికవి అకారము ఆంధ్రతద్భవ జనిత మన్నాఁడు. తద్భవమున అకారము లేదని పెక్కు లాక్షణికుల మతము. తక్కినవారి మాట యెటులున్నను నీ శిరోమణి కారుఁడే 'తత్సమ తద్భవములందు బండి అ కారంబు లే' దని (4.572) రేఫ అకార పద్ధతి తుదిలో వక్కాణించినాఁడు. ఇది పూర్వోత్తర వచోవ్యాఘాతము గాకమానదు.

## ద్వితీయాశ్వాసము : గణాధికారము

ఇందు గురులఘు వర్ణసంజ్ఞా బోధకప్రకారము అష్టగణోద్భవ క్రమము, సూర్యేంద్ర చంద్రగణ నిర్ణయము దొలుతఁ దెలుపఁబడియె. తుదుపరి కృతినాయక నామధేయాద్యక్షర కృతిముఖ పద్యాద్యక్షర మైత్రీశోధనవలెఁ గృతిముఖగణ కృతి నాయకనక్షత్రగణ మైత్రీశోధన ప్రబంధోపక్రమమునఁ గర్తవ్యమగుటచే నీ యధి కారములో గణాష్టకమునకు స్వర, జననయామ, కుల, గోత్ర, సుమ, భూషా, గుణ, వార, వర్ణ, గ్రహ, కాంతి, రాశి, రస, సాధనాధిదేవతా, ఫల, నక్షత్ర, యోని, వస్త్ర, లింగ, దేశనిరూపణము, కృత్యాది గణప్రయోగము, కృత్యాది గణద్వయయోగ బాంధవ సందర్భ శుభాశుభ వివేచనము, కృతికన్యకా కృతినాయకులకుఁ బొంతనము, దీనిని నిరూపింప జ్యోతిషశాస్త్రదృష్టములగు కన్యావరుల వివాహ సంగతికిఁ బరిశీ లించు వివిధ కూటములను దదుదాహరణములగు మహాకవి ప్రయోగములను, గావ్య కన్యకా ప్రదాన శుభలగ్నాదిక నిర్దేశంబు ఇత్యాది గణ సంబంధి లక్షణములు ప్రపం చితములు.

ఇవన్నియు జ్యోతిషశాస్త్ర విషయములు. కవి జోస్యుఁడు గావలెనని గ్రంథావ తారికలోఁ బేర్కొనియున్నాఁడు. మఱి యిందును,

> 'జ్యోతిష మెఱుంగకున్నఁదా సుకవి గాఁడు......
> తద్విహీనము గా కవిత్వంబు కృష్ణ! (2.68)

అని యుగ్గడించినాఁడు.

పూర్వ ప్రబంధ కవులకెల్ల జ్యోతిష జ్ఞానము గలదనుట వారి గ్రంథములఁ జక్కఁగాఁ బరిశీలించినవారికి విదితచరము. ఈ యాశ్వాసాదిలోఁ బొత్తపికవి తన కవితాగురుని నరసింహకవివరుని బ్రస్తుతించి, యా జ్యోతిష విషయ నిర్దేశారంభమున జ్యోతిష గురుఁడగు అప్పయభట్ల నభినుతించెను.

అధికారము తుదిలోఁ దాఁజెప్పిన కృతిముఖ పద్యమునకు వర్ణగణశుద్ధి లక్షణ ములఁ బొందికను సమన్వయించి తత్ప్రశస్తిని బ్రసంగించినాఁడు. 'శ్రీరామారమణ జయ' అను లక్షణశిరోమణి నాందీపద్యము నాదిగోని శ్రీకారప్రయోగము, మగణనగణ సంయోగము, వీనికిఁ గృతినాయకుండగు వేంకటేశ్వరస్వామి నామనక్షత్రాదులకుఁగల పొంతనము తదుత్కృష్టత మున్నగు విషయముల విశదీకరించినాఁడు (2-176).

ఆకాలపుఁగవులు దుష్టగణవర్ణ ప్రయోగముచేఁ దమ శత్రుమర్దనము గావిం చెడువారు. వారి కట్టి దైవభక్తి, తపశ్శక్తి యుండెను. 'నానృషిః కురుతేకావ్య' మన్నారు పెద్దలు. కవులు ఋషికల్పులు. కవి వాక్యము ఋషివాక్యము వంటిది, యమోఘము. అట్టియెడ తకారమునిలిపి భీమన (హయమదిసీత - పద్యము 1-121) తన హయము నపహరించిన పోతరాజును జావఁదిట్టెనఁట. ఇట్టి తిట్టు కవితను జెప్పిన కవులు పెక్కురు గలరు.[1] శిరోమణిలో సంహారవచనములు, శత్రువధో పాయక్రమము, బ్రహ్మాస్త్రప్రయోగము అను క్రొత్త విషయములు చెప్పఁబడినవి. ఇవన్నియు దుష్టగణవర్ణ ప్రయోగరూపములు. కవితను మంచిచెడ్డలకు మేలుగీడ్లకు ఆనాఁడు కవులుపయోగించెడివారు. భీమకవ్యాదులు శాపానుగ్రహదక్షు లని ప్రతీతి. మనకవి యీ యధికారము తుదలో లాక్షణికుని వేఁటకానితో రూపించెను.

సుకవిరాజులు లక్షణజ్ఞులై శుభగణవర్ణ వాచకములు ప్రయోగించి శుభముహూ ర్తమునఁ గృతి చెప్పిరేని యదికర్తకు భర్తకు శుభోదర్కమగును. 'కవులు దాతలు గల్గుటఁగాదె చెన్నుమీఱుట' లని యుద్ఘాటించినాఁడు మనకవి. ఆ కాలపుఁగవులు సాధారణముగా రాజాశ్రితులు. 'నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతాః' అను సూక్తి కలదు కదా?

ఇందుఁ గట్ట కడపటఁ గవి తామున్ను వాకొన్న కృతికన్యకా ప్రదాన లక్షణ ములకు లక్ష్యముగాఁ దన యీ కృతిప్రదానసందర్భమున నవలంబించిన పద్ధతిని విశదీకరించెను. కృతినాయక నక్షత్రా ద్యనుకూలమైన శుభదివసమున శుభముహూర్త మునఁ దన కావ్యకన్యకామణిని లక్షణశిరోమణిని జతుర్దశ భువనాధీశుండైన యైహికా ముష్మిక ఫలప్రదాతయైన శ్రీవేంకటేశ్వరునకు సమర్పితము గావించిన సంప్రదాయ మును బ్రదర్శించెను. (2-180)

---

1. చూ. తెలుఁగులో తిట్టుకవిత్వము. కర్త: రావూరి దొరసామిశర్మ.

లక్షణశిరోమణి శ్రీవేంకటేశ్వరస్వామి కంకితము. కవిపేరు కవి కిష్టదైవము పేరు రెం డొక్కటిగా సమకూడియుండుట సుకృతవిశేషము.

ఈ యధికారాదిలో గురులఘుగణ ప్రస్తావనానంతరము 'ర - హ' సంయుక్త పూర్వాక్షరము వికల్పముగా లఘువగుట నిరూపితము. అందులకు ఛందశ్శేఖర వృత్తరత్నాకరాకరము లొసఁగఁబడినవి. 'వసతిగ్రామే, జయతి ప్రభుః, వహతిహ్రస్వః, త్యజతిహ్రియ మిత్యాది' సంస్కృతభాషోదాహరణములు చూపఁబడినవి. రహేతర సంయుతములకుఁగూడ 'సాధుక్వణతి, వేశ్మనిక్వచిత్' (ఇతి ప్రౌఢోక్తిః) అని యుదాహృతు లొసఁగఁబడినవి. (2-23) శిరోమణికారుఁడు దీనికిఁ దెనుఁగు పద్య గ్రంథములనుండి యుదాహరణములు చూపలేదు. సంస్కృతలక్షణము తెనుఁగునందును సంగ్రహించుకొనవలెనని భావించెనేమో? కాని యట్లు గుదురునదికాదు.

సంస్కృతములో శబ్దము వ్యస్తమైనను సమస్తమైనను సంయుక్త పూర్వాక్షరము నియతముగా గురువగును.

ఉ. శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీ వృత్తింసపత్నీజనే.
(కాళిదాసుని శాకుంతలము)

'కురు, ప్రియసఖీ' భిన్నపదములైనను సంయుక్త పూర్వవర్ణము గురువయ్యెను. తెనుఁగున సిద్ధ సంస్కృత సమాసములందుఁ దప్పఁ దక్కిన యెడల సంయుక్త పూర్వవర్ణము గురువుకాదు. భిన్నపదము లయ్యెనేనిఁ బదపదాది సంయుక్తముచే పూర్వపదాంతిమవర్ణము గురువు కానేరదు.

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు.
(నన్నయ భారత - సభ 2-18)

మ. హరి మేనల్లుఁడు బాహువీర్య పటుశౌర్యఖ్యాతి త్రైలోక్యసుందరుఁడు
(భారత - విరాట V-368.

పై పద్యపాదములందు క్రింది గీతలుగల పట్టుల సంయుక్తముల పూర్వాక్షరములు భిన్నశబ్దములగుటచే గురువులు గావు.

ఈ సంయుక్తపూర్వాక్షర పాక్షిక లఘుత్వ విషయ మప్పకవివంటి వాఁడు గూడఁ జెప్పక యుపేక్షించెను. తక్కిన ప్రాచీన తెలుఁగు ఛందః కర్తలు దీనిని

దదవరైరి. మనకవి కించుమించు సమకాలికుఁ డనఁదగిన కూచిమంచి తిమ్మకవి మాత్రము తన లక్షణ సారసంగ్రహములో నీ విషయమును బ్రస్తావించెను.

'సంస్కృత పదంబు లొగి సమాసములు గూర్చు
నపుడు రేఫను గూడిన యక్కరంబు
లూఁదియుండు నొకొక్కచో నూఁదకుండుఁ
దెనుఁగు కృతులందు సామజాజిననివోలె. (2-28)

ఈ లక్షణమునకుఁ దిక్కన శ్రీనాథ ప్రయోగముల నాల్గింటిని లక్ష్యములుగాఁ బ్రదర్శించెను (చూ. 2-24, 25, 26, 27).

కావునఁ గామ క్రోధములు (శాంతిపర్వము).

గీత వాద్య వినోద క్రియలఁదగులు (కాశీఖండము) మొ.

కూచిమంచి కవి చూపలేదు కాని తిక్కనయే కాక నన్నయ గూడ నిట్టి ప్రయోగము చేసియున్నాఁడు.

'అతనిజముతలన నమ్మౌని
ప్రవరు పృథూత్సంగతలముపై వడిఁ బడి రొగా' సభా. 1-143)

దీని కితర కవుల లక్ష్యములు పరశ్శతములు గాననగుచున్నవి.[1]

ఇతర సంయుక్తముల విషయమునను దత్పూర్వాక్షరములు లఘువులుగా గూర్చిన ప్రయోగములు తెలుఁగున క్వాచిత్కముగాఁ గాననగును.

## తృతీయాశ్వాసము : వృత్తాధికారము

శిరోమణికారుఁడు ఈ యాశ్వాసమునకు వృత్తాధికారమని పేరిడియె. పద్యములు వృత్తములు జాతులనని ద్వివిధములు.

'పద్యాలియు నిరుదెఱఁగై చను నోలిని వృత్తములు జాతు లానరం గృతులన్' అని భీమన ఛందము (సంజ్ఞ - 11)

---

1. చూ. తెలుఁగు భాషలో ఛందోరీతులు, కర్త: రావూరి దొరసామిశర్మ (పుటలు 33-37)

'వృత్తం జాతిశ్చేతి ద్వివిధం, పద్యం, గణై ర్నిసర్గాఖ్యైః
సంబద్ధం వృత్తంస్యా, దుపగణ మాత్రాభిరన్వితా జాతిః'

అని అప్పకవీయ చింతామణి. (IV ఆ.)

పొత్తపికవి వృత్తములని పేర్కొన్నాఁడు. జాతుల పేరు స్మరింపలేదు. జాతులనఁబడు కందాదుల లక్ష్యలక్షణముల వృత్తలక్షణానంతరము రచించెను. వృత్తములను శిరోమణికారుఁడు పద్యసామాన్యవాచిగా గ్రహించియుండును. భీమనాది ప్రాచీనాంధ్ర లాక్షణికులు వృత్తజాతులని పద్యద్వైవిధ్యమును బేర్కొన్నారు.

సంస్కృతమునఁ బింగళచ్ఛందమునఁగాని వృత్తరత్నాకరమందుఁగాని జాతులను విభాగములేదు. వృత్తరత్నాకరములో మాత్రావృత్తములు, వర్ణవృత్తములు నను విభాగము గలదు. మాత్రావృత్తములనే తెనుఁగు ఛందములు జాతులని పేర్కొనెను. సంస్కృతములో రెంటికి వృత్తనామము సామాన్యము.

శిరోమణిలో - వృత్తములకును జాతులని యితరులు పేర్కొన్న కంద గీత సీస ద్విపదాదికమునకును మధ్య విభాగసూచనార్థమున కన్నట్లు ప్రస్తారాది గురు లఘు విషయములు నిరూపింపఁబడుటయేకాక, వృత్తవిభాగమున నటనట విషయ వివేచనార్థము 'స్వస్థానార్థ సమ విషమ పరస్థానార్థ సమవిషమ వృత్తాధికారము, ఉపరి వృత్తాధికారము' అని పేర్కొనఁబడినట్లు షట్ప్రత్యయాదుల యనంతరము చెప్పఁబడిన కందాది (జాతి) పద్యలక్షణవిభాగమున 'ఇది గీతజాత్యధికారము, సీస జాత్యధికారము, ద్విపద జాత్యధికారము, రగడ జాత్యధికారము, ఆర్య జాత్యధికారము, అక్కర జాత్యధికారము' ఇత్యాదిగా నిర్దేశింపఁబడినది. మఱియు 'అక్కరజాతివృత్తలక్షణ' మని యొకచో (3-385) మిశ్రమ సంకేతము లుపయోగింపఁబడ్డవి.

ఈ యధికారములో శిరోమణికారుఁడు వృత్తముల జాతుల లక్ష్యలక్షణముల నవిస్తరముగాఁ బ్రదర్శించెను.

వృత్తము లక్షరగణనిబద్ధములు, జాతులు (కందాదులు) మాత్రాగణ నిబద్ధములు. ఉత్పలమాల, చంపకమాల ఇత్యాదులు వృత్తములు. కంద ద్విప దాక్కర రగడాదులు జాతులని, సీసగీతము లుపజాతులని తెలుఁగు ఛందఃకర్తల విభజనము. శిరోమణి జాతిస్మరణమే చేయనపు డిఁక నుపజాతి ప్రస్తావమున కాస్కారము లేదుగదా?

వృత్తములు సంస్కృత ఛ్ఛందోజాతములు. కాన వాని లక్షణములు సంస్కృతాను సారులు. తెలుఁగున సంస్కృత వృత్తములు యథాతథముగ సంగ్రహింపఁబడును. అక్షరగణబద్ధము లయిన యా వృత్తములు - సమవృత్తములు, విషమ వృత్తము లనియిరు తెఱఁగులు.

## సమవృత్తములు

సమవృత్తములు సమాక్షర సంశోభితములు. వృత్తమునకు నాలుగుపాదములు. వృత్తపాద చతుష్కములో గణక్రమము యతిస్థానము సమానముగా నుండును. పాదమున కెన్ని యక్షరములుండునో యా వృత్త మన్నవ ఛందమునఁ బుట్టిన దగును. పాదమున కొక్క యక్కరము మొదలుకొని 26 అక్షరముల వఱకే వృత్తములు ఛందోగ్రంథములఁ జెప్పఁబడినవి.

ఆ యిరువదాఱు ఛందముల కీ క్రింది పేళ్లు పెట్టఁబడినవి :— 1. ఉక్త, 2. అత్యుక్త, 3. మధ్య, 4. ప్రతిష్ఠ, 5. సుప్రతిష్ఠ, 6. గాయత్రి, 7. ఉష్ణిక్కు, 8. అనుష్టుప్పు, 9. బృహతి, 10. పంక్తి, 11. త్రిష్టుప్పు, 12. జగతి, 13. అతిజగతి, 14. శక్వరి, 15. అతిశక్వరి, 16. అష్టి, 17. అత్యష్టి, 18. ధృతి, 19. అతిధృతి, 20 కృతి, 21. ప్రకృతి, 22. ఆకృతి, 23. వికృతి, 24. సంకృతి, 25. అభికృతి, 26. ఉత్కృతి.

మొదటి ఉక్త చ్ఛందమున 2 వృత్తములు, రెండవ అత్యుక్తలో 4 వృత్తములు, మూఁడవ మధ్యచ్ఛందమున 8 వృత్తములు ఈ రీతిగా రెట్టించుచుఁబోయిన 26-వ ఛందములో 67108 సమవృత్తములు పుట్టినవని తెలియనగును. ఏకాది షడ్వింశతి చ్ఛందములలో జనించిన సర్వసమవృత్తసంఖ్య 134217726 అగును. ఈ గణన, ప్రస్తారాది ప్రత్యయములవలన నెఱుఁగనగును.

26 కన్న నధికములైన యక్షరములుగల వృత్తములు కతిపయములు కలవు. వానికి ఉపరివృత్తములని సంజ్ఞ. కవిజనాశ్రయాది చ్ఛందోగ్రంథములందు లయగ్రాహి (30 అక్షరములు), లయవిభాతి (34 అక్షరములు), లయహారి (37 అక్షరములు), త్రిభంగి (34 అక్షరములు), దండకము (అనియతము) అను 5 ఉపరి వృత్తములు మాత్రమే యుటంకింపఁబడెను. వీని కందు ఉద్ధురమాలావృత్తము లని పేరొసఁగఁబడియె.

లక్షణశిరోమణిలో మాత్రమే 27 మొదలు 36 వఱకుఁ గల 10 ఉపరి చ్ఛందస్సుల పేళ్లు, అందలి వృత్తములు గొన్ని యుపదేశింపఁబడినవి. ఇదే యీ శిరోమణి విశిష్టత.

ఆ యుపరి చ్ఛందస్సు లివి:— భూశ్ఛందస్సు 27, భువశ్ఛందస్సు 28, సువశ్ఛందస్సు 29, మహశ్ఛందస్సు 30, జనశ్ఛందస్సు 31, తపశ్ఛందస్సు 32, సత్యచ్ఛందస్సు 33, భూర్భువశ్ఛందస్సు 34, స్వరశ్ఛందస్సు 35, విరాట్ఛందస్సు 36.

ఇట్లు కోట్లకొలఁది వృత్తములున్నను 500 వృత్తములకంటె నెక్కువ ఛందః కర్తలు పేర్కొనలేదు. వాటిలో 40-50 కంటె నెక్కువ గ్రంథములలో వాడకము లేదు. సంస్కృతములోని పింగళచ్ఛందము వృత్తరత్నాకరము ననుసరించి పూర్వ లాక్షణికులు పెక్కు వృత్తములఁ దెలుఁగులోఁ జూపిరి. సంస్కృత వృత్తరత్నా కరమున సుమారు 190 సమవృత్త లక్షణములు చెప్పఁబడెను. తెనుఁగున భీమన-120, విన్నకోట పెద్దన-100, అనంతుఁడు-100, చిత్రకవి పెద్దన-200, అప్పకవి-186 వృత్త భేదముల వ్రాసిరి.

## లక్షణశిరోమణి - సమవృత్తములు

సమవృత్త లక్ష్యలక్షణములఁ బ్రదర్శించుటలో శిరోమణి కర్త యొక క్రొత్త పద్ధతిని జేపట్టెను. కవి స్వయముగా సంతరించిన వృత్తములు మొదటఁ, దదుపరి భీమన రచించిన కవిజనాశ్రయ వృత్తాధికారములోని ప్రశస్త వృత్తములు, తరువాతఁ గేదారభట్ట ప్రణీత సంస్కృత వృత్తరత్నాకరములోని ప్రయోగ వృత్తములు ముత్తెఁగుల వేర్వేఱ బ్రదర్శింపఁబడినవి.

రమణకవి ప్రదర్శించిన వృత్తముల సంఖ్య:—

| | | |
|---|---|---|
| 1. పొత్తపికవి నూతన కల్పిత సమవృత్తములు. | .... | 72 |
| 2. భీమన చెప్పిన ప్రశస్త వృత్తములు | .... | 23 |
| 3. వృత్తరత్నాకరములోని వృత్తములు | .... | 50 |
| 4. లుప్త వృత్తములు (3-159 వచనము) | .... | 54 |
| | మొత్తము | 199 |

లక్షణశిరోమణి 3-159 వచనమునఁ బేర్కొన్న వృత్తములలోఁ గొన్ని వృత్త లక్షణ ప్రకరణమునఁ గానవచ్చుటలేదు. అట్టి లుప్తవృత్తముల పట్టిక నీ క్రిందఁ జూపుచున్నాను :—

## లక్షణశిరోమణియందు లుప్తములైన వృత్తములు

| | ఛందస్సంఖ్య | | వృత్తనామము |
|---|---|---|---|
| 1. | 10-వ. | ఛందము | మయూరసారణి |
| 2. | 11-వ. | ,, | శాలోర్మి |
| 3. | | | రథోద్ధతము |
| 4. | | | చంద్రిక |
| 5. | | | కాంత |
| 6. | | | మందారదామము |
| 7. | 12-వ. | ,, | చంద్రవర్త్మ |
| 8. | | | హాయరచిత |
| 9. | | | ప్రభ |
| 10. | | | పుట |
| 11. | | | కలహంస |
| 12. | | | జలోద్ధరము (జలోద్ధతగతి) |
| 13. | 13-వ. | ,, | ప్రభాతము |
| 14. | | | రుచిరము |
| 15. | | | జలద |
| 16. | | | ప్రీతి |
| 17. | | | క్షమ |
| 18. | 14-వ. | ,, | అసంబాధము |
| 19. | | | భూనుతము |
| 20. | | | సుందరి |
| 21. | | | అపరాజిత |
| 22. | | | పుష్పదామము |
| 23. | 15-వ. | ,, | సుకేసరి |
| 24. | | | మణిభూషణ |
| 25. | | | మనోజ్ఞ |

| | ఛందస్సంఖ్య | | వృత్తనామము |
|---|---|---|---|
| 26. | 16_వ. | ,, | చంద్రశ్రీ |
| 27. | | | ప్రియకాంత |
| 28. | | | పద్మ |
| 29. | | | మదనదర్పణము |
| 30. | | | అశ్వగతి |
| 31. | 17_వ. | ,, | త్వరితపదగతి |
| 32. | | | హారిణి |
| 33. | | | సుగంధి |
| 34. | | | పాలాశదళము |
| 35. | | | సరసీరుహము |
| 36. | 19_వ. | ,, | భూతిలకము |
| 37. | | | చంద్రకళ |
| 38. | 20_వ. | ,, | అంబురుహము |
| 39. | | | ఖచరప్లుతము |
| 40. | | | భుజగవృత్తము |
| 41. | 21_వ. | ,, | లాటీవిటము |
| 42. | | | వనమంజరి |
| 43. | | | మణిమాలిక |
| 44. | | | భ్రమరకూజితము |
| 45. | | | కరిబృంహితము. |
| 46. | 22_వ. | ,, | అష్టమూర్తి |
| 47. | | | చంద్రిక |
| 48. | | | మృగసాక్షి |
| 49. | | | తురగము |
| 50. | | | విచికిలస్తబకము |
| 51. | 23_వ. | ,, | పద్మనాభము |
| 52. | 24_వ. | ,, | సరసిజము |
| 53. | 25_వ. | ,, | బంధురము |
| 54. | | | భాస్కరవిలసితము |

రమణకవి నూతన కల్పిత వృత్తములయు, సంగ్రహించిన భీమన ఛ్ఛందో వృత్తములయు లక్షణములు లక్ష్యనిబద్ధములై పద్యములలోఁ గూర్పఁబడ్డవి. వృత్త రత్నాకరము నుండి స్వీకరించిన వృత్తలక్షణములు వచనములో నున్నవి. అందు మూలము సంస్కృత శ్లోకాత్మకము. పద్యాత్మకములైన తత్తద్వృత్తలక్షణము లా యాయి వృత్తములలోనే సంతరింపఁబడుటచే లక్ష్యలక్షణద్వయ మేకత్ర సమ కూర్పఁబడిన ట్లయ్యెను. ఇట్టి పద్ధతియే యాదిమమైన కవిజనాశ్రయకాలము నుండి ఛందఃకర్తలచే నాశ్రయింపఁబడుచు వచ్చినది. వృత్తలక్షణముల ఒక్క పాదమున, రెండు పాదముల, నాల్గు పాదముల నిట్లు వివిధరీతుల ఛందఃకారులు చెప్పుచు వచ్చిరి. ఒక్కపాదమునఁ జిత్రకవి పెద్దన, రెండు పాదముల భీమన విన్నకోట పెద్దనలు, నాల్గు పాదముల ననంతాప్పకవులు వృత్తలక్షణముల విరచించిరి. పొత్తపి కవి రెండు చరణములలోనే వ్రాసెను. వృత్తలక్షణములలో గణక్రమ యతి నియతులు రెండే చెప్పవలసి యుండును గానఁ జతుష్పాదములకు విషయములేక యనవసర పదజాలము సమకూర్పవలసి యుండును. ఏకపాదమున లక్షణము సమగ్రముగా స్పష్టముగా సంతరింప సాధ్యము గాదు. కాన ద్విపాదరచనయే యుక్తతరము. ఏద్విత్రిచ్ఛందఃకారులో తప్పఁ దక్కిన వారెల్లరు రెండు పాదములలోనే లక్షణము రచించిరి.

తెలుఁగు ఛందములలో భీమన కవిజనాశ్రయము ప్రాచీనము, ప్రసిద్ధము. కాన నందలి ప్రశస్త వృత్తములను స్వీకరించి, మఱి యందుఁ జెప్పఁబడని కొన్నింటిని దెలుఁగు ఛందములకు మాతృక యనఁదగు వృత్తరత్నాకరము నుండి సంగ్రహించి, రెంటను గాన రాని స్వకల్పిత సరస వృత్తములను సంతరించి, రమణకవి తన శిరోమణిలోఁ బ్రదర్శించెను. ఇప్పు డున్నట్లు గాక, భీమనచ్ఛందో వృత్తరత్నాకరముల వృత్తములఁ జూపిన తరువాత, స్వకల్పిత నూతనవృత్తములఁ బ్రదర్శించి యున్నఁ బరిపాటిగా నుండును.

రమణకవికల్పిత నూతన వృత్తములలోఁ గొన్ని వృత్తరత్నాకరములోఁ గన్పట్టుచున్నవి. ఆతఁడు పరిశీలించిన రత్నాకరములో నయ్యవి లేవు గావలయు. మఱికొన్ని భీమనఛందము మున్నగు వానిలోఁ గనవచ్చుచున్నవి. అందుఁ గొన్ని నామాంతరములతో నున్నవి. వాటి వివరముల నొకపట్టికలోఁ జూపెదను.

## లక్షణశిరోమణియందలి నూతనకల్పిత వృత్తములను నామాంతరములతోఁ బేర్కొనిన యితర లక్షణగ్రంథములు

| | ఛంద స్సంఖ్య | వృత్తనామము | గణములు | లక్షణగ్రంథము - నామాంతరము |
|---|---|---|---|---|
| 1. | 2-వ. | శ్రీపెంపు. | గ,గ. | క.జ.అ. |
| 2. | | రమా. | ల,గ. | ల దీపిక. - 'శివా' |
| 3. | 3-వ. | శ్రీకారయుక్త. | మగణము. | క.జ.అ ;అప్ప.-నారి. |
| 4. | | భారతి. | రగణము. | అప్ప. - మృగి; ల.దీపిక - కీరము. |
| 5. | 4-వ. | హేలుకము. | స,గ. | పింగళచ్ఛందో టిప్పణి - సుమతి. |
| 6. | | సుకాంతి. | జ,గ. | క.జ.అ.; అప్ప.; ఛం.ద. |
| 7. | 5-వ. | కలహంస. | స,వ. | ప్రాకృత పింగళము- ప్రియా. |
| 8. | | మలహరి. | న,వ. | ల దీపిక-శ్రీలలితము రం.ఛం. - కుమారి. |
| 9. | 6-వ. | హంసపదము. | న,య. | క.జ.అ. - సురలత అప్ప. - శశివదన. |
| 10. | | ప్రసవ. | స,స. | ల సా సం.; అప్ప. - వసుధావృత్తము. రం.ఛం.-కిసలయము. |
| 11. | 7-వ. | కుసుమశరము. | న,స,గ. | రం.ఛం.-ప్రసవశరము. |
| 12. | | సుధాధామము. | న,త,గ. | ప్రాకృత పింగళము- సమానిక. |
| 13. | 8-వ. | షట్పదము. | భ,భ,గ,గ. | వృత్త.రత్న.; అప్ప. - చిత్రపద. |
| 14. | 9-వ | రాజమరాళము. | న,భ,ర. | రం.ఛం. -కిశోరము. |

| | ఛంద స్సంఖ్య | వృత్తనామము | గణములు | లక్షణగ్రంథము - నామాంతరము |
|---|---|---|---|---|
| 15. | | సుధారసలహరి. | ర,న,స. | ల.సా.సం.; అప్ప. - హాలముఖి. |
| 16. | 10-వ. | భాసురము. | భ,భ,మ,గ. | రం.ఛం.-కోమలము. |
| 17. | 11-వ. | గంధగజేంద్రము. | భ,భ,భ,గ,గ. | ఛం.ద.-తోదకము, అప్ప. - దోదకము. |
| 18. | 12-వ. | మృగమదము. | న,జ,జ,య. | క.జ.అ.-తోదకము, ఛం.ద. - ,, |
| 19. | 13-వ. | మత్తమయూరము. | న,న,భ,భ,గ. | అప్ప. - మ,త,య, స,గ. |
| 20. | | సలలితము. | న,య,న,న,గ. | రం.ఛం. - లత. |
| 21. | 14-వ. | సురతరునికరము. | న,న,న,న,గ,గ. | ల.సా.సం.; ఛం.ద. - కమలవిలసితము. |
| 22. | 15-వ. | పారిజాతము. | ర,జ,ర,జ,ర. | అప్ప. - సుగంధి. |
| 23. | | బాలకౌముది. | స,జ,భ,భ,స. | రం.ఛం.-గజరాజము. |
| 24. | | కిసలయము. | న,న,న,న,స. | ఛం.ద. - మణిగణ నికరము. ల.దీపిక - సరసము. |
| 25. | 16-వ. | చక్రవాకము. | న,ర,జ,ర,జ,గ. | రం.ఛం.-చంద్రభాను. |
| 26. | | సింహవిక్రమము. | ర,జ,ర,జ,ర,గ. | ప్రాకృత పింగళము- చంచల. |
| 27. | 18-వ. | కవివినుతము. | న,న,న,న,న,స. | క.జ.అ. - అతివిన యము. |
| 28. | 19-వ. | మణినిచయము. | న,న,న,న,న,న,గ. | ప్రాకృత పింగళము- ధవల. |
| 29. | 21-వ. | రతిరాజరాజము. | న,భ,ర,న,న,న,ర. | రం.ఛం. - సురభూజ రాజము. |

| ఛంద స్సంఖ్య | | వృత్తనామము | గణములు | లక్షణగ్రంథము - నామాంతరము |
|---|---|---|---|---|
| 80. | 22-వ. | కుసుమవిశిఖ. | న,న,న,న,న,న,న,గ. | సు.ల.సా.-తరళము.<br>అప్ప.-విచికిలిత.<br>రం ఛం.-కనకలతిక. |
| 81. | 23-వ. | కుముదము. | స,భ,స,భ,స,న,న,లగ. | రం ఛం.-కుసుమము. |
| 82. | 25-వ. | సురభి. | న,న,భ,స,త,న,న,య,గ. | రం.ఛం.-సురుచి. |
| 83. | | విభవము. | భ,స,భ,త,న,స,న,న,గ. | రం ఛం.-విజయము. |
| 84. | | జలరుహము. | మ,స,భ,భ,న,న,న,న,గ. | రం.ఛం.-వనరుహము. |

పొత్తపికవి 1-26 ఛందములం బుట్టిన స్వకల్పిత నూతన వృత్తములఁ జెప్పెను. అందుఁ గొన్ని వృత్తరత్నాకర భీమనచ్ఛందములలో మున్నే రచితములై యున్నవని పై పట్టికవలన నెఱుఁగనగును. వృత్తరత్నాకర కవిజనాశ్రయములనుండి 11 మొదలు 26 ఛందస్సుల వఱకుఁగల వృత్తములనే ప్రదర్శించెను. అందుండి 1-10 ఛందోజాతవృత్తములఁ బ్రదర్శింపలేదు. కాని యా పది ఛందస్సులలోని వృత్తములలోఁ గూడఁ గొన్ని భీమనాది పూర్వలాక్షణికులు చెప్పినవి గలవు.

## వృత్తయతినిర్దేశము

మొదటి తొమ్మిది ఛందస్సుల వృత్తములకు నవి చిన్నవగుటచే యతులు లేవు. 10-వ పంక్తి చ్ఛందస్సు నుండియే సంస్కృతమునను యతిస్థానములు నిర్దేశింపఁబడ్డవి. తెలుఁగు ఛందఃకర్తలు యతిస్థాన నిర్దేశక్రమములో సంస్కృత చ్ఛందోమార్గమునే యనుసరించిరి. తెలుఁగునందుఁగూడ మొదటి తొమ్మిది ఛందస్సుల వృత్తములకు యతులు లేవు.

యతివిషయమున సంస్కృతాంధ్ర చ్ఛందములకు భేదము గలదు. సంస్కృతమున యతి పదచ్ఛేదరూపము. ఆంధ్రమున నయ్యది పాదాద్యక్షరమైత్రి గలది. ఉదాహరణార్థ ముత్పలమాలా వృత్తమును గైకొందము. ఉత్పలమాలకు 9 యతి యని సంస్కృత చ్ఛందములఁ జెప్పఁబడినది. అందు దా యతిస్థానముపైఁ బదచ్ఛేదము కావలయును. తెనుఁగు ఛందములు ఆ 9 యతినే సంగ్రహించెఁ గాని యందు

9 అక్షరములపైఁ బదచ్ఛేదము కానక్కఱలేదు. అందులకు మాఱు పాదాద్యక్షరమైత్రి యుండవలయు. అనఁగా 9 మీఁదిదగు 10-వ అక్షరము పాదాద్యక్షరమైత్రి గలదిగా నుండవలె ననుట. సంస్కృత పద్ధతిలో 9-వ చోట యతి, తెనుఁగు సంప్రదాయమున 10-వ యక్షర మగును. తెనుఁగు ఛందఃకర్తలు భీమనాదులు వృత్తములకు యతి స్థానము సంస్కృత పద్ధతిలోనే నిర్దేశించిరి.

అప్పకవి, రంగకవి తెనుఁగు పద్ధతిలో వర్ణమైత్రిగల స్థానమును దెలిపిరి. భీమనాదు లుత్పలమాలకు 9 యతి చెప్పఁగా, అప్పకవి 10 యతి యన్నాఁడు. ఎటు చెప్పినను స్థితి భేదము సమానమే. శిరోమణికారుఁడు భీమనాదుల సంప్రదాయమునే పాటించెను.

మనకవి స్వకల్పిత వృత్తములలో 10-వ ఛందము నుండి కాక 15-వ ఛందము నుండియే లక్షణ పద్యమున యతిస్థానమును బేర్కొనెను. లక్షణములోఁ బేర్కొనకున్నను లక్ష్యములందు 10-వ ఛందము నుండి యతి మైత్రిఁ బాటించెను. అంతయేల? తానే స్వకల్పిత వృత్తములలో పంక్తి చ్ఛందస్సు నొద్ద నటనుండి విశ్రమస్థానము నిలుపవలయునని వచించె (3-42).

## యతిస్థాన నిర్దేశములో భిన్నమతములు

సంస్కృతములోఁ జెప్పఁబడిన యతిస్థానమునకు భిన్నముగాఁ గొన్ని వృత్తములకుఁ దెలుఁగు ఛందములు యతుల నిర్దేశించెను. అదియునుగాక తెలుఁగు ఛందములందే కొన్నింటికి యతి నిర్ణయమున నైకమత్యము లేదు. లక్షణేతర గ్రంథములలోఁ గవులు గొందఱు నిరంకుశులై మూఁడవ మార్గము ద్రొక్కిరి.

భుజంగప్రయాతమునకు సంస్కృతములో 6 పై, తెలుఁగున 8 పై యతి చెప్పఁబడియెను.

పృథ్వికి సంస్కృతములో 8 పై యతి, తెలుఁగు ఛందస్సులలో 11 పై యతి. సులక్షణసారమున 13 పై (త్రయోదశ) యతి. ఈ సులక్షణమత మనాకరము. తెలుఁగు కవులలోఁ గొందఱు 8 పై, కొందఱు 11 పై యతి పాటించిరి. మఱి కొందఱు ఉభయ విధములఁ గూర్చిరి.

8 పై యతి నిలిపిన గ్రంథములు — ఎఱ్ఱనహరివంశము, జైమినిభారతము, నైషధము, మనుచరిత్ర, పాండురంగమాహాత్మ్యము - మొ.

11 పై యతిఁగూర్చిన గ్రంథములు — నన్నయ భారతము, భాస్కర రామాయణము, కవిరాజ మనోరంజనము - మొ.

రామరాజభూషణుఁ డుభయమతముల భిన్నకృతులందుఁ బాటించెను. వసుచరిత్ర (1-166) లో 8 పై, హరిశ్చంద్రనలోపాఖ్యానము (3-67) లో 11 పై యతిఁ గూర్చెను. మన రమణకవి వృత్తరత్నాకర వృత్తముల క్రింద సంగ్రహించుటచే సంస్కృతమతము 8 పై యతి చెప్పెను.

మానినీ కవిరాజవిరాజిత వృత్తములు భిన్నచ్ఛందోజాతము లయినను మాత్రాసమక మగుటచే సమానగతి గలవి. వీటికిఁ గొందఱు 3 యతులు, కొందఱు 1 యతి నిర్దేశించిరి. ఉభయరీతులఁ గవులు ప్రయోగించిరి.

మానిని — 6 + 6 + 6 + (3 యతులు), [1]12 + (1 యతి). కవిరాజ విరాజితము — 7 + 6 + 6 + (3 యతులు), 13 + (1 యతి). మానినికి 3 యతులు చెప్పిన లాక్షణికులు - భీమన, వి. పెద్దన, అనంతన. మానినికి 1 యతి చెప్పినవాఁ డప్పకవి.

చిత్రకవి పెద్దన 'రవినేని రనత్రయినేని' అని యుభయమతముల నురరీకరించెను.

కవిరాజవిరాజితమునకు 3 యతులు చెప్పిన లాక్షణికులు - భీమన, వి. పెద్దన, అనంతన, చి. పెద్దన, అప్పకవి.

కవిరాజమునకు 1 యతి చెప్పినవాఁడు రంగకవి.

మనకవి భీమనఛందములోని లక్షణముల సంగ్రహించినవాఁడు గాన రెంటికి మూఁడు యతు లంగీకరించినవాఁడు కావలె. శిరోమణి ప్రథమాశ్వాసాంతమున రచితమైన కవిరాజవిరాజితమున 3 యతులు గూర్పఁబడియున్నవి.

---

1. 12 + పండ్రెండవ యక్షరము మీఁద అనుట.

## మఱికొన్ని విశేషములు

శిరోమణిలో 20-వ ఛందముక్రిందఁ జెప్పఁబడిన 'రతివిలసితము' లఘ్వంత వృత్తము (గణములు - ర వ జ న్ల వ వ గ ల).

26 ఛందస్సులనుండి జనించిన 13 కోట్లమీఁది సమవృత్తములలో నగము గుర్వంతములు, నగము లఘ్వంతములు. తెలుఁగు ఛందఃకర్త లెవ్వరుగాని లఘ్వంత వృత్తముల సంగ్రహింపలేదు.

శిరోమణికారుఁ డొక్కఁడే యీ లఘ్వంతవృత్తమును బ్రత్యేకముగఁ బేర్కొనెను. చిత్రకవిపెద్దన లక్షణసారసంగ్రహములో సమవృత్తములందు లఘ్వంత వృత్తములు వచింపఁడయ్యెఁగాని పరస్థానవృత్తాధికారముక్రింద రెండు వృత్తముల గ్రహించెను.

పరస్థానార్ధ సమవృత్తము - పథావతి (ల. సా. సం. 2-24 పు. 45) దీనికి బేసిపాదములందు ఆఱు హ గణము లుండును. (లఘ్వంతము) దీనికి జయనామము నందలి వృత్తకుసుమోచ్చయములో సమానవృత్తమని పేరున్నది. మఱి సర్వపరస్థాన విషమవృత్తములలో ఉద్గతవృత్తమునకుఁ (2-44, పు. 49) బ్రథమ పాదమున 'స-జ-జ' గణములుండును (లఘ్వంతము) అప్పకవి పరావ త్యుద్గతలఁ జెప్పెను గాని గుర్వంతములు చేసెను. చిత్రకవి పరావతిని వృత్తరత్నాకరమునుండి గ్రహించెను. శిరోమణికారుఁడు చిత్రకవి చెప్పిన యుద్గత పరావతుల నుద్ధరించెను. (8-223; 207)

విద్యున్మాల - ఇది 8 ఛందములోఁబుట్టిన ప్రసిద్ధవృత్తము. దీనిని సంస్కృతాంధ్ర చ్ఛందఃకర్త లెల్లరు పేర్కొనిరి. శిరోమణికారుఁడు సంగ్రహింపమికిఁ గారణమేమో ?

## మాత్రాసమక వృత్తములు

ఈ క్రింది సమవృత్తములు అక్షరసంఖ్యనుబట్టి భిన్నచ్ఛందోజాతములయ్యును, మాత్రాసమకములై సమలయతాళాన్వితములై నడచును. శిరోమణికారుఁడు కంద గీత సీస రగడ చౌపదాదుల మాత్రాసమతనిబద్ధములని పేర్కొనెను ఇందుఁ జర్చింపఁబడు నవి జాతులుగావు సమవృత్తములు.

క్రౌంచపదము (24 ఛందము)

పంచశరాభా + సంచితపుణ్యా + భమసభవనయా + పరిష్కృతమైనన్
(3-138)

దీనిని మాత్రాచ్ఛందోరీతిఁ జతుర్మాత్రాగణములుగా విభజించిన 8 గణము లేర్పడును. ఇందు 4 X 8 = 32 మాత్రలుండు. ఎనిమిదేసిమాత్రలపైఁ బాదమునకు మూఁడుచోట్ల యతు లమరును. లాక్షణికు లనేకులు మొదటి 8 మాత్రలపైఁ బ్రాసయతి పాటించిరి. తరువాతి యెనిమిదేసి మాత్రలపై రెండుచోట్ల యతులఁ గూర్చిరి. అప్పకవి మొదటి 8 మాత్రలపై యతిగాని ప్రాసయతిగాని పాటింపలేదు.

ఎఱ్ఱన హరివంశములో (ఉత్తరభాగము 9-259) ఎనిమిదేసి మాత్రలపై 3 చోట్ల యతినే ఘటించెను.

విభవవృత్తము (25 ఛం.)

పన్నగశయనా + పన్నగశరణ్యా +
భగ్నభృతవసనల్ + పరఁగఁగ నగలన్
కన్నగు విభవం + బెన్నఁ గవీంద్రుల్ +
శివనగము ధరం + జెలు వలరెడఁగన్. (ఉ. హ. 3-107)

దీనికిఁ బాదమునకు 32 మాత్రలు. మొదటి 8 మాత్రలపైఁ బ్రాసయతి, తరువాతి యెన్మిదేసిమాత్రలపై రెండుచోట్ల యతులుండును. లక్షణమునఁ బ్రాసయతి చెప్పఁబడలేదు. దీనికేకాదు క్రౌంచపద సరసిజములకుఁగూడ లక్షణమున నేఛందః కర్తయుఁ బ్రథమదశమునఁ బ్రాసయతి నిర్దేశింపలేదు. లక్ష్యములందు మాత్రము ప్రాస యతి ఘటితమైయున్నది.

ఇట్టి ద్వాత్రింశ (32) న్మాత్రాత్మకవృత్తములు కొన్ని కలవు. వాని కించుక వివరము :—

(21 ఛం.) - లాటీవిటము (23 ఛం.) - మత్తాక్రీడ.

(24 ఛం.) - క్రౌంచపదము, సరసిజము, తన్వి, ఆనందము (ఉ. హ.) కలకంఠము (ఉ. హ.), శృంగారము (రంగ).

(25 ఛం.) - భాస్కరవిలసితము, సురభి (ల. శి; సురుచి - రంగ), విభవసు (ల. శి; విజయము - రంగ), జలరుహము (ల. శి; వనరుహము - రంగ).

(26 ఛం.) - సురభూరుహము (ల. శి.)

మాత్రాసమకములైన పై వృత్తముల కన్నింటికి మాత్రాగణనాప్రకారము యతిస్థాన సామ్యము భాసించును. అక్షరసంఖ్యాగణనమున సామ్యత చూపట్టదు. లాక్షణికులు పై వృత్తములకు యతి నిర్దేశించుటలో భిన్నమార్గములు చేపట్టిరి.

లాటీవిట, తన్వీ, భాస్కరవిలసితములకు 16 మాత్రలపై నొకేయతి. మత్తాక్రీడా, శృంగారములకు 16, 24 మాత్రలపై రెండుయతులు. క్రౌంచపద, సరసిజ, ఆనంద, జలరుహములకు 8 మాత్రలపైఁ బ్రాసయతియు, 16-24 పై రెండుయతులు.

కలకంఠ, సురభి, సురభూరుహములకు 8-16-24 మాత్రలపై మూఁడుచోట్ల యతులు.

ఈ యన్నింటికి 3 యతులుగాని, ఒకప్రాసయతి తరువాత రెండుయతులు గాని సమానముగా నుపదేశించియుండవలసినది. ఛందఃకర్తలు పూర్వులు సరిగాఁ బరిశీలించి యున్న యతిలో నిట్టి భేదము లేర్పడియుండవని మామతము.

## విషమవృత్తములు

లక్షణశిరోమణికారుఁడు సమవృత్తములలో స్వకల్పిత నూతనవృత్తములఁ దొలుతఁ బ్రదర్శించి, తదుపరి భీమనాదుల ప్రసిద్ధవృత్తముల నుద్ధరించినట్లు, విషమ వృత్తములలోఁగూడఁ బ్రథమమున స్వకల్పిత నూత్నవృత్తములఁ బ్రపంచించి, యనంతరము భీమన చిత్రకవిపెద్దనలు చెప్పినవాటి నుదాహరించెను. ఇతని విషమ వృత్తవిభజన తన్నిర్వచనోదాహరణములు వినూత్నములు.

మొదట సంప్రదాయానుసారము వృత్తరత్నాకరము భీమన చిత్రకవ్యాదుల తెలుఁగుఛందములు పేర్కొన్న విషమవృత్తలక్షణముల వివరించి, పిదప శిరోమణి విషమవృత్తప్రకారములఁ బరామర్శించెద.

అనంతుఁడు వీటిని వృత్తమిశ్రంబులగు అర్ధసమవిషమవృత్తములని పేర్కొన్నాఁడు. అప్పకవి గౌణవృత్తము లన్నాఁడు.

మిశ్రవృత్తభేదములు :—

ఇవి స్వస్థానము, పరస్థానము అని యిరుతెఱఁగులు. ఒకేఛందమునఁబుట్టిన భిన్నవృత్తముల మిశ్రము స్వస్థానమునకును, భిన్నచ్ఛందోజాతవృత్త మిశ్రము పరస్థానమునకును జెందును. అందులో అర్ధసమ, విషమము లని ద్వివిధములు. సరిపాదము లొకరీతి, బేసిపాదము లొకరీతి గలవి అర్ధసమవృత్తములు. పాదపాదమునకు భిన్నవృత్తములు గలవి విషమవృత్తములు. వృత్తరత్నాకరములో అర్ధసమ-విషమవృత్తలక్షణము లిట్లున్నవి :—

'ప్రథమాంఘ్రిసమో యస్య తృతీయశ్చరణో భవేత్,
ద్వితీయ స్తుర్యవ ద్వృత్తం తదర్ధసమ ముచ్యతే.
యస్యపాద చతుష్కేఽపి లక్ష్మభిన్నం పరస్పరం,
తదాహు ర్విషమవృత్తం ఛందశ్శాస్త్ర విశారదాః.' (1-15, 16)

భీమ నానంత పెద్దనా ద్యాంధ్ర లాక్షణికులమతమున సమపాదము లొకరీతి, విషమపాదము లొకరీతి నున్ననే యర్ధసమవృత్త మగును. అటుగాక పూర్వార్ధ మొక విధము, ఉత్తరార్ధ మొకవిధముగా నున్నను, ఒకపాద మొకతెఱఁగు తక్కిన మూఁడు పాదము లొకతెఱఁగుగా నున్నను విషమవృత్తములగును. కాని అప్పకవిమతమునఁ బైవిఁ బేర్కొన్నవి యర్ధసమవృత్తములే యగును. చూ.

'సగ మొక్క విధంబునఁ, బెఱ
సగ మొక్క తెఱంగు గాఁగ సమకూర్పఁ దగున్,
జగతి నొకటొక కరణి
నొగి మూఁడు పదంబు లొక్క యోజం దనరున్. (అప్ప. 4-371)

స్వస్థాన వృత్తములలో బాదములన్నియు నేకచ్ఛందోజాతము లగుటచే వర్ణసంఖ్య సమము. పరస్థానవృత్తములు భిన్నచ్ఛందోభవము లగుటచే వర్ణసంఖ్య యసమము. ఇందుఁ బాదములలోఁ బరస్పరము న్యూనాధిక్యము లుండును.

స్పష్టార్థ మీ వృత్తమిశ్రప్రణాళిక యుదాహరణ సూచనలతో నీక్రింద ప్రదర్శింపఁబడుచున్నది :

1) స్వస్థానార్ధ సమవృత్తములు :

1 = 3 / 2 = 4 — [= సమము, / విభాగసూచన. '1 = 3' — మొదటిపాదము మూఁడవపాదము సమానము (సమానగణములు గలది). '2 = 4' — రెండవ నాలవ చరణములు సమానములు. ఇది అనంత పెద్దనాది ప్రాచీనులమతము.]

1 = 2 / 3 = 4
1 / 2 = 3 = 4
} [ఇది అప్పకవి మతము. అనంతాదు లిట్టి వానిని విషమవృత్తములక్రిందఁ బరిగణించిరి] 1 / 2 = 3 = 4 — మొదటిపాద మొకవృత్తము. 2, 3, 4 పాదములలో మఱొకవృత్తము. ఈ మూఁడుసమము. ఇట్లే యంతట నెఱుఁగునది.]

ఉదా॥ ఉపజాతి (వి) 11 ఛందము. చూ. ల. శి. 3.

1 = 3 — ఇంద్రవజ్ర; 2 – 4 — ఉపేంద్రవజ్ర.

2) వ్యస్థాన విషమవృత్తములు;

1 = 2 / 3 = 4
1 = 2 = 4 / 3
1 / 2 / 3 / 4
1 / 2 = 3 = 4 (అప్పకవి)

ఉదా॥ అంగజాస్త్రము:

1 = 2 — రుగ్మవతి; 3 = 4 — శుద్ధవిరాటి.

వరాంగి:

1 = 2 = 4 — ఉపేంద్రవజ్ర; 3 — ఇంద్రవజ్ర.

భరణి:

1 — స స స స, 2 — ర ర ర స, 3 — న న స స, 4 — మ మ స స గణములు.

3) పరస్థానార్ధ సమవృత్తములు ;

1 = 3 / 2 = 4.

ఉదా॥ కేతుమతి.

1 = 3 — స జ స గ; 2 = 4 — భ ర న గ గ.

4) పరస్థాన విషమవృత్తములు :

1 / 2 = 3 = 4

1 = 2 = 4 / 3

1 = 3 = 4 / 2

ఉదా॥ శ్రీరమణము.

1 — రుగ్మవతి; 2 = 3 = 4 — దోధకము.

1 — శరభక్రీడ.

1 = 2 = 4 — చంద్రశ్రీ; 3 — విశాల.

రథగమనమనోహరము :

1 = 3 = 4 — న స ర జ గ గ; 2 — స జ జ ర య.

5) సర్వపరస్థాన విషమవృత్తములు :

1 / 2 / 3 / 4. (నాల్గు భిన్నచ్ఛందస్సులు, నాల్గు భిన్నవృత్తములు)

ఉదా॥ పీతాంబరము.

| | |
|---|---|
| 1—త య న న గ (13 ఛం) | 3—త జ న భ న (15 ఛం) |
| 2—త జ న భ గ గ (14 ఛం) | 4—భ న న జ న గ (16 ఛం) |

ఈ మిశ్రవృత్తభేద లక్ష్యలక్షణములలో అనంతపెద్దనలకును అప్పకవికిని విపర్యాతభేదములు కాననగును. వాటి పర్యాప్త పరిశీలనకు నా ఛందోరీతులను జూచునది (పుటలు 114-126).

## శిరోమణి నూతన విషమవృత్తపద్ధతి - నిర్వచన వివరణములు

అర్ధసమ విషమవృత్తములలో లక్షణశిరోమణికర్త సూక్ష్మపరిశీలనచేసి మఱి కొన్ని యంతర్భేదములఁ బ్రపంచించెను. శిరోమణికారుఁడు వీనినెల్లను విషమ వృత్తములని వ్యవహరించెను.

శిరోమణి విషమవృత్తభేదముల ప్రకారము—

| | పాదక్రమము |
|---|---|
| **I. స్వస్థాన విషమవృత్తములు :** | |
| 1) స్వస్థానైకపాద విషమవృత్తములు | 1 = 3 = 4 / 2 |
| 2) స్వస్థానార్ధసమ విషమవృత్తములు | 1 = 3 / 2 = 4 |
| 3) స్వస్థానత్రిపాద విషమవృత్తములు | 1 = 2 = 3 / 4 |
| 4) స్వస్థాన సర్వచతుష్పాద విషమవృత్తములు | 1 / 2 / 3 / 4 |
| **II. పరస్థాన విషమవృత్తములు :** | |
| 1) పరస్థానైకపాద విషమవృత్తములు | 1 = 3 = 4 / 2 |
| 2) పరస్థానార్ధసమ విషమవృత్తములు | 1 = 3 / 2 = 4 |
| 3) పరస్థానత్రిపాద విషమవృత్తములులు | 1 = 2 = 3 / 4 |
| 4) సర్వస్థాన సర్వచతుష్పాద విషమవృత్తములు | 1 / 2 / 3 / 4 |

స్వస్థానమున నేకచ్ఛందోజాత వృత్తములు (అక్షరసంఖ్య సమము), పరస్థానమున భిన్నచ్ఛందోజాత వృత్తములు (ఏకైకాక్షరవృద్ధి, అక్షరసంఖ్య యసమము) వర్తించును.

ఏకపాద విషమవృత్తములలో 1, 3, 4 - పాదములం దొకవృత్తము, రెండవ పాదమున మఱొకవృత్త ముండును. అర్ధసమ విషమవృత్తములలో సమపాదములం దొకవృత్తము, విషమపాదములందు మఱొకవృత్తముండును. త్రిపాద విషమవృత్తములలో మొదటి మూఁడుపాదముల నొకవృత్తము నాలవపాదమున మఱొకవృత్త ముండును.

సర్వచతుష్పాద విషమములో నాలుగుపాదముల నాలుగువిధములయిన వృత్తములుండును.

స్వస్థాన పరస్థానములలోని నాలుగేసి విషమవృత్తభేదములకు వరుసగా శిరోమణి యుదాహరించిన వృత్తములు :

స్వస్థానము :— 1. చిత్ర 2. విరుహాంకము
3. శరభక్రీడ 4. తురంగి

పరస్థానము :— 1. బంధురము 2. మందరము
3. చక్రము 4. సన్మాని.

వీని గణక్రమాదులకు. చూ. తృ. ఆ. ప-169 నుండి 184 వఱకు.

శిరోమణి ప్రదర్శించిన యీ విషమవృత్తభేదములు వినూత్నములు. అర్ధసమ వృత్తములు, సర్వచతుష్పాద విషమవృత్తములు మాత్రమే ప్రాచీనుల పద్ధతితో నేకీభవించును. శిరోమణి పద్ధతిని బ్రాచీన సంస్కృతాంధ్ర ఛందోనుశాసకు లెవ్వరును జెప్పినవారు గారు.

శిరోమణికారుని ప్రకారములో నింకను గొన్ని యంతర్భేదములు కల్పింప నగును. ప్రయోగములు మృగ్యము లగుటచే నట్టి ప్రయత్నమువలనఁ బ్రయోజనము మందము. అర్ధ సమ విషమ వృత్తములలో సమపాదము లోకరీతి విషమపాదము లోకరీతి యను ప్రాచీన పద్ధతిని మాత్రమే చేపట్టెను శిరోమణికారుఁడు. అప్పకవి చెప్పినట్లు పూర్వార్ధ మొకవృత్తము ఉత్తరార్ధము మఱొకవృత్తము అను ప్రకారము నయితము సంగ్రహించియుండుట యుక్తము.

## వృత్తశ్లోకము

అనుష్టుప్ఛందము (8) లోనిదగు శ్లోకము సంస్కృత వాఙ్మయమున సుప్రసిద్ధము. పురాణేతిహాసశాస్త్రాదుల సర్వత్ర నీ శ్లోకమే ప్రయుక్తము. ఇది 8 అక్షరములు ప్రతిపాదమునఁగల వృత్తవిశేషము. కాని నాల్గుపాదములందు సమానగణక్రమ ముండదు.

కాన నియ్యది స్వస్థాన విషమవృత్త మగును. దీని లక్షణము కాళిదాసకృత శ్రుతబోధమునఁ జెప్పఁబడినది.

'శ్లోకే షష్ఠం గురుజ్ఞేయం, సర్వత్ర లఘుపంచమం,
ద్వి చతుష్పాదయో ర్హ్రస్వం, సప్తమం దీర్ఘమన్యయోః'

దీనినే సుబోధాభిధానములోవిదిగా శిరోమణి చూపినది. అమరసింహాది సకల కావ్యములఁ దనరుననిి యుటంకించినది, దీనిని వృత్తశ్లోకమందు రని పేర్కొన్నది (3-178).

ఈ వృత్తభేదమునకు శ్లోక మను సంజ్ఞ ప్రసిద్ధము. కాని తెలుఁగున ఛందో బద్ధములైన రచనలనెల్లఁ బద్యము లనునట్లే సంస్కృతమున శ్లోకములని వ్యవహరింతురు. 'పద్యే యశసిచ శ్లోకః' - అని యమరకోశము.

ప్రతిపాదమునఁ బంచమాక్షరము లఘువుగను, ఆఱవది గురువుగను, 1-3 పాదములలో సప్తమాక్షరము గురువుగను 2-4 పాదములలో నయ్యది లఘువుగ నుండవలెనని శ్లోకలక్షణము దెలుపుచున్నది. పై స్థలములందుఁదప్పఁ దక్కిన యక్షరములు గురులఘువులలో నేదేనిఁగావచ్చును. 'పదచతుష్టయమందలి తుదల గురువు, తల్లక్షణంబు పాదాంతమ్ములను గురువు' (3-177.) అని శ్లోకపాదాంత గురుస్థితి నుపదేశించినాఁడు శిరోమణికారుఁడు. ఇట్టి గుర్వవసాయి నియమము శ్లోక సామాన్యలక్షణమున నెందును గానరాదు. ఇది విచారణీయము.

సంస్కృతములో శ్లోకమునకున్నఁ బ్రయోగప్రచారములు మఱేపద్యమునకును లేదు. కాని తెనుఁగుఛందములందు దీనిప్రసక్తి (శిరోమణిలోఁదక్క) గానరాదు. శిరోమణిలోఁగూడ దీనికిఁ దెనుఁగులక్ష్యము చూపఁబడలేదు. పూర్వాంధ్రకవు లెవ్వరును దీని నుపయోగింపలేదు. అర్వాచీనమగు బిశ్వేశ్వరీయ కావ్యమున అమృతవాహినీవృత్తమను క్రొత్తపేరితో నియ్యది యుపయోగింపఁబడ్డది. వేదము వేంకటరాయశాస్త్రిగా రుత్తరరామచరిత్ర నాటకములో మానిషాదేతి శ్లోకానువాదముగఁ దెనుఁగున శ్లోకము సంతరించిరి.

'ఓ నిషాద ప్రతిష్ఠన్నీ, వొందుకో శాశ్వతాబ్దముల్
కామమోహిత మేకంబుక్, క్రౌంచ యుగ్మానఁజంపుటన్"

ఇందుఁ బ్రాస గూర్పఁబడలేదు. ఇది తెలుఁగుఛందస్సంప్రదాయమున కత్యంత విరుద్ధము. కొక్కొండవారు నియతిగాఁ బ్రాసఁగూర్చిరి.

## ఉపరివృత్తములు

ఇరువది యక్షరములకుఁ బైఁబడిన ఛందస్సులందుఁ బుట్టినవి యుపరివృత్తము లనఁబడును. శిరోమణియందు భీమనాదులు చెప్పిన లయగ్రాహ్యాదులతో మఱికొన్ని క్రొత్తవి ప్రదర్శితములు. ఆ వృత్తము లివి :

లయగ్రాహి (30 ఛందము), (లయవిభాతి 34 ఛం.), త్రిభంగి (34 ఛం.), దరము (30 ఛం.), లలితము (36 ఛం.), ఘనవినదము (36 ఛం.).

ఇందు మొదటి మూఁడు ప్రాచీనులు చెప్పినవి. తరువాతి మూఁడు పౌత్తికవి క్రొత్తగాఁ జేర్చినవి. ప్రాచీనులు భీమనాదులు చెప్పిన లయహారి శిరోమణిలో సంగ్రహింపఁబడలేదు. లయహారి శిరోమణిలో లేఖకప్రమాదమునఁ బరిచ్యుతమయ్యెనని తలంచుటకు వీలుపడదు. లయహారి 37 అక్షరముల వృత్తము - శిరోమణికారుఁడు పదివృత్తములందు 36 ఛందములవఱకే పేర్కొనెను. భీమనా నంతన పెద్దనల ననుసరించిన పౌత్తికవి వారు చెప్పిన లయహారిని లయముసేఁత మనోహారిగా నుండలేదు. ఇతఁడు 37 ఛందములఁ బేర్కొని లయహారిని సంగ్రహించియుండ వలయును. నన్నయ లయగ్రాహిమాత్ర ముపయోగించెను. తిక్కన లయగ్రాహి లయవిభాతుల రెంటిని రచించెను. ఈ రెండే తెలుఁగు కావ్యములందుఁ బ్రచురము. ఇవి సంస్కృత చ్ఛందములం దుక్తములుగావు.

లయహారిని నన్నెచోడుఁడు కుమారసంభవమునఁ బ్రయోగించెను. (2-100, 101). అనంతామాత్యుఁడు భోజరాజీయమున లయనామవృత్తత్రయమును వరుసగా నుపయోగించెను. [భోజరా. VII ఆ - లయగ్రాహి (12), లయవిభాతి (11), లయహారి (13)]. త్రిభంగి పాల్కుఱికి సోమన యనుభవసారమున నుపయుక్తము (194 ప.)

## దండకము

దండక మిరువదాఱింటికిఁ బైఁబడిన యక్షరములతో నొప్పారు నుపరివృత్తి విశేషము. దండకము సంస్కృతవృత్తము. ఇంచుమించుగఁ దెనుఁగుకవులు దండకమునకు సంస్కృత లక్షణమును బాటించిరి.

## దండక భేదములు

న గణయుగముమీఁద 7 మొదలుకొని యిచ్చవచ్చినన్ని ర గణములు నిలిపి యేకపాదముగానొండెఁ జతుష్పాదముగానొండె వ్రాయవచ్చును. 7 ర గణములు మొదలుకొని యేకైక ర గణవృద్ధిగల దండకములకుఁ జండవృష్ట్యాదినామములు ఛందోగ్రంథములం దొసఁగఁబడినవి. దండకపాదము సహస్రాక్షరపర్యంత పరిమిత ముగా నుండనగు నను నియతిగలదు గాని యతివ్యాప్తి గాననగును.

న గణద్వయముమీఁద ర గణములేకాక య గణములుగూడ నిలుపవచ్చును. ఇది య గణదండకము. మఱి యాదిలో న గణద్వయముమాని కేవల త గణము లతో గుర్వంతముగా దండకము వ్రాయవచ్చును. దీనిని త గణ దండకమందురు. మఱియుఁ దొలుత 'న న హ' గణములు వరుసగా నిలిపి పిదప వలసినన్ని త గణ ములు తుద గురువుండునట్లు దండకములు గూర్పనగును.

శిరోమణి వ్రాసిన దండకముల ప్రకారము :

1. న న + ర గణములు

2. న న + య గణములు

3. త గణములు + గ

4. న న హ + త గణములు

న న హ + త గణములు — అనంత పెద్దనలు పేర్కొనిరి. సంస్కృత భాషలో ర గణదండకములే (న న + ర) కాన నగును. తెలుఁగులో త గణదండక ములు ప్రచురములు. దండకవృత్తమునకుఁ దెలుఁగున శ్రీకారముచుట్టినవాఁడు నన్నయ భట్టారకుఁడు. అతనిది త గణదండకము. నన్నయ భారతారణ్యపర్వమున (1-324) అర్జునుఁడు పరమేశ్వరుని బ్రస్తుతించు సందర్భమున దండకము రచించెను.

తెనుఁగుకవులు కొందరు త గణదండకములే కాక ర గణదండకములు నయితము రచించిరి. నన్నయ, ఎఱ్ఱన, మారన, పోతన మున్నగువారు త గణదండ కములను, జక్కన, శ్రీనాథుఁడు, నందితిమ్మన, మాదయ మల్లన మొదలగువారు ర గణదండకములను బ్రయోగించిరి. తెనాలి రామకృష్ణుఁడు తన భిన్నకృతులలో

మఱియదండకముల నుపయోగించెను. ప్రధానముగఁ బ్రథమమునఁ బ్రస్తుతికై యుద్దేశింపఁబడ్డ దండకము కాలక్రమేణ వివిధ విషయాత్మక మయ్యెను. కొందఱు కవులు ప్రత్యేక దండకకృతులు సంతరించిరి. అందు భోగినీదండకాదులు ప్రసిద్ధములు.

## పంచపాది

సమవృత్తములు చతుష్పాదములు. అవసరమునుబట్టి పంచపాదులుగా వ్రాయవచ్చును. గీతసీసములను సైతము పంచపాదులుగాఁ గూర్పవచ్చును. కవులు స్తుతిలో శృంగారరసస్థితిలోఁ బంచపాదవృత్తములు రచింతురని లక్షణదీపికాకారుఁడు వార్తాకవి రఘునాథయ్య నిర్దేశించిన లక్షణము శిరోమణిలో సంగ్రహింపఁబడినది.

## మాలికలు

పంచపాదులుగానే గాక కంద సీస గీతములను సమవృత్తములను మాలికలుగా రచింపవచ్చును. 10, 12 18 పాదముల సీసమాలికలు వ్రాయవచ్చు (3.365). ప్రయోగములఁబట్టి సీసమాలికల పాదము లనియతములని తెలియనగుచున్నది.

కందమాలికలస్వరూప మిందుఁ జెప్పఁబడలేదు. సగముకంద మొకపాదముగా గ్రహించి యిచ్చవచ్చినన్ని పాదములు మాలికగా వ్రాయవచ్చునేమో? గీత సీస వృత్త మాలికలు తెలుఁగునఁ బ్రచురములు.

అప్పకవీయమందు రేఫ ఱ కార సీసమాలికలు, మఱి శబ్దార్థ లక్షణాలంకార, శబ్దార్థదోష, అష్టరసప్రభృతి సీసమాలికలు పెక్కులు గలవు. గణపవరపు వేంకటకవి ఆంధ్రకౌముది యను వ్యాకరణలక్షణ గ్రంథమున వేయిచరణముల సీసమాలికను సంతరించె. అల్లసాని పెద్దన యుత్పలమాలిక (30 పాదములుగలది) యంద ఱెఱింగినదే. చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహమున సీసమాలికాలక్షణములో 'పదిరెం డంఘ్రుల నేనియుఁ బదునెనిమిదినేని సీసపద్ధతి స్వేచ్ఛం బొదలినయే' నని పాదనియతిని బ్రస్తావించె (2-పుట 79). తన చెప్పిన ప్రకారము 28, 36 పాదముల సీసమాలికలు కూర్చెను (1.65; 3.144). శిరోమణికారుఁడు సీసమాలికలను బంచపాదులను బ్రచురముగ నుపయోగించెను. చూ. ల. శి. 1-14 (సీ. 9 పా.) 2.115 (గీ. 5 పా.) 132 (గీ. 5 పా.) 145 (సీ. 15 పా.) 192 (సీ. 20 పా. గీ. 5 పా.) 193 (సీ. 6 పా.) 3.272 (గీ. 5 పా.) 4-158 (సీ. 5 పా.)

ద్విపద రెండుపాదముల పద్యమయ్యును నొకటి రెండు ద్విపదలు మాత్రము పద్యకావ్యములమధ్య వ్రాయునాచారము మృగ్యము. గ్రంథమంతయు ద్విపదాత్మకము గానే రచించుట సంప్రదాయము. అట్టి కృతులను ద్విపదకావ్యములందురు. బసవ పురాణ - రంగనాథరామాయణములు ద్విపదకావ్యములు. వీటిలో ద్విపదేతర పద్యము లుండవు. కవిత్రయభారత, పోతనభాగవత, భాస్కరరామాయణములు పద్యకావ్యము లని వ్యవహరింపఁబడును. వీటిలో ద్విపద యచ్చునకేని యుండదు. ద్విపద కావ్యము లోనివి ద్విపద మాలిక లననొప్పును. రమణకవి దీనినిగూర్చి ప్రస్తావింపలేదు.

## జాతులు - కంద గీత సీసాదులు

మాత్రాగణాత్మకములైన పద్యములు జాతులని సాధారణముగ వ్యవహరింపఁ బడును. తెనుఁగునఁ గేవలమాత్రాగణాత్మకములే కాక సూర్యేంద్ర చంద్రగణబద్ధము లైన గీత సీ సాక్కరలుగూడ జాతులక్రిందఁ బరిగణింపఁబడును. మీఁదు మిక్కిలి ప్రాసరహితములగు గీత సీసముల నుపజాతులక్రింద సంగ్రహించినవి తెలుఁగు ఛందములు.

శిరోమణి జాతు లనుసంజ్ఞనే స్పష్టముగా నిర్దేశింపనపుడు ఉపజాతిపేరు స్పృశింప లేదనిచెప్పఁబనిలేదు. కందము, ఆర్యలు, గీతులు, సీసములు, ద్విపద, తరువోజ, అక్కరలు, రగడలు జాత్యధికారమునకు సంబంధించినవి.

ఇఁక శిరోమణిప్రోక్త జాతిపద్యములలోని విశేషములుమాత్ర మించుక పరామర్శింపఁబడును.

## కందములు

శిరోమణిలో 14 విధముల కందములు పేర్కొనఁబడెను.

అయ్యవి - సమకందము, విషమకందము, ఆర్యాకందము, కుఱుచ కం, విడుద కం, నలచతుష్కందము, భగణచతుష్కందము, ద్వివిధ కం, చతుర్విధ కం, వృత్తగర్భితకం, భాస్కరవిలసిత కందద్వయము, క్రౌంచపద కందద్వయము, మణి గణనికర కం, ప్రమితాక్షర కందము.

ఈ ఘట్టమునఁ జిత్రకవి పెద్దన (ల.సా.సం.) పద్యములను సంగ్రహించిన మన రమణకవి యతఁడు చెప్పని కందభేదముల నూఁటిని దెలిపెను. (సమకందము

ఆర్యాకందము, చతుర్విధకందము) సమకందము సహజకందమే యగుటచేఁ జిత్రకవి పెద్దన దానిని జెప్పినట్లే యగును. చతుర్విధకందము ల. సా. సంగ్రహమునఁ గానరాదు గాని యప్పకవీయాదులందుఁ బ్రదర్శితము. శిరోమణిలోని యార్యాకంద మొక్కటి పూర్వలాక్షణికులు వచింపని కందభేదము. శిరోమణి తరువాతఁగూడ దీని నెవ్వరు స్పృశించినట్లు లేదు.

సహజకందమున విదుదపాదముల తుదగురువు నియతముగా నుండవలె. ఆ తుదిగురువునకు మూఁడు లఘుద్వయము నిలిపిన నయ్యది యార్యాకందమగునని శిరోమణి లక్షణము. ఆర్యాకందము లఘ్వంత సహజకంద మనఁజనును.

ఉదా. యదుకులపావన రాధా

హృదయవ్యాకోచ జలజభృంగ రమాధవ. (ల.శి. 3-293).

ఇట్టి లఘ్వంత కందము మఱే ప్రసిద్ధ చ్ఛందమందును గానరాదు. ప్రయోగము మృగ్యము. ఆకర మన్వేషణీయము.

## ఆర్యలు - గీతులు

తెనుఁగు కందమునకు మూలభూతము లనఁదగునవి సంస్కృతీయంబులగు నీ యార్యాగీతిభేదములు. ఆర్యాపంచకము గీతిచతుష్కము ననంతుఁడు కందమువెంటఁ బేర్కొనెను. చిత్రకవిపెద్దన యార్యాగీతుల యనంతరము దెలిపెను. అప్పకవి కందముక్రింద నార్యలను, మఱియన్యత్ర సమవిషమ గీతిభేదముల క్రింద గీతులను బ్రదర్శించెను. రమణకవి యప్పకవివలె భిన్నస్థలములలో వేర్వేఱ గీతుల నార్యల సంగ్రహించెను. వస్తుతత్త్వము నరయఁగా నీ గీత్యార్యాభేదములు రెండు వెంటవెంట మండఁదగినవి. సంస్కృత చ్ఛందముల నట్లే కలదు.

సంస్కృతములోని యార్యాగీతియే (ఇది గీతిభేదము) మన తెనుఁగు కంద మగును. మన కవియేకాక ప్రాచీను లనంతాదు లిట్లే వక్కాణించిరి.

## సీ స భే ద ము లు

6 ఇంద్రగణములు + 2 సూర్యగణములు - మొత్తము 8 గణములుగల పాదములు నాలుగు, వాటిపై నొక గీతపద్యము (ఆటవెలఁదిగాని తేటగీతిగాని) కలిపినచో సీసపద్య మగును. సీసపాదములందుఁ బ్రతివానియందు రెండు సగములలో

రెండేసి గణములపైఁ బ్రత్యేకయతు లుండును. రెండు సగముల కేకాక్షరమైత్రి యుండనక్కఱలేదు. మఱి యతిగాని ప్రాసయతిగాని విలుపవచ్చును. ఇది సీసపద్య సామాన్యలక్షణము.

ఇందలి యతిప్రాసనియతి లక్షణవిశేషములఁబట్టి కొన్ని సీసభేదములు లాక్షణికులచేఁ బ్రదర్శింపఁబడెను. భీమన-6, విన్నకోటపెద్దన-6, అనంతుఁడు-10, చిత్రకవిపెద్దన-10, అప్పకవి-7 సీసభేదముల వక్కాణించిరి. శిరోమణికారుఁడు 12 భేదములఁ బ్రసంగించెను.

శిరోమణికారుఁడు చెప్పిన ద్వాదశవిధసీసములఁ దొలుత నిర్వచించి, యితర లాక్షణికులు రచించిన సీసభేదములతో సమన్వయించి తద్విశేషముల నీ క్రిందఁ బరామర్శించెద.

## శిరోమణిలోని ద్వాదశవిధ సీసములు – సమీక్ష

1. వృత్తప్రాససీసము, (3-324) సీసము పెద్దపాదములనాల్గింట నాదిలో వృత్తము నకువలెఁ బ్రాసము గలది. (ల.శి.) 4 పాదముల నాదిప్రాస అనంతుఁడు, చి. పెద్దన చెప్పిరి. అప్పకవి 6 పాదముల ప్రాస గూర్చెను (ఎత్తుగీతి రెండు సగముల రెండుపాదములుగా గ్రహించెను.)
2. సర్వతః ప్రాససీసము (3-325) గీతసహితముగ సీసము నన్నిపాదములందుఁ బ్రాస (ప్రాసయతి) నియమముగల సీసము (ల.శి.)
3. అర్ధసమసీసము (3-329) సీసము తొలి రెండు పాదముల (పూర్వార్ధమున) యతి, మరిరెండుపాదముల (ఉత్తరార్ధమున) ప్రాస (యతి) నియమము, మఱియు నెత్తుగీతియందుఁ బూర్వార్ధము తేటగీతి, ఉత్తరార్ధ మాటవెలఁది లక్షణము గలది. (ల.శి.) ఇట్టిభేదము నితర లాక్షణికులు స్పృశింపలేదు,
4. అవకలి సమసీసము (3-331) అన్నిచోట్లను బ్రాసయతి నియమముగలది (ల.శి.) దీనిని అవకలి సీసమని భీమన, అవకలి ప్రాససీసమని యనంత చిత్రకవులు పేర్కొన్నారు.
5. అవకలివడిసీసము (3-334) - అన్నిచోట్లను వడినియమముగలది (ల.శి.). దీనిని అక్కలివడి సీసమని యనంతుఁడు. అవకలివడి సీసమని చిత్రకవి పేర్కొన్నారు.

6. అవకలి ప్రాసనీసము (3-333) సీసపాదముల రెండు ఖండములలోను గీతి నాల్గు పాదములలోను అనఁగా 12 చోట్ల నొకటే ప్రాసాక్షరముగలది. (ల.శి.) అక్కిలి ప్రాసనీసమని యనంతచిత్రకవులు, అవకలివడి సీసమని యప్పకవి చెప్పిరి.

7. సర్వలఘుసీసము (3-330) గీతసహితముగ సీసపాదము లన్నియు లఘువులతోఁ గూర్పఁబడినది (ల.శి.). ఇంద్రగణములలో 'న ల ము', సూర్యగణములలో 'నగణము' మాత్రమే సర్వలఘుగణములు. నలములలో నగణములలో సర్వలఘుసీసము రచింపఁబడును. ఇది శిరోమణికారుఁడు చూపిన లక్షణము. ఛందములం దీవిషయమున లక్షణ మత భేదములు గాననగును. ఇంద్రగణములస్థానమునఁ బంచమాత్రాత్మక (నలల) గణము లుపయోగించిరి అనంత పెద్దనాప్పకవులు. వీ రీనియమమును గీతములోఁ బాటింపరైరి.

పంచమాత్రాగణ సర్వలఘుసీసము భాగవతమునఁ గలదు. ఇందు గీతముగూడ సర్వలఘువే. కాని యందలి యింద్రగణములు చతుర్మాత్రాకములు. కూచిమంచితిమ్మకవి రాజశేఖరవిలాసములో (1-17) సర్వలఘుసీసమునఁ దేటగీతిని లఘుమయముగా వ్రాయుటేకాక యందలి యింద్రగణములఁ బంచమాత్రాకములుగాఁ గూర్చుట గమనింపఁదగినది. అతని యచ్చతెలుఁగు రామాయణములోని సర్వలఘుసీసము (ఆరణ్య-114) చతుర్మాత్రాగణబద్ధము. గరళపురీ ఛందమున సర్వలఘుసీసము నింద్రగణములు చతుర్మాత్రాకములు. ప్రబంధరాజములో నుభయవిధము లున్నవి. (366-సీసము పంచలఘు గణములు: 221 సీసము-చతుర్మాత్రాత్మక గణములు)

ఉత్సాహవేదండ విషమసీసము (3-328) ఉత్సాహపై గీతముచేర్చి వ్రాసిన సీసము. ఇందు సీసము పెద్దపాదములకు మాఱు ఉత్సాహపాదములు నాలుగుండును (ల.శి.). ఇం దుత్సాహ వేఱుగా గీతము వేఱుగాఁగాక రెండేకపదముచేఁ గలిపియుండవలెను. ఉత్సాహమీఁద నాటవెలఁదియని శిరోమణికారుఁడు. అనంతచిత్రకవు లట్లే పేర్కొనిరి. భీమన చిన్నకోటపెద్దనల లక్ష్యముల నాటవెలఁదియున్నది. లక్షణమున గీతమని యున్నది. అప్పకవి లక్షణమున గీతమన్నాఁడు, లక్ష్యమున నాటవెలఁదిఁ గూర్చినాఁడు. దీనిని భీమనాది లాక్షణికు లెల్లరు విషమసీసమని పేర్కొనిరి.

9. సమనామ ప్రాససీసము (3_332) సీసము నాల్గు పెద్దపాదములందోను గీతి చేసిపాదములలోను నేకప్రాసాక్షరము గలది (ల.శి.). దీనిని అనంత చిత్రకవి విన్నకోటపెద్దనలు ప్రాససీసమని, అప్పకవి యక్కిలిప్రాససీస మని, పేర్కొన్నారు. శిరోమణికారుఁడు చూపిన లక్ష్య మనంతునిది.

10. సమసీసము (3_331) ఇది సామాన్యసీసము. (ల.శి.)

11. గీతరహిత చతుష్ప్రాససీసము (3_326) గీతములేని సీసము. ఇందు సీసము పెద్దపాదములు నాల్గుమాత్రముండును. మఱి యందుఁ బ్రతిపాదమునో వేర్వేఱ నేకప్రాసనియతి గలదు. (ల.శి.)

ఇట్టిసీసమును మఱెవ్వరు చెప్పినవారుగారు. రంగకవి మన రమణకవి ననుసరించి కాఁబోలు లక్ష్యలక్షణములఁ దెలుపక కేవలము పేళ్ళుమాత్రము చెప్పిన 12 సీసభేదములలో గీతరహిత చతుష్ప్రాససీసము గలదు.

అర్వాచీనుఁడగు చిలకమర్తి లక్ష్మీనరసింహకవి యనువదించిన భాసనాటకములలో గీతరహిత సీసములు రచితములై యున్నవి.

12. వడిసీసము (3_327) సర్వత్ర ఏకాక్షరవడినియతి గలది (ల.శి.). సర్వతః ప్రాససీసమున నేకాక్షరప్రాసవలె వడిసీసమున సర్వత్ర నేకాక్షరవడి గూర్పఁబడును. అనఁగా 24 చోట్ల నొకేయక్షరము పాదాదియతిస్థానములలో నుండు ననుట...లక్షణశిరోమణి లక్ష్యలక్షణములలో వడిసీసమను పేరున్నది. కాని దీని శీర్షికలో సర్వవడిసీసమని లిఖితము. రంగకవి సర్వవడిసీసమని పేర్కొన్నాఁడు. ఈ పేరే యుక్తతరము. ఈ సీసభేదము నీవిధముగఁ దక్కిన లాక్షణికులు చెప్పలేదు. చిత్రకవిపెద్దన 'మొదలనెత్తిన యతి పదమునందెల్లను నమరింప వడిసీస మనఁగఁ దగును' (2ఆ. 74 పు.) అన్నాఁడు. సీస పదముల వేర్వేఱ నేకాక్షరవడినియతి పెద్దనమతము. అప్పకవి కేవల వడి నియతిని జెప్పెను. అతని మతమున నేకాక్షరవడినియతి ప్రస్తావితముగాదు. (చూ. అప్ప - 4_527)

కపిలాంశమణిదీప + కమనీయ కల్హార
కలితభూనుతగుణ – గణకలాప (అ.సా.సం. పుట 77)

(ఇందు నాలుగుచోట్ల కకారయతి.)

విజయసారథిఁ గాని + వినుతింపఁ గాకొల్లఁ
గిరిజానాయకునిఁ గాని + కీర్తి సేయ. (అప్ప.4-529)

(ఇందు రెండు ఖండములఁ బ్రత్యేకయతి)

సీసభేదములలో అర్ధసమసీసము, గీతరహిత చతుష్ప్రాసపీసము అను రెండు శిరోమణికారుఁడు క్రొత్తగాఁ జెప్పినవి.

ఈ సీసభేదములనెల్ల నేకవియు గ్రంథముల నుపయోగించినట్లు గానరాదు. సర్వతః ప్రాసపీసము పాల్కురికిసోమన అనుభవసారము, నన్నిచోడ కుమార సంభవము మున్నగు ప్రాచీన గ్రంథములలో నుపయుక్తము. గణపవరపు వేంకటకవి ప్రణీత ప్రబంధరాజమునఁ బెక్కు సీసభేదములు ప్రయుక్తములై యున్నవి.

నన్నయ భారతమున సీసరచనలోఁ గొన్ని నియమములు పాటింపఁబడినట్లు దెలియవచ్చెడు. అందు సర్వత్రయతి, సర్వత్రప్రాసయతి, పాదఖండములలో సర్వత్ర నొకదానయతి మఱొకదానఁ బ్రాసయతి యను పద్ధతిలో సీసములు సంతరింపఁ బడియున్నవి. ఇచ్చవచ్చినట్లు యతిప్రాసలుగూర్చినసామాన్యసీసము లందు లేవు. అట్లేవేవి కతిపయము కానవచ్చిన నయ్యవి లేఖక ప్రమాదము లనుకొనవలెను. వాటికి సాధుపాఠములు లభించుచున్నవి. ఆయావివరములు పీఠిక విస్తరమగునను శంకచే నిందుఁ బ్రదర్శితములు కావు. ఈ సీసభేదములపరామర్శకు నా ఛందోరీతులఁ జూడఁ గోరెద (పుటలు 187-200)

ఈ యతిప్రాసనియతి నన్నయ సీసములందేకాక సీసముల యెత్తుగీతులందును మఱి ప్రత్యేకగీతులందును గాననగును. నన్నయ యీ సీసయతిప్రాసనియతిని దిక్కన పాటింపఁడయ్యె. ఎఱ్ఱన తాను నన్నయ రచనయకా సంతరింప సంకల్పించిన యొక్క యారణ్యపర్వశేషమునమాత్ర మీనియతి నిర్వహించెను. మఱియుఁ బోతన భాగవతమున నీనియతి గోచరించెడు.

## గీతిద్వయ సమ్మేళనము

ఆటవెలఁది తేటగీతుల రెంటికి అర్ధమర్ధంబున లక్షణంబును లక్ష్యంబును గనుపింప వివరించెద నన్నాఁడు శిరోమణికారుఁడు.

'రవిగణ త్రితయము దివశశిద్వయమును
నర్కు లై దుగురును నాటవెలఁది;
కినుని పై నిద్దఱింద్రులు నిరువురినులు
తేటగీతికి వడి మూఁటఁ దెలియఁగృష్ణ.' (3-310)

ఇందుఁ బూర్వార్ధ మాటవెలఁది, యుత్తరార్ధము తేటగీతి. ఈభిన్న గీతిద్వయము విడివిడిగాఁగాక యఖండముగా సంధింపఁబడియున్నది.

మఱియు నీ గ్రంథమందే అర్ధసమసీసములో (3-329) నెత్తుగీతియందు నాటవెలఁది తేటగీతులలోఁ దొలిసగ మొకదాన మలిసగ మొకదానఁ గూర్పవల్లయునవి లక్ష్యలక్షణములు ప్రదర్శితములు.

ఇట్టి యుభయగీతి సమ్మేళనము ఇతరత్రఁ గానవచ్చెడు.

కవిసంశయవిచ్ఛేదము (వావిళ్ళప్రతి - ముద్రణ 1925)

'ఇడఁగవచ్చును వ్యప్పు పై నిత్యసంధి
మాత్ర మొకక్కచోటను మట్టుమీఱఁ;
గొలుతు నఘమడంపఁ గోరిందుశేఖరు
నన్నయట్లు కవిజ నానుమతిని' (1-15)

పై పద్యమందుఁ బూర్వార్ధము తేటగీతి, ఉత్తరార్ధ మాటవెలఁది. ఇట్టి గీతి ద్వయ సమ్మేళన మిందు మఱి రెండుచోట్లఁ గలవు (1-91, 100). అర్ధ సమగీతులు నైతము వ్రాయవచ్చునని పై ప్రయోగములు విరూపించెడు.

## సీసగీతముల యుత్పత్తి

ఈ యంశ మీ ఛందమందే యుపన్యసింపఁబడినది. సీసగీతములు విరాట్ఛందో భవములఁట, 36 అక్షరములు గలది విరాట్ఛందము. ఉక్తాదిచ్ఛందములు వృత్తము లకు సంబంధించినవి. సీస ముపజాతిపద్యము; వృత్తముగాదు కావి యక్షరసంఖ్యను బురస్కరించుకొని సీసమును గూడ విరాట్ఛందమునఁ బరిగణించిన ట్లున్నది.

సీసమునకుఁ బ్రతిపాదమున 6 ఇంద్ర + 2 సూర్య గణములు. పంచమాత్రాక ములుగా నింద్రగణముల గణించిన 6 ఇంద్రగణములకు (6 x 5) 30 లఘువులు,

మఱి రెండు సూర్యగణములకు 6 లఘువులు, మొత్తము 36 లఘువులగును. 36 లఘువులను 36 అక్షరములుగాఁ బరిగణించిన సీసము విరాట్ఛందోభవ మగును.

ఋగ్వేద బ్రాహ్మణమున సీసగీత లక్షణములు పేర్కొనఁబడిన వని శిరోమణి గారుఁడు వచించినాఁడు. ఋగ్వేద బ్రాహ్మణములో సీసమునకు 'త్రపు' అను పే రున్నది. త్రపు అనఁగా సీసము. మఱి యందలి 'నటి' యను గీతి తెనుఁగున ఆటవెలఁది యనియు, శుభ్రగీతి యనియుఁ బేరందెను. 'బ్రహ్మవాదినో గీయతాం గీతా భవంతి' అని గీతిశబ్ద నిర్వచనము చూపఁబడెను.

శిరోమణి చెప్పలేదు గాని సీసము శీర్షకమను పేర భరతుని నాట్యశాస్త్రమునఁ బ్రస్తావితము. శీర్షక మను గేయవిశేషమును భరతుఁడు తన నాట్యశాస్త్రమునఁ బేర్కొన్నాఁడు. శీర్షితమన్నది యొక తాళభేదము. దానితోఁగూడిన రచనావిశేష మగుటచే దీనికి శీర్షకమని భరతుఁడు నామకరణము చేసియుండునని పండితాభిప్రాయము.

భరతుని శీర్షకలక్షణము తెలుఁగు సీస లక్షణమున కించుమించుగ సరిపోవు చున్నది. గేయరూపములుగానున్న దేశీయ చ్ఛందోరచనలకు భరతాదులు లక్షణముల, గల్పించి తెలుఁగు పేరిడి సంస్కృతీకరించి తమ లక్షణ గ్రంథములలోఁ జేర్చికొనిరని నేఁటి పరిశోధకుల యభిప్రాయము.

మానవల్లి రామకృష్ణకవిగారి యభిప్రాయ మిట్లున్నది:— 'సీస మనునది సామవేదమున బ్రహ్మగీతమువలనఁ బుట్టినది. అక్షరపిండప్రధానమై చంచత్పుటాది తాళనియమబద్ధమై యుండును. అట్టి పాదముల కొనలో తాళాంతరముచే వ్యవస్థితమగు గీతమొక్కటి సర్వమునకును శీర్షప్రాయముగా నుండుటచే శీర్షమై యంతయుం గలిపి శీర్షకమయ్యె' [1] (మానవల్లికవి రచనలు - కవికంఠపాశమను రచన - పు. 287)

సంస్కృతములో జనాశ్రయీఛందఃకర్త గీతశీర్షకములఁ బేర్కొన్నాఁడు. 'శీర్షకం గీతికాపరా' (5 అధ్యాయ - 50 సూత్రము.

శిరోమణి సీసగీతముల కాకరము సూచించెనుగాని కందవిషయమున నేదియుఁ దెలుపలేదు. కందమునకు గీత్యార్యమూలము. గీత్యార్యకు (ఆర్యాగీతికి) ప్రాకృత

---

1. శీర్షకమును గూర్చిన విషయము కోరాడ రామకృష్ణయ్యగారి 'దేశి' అను గ్రంథములోఁ గొంత గలదు. చూ. దేశి. పుటలు 205-206.

పింగళమున 'ఖందఅ' అను పేరుగలదు. దీనినే స్కంధకమని సంస్కృతీకరించిరి. ప్రాకృత స్కంధక (ఖందఅ) శబ్దభవమేమన కందము. చూ. పింగళచ్ఛందము - అధ్యా - పు. 67) స్కంధక కంద లక్షణములు సమానములు.

## అక్కరలు

అక్కర లయిదు విధములు — మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కర. వీటి లక్షణములు కవిజనాశ్రయాది సమస్త లక్షణ గ్రంథములందు సమానము. ఒక్క మధ్యాక్కర యతిస్థాన విషయమునందు లక్షణమునకును బ్రయోగమునకును భేదము గానవచ్చెడు. ఎల్లఛందఃకర్తలు మధ్యాక్కరకు 3-వ గణముపై యతి నిర్దేశించిరి. మధ్యాక్కరను గ్రంథములో నుపయోగించిన వారిలోఁ బ్రథముఁడు నన్నయ, ద్వితీయుఁడు ఎఱ్ఱన, తక్కిన కవు లుపయోగింపలేదు.

నన్నయ మధ్యాక్కరలో 4-వ గణముపై యతి ఘటించెను. అతనికిఁ బ్రాచీనమగు యుద్ధమల్లుని శాసనమందు లిఖితములైన మధ్యాక్కరలలో 4-వ గణముపై యతి యున్నది. నన్నయ కాలము వఱకు మధ్యాక్కర యతి 4-వ గణముపై నుండినట్లున్నది. నన్నయ తరువాతివాఁడగు భీమన కవిజనాశ్రయములో దీనికి 3-వ గణముపై యతి చెప్పెను. నన్నయరచనయగా నారణ్య పర్వశేషమును బూరించిన యెఱ్ఱన 3-వ గణముపై యతిఁగూర్చెను.

యుద్ధమల్లశాసనము, నన్నయభారతము — 4 గణములపై యతి; తెలుఁగు ఛందములు, ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషము—3 గణములపై యతి. ఈ యతి మార్పును ఛందోలక్షణకారు లేరును గమనించినట్లు గానము. 'కతానుగతికో లోకః' అన్నట్లు బహులక్షణగ్రంథ పరిశోధకులగు అప్పకవి, పొత్తపి రమణకవియు నీ మార్పును గుర్తింపక 3 గణము మీఁది యతినే పేర్కొనిరి.

ఈ యతిభేదమును సూచింప మచ్చున కాయా లక్ష్యముల నుదాహరించెద :

విస్తర, శ్రీయుద్ధ, మల్లుఁ, డనవద్య, + విఖ్యాత, కీర్తి.

(యుద్ధమల్ల శాసనము)

నరవర, స్తుత్యమై, యెంత, కాలంబు + నాకథల్, వినుచు.

(నన్నయ - భార - ఆరణ్య - 3-331)

అనదృశ, తేజుఁడు, బ్రాహ్మ + ణానీక, సహితుఁడై, కదఁగి.

(ఎఱ్ఱన - ఆరణ్య - 4-310)

మునుపుగాఁ, బ్రాసంబు, గూర్చి, + మూఁటిపై, విరమంబు నిల్పి.
(అప్ప - 4.464)

## గద్య లక్షణము

గద్య పంచవిధము — గద్య, బిరుదగద్య, చూర్ణిక, వచనము, విన్నపము. (ల. శి. 3.426)

గద్యము వచనము కాలక్రమమున సమానార్థకములుగాఁ బర్యాయపదములుగా రూపొందినవి. గద్య కావ్య మన్నను వచన కావ్య మన్నను నొక్కటే. ప్రాచీనులు ప్రచురముగా గద్యమని విగదించిరి. అర్వాచీనులు వచనమని వ్యవహరించెదరు. ఆదిలో నీ రెంటికి భేదమున్న ట్లూహ్యము.

అనంతుఁడు గద్యనే తెనుఁగు కృతుల వచనమందురని పేర్కొనె. తిక్కన సోమయాజి భారతమున 'పద్యముల గద్యములఁ రచియించెదం గృతుల్' అన్నాఁడు. ఉత్తరరామాయణములో 'వచనములేకయ వర్ణన రచియింపఁగవచ్చు' నని వచించినాఁడు. అందుచేతనే యాతని కతి నిర్వచనోత్తరరామాయణ మనఁ బరఁగినది.

బిరుదగద్య — మన తెనుఁగు కావ్యముల యాశ్వాసాంతగద్య లీ తెగకుఁ జెందును.

వచనము లనుపేరఁ బ్రసిద్ధములైనవి — కృష్ణమాచార్యుల సింహగిరి వచనములు, తాళ్లపాక పెదతిరుమలయ్య వేంకటేశ్వర వచనములు, మఱి సభాపతి వచనములు.

విన్నపములకుఁ గృష్ణమాచార్యుల శఠగోప విన్నపము లుదాహరణములు.

చూర్ణికలు క్వాచిత్కముగఁ దెలుఁగు ప్రబంధములఁ గాననగును. (చూ. మొల్ల రామాయణము - యుద్ధ - 3-30)

## చతుర్థాశ్వాసము - విశ్రమాధికారము

### యతులు - యతిభేదములు

యతి యను శబ్దము సంస్కృతము. ఛందశ్శాస్త్ర పారిభాషికమైన యీ శబ్దము నకు విచ్ఛేదమని యర్థము. 'యతి ర్విచ్ఛేద సంజ్ఞకః' అని వృత్తరత్నాకర నిర్వచ

నము. 'శ్లోకేషు విశ్రమస్థానం పదచ్ఛేదం యతి ర్విదుః' అని వృత్తరత్నాకరటీకోదధీ వ్యాఖ్య. ఇందు విచ్ఛేదమనఁగాఁ బదచ్ఛేదమని యర్థము. పద్యముయొక్క ప్రతిపాదములోను యతిస్థానముండును. ఆచోటఁ బదచ్ఛేదము కావలెను. పద మధ్యమున యతి రాఁగూడదు. యతిస్థానమున నట్టి పదవిచ్ఛేదము లేకుండునేని యతి భంగ దోషము గలుగునని సంస్కృత లాక్షణికులు శాసించిరి.

'యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా'

(శాకుంతలము)

ఇది శార్దూలవృత్తము. 12 అక్షరములపై యతి. ఇందు 12 అక్షరములపైఁ బదము భేదమగుచున్నది. అట్లుగాక,

'యాచ్ఞాదైన్య పరాంచితస్య కలహా + యంతే మిథ స్త్వాంవృణు'

అనుచోట 12 పైఁబదచ్ఛేదము లేదు. 'కలహాయంతే' అఖండ శబ్దము. ఇట్టిది సంస్కృతములో యతి భంగదోషమున కుదాహరణము.

సంస్కృతభాషలో విచ్ఛేదరూపయతి వెలయుచుండఁగాఁ, దెలుఁగున నాస్థానమందే యందులకుఁ బ్రత్యామ్నాయముగాఁ బాదాద్యక్షరమైత్రి విధిగాఁ బాటింపఁ బడును.

'సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శ + క్త్యుత్కుండ లోద్భాసితున్,
బాలార్కప్రతిమున్ శరాసనధరున్ + బద్ధోగ్రనిస్త్రింశు'

(భార, ఆది - 6-31)

ఇది శార్దూలము. పై పద్యమందుఁ బ్రథమపాదమున 12 పైఁ బదచ్ఛేదముగా లేదు. కాని పాదాదినున్న సకారమునకు సాజాత్యమైన శవర్ణము 12 పై నియుపఁబడి యున్నది. దీనినే యక్షరమైత్రి యందురు. మఱి పై పద్యము రెండవ పాదమునను అక్షరమైత్రి యున్నది( బా - బ), పదచ్ఛేదము సయితము గలదు. కాని పదచ్ఛేదముతోఁ దెనుఁగు యతికిఁ బ్రసక్తి లేదు.

సంస్కృతాంధ్ర యతిస్వరూపమును ఈ క్రింది యనంతుని ఛందములోని పద్యము స్పష్టము సేయుచున్నది:

'ఎన్నిట యతి రావలెనని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం,
బెన్నిట యతి రావలెనని
రన్నిటఁ దెలుఁగునకు మొదలి యక్షర మమరున్.
(ఛందో - 1-129)

(ఈ పద్యము వార్తాకవి రఘునాథయ్య లక్షణదీపికలోనిదిగా శిరోమణిలో నుదాహృతము. ఇది యనంతుని ఛందములోనిది. ఈ ప్రమాదము గ్రంథకర్తదో లేఖకునిదో యయియుండును. ఇందేకాక యనంతుని ఛందములోని పద్యములు మఱికొన్ని దీపికలోనివిగా శిరోమణి పేర్కొన్నది. ఒక గ్రంథములోనిదానిని వేఱొక గ్రంథములోనిదిగా రమణకవియే కాక యితర లాక్షణికులు గూడఁ బేర్కొని యున్నారు.)

## వడి - యతి

పద్యములందుఁ బ్రతిపాదమధ్యమున యతిస్థానమునఁ బాదాద్యక్షరమునుగాని తన్మిత్రాక్షరమునుగాని నిలుపుట తెలుఁగు పద్ధతి. సంస్కృతమున యతిలో అక్షర ప్రసక్తిగాని పాదాద్యక్షరప్రసక్తిగాని యుండదు. తెనుఁగు యతికిఁ బాదాది పాద మధ్యాక్షరముల సంబంధము గలిగించేఁ బ్రాచీన లాక్షణికులు పాదాద్యక్షరమును వడి యని, పాదమధ్యాక్షరమును యతి యని పేర్కొని, యతిస్థానమున ఆ వడిని నిలుప వలయునని లక్షణము నేర్పఱచిరి. వడి యతులకు సంబంధమున్నను వడివేఱు, యతి వేఱు. అందుచేతనే లాక్షణికులు వడి నిర్వచన మిట్లు చేసిరి:

అద్యోవళిః (అం. శ. చిం. సంజ్ఞ)

చరణాద్యక్షరమే వడి (కవిజనాశ్రయ - సంజ్ఞ - 61)

పాదప్రథమాక్షర ముత్పాదితమగు వళియనంగ (కా. చూడా - 7-29)

వాసనగల మొదలి వ్రాయి వడి యనఁబరఁగున్ (ఛందో - దర్ప - 1-29)

వడి (అక్షరము)నే యతిస్థానమున నెనచేసుక నిల్పవలెనని తాతన పెద్దనలు వక్కాణించిరి.

'పాదాదిను వర్ణము వడి
యాదరమున వానివాని యతినిడఁగఁదగున్' (శ. చిం - 3-1)

'వడియనఁగఁ బాదాదుల యం
దిడు నక్షరమేది యదియె యెనచేసుక యె
య్యెడ యతి రావలెనని రట
నిడుటయు విరతులకు సంజ్ఞ' (అ. సా. సం. 1-67)

ద్విపదకుఁ బ్రాసయతి గూర్పవచ్చునని నిర్వచించు సందర్భమున

'ప్రాసమైనను యతిపై వడి యైన దేనిగానిలిపి'

అని పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రలో వ్రాయుట (యతిపై వడి నిలుపుట) 'వడి - యతి' భిన్నార్థకములని నిరూపించుచున్నది.

దీనినిబట్టి వడి యను నర్థములో యతి, విరతి మొదలగు పర్యాయ పదము లలో దేనిని వాడరాదని తోఁచును. కాని కాలక్రమేణ అయ్యవి సమానార్థకములై పర్యాయపదములైనవని యీ క్రింది లాక్షణికుల వ్రాఁతలను బట్టి యూహింపనగును.

'విరతులు విశ్రాంతులు మఱి......
విరమణములు నాఁగ వళ్లు వెలయు' (అనంత - ఛం. ద. 1-78)

'విరతి విశ్రాంతి విశ్రామ విశ్రమములు......
అనఁగ నివి తొమ్మిదియు వళి కాఖ్యలయ్యె..' (అప్ప - 3-6)

'సప్తవింశతి యతుల్ సత్కవుల్ పనిగొన్న
కరణివళ్లన్నియుఁ గానరాఁగ' (చిత్రకవి - అ. సా. సం. పు. 18)

పోలికవడి, సరసయతి (అనంత), స్వరయతి, బిందుయతి, వర్గవడి, ఋవడి (చిత్రకవి), నిత్యయతి, భిన్నయతి, వృద్ధివడి, విశేషవడి (అప్పకవి) అని యీ విధముగ వడి యతిశబ్దములఁ బర్యాయముగ లాక్షణికు లుపయోగించియున్నారు.

కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణులలో యతి పర్యాయముగా వడి శబ్దము వాడఁబడలేదు. పరిశీలింపఁగా విన్నకోటపెద్దన కాలమువఱకు వడి యతులు భిన్నార్థకములుగా నుండి, యనంతుని కాలము మొదలు పర్యాయపదము లయ్యెనని యరయనగుచున్నది. కాని యనంతుని యనంతరమువాఁడగు తాతంభట్టు కవిచింతామణిలో వడికి యతి పర్యాయము వేయలేదు.

'పాదాదిమ వర్ణము వడి,
యాదరమున వానివాని యతినిడఁగఁదగున్'

అని తాతంభట్టు నిర్వచించెను.

ఇది యిట్లుండఁగా ల. శిరోమణికారుఁడు యతిని పాదాద్యక్షరమని నిర్వచించి, వడిని యతికిఁ బర్యాయముగాఁ బేర్కొనెను.

'జరగుఁ జరణాది విశ్రమ స్థానమనఁగ ;'

'యతి విశ్రాంతి విరమము వి
రతి విశ్రమ విరమణము విరామము వడి వి
శ్రుత విశ్రామము లనునివి
యతులకుఁ బదిపేళ్లుఁ జెల్లు నారయఁగృష్ణా'

ఇందు యతులకుఁ జెప్పిన పదిపేళ్లలో 'శ్రాంతి' కి బదులు 'విశ్రుత' మని కలదు. విశ్రుత శబ్దమునకు విశ్రమార్థము లేదు. శిరోమణికారుని మతమున విశ్రుతము యతికిఁ బర్యాయపద మనుట యతని యీ క్రింది పద్యసందర్భములు స్పష్టము సేయు చున్నవి. (ఇందు రెండవది నిర్ధారకము)

శ్రేమదంతి విశ్రుతంబు - రేఫ జ ర న జ ల్గురు ల్ (3-178)

సారసాక్షి ర జ ర్ల - జ ర్లసంయుతంబు స
త్పారిజాత మొందు విశ్రు - తంబ దెన్మిదింటిపై (3-63)

పాదాద్యక్షరము వడియనుటకు మాఱు యతి యని పేర్కొన్న ప్రథమాంధ్ర లాక్షణికుఁడు రమణకవి. ఈ నిర్వచనము యుక్తియుక్తము గాకున్నను వడియతుల ననంతాది లాక్షణికులు పర్యాయములుగా రచించుటచే శిరోమణికారుఁడు వడిపదముతో నందఱవలె మొదలుపెట్టక విశ్రమముతో నారంభించి వడియెడ యతిని బ్రతిష్ఠించి నాఁడు. ఇది కొంత విలక్షణమనక తప్పదు.

## వ డి శ బ్ద వ్యు త్ప త్తి

వడికి వళి రూపాంతరము. వడి సంస్కృత శబ్దముగాదు, ఇది దేశ్యము. దీని వ్యుత్పత్తి యూహ్యము. దేశ్యశబ్దము లవ్యుత్పన్నములని ప్రాచీనులమతము. కాని

యీనాఁటి భాషాశాస్త్రవేత్తలు సోదరదేశభాషా తులనాత్మక పరిశీలనచే దేశ్యశబ్దములకుఁ బెక్కింటికి వ్యుత్పత్తుల మూలముల నాకరముల నూహించి వక్కాణింతురు.

సంస్కృతములో తెలుఁగులో నున్నట్లు యతిప్రాసలు లేవు. కన్నడమునఁ బ్రాసగలదు, యతిలేదు. తమిళమునఁ దెలుఁగులోవలె వళిప్రాసలు రెండును గలవు. తమిళమున వళి ప్రాసలను గ్రమముగా 'మోనై - యదుగై' అందురు. వీటికి మన తెనుఁగు వళిప్రాసలకు శబ్దసామ్యము గానరాదు. అనుప్రాసమునకుఁ దమిళమున 'వళ్లి (ళి) యెదుగై' అని పేరు. ఈ పదబంధములోని వళినే తెనుఁగువారు సంగ్రహించి యుందురేమో పరిశీలనార్హము.

## యతిమైత్రి

నే నిందు వళియతులను బర్యాయపదములుగా నుపయోగించెదను. తెనుఁగులోని యీ యతి సావర్ణ్యరూపము. పాదాద్యక్షరమునకు సజాతీయాక్షరమును యతిస్థానమున నిలుపవలయు ననుట దీని లక్షణము. ప్రాసమునందువలె నేయక్షరమున కాయక్షరమే కాక, యతిలోఁ గొంత సాజాత్య సావర్ణ్యముల ననుసరించి యొక యక్షరమునకు వేఱొక యక్షరముతో మైత్రి యేర్పడెను.

ఈ యతిమైత్రికి గారణమైన సావర్ణ్య సాజాత్య సంబంధాదులఁగూర్చి యే లాక్షణికుఁడును బ్రస్తావింపలేదు. శిరోమణికారుఁ డొక్కరుఁడే యీ యంశమును సవిస్తరముగఁ బరామర్శించెను.

'సంస్కృతంబునకు యతి పాదచ్ఛేద సంజ్ఞఁదనరు; నాంధ్రభాషాకవనంబున వర్ణోత్పత్తిస్థాన ప్రయత్నంబునఁ బ్రత్యాహారప్రయుక్త సూత్రంబున నాంధ్ర ప్రాకృత శాస్త్రోద్భవ తద్భవ తత్సమవర్ణ నిరూపణ సామ్యంబునం జేసిన వర్ణంబుల కన్యోన్య సంబంధంబులగుటచేత నాదిమకవులు వివరించిన యతులలోఁ దెలుఁగున మొదలి యక్షరంబు విచ్ఛేదస్థానంబున రావలయుఁ గావునఁ దత్తద్వర్ణోత్పత్తి క్రమంబు వివరించెద —

......వర్ణంబులకు సారూప్య సామీప్య ప్రత్యాహారైకస్థాన తద్భవ సంబంధ బాంధవంబులు - విచారించి యతులు నిర్ణయించి నిలుపవలయు' (4-16)

## యతిమైత్రి - అన్యోన్యసంబంధము

ఏకస్థానసామ్యము—

అ ఆ ఐ ఔ — కంఠస్థాన జనితములు - యతిమిత్రములు.

క ఖ గ ఘ — కంఠ్యములు.

ప్రత్యాహారప్రయుక్తము— (ఇక్లే తక్కినపట్ల నరయవలె)

శ ష స (ర్)

సారూప్యము—

వేళ - వేల (ళ - ల), జలధి - జడధి (ల - డ)

వనమ్ము - వనంబు (ము - బు), నెపము - నెవము (ప - వ)

బలాహక - వలాహక (బ-వ), హరుసము - అరుసము (అ - హ)

తత్సమ తద్భవ సంబంధము (ప్రాకృతాంధ్ర సూత్రప్రయుక్తము) —

అజ్ఞ - ఆన (జ్ఞ - న), గుణము - గొనము (ణ - న)

దిశ - దెస (శ - స), రోషము - రోసము (ష - స)

హంస - అంచ (అ - హ, చ - స)

పై వానిలోఁ గొన్నింటికి రెండు మూఁడు సంబంధములు గలవు.

'వ - బ'ల కభేదతకు సారూప్యకారణమే కాక తత్సమ తద్భవ సంబంధమును గలదు. వాపి - బావి, వీరము - బీరము.

'అ - హ'లకు స్థాన సామ్యమేకాక, తత్సమ తద్భవ సంబంధమును గలదు. హంస - అంచ, హర్షము - అరుసము.

శిరోమణికారుఁడు వచింపలేదు కాని యీ యతిమైత్రికి వ్యాకరణశాస్త్రప్రసిద్ధము లగు ఆగ మాదేశ సంబంధముగూడఁ గారణముగఁ జెప్పనగును.

పాపము + మాట — పాపపు మాట (పు - ము)

అతఁడు + పలికె — అతఁడు వలికె (ప - వ)

మేలు + చేయు — మేలుసేయు (చ - స)

మేన + అత్త — మేనయత్త (అ - య)

ఇట్లే యతిమైత్రీ సంబంధమునకు మఱికొన్ని కారణములు నిరూపింపనగును.

ఆదిలో నీ వడియత్యక్షరమైత్రిలోఁ గతిపయభేదములేయుండి కాలక్రమమునఁ బద్యవాఙ్మయ విస్తృతిచేతను గవుల నిరంకుశత చేతను బహు మతములు బహు భేదము లేర్పడెను. యతిభేదములే కాక ప్రాసభేదములు గూడ నానాఁటికి విస్తరించి యధికసంఖ్యాకము లయ్యె.

ఈ సందర్భములో భీమన 10, అనంతుఁడు 24, మఱి కొందఱు 27 యతిభేదములు చెప్పిరని, తాను బూర్వకవి లక్ష్యములఁ బరిశీలించి యందఱ కెక్కువగా 41 యతిభేదములు విరచించినట్లు చెప్పికొనె నప్పకవి. (అప్ప - 4 - 7, 8)

ఈ లక్షణశిరోమణిలోను రంగరాట్ఛందములోను ఏయే ఛందఃకర్త లెన్నెన్ని యతిభేదములు వచించిరో యా వివరములు దెలుపఁబడినవి. ఈ గ్రంథద్వయమందే కాక యితర ముద్రితాముద్రిత లక్షణగ్రంథములలోఁ బేర్కొనబడిన యతిభేదముల సంఖ్య లీ క్రిందఁ జూపెద.

| లక్షణ గ్రంథము | యతుల సంఖ్య |
|---|---|
| భీమనఛందము | 10 |
| కావ్యాలంకార చూడామణి | 16 (రంగ) |
| అనంతుని ఛందము | 24 |
| తాతంభట్టు - కవిచింతామణి | 15 |
| చిత్రకవి పెద్దన - ల. సా. సంగ్రహ | 27 |
| కవిసంజీవని | 12 (రంగ) |
| సులక్షణసారము | 39 |
| అప్పకవీయము | 41 |
| కూచిమంచి తిమ్మన - సర్వ - ల. సా. సం. | 28 |
| రంగరాట్ఛందము | 27 |
| కవితాలక్షణసారము | 17 |
| ఛందస్సారసంగ్రహము | 27 (ల. శి.) |
| వన్నయభట్టు లక్షణసారము | 27 (రంగ) |

| లక్షణ గ్రంథము | యతుల సంఖ్య |
|---|---|
| లక్కభట్టు | 55 (ల. శి.) |
| లక్షణవిలాసము | 26 |
| యతిప్రాసవిలాసము | 45 |
| గరళపురీఛందము | 50 |
| కీరభూపాలీయము | 45 |
| శ్రీధరచ్ఛందము[1] | 15 (ల. శి.), 30 (రంగ) |
| అథర్వణచ్ఛందము | 15 (ల. శి.), 29 (రంగ) |
| కవిరాక్షసచ్ఛందము | 21 (రంగ) |
| జయదేవచ్ఛందము | 9 (రంగ) |
| నీలకంఠచ్ఛందము | 25 (రంగ) |
| ఉత్తమగండచ్ఛందము | 18 (రంగ) |
| లక్షణదీపిక (వార్తాకవి) | 36 |

కాలక్రమమున యతిభేదసంఖ్య పెరుగుచువచ్చినమాట నిజమే కాని యప్పకవి తర్వాతివారు పెక్కురు 41 యతులకన్నఁ దక్కువే చెప్పిరి. అర్వాచీనులు సాదృశ్యముగల రెండు మూఁడు యతిభేదముల నొక్క భేదముగానే పరిగణించిరి. అందుచేత యతిసంఖ్య తగినట్లు గానవచ్చెనేకాని యతిమైత్రీభేదవిషయములు కొఱఁతవడలేదు. ఒక్క ఋవడిలోనే యప్పకవి చెప్పిన ఋవడి, ఋత్వసంబంధవడి, ఋత్వసామ్యవడి యను మూఁడు భేదముల నొక్కటిగా సంగ్రహించిరి. అట్లు సంగ్రహించిన వారిలో శిరోమణికారుఁడు నొక్కఁడే. అప్పకవి చెప్పని క్రొత్తయతులఁజేర్చి మొత్తము 38 యతిభేదములఁ బ్రదర్శించినాఁడు పొత్తపికవి. యతిభేద నిరూపణమునకు మున్నుగ నిట్లు ప్రతిజ్ఞ చేసినాఁడు.

‘ అమర మున్నుగ యతిలక్షణములు నొడివి,
జత పురాతన కవుల సమ్మతులం బ్రాసి
లాక్షణిక దక్షులెల్ల ఖళా యనంగ
రచన చేసెద యతులేను రామకృష్ణ.’ (4-8)

---

1. శ్రీధరచ్ఛందములో 15 యతులని లక్షణశిరోమణి, 30 యతుల రంగయఛందము. ఇట్లే తక్కిన వారిపట్ల తెలియఁగునది.

ఈనాఁడు ఛందోభ్యాసకుల కెల్లర కవశ్యపఠనీయమును సుప్రసిద్ధమును బహుళ ప్రచారము గలదియునగు అప్పకవీయములోని యతిభేదములతో లక్షణశిరోమణిలోని యతిభేదములను సరిపోల్చి పాఠకుల సౌకర్యార్థ మొకపట్టికగా క్రిందఁ జూపుచున్నాను :—

## యతులపట్టిక

ఇందు శిరోమణ్యప్పకవీయ యతిభేదములు సరిపోల్పఁబడును.

| లక్షణశిరోమణి | అప్పకవీయము | |
|---|---|---|
| 1. స్వరయతి (సహజస్వరయతి) | స్వరమైత్రీవళి | (1)[1] |
| | స్వరప్రధానవళి | (2) |
| 2. వర్గయతి | వర్గవళి | (9) |
| 3. సరసయతి | సరసవళి | (25) |
| 4. దేశీయయతి | దేశ్యనిత్యసమాసవిశ్రాంతి | (33) |
| 5. జ్ఞయతి | తద్భవవ్యాజవిశ్రామము | (11) |
| | విశేషవళి | (12) |
| 6. ఉభయయతి | యుష్మదస్మచ్ఛబ్దయతి | (29) |
| 7. అఖండయతి | —— | |
| 8. బిందుయతి | బిందుయతి | (10) |
| | అనునాసికాక్షరయతి | (14) |
| 9. భిన్నయతి | భిన్నయతి | (20) |
| | ప్రత్యేకయతి | (19) |
| 10. ప్రాదియతి | ప్రాదియతి | (31) |
| 11. అభేదయతి | అభేదవిరతి | (22) |
| | అభేదవర్గయతి | (23) |
| 12. వృద్ధియతి | వృద్ధివళి | (7) |
| 13. మకార (బిందు) యతి | మవర్ణవిరామము | (17) |

1. ఈ కుండలీకరణములందలి సంఖ్యలు అప్పకవీయములోని యతిభేదక్రమమును సూచించును.

| లక్షణశిరోమణి | అప్పకవీయము | |
|---|---|---|
| 14. ప్లుతయతి | కాకుస్వరవళి | (39) |
| 15. నిత్యసమాసయతి | నిత్యసమాసవిశ్రాంతి | (32) |
| | నిత్యయతి | (34) |
| 16. గూఢస్వరయతి | లుప్తవిసర్గస్వరయతి | (3) |
| 17. వ్యంజనస్వరయతి, | స్వరప్రధానవడి | (2) |
| 18. ఋత్వయతి | ఋవళి | (4) |
| | ఋత్వసంబంధవళి | (5) |
| | ఋత్వసామ్యవళి | (6) |
| 19. విభాగయతి | విభాగవళి | (36) |
| 20. కాకుస్వరయతి | కాకుస్వరవళి | (39) |
| 21. సావర్ణ్యయతి | ——— | |
| (బిందుసావర్ణ్యయతి) | అనుస్వారసంబంధయతి | (13) |
| 22 అనుస్వారోష్మయతి | ——— | |
| 23. ముఖ్యానునాసికయతి | ——— | |
| 24. ఆదేశయతి | నిత్యసమాసయతి | (32) |
| 25. ప్రాసయతి | ప్రాసయతి | (41) |
| 26. వికల్పయతి | అంత్యోష్మసంధివడి | (27) |
| | వికల్పవిరమణము | (28) |
| 27. ప్రభునామయతి | నామాఖండవిశ్రమము | (37) |
| 28. సంయుక్తయతి | సంయుక్తయతి | (26) |
| 29. శకంధుయతి | పరరూపయతి | (30) |
| 30. యశవర్గద్వయయతి | ——— | |
| 31. చక్కటియతి | ముకారయతి | (16) |
| 32. ఎక్కటియతి | ఏకతరయతి | (21) |
| 33. పోలికయతి | మువిభక్తియతి | (15) |
| 34. శివడి | ఋవళి | (4) |
| | ఋత్వసంబంధవళి | (5) |
| 35. సవర్ణప్రాసయతి | ——— | |
| 36. అలుక్సమాసయతి | ——— | |
| 37. ఘుష్టయతి | ——— | |
| 38. నఞ్సమాసయతి | నిత్యసమాసయతి | (32) |

గమనిక :- అప్పకవీయమున లేని యతులకు గుర్తు '—' శిరోమణి చెప్పిన యొక యతిలో నప్పకవీయములోని 2, 3 యతిభేదములు అంతర్గతములగును. అప్పకవీయయతుల ప్రక్కనున్న సంఖ్యలు అప్పకవీయ యతిభేదసంఖ్యలఁ దెలుపును. అప్పకవి చెప్పిన - ప్రాణి, ఋజు, ఊష్మ, రాగమసంధి, పంచమావిభక్తి ప్లుతయుగ మిశ్రమభేదములు శిరోమణిలో లేవు.

## శిరోమణిలోని యతిభేదముల సంగ్రహ వివరణము

1. స్వరయతి[1] :

(a) అ ఆ ఐ ఔ । ఇ ఈ ఋ ౠ ఎ ఏ । ఉ ఊ ఒ ఓ ॥

(b) అచ్చంధియందుఁ బరపదాద్యచ్చునకు యతి.

ఉ॥ ఇనజాఁడీగి ఖార + ఈశుండు చతురత.

2. వర్గయతి :

వర్గములలోఁ దొలి నాలుగక్షరములకు మైత్రి -

క ఖ గ ఘ । చ ఛ జ ఝ । ట ఠ డ ఢ । త థ ద ధ । ప ఫ బ భ ॥

3. సరసయతి :

అ య హ । న ణ । చ ఛ జ ఝ శ ష స ॥

4. దేశీయయతి :

స్వరసంధిగల దేశ్యశబ్దములందు స్వరవ్యంజనోభయ యతిమైత్రి.
క్రిక్కిఱియు, క్రచ్చఱ, తెమ్మెరలు, మొ. దేశ్యశబ్దములతో నుభయయతి చెల్లును.

5 క్షయతి :

(a) క్ష - న జ స. (b) క్ష - క.

---

1. ఇందలి యతిభేదసంఖ్యలు శిరోమణిలోని క్రమమును ననుసరించినవి.

6. ఉభయయతి :

యుష్మదస్మచ్ఛబ్దముల స్వరసంధియందు స్వరవ్యంజనోభయయతి. యుష్మదవతార, అస్మదాజ్ఞ - ఇట్టి స్వరసంధులందు స్వరవ్యంజనములలో నొకదానికి యతి.

7. అఖండయతి :

అచ్సంధిలో స్వరమునసేకాక సంధి నిలిచిన హల్లునకు యతి.

8. బిందుయతి :

'ణ - న - మ' లకు బిందుపూర్వకములైన యాయావర్గములలోని తొలి నాలుగక్షరములతో యతి.

(a) ణ - ంట, ంఠ, ండ, ంఢ.
న - ంత, ంథ, ంద, ంధ.
మ - ంప, ంఫ, ంబ, ంభ.

(b) ణ - ంత, ంథ, ంద, ంధ.
న - ంట, ంఠ, ండ, ంఢ.
జ్ఞ - ంత, ంథ, ంద, ంధ.

9. భిన్నయతి :

ఇంచుగాగమయతి. 'ధరించు' అనుచో రేఫకు 'ధరియించు' అనుచో స్వరమునకు యతి.
ఇట్లే చేరిది, చేరియుది యనుచో హల్లునకు నచ్చునకుఁ గ్రమముగా యతి.

10. ప్రాదియతి :

ప్రాదియోగముగల శబ్దములం దుభయయతి.
ప్రార్థిత (ప్ర + అర్థిత) - ఇందు స్వరవ్యంజనములలో నొకదానికి యతి.

11. అభేదయతి :

ర ల । ర శ । ల శ । ల ళ । శ ళ । వ ప బ ॥

12. వృద్ధియతి :

వృద్ధిసంధిగలచోట నుభయస్వరములకు యతి.

లోక + ఏక - లోకైక — ఏ, ఐ లకు యతి.

నాక + ఓక - నాకౌక — ఓ, ఔ లకు యతి.

13. మకారబిందుయతి :

ంయ, ంర, ంల, ంవ — మ.

ంశ, ంష, ంస, ంహ — మ.

బిందుపూర్వకాంతస్థోష్మలకు మకారముతో యతి.

14. ప్లుతయతి :

దూరాహ్వాన, సంశయ, రోదనములందలి ప్లుత దీర్ఘమునకు స్వరయతి.

ఉ॥ ఏమినాస్వామి రా + వే.

15. నిత్యసమాసయతి :

నిత్యసమాసశబ్దములలో సంధ్యక్షరమున కుభయయతి.

నాస్తి, నారాయణ, అనంత, ఏకాంత, జనార్దన, విశ్వామిత్ర ప్రభృతి నిత్య
సమాసశబ్దములలో నుభయయతి చెల్లును.

16. గూఢస్వరయతి :

విసర్గసంధిలో అకారముమీఁది విసర్గకు ఓత్వమగుచో గూఢమైన్న అకార
మునకు యతి.

ఉ॥ అరయ స్వరవిలాసంబు దా + సోఽహమనఁగ.

17. వ్యంజనస్వరయతి :

అచ్సంధియందు హల్లులమీఁద నిలిచిన స్వరమునకే యతి.

ఉ॥ పీ । కాకపిపరుతోడి సఖ్య + మర్ఘము.

సీకు + అకపి ......... సఖ్యము + అర్ఘము.

( అప్పకవి దీనిని స్వరప్రధానవడియని పేర్కొనె )

18. ఋత్వయతి :

ఋ - రే - రి ఋ - ఌ (వట్రసుడి) । ఌ - ఌ (వృ - మృ) హ - ఌ ।

19. విభాగయతి :

విభాగార్థకమగు ఏపి శబ్దముతోడి సంధియం దుభయయతి.

ఉ॥ రేందేపి - ఇందు ఏ - దే లకు యతి.

20. కాకుస్వరయతి :

దీర్ఘాంత సంబోధనయం దుభయయతి.

21 సావర్ణయతి :

త వర్గ ట వర్గములకు యతి.

ఉ॥ దిగ్గిన — + తీర, దక్కె — అట + టా.

(త ట వర్గాక్షరముల కుభయరూపము లున్నప్పుదే యీ యతి చెల్లునని యిందలి లక్ష్యములవలన నెఱుఁగవగును.)

బిందుసావర్ణయతి -

పూర్ణబిందుపూర్వక 'ట - త' వర్గలకు యతి.

ఉ॥ చం । దాలశ ...... ఇం + టశ.

22. అనుస్వారోష్మయతి :

మ - ంశ, ంష, ంస, ంహ.

23. చుత్వానునాసికయతి :

త్వత్ + చరణ - త్వచ్చరణ (చుత్వసంధి) - ఇందలి 'త - చ' లకు యతి.
మత్ + మానస - మన్మానస (అనునాసికసంధి) - ఇందు త - మ - నలకు యతి.

24. ఆదేశయతి :

నాక, ద్వీప, అంతరీపశబ్దములలో ఆదేశసంధియం దుభయయతి.

25. ప్రాసయతి :

యతికిమాఱు ప్రాసాక్షరమైత్రి. ఇది పదగీత సీస లయగ్రాహి ప్రభృతి పద్యములలోఁ జెల్లును.

26. వికల్పయతి :

వర్గహల్లులకు హకారము పరమగుచో ఆ హకారమునకు వర్గచతుర్థమును, అనునాసికములు పరమగుచో నా యా వర్గానునాసికమును వికల్పముగా నగును. అట్టి వికల్పసంధిలో నుభయవ్యంజనములకు యతి.

జగత్ + హిత - జగద్ధిత — ఇందుఁ దకార హకారములకు ( ఒక్కదానికి ) యతి.

సత్ + మతి - సన్మతి — ఇందుఁ దకార నకారములకు మకారమునకును యతి.

27. ప్రభునామయతి :

వెంగన్న, వెంగన, మంగమ్మ, మంగమ — ఇట్టి అన్న అమ్మ పదములతోడి సంధియం దుభయయతి. అన్నమ్మలు ప్రభు ( శ్రేష్ఠ ) వాచకములు.

వెంగ + అన్న - వెంగన్న — ఇందు అకార కకారములలో నొక్కదానికి యతి.

28. సంయుక్తయతి :

సంయుక్తాక్షరములలో నేదే నొక్కయక్షరమునకు యతి.

క్ష - ఇది క షల సంయుక్తము. దీనికి క షలలో నొకదానికి యతి చెల్లును.

29. శకంధుయతి :

పరరూప సంధిగల శకంధ్వాదిగణములోని శబ్దములం దుభయయతి.

ఉ॥ శక + అంధు - శకంధు — 'అ - క' లలో నొకదానికి యతి.

వేద + అంద - వేదంద — 'అ - ద' లలో నొకదానికి యతి.

30. యశవర్గద్వయయతి :

య ర ల వ లకు శ ష స హ లకు పరస్పరము యతి.

31. చక్కటియతి :

పు పు బు భు లకు (శబ్దగత) ముకారముతో యతి.

(మువి - లోనిది శబ్దగత ముకారము)

32. ఎక్కటియతి :

ఏయక్షరమున కాయక్షరమే యతి, మఱొక్కదానితోఁ జెల్లదనుట. అట్టివి 'మ - ర - ల - వ' లు.

33. పోలికయతి :

విభక్తి ముకారమునకు పు పు బు భు లకు యతి.

(దైవము, కవిత్వము — ఇందలి ము వర్ణము విభక్తి సంబంధి)

34. రివడి :

వత్రువసుడికి 'రి' తో యతి.

ఉ॥ కృతుల — రివడి.

కృష్ణ — మ + ర్దింపంగ.

35. సవర్ణప్రాసయతి :

ఆ యా వర్గములలో ద్వితీయ చతుర్థ వర్ణములకుఁ బ్రాసయతి.

ఉ॥ సాధు — నాథ.

36. అలుక్సమాసయతి :

అలుక్సమాసములో విభక్తి ప్రత్యయస్థానమునందలి యక్షరమున కుభయయతి.

ఉ॥ కంఠేకాల - ఇది సప్తమ్యలుక్సమాసము. విభక్తి ప్రత్యయస్థానమగు 'ఠే' కు స్వరవ్యంజనములలో నొకటి చెల్లును.

37. ఘఞ్యతి :

'లప' ధాతువునకు ఘఞ్ ప్రత్యయ యోగమున 'లాప' అగును. అట్టి 'ఆలాప' శబ్దాములందలి లకారమునందలి స్వరమునకు యతి.

ఉ॥ అంచిత .. కోకిలా + లాప.

38. సఙ్ఖ్యామానయతి :

అనేక, అనంత — మున్నగు సఙ్ఖ్యామానములం దుభయయతి.

## శిరోమణి యతిభేద సమీక్ష

తెనుఁగు యతి యక్షరమైత్రిగలది గదా? ఆ యక్షరములు అచ్చులు హల్లులని ద్వివిధములు గాన అచ్చులమైత్రి స్వరమైత్రి యనియు, హల్లులమైత్రి వ్యంజనమైత్రి యనియు వ్యవహృతమగును. హల్లు లచ్చులచేరికచేతనే యుచ్చరింపఁబడుఁ గాన వ్యంజనమైత్రిలో హల్లులకేకాక వానిమీఁది యచ్చులకును యతిమైత్రి పొసఁగవల యును. అరసున్న, నెఱసున్న, విసర్గ యను మూఁటి కుభయాక్షరములని సంజ్ఞ యతిమైత్రిలో వీనికిఁ బ్రసక్తి లేదు. ఒక్క నెఱసున్నకు మాత్రము హల్యోగమునఁ గలదు. పూర్ణబిందుపూర్వక వర్గ వర్ణములు (మొదటి నాల్గు) తత్తద్వర్గానునాసిక ములతోను, దద్బిందుపూర్వకాంతస్థోష్మలు మకారముతోను యతి చెల్లును. అంతేకాని బిందుసున్నకుఁ బ్రత్యేకముగా యతిమైత్రి కవకాశము లేదు.

కొన్ని యచ్చులకు వ్యంజనములతో యతిమైత్రి గలదు. 'అ - య - హ'' 'ఋ - రి' — ఇట్టివానిని స్వరవ్యంజనయతులని పేర్కొనవలసియున్నను, లాక్షణిక లిందు మొదటిదానిని స్వరయతులలోను, రెండవదానిని వ్యంజనయతులలోను సంగ్ర హించిరి. ఇవిగాక యచ్సంధిగల కొన్ని (వేదండ, రామాయణ, క్రీకిణము, రామన - మొ) శబ్దములలో స్వరమునకుఁగాని వ్యంజనమునకుఁగాని యతి గూర్ప వచ్చునుగాన వానిని ఉభయయతులని ఛందోనుశాసకులు పరిగణించిరి.

ఇట్లు స్వర, వ్యంజన, ఉభయ యతులని విభజించి, యందలి యంతర్భేదము లను గ్రమపద్ధతిలోఁ జెప్పిన గొప్పతన మొక యప్పకవికే దక్కినది. మఱి యాతనికి ముందు వెనుకల నే ఛందఃకర్తయు నిట్టి యానుపూర్వితో విభజింపంగడంగినట్లు గానరాదు. అప్పకవి కనుకరణమనఁదగిన మాదనామాత్యప్రణీత వీరభూపాలీయమున (క్రీ. 18 శతాబ్ది) మాత్ర మీ పరిపాటి పాటింపఁబడియున్నది. అదేమికారణమో ఛందోలక్షణకర్తలు యతివిభజనలో యతిభేదప్రదర్శనలో నీయానుక్రమ్యము నాద రింపరైరి. ఈ లక్షణశిరోమణికారుఁడు సైత మిట్టి లోపమునకు లోనయ్యెనని చెప్పక తప్పదు.

అప్పకవీయ పద్ధతిప్రకారము లక్షణశిరోమణి యతులను ఈ క్రింద సమన్వయించి చూపెదను.

1. స్వరయతులు :—

స్వరయతి (1), వృద్ధియతి (12), గూఢస్వరయతి (16), ఋత్వయతి (18), శివడి (34), వ్యంజనస్వరయతి (17).

2. వ్యంజనయతులు :—

వర్గయతి (2), సరసయతి (3), జ్ఞయతి (5), బిందుయతి (8), భిన్నయతి (9), అభేదయతి (11), మకారయతి (13), సావర్ణ్యయతి (11), అనుస్వారోష్మయతి (22), చత్వానునాసికయతి (23), వికల్పయతి (26), సంయుక్తయతి (28), యశవర్గద్వయయతి (30), ఎక్కటియతి (32), పోలికయతి (33), చక్కటియతి (31).

3. ఉభయయతులు :—

దేశియతి (4), ఉభయయతి (6), అఖండయతి (7), ప్రాదియతి (10), ప్లుతయతి (14), నిత్యసమాసయతి (15), విభాగయతి (19), కాకుస్వరయతి (20), ఆదేశయతి (24), ప్రభునామయతి (27), శకంధుయతి (29), అలుక్సమాసయతి (36), షష్ఠ్యతి (37), నఞ్సమాసయతి (38).

4. ప్రాసయతులు :—

ప్రాసయతి (25), సవర్ణప్రాసయతి (35).

శిరోమణి ప్రదర్శిత యతిభేదములలో విశేషములు, విలక్షణములు, చర్చనీయములు, వ్యతిక్రమములు, ప్రమాదములనగు వాటినిమాత్రము క్రిందఁ బరామర్శించెద.

స్వరయతి (1)[1]

స్వరయతిలో నేయే యచ్చులు పరస్పరము చెల్లుబడి యగునో పేర్కొని, దానిక్రిందనే,

1. కుండలీకరణములోని యీ సంఖ్యలు ల. శిరోమణి యతుల సంఖ్యలఁ దెలుపును.

అవని ధర్మజుఁబోలు స + త్యార్జవమున ( సత్య + ఆర్జవము ),

ఇనజుఁ డీగి భార + తీశుండు చతురత ( భారతీ + ఈశ ),

అమలసువర్ణశృంగ ఖర + మై ( ఖరము + ఐ ) —

మున్నగు స్వరప్రధానవడి ప్రయోగములఁ బ్రదర్శించెను రమణకవి. స్వరయతి కేవల స్వరముల మైత్రిని దెల్పునది. అచ్సంధిగల శబ్దములందుఁ బరస్వరమునకు యతి స్వరప్రధానవడియని యప్పకవి పేర్కొనెను. అప్పకవి రెండు భేదములుగాఁ జెప్పిన స్వర, స్వరప్రధానయతులను రమణకవి యొక స్వరయతిలోనే సంగ్రహించెను. కాని రెండు భేదములుగా వచించుట సరసము. ఇందొకచిత్రమేమనఁగా స్వరప్రధానవడి విషయమును స్వరయతియందుఁ దొలుత సంగ్రహించి, మరల స్వరప్రధానవడి లక్షణముగల వ్యంజనస్వరవళిని (17) బ్రత్యేక భేదముగాఁ జూపినాఁడు రమణకవి.

'ఓ కాకుత్థ్సపతీ!
కాకపికరుతోడి సఖ్య + మర్ఘ్యము' (4 - 231)

అను పద్యము వ్యంజనస్వరయతి కొసఁగిన లక్ష్యము. 'నీకు + ఆకపి ... సఖ్యము + అర్ఘ్యము'

ఇం దుభయత్ర పాదాది యతిస్థానములలో స్వరసంధియున్నది. ఏకత్రమాత్రము స్వరసంధియుండి స్వరముతో యతిచేయుట స్వరయతిలోను, నుభయత్రమున్న వ్యంజన స్వరయతిలోను సంగ్రహింపవలెనని శిరోమణి మతమని యూహింపవచ్చును. ఇట్టి వ్యంజన స్వరయతిని సులక్షణసారము సరసస్వరయతి యని నిర్దేశించెను.

గూఢస్వరయతి (16)

దాసః + అహమ్ - దాసోహమ్. ఇందు విసర్గకోత్వమువచ్చి మీఁది యత్తు లోపించును. అట్లు లోపించిన అత్తు గూఢస్వర మనఁదగును. ఇట్టి పట్టున అకారముతో యతి గూఢస్వరయతి.

ఉ। ఐన స్వరవిరామంబు దా + సోహ మనఁగ.

ఈ యతికి లక్ష్యములుగా యశోబ్ధి ( యశః + అబ్ధి ), అన్యోన్య ( అన్య + అన్య ), పర + అక్ష ) శబ్దము లుదాహృతములు. వీటన్నిటియందును ఓత్వమువచ్చి పరపదాదినున్న అకారమందు గూఢముగానున్నదని యెన్నవలెను. దాసః, యశః —

ఇత్యాదులందుఁ దుదిసకారము ( దానస్‌, యశస్‌ ) ప్రత్యేకముగా నున్నప్పుడు విసర్గ రూపమున నుండును. అన్యోన్య, పరోక్షములలో విసర్గ లేదు. కాని వ్యాకరణ సూత్రముల సుడాగమము ప్రాప్తించి తుది సకార విసర్గలు సంభవించును. దాసోహ ములో ఉ విభక్తి సకారము, యశోబ్ధిలో శబ్దావయవసకారము, అన్యోన్య పరోక్ష ములలో వ్యాకరణసూత్రనివతిత సకారము అని యిందలి సకార విసర్గల వింగడింప నగును. పాణినీయపద్ధతిలో నీ శబ్దాంతముల సకారావస్థితిని జెప్పుటే సంప్రదాయము. అనంతుఁడు లక్షణమున 'లుప్తవిసర్గ కోత్వమైన స్వరవిరామంబు' అని వ్రాయుటను సంగ్రహించి యప్పకవి లక్షణమున 'అదంతసాంతములమీఁద అత్తుమొదలనుగల శబ్దమతుకువేళ' అని వ్యాకరణసంప్రదాయమార్గమున నిర్వచించినను యతిపేరు లుప్త విసర్గకస్వరవళియని వచించెను. అన్యోన్యాదిశబ్దముల సకారము లేకున్నను గూఢముగా నున్న అకారమునకు యతి చెల్లుబడి యగుటచే దీనికి గూఢస్వరయతి యను పేరు సముచితము.

ఇందు మఱొకవిషయము — దాస(స్‌)ః + అహమ్‌ - ఇత్యాదులందు విసర్గకు ఓకారమువచ్చును దాసో + అహమ్‌, అన్యో + అన్య, పరో + అక్ష, ( తుది రెంటి యందు సుడాగమము ). తరువాత 'ఏఙః పదాంతాదతి' సూత్రముచే 'ఏ - ఓ' ల మీఁది అత్తునకు లోపము ( పూర్వరూపము ) వచ్చును. పై శబ్దములందెల్ల ఓకార మున్నది. ఈ గూఢస్వరయతి ఏ కారముమీఁది అత్తునకును జెల్లవచ్చును. కాని లాక్షణికు లెవ్వరును దీనిని స్పృశింపలేదు. ఇందుల కొండు రెండు లక్ష్యములు గాన వచ్చెడు.

ఆద్యరూపాయ విశ్వక + ర్త్రేఽక్షరాయ. ( ఉ. హరివంశ. 3 - 219 )

( క ర్త్రే + అక్షరాయ )

అందు ననునాసికములు 'య + రోఽననునాసి

కేఽనునాసికో వా' యని + య ర లకర్గ.

( కవిచింతామణి వికల్పప్రాసము 3 - 70 )

[ ఇందు మొదటిపాదమున ఓకారముమీఁది గూఢస్వర ( అకార ) మునకును యతిమైత్రి. ]

ఈ గూఢస్వరయతిక్రింద నుద్ధరింపఁబడిన రఘునాథయ్య లక్షణదీపికా పద్యములో —

'వినుము గూఢస్వరములగు వీనియందు ( అన్యోన్య - పరోక్ష )
అచ్చులకు హల్లులకు వళులగునటంద్రు'

అని లక్షణము వచింపఁబడినది. అప్పుడిది యుభయ యతిభేదమునకుఁ జెందును. అన్యోన్యశబ్దమునకు విన్నకోటపెద్దన కావ్య - చూడ - లోఁగూఢస్వరమునకే ( అ ) కాక నకార యకారములకును యతిమైత్రి చూపఁబడినది. శిరోమణికారుని మతమున స్వర సంధిగల శబ్దములందెల్ల అచ్చునకేకాక హల్లునకును యతి గూర్పవచ్చు ( ఇది అఖండయతి ).

ఋత్వయతి (18)

'గరిమ స్వరరూపమైన ఋకారమునకు
రేఫతోఁ గూడ వడి రొంచరించిరని
ఋత్వయతియన నదియొప్పుఁ + గృతులయందు
ఋషిమనోంబుజ మత్తద్వి + రేఫ కృష్ణ' [ 4 - 233 ]

ఈ లక్షణమునుబట్టి ఋకార ( స్వర ) మునకు రేఫతో మైత్రి ఋత్వయతి యనుట విదితమగును. ఋకార రేఫల మైత్రిని జెప్పు రివడి యను యతిభేదము మఱొకటి గలదు.

'ఋత్వమును వట్రువల్ వడి + రికినిడినఁ,
గృతమహా కవిమతముల + రివడియగును.' ( 4 - 341 )

అని శిరోమణికారుని రివడి లక్షణము.

ఋకారమునకు రేఫ ( రి - రీ - రె - రే ) తో యతి ఋత్వయతి.

ఋత్వము వట్రువలు రితో యతి రివడి.

ఈ లక్షణశిరోమణి లక్షణ మస్పష్టము. రెండు భేదము లొకరకముగానే తోఁచుచున్నది.

ప్రాచీన లాక్షణికుల మతమున నీ యతిభేదలక్షణము లిట్లున్నవి :—

అనంతుని ఛందోదర్పణము —

ఋకారస్వరూపయతి — ఋ కు వట్రసుడి, వట్రసుడికి వట్రసుడి, వట్రసుడికి ఇ ఈ ఎ ఏ ఐ యతి చెల్లునమట.

రీ విరమము — ఋ కు వట్రసుడికి రి వర్ణము యతి. (1 - 87, 88)

చిత్రకవిపెద్దన ల. సా. సంగ్రహము —

ఋవడి — ఋ - వట్రసుడి, వట్రసుడి - ఇ ఈ ఎ ఏ ఐ.

రివడి — ఋత్వము (వట్రసుడి) - రి. (1 - 20, 21 పు)

అప్పకవి మూఁడు భేదములుగా వింగడించెను —

ఋవళి — ఋ - వట్రసుడి = రి - రీ - రె - రే.

ఋత్వసంబంధవళి — వట్రసుడికి ఇ ఈ ఋ ౠ ఎ ఏ ఐ.

ఋత్వసామ్యవళి — వట్రసుడికి వట్రసుడి. (3 - 33 ... 36)

ఇఁక శిరోమణి లక్షణభావము సందిగ్ధము గావుటంజేసి యం దుదాహృత లక్ష్యలక్షణములఁ బరిశీలించి తన్మతమును నిర్ణయింపఁబూనుట సరియైన మార్గమగును.

ఉదాహృత లక్ష్యలక్షణములు —

ఋత్వయతి .—

4 - 233. ఋత్వ — కృతుల (ఋ - ృ)
ఋషి — రేఫ (ఋ - రే)

4 - 235. ఋగ్యజు — కృష్ణ (ఋ - ృ)
వృష్టి — స + మృద్ధ (ృ - ృ)
హేమ — ఋషభ (హే - ఋ)

4 - 236. కృతి — ఋక్ష (ృ - ఋ)
కృతి — ఉర + రీకృత (ృ - రీ) ఇది రివడి యని శిరోమణి నిర్దేశించె.

4 - 237. ఋత్విజ — విదా + రించి

4 - 238. ఋషి — స్పృహ

4 - 239. ఏ — ఋషులార

రివడి —

4 - 341. కృతుల — రివడి

4 - 343. మృతుల — ఏ
ఋక్ష — కృష్ణ

4 - 344. త్రిలు — ఋషు

4 - 346. కృష్ణ — మ + ర్దింప

4 - 347. రీతి — మృదు

4 - 348. త్రేవ — పృథ్వీ

శిరోమణి చెప్పిన ఋత్వయతి రివడి లక్షణము లొక్కటిగానే తోఁచుచున్నది. ఋ - వట్రసుడి, ఋ - రి మైత్రిగల లక్ష్యములు రెండును జూపట్టుచున్నవి. ఇందలి తక్కిన లక్ష్యముల సూక్ష్మముగాఁ బరిశీలించిన, కేవల ఋకార స్వరమునకు వట్రసుడి తోను 'రి - రే' లతోను మైత్రి ఋత్వయతి, వట్రసుడికి 'రి - రే' లతో మైత్రి రివడి యని పౌత్తిపికవి భావముగాఁ జెప్పనగును.

ఈ ఋవడి రివడి లక్షణములలో అనంతుని మతము సయుక్తికము సముచిత మునుగా వచింపవచ్చును.

## వ్యంజనయతులు

జ్ఞయతి (5)

'యజ్ఞము - జన్నము, ఆజ్ఞ - ఆన' ఇత్యాదులందుఁ దత్సమములోని జ్ఞకారము తద్భవమున నకారమగును. ఈ తత్సమతద్భవ సంబంధ కారణమున 'జ్ఞ - న' లకు యతి చెల్లును.

'చ ను నిల్ప 'న జ స'లు జ్ఞాకు వడు' లన్నాఁడు శిరోమణికారుఁడు. సంయుక్త యతిచేత జ్ఞకారమునకు జకారమును సరసయతిచేత జ స ల మైత్రినిబట్టి సకారమును యతి చెల్లును.

'న - ణ' లకు సరసయతిచే మైత్రి కలిమినిబట్టి జ్ఞకారమునకు 'న - ణ' లు చెల్లుబడియగును. శిరోమణికర్త జ్ఞాకు ణా చెల్లుట చెప్పలేదు. అతఁడొసఁగిన లక్ష్యములలోను ణకారములోకి మైత్రిగల ప్రయోగము గానఁబడదు.

మఱి శిరోమణి యుద్ధరించిన యనంతుని లక్షణమున 'ణ న లతోఁ బొందు విరతి యా-జ్ఞప్తి యనఁగ' అనుచోట 'న జ లతోఁ బొందువిరతి' యను పాఠము చూపఁబడియున్నది.

'వెలయుటను దద్భవవ్యాజ విశ్రమమున
జరిగి 'న-ణ' లను రెంటికి జ్ఞా తనర్చు' (అప్ప 3-54)

అని యప్పకవి 'వ-ణ' లతో జ్ఞా వడిని బ్రదర్శించె.

పొత్తపికవి లక్షణమున వచింపలేదుగాని లక్ష్యములో జ్ఞాకు కాతోడి యతి మైత్రిగల —

'కనువిందై యభిషిక్తుఁడైన విభుసా+జ్ఞం గొల్వులో' (4-67)

అను అల్లసానిపెద్దనగారి [1]సత్యావధూప్రణయప్రబంధములోని పద్య ముదాహరించెను. ఇది జ్ఞకారమునకు క ఖ గ ఘ లతోడి యతిమైత్రిని దెలుపును.

ఈ జ్ఞకారకవర్గమైత్రిని విశేషవశియని పేర్కొని యప్పకవి, 'జ్ఞానికి నుపదేశ విధిఁ బ్ర+కాశముసేయఁగ' (శాంతి 4-255) అను తిక్కన భారతప్రయోగమును బ్రదర్శించెను. అప్పకవి లక్షణమును దిక్కన లక్ష్యమును శిరోమణికారుఁడు పరిశీలింప లేదేమో!

ఈ జ్ఞకారవిశేషవడికి అప్పకవియొక ప్రయోగమును, రమణకవియొక లక్ష్యము నొసఁగిరి. ఈ యతికిఁ బ్రాచీనార్వాచీన కవిప్రయోగములు గలవు. అందుఁ గొన్ని —

కర్మ మధర్మ మ+జ్ఞాన మాగడము (పండితారాధ్యచరిత్ర - పు. 284)

జ్ఞానేంద్రియ జ్ఞాన+కళ లౌరుసౌరుగా (కాశీ 1-139)

అ, జ్ఞానంబునఁ గడవ మిగులఁ+గల్మషమొదవుఁగా (రుక్మాంగ 2-68)

---

1 కృష్ణరాయలు సత్యావధూప్రీణనమును సంస్కృతమున రచించినట్లు దెలుపుచున్నది యాముక్తమాల్యద. ఈ తెనుఁగు సత్యావధూప్రణయము సంస్కృత కృతి కనువాదమా, లేక పెద్దన తెనుఁగు కృతికి రాయలది సంస్కృతీకరణమా? పరిశీలనీయము.

బిందుయతి (8)

పూర్ణబిందు పూర్వక వర్గాక్షరములు తొలి నాలుగింటికి నాయాయి వర్గానునాసిక ములు చెల్లుట బిందుయతి. ఇయ్యది లాక్షణికు లెల్లరచే నిట్లే యుపదేశింపఁబడినది.

దీనిక్రింద శిరోమణికారుఁడు, పాం, దవబలముల .. + నడచును (ఉద్యోగ), బా. ణుని ... సుంబం + ధుణా (మనుచరిత్ర), అను బిందుపూర్వక ట వర్గ త వర్గము లకు వరుసగా న కార ణ కారములతోడి మైత్రిగల ప్రయోగములఁ బ్రదర్శిం చెను. లక్షణమున నీ యతిమైత్రి వచింపఁబడలేదు. దీనిని అనునాసికాక్షర యతిపేర వేఱుగాఁ జెప్పినాఁ డప్పకవి. బిందుయతి లక్షణములో శిరోమణిలో 'ఙ ఞ ఌ నప్ర సిద్ధములు శబ్దాదులయందలి తక్కిన ణ న మ లు ద న రు మూఁడు' (4 - 108) అని శబాదిలో 'ఙ ఞ' లుండవని చెప్పఁబడె. ణ కారముగూడ శబ్దాదిని గోచరము గాదని యెఱుఁగవలెను. ఙ ఞ ఌ శబ్దాదియందేకాక మఱెందును బ్రత్యేకముగ నుండవు. ణకారము శబ్దాది నుండదు గాని యితరత్ర (గుణ, కారణ) వచ్చును.

మఱి యిందు జ్ఞా కు బిందు పూర్వక త వర్గ యతి చెల్లుటను బిందుయతి విశేషముగాఁ బేర్కొన్నాఁడు రమణకవి.

నం, దన . . . వి + జ్ఞాపింప (వరాహపురాణము)

జ్ఞా వడిలో 'జ్ఞ - న' లు చెల్లును, బిందుయతిలో 'ంద - న' లు చెలును. తన్మూలమున జ్ఞ - ంద (తవర్గ) చెల్లుబడియగును.

నిర్బిందుయతి విశేషమని యీ క్రింది ప్రయోగము శిరోమణిలోఁ జూపఁబడినది :

మా పాలికి వచ్చిరేని విను + మా వనమాలికా సంగువాఁడ (4 - 118)

(సోమయాజి ఉద్యోగపర్వము)

బిందుపూర్వక పకారమునకు మకారము చెల్లును. నిర్బిందువునకు యతి సరిపడదు. ఈ పద్యము భారతమున మృగ్యము.

సావర్ణయతి (21)

శిరోమణిలో నీ యతిలక్షణము చెప్పఁబడలేదు. ఆ భాగము లుప్తమయ్యెఁ గావలయు. ఇఁక నిచ్చిన లక్ష్యములను వాని సూచనలఁబట్టి యియ్యది 'ట - త' వర్గలకుఁ బరస్పరము యతిమైత్రి నుపదేశించునని యెఱుఁగనగును.

ఇంవలి యుదాహృతులు :—

డిగ్గిన — తీర (ఆముక్త)

దక్కెఁ — నక + టా (ఉద్యోగ)

ఔ ట్టిదుఁడగు — దెప్పర (ద్రోణ)

ప ట్టికొనఁగ — దెప్పర (ద్రోణ)

దెప్పర — క + డించి (విరాట)

డీకొన — దిక్పతి (నైషధ)

ఈ ప్రయోగములఁ బ్రదర్శించి పొత్తపికవి వాటిక్రింద వచనమున నిట్లు వివరించెను — 'డిగ్గి - దిగ్గి, డక్కెను - దక్కెను, డీకొని - దీకొని' అని యిట్లు రెండు ప్రయోగములు గలవని యందురు. రూఢిపదములు 'డిగ్గి, దక్కెను, డీకొని' యనునివి ప్రశస్తముగా వాడిరి.

ఎప్పు డుభయరూపములున్నవో యప్పుడు సమయతిగాఁ బాఠమును గ్రహించుటనుమాని (దిగ్గిన - తీర - అని యుండఁదగు దానిని డిగ్గిన - తీర - అను రీతిఁ బాఠము బఠించి) యనవసరముగా 'ట - త' వర్గ సావర్ణ్యయతి సమ్మతించుటేల?

అప్పకవి ద - డ ల యతిప్రాసమైత్రిని అగ్రాహ్యసంబంధవళులక్రింద నిట్లు విరచించినాఁడు. "ఈ చెప్పిన 'ద - డ లకు పదాదినున్న చతుర్థవర్గ సరళము ఆదేశమైవచ్చునప్పుడు ఆదేశయతిగాఁ జెప్పవచ్చును. అదియుఁగాక ఆ రెంటికిని దాపలించి నెఱసున్న లున్నప్పు డనుస్వార సంబంధ యతులుగనుక అటువలెను జెప్పవచ్చును. అదిగలుగఁ జెప్పలేదు గనుక ఇదియు సమ్మతముగాదు." (అప్ప 3 - 265)

డాకు దా ఆదేశమై వచ్చునపుడు ఆదేశయతి చెప్పవచ్చునఁట. 'డక్కె - దక్కె' అనురీతి ద్వైరూప్యమున్నప్పు డీ యతి చెప్పవచ్చునన్నమాట ఇట్లు చెప్పికొనుట యనవసరము.

పొత్తపికవి చూపిన 'ద - డ' యతి ప్రయోగములు ద్వైరూప్యములు గలవి గాన నిర్ధారకములుగావు. కాని నా పరిశీలించిన యీ క్రింది పద్యములలోఁ గేవల 'ట - త' వర్గ యతి ప్రయోగములు గానవచ్చెడు.

దూఱియుఁ దీటయునఁగఁ గం + ఱూఱి (పాంబరిపంటు - మానవవర్గు 44)

దుర్గ తండముల్ హార కుం + దములు గాఁగ (రంగారాయచరిత్ర 2-9)

దరహాసమదరి వెం + టనె మరల్చె (యామినీపూర్ణతిలక 5-12)

దర్శనోత్సాహపతిచపే + టప్రదాయి (హంసవింశతి 2-54)

కస్తూరిరంగకవి తన ఛందమున నభేదయతిక్రింద — దకార డకారములకు యతులుమాత్రము చెల్లును (3-272) అని వివరించి, దీనజనపారిజాత పా + టించి విన్న (3-273) — అను స్వీయలక్ష్యమొసఁగె. పై సాంబనిఘంటుకర్త యాతఁడే.

రంగకవి యిచ్చిన యితర కవి ప్రయోగములు —

డెబ్బదిరెండు వెల్లువల + దేవరలక్ష్మణు (భాస్కరరామాయణ)

పా టలరుచి యింక వేతె యొక + దానికి వచ్చునె (ఆముక్త)

(ఒక + డాలిదవచ్చునె - అని ముద్రణ)

సుకవిజన మనోరంజని[1] చూపిన ప్రయోగములు (150 పుట)

దైవతార్చలపుడు + డాకినీ భూత (భారత - అనుశాసనిక 4-17)

(తామసభూత - ముద్రితప్రతి)

ఈ సావర్ణయతిక్రింద బిందుపూర్వక 'ట-త' వర్గముల మొదలి నాలుగక్షరములు చెల్లుబడి యగుటకు బిందు సావర్ణయతి యనుపేర నీ క్రింది మనుచరిత్ర పద్య లక్ష్య మొసఁగఁబడినది.

'చం దాలంబందు నొకప్పుడుం దఱుగ దిం + టం బాఁడియుఁ' ఈ లక్ష్యమునే యనుస్వార సంబంధయతిపేర నొసఁగినాఁ డప్పకవి (3-59).

ఈ క్రింది యతిమైత్రీవిశేషము గమనింపఁదగినది —

ట-త వర్గ సావర్ణయతి లక్ష్యముల మధ్యలో — 'క వర్గ-త వర్గులకు బిందు సావర్ణయతి' లక్ష్యమని యెత్తిన యారణ్యపర్వములోనిదిగా నీ క్రింది పద్య ముదాహృతము.

1. చూ. సుకవిజన మనోరంజనము — ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ ప్రచురణ.

పిండి పిచంబుగాఁ బృథివీధరంబులఁ

దంతునే కాండం + డమున నధిక (కాశి 7-80)

(ధరంబుల, డంతునే - ముద్రితప్రతి)

'కెలఁకింగానక చోటు ... ..... జాం
గల దేశంబుల మాధుకీఘుసృణ కాం + తా రాటవీక్షోణులన్' (4-259)

పై పాదమున బిందుపూర్వక 'గ-త' లకు యతి యున్నది. ఇట్టియతి యే లాక్షణికుఁడును జెప్పినవాఁడుగాఁడు.

అసలీపద్యము ఆరణ్యపర్వమునఁ గానరాదు. ఎందలిదో? 'క-త' వర్గులకు బిందుసావర్ణ్యయతి సమ్మతమగునేని, సమస్త వర్గాక్షరములకు బిందు సావర్ణ్యయతి నంగీకరింపవచ్చు. అందులకుఁ బ్రామాణిక ప్రయోగము ఉండవలయుఁగదా?

భిన్నయతి (9)

ఇంచుగాగమముగల శబ్దములలో (క్రియలలో) 'ఇంచు' విరళమైయున్నప్పుడు (ధరియించు-అనురీతి విడియున్నప్పుడు) ఇత్వమునకు యతి భిన్నయతి, అట్లు విరళము గానప్పుడు (ధరించు-అనురీతి నున్నప్పుడు) వ్యంజనమునకు యతి. ఈ పొత్తపికవి మతమును అప్పకవి మతము నొక్కటే.

'ధరించు'లో హల్లునకు, 'ధరియించు'లో నచ్చునకు యతి యని చెప్పకే తెలియఁగలదు. కాన నిదియొక యతిభేదముగాఁ జెప్పనక్కఱలేదు. 'ధరించు, సుఖించు' ఇత్యాదులందు ఇంచు విరళముగాక సంధించి యున్నప్పుడు స్వరవ్యంజనోభయయతి సమ్మతించుచున్నట్లనే యీ యతి వచించుట సప్రయోజనము. ఇందు హల్లు యతిచెల్లుటకు లక్ష్యములు ప్రసిద్ధములు.

స్వరమైత్రికి లక్ష్యము లనేకములు గలవు —

నందియం బీరమణీయ కాంతి నుప + మింపఁగ (భార-ఆది 5-151)

శయ వించు యుధామన్యుఁ + డెఱిఁగి (భార-సౌప్తిక 1-179)

ఏను దియ్యమున న + టించిన (నృసింహ 2-56)

ఏమఁట పాదుకలమఁట గ + ణింపఁగ (భాగవత X. ఉ 585)

ఇష్టఫలసిద్ధి దోరహ + త్తించువింతి (పాండురంగ 2-78)

ఈ క్రియ సత్పుత్రకులు చ + రింతురు (ప్రబంధరాజ 688)

లక్షణదీపిక, సులక్షణసారము, రంగయఛందము, గరళపురీఛందము, సుకవిజనమనోరంజనము మున్నగు లక్షణగ్రంథములలో ఇంచుగాగమముగల ధాతువులందుభయయతి చెల్లునని నిరూపితము.

భిన్నయతిలో శిరోమణికారుఁ డప్పకవివలెఁ జెప్పినను, నిత్యసమాసయతి లక్షణములో,

'క్రిక్కిఱించెను ధిక్కరించెఁ దమ్మిర ప్రస
రించెఁ గట్టెఁడి యలరించె ననెడి
శబ్దముల పోల్కిగల యన్నిశబ్దములకు
నచ్చు హల్లైన సంధిసేయంగఁ గృతుల
మహిని రంజిల్లు నిత్యసమాసయతులు.' (4-202)

అని యింౘుగాగమసంధిలో నుభయయతి నుపదేశించె. ఇందలి లక్ష్యములలో నింౘు కృద్దము ప్రదర్శితముగాదు గాని శిరోమణిలో నితరత్ర స్వరమైత్రి సంఘటితమై యున్నది.

'ఈ రసమూని యన్యుని ర + పించుచెదఁజా' (3-220)

ఇంౘుగాగమములో నుభయయతి సమ్మతించి నిత్యసమాసయతిలోఁ బ్రస్తావించి నపుడు భిన్నయతిని బ్రత్యేకభేదముగాఁ దత్పూర్వము వచించుటలోఁ బ్రయోజనము శూన్యము.

అభేదయతి (11)

'రలయో ర్లడయో స్తద్వ ల్లళయోశ్చ సయోరపి,
వబయో ర్నణయోశ్చాంతే...స్యా దభేదేన కల్పనమ్'

అని యభేదవర్ణములఁగూర్చిన యభియుక్తోక్తి.

మఱి యందు 'వబయోరభేద' యన్న వాక్య మతిప్రసిద్ధము.

ప్రాచీనలాక్షణికు లొక్క 'వ - బ' మైత్రిని మాత్రమే యభేదయతిలో నంగ్ర హించిరి. భీమన, విన్నకోట పెద్దన, కాతంభట్టు ఈ యతిభేదమును జెప్పలేదు. అనంతుఁడు 'ప - వ' లకే యభేదయతి చెప్పినాఁడు. చిత్రకవి ప ఫ బ భ వ లకుఁ జెప్పినాఁడు. ముద్దరాజు రామనయు యతుల వకార ప వర్గ ద్వితయాభేదంబు చెల్లు నన్నాఁడు. అప్పకవి 'వ - బ, ల - ద, ల - శ' లకు మైత్రి యభేద విరతి క్రిందను, వకార ప వర్గమునకు నభేదవర్గయతిక్రిందను వేర్వేఱ నుపదేశించినాఁడు. అప్పకవికి 'ర - ల', 'ద - డ' ల యభేద యతిమైత్రి సమ్మతముగాదు.

శిరోమణికారుఁడు — 'ర - ల ర - ళ, ల - ళ, ల - డ, వ - వ (బ) లకు నభేదయతి నిర్దేశించెను లక్షణమున 'వ - వ' లని మాత్రమే యున్నను లక్ష్యములో 'వ - బ' ల మైత్రియుఁ గలదు. 'ద - డ' ల మైత్రి వేఱుగా సావర్ణ్యయతిక్రిందఁ బ్రదర్శించెను.

ఈ యభేద యతిక్రిందనే ప్రసక్తానుప్రసక్తముగా ల - ళ - డ లయు, ద - డ లయు నభేదప్రాసమైత్రికి లక్ష్యములఁ జూపెను. తుదలో 'ఇవి యభేద యతిప్రాస ప్రయోగలక్ష్యము' లని యుటంకించెను. ప్రాసభేదములలో నభేదప్రాస ప్రత్యేకముగా వచింపఁబడలేదు.

శిరోమణిలో నభేదప్రాసక్రిందఁ జూపఁబడిన లక్ష్యములందలి శబ్దములనున్న 'ల - ళ - డ - ద' లకు ద్వైరూప్యములు గలవుగాన నయ్యవి నిర్ధారకములు గాఁజాలవు.

అభేదప్రాస లక్ష్యములు - వాని పాఠాంతరములు :—

కొడుకును దారను గుఱ్ఱపు, దళములు (దడములు)

చెలువార ... గళపీల (గలపీల)

తాలిమి ... వ్రీడ (వ్రీళ)

వెడలెబలరిపుడు ... కలుషము (వెలలె)

గాండీవధరుని...మా, ర్కొందునని (మార్కొందునని) ద్వైరూప్యములేని యభేదప్రాస ప్రయోగములు కాదాచిత్కములు కాననగును.

అనుస్వారోష్మయతి (22)

శిరోమణి చెప్పిన దీని లక్షణ మస్పష్టము. ఇందలి లక్ష్యములఁబట్టి 'కేవల మనుస్వారమునకు శ ష స హ లకు (ఊష్మములకు) యతి చెల్లునని తెలియు చున్నది. (4-265)

బిందుపూర్వకములగు నంతస్థోష్మములకు మకారము యతి చెల్లుట ప్రసిద్ధము. దానిని మావడి, మ వర్ణవిరామము అని పేర్కొనిరి లాక్షణికులు. పొత్తపికవిగూడ మకారయతిని (13) జెప్పెను.

ఈ యనుస్వారోష్మయతి యభూతకల్పన. అనుస్వారము ప్రత్యేకముగా నిలువదు, తెలుఁగున వర్గాక్షరములకుఁ బూర్వముననే వచ్చును. సంస్కృతమున

పీ యనుస్వారము పరసవర్ణానునాసిక మగును. అనుస్వారమునకు శ ష స హ లు చెల్లుననఁగా బిందుపూర్వక వర్గాక్షరములకుఁ గేవలోష్మలు మిత్రములగు నన్నమాట. కవిచూపిన స్వీయలక్ష్యములోని యతిమైత్రి యిది.

శరధి — సం + గత

సర్వ — పం + కజ

హంస — సం + భరిత (4-266)

ఈ యతిస్థితి కుపబలముగా ఛందస్సారసంగ్రహ లక్షణ ముదాహృతము. రామాయణములోనిదని 'సమరాగ్రమ్మున' (4.268) అను పద్యము లక్ష్యముగాఁ జూపఁబడినది. అందు, వ్యాలోల కీలచ్ఛటా । సమరోషోగ్రకషాయి తేక్షణములం బ్రధ్వస్త' అను 3.వ పాదములో 'స - ంబ్ర' లకు అనుస్వారోష్మ - యతి ఘటితమైయున్నది. ఈ పద్యము భాస్కర రామాయణమున గోచరముకాదు. రామాయణములోనిదని యీ పద్యమునే కవిచింతామణి, ఆంధ్రప్రయోగరత్నాకరము ఉదాహరించెను. ఇది యేరామాయణములోనిదో ? బిందు సంబంధయతికి సాహిత్య చింతామణి (కవిచింతామణి) లో లక్ష్యమని యీ పద్యమును ఆం - ప్ర - రత్నాకరము ప్రదర్శించెను. అందలి పాఠము సరిగాలేదు. కవిచింతామణిలో వియ్యాది సంయుక్తాక్షరవళికి లక్ష్యముగాఁ జూపఁబడినది—అందు 3 పాదము 'కీలాంచలో । పమరోషాగ్ని కషాయితేక్షణములం బ్రధ్వస్త' అను పాఠమున్నది. ఇం దిదిసంయుక్తవళియే యగును.

ఎక్కటియతి (32)

ఆదిమలక్షణకవి భీమన మొదలుకొని ఛందఃకర్తలెల్లరు దీనిని జెప్పిరి. దీనికే యేకతరవళియని పేరిడినాఁ దప్పుకది. ఎక్కటి యనుశబ్దమునకు అసహాయము, అద్వితీయము, పరాపేక్షలేనిది, రెండవదానితోఁ గలియనిది యను నర్థములు గలవు. ఏ యక్షరమున కా యక్షరమే మైత్రిగలది యెక్కటి యతియగును.

ఎక్కటియతిలో శిరోమణికారుఁడు సంగ్రహించిన యక్షరములు 'మ - ర - ల - వ' లు. లిఖితప్రతిలో నీ పట్టున వర్ణశైథిల్యమున్నది. లక్షణము స్పష్టముగా నిర్వచింపఁబడలేదు. కాని యందే కూర్పఁబడిన యుదాహృతులవలన నయ్యవి 'మ ర ల వ' లని నిర్ధారితమగును. భీమనాది లాక్షణికులు 'మ ర ఱ ల వ' ల నెక్కటియతి యందుఁ జెప్పిరి.

'మ - ర - ల - వ' లకు నయిత మితరాక్షరములు యతిలోఁ జెల్లుబడి యగు చుండఁగా, నెక్కటియతి వీనిపట్ల నెట్లు సార్థకమగునను సంశయము గలుగుట సహజము. అందుల కిట్లు సమాధాన మూహింపనగును. మకారమునకుఁ గేవల హల్లు చెల్లదు. బిందుపూర్వక ప వర్గాంత స్థోష్మలు మాత్రమే చెల్లును. 'ల - ళ' లకు 'ప - బ - వ' లకు నభేదము. ఇవిగల శబ్దములందు ద్వైరూప్యము గలదు. ప్రాచీన కవిప్రయోగములందు ద్వైరూప్యముగల శబ్దములందే తఱచుగ వీనికి యతి నంఘటితమైయున్నది. దీనిని సరిగాఁ బరిశీలించియే యప్పకవి 'ర - ఱ' ల రెంటినే యేకతరయతియందుఁ జేర్కొనెను. అప్పకవి మతమున 'ర - ఱ' ల యతిప్రాసలు రెండు నిషిద్ధములు. అర్వాచీనులగు కూచిమంచి తిమ్మన ప్రభృతులు వీటి మైత్రి నంగీకరించిరి శిరోమణికారుఁడు వళిప్రాస ప్రకరణములో 'ర - ఱ' ల మైత్రీ విషయము ప్రస్తావింపఁడయ్యెఁగాని, రేఫఱకార లక్షణ ప్రకరణములో (4 - 521). 'ర - ఱ' ల సాంకర్యము కూడదని, 'ర - ఱ' లు యతిప్రాసశ్లేషలకు విరుద్ధమని హెచ్చరించినాఁడు. ఇతఁడీ విషయమున నప్పకవి మతమునాఁడుగా దోఁచెడు.

చుత్వానునాసికయతి (23)

'స్తోశ్చునాశ్చుః' అను పాణినీయ సూత్రప్రకారము గలుగు సంధి శ్చుత్వ సంధి యనఁబడును. శ్చుత్వయతినే తన లక్షణానుగుణముగ శిరోమణి 'చుత్వయతి' యని పేర్కొన్నది.

యతిభేద నిర్దేశపద్యములో,

'సావర్ణ్యములు నను స్వారోష్మ చుత్వాను
నాసికాదేశముల్ ప్రాసనిరతు' (4-17, 25)

'శ్చుత్వ' అని పఠించిన ఛందో (గణ) భంగమగును.

మత్, భవత్, త్వద్, యుష్మద్, అస్మద్ — ఇత్యాది త వర్గాంతములకు 'చ - జ' లు పరంబగుచో చుత్వము, అనునాసికము పరంబగుచో ననునాసిక మాదేశ మగును.

ఈ యతిలో ద్వివిధ సంధులందలి మైత్రి యేకత్ర పొత్తపికవి చెప్పనాఁడు.

భవత్ + చరిత్ర - భవచ్చరిత్ర — ఇందుఁ బరంబయిన చకారమునకే కాక గూఢముగానున్న తకారమునకును యతి చేయవచ్చును. ఇట్లే మత్ + మానస -

మన్మానస — లో గూఢముగామన్న తకారమునకు యతి విలుపవచ్చును.

ఉ॥ తలమె ... త్వ + చ్చరణ
ధాత్రి ... మ + న్మానసాబ్జ (4-271)

ఇందు రెండవదగు ననునాసిక సంధియతి మరల వికల్పయతి (26) లోఁ బ్రదర్శితము. ఇట్టి పునరుక్తు లీ గ్రంథమునఁ గొన్ని పట్టులఁ జూపట్టును.

సంయుక్తయతి (28)

సంయుక్తాక్షరము పాదాదినున్న నందలి యేదేనొక హల్లునకు యతిఁగూర్చినఁ జాలును. అట్లే సంయుక్తము యతిస్థానమున నున్నను నందలి యొకహల్లు పాదాదినున్నఁజాలును. ఇయ్యది సంయుక్తయతిసామాన్యలక్షణము.

పొత్తపికవి 'క్ష, కియ్య, వట్రువ, క్రార, గిలుక' అన్నవి సంయుక్తములుగాఁ బేర్కొనెను.

క్షకారము 'క - ష' సంయుక్తము (రక్ష, కియ్య - యకార సంయుక్తము (క్య), వట్రువ - ఋత్వయుతము (కృ) క్రార - రేఫసంయుక్తము (చక్ర), గిలుక - దీనినే వలపగిలుక యందురు. (అర్క) - ప్రాచీనులు సంస్కృత లేఖనము ననుసరించి సంయుతమున మొదట రేఫయున్నచో నా క్రింది హల్లును మొదటనుంచి దానిప్రక్క (వలపల) రేఫకు మాఱు గిలుక వ్రాయుదురు. ఉ॥ అర్క - అర్క.

సంయుతములో రేఫ తుదినున్నచో దానిని హల్లుక్రిందవ్రాసి క్రారయందురు. క్రార సంయుక్తముగా లిపిలోఁ గనఁబడును. గిలుక పై చూపునకు సంయుతముగాఁ దోఁపదు. అందుచేతనే పొత్తపికవి రెంటిని విడిగాఁ బేర్కొనెను.

ఇందు వట్రువను సంయుక్తమున ననుసంధించుట విచారణీయము. వట్రువ ఋకార స్వరగుణితము. అది సంయుక్తముగాదు. అందుచేతనే 'అమృతము, వికృతి' మున్నగుపట్ల వట్రువకు ముందున్న యక్షరము గురువుగాదు.

అట్లుండ నీకవి వట్రువను సంయుక్తమునఁజేర్చుటకుఁ గారణమి ట్లూహ్యము : ఋకారోచ్చారణమున స్వరవ్యంజన ధర్మములు మిశ్రితములు. ఇందు స్వరోచ్చారణ రేఫోచ్చారణలు గలవు. ఋకారము రేఫద్వయ గర్భితమని సంస్కృతవ్యాకర్తల మతము. ఋకారము రేఫతుల్యముగాన ఋత్వవిశిష్టత (వట్రువసుడి) రేఫవిశిష్టత

(ఱకార) వంటిదై సంయుక్తవర్ణముంబోలినదగును. సంయుక్తమున నొకహల్లునకు యతిమైత్రియున్నఁ జాలుఁగాన వ్రటసుడికి వ్రటసుడి (వృష్టి - స + మృద్ధ), వ్రటసుడికి రివర్ణము (రీతి - మృదు) యతికిఁ జెల్లుబడి కాఁజొచ్చినది. ఈ కారణమునుబట్టి మన కవి వ్రటువను సంయుతమున సంగ్రహించియుండనోపు.

సంయుక్తయతిలో బహుయతినియతి :

ఒక్కపాదమునఁ బెక్కుయతులుగల పద్యములలో ఆదిలో సంయుక్తమున్నఁ దర్వాత నం దేహల్లునకు యతి గూర్పఁబడునో యాహల్లునకే యా పాదమునఁ దక్కిన యతిస్థానములలో మైత్రి పాటింపవలయు.

ఉదా॥ క్ష్మావలయమునంతయు వి + షాణమున నెత్తుకిటి
+ షత్త్వ మరుదన నొప్పు + సంయుక్తవడి చెడక. (4-298)

ఇది జయభద్రరగడ. దీనికి 3 యతులు. పాదాదియున్న సంయుక్తాక్షరమగు 'క్ష్మ' లోని షకారమునకుఁ బాదమున మూఁడుచోట్ల యతి చేయఁబడినది.

బహుయతులు గల పద్యము పాదములో మధ్య యతిస్థానములో నొకచో సంయుక్తముండునేనిఁ బాదాద్యక్షరమునకు సవర్ణమైన దానినే ముందు వెనుకల యతి స్థానములలో నిలుపవలెను.

ఉదా॥ రంపముల వ్రచ్చుగతి + వ్రచ్చెసఖముల రిపును
+ రమ్ము నరసింహుఁడనఁ + బ్రాలు సంయుక్తయతి. (4-298)

ఇందు రెండవ నాలవ యతులలో సంయుతమున్నది పాదాది రేఫకు సర్వత్ర యతి ఘటింపఁబడినది.

ఈ క్రిందిది బహుయతినియతి భంగము —

క్ష్మాతలముమంతయు వి + షాణమున నెత్తుకిటి
+ మహిమఁదలపోయ న + క్కజమనుచు నిట్లనక. (4-293)

ఇందు — 'క్ష్మకు — షా — మ — క' అని వేర్వేఱక్కరములకు యతి చేయఁబడినది. ఇది దోషము.

ఇట్లుపదేశించిన లాక్షణికులే బహుయతినియతిభంగము గావించియున్నారు.

అప్పకవీయమున (4-357) క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నా + రఁగఁ బలు కుదురిలఁ + గవివరులెల్లన్. (క్రౌ - ర - గ).

లక్షణశిరోమణిలో రెండెడల నిట్టి యతిభ్రంశము గాననగును.

గజలీల వృత్తము —

మీఱి గిరిధాత్రి ని + ర్మిత విశ్రమముల గజ + లీల యనఁబరఁగున్.
(43-98)

తరువోజ। తరణిఁ జెందును రెండు + గణములమీఁదఁ
+ గ్రమునఁ వడి నొప్పఁ + బ్రాసంబు లొనరు. (3-395)

ఇట్టి యతిభ్రంశము ప్రాచీన ప్రామాణిక కవుల గ్రంథములలో నటనటఁ జూపట్టెడు (చూ. ఛందోరీతులు - పుట 270 - 271; అప్పకవీయ భావప్రకాశిక - పుట 84, 85)

యశవర్గద్వయయతి (30)

ప్రసిద్ధ ప్రామాణిక లక్షణగ్రంథములలో నెందును నీయతి కానరాదు. అప్పకవి యగ్రాహ్యవర్ణచతుష్టయ వతులక్రింద,

'య ర ల వ లను నీవాల్గను
తరుసం దములోన నల్లు + రయమునఁ జెల్లున్
ధర శ ష స హ వర్ణంబులు
నరవి నొకటికొకటి చెల్లు + హరినిభ రేచా.' (అప్ప 3-265)

రేచసంబుద్ధి గలదగుటచే నీ పద్యము భీమన ఛందములోనిదిగాఁ దోఁచును. భీమన చెప్పినవి 10 యతులే. కాన నిది ప్రక్షిప్తము. ప్రాచీన కృతియగుటచే భీమన ఛందములోఁ బ్రక్షిప్తము లనేకములు ప్రవేశించినవి. అందుచేతనే 'వికటకవులు కొన్ని వింతలు కల్పించి, కవిజనాశ్రయమునఁ గలిపినారు' అన్నాఁ డప్పకవి. పై పద్యమున య ర ల వ లకు వేఱుగా శ ష స హ లకు వేఱుగా యతిమైత్రి చెప్ప బడినది. కాని శిరోమణికారుని మతమున అంతస్థోష్మములకు పరస్పరము యతిచెల్లును. ఇందు మ యతి (4-188) లక్షణములోఁ బూర్వార్ధము మ యతి, ఉత్తరార్ధము యశ వర్గయతి చెప్పఁబడినది. అట్లే యశవర్గ ద్వయయతి (4-319) లక్షణములోఁ బై వు

యతి లక్షణపద్యమే పునరుక్తమై యందుఁ బూర్వార్ధము యశవర్గయతి, ఉత్తరార్ధము మ యతిగా మార్చి కూర్పఁబడెను. ఈ యతిని లక్షణదీపిక (వార్తాకవి), శ్రీధర చ్ఛందము, సులక్షణసారము పేర్కొని లక్ష్యలక్షణముల నొసఁగినవి. ప్రసిద్ధ లాక్షణికుల మతమున య ర ల వ లు యతి చెల్లవు. శ ష స లు పరస్పరము చెల్లును. హకారముతో నవి చెల్లవు. 'య - హ' లు మాత్రము చెల్లును.

ఈ విలక్షణ విశ్రమమునకు లక్షణశిరోమణి ప్రదర్శించిన లక్ష్యములలో నొకటి నన్నయది, రెండవది యెఱ్ఱనది. అవి యీ క్రిందివి:

నన్నయ - (ఆది 8-232)

'జలరుహనాభ రమ్యగిరి సానువనమ్ముల వేఁటలాడుచున్
సలుపుద మీనిదాఘ సమ + యమ్ముల నీవును నేను నెమ్మితోన్.'

(అ. శి. 4-322)

రెండవపాదమున 'స - య' లకు యతి కన్పట్టుచున్నది. సంశోధిత భారత ముద్రణమున నిట్టి పాఠము కానరాదు. అందున్నది — 'సలుపుదమీ నిదాఘ దివ + సమ్ముల'. ఇందు సమయతి సహజముగా నున్నది. పౌత్తపికవి కిట్టి క్రొత్తపాఠమే మూల లభించెనో!

సంస్కృత భారతములో (ఆది - 248 అధ్యాయ - 14 శ్లో.) ఏ సందర్భమున నిట్లున్నది :— (ఖాండవవనవిహార ఘట్టము)

'తతః కతిపయాహస్య, బీభత్సుః కృష్ణమబ్రవీత్,
ఉష్ణాని కృష్ణ వర్తంతే, గచ్ఛావో యమునాం ప్రతి'

మూలమునఁ గతిపయాహస్యయని యుండుటనుబట్టి నన్నయ యహశ్శబ్దపర్యాయమగు దివసమునే సంగ్రహించి యుండునని తోఁచెడు.

ప్రాదియతి (10)

ప్రాదిస్వరసంధిలో మభయయతి చెల్లును. ప్ర + అర్థిత - ప్రార్థిత, అభి + ఇష్ట - అభీష్ట — ఇత్యాది ప్రాదిసంధులందు స్వరమునకుఁగాని వ్యంజనమునకుఁగాని యతి చేయవచ్చును. ఇందులకు శిరోమణి లక్షణ మిట్లున్నది :—

'ప్రాదు లిరువదిలోన నపాఙ్జు లనఁగ
వెలయు నుపసర్గ లివి రెండు తెలుఁగుకృతులఁ
జొరవు, మిగిలిన వానిపై స్వరములూన
అచ్చులకు హల్లులకుఁ బ్రాదియతులు కృష్ణ.' (4-134)

ప్రాదు లిరువదిలో 'అపి, ఆఙ్' అను రెండు తెలుఁగునఁ జొరవన్నాఁడు పై లక్షణములో మనకవి. తదుపరి భీమనానంత పెద్దనల లక్షణముల నుద్ధరించి, వాటి తుదలో "భీమన్నగారు ఇరువది ఉపసర్గలకు నుపరిస్వరయుక్తమైన నుభయముఁ జెల్లునన్నారు. అనంతన్నగారు పెద్దన్నగారు 'పరా, ఆఙ్, అపి' యనఁబడు ఈ మూఁడు ఉపసర్గలు తెలుఁగునఁ జొరవు; మిగిలిన 17 ఉపసర్గలఁ జెల్లునన్నారు గాఁబట్టి ... 17 ఉపసర్గలకు ... మహాకవి ప్రయోగములు వివరంబులుగాఁ దెలియ లక్ష్యంబులు వ్రాసెద" (4-140) అని వ్రాసి ప్రయోగములఁ బ్రదర్శించెను. పొత్తపి కవి చేర్కొన్నట్లు ఉపసర్గలలో దేనిని భీమన నిషేధింపలేదు. విన్నకోటపెద్దన అపాఙ్ నిరూపణ మప్రసిద్ధమని రెంటిని నిషేధించినాఁడు. అనంతుఁడు, చిత్రకవి పెద్దన, వీరిననుసరించి యప్పకవి పరాజపులు మూఁడు తెలుఁగునఁ జొరవన్నారు. శిరోమణికారుఁడు తొలుత స్వీయలక్షణమున రెంటివిగాదని, తరువాత ననంతాదుల మతము నవలంబించి మూఁటిని ద్రోపిరాజనెను. ఈ యభిప్రాయ పరిణామము వ్యతిక్రమముగానున్నది. తొలుత రెండనడమేమి? తరువాత మూఁటిని గాదనడమేమి? ఇది పూర్వోత్తరస్వవచో వ్యాఘాతము. ఏది యెట్లున్నను శిరోమణికారుఁడు 17 ఉపసర్గలకే లక్ష్యములఁ జూపెను. పరా, ఆఙ్, అపి - ఇవి తత్సమాంధ్రభాషలోఁ బ్రవేశింపవని కొందఱు లాక్షణికుల మతము. రంగకవి 20 ఉపసర్గలకు లక్ష్యములొసఁగెను.

పరాక్రమము (పరా + అక్రమము), పరేత (పరా + ఇతి) — అనుశబ్దములలో 'పరా', అప్యయ (అపి + అయ) అనుచో 'అపి' అను ఉపసర్గలు గలవు. విన్నకోట పెద్దన 'పరేత'ను రంగకవి 'అప్యయము' నుదాహరించిరి. ఇఁక మిగిలినది 'ఆఙ్' అన్నది. దీనికి స్వరము పరంబగుచో ఙకారలోపమగును. (ఆఙ్ + ఉదక - ఆ + ఉదక - ఓదక). సంధిలో వ్యంజనము నిలువదు, గానఁ బ్రాద్యుభయయతికి నవకాశములేదు.

శిరోమణి చూపిన ప్రాదిశబ్దములు :—

ప్రాపించు (ప్ర), సముల్లసన (సమ్), అనురాగ (అను), సుమహత్ (సు), విరాన (నిర్), నిరతిశయ (నిర్), దురంత (దుర్), అభీప్సిత (అభి), ఉపాంత (ఉప), ఉపేంద్ర (ఉప , పరాక్రమ (పరా), ఆకలిత (ఆఙ్), వ్యవసాయ (అవ), ఉదగ్ర (ఉద), వ్యపగత (వి), అత్యంత (అతి) — ఇందు 14 ఉపసర్గలకే లక్ష్యము లున్నవి. అప్పుడు 'ప్రతి, పరి, అధి, ని, అపి, అప' అను 6 ఉపసర్గలకు లక్ష్యములు లుప్తములని యెన్నవలెను. స్వీయలక్ష్యములలో (4-136) 'అప'కు 'అపాస్త' అను నుదాహృతియున్నది. అట్లైన ఉపసర్గవింశతికి నుదాహరణము లున్నవన్నట్లగును. పరాదుల నిషేధించియు పరాదులకు లక్ష్యము లొసంగుటలో శిరోమణిగారి భావ మేమో వింతగా నున్నదనక తప్పదు.

శిరోమణి ప్రదర్శించిన లక్ష్యములలో హల్లునకో యచ్చునకో యొకదానికి యతి యున్నదిగాని ప్రత్యుపసర్గకు స్వరవ్యంజనయతులు చెల్లుటకు రెండేసి యుదాహృతులఁ జూపి యుండవలసినది. ఈ గ్రంథమున నట్టి క్రమపద్ధతి యిటనేకాక యన్యత్రఁగూడఁ బాటింపఁబడలేదు.

ఇఁక రమణకవిచూపిన ప్రాదియతిలక్ష్యములలోఁ గతిపయవ్యతిక్రమములు —

అరుదుగఁ బతి పిల్వఁగవిన + యనురాగము (ల. శి. 4-143) — ఇది ప్రాది యతి కాఁజాలదు. 'అను' అను నుపసర్గయున్నది గాని దానిపై స్వర మతుకలేదు. 'అన్వర్థ (అను + అర్థ) అన్వీక్షణ (అను + ఈక్షణ)' అనురీతిఁ బ్రాదిస్వరసంధి యతిస్థానమున రావలయును — ఇం దట్టి సంధిలేదు. కాన నియ్యది యుదాహార్యము కానేరదు. మఱి ప్రాదియతులకుఁ గవి తొలుత వ్రాసిన స్వీయలక్ష్యములోఁగూడ 'అమిత సద్భోగమౌని మ + నోనురాగ' (ల. శి. 4-136) అనుచోటఁగూడ నీ దోషమే కలదు. అందున్నది గూఢస్వరయతిగాని ప్రాదియతికాదు. ఇది కవిప్రమాద మనక తప్పదు. ఇట్టివే మఱికొన్ని —

సుమహ దుపాశ్రయా ప్రమద + ఘోషిత (4 - 144) — ఇదియుఁ బ్రాదియతి గాదు. సూక్తి (సు + ఉక్తి), స్వస్తి (సు + అస్తి) వంటి స్వరసంధిగలవి యుదాహార్యములు.

పి. రాసంబగుఁ బాయనురగ + రక్షోభయముల్ (4-145).

'నిర్ + అస - నిరాస' — ఈ ప్రాది స్వరసంధిలో వ్యంజనమైత్రి గూర్పఁ బడినది — ఇది సమీచీనమైనలక్ష్యము. కాని దీనితరువాతఁ జూపఁబడిన

'నిరతిశయ దుఃఖభారంబు + విస్తరింప' (4-146) అను లక్ష్యములో ప్రాది యతి కుదురదు. నిరతిశయమందలి (నిర్ + అతిశయ) రేఫకో అకారమునకో యతి యున్ననే ప్రాదియతి యగును.

ప్రాదులు పూర్వమునమంచి వానికచ్చుపరంబయి కలసిన సంధులందే యుభయ యతి ప్రాదియతిగా లాక్షణికులు పేర్కొనిరి. అధీశ (అధి + ఈశ) = అనురీతిఁ బ్రాదులు పూర్వమునమన్నను, వృషభాధిప (వృషభ + అధిప) — అనురీతిఁ బరమున నున్నను నుభయమునకు యతిచెల్లుట ప్రాదియతి యగునని తాతంభట్టకవిచింతామణి లక్ష్యలక్షణములు నిరూపించెను.

> 'ధాత్రిఁ బ్రాదియోగ మాత్రంబు గలిగిన
> నుభయమును రచింప నొనరు యతికి
> సాతిరిక్త భక్తి + శక్రసేవిత కమ
> లాలయా నివాస + లక్ష్యమిదియ.' (కవిచింతామణి 3-15)

ఇందు 'సాతిరిక్త' (స + అతిరిక్త), శబ్దములో 'అతి' యను నుపసర్గ పరముననున్నది. పూర్వముననున్ననే ప్రాదియతియని పరముననున్న (వృషభాధిప - అనుచోట) ప్రాదియతిగాక నిత్యసమాస విశ్రాంతిలో నుపసర్గసంధి కుభయయతియని యప్పకవిగారి యభిప్రాయము. పూర్వాపరములలో నెందున్నను బ్రాదియతియని పరిగణించుటయే యుక్తియుక్తము.

నిత్యసమాసయతి (15)

పదద్వయవిభాగము స్పష్టముగాఁ దోఁపని సమాసమధ్య స్వరసంధ్యక్షరమున కుభయయతి నిత్యసమాసయతి యగును. నారాయణ (నార - అయన), రసాయన (రస - అయన), జనార్దన (జన - అర్దన) ఇత్యాది సమాసములందుఁ బదద్వయ విభాగమున్నదని తోఁపదు. ఇవి నిత్యసమాసములు ఇట్టివానియం దుభయయతి చెల్లుబడియగును.

శిరోమణికారుఁడు సంస్కృత సమాసములనేకాక యందు — ఏపఱు, రూపఱు' ఉక్కఱు, క్రికిఱియు, తెమ్మెర, కట్టెఁడి — మున్నగు దేశ్యసమాసముల సంగ్రహించెను

వీటిని లాక్షణికులు దేశ్యనిత్యసమానయతి, దేశియయతియనుపేర వేఱుగాఁజూపిరి శిరోమణికర్త కూడ దేశియయతిని ప్రత్యేకముగాఁ బ్రదర్శించియున్నాఁడు. అందు సైతము తెమ్మెర, క్రచ్చఱ, ఏపఱ, క్రిక్కిఱియు మున్నగు దేశ్యశబ్దముల సంగ్రహించి యున్నాఁడు. నిత్యసమానయతియందు దేశియయతినేకాక 'మఱియుఁ బ్రభునామ నిత్యసమానయతు లొక్కవిధంబుననుండు' (ల. శి. 4-203) నని ప్రభు యతినిగూడ నిందుఁ గలిపినాఁడు. అనంతుఁడు చెప్పిన నిత్యయతిని (క్రూరకర్ముఁడేని - ఏనిశబ్ద సంధి కుభయయతి) ఇందే సంగ్రహించినాఁడు. (ల. శి. 4-208)

చేతిది (చేతి + అది) — అప్పకవి మతమునఁ బ్రత్యేకయతి. అనంతుని మతమున భిన్నయతి — 'చేతిది' యనుచో హల్లునకు, 'చేతియది' యనుచో నచ్చునకు యతి చేయవచ్చునని యనంతాప్పకవుల లక్షణములు.

'చేతిది' అనుశబ్దమును నిందుఁజేర్చుటచే శిరోమణికారునికి నిత్యసమాసోభయ యతి సమ్మతమని తెల్లమగును. అట్లే 'క్రిక్కిఱించు, ధిక్కరించు, ప్రసరించు, అలరించు' అను నించుగాగమక్రియలనుగూడ నిందే పరిగ్రహించెను. వీనికి రమణ కవి భిన్నయతియందు స్వరమైత్రిమాత్రమే వచించెను. మఱి యింపుభయయతి నుపదేశించెను. ప్రసరించువంటివి భిన్నయతి యనుకొన్నచో వ్యంజనమునకును, నిత్యసమానయతి యనుకొన్నచో స్వరవ్యంజనోభయమునకును యతి గూర్పవచ్చునని శిరోమణికారుని యభిప్రాయమని యేర్పడును. ఈ పద్ధతి వింతగనున్నది.

నఞ్సమాసయతిని వేఱుగా వింగడించియున్నను రమణకవి అనంత, నాస్తి శబ్దముల నిందుఁగూడఁ జేర్కొనెను. ఇట్టి పౌనరుక్త్యవ్యతిక్రమపద్ధతి యీ శిరోమణి కారునికి సహజమయి కానవచ్చుచున్నది.

శిరోమణి ప్రదర్శించిన నిత్యసమానయతి శబ్దములు — నాస్తి, నారాయణ, అనంత, రత్నాకర, ఆపోశన, వాతాయన, రామాయణ, పరాయణ, శుద్ధాంత, ఏకాంత, రసాయన, జనార్దన, విశ్వామిత్ర ;

ఏపఱ, ఉక్కఱ, రూపఱ, చూపఱ, కాపది, క్రిక్కిఱించె, ధిక్కరించె, తెమ్మెర, ప్రసరించె, కట్టిఁడి, అలరించె, చెన్నక్క, చెన్నక, చేతిది, పిన్నది, కర్ముఁడేని, తలఁచెనేని — ఇందు నిత్యమాసములేకాక, యితర యతిభేదములలోని శబ్దములు గూడ సంగ్రహింపఁబడి కలగాపులగమయ్యెను.

శకంధుయతి (29)

పరరూపసంధిగల శకంధ్వాదిగణ పఠితశబ్దముల కుభయయతి చెల్లును. దీనినే పరరూపయతియని పేర్కొనె నప్పకవి.

శిరోమణి లక్షణములో ద్వీ పాంతరీప ప్రతీప నాక నారికేళాది శబ్దములు శకంధు సంజ్ఞకములుగా వచింపఁబడినవి. ఈ నిర్దేశము సరిగాదు. ద్వీపాదులు శకంధ్వాదులఁ బఠితములుగావు. 'ద్వ్యంతరుపసర్గేభ్యోపఈః' త్రనుపాణిని సూత్రముచే (ద్వి + అప్ - ద్వి + ఈప్ - ద్వీప) అప్పులోని అకారమునకు ఈకార మాదేశమయ్యెను. ఆదేశయతి క్రింద శిరోమణి ద్వీపశబ్దమును బేర్కొన్నది. నాక, నారికేళ శబ్దములు నిత్యసమాస యతులగును.

శిరోమణి యుద్ధరించిన లింగమగుంట రామన్నగారి లక్షణసారములోని అరయశకంధు ' (4-306) పద్యములో నాక ద్వీప నారికేళ శబ్దము లన్వితములు నిత్యసమాసములని వచింపఁబడెను. ఈ రామన్నపద్యము కవిచింతామణిలో అఖండ స్వరవళిక్రిందఁ దాతంభట్టీయముగా నొసఁగఁబడియున్నది.

దేశియయతి (4)

క్రచ్చఱ, తెమ్మెరలు, క్రిక్కిఱియు మున్నగు దేశ్యపదములలోని సంధ్యక్షర ముల కుభయయతి చెల్లును. శిరోమణికారుఁ డిట్టి పదద్వయవిభాగములేని 'మక్కువ, ఎక్కటి, చక్కటి' మున్నగు దేశ్యశబ్దములందును హల్లులమీఁది యచ్చులకు నచ్చు లచ్చులతో యతి చేయవచ్చునని లక్షణము రచించె. అందుల కాతఁ డొసఁగిన కొన్ని యుదాహరణము లివి —

'అఖిలకెంతయుఁ బ్రియము నె + త్తమ్ములనఁగ
ఈశ్వరుఁడు మౌళిఁదాల్చెఁ గ్రొ + న్నెల ననంగ' (ల. శి. 4-56)

'నెత్తమ్ములు, క్రొన్నెల' అను శబ్దములకో సంధులుగలవుగాని యవి స్వర సంధులుగావు. కాన నేవలస్వరమైత్రి కాస్కారములేదు. శిరోమణికారుని మతమున 'అఖిల — నె + త్తమ్ము' లనుచోట తకారముమీఁది అకారమునకుఁ బాదాది అకార మునకు యతి చెల్లును. ఇట్టి యతి నాయెఱిఁగిన లక్షణగ్రంథములలో నెందును గానరాదు. ఇదియొక యవలక్షణ యతిమైత్రి. ఇది యిటులుండ,

'ఓషధీశార్క నేత్ర ఖా + సురచరిత్ర' (4-53) అను నుదాహృతి మఱెంతో విలక్షణమైనది. 'ఖాసుర' లోని సవర్ణముమీఁది ఉత్వమునకు ఓతో యతి. ఇందు సంధిలేదు. మఱి దేశ్యశబ్దమునుగాదు. రమణకవి భావమేమో?

ఈ యతి నంగీకరించినచో స్వరసంధి లేకున్నను నెట్టి శబ్దమందేని హల్లు మీఁది స్వరమునకుమాత్రము యతి చేయవచ్చుననుటలో నభ్యంతరముండదు. పొత్తపి కవి స్వీయలక్ష్యమొసఁగెనేకాని దీని కితరకవిలక్ష్యము చూపలేదు. అట్టి లక్ష్యము గగనకుసుమప్రాయమని యెన్ననది.

<u>ప్లుతయతి</u> (14) — <u>కాకుస్వరయతి</u> (20)

దూరాహ్వాన, సంగీత, సంశయ, రోదనములం దుచ్చరింపఁబడు వర్ణోచ్చారణము ప్లుతమనఁబడును. ఇది దీర్ఘాంతము, త్రిమాత్రాకాలికము. ఇట్టి ప్లుతాక్షరమున కుభయయతి చెల్లును. పొత్తపికవి ప్లుతస్వరమున సంగీతమునినా తక్కినవిమాత్రమే సాహిత్యసంబంధులని స్పష్టపఱచెను.

కాకుస్వరయతి సంబోధనాంతపర మయ్యును దీర్ఘవర్ణంబై స్వరముగాఁ గాన్పించునది యని పొత్తపికవి వివరణము (4-245) మఱి యందే యుద్ధరింపఁబడిన యనంతుని లక్షణప్రకారము ప్రశ్నాకలితదీర్ఘము గూడఁ గాకుస్వరమే (4-249). ఈ కాకుస్వరప్లుతయతులు రెండు వేర్వేఱఁజెప్పినను ఒక్కొక్కచిక్కున ఈ కాకుస్వర యతియు ప్లుతయతియు ఒక్కతీరుగాఁ గానఁబడునని శిరోమణికారుని సమీక్ష (4-253). ఇట్టి సమీక్షావచనము ప్లుతయతిక్రిందను గలదు (4-201).

లాక్షణికులలోఁ గొందఱు ప్లుతయతిని, గొందఱు కాకుస్వరయతిని, మఱికొందఱీ రెంటిని రెండుభేదములుగాను జెప్పిరి. కాకుస్వరమే ప్లుతస్వరమగును. పరిశీలింపఁగా రెండునొక్కటే. 'అదికాకుస్వరంబు ప్లుతవశయునగు' నన్నాఁడప్పకవి. (3-241)

ఇది రెండుభేదములుగాఁ జెప్పుటకన్న నొక్కటిగాఁ బరిగణించుటే సముచితము.

అలుక్సమాసయతి (36)

సప్తమ్యలుక్సమాసములలో విభక్తి ప్రత్యయస్థానమందలి వర్ణమున కుభయ యతి చెల్లునని శిరోమణి. ఇది సంస్కృత (తత్సమ) సమాసవిషయము. 'శంత-

కాల' శబ్దములు సమసించినపుడు 'కంతేకాల' అని యలుక్సమాసమగును. 'కంతే' సప్తమీవిభక్తి. ఇందు స్వరవ్యంజనములకు యతిచెల్లును.

స్వరముతోడి మైత్రికి పొత్తపికవి స్వీయలక్ష్యము మాత్రమే కలదు.

'కం । తేకాల సహాయుఁడవి సు + రేశ్వర' (ల. శి. 4-362)

వ్యంజనమైత్రికి స్వీయలక్ష్యముతో రా. పాం. లక్ష్యమును జూపఁబడినది.

'పా । ణౌకృతగిరిరాడవత్యు + నకు' (రా. పాం, ల. శి. 4-363)

స్వరమైత్రి కితర లక్ష్యములు మృగ్యములు.

ఈ శిరోమణి లక్షణమునుబట్టి 'అంతేవాస, వంకేరుహ, నీరేజ, ఖేచర, వనేచర' ఇత్యాదులందు నీ యలుక్సమాసయతి చెల్లునని యూరయనగును. ఇది శిరోమణి ప్రోక్త నూతనయతిభేదము.

ఘఞ్ యతి (37)

లపధాతువునకు (లప - వ్యక్తాయాం వాచి - ధాతుపాఠము) ఘఞ్ ప్రత్యయ యోగమున 'లాప' అను రూపము కలుగును. భావార్థక ఘఞ్ ప్రత్యయము పరమగు నేని అకారోపధకధాతువులకు బహుళముగా నుపధాదీర్ఘ మువచ్చును.

ఉ॥ లప్ - లాప; ఆఙ్ + లాప - ఆలాప.

ఈ లాపశబ్దమందు అకారముమీఁది ఆకారమునకును యతి చేయవచ్చునని యీ ఘఞ్ యతి సమ్మతించుచున్నది.

కలా । లాపములఁజా సుఖంబడుగ + నాటిటఁజొచ్చి (ల. శి. 4-[illegible])

అచ్చుతోడి మైత్రియే విశేషము. హల్మైత్రి సహజము.

ఇందుల శాముక్తమాల్యదాది ప్రయోగములు చూపఁబడియె.

లాపశబ్దమందువలె ఘఞ్ ప్రత్యయయుక్తశబ్దములకెల్ల (పాక, భాగ, రాగ, విశ్రామ - మొ) ఈ ఘఞ్యతి చెల్లుబడి కాఁదగును. కాని లాక్షణికులు వచింపలేదు.

ఘఞ్యతి నన్నయభట్ట లక్షణసారము, అథర్వణచ్ఛందము, కవిరాక్షస చ్ఛందము అనువానిలో వచింపఁబడినట్లు రంగయఛందము దెలుపుచున్నది. గణపవరపు వేంకటకవి యాంధ్రప్రయోగరత్నాకరములో నీ ఘఞ్యతి చెప్పఁబడియున్నది.

**అఖండయతి** (7)

అఖండయతి యననేమో లక్షణమున స్పష్టపఱుపలేదు లక్షణశిరోమణి. ఈ యతి ప్రారంభలక్షణపద్యమున — 'ఉక్కఱ, క్రచ్చఱ, ఓలమాస, గ్రక్కదల, తెమ్మెర, నారాయణ, నాక, లోకైక' అను శబ్దములలో హల్లులపై స్వరమునకు మైత్రి యిడుట యఖండయతియని వచింపఁబడెను.

కాని అఖండయతి లక్షణస్వరూప మిట్లుండును — అచ్చంధిగల శబ్దములందు స్వరప్రధానవడియే పాటింపవలసియుండఁగా, ఆ శబ్దద్వయమేళనమును అఖండముగా (ఏకముగా) భావించి సంధిస్థలమున నిలిచియున్న వ్యంజనాక్షరమునకే యతిగూర్చుట యఖండయతి యనఁబడును. ఇందు చేయుటకే యభ్యంతరములేదు.

అఖండవడి నప్పకవ్యాదులు విరసించిరి. ఏలయన నఖండవడి నమ్మతించినచో స్వరసంధిగల సంస్కృతాంధ్రశబ్దములందెల్ల స్వరములకేకాక వ్యంజనములకును యతి సంగతమగును. నీ విచ్చితి (నీవు + ఇచ్చితి), వంశాబ్ధి (వంశ + అబ్ధి) మున్నగు తెలుఁగు సంస్కృత స్వరసంధులందెల్ల వ్యంజన యతిమైత్రియు నంగీకర్తవ్యమే యగును. ఇది యంత రమ్యముగాఁ దోఁపదు. ఇట్టి యతివ్యాప్తి నరికట్టి కతిపయ శబ్దములకే దీనిఁ బరిమితము చేయఁదలఁచి యుభయయతి భేదము లనంతాదులచే నుపదేశింపఁబడెను.

అఖండవడి యొక్కటి చెప్పినచో నుభయవళు లన్నియు నందే గతార్థమగును. కాని కొందఱు ఛందఃకర్త లుభయవళీ భేదాలగు ప్రాదిశకంధు ప్రభునామ నిత్యసమాసాదులఁ జెప్పుచు వాటిలో నఖండవడినిగూడ నుడివిరి.

అఖండవడిని జెప్పినవారు భీమకవి, చిత్రకవిపెద్దన, అథర్వణుఁడు, ముద్దరాజు రామన, లింగమగుంటతిమ్మన, రఘునాథయ్య, పొత్తపిరమణకవి, కూచిమంచితిమ్మన, నైషధముతిమ్మకవి, రంగకవి, ఓరుగంటిరామకవి, కూచిమంచి వేంకట్రాయకవి మున్నగువారు.

శిరోమణిలో అఖండవడినిగూర్చిన పరామర్శ కొంతగలదు. 'అవి (అఖండ యతులు) కొందఱు మెచ్చరు మే। లవునని కృతులందు సుకవులయ్యె యెడలఁ । దివిరి రచించిరి' (4.88) అని వచించి

'ఈయఖండయతి మహితబుద్ధిఁదెలియని
వారు చెల్లదనుట కారణమునఁ
జతురబుద్ధిఁదెలియ సమ్మతుల్ వ్రాయుదు
విచ్చసుకవివరుల మెచ్చుగాఁగ' (4.89)

అని విమర్శించి కవుల లక్ష్యములఁ బెక్కింటిని వ్రాసెను. అందుఁ గొన్ని పొత్తపికవి మతప్రకారమే యాతఁడు చెప్పిన యితర యతులకుఁ జెందును.

ఈ క్రింది పట్టికలో శిరోమణికారుఁడు చూపిన లక్ష్యములలోని అఖండవడి శబ్దములను వరుసగవ్రాసి, యందెయ్యవి యతని మతమున నఖండవడులగునో యెయ్యవి యితర భేదములకుఁ జెందునో యా వివరములు సూచింపఁబడును.

| పద్యసంఖ్య | అఖండవడిశబ్దము | దేనితోమైత్రి | యతిపేరు |
|---|---|---|---|
| 4. 90 | అక్కఱ | అచ్చు | దేశీయ |
| 91 | క్రచ్చఱ | అచ్చు | దేశీయ |
| 92 | ఓలమాస | హల్లు | దేశీయ |
| 93 | గ్రక్కదల | ,, | దేశీయ |
| 94 | తెమ్మెరలు | ,, | దేశీయ |
| 95 | నారాయణ | ,, | నిత్యసమాస |
| 96 | నాక | ,, | ఆదేశ |
| 97 | లోకైక | ,, | వృద్ధిలో అఖండ |
| 98 | అనేక | ,, | నఞ్ సమాస |
| 99 | చూచూచుందెద | ,, | అఖండ |
| 100 | కృశాంగ | ,, | అఖండ |
| 101 | ఏమన్న | ,, | అఖండ |
| 102 | సత్యమిది | ,, | అఖండ |
| 103 | అశ్వత్థామలకే | ,, | అఖండ |
| 104 | దివిజారి | ,, | అఖండ |
| 105 | పిలోనికి - నిచ్చెద | ,, | అఖండ |
| 106 | యథోచిత | ,, | అఖండ |

దేశియాది యతులం దుదాహరించిన అక్కఱాదుల నఖండయతిలోఁ జెప్పుట పరస్పర వ్యాఘతమగును.

అఖండవడిగూర్చిన ప్రయోగములు భారతమునఁ బెక్కులు గానవచ్చెడు. కాని కవిత్రయ మఖండవడిని బ్రయోగింపదను దృఢాభిప్రాయముగల లాక్షణికులుమాత్రము వాటికెల్ల అఖండవడిలేని పాఠములఁ బఠింతురు. అప్పకవి యట్లే పాఠాంతరములఁ బ్రదర్శించెను. (చూ : అప్ప - 3 ఆ - 202 - 212)

కూచిమంచి తిమ్మకవియు అఖండవడిని వడిభేదములలోఁ బేర్కొని లక్ష్యములఁ బ్రదర్శించి, 'ఇట్టి ప్రయోగములు గలవుగాని అఖండ యతికిఁద్రికవుల ప్రయోగములు లేవుగనుక ఇది సుప్రయోగముగా' దని విమర్శించెను. (చూ : స. ల. సా. సంగ్రహము - మంజువాణిప్రతి - పుట 111) పై వాక్య మీరీతి నిటీవలి అకాడెమీ ముద్రితప్రతిలో లేదు. అం దిట్లున్నది : 'ఈలాంటి ప్రయోగాలు అదకాదకుగలవు. కాని మహాకవి ప్రయోగాలులేవు' (అకాడెమీప్రతి - 2 - 125)

'అక్కఱు తెమ్మెర రూపఱు
గ్రక్కదలఁగ నోలమాన క్రచ్చఱయనుచీ
పెక్కుపదము లిరుదెఱఁగుల
నిక్కముగ నఖండవడి గణించిరి సుకవుల్'

(స. ల. సా. సం - అకాడెమీప్రతి 2-126)

కూచిమంచి తిమ్మన పై పద్యములో నిచ్చిన అక్కఱాది పదములన్నియు శిరోమణికారుఁడు చూపిన యఖండవడి లక్ష్యములలోనున్నవి. ఇం దెవరినెవ రనుసరించిరో?

శిరోమణి చూపిన భారత లక్ష్యములలోని యఖండవడి ప్రయోగములకు నవ్వడిలేని పాఠాంతరము లీ క్రిందివి కానవచ్చెడు.

చూచె ... దలఁచు + చుందెద (అఖండవడి)

చూచె ... దలంతు + సుందరి (అఖండవడిలేని పాఠము)

ఘు । స్మరు ... దివి + జారి (అఖండవడి)

సం । హరు ... దివి + జారి (పాఠాంతరము)

పిలోనికి — విచ్ఛేద (అఖండవడి)

వలపిన । వేలోనికి — విచ్ఛేద (పాఠాంతరము)

తుది ... వైచుటయ + ఖోచిత (అఖండవడి)

తుది ... వైచుటయ + తోచిన (పాఠాంతరము)

ఈ ప్రసంగమువలనఁ దేలిన సారాంశమేమన శిరోమణికారుని కఖండయతి యఖండసమ్మతి యన్నమాట.

శిరోమణికారుఁడు చెప్పిన క్రొత్తయతులు అప్పకవీయమున లేనివి : అఖండ, అనుస్వారోష్మ, చుత్వానునాసిక, యశవర్గద్వయ, అలుక్సమాస, షుక్, ఆదేశ, సవర్ణప్రాస, నఞ్సమాస యతులు తొమ్మిది. (నఞ్యతిని అప్పకవి నిత్యసమాసలో సంగ్రహించెను) ఇందు అఖండ, యశవర్గ, షుక్, నఞ్ యతులు శిరోమణికాలమున కించుక ముందు వెనుకల వెలసిన లక్షణ గ్రంథములలోఁ జెప్పఁబడినవి. అప్పకవి చెప్పిన ఋజు, ఊష్మ, రాగమసంధి, పంచమావిభక్తి, ప్లుతయుగవిశ్రమములు వొత్తపికవి గ్రహింపలేదు. ఋజూష్మయతు లనవసరములు, తక్కినవి యవశ్య ములు. అనంతపు కవులు నుడివిన నిత్యయతిని శిరోమణి నిత్యసమాసయతిలో సంగ్రహించెఁ, గావి యది ప్రత్యేకభేదముగాఁ బరిగణింపఁదగినది. లక్షణదీపిక నుదాహరించిన శిరోమణికర్త అందలి సౌభాగ్య, అభిన్న, సంభావన, భావదుల సంగ్ర హింపఁడయ్యె.

శిరోమణి చెప్పని యతులు :

ప్రయోగదృష్టములైన యీ క్రింది కొన్ని యతిమైత్రీ విశేషములు శిరోమణి కారుఁడు పరిశీలించినట్లు లేదు —

ఙకారవడి —

కృతవీర్యధనమెల్ల ( + గ్గప్తివేసి ) (భార - ఆది - 7.133)

ఏవార్థకవడి —

పర్వం । బి కడుఁగా మేలనఁగ శాంతి + పర్వము వెలయుఁగా

(భార - ఆది - 1-58)

౨౫. రు వడి —

క్రూరార్ధ చంద్రాస్త్ర + కృత్తోరుబాహాళై (భాస్కరరామా - యుద్ధ - 1443)

౨౬. వు వడి —

దే, వునకు ననుంగువాఁడనయి + యుత్సుకతకు (వృషాధిప శతకము - 98)

సంయుక్త యతివిశేషము —

మంగళ । స్నానమొనర్చి ధౌతపటి + ధానముఁగట్టి (హర - 2-37)

మఱి చతుర్థీవిభక్తి (కై) యతి — దీని కుభయయతి; అక్షౌహిణీశబ్దగతో భయయతి (ఏవార్థకవడియు వియ్యాదియు నఖండ నిత్యసమాసయతులలో గతార్థములు గావచ్చును.)

సంయుక్తప్రాసవిశేషము —

మర్త్యలోకమునకుఁగర్త (బసవపురాణము)

భర్గుండు — మ్రగ్గింతు (నన్నెచోడ కుమార - 11-34)

పక్షీశ్వర తుక్కార భ । పక్షేమంకర (ప్రబంధరాజ - 347)

లక్షణకార్త్స్న్యమును బరిశీలించి ప్రదర్శింప నెట్టివారికిని సాధ్యముగాదు. సర్వజ్ఞనామధేయుకు శర్వునకేకదా ? లక్షణశిరోమణి విక్రమాధికారములోఁ గతిపయ నూతన యతిప్రాస విశేషములు, అనేక లక్ష్యలక్షణ గ్రంథపద్యములు మన తెలియ బడుచున్నవి.

## ప్రా స భే ద ము లు

'పరఁగు రెండవ వర్ణంబు ప్రాసమనఁగ ......
నమరుఁ బ్రాసంబు నాల్గు పాదములఁ గృష్ణ' (4-377)

అని ప్రాస నిర్వచనము.

పొత్తపికవి యతిభేదములఁ జెప్పినట్లే ప్రాసభేదములఁ గొన్నింటిని జేర్కొన్నాఁడు.

కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణులలోఁ బ్రాసభేదములు — ప్రత్యేకముగాఁ జెప్పఁబడవు. అనంతుఁడు చిత్రకవిపెద్దన 12 ప్రాసభేదములఁ దెల్పిరి. లక్షణవిలాసము - 20, యతిప్రాసవిలాసము - 24, లక్షణదీపిక - 12, అప్పకవీయము - 17, సర్వలక్షణసారసంగ్రహము - 7, రంగయఛందము - 12 ప్రాసభేదములఁ జెప్పినవి.

శిరోమణికారుఁడు 'ద్వాదశవిధములు షడ్విధభేదమ్ములు మఱియు రెండుఁ జెప్పఁగఁ దత్తద్భేదములు వ్రాసెద' నన్నాఁడు (4 - 379) అనఁగా 12 + 6 + 2 = 20 ప్రాసభేదములు చెప్పినాఁడనుట. ఇందు 6 శబ్దాలంకార ప్రాసములు. అవి ఛందస్సంబంధులుగావు. అట్లైన శిరోమణిలో 14 ప్రాసములు వచింపఁబడినవనవలెను. ఇవిగాక యతిప్రాసభేదాలమధ్యలో మఱొక రెండు ప్రాసవిశేషములు గాననగుచున్నవి. వీటినన్నింటి నొకవంక నానుపూర్విగా నిచ్చియున్న ఛందోభ్యాసకులకు సమకూలముగా నుండియుండును.

పౌత్తపికవి అప్పకవి పేర్కొనిన ప్రాసభేదములను క్రిందిపట్టికలో సరిపోల్చి చూపెదను :

## ప్రాస భేద ము ల ప ట్టి క

| లక్షణశిరోమణి | అప్పకవీయము | |
|---|---|---|
| 1. సమనామప్రాస | అర్ధబిందుసమప్రాస | (1)[1] |
| | పూర్ణబిందుసమప్రాస | (2) |
| | సంయుతాక్షరప్రాస | (4) |
| 2. ప్రాసమైత్రిప్రాస | ప్రాసమైత్రిప్రాస | (11) |
| | అభేదప్రాస | (16) |
| (సావర్ణ్యప్రాస) | సంయుతాసంయుతప్రాస | (5) |
| 3. ఋప్రాస | ఋప్రాస | (14) |
| 4. త్రికారప్రాస | సంయుతాసంయుతప్రాస | (5) |

1. ఈ కుండలీకరణములందలి సంఖ్యలు అప్పకవీయములోని ప్రాసభేద క్రమమును సూచించును.

| | లక్షణశిరోమణి | అప్పకవీయము | |
|---|---|---|---|
| 5. | ప్రాదిప్రాస | ఉభయప్రాస | (9) |
| 6. | వికల్పప్రాస | వికల్పప్రాస | (8) |
| 7. | సమలఘుప్రాస | లఘుద్విత్వప్రాస | (7) |
| 8. | బిందుప్రాస | సంధిగతప్రాస | (17) |
| | | అనునాసికప్రాస | (10) |
| 9. | అర్ధబిందుప్రాస | ఖండాఖండప్రాస | (3) |
| 10. | ఉభయప్రాస | సంయుక్తాసంయుక్తప్రాస | (5) |
| 11. | సంయుక్తప్రాస | రేఫయుతప్రాస | (6) |
| 12. | సంధిగతప్రాస (అనేకముగాఁ జెప్పినది) | సంధిగతప్రాస | (17) |
| 13. | వర్గప్రాస | ఋజుప్రాస | (18) |
| 14. | శ ష స ప్రాస | | |
| 15. | అభేదప్రాస (యతిలోనున్నది) | అభేదప్రాస | |
| 16. | సవర్ణప్రాస ( ,, ,, ) | — | |

గమనిక :- అప్పకవీయములో ప్రాసవైరము, లఘుయకారప్రాస అను రెం డధికము.

## శిరోమణి - ప్రాసభేద సంగ్రహ వివరణము

1. సమనామ ప్రాసము :—

పద్యముపాదము లన్నిట రెండవయక్షరము సమము గానుండునది.

ఇం దరసున్నలు నిండుసున్నలు నయిత మన్నిట నొక తీరుగానుండును.

2. ప్రాసమైత్రి ప్రాసము :—

ల - ళ, అలి - మృళ ; పీల - గోళ, లో కంబు - నెమ్మి.

లోక - శా । శాస్త్ర ; సంస్కృత - బృంద.

3. ఋప్రాసము :—

ఋ - ర ; అఋషి - చీరలు.

4. త్రికారప్రాస :—

త్రి - త ; అత్రివిక్రమ - దాత.

5. ప్రాదిప్రాసము :—

న - ణ ; ప్రాణ - దాన.

6. వికల్పప్రాసము :—

అనునాసికసంధిలో వికల్పముగా నాదేశమగు ననునాసికమునకును తత్తద్వర్గ తృతీయాక్షరమునకును ప్రాస.

ప్రాఙ్నగంబు (ప్రాక్ + నగ) - అగ్ని.

7. సమలఘుప్రాసము :—

అద్రుచు, విద్రుచు మున్నగు నచ్చ తెనుఁగు మాటలందు రేఫ సంయుక్త పూర్వవర్ణము లూఁదఁబడవు. అనఁగా గురువులుగాఁగాక లఘువులుగా నుచ్చరింపఁబడును. అట్టి సంయుక్తవర్గముల పరస్పర ప్రాస చెల్లును.

ఉ॥ విద్రిచె నసురఁగృష్ణుఁడు దిక్కు- + లద్రువననఁగ.

8. బిందుప్రాసము :—

సంధియందు ద్రుతమునకువచ్చిన బిందువునకును సహజబిందువునకును ప్రాస.

బంధము - ఉదయించి ; నంధరిత్రి (ఉదయించినన్ + ధరిత్రి)

అంగజ - కాం చెంగజంబు (కాచెను + గజంబు)

కమ్మవి - లతాంతముల ; కు మ్మొనసి (లతాంతములకున్ + మొనసి)

9. అర్ధబిందుప్రాసము :—

ఇది సార్ధబిందు నిర్బిందువులకుఁ బ్రాస.

మూఁడు మూర్తులు నేకమై + కూడెననఁగ.

10. ఉభయప్రాసము :—

పొంది - వాండ్రు ; పిండు - ఇండ్లు

దకార రేఫలకు దకార లకారములకు సంయుతాసంయుతప్రాస గూర్చుట.

11. సంయుక్తప్రాసము :—

(a) బహువచన శ్లిష్టములైన 'ళ్ల' కారములప్రాస.

పాళ్లు (పాళులు) - ఊళ్లు (ఊరులు)

(b) క్రారకొమ్ముప్రాస.

ఈక్రింది - వాక్రువ్వ

12. సంధిగతప్రాసము :—

సంధివశమునవచ్చిన యాగమాదేశ వర్ణములకుఁ బ్రాస.

ఆవిరళ - అ। య్యవదాఱవపాలు (అయ్య + పదాఱవ)

శబ్దాలంకార ప్రాసముల తరువాత నధికముగాఁ జెప్పఁబడిన రెండుప్రాసలు —

1. వర్గప్రాసము —

ద - త; ద - ధ.

2. శ ష స ప్రాస.—

అసదృశ సుషమా। విశద। అనమ

పై రెండు వెంటవెంటఁ జెప్పఁబడలేదు. శ ష స లప్రాస శబ్దరూపభేదముల మధ్యలోఁ జోటు చేసికొన్నది.

ఇవిగాక యతి ప్రకరణములో రెండు ప్రాసభేదము లదనముగాఁ జూపట్టు చున్నవి.

1. అభేదప్రాస (4.158)

ర ల, ర శ, ల శ, ల డ, ద డ, వ ప లకుఁ బ్రాస.

వీనికి వడులు ప్రాసలు చెల్లునవి యభేదయతిక్రిందఁ బేర్కొనఁబడినది.

ర - ల ప్రాస మరల నొకచోఁ బ్రస్తావింపఁబడినది (4.472)

2. సవర్ణప్రాస (యతి) (4.350)

వర్గ ద్వితీయ చతుర్థములకు సవర్ణములకుఁ బ్రాస.

వీటివి గలిపికొన్నచో శిరోమణి 16 ప్రాసభేదసంఖ్య (శబ్దాలంకార ప్రాసముల గాక) పేర్కొన్నవని యెన్నవలెను.



## శిరోమణి చెప్పిన ప్రాసభేదములలోని కతిపయవిశేష పరామర్శ

### ప్రాసమైత్రిప్రాస (2)

ల - ళ లకు, ంబ - మ్మ లకు, ఋ - ఌ యుతములకును ప్రాస చెల్లును. ఇందుల కనంతుని ఛందములోని లక్ష్యలక్షణములు సంగ్రహింపఁబడెను.

'అమరుననో్యన్యమును ఋ యుతాయుతములు' అని యనంతుని లక్షణము. 'శ్రీకి నొడయఁడు జ్ఞ్వ + లాకృతి' అను నిట్టి ఋ యుతాయుతముల ప్రాసమైత్రి లక్ష్యముగా నందుఁ జూపఁబడినది. శిరోమణిలో 'అమరు ఋ ఌ యుతాయుతము లన్యోన్యముగను' (4-389) అను పాఠము కూర్పఁబడియున్నది. ఋ యుతాయుతములకువలె ఌ యుతాయుతములకును నీ ప్రాస చెల్లునను క్రొత్తయంశ మీ పాఠభేదమువలన రూపొందును. దానికనుగుణముగ, 'లోకత్రాణ — భా। షాక్లృప్త' అను లక్ష్యముదాహృతము. దీనికిందు సావర్ణ్యప్రాసయని పేరిడియెఁగాని ప్రాసభేదములలోఁ బ్రత్యేకముగఁ బేర్కొనలేదు. మఱియు నిందు 'ఋకార సంయుక్తప్రాసవలెనే ఌకార సంయుక్తప్రాస గలుగుటకు' అను నిర్దేశముగలదు. 'ఋ - ఌ'లు స్వరములు. వీటితోజేరిన హల్లులు సంయుక్తములనుట శాస్త్రవిరుద్ధము. 'కృ - క్లృ'లు సంయుక్తాక్షరములుగావు. అప్పకవివంటివాఁడును బ్రమాదమున లకారశ్లిష్టమునలేని (ఌకారమన్నను గొంతమేలు — లకారమనుట మఱింత ప్రమాదము) సంయుతాసంయుత ప్రాసక్రింద 'లోక - భాషాక్లృప్త' అను పై రా. పాం. పద్యమునే లక్ష్యముగాఁ జూపెను. (అప్ప. 3-322) అప్పకవి యీ వ్రాఁతను మనసులో నుంచికొనికాఁబోలుఁ గూచిమంచి తిమ్మన

'కల్పముల క్లృప్తియను స్వరల్కార మితర
హల్లుతోఁ బ్రాసముఁ గూర్పఁజెల్లు' (స. ల. సా. సం. 2-74, 75)

వనుచు క్లృప్తిలోని ఌకారము స్వరమని స్పష్టీకరించెను. రంగకవి యీ రా. పాం. ఌకార ప్రాసలక్ష్యమును ప్రాసమైత్రిప్రాసక్రింద నామనిర్దేశముచేయక సంగ్రహించెను.

శిరోమణి యీ ప్రాసభేదముక్రింద 'బ - మ'ల మైత్రికిఁజూపిన భారత పద్య ప్రయోగము నిర్ధారకముగాదు.

'అమ్మల ... సై, న్యంబెల్ల' ఇందు 'సైన్యమ్మెల్ల' అని పఠింపనగును. ఇందులకు 'అమ్మఖవాజి ... మా, వంబపివెట్టి' అను స. ల. సా. సం. (2-80) లోఁ బ్రదర్శితమైన జైమిని భారత ప్రయోగ ముదాహార్యము.

ఋప్రాసము (3)

> ఋ - ర లకు ప్రాస చెల్లునని ఋ ప్రాస తెల్పును.
> దీనిక్రిందనే ఋద్వంద్వరవర్ణాదేశ లక్షణ లక్ష్యములు ప్రదర్శితములు.

'తగు ఋకారాంత శబ్దముల్ ద్వంద్వమైన
యపుడు మీఁదటి ఋత్వంబు లణఁగి రేఫ
లగును దద్వర్ణ మిత్రంబులగు మహేంద్ర
ధాత్రశంకరనుత పద్మనేత్రకృష్ణ' (4-398)

అవి ద్వంద్వమున ఋకారము రవర్ణమగుటయు, ఆ ఋత్వమున కాదేశమైన రవర్ణ సంయుక్తము సహజరేఫసంయుతికి (తద్వర్ణమిత్రంబులకు) ప్రాస చెల్లుటయు వచి యించి, 'క్షత్రియసంఖ్యలై ... రామమాం ధాత్రరఘు' అను నన్నయభారతపద్య మును లక్ష్యముగాఁ జూపెను శిరోమణి. ఈ లక్ష్యమునే యప్పకవి సంయుతాసంయుత ప్రాసక్రింద 'క్షత్రియ — మాం । ధాతృ' అనురీతిఁ బ్రదర్శించి, మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువసుడిగాని క్రారవడిగాదు (అప్ప - 3 - 316, 317) అని వ్యాఖ్యానించెను. కవిసంశయవిచ్ఛేదమున అడిదము సూరన యీ పద్యమునే రేఫాదేశము వచ్చినందుల కుదాహరించె. అప్పకవిమతమున రేఫాదేశము రాఁగూడదు. వచ్చునేని సంయుతాసంయుతప్రాసకు లక్ష్యము గాకపోవును. 'ఆనఙ్ ఋతో ద్వంద్వే' అను పాణిని సూత్రముచేఁగలుగు నానఙాదేశము వచ్చుచోటు లందే 'ఋర్ద్వంద్వే రః' అను చింతామణి సూత్రముచేఁ దెలుఁగున రవర్ణాదేశము సంభ వించును. మఱి విద్యాయోని సంబంధముగల ఋకారాంత సర్వావయవ ద్వంద్వ మందే పూర్వపద ఋత్వమునకు నానఙాదేశము సంస్కృత వ్యాకరణ సమ్మతము గాన నట్టి యనఙాదేశస్థలమునఁ దెలుఁగునవచ్చు రవర్ణము విద్యాయోని సంబంధాదులు లేమిచే 'మాంధాత్రరఘుక్షితీశు' లనుచోట నానఙాదేశ . రవర్ణాదేశములు రావనియు, నందుచే 'మాంధాత్రఘు' అను ఋత్వయుతరూపమే సమీచీనమనియు నాంధ్ర వైయాకరణ సార్వభౌముల సిద్ధాంతము.

ఏదియెట్లున్నను శిరోమణికారుని మతమున 'మాంధాత్రరఘు' అని రవర్ణా దేశము సిద్ధము. శిరోమణికారుఁడు 'ధాత్రశంకరనుత' అను నుదాహరణ యించు మించు సమకాలికుఁడగు మండ లక్ష్మీనృసింహకవి త్రిలింగశబ్దానుశాసనములోని యీ సందర్భమునఁగల 'విధాత్రశంకరులఁగొలుతు' అను నుదాహరణను దలఁపించు చున్నది. ఇం దెవ రెవరినిజూచి దీనిని సంగ్రహించిరో ?

త్రికారప్రాస (4)

అనంతుని త్రిప్రాస లక్షణలక్ష్యముల యథాతథముగ నుద్ధరించినాఁడు పొత్తపి కవి. ఇందు సంఖ్యార్థక త్రికారమునకు మాత్రమే సంయుతాసంయుతప్రాస యనం తునిచే నంగీకృతము. అనంతుననుసరించి చిత్రకవి (త్రిప్రాస), రంగకవి (త్రివర్ణ ప్రాస), వార్తాకవి (త్రికారప్రాస) యీప్రాస నిట్లే పేర్కొని త్రివర్గమునకుఁ బరిమిత మొనర్చినారు.

అప్పకవి సంయుతాసంయుతప్రాసలో నిచ్చిన ప్రయోగలక్ష్యములు (శ్రీకర - ఈఁక్రియ ; సంభ్రమ - కుంభ 3-320, 321) త్రికారేతర స్థలములందును క్రారవడిగల వర్ణమునకు క్రారవడిలేని వర్ణమునకుఁ బ్రాసను బ్రమాణీకరించుచున్నవి. అందుచేతనే యప్పకవి త్రిప్రాస యని పేర్కొనక సంయుతాసంయుతప్రాసమని సార్థకముగ నామకరణ మొనర్చెను.

బిందుప్రాస (8)

'ఉదయించినన్ + ధరిత్రి' అనుచోట సంధియందుఁ బొల్లు నకారము (ద్రుతము) బిందువయి (ఉదయించినంధరిత్రి) సహజ బిందుపూర్వక ధకారముతో (బంధ) ప్రాస చెల్లునని లక్షణము.

ఉ॥ బంధమగుఁ గృష్ణుఁ డుదయించి + నంధరిత్రి. (4 - 416) ధకారమునకే పరిమితము చేసినాఁడనంతుఁడు. ఈ యనంతుని లక్షణమును దొలుత గ్రహించి శిరోమణికర్త తదుపరి,

'అంగ — కా । చెంగజంబు ; కంజ — ప్రో చెంజగంబు' (4-418) అను స్వీయోదాహరణముల నొసఁగి యీ బిందుప్రాస ధకారమునకే కాక యన్నింటికి జెల్లుటను సూచించినాఁడు.

ఈ ప్రాస తుదిలో నకారము బిందువై నిలిచినందుకు, కమ్మని లతాంతముల + కుమ్మొనసివచ్చు (4 . 422) అను నన్నయగారి యాదిపర్వప్రయోగ ముదాహరించెను.

లక్షణములో బిందువనియున్నది. వ్రాఁతలో మకారద్విత్వమున్నది. ఇయ్యది లేఖక ప్రక్షిప్తముగావచ్చు.

పై లక్షణప్రకారము 'కమ్మనిలతాంతముల కుంమొనసి' అని యుండనగును.

ఈ పద్యమునే 'పొల్లుచెడి బిందువగుటకు మకారమునకు' అని లక్ష్యముగాఁ జూపినాఁడు కూచిమంచి తిమ్మన (స. ల. సా. సం. 1-212)

రంగకవియుఁ జూపినాఁడు (రంగ 3.44)

అప్పకవి యీ లక్ష్యమును జూపలేదు కాని యనునాసికప్రాస క్రింద (తమ్ముల - త 1 క్తింమురహరు 3-342) నెఱసున్ననే నిలిపును.

ఈ సంధి విధానమునుగూర్చి యించుక వివరణము -

పొల్లనకారము (ద్రుతము) స్థిర (మకార) పరకత్వమున బిందువగు నది లక్షణము. (లతాంతములకుఁ + మొనసి - లతాంతములకుంమొనసి). కాని నేఁడిట్టి బిందుపూర్వక మకారము తెలుఁగుసంధిలోఁ జెప్పఁబడదు. మఱి యిట్టి బిందురూపము వ్రాయు వాడుకయులేదు. అప్పకవ్యాదు లిటు సంగ్రహించుటకుఁ జింతామణి సూత్రముతే యాధారము.

> 'అగ్వాద్రుత ప్రకృతికాత్పరత స్వరశ్చే స్థిరేచ వస్వస్యాత్,
> అయకిచ సంశ్లేషస్స్యాత్, బిందుంప్రవదంతి తం క్వచిత్కేచిత్'
>
> (ఆం. శ. చిం. సంధి 26)

అను సూత్రములవలన ద్రుతమునకు మకార పరకత్వమున బిందుత్వము విధింపఁ బడినది.

'కేచి ద్వదంత్యభేదత్వ మనుస్వార మకారయోః' (అథర్వసంధి 12) అని బిందు మకారముల కభేదత్వమును జెప్పినాఁ డథర్వణుఁడు.

మకారపరకత్వమున నిట్టి బిందులేఖనము నేఁడు గానరాదు. కాన నిట్టి ప్రాస విధానమును సంరక్షింప నవ్యులగు వ్యాకర్తలు 'పాసంబున మకారంబు పరంబగుచో

ద్రుతంబునకు మకారాదేశంబగు' (ప్రౌఢవ్యా. సంధి 22) అని సూత్రించి కృతార్థులయిరి. ఇప్పటి పరిశోధిత భారతముద్రణలోఁగూడ నీపట్టున మకారద్విత్వమే కాననగును.

ఇందు మఱొకవిషయము గమనింపఁదగినది. 'కమ్మని లతాంతముల కుమ్మొనసి' యను లయగ్రాహి పద్యలక్ష్యమున, 'మధుపమ్ము - వినదమ్ము - చూతమ్ము' అని మకారద్విత్వము మొదటి రెండు పాదమ్ములలోఁ వ్రాపి, ఉత్తరార్ధమున 'భాసుర రవంబుగను వీచెననిశంబు సుమనోభరంబున' అని బిందుపూర్వక బకారమునునిలిపి, దానిక్రింద — ఇదియే 'బ - మ' లకుఁ బ్రాసమైత్రి ప్రాసలక్ష్యమని నిర్దేశించినాఁడు శిరోమణికారుఁడు అనఁగా నిందు ద్వివిధప్రాసము లున్నవన్నమాట. కాని రవమ్ము - అనిశమ్ము - భారమ్ము అనురీతి రూపములుండఁగా నన్నే భారత లిఖితప్రతులలోఁ గానవచ్చుచుండఁగా ననవసరముగ నిట్లు కృతకరూపములఁగల్పించి ప్రాసభేదముగ నుపన్యసించుట సమంజసముగాదు.

ఉభయప్రాస (10)

ఇది దకారరేఫ - డకార లకార సంయుతాసంయుతప్రాస. ఇందుల కనంతుని లక్ష్యలక్షణము లుదహరింపఁబడెను. త్రిప్రాస, ఉభయప్రాస అని వేర్వేఱఁ జెప్పుటకన్న రేఫ సంయుతములందన్నిట నసంయుతముగాఁ బ్రాసగూర్చిన ప్రయోగములుంటచే వీటన్నిటికిని సంయుతాసంయుతప్రాసయను నప్పకవిపేరు సంగ్రహించుట యుక్తము.

'పీంద్రు - ఇండ్లు, కృ । ష్ణుండ - పండ్లు' (4-433) అను నుదాహరణలలోని డకార లకారప్రాసకుఁ బ్రాచీన ప్రామాణిక ప్రయోగము మృగ్యము.

సంధిగతప్రాస (12)

గ స డ ద వాదేశ సంధివలన సిద్ధించు సాధ్య వకారమునకును శబ్దసిద్ధ వకారమునకుఁ బ్రాస చెల్లుబడియగుటను దెల్పుచున్నది యీ ప్రాసభేదము.

అవిరళ ... అ య్యవదాతవపాలు (అయ్య + పదాతవ) ఇందు మొదట సిద్ధ వకారము, తరువాత సాధ్య వకారమున్నది. ఈ లక్షణ మనంతునిది. సంధి యందొక్క వకారమునకేకాక సంధిగతములైన యాగమాదేశ వర్ణములకెల్ల నీప్రాస ఘటిల్లుననుట బహుప్రయోగములవలన సిద్ధము. మఱి యనంతు ననుసరించి రమణ

కవి చెప్పిన బిందుప్రాస (8) యు సంధిగతప్రాసయే. కాని వీరు రెండు వేర్వేఱఁ జెప్పిరి. చక్కఁగాఁ బరిశీలించి యప్పకవి యీ రెంటిని సంధిగతప్రాసయందు సంగ్రహించుటయేకాక సంధిఁగూడిన వ్రాలన్నింటికిప్రాస యుపదేశించెను.

సవర్ణప్రాస — ఇది సవర్ణప్రాసయతిలో యతిప్రకరణములోఁ జెప్పఁబడినది. వర్గద్వితీయ చతుర్థములకుఁ బ్రాస చెల్లునఁట. 'థ - ధ' లకు మాత్రమే యీ ప్రాసను బ్రాచీనులు సమ్మతించిరి.

'రథము - మథము ; వ్యథ - పథన ; సఫలం - ప్రథన' (ల. శి. 4-354) ఇవి కవి స్వీయోదాహృతులు. వీనికిఁ బ్రామాణిక లక్ష్యములు మృగ్యము.

మఱి శిరోమణికారుఁడు 'థ . ధ' లకుఁ జూపిన తిక్కన విరాటపర్వలక్ష్యములు సరికావు.

'రథము - ప్రథితము - అ, శ్లథ - మనో, రథ (ల. శి. 4-356) ఇందు 3-వ పాదమున తవర్గ చతుర్థ (ధ) వర్ణమున్నదని పొత్తపికవి నిర్దేశము. అశ్లథలో నున్నది తవర్గ ద్వితీయము. కాన నిది సమప్రాస యగును. సవర్ణప్రాసకు లక్ష్యము కాఁజాలదు. ఇట్టిదే తరువాతి భారతలక్ష్యముకూడ.

వృథ - ప్రథిత - వృథా - అపి తథ (4.357) 3-వ పాదమున ధకారమున్నట్లు శిరోమణి సూచన. ఇది ప్రమాదము.

మఱి 'బ - భ' ల ప్రాస చెల్లుటకు నుద్యోగపర్వ లక్ష్యమున మొదటిపాదము నిర్దేశింపఁబడినది. (ల. శి. 4.505)

ఆ బీభత్సుని — భు, జాబల — ని, ద్యాబహుంతి — నై బవరము. 'బీభత్సు' అని భవర్ణాదిగా గ్రహించిననే బ భ ల ప్రాస యగుట యింను సంగతమగును. బీభత్సు శబ్దములోని ప్రథమవర్ణము సరళమేకాని (బ) వర్గయొక్క (భ) కాదు. అప్పటున పొత్తపికవి తలంపు పొరపాటనియు నతఁడు చూపిన లక్ష్యము పొసఁగనేరదనియు నెన్నవలెను.

'ద - ధ' ప్రాసకిచ్చిన కర్త పర్వపద్యములో 'లేఁదు - రూఢి' అనుచోటఁ దద్భవమగు రూఢిశబ్దమున్న దనుకున్నచో సమప్రాసమగును.

శ ష స ప్రాస (4 - 503) ఇందులకు కౌస్తుభాభరణాంకుని లక్షణము (ఇది లక్షణగ్రంథము కానోపు) సంగ్రహింపఁబడినది.

ఆ లక్షణమున, 'అసదృశ - సుషమ - విశద - అసమ' అనురీతి నీ ప్రాస మైత్రికి లక్ష్యమున్నది. మఱి యిందులకుఁ జూపిన 'బిసరుహాగర్భు - దశరథసూను' అను లక్ష్యము శబ్దశాసనుని ఆదిపర్వములోనిదను శిరోమణిగ్రంథనిర్దేశము ప్రమాదపతితము. ఇయ్యది భీమకవిచాటుధార భీమనచాటుపద్యములో నీప్రాసవిశేష మున్నది గాని యతని ఛందమున నిట్టిప్రాస చెప్పఁబడలేదు. శకారప్రాస యనుపేర రంగకవి, యన్యోన్యప్రాస యనుపేర వార్తాకవి రఘునాథయ్య దీనిని జెప్పిరి. అప్పకవి 'స - ష' ల కుభయప్రాస నుపదేశించెఁగాని శ స లకు శ ష లకుఁ బ్రాస యతనికి సమ్మతముగాదు.

శ - స ప్రాసకుఁ బ్రాచీన ప్రయోగములు గలవు.

వ్రేసియు — కీశులు (భా - రామా - యుద్ధ -        )

సంసారశ్రమ — వంశంబీ (హర - 2-111)

కంసుని — వంశము (ఎఱ్ఱన హరి - పూర్వ - 9-87)

భూసుర — దేశిక (భాగవత - 10. ఉ -        )

అభేదప్రాస (4-158) దీనిని విడిగాఁ జెప్పక శిరోమణికర్త అభేదయతిక్రిందఁ బ్రస్తావించెను. ల ళ, ల డ, ర ల ఇత్యాదులతో 'వ - ప' లనుగూడ నిందు గ్రహించె. 'వ - ప' లకుఁ బ్రాసఁగూర్చిన ప్రయోగములు మృగ్యములు.

ఇందే 'ర - ల' ప్రాసమైత్రి చెప్పఁబడినదిగాని లక్ష్యములేదు. మఱి 'ర [illegible] ప్రాస లక్ష్యము వేఱుగా నిందే యన్యత్ర వ్రాసియున్నది. దాని 'ర - ల' ప్రాసక్రిందఁ జెప్పి యుండవలసినది. 'ర - ల' ప్రాస కొసఁగిన తిక్కనపద్యములో —

'వారి యెలుంగుమాచి ... (4-472) మీలిత విక్రముండు ...' అను శిరోమణి పాఠమునకు ర - ల ప్రాసలేని 'వాలియెలుంగు ... మీలిత' అను సమప్రాసగల పాఠము ముద్రిత భారతములోఁ గానవచ్చుచున్నది.

ఈ ఛందస్సంబంధ ప్రాసభేదముల ప్రసంగము తరువాత శబ్దాలంకార ప్రాస షట్క ముపన్యసింపఁబడినది. అందు సుకరప్రాసానంతరము అర్ధబిందుప్రాస గలదు. అది యింతకుముందు చెప్పిన యర్ధబిందు నిర్బిందు ప్రాసగాదు. (8)

ఇది యిట్లున్నది. (4 458)

క॥ తొలఁకుచు నుండిన ....
కొలఁకుల కడ ...
కెలఁకుల నాడుచు ....
తలఁకక యున ....

అర్ధబిందుప్రాస యన్నచోఁ బాదప్రథమాక్షరముమీఁద అనఁగాఁ బ్రాసాక్షరమునకుఁ బూర్వము అర్ధబిందు వుండవలె. ఇట్లున్న నయ్యది యర్ధబిందు సమప్రాసకే చెందును. పొత్తపికవి యర్ధబిందుప్రాస యన్నకవిచెప్పిన ఖండాఖండ ప్రాసయగును. మఱి యీ యర్ధబిందుప్రాస దానికి విలక్షణము. ఇందుఁ బ్రాసాక్షరముమీఁద నర్ధబిందువు నాల్గుపాదముల సమానముగా నున్నది. ఇది ద్విప్రాసకుఁ జెందును.

ప్రాసభేదముల మధ్యలో లఘువుమీఁద అర్ధబిందుప్రాస ప్రయోగములని రెండు లక్ష్యపద్యము లున్నవి. అందలి పాదాదిశబ్దములు మాత్రము ప్రసక్తమగుటచేఁ జూపఁబడును.

1. కడకన్నెట్టని    2. ఎక్కుడుకోపంబున
3. కడిఖండఖంబులు    4. పెక్కమ్ముతే, యుడు (4-410)

ఇందు 4-వ పాదమున లఘువుమీఁద నర్ధబిందువునకు లక్ష్యమని శిరోమణి సూచన. అనఁగా 'ఏయుఁదుఁ' అనుశబ్దమున నరసున్న యున్నదనుట. ఏయుదుఁ - అనంతర్యార్థకము. ఇందలి డు వర్ణకమునకుఁ బూర్వ మర్ధబిందువులేదు. కాని యీ శిరోమణికారుని మతమున నరసున్న యున్నదనక తప్పదు. కొన్ని ప్రాచీన లిఖిత ప్రతులలో 'నావుడు' అనుచోట 'నావుండు' అని కానవచ్చెడు. అప్పట్టున నావుఁడు పార్ధబిందుక మనవలెను.

'అనవుండు, నావుండు' అను రూపములను మంచెళ్ల వాసుదేవకవి [1]వైకృత చంద్రికలోని యీ క్రింది సూత్రము సాధించుచున్నది.

1. వైకృతచంద్రిక - ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ - హైదరాబాదువారి ప్రచురణ.

'అవుందోరనః' తిజంత విభాగము - 80 సూ. 'అనఇ త్యస్మాత్పరస్య అవుందోర తోలుక్స్యాత్'. అనవుందు, నావుందు అని వృత్తి. (అన - అనుదానికి అవుందు (అవు + ఉందు) పరమగునపుడు అకారమునకు లోపమువచ్చును. (అనవుందు - నావుందు)

నృగుఁడజా — మృగయా — పో, యగహవ — చం, పెగవయ సింహ (4.411) 4-వ పాదాన లక్ష్యమని శిరోమణి సూచన.

'చంపెగవయ' లో వరసున్న యుండుటకు మార్గములేదు. గవయశబ్దము సంస్కృతము గవేరాది. ఈ లక్ష్యమొసఁగుట పొరపాటనవలెను.

## శబ్దరూపభేద ప్రదర్శనము

ప్రధానప్రాసభేదముల ప్రసంగానంతరము కతిపయశబ్దరూపముల నిరూపించుచు శిరోమణి వాటికి నిర్ధారకములుగఁ బ్రాసస్థల ప్రయోగములఁ బ్రదర్శించెను. ఈ భాగము ఛందస్సులో వ్యాకరణప్రస్తావ మనఁదగును. ఇదిగాక దీని తుదలోఁ గేవల వ్యాకరణ ప్రకరణము నున్నది.

తెలుఁగుశబ్దసిద్ధికి ఛందస్సు యతిప్రాసములే నిర్ధారకములనుట విజ్ఞులకు విదితచరమైనవిషయము.

శిరోమణి యీ క్రింది శబ్దరూపభేదములఁ బ్రదర్శించెను.

4 - 470 అయి - ఐ, అవు - ఔ, అయిదు - ఐదు, అవును - ఔను.

471 వసియించు - వసించు.

476 నవు - నవ్వు - నగవు; పువు - పువ్వు - పూవు - పూ.
తిగిచె - తివిచె; పగడము - పవడము, తగిలించె - తగిల్చె.

477 పువుఁదీఁగ - పువ్వుఁదీఁగ - పూఁదీఁగ.
దవు - దవ్వు.

487 కర్మువు - కర్మము, ధర్మువు - ధర్మము.

491 కను - కన్ను, కనుఁగవ - కన్నుఁగవ - కన్గవ - కన్నుంగవ.
కనుదోయి - కన్నుదోయి - కందోయి.

493 చివురు - చిగురు, నెవము - నెపము, నేతు - నేర్తు.
తీఁగ - తీవ, వెలతె - వెడలె.

494 చను - చన్ను, చన్నుఁగవ - చనుఁగవ - చన్గవ - చన్నుంగవ.
చందోయి - చనుదోయి - చన్నుదోయి.

500 జరజాత - జలజాత.

507 ఏవాఁడు - ఎవ్వాఁడు - ఎవఁడు.

510 పూంచె, మంచె, పంచె (సబిందుకములు)

కొన్ని రూపములకు లక్షణములు —

4 - 473 గ స డ ద వాదేశ వికల్పసంధి.

474 అచేతన ద్వితీయకు వికల్పప్రథమ - క్రతువుగాచె, క్రతువుఁగాచె.

478 మది తొలిహ్రస్వముపై అరసున్న యుండదు. 'అఁట' లో మాత్రము కలదు.

485 భిన్నపద ప్రథమ పకారమునకు వకారము.
ప్రాసలో నిత్యము, యతిలో నిషిద్ధము, అన్యత్ర వైకల్పికము.

## వ్యా క ర ణ భా గ ము

ఇందు [1]అగస్త్యవ్యాకరణప్రస్తావనతో నాంధ్రవ్యాకరణప్రకరణము ప్రారంభింపఁబడినది (4-514) ఇంతవఱకు ఈపేరి వ్యాకరణము కన్నదిగాదు విన్నయదిగాదు. ఇది వికృతివ్యాకరణమఁట. వికృతియనుట యాంధ్రభాషాసామాన్యమును నిర్దేశించును.

అథర్వణాచార్యుఁడు తన యాంధ్రవ్యాకరణకారికలను వికృతివివేకమని పేర్కొనియె. మఱి మంచెళ్ల వాసుదేవకవి రచించిన త్రిలింగవ్యాకరణమునకు వైకృతచంద్రిక యని నామకరణ మొనర్పఁబడినది.

---

1. ఈ అగస్త్యవ్యాకరణమునుగూర్చిన వివరములు మైసూరు విశ్వవిద్యాలయమునకు, జి. లలిత సమర్పించిన 'తెలుఁగు వ్యాకరణ సంప్రదాయ సమాలోచన' మను సిద్ధాంత వ్యాసగ్రంథమునఁ గానవగును. (July 1977)

వికృతిశబ్దము మన తెనుఁగువ్యాకర్తలు మూఁడు భిన్నార్థములలో నుపయోగించిరి. 1. సామాన్య (తత్సమ తద్భవ దేశ్యాత్మక)మగు ఆంధ్రభాష. 2. సంస్కృత సమేతరమైన యచ్చతెనుఁగు (తద్భవదేశ్యాత్మకము), 3. కేవలము తద్భవము — (ప్రకృతి - తత్సమము, వికృతి - తద్భవము).

పై వికృతి వ్యాకరణము సామాన్యాంధ్రభాషావ్యాకరణ మనుట యిందు గ్రాహ్యము.

## ఈ అగస్త్యుఁ డెవఁడు?

ఆంధ్రవ్యాకరణ వాఙ్మయములో — కణ్వుఁడు, బృహస్పతి, హేమచంద్రుఁడు, పుష్పదంతుఁడు, రావణుఁడు, కవిభల్లటుఁడు, సోమచంద్రుఁడు, ఈశ్వరముని, వాల్మీకి, ధర్మరాజు, నాగరాజు, ఇంద్రుఁడు, గౌతముఁడు ప్రభాకరుఁడు, విష్ణుశర్మ, శర్వ వర్మఁడు, శ్రీకవి, హరి, శృంగారభూషణుఁడు, శౌరికవి మున్నగు ఆంధ్రవ్యాకర్తల నామములు గానవచ్చుచున్నవి. కాని లక్షణశిరోమణిలోఁదప్ప అగస్త్యుని ప్రస్తావము మఱెందును గోచరింపదు.

తమిళవాఙ్మయమునఁ బ్రథమవ్యాకర్త అగస్త్యుఁడని ప్రతీతి. తెలుఁగువ్యాకరణము సంతరించిన యగస్త్య నాంధ్రసూరిలోక మింతవఱకెఱుంగదు. హొత్తపి రమణ కవి లక్షణశిరోమణియందు అగస్త్యప్రోక్తంబైన వికృతివ్యాకరణమునుండి కారిక లొసఁగఁబడినవి. ఆ యిచ్చిన కారికలలో తెలుఁగు - తెనుఁగు శబ్దములు త్రిలింగశబ్ద భవములుగా సాధితములు.

సంస్కృతమున రచితమైన ప్రతాపరుద్రయశోభూషణమను వలంకారగ్రంథమునకుఁ గర్తయగు విద్యానాథునకు అగస్త్యుఁడను నామమున్నట్లు దెలియుచున్నది. విద్యానాథుఁడన్నది బిరుద నామమనియు, నీతని తొలిపేరు అగస్త్యుఁడనియుఁ బరిశోధక పండితుల యభిప్రాయము.

సంస్కృత సాహిత్యమున సుగృహీతనాముఁడైన యీ యగస్త్యుఁడే లక్షణ శిరోమణికారుఁడు పేర్కొన్న వికృతివ్యాకరణనిర్మాత యగునేమో? ఆంధ్రుఁడును బహుగ్రంథకర్తయు లాక్షణికుఁడునైన అగస్త్యుఁడు ఆంధ్రవ్యాకర్త యగుటలో అబ్బురములేదు. ఈ వ్యాకరణారంభములో త్రిలింగశబ్దభవము తెలుఁగని నిరూ

వించుటయు, నందులకుఁ బ్రసక్తముగ నాంధ్రదేశమునకుఁ ద్రిలింగరాజ్యమను పేరు నిర్వచించుటయు నీ యూహకుఁ గొంత యుపబలముగానున్నది. 14-వ శతాబ్ది (క్రీ. శ. 1292-1323) పూర్వార్ధమున విలసిల్లిన విద్యానాథుఁడే త్రిలింగశబ్దమును ఆంధ్రరాజ్య పరముగాఁ బ్రథమమునఁ బ్రవేశపెట్టినవాఁడు. అతఁడు ప్రతాపరుద్రీయమున శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామములలోని మూఁడు శివలింగములవలన నీ (ఆంధ్ర) దేశమునకుఁ ద్రిలింగమను పేరు కలిగినట్లు వక్కాణించెను (చూ. యద్దేశ పృథివీమయాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా ... 4 అంక - 21 శ్లో).

ఈ వ్యాకరణమున శబ్దశాసనుని ఆంధ్రశబ్దచింతామణి అథర్వణాచార్యుల నామములు ప్రస్తావితములగుటచే నథర్వణానంతరమువాఁడు విద్యానాథ బిరుదాంకితుఁడునగు అగస్త్యుఁ డీ వికృతివ్యాకరణకారుఁడుగా ననుమానితుఁ డగుచున్నాఁడు. ఇది యూహమాత్రమే.

ఇం దుదాహృతమైన భాగమునుబట్టి యీ యగస్త్య వ్యాకరణము సంస్కృతములో సూత్రవృత్తిరూపముగా విరచితమైనదని యూహింపనగుచున్నది.

సంస్కృతభాషలో విరచితములయిన యాంధ్రవ్యాకరణములు పెక్కులు గలవు. అందుఁ గొన్ని — నన్నయ ఆంధ్రశబ్దచింతామణి, అథర్వణాచార్యుల త్రిలింగశబ్దానుశాసనము — వికృతివివేకము, త్రివిక్రమవ్యాకరణము, కవిశిరోభూషణము (అహోబల పండితీయము), శేషసుమతి ఆంధ్రవ్యాకరణము, మండలక్ష్మీనృసింహకవి ఆంధ్రకౌముది — త్రిలింగశబ్దానుశాసనము, మంచెళ్ల వాసుదేవకవి వైకృతచంద్రిక, (అర్వాచీనములలో) చిన్నయసూరి సూత్రాంధ్రవ్యాకరణము, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి హరికారికావళి, భాగవతుల రామమూర్తి హరికారికాశేష సర్వస్వము.

లక్షణశిరోమణిలో అగస్త్యవ్యాకరణమునుండి యుదాహృతాంశములు — ఆంధ్రభాష పంచవిధములు, త్రిలింగశబ్దభవము — తెలుఁగు - తెనుఁగు, రామశబ్ద తత్సమ (రాముఁడు) రూపసాధనము. ఈ రూపనిష్పత్తికిఁ జింతామణి సూత్రము లుదాహృతములు. శిరోమణి అథర్వణకారికలను ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానమని పేర్కొన్నది. 'వాచ మాంధ్ర మయీనాం యః' అను వాగనుశాసన (నన్నయ) స్తుతి శ్లోకము అథర్వణవ్యాఖ్యాన గ్రంథాదిలోనిదిగాఁ జెప్పి, ఆంధ్రకవనమునకు శబ్దశాసనుఁడే ముఖ్యమని ప్రశంసించినది.

## రేఫఱకార ప్రకారపద్ధతి

అగస్త్య వ్యాకరణ ప్రస్తావనానంతరము వ్యాకరణభాగ నిర్దేశపూర్వము రేఫఱ కార ప్రకార ముపన్యసింపఁబడెను.

ఆంధ్రశబ్ద చింతామణిలో నిట్లు సూత్రింపఁబడినది —

'లఘువోఽలఘవశ్చేతి ద్వేధాంతస్థా వ్విదంతి శాస్త్రారః
అన్యేఽన్య వ్యాకరణస్పృష్టార స్త్వత్ర గృహ్యతే ద్వివిధః
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్'

(సంజ్ఞ 19, 22).

అంతస్థములయిన య ర ల వ ళ లఘువులు అలఘువులని రెండువిధములు. య వ ల ళ లఘుత్వా లఘుత్వములు సంస్కృత ప్రాకృత వ్యాకరణోక్తములు తెలుఁగున గ్రాహ్యములు. రేఫకు లఘ్వలఘుతా ద్వైవిధ్యము తెలుఁగునమాత్రము గలదు. యి వ లకు లఘ్వలఘువులకు యతిప్రాసమైత్రి గలదు. కాని లఘ్వలఘురేఫలకు (ర - ఱ) మాత్రము వైధర్మ్యము గలదు. అనఁగా యతి ప్రాసమైత్రికి విరోధమని పై సూత్రాభిప్రాయము.

ఆదిమలక్షణగ్రంథమగు ఆం. శ. చింతామణి సూత్రముల ననుసరించికాఁబోలుఁ దరువాతి ఛందోలక్షణగ్రంథములలో 'ర - ఱ' యతిప్రాసమైత్రి నిషిద్ధమైనది. భీమనాది లాక్షణికులు ర - ఱ ల నెక్కటివడియందుఁ జెప్పిరి. వారిమతమున ర - ఱ యతి నిషిద్ధమనుట సిద్ధము. భీమన, విన్నకోట, అనంతుఁడు ర - ఱ ప్రాసవిషయము స్పృశింపలేదు. చిత్రకవి పెద్దన ఎక్కటియతియందు ర - ఱ లఁ బేర్కొని, రేఫ ఱకారములఁ బ్రాసమునఁ గలయఁగఁ జెప్పరాదని రేఫఱకార నిర్ణయప్రకరణమున నుగ్గడించెను. కవిచింతామణిలోఁ దాతంభట్టు 'ఇలరేఫఱకారప్పులు వళి చెల్లినఁ జెల్లుఁగాని వసుమతిఁ బ్రాసంబులు చెల్ల' వన్నాఁడు. అప్పకవి జ్ఞాతివైరంబుగలిగిన దేవదానవులతోఁబోల్చి రేఫఱకార యతిప్రాస సాంకర్యమును నిరసించె. సులక్షణ సార లక్షణదీపికలలో బావడి (ర - ఱ) యంగీకరింపఁబడినది. కూచిమంచి తిమ్మన శకటరేఫ ప్రకరణాదిలో రేఫఱకార సాంకర్యము సేయరాదని వచించి, యేతత్ప్రకర ణాంతములో అల్లసానిపెద్దనాదులు ర - ఱ లఁ గలిపిరని వారి ప్రయోగములఁ

గొన్నింటిని బ్రదర్శించెను. రంగకవి ర - ఱ లకు యతులుమాత్రము చెల్లవన్నాఁడు (3-272) లక్షణశిరోమణికారుఁడు చిత్రకవిపెద్దన మతమువాఁడుగాన నితనికి నుభయ రేఫ యతిప్రాస సాంకర్య మిష్టముగాదనుట స్పష్టము. రేఫ ఱకార ప్రకారపద్ధతి తుదలో 'రేఫ ఱకారంబులకు యతిప్రాసశ్లేషలకు విరుద్ధము' (4-572) అని వక్కాణించినాఁడు.

'ర - ఱ' ల సాంకర్యము సాధారణముగా నిషిద్ధమగుటచే నేయేశబ్దములలో సాధురేఫము శకటరేఫముగలదో కవులకు విస్పష్టముగాఁ దెలియవలసియున్నది. అందుచేతనే కొందఱు లాక్షణికులు రేఫ ఱకార శబ్దపట్టికల సమకూర్చిరి.

కొందఱు గ్రంథమునం దేకదేశముగాను, మఱికొందఱు ప్రత్యేక గ్రంథము గాను వంతరించిరి.

ఏకదేశముగా రేఫ ఱకార ప్రకరణము గలవి :—

లక్షణసారసంగ్రహము (చిత్రకవి 16 శతాబ్ది), అప్పకవీయము (17 శ.), లక్షణదీపిక (వార్తాకవి 17 శ.), లక్షణశిరోమణి (పొత్తపి 18 శ.), సర్వలక్షణ సారసంగ్రహము (కూచిమంచి 18 శ.).

ప్రత్యేక కృతులు :—

| | | |
|---|---|---|
| రేఫఱకారనిర్ణయము — తాళ్లపాక పెదతిరుమలయ్య | | (16 శ.) |
| రేఫఱకారనిర్ణయము — పెద్దపూఁడి భద్రన్న | | (?) |
| రేఫఱకారనిర్ణయము — గణపవరపు వేంకటకవి | | (17 శ.) |
| శకటరేఫావళి — చల్లా పేరయ్య | | (18 శ.) |
| శకటరేఫనిర్ణయము — భారతము లక్ష్మీపతి | | (18-19 శ.) |
| ద్విరేఫవర్ణదర్పణము — ఓగిరాల రంగనాథకవి | | (19-20 శ.) |

అలఘుకౌముదీత్యాద్యర్వాచీనకృతు లనేకములుగలవు. నన్నయభట్టాది ప్రాచీన ప్రామాణికకవులు యతిప్రాసస్థలములలోఁ బ్రయోగించిన రేఫఱకారశబ్దము లాధారముగా లాక్షణికులు ద్విరేఫనిర్ణయము నిర్వహించినారు.

లక్షణశిరోమణికారుఁడు చిత్రకవిపెద్దన లక్షణసారసంగ్రహమందలి రేఫఱకార నిర్ణయపద్యములనెల్లఁ దన గ్రంథమున సంగ్రహించి 'రేఫలు ఱకారములు చెప్పలేక

కాదు ... ఘనుల లక్షణములు ప్రాయఁజనుట యుత్తమ' మని (4.570) ప్రశస్త కారణమును వచించెను. ఇందేకాదు, ఈకవి ఛందో (యతిప్రాసవృత్తాది) లక్షణము లందును నితరలాక్షణికుల లక్షణము లుద్ధరించెను.

రేఫఅకార ప్రకరణాంతమున రేఫసంబంధి చింతామణి సూత్రములను అధర్వణ కారికల నుదాహరించెను.

హొత్తపికవి సంస్కృత తత్సమ తద్భవములలో రేఫలు గలవుగాని శకటములు లేవని యాదిలో సూచించెను (4-517). సంస్కృత తత్సమములలో బండిఱా లేమి విదితము; చెప్పఁబనిలేదు. స్పష్టార్థము చెప్పినాఁ డనవలె.

తద్భవములలో బండిఱా లేదని కొందఱు, ఉన్నదని కొందఱు వక్కాణించిరి. లేదన్నవారు - అప్పకవి, అహోబలపతి, దిట్టకవి వేంకటార్యుఁడు, ఆదిదము సూర కవి, చిన్నయసూరి.

ఇటీవలి ప్రౌఢవ్యాకర్త 'తద్భవములం దలఘురేఫము కల' దని సోదాహరణ ముగ సూత్రించెను. ప్రాచీన లాక్షణికుల మతమునఁ దద్భవములలో నలఘురేఫము లేదనుట సిద్ధాంతము.

ఇం దీ క్రిందివిషయము గమనింపఁదగినది —

రేఫ ఱకారంబులకు నన్నయభట్టుగారి ఆంధ్రకవిచింతామణియందు శ్లోకము

'తత్సమగస్తద్భవగో, దీర్ఘైకాక్షరగశ్చ రేఫస్స్యాత్,
నాన్యేషాం వైధర్మ్యం, లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్.' (4 571)

అని యొసఁగఁబడినది పై శ్లోక పూర్వార్ధము నేఁడు లభించు చింతామణియందుఁగాని బాలసరస్వతీయాప్పకవీయాహోబలపండితీయములందుఁగాని కానరాదు; అపూర్వము.

బాలసరస్వతీయాహోబలపండితీయములలో 'నాన్యేషాం ... నిత్యంస్యాత్' అనుదళము పూర్వార్ధముగను, 'అద్దంత్యస్తాలవ్యశ్చ ర్వక్రః స్యాన్మిథ స్సవర్ణశ్చ' అన్నది యుత్తరార్ధముగను జతపఱుపఁబడియున్నది.

అప్పకవీయ చింతామణిలో 'క్వచిదపి నస్త ఉచోతౌ దంతోష్ఠభవస్య వికృతి శబ్దాదౌ' అన్నది (ఇది క్రొత్తది) పూర్వార్ధముగను, నాన్యేషా మిత్యాది యుత్తరార్ధము

గము నున్నది. బాలసరస్వ త్యప్పకవి చింతామణి పాఠములలోఁ బరస్పరము భేదములు గానవచ్చెడు. శ్లోకములలో న్యూనాధిక్యములు గలవు. కాన శిరోమణికారుఁ డొసఁగిన తత్త్వమగ ఇత్యాది శ్లోకపాదము ప్రక్షిప్తమన వీలులేదు. అట్లైన మఱి యెందును గానరాని చింతామణి శ్లోకభాగమొకటి క్రొత్తగా లభించెనని హర్షింపవలెను. ఆంధ్రశబ్ద చింతామణికి ఆంధ్రకవిచింతామణి యను నామాంతరముగూడఁ గలదేమో!

దీర్ఘాక్షరైకాక్షరములమీఁద బండిఱాలు లేవనుచున్నది పై సూత్రము. ఈ యాంధ్రకవి (శబ్ద) చింతామణి ననుసరించియే కావలయుఁ దాతంభట్టు తన కవి చింతామణిలో.

'దీర్ఘములమీఁద బండిఱాలు లేవు పద్మనాభ' (2.1) అని వచించెను. దిట్టకవి వేంకటార్యుఁడు నట్లే దీని నామ్రేడించెను. అప్పకవి కూచిమంచికవులు తాతంభట్టు లక్షణమును విరసించి దీర్ఘములపై బండిఱాలుగల పదములను బ్రయోగములను బ్రదర్శించిరి. (చూ. అప్ప - 2 ఆ - 197; కూచిమంచి - స. ల. సా. సం. 3 ఆ - 7 ప.)

నన్నయభట్టు భారతభాగములో దీర్ఘపూర్వక శకటరేఫ ప్రాసయొక్క పద్యముఁ బ్రయుక్తము.

కాఱడవి - నూఱడక - శ్రమం బాఱఁగ - తీఱఁగ (ఆది - 4 - 19). శకటరేఫ నిర్ణయగ్రంథకర్త 'దీర్ఘాత్పరే రేఫఏవ, నభవే చ్ఛకటః క్వచిత్' అను లక్షణ మేర్పఱచి, పై నన్నయ పద్యములోని 'కాఱడవి' ఇత్యాదులలోని శకటరేఫములను 'కారడవి - ఊరడక' అనురీతి లఘురేఫములుగాఁ జూపెను. పొత్తపికవి యుద్ధరించిన చిత్రకవిపెద్దన చెప్పిన రేఫ అకార ప్రకారములో దీర్ఘములపై బండిఱాలుగల శబ్దము లొసఁగఁబడుటయేకాక, 'ఊఱడు, తీఱఁగ' ఇత్యాది నన్నయప్రయుక్త శకటరేఫాన్విత శబ్దములు బండిఱాలక్రిందనే సంగ్రహింపబడ్డవి.

ఇఁక ఏకాక్షరపరకత్వమున శకటరేఫలు లేవనుటఁగూర్చి యొకమాట — ఏకాక్షరశబ్దములలో రెండవ యక్షరమునకు స్థానము లేదుగదా? అట్లుండఁగా నేకాక్షర పరరేఫ కాస్కార మెందుఁగలదు?

క్రియాపదాంతములలో (వ్రాసిరి, వచ్చిరి) లఘురేఫలు. ద్విత్వములో (నఱ్ఱు, గుఱ్ఱము) శకటరేఫము నుండునని చెప్పఁబడినది.

'అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ క గ చ జ త ద న ప బ మ వ స' అను 22 అక్షరములపై రేఫఱకారములు వచ్చునని, తక్కిన యక్కరములపై లఘురేఫము లుండును శకటరేఫములు లేవని తెలుపఁబడెను. తరువాత అకారాదిక్రమమున రేఫఱకారములుగల పదములపట్టిక సమకూర్పఁబడినది. ఇచ్చిన పట్టికనుబట్టి ఈ ఏ ఓ స లపై ఱకారములు గానరావు. జకారముపై లఘురేఫము లేదు. ఈఱతాఱలు, ఏ ఱు - ఈ ఏ లపై ఱాలు, జరగు - జకారముపై రేఫ గానవచ్చెడు.

కాలక్రమమున యతిప్రాసలలో నుభయరేఫ సాంకర్యము నంఘటిల్లి కొన్నింటికి ద్వైరూప్యము సమ్మతింపఁబడి యుభయరేఫయతి ప్రాసమైత్రి యంగీకృతమయి యిటీవల శకటరేఫ లేఖన సయితము పరిహరింపఁబడినది.

ఈ ప్రకరణాంతమున —

'లఘవ శ్శిఖిశైలాగ్నయోన్యే ఖగజబర్హిషః
లఘుర్నాప్తి జకారస్యా లఘుస్సన్య క్వచిత్క్వచిత్'. (4.5‌1)

అను నథర్వణకారిక నన్నయభట్టాంధ్రకవిచింతామణి లోనిదిగా సంగ్రహింపఁబడినది.

ఇందలి పూర్వార్ధమునకు — శిఖిశైలాగ్ని = 373 తెలుఁగున రేఫలు, ఖ గ జ బర్హిషః 380 ఱకారములు గలిగియుండునని టీక తెలుపుచున్నది. తెలుఁగున రేఫఱకారయుక్తశబ్దము లెన్నియున్నవో యీ కారిక నిర్దేశించుచున్నది. ఇట్టి యర్థమునే యహోబల పండితుఁడు వ్రాసెను. ద్విరేఫదర్పణకర్త రంగనాథకవియు నిట్లే సంఖ్యాపరమున నర్థము వివరించెను.

అథర్వణుఁడు నన్నయభారతభాగ యతిప్రాసస్థలఘటిత రేఫఱకారశబ్దములనే యెన్నెననియు నయ్యవి యథర్వణుని కారికలోని సంఖ్యలకు సరిపడియుండలేదనియు 'శాఖి (శిఖి కాదు) - ఉసిరిక - నేరెడు (తరువాచకము), శైలి - తరిగొండ, అగ్ని - ఎరగలి' ఇత్యాదిగా ఆ యా పదార్థముల తెలుఁగుపేర్ల రేఫఱకారము లున్నవని యరయవలెనని వజ్ఝలవారి సిద్ధాంతము (చూ. ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వము - 58 - IV విషయము). ఇది వివాదాస్పదము. చిత్రకవి పెద్దనయు (శిరోమణి సంగ్రహించిన) రేఫఱకార ప్రకారములో అకారాద్యక్షరములపై నెన్నెన్ని 'ర - ఱ'లు గలవో పేర్కొనఁబడియె. ఏ యే యక్షరములమీఁద లఘ్వలఘురేఫలు గలవో యా

విషయమును సూత్రించి, తరువాత 'లఘువళ్ళి' అనుకారికను రచించె నథర్వణుఁడు. ఈ సందర్భమునఁ బ్రాచీన సంప్రదాయముంబట్టి సంఖ్యాపరముగ నర్థముచేయుటే ప్రకరణోచితమని తోఁచెడు.

## విభక్తిపద్ధతి

ఇందు విభక్త్యంత శబ్దరూపములు ప్రయోగ పురస్సరముగఁ బ్రదర్శితములు.

4 _ 573 పులకలు - పులకములు, అలకలు - అలకములు, హంసలు - హంసములు, తరంగలు - తరంగములు. వీనికి మువర్ణకలోపము వికల్పము. ఇట్టి పద్యమే కవిసంజీవనిలో నున్నది (2-7). దానిఛాయ యిది.

ఇందు తరగ లను రూపముగూడ నొసఁగఁబడినది తరంగశబ్దమునకు వైకృతము తరఁగ; సంస్కృత తరంగశబ్దమునకు తరఁగ రూపభేదము కాదు.

4 _ 578 రఘు - రఘువు, బాహు - బాహువు, రాహు - రాహువు, ఊరు - ఊరువు, మేరు-మేరువు (వువర్ణక లోపము) ప్రాచీన లాక్షణికు లిట్లే చెప్పిరి ప్రథమైక వచనాంతమున వువర్ణకలోపము రాహు బాహు శబ్దద్వయమునకే కలదు. తక్కినవారికిఁ బ్రథమైకవచనేతర విభక్తిలోనే వువర్ణలోపము ప్రాప్తించును.

4 _ 584 కొన్ని యమహత్తులకు మహద్వివక్ష (తిర్యక్పదములు పురుషవాచకములై పరఁగును) ఉరగులు, సముద్రుఁడు.

587 చరిత - చరితము. మువర్ణక వికల్పలోపము.

589 కంటె పరకత్వమున నవర్ణలోప వికల్పత.
విష్ణునకంటె - విష్ణుకంటె.

591 కేలు - విశేష్యైకవచనము, ఇరులు - విత్యబహువచనము.
కేలులు, కేళ్లు అను బహువచనరూపములు ప్రయోగదృష్టములు.
ఇరులువ - అవి యేకవచన ప్రయోగమునుగలదు.

కేలుల (విష్ణుపురా - 3 - 101), కేళ్ల (ఆముక్త - 4 - 2)
ఇరులున (విజ్ఞాన - ప్రా - 105)

592 విశేషణంబుల షష్ఠికిఁ బ్రథమ.
ఉ॥ బాహుబలుఁడు వీరజాక్షునకు.

594 మహతీతర స్త్రీలింగ విశేషణము లుభయవిధములు.
ఉ॥ యశోదాతనయ కృపాదృష్టి సౌఖ్యదాయకము.

596 అప్రాణివాచక విశేషణముల బహువచనమున కేకవచనము రావచ్చును.
ఉ॥ హరికీర్తితతులు విఖ్యాతము.

## విభక్తిసంధి క్రమలక్షణము

అచ్చంధియందుఁ బొల్లనకారమునకు ద్విత్వము.
ఉ॥ హరియించు న్నఘములు.
ఇది కవిసంజీవని లక్షణము. భీమనానంతాది లాక్షణికులు ద్రుతద్విత్వ సంధిని దుస్సంధియని దోషప్రకరణమునఁ జెప్పిరి.

4 - 602. అచ్చుపైనచ్చు సంధి సేయంగవచ్చు.
ఉ॥ శౌరిచ్చు, ఎంతధికము, కినుకుడుగు, కృష్ణుఁడనఁగ.
'శౌరిచ్చు' వంటి తత్సమస్వరములకు సంధిలేదని లాక్షణిక మతము. 'కుత్రచి త్సంస్కృతీయోపి ప్రాణోప్యత్ర చ్యుతోభవే' త్తని యాథర్వణము. కొన్నియెడల సంధిగలదనుచున్నది. దీని కర్వాచీన ప్రయోగము లసంఖ్యాతములు. పొత్తపికవి ధారాళముగా నుపయోగించె.

4 - 604 కొన్నియచ్చులపై యకారాగమము వచ్చును.
ఉ॥ అబలాయేలె, ఇచ్చయపూర్వము. అది యచ్చెరువు.
తెలుఁగున సంస్కృత శబ్దప్రయోగము.

4 - 605 సంస్కృత క్రియలు, విభక్తులు, అవ్యయములు ఒకచోఁ దెలుఁగున నిష్టము. ఉ॥ మనసా భజింతు, విష్ణుదూపాయ నమశ్శివాయ యని.

సంస్కృత విభక్తి క్రియావ్యయములు తెలుఁగునఁ బ్రయోగింపరాదని ప్రాచీన లాక్షణికానుశాసనము. అనుకరణసహితముగాఁ బ్రయోగింప వచ్చును. కాన రెండవ యుదాహృతి సాధువు.

4 - 609 రాజన్‌శబ్ద జకారలోపము.

ఉ॥ రాయంచ, రారాజు వలరాయఁడు.

4 - 609 రాజన్‌శబ్దము తత్సమమున 'రాజు' అగును. 'రా, రాచ, రాయ' అన్నవి రాజశబ్ద తద్భవములు. వృత్తియందుఁదద్భవ 'రాచ' శబ్దములోని చ వర్ణము లోపించును. ఇది తత్సమతద్భవ విషయకము. లక్షణమున స్పష్టముగాదు.

## సంధి సమాస విచారము

ఇఁక నిక్కడనుండి (4 : 611 - 696) తుదవఱకు (ఉపలబ్ధ భాగమువఱకు) సంధిసమాసాది వ్యాకరణాంశములు దెలుపఁబడినవి. ఈ పద్యము లన్నియు ననంతుని ఛందము చతుర్థాశ్వాసములోనివి యథాతథముగ నుద్ధరింపఁబడ్డవి.

సమాసములవఱకుఁగల గ్రంథమే మనకు లభించినది. ఆతరువాత దశవిధ దోషములు, నవరసనంగతులు, చ జ య వ స ర వర్ణసంకేతములు, వట్రువలు ఱకారలుగల శబ్దములు చిత్రకవితావిశేషములు అనునంశము లుండవలెనని చతుర్థాశ్వాస విషయసూచికా పద్యమువలనఁ (6) దెలియవచ్చుచున్నది.

కవి వ్యాకరణాధికారమును ఛందమునుండి వేర్పఱచి ప్రత్యేక పంచమాశ్వాసముగా నిర్మించియున్న యుక్తముగానుండును. మీఁదు మిక్కిలి యప్పకవివలె విషయానుపూర్వి పాటింపఁబడియున్న రమ్యముగా నుండెడిది. మొత్తముమీఁద నీశిరోమణి లాక్షణికాగ్రణులకు వాఙ్మయచరిత్ర పరిశోధకులకు నత్యంతోపకారకము.

## చిత్రకవిత్వము

లక్షణశిరోమణిలోఁ జిత్రకవితారీతులు కొన్ని ప్రదర్శితములు. ఆశు, మధుర చిత్ర, విస్తరములని కవిత చతుర్విధము.

ఆశుకవిత — కలము కాగితము లేక యడిగినవెంటనే యాశువుగఁ జెప్పెడు కవిత. అష్టావధాన, శతావధాన, ఘటికాశత గ్రంథకల్పనాదు లీ తెగకుఁజెందినవి.

మధురకవిత — దేశికవితాభేదములగు పదములు, గేయములు, రగడలు, ఉదాహరణములు మున్నగు రచనావిశేషము.

విస్తరకవిత — పురాణప్రబంధాది విరచన.

చిత్రకవిత — శబ్దవర్ణచిత్రరచనలు, గర్భబంధకవిత లిందుఁజేరును. ఏకాక్షరి, ద్వ్యక్షరి, పాదభ్రమకము, పాదగోపనము, నిరోష్ఠ్యము, అనులోమవిలోమము ఇత్యాదులు శబ్దాక్షర చిత్రకవితయగును. ఒక పెద్ద పద్యగర్భములో మఱియొకటి రెండు పద్యముల నిముడ్చుట గర్భకవిత. చంపకములో గీత కందములు గర్భితములుగా వచ్చును. పద్మ చక్ర నాగాకారముల చిత్రముల యిండ్లలో నక్షరముల నిమిడించుట బంధకవిత.

తెలుఁగు చిత్రకవితకు సంస్కృత చిత్రకవితయే మాతృక. వ్యంగ్యస్పర్శలేని చిత్రకావ్య మధమకావ్యమని సంస్కృతాలంకారికుల యుద్ఘాటనము. రసాపకర్షకమను మాట యటుండఁగాఁ జిత్రకవిత యొక వినోదరచన, శబ్దాలంకారము. అందుచేతనే సంస్కృత సాహిత్య లక్షణగ్రంథములలోఁ జిత్రకవితారీతులు ప్రదర్శితములు. మాఘ భారవి మహాకావ్యములలోను యమకరత్నాకరాది గ్రంథములలోను జిత్రకవిత సంతరింపఁబడియున్నది.

కవితలో వైవిధ్యము మనఆహ్లాదప్రదము. 'ఆశుకవిత్వంబు లల్లితేనేసరా చిత్రప్రబంధముల్ సేయవలదె' అని ముద్దుపళని కవయిత్రి రాధికాసాంత్వమున నుగ్గడించె.

'కవులమం చంతింతగా నల్లితేగాదు, చిత్రప్రబంధముల్ చేయవలయు' నని వేణుగోపాలశతకకర్త పోలిపెద్ది వెంకట్రాయకవి యానతిచ్చెను.

చదువరులకు రుచిభేదము కలిగించుటకై యట్టి చిత్రకవితారచనను మహాకవు లాంధ్రవాఙ్మయమున నన్నెచోడుని కాలమునుండి యీనాఁటివఱకుఁ గొంచెముగనో గొప్పగనో ప్రదర్శించుచు వచ్చెదరు.

చిత్రకవితాప్రక్రియను బ్రదర్శించిన తెలుఁగు గ్రంథములు — కావ్యాలంకార చూడామణి, చిత్రకవి లక్షణసారసంగ్రహము, నరసభూపాలీయము, అప్పకవీయము

(ఇవి లక్షణగ్రంథములు), నన్నెచోడ కుమారసంభవము, జైమినిభారతము, పారిజాతాపహరణము, కలాపూర్ణోదయము, రసికజనమనోభిరామము, కవిరాజమనోరంజనము, దశావతారచరిత్ర, ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము - మున్నగునవి యెన్నఁదగినవి. ఇందుఁ బ్రబంధరాజమునఁ జిత్రకవిత పరాకాష్ఠనందినది. శిరోమణికారుఁ బ్రబంధరాజ చిత్రకవితాపద్యము లుదాహృతములు.

చిత్రకవిత తెలుఁగు వాఙ్మయములోఁ బ్రత్యేకశాఖగాఁ బరిగణింపఁదగినది. దీనింగూర్చిన గ్రంథము నాచే సంతరింపఁబడుచున్నది.

శిరోమణికారుఁడు తృతీయాశ్వాసాదిలో 'చిత్రకవిత్వ వృత్త బంధరీతుఁ దేటగావించెద' నన్నాఁడు. కాని యా యాశ్వాసాంతములో 'చిత్రకవితా ప్రకారమ్ములు లక్షణలక్ష్యములు విశదమ్ముగా విశ్రమాధికారమను నాలుగవ యాశ్వాసంబునఁ దేటఁజేసెద' నని రచించె. మఱి చతుర్థాశ్వాసాదిలో 'చిత్రలక్షణ కవితావిశేషములను దేటఁజేసెద' నని వచించె.

రమణకవి చెప్పఁదలఁచిన చిత్రకవితావిశేషముల పట్టిక తృతీయాశ్వాసాంత వచనమున నిట్లున్నది (3-427).

'పాదభ్రమకము, సౌగంధికకుసుమమంజరీగర్భ శోత్పలమాలిక, కందగర్భిత చంపకమాల, వృత్తకందఖడ్గగర్భితసీసము, వృత్తకందగర్భితసీసము, మంగళమహాశ్రీ వనమయూరగర్భిత లయగ్రాహి, మణిగణనికర నవాక్షర కందత్రయ షడ్విధగర్భిత నరపిజవృత్తము, గీతగర్భితవృత్తము, ఖడ్గగర్భిత సుగంధివృత్తము, అత్వ - ఇత్వ - ఉత్వ - ఏత్వ - ఔత్వ కందములు, పద్యగుణితము, ఓష్ఠ్య నిరోష్ఠ్యము, జిహ్వాచల జిహ్వము, శంఖ - చక్ర - గదా - శార్ఙ్గ - ఛత్ర - చామర - యక్షయంత్ర - గోమూత్రికా - ఖడ్గ - కంకణ - నాగ - పద్మ - కాలచక్ర - హల - మణి - పుష్పమాలికా - పుష్పగుచ్ఛ - పంచావరణచ్ఛత్ర - రథ - మహామేరుచ్ఛత్ర - ఛురికా - దశావరణచక్ర మహాబంధములు - పాదగోపనము - ఏకపాద ద్విపాద త్రిపాద సంఘటనలు - కల్పిత కల్పవల్లి.

తృతీయాశ్వాసమునఁ జిత్రకవితావిశేషములఁ బేర్కొన్నాఁడు కాని లక్ష్యలక్షణములు విశదీకరించిన చతుర్థాశ్వాసము తుదిభాగము మన దురదృష్టమున నష్టమైనది. కాని యొకానొకప్రతిలో నొక పండ్రెండు చిత్రకవితాపద్యములు లభించెను.

అవి — చక్ర, నాగ, పద్మ, పుష్పమాలికా, గోమూత్రికా, ఛత్రబంధములు. ఓష్ఠ్యాచల జిహ్వాద్వ్యక్షరి, అనులోమ విలోమము, పాదగోపనము. గర్భకవితాపద్య మొక్కటియు నుపలబ్ధముగాదు. ఇందు రెండేసి నాగ, పద్మ పుష్పమాలికాబంధము లున్నవి. అందొక్కొక్కటి ప్రబంధరాజమునుండి యుద్ధరింపఁబడినవి. ఛత్రబంధము లక్షణము దానికిచ్చిన పద్యమునఁ బొసఁగకున్నది; పుష్పగుచ్ఛబంధముగా సంతరింపఁ బడినది. బంధచిత్రము లనుబంధమునఁ గూర్పఁబడినవి.

చిత్రకవితా ప్రయోజనమున కొక నిదర్శనము —

ఆంధ్రబిల్హణీయము పండిపెద్దికృష్ణస్వామి రచనగా గోచరించుచున్నది అందలి యవతారికలో చిత్రకవి పింగరార్యసూనుఁడు నారసింహకవి వచ్చి మెచ్చి కృష్ణస్వామిని బిల్హణకృతిని రచింపఁ బ్రోత్సహించి రచనలోఁ దోడ్పడినట్లు చెప్పఁబడినది ఆకృతి ప్రథమాశ్వాసాంతమునఁ జక్రబంధపద్యమున్నది. చక్రబంధమున 3-వ, 6-వ వలయము లందు కవిపేరు, గ్రంథముపేరు లేదా కృతిపతిపేరు రావలయును. బిల్హణీయచక్రబంధ తృతీయ వలయమున 'పింగరార్యకవి' పేరున్నది. దీనివలన పింగరార్యకవి రచించిన బిల్హణీయమును నాతని సూనుఁడు ద్రవ్యలోభమునఁ గృష్ణస్వామికి నవతారికాదుల మార్చి రచించి విక్రయించియుండునని తెలియఁగలదు. చక్రబంధములో కవిపేరు నిగూఢముగానున్న విషయము కృష్ణస్వామికిఁ దెలిపియుండదు. పింగరార్యకవి రచించిన రాఘవవాసుదేవీయద్వ్యర్థికావ్యమున (అముద్రితము - లిఖితప్రతి - మదరాసు ఓరియంటలు లైబ్రరీ ... డి. నెం. 688) తాను మున్ను బిల్హణీయమును జేసితినని చెప్పికొన్న పద్యముగలదు. చక్రబంధచిత్రకవిత వాఙ్మయచరిత్ర కెంతటి యుపయోగ కారియయ్యెనో కోవిదుల కెఱుక.

అంతేల? శిరోమణి లిఖితప్రతి తుదలోఁ బ్రత్యేకముగా లభించిన చిత్రకవితా పద్యములలోని చక్రబంధము 3 - 6 వలయములలో 'కవివేంకటాద్రి, ప్రబంధరాజము' అను పేర్లున్నవి. ఇది శిరోమణికారునిదని తొలుతఁ దోఁచెను. ప్రబంధరాజముపేరు చూచి యయ్యది గణపవరపు వేంకటకవి ప్రబంధరాజములోనిదేమో యని పరిశీలింపఁగా నది యందలిదని తెలియవచ్చె. పద్యమునకు శిరోమణితో నాకరము చెప్పఁబడదు. మఱి యట్లే పరిశీలింపఁగా నాగ, పద్మ, పుష్పమాలికా బంధములలో నొక్కొక్కటి ప్రబంధరాజమునుండి సంగ్రహింపఁబడినవని తెలియనయ్యెను. శిరోమణిలో ప్రబంధ

రాజమునుండి యుదాహృతులున్నవని తెలియుటకు దానిద్వారా కాలనిర్ణయమునకు సాధనమైన దీ చక్రబంధమే.

## గ్రంథ వైశిష్ట్యము

### లక్షణశిరోమణిలోని నూతనాంశములు

సాధారణముగా నితరాంధ్ర లక్షణగ్రంథములలోఁ జెప్పఁబడని విషయము లనేకము లీ శిరోమణిలోఁ గానవచ్చును. అయ్యవి యీ క్రిందివి :—

II ఆ.

1. రహసంయుక్తాక్షరపూర్వవర్ణము వికల్పముగా లఘువుకావచ్చు ననుట.
2. శత్రువధోపాయలక్షణక్రమము.
3. దుష్టగణసంయోగము - అట్టి సంయోగముగల కతిపయవృత్తనిర్దేశము.
4. బ్రహ్మత్రప్రయోగము.

III ఆ.

5. 26 అక్షరములకుఁ బైఁబడిన ఛందస్సులు. 27 మొదలు 36 వఱకు ఛందముల పేళ్లు.
6. ప వ యతులు, ద్వంద్వయతులు.
7. నూతనకల్పిత వృత్తములు.
8. ఉపరివృత్తములు (దర, లలిత, ఘనవినదములు).
9. విషమవృత్తలక్షణము - పొత్తపికవి వింగడించి కల్పించిన నూతన స్వస్థాన వృత్తములు.
10. శ్లోకలక్షణము.
11. 26 ఛందస్సులకు గురులఘుసంఖ్య.
12. అర్ధసమ - విషమవృత్తసంఖ్య.
13. కందభేదములలోఁ గొన్ని.

14. ఆర్యాకందము - లఘ్వంతపద్యము.
15. కంద గురులఘు సంఖ్యాక్రమము.
16. సీసగీతముల యుత్పత్తి - వానింగూర్చిన ఋగ్వేదబ్రాహ్మణ ప్రస్తావన (విషమసీసము నృపతికిఁ జెప్పరా దనుట).
17. విషమగీతులలో మలయగీతి.
18. ద్వాదశవిధసీసములలో - ఉత్సాహపేదంశ విషమసీసము, గీతరహిత చతుష్పాద్సీసము, అర్ధసమ సీసములో గీతిసమ్మేళనము, చతుర్మాత్రా గణాత్మక సర్వలఘుసీసము.
19. ఏకపద మంజరీద్విపద.
20. మహానవమి పద్యము.
21. శుద్ధమంజరి, కలియుగమంజరి.
22. కందవృత్త సీసమాలికలు.
23. పంచవిధ గద్యభేదములు.
24. ఏలాలక్షణము.

IV అ.

25. చరణాది విశ్రమస్థాన మను విర్వచనము.
26. యతిమైత్రికి సారూప్య సామీప్య స్థానసామ్యాది కారణములు.
27. దేశీయయతితో సంధిశేవి యేకపదమధ్యవ్యంజనముమీఁది స్వరముతో మైత్రి.
28. ప్రాసయతి చెల్లు పద్యముల విర్ధశము.
29. అభేదయతిలో ర - ల, ర - శ, ఱ - డ మైత్రి.
30. అభేదప్రాసలో ద - డ మైత్రి.
31. సావర్ణయతి.
32. అనుస్వారోష్మయతి.
33. దుష్యామనాపితయతి.

34. సంయుక్తయతిలో - ఋకార, కియ్యవడి, వట్రువసుడి, క్రారవడి, గిలుక ప్రస్తావన.

35. యుశవర్గద్వయయతి.

36. సవర్ణప్రాసయతి.

37. అలుక్సమాసయతి.

38. షష్ఠ్యతి.

39. ఋ - ఌ ప్రాస.

40. సావర్ణ్యప్రాస.

41. ర - ఱ ప్రాస.

42. శ - ష - స ప్రాస.

43. ద - ధ, బ - భ ప్రాసలు.

44. తెలుఁగులో అగస్త్యవ్యాకరణ ప్రస్తావన.

45. సంస్కృత విభక్త్యంతశబ్ద ప్రయోగము.

46. రాజశబ్ద జకారలోపము.

47. ఆంధ్రశబ్ద చింతామణిలో - 'తత్సమగ స్తద్భవగ' యను సూత్రము.

48. ఇవిగాక యటనట వచనములతో యతిప్రాసభేద సాదృశ్య సమీక్షలు - వాటిసంఖ్యలు - 4-73, 201, 245, 264, 275, 285.

## అజ్ఞాత గ్రంథములు - గ్రంథకర్తలు

శిరోమణివలనఁ గొన్ని యపూర్వాజ్ఞాత లక్ష్యలక్షణగ్రంథములు, అందలి పద్యములు, అజ్ఞాతకవుల నామధేయములు విజ్ఞాతము లగుచున్నవి.

పితిపారము (1-50)

భీమన ప్రార్థనాపంచాశము (4-64)

భీమన శివస్తుతి (4-147)

సర్వదేవుని ఆదిపురాణము (4-94, 226)

వరామృతం అప్పన బృందావనంభవము (4-128)

పురుషార్థసారము (4-151)
నందిసింగయతిమ్మన త్రిస్థలీదండకము (2-155)
శతపక్షిసంవాదము - లక్కాభట్టు (క్షేమేంద్రుఁడు) (4-348)
భీమన్నమిత్రపద్ధతి (4-158)
భాస్కరుని కందశతకము - అల్లయవేమ మకుటము (4-152)
వామనచరిత్ర (4.215)
సత్యావధూప్రీణయప్రబంధము - అల్లసాని పెద్దన (4.67)
కృష్ణగోపికాలంకారము (4.51)
సాగాభరణము (1.58)
ఉత్తమ గండచ్ఛందము - చిత్రపు భీమన (4.35, 78, 159)
ఉభయకవి లక్కాభట్ల లక్షణము (4.16)
ఆంధ్రకవితాపితామహుని అలంకారము (4-183)
కవికంఠపాశము (4-238)
ఛందస్సారసంగ్రహము (4-263, 267, 272)
కౌస్తుభాభరణాంకుని లక్షణము (4-503)
లక్షణతిలకము - లింగముగుంట రామన్న (1-196, 4-177)
లక్షణసారము - (4-306, 307)
అగస్త్యవ్యాకరణము (4 514)
వరకవి వేంకట్రామన్న (లక్షణకర్త) (5-266, 268)
ఏకభీమన (గ్రంథము ?) (4-98)

## కవులంగూర్చిన కొన్ని విషయములు

రంగనాథుఁడు — అచ్చవెల్లి రంగన్న రామాయణద్విపద (4-39); అచ్చవెల్లి రంగనాథుఁడు (4-221). ఇంటిపేరు అచ్చవెల్లి(ల్ల)వారని తెలియుచున్నది.

విన్నకోట పెద్దన — పిన్నకోట పెద్దిరాజు (4-481) ఒక్కస్థలమందు మాత్రము 'పిన్నకోట' అని యున్నది. తక్కినవట్టుల 'విన్నకోట' యనియే కలదు. ఇతని

కావ్యాలంకారచూడామణిని పెద్దిరాజు అలంకారమని లాక్షణికులు వ్యవహరించిరి. చిత్రకవి పెద్దన ల. సా. సంగ్రహమును పెద్దిరాజుఛంద మన్నారు. గణపవరపు వేంకటకవి తన యాంధ్రప్రయోగ రత్నాకరములో ‘పిన్నకోట’ అని లిఖించినాఁడు. లక్షణదీపికలోను నొకచో ‘పిన్నకోట’ అని కలదు.

గౌరన — కేతరాజు గౌరన్న హరిశ్చంద్రద్విపద (4-170) ‘పోతరాజు గౌరన’ అని వార్తాకవి లక్షణదీపిక. కవులచరిత్ర ప్రకారము గౌరనతండ్రి అయ్యలుమంత్రి, తల్లి పోతాంబ, పెదతండ్రి పోతనామాత్యుఁడు తల్లినిబట్టి పోతరాజయ్యెనా? మఱి కేతరాజెవ్వఁడు?

లింగమగుంట రామన్న — (61-117, 2-177, 4-306). లింగమగుంట తిమ్మకవి అన్నగారు రామన్న. తిమ్మకవి సులక్షణసారము రచించె. అన్న రామన్న లక్షణసార (తిలక)ము విరచించెఁ గావలెను......

లక్కాభట్టు — క్షేమేంద్రనామాంతర వ్యవహృతుఁడు. అది పౌరుషనామము గానోపు. ఉభయకవి బిరుదాంకితుఁడు, లక్షణగ్రంథకారుఁడు.

అల్లసాని పెద్దన - ఆంధ్రకవితాపితామహుఁడు — మనుచరిత్రనేకాక అలంకార (లక్షణ) గ్రంథమును, సత్యావధూప్రీణనప్రబంధమును సంతరించినట్లున్నది. ఆముక్తమాల్యదలోఁ గృష్ణరాయలు సంస్కృతమున సత్యావధూప్రీణనమును రచించెనని చెప్పఁబడినది. దానికిది యాంధ్రానువాదమా? అయ్యలరాజు రామభద్రుఁడు రాయల సకలకథాసారసంగ్రహమును దెనిఁగించె నందురు. పెద్దనయు సత్యాప్రీణనము దెలిఁగించెనేమో?

మూర్తి - రామరాజభూషణుఁడు — మూర్తికే రామరాజభూషణ బిరుదనామము. అళియరామరాజాశ్రయమువలన స్థిరపడెనని కవిచరిత్రకారుల యభిప్రాయము. ఈ రెండుపేళ్లొక్కరిదేయని కొందఱు, మఱికొందఱిద్దఱుకవులని తలంచెదరు. ఈ విచికిత్సకు సమాధాన మిందుఁగలదు. మూర్తి వసుచరిత్ర (4-367), మూర్తి నరస భూపాలీయము (4 462), నరసభూపాలీయ రామరాజభూషణము (1-16), వసుచరిత్ర నరసభూపాలీయములకర్త మూర్తియని పై నిర్దేశము లుల్లేఖించుచున్నవి. మీఁదు మిక్కిలి పై మూఁడవనిర్దేశము నరసభూపాలీయము రామరాజభూషణ ప్రణీతమనియుఁ దెల్లము సేయుచున్నది. ఈ యుల్లేఖమువలన మూర్తి రామరాజభూషణు లొక్కరే యనుట సిద్ధాంతితమగును.

భాస్కరుఁడు — వీరభద్రారెడ్డిఁ గలసిన కందశతకములో భాస్కరుఁడు చెప్పిన కందశతకము (4-152) అని యున్నది. 'అల్లయవేమా' అని మకుటము. ఈ భాస్కరుఁడెవఁడో ? హుళక్కిభాస్కరుఁడా ? అల్లయవేమారెడ్డి 15 శతాబ్దివాఁడు. వీరభద్ర వేమారెడ్లకు భాస్కరునికిఁగల సంబంధమును వాఙ్మయచరిత్రకారులు పరిశీలింతురుగాక.

నాచనసోమన (ఉత్తరహరివంశకర్త) అనవేమారెడ్డి యాస్థానకవి —

'కవితాకన్యకకెందును ... అనవేమనృపా' (2-168) అను చాటుపద్యము నాచనసోమునిదిగా శిరోమణి యొసఁగినది. ఈ పద్యముతోఁబాటు మఱి నాలుగుపద్యములు అనవేమనృపాలునిపైఁ జెప్పినవిగాఁ గర్తృనిర్దేశరహితముగా వేటూరివారి చాటుపద్యమణి మంజరి ప్రథమభాగములో (పు. 32) నొసఁగఁబడినవి.

అందలి రెండవపద్యము 'కొంచెపు జగములలోపల' అన్నది. ఇది సోమన పద్యమని దీనికి సంబంధించిన కథయొకటి గలదని మా తండ్రిగారు చెప్పిరి. ఆకథ యిది —

సోమన విజయదశమి వార్షికోత్సవ సందర్భమున సంవత్సరమున కొకసారి అనవేమనృపాలునియాస్థాని కరుదెంచి ప్రభువుపై నొక చిన్నపద్యముచెప్పి వార్షిక సంభావనమునుబడసి వెళ్లువాఁడఁట. ఆ కొలువులోని యితరకవులు ఏకైకదిన ప్రబంధ ఘటనాదక్షులు సోమనపై నసూయగొనిరి. ఈ నవ్వడినరసి ప్రభువు సంవత్సరమధ్యమున సోమనను బిలిపించి పద్యమెంతవఱకువచ్చినదో తెలుపఁగోరెను. అందులకు సోమన యీ పద్యభాగము నిట్లు చదివెను —

'కొంచెపు జగముల లోపల
నంచితముగ నీదుకీర్తి యనవేమనృపా!
మించెను' ............

వేముఁడు సోముని బంపివైచి యీ పద్యమును బూర్తిచేసి తెండని తక్కినకవుల కానతిచ్చెను. ఆకవు లాపద్యశేషమును బూరింప సముచితమైన యుపమానము స్ఫురింపనందునఁ బద్యభావము సరిగా దవిరి. విజయదశమినాఁడు విజయంచేసిన సోమన

'.... కరిముకురంబునఁ,
బంచాక్షరి శివుఁడు, హరిఁబ్రపంచమువోలెన్!'

అని పద్యమును బూర్తి చేసి ప్రత్యర్థికవుల కాశాపుట్టించి సన్మానితుఁ డయ్యెనఁట.

ఈ చాటుపద్యసంబంధికథ నాయెఱుకలో నెందును గ్రంథస్థముగాదు. చా. ప. మం. మంజరిలోని యనవేమునిమీఁది పద్యములు నాచనసోమునవని శిరోమణి యుల్లేఖము ద్వారా విదితమగును.

నాచనసోమన యనవేమారెడ్డి యాస్థానకవియని దీనఁ దెలియఁగలదు. సోమనను పేర్కొన్న బుక్కరాయలశాసనముకాలము క్రీ. శ. 1344 అని కవిచరిత్రకారులచే నిర్ణీతము. అనవేమునికాలము క్రీ. 1362-80. ఈ కాలములు సోమునికాలమునకు సరిపడుచున్నవి. ఈ యంశమును ఆంధ్రవాఙ్మయచరిత్రకారులు పరిశీలించి సంగ్రహింతురుగాత.

## శిరోమణిలో గమనింపఁదగిన విషయవిశేషములు

పూర్వకవి నామనిర్దేశమున 'గారు' అను మర్యాదావాచకము విధిగా నుపయోగించుట —

గారని పేర్కొన్నవారిలో అప్పకవిగారు ప్రథములు. అప్పకవీయములో రెండుచోట్ల 'గారు' శబ్దప్రయోగముగలదు.

సూరపరాజుగారు (2 137), నన్నయతిక్కనగార్లు (8-183). గణపవరపు వేంకటకవి యాంధ్రప్రయోగరత్నాకరములో (అముద్రితము - దీనిప్రతి - తంజావూరి గ్రంథాలయమునఁగలదు) కొన్నిపట్టుల 'గారు - వారు' ప్రయోగములు గాననగును.

'లక్షణకవి అప్పనగారి యథావాల్మీకిరామాయణమ్ము, చామకూరివారి సుభద్రా పరిణయము, పెద్దిరాజువారి కథాసారము'

కస్తూరిరంగకవి తనఛందములో 'ధూర్జటివారి కాళహస్తీశ్వరశతక' మని యొక్కచోఁ బేర్కొనె (రంగ - 3-27).

ఇఁక శిరోమణిలోనివి కొన్ని — చిత్రకవి పెద్దనగారు (1-39), భీమనగారు (1-41, 43), అనంతనగారు (2-33), వెల్లంకి తాతంభట్టుగారు (1-47), లింగము గుంట రామన్నగారు (2-177), ముద్దరాజు రామభద్రయ్యగారు (4-85), వార్తాకవి రఘునాథయ్యగారు (4 76).

మఱి అథర్వణాచార్యులు, కేదారభట్టాచార్యులు, భాస్కరాచార్యులు అని యాచార్యవాచకముతోఁ గొందఱను సంస్కృతభాషలో రచించినవారిని బేర్కొనెను.

ప్రబంధపరమేశ్వరుఁడు, శబ్దశాసనుఁడు, సోమయాజి, ఆంధ్రకవితాపితామహుఁడు అని బిరుదమాత్రముచేఁ బెద్దలఁ గొందఱిని బేర్కొనెను.

సర్వత్ర నియతితో గారని నామనిర్దేశమొనర్చి పూర్వులయెడ గౌరవము ప్రకటించిన యుదాత్త సంప్రదాయమొక శిరోమణికారునికే దక్కినది.

## ఉదాహృతగ్రంథ నామ నిర్దేశములో విశేషములు

ఇందుఁ గుండలీకరణములలోఁ బ్రచురమైనపేళ్లు చూపఁబడును —

దీపిక (లక్షణదీపిక), విష్ణుచిత్తీయము (ఆముక్తమాల్యద), పెద్దిరాజు అలంకారము (విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి), కవిసంజీవని, కవిలోక సంజీవని (కవిజనసంజీవని), కవిరాజగజాంకుశము (కవిగజాంకుశము), సుభద్రా పరిణయము (విజయవిలాసము), విక్రమార్కచరిత్ర (కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక ; ఇది జక్కన కృతికాదు), ఆంధ్రకవిచింతామణి (ఆంధ్రశబ్దచింతామణి), ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానము (అథర్వణకారికావళి).

ఆముక్తమాల్యద యాంధ్రకవితాపితామహ (అల్లసాని పెద్దన) కృతిగా నిర్దిష్టము. శిరోమణికారునికిఁ బూర్వులగు నప్పకవ్యాదులు నట్లే పేర్కొనిరి.

## ప్రయోగలక్ష్యపాద నిర్దేశము

శిరోమణియందు లక్షణములకుఁ జూపిన లక్ష్యపద్యములలో నాప్రయోగ మేపాదముననున్నదో యటనట మున్నుగా సూచింపఁబడియున్నది. ఈ పద్ధతి యీ కృతిలో సర్వత్ర నిర్వహింపఁబడినది. తక్కిన లక్షణగ్రంథములలో నీరీతి గానరాదు.[1] అందులకుఁ గొన్ని యుదాహరణలు —

---

1. మండ లక్ష్మీనృసింహకవి త్రిలింగశబ్దానుశాసనమున గ్రంథకర్తానందర్భ సహితముగ లక్ష్యప్రయోగములు నిర్దేశింపఁబడియున్నవి.

(4.65) సోమయాజి ప్రయోగము శాంతిపర్వము కందము 4-వ పాదమున నవర్ణమునకు జ్ఞా యతిలక్ష్యము.

(4.92) ఓలమానయనుటకు సోమయాజి అనుశాసనికము కందము 2-వ పాదమ్మున అఖండయతి ప్రయోగము లక్ష్యము.

(4-113) విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు ట త ప వర్గవులు మూఁటికి చంపకము 2-వ పాదమున 3-వ చరణమున 4-వ యడుగున విక్రమంబుగా బిందుప్రయోగము లక్ష్యము.

(4.410) లఘువుమీఁద అర్ధబిందుప్రాస ప్రయోగము ద్రోణపర్వము మత్తేభము 4-వ పాదమున లక్ష్యము. ఈ లక్ష్యమున వరుసగాఁ బాదాదిశబ్దము లివి —

కడకన్ను — ఎ, క్కుఁడు — కడిఖండంబు — పెక్కుప్పులే, యుఁడు

ఈ నిర్దేశమువలన - ఏయుఁడుఁగా - అను నానంతర్యార్థక డు వర్ణకము సార్ధబిందుకమని స్పష్టమగును. అట్లుగాకున్న నీ పద్యము లక్ష్యము కాఁజాలదు. అనంతర్యార్థక డు వర్ణకము నిర్బిందుకమని లాక్షణికాభిప్రాయము. ఈ నిర్దేశము లేకున్న నేపాదమం దేశబ్దము సార్ధబిందుకమో తెలియరాదు.

(4-430) ఆదిపర్వము కందము 4-వ పాదమున అర్ధబిందు నిర్బిందువులకు ప్రయోగము లక్ష్యము. ల. శి. లిఖితప్రతిలోఁ బద్యపాదాదు లిట్లున్నవి —

'వీంక — దాంకిన — మూక — ఆకరముగ'

ప్రాచీనలేఖన సంప్రదాయానుసారము 'వీంక, తాంకి' అనువానిని 'వీఁక, తాఁకి' అని సార్ధబిందుకములుగా గ్రహింపవలెను. నిర్దేశప్రకారము 'ఆకరము' లో నరసున్న యుండదు. మూఁకలో మున్నటనవలెను. మూక నిర్బిందుకము, ఆఁకరము సబిందుకమని కొందఱమతము. అప్పకవిమతమున 'మూక' నిర్బిందుకము. (చూ. అప్ప. 3-305. మూకలు విరియించి - వీఁక - ఖండాఖండ ప్రాసలక్ష్యము). అహంకారశబ్ద వైకృతము ఆఁకరము సబిందుకమని కొందఱు, అగ్రహాశబ్దభవము అకరము నిర్బిందుకమని కొందఱు మందలింతురు. శిరోమణిమతమున నిర్బిందుకము.

## సాధుపాఠోపలబ్ధి

శిరోమణి యనేక లక్ష్యలక్షణగ్రంథ పద్యముల నుదాహరించె. ఇందలి కొన్ని పాఠములు నేఁడు ముద్రితములైన యా యా గ్రంథపద్యపాఠములకన్న యుక్తతర

ములుగామన్నవి. కొన్ని లక్షణగ్రంథపద్యములలో లోపించిన పాదములు దీన లభించు చున్నవి. ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి యాంధ్రమహాభారత సంశోధితముద్రణ ములో నీ శిరోమణిలోని భారతపద్యోద్ధరణములు సంగ్రహింపఁబడవయ్యెను వారు పరిశీలించిన లక్షణగ్రంథ పట్టికలో నిది చేరలేదు. ఈ క్రింద నట్టి పాఠవిశేషములఁ గొన్నింటిని బ్రదర్శించెద.

(4 601) 'దీనినెట్టులఁ గ్రమ్మఱింతు మదీయ భాషణమెన్నఁడు
న్నెనమోఘముసుమ్ము దిగ్ధరణీందు భానులెఱుంగఁగన్.'

ఇయ్యది శబ్దశాసనుఁడు ఆదిపర్వము 4-వ పాదమున నకారపొల్లుమీఁద అచ్చు ప్రయోగలక్ష్యముగా నిర్దేశింపఁబడినది

ఈ పాఠము సంశోధిత ముద్రణమున సంగ్రహింపఁబడలేదు. తొందలి పాఠ మిది — 'భాషణమెన్నఁడు- న్నెనిమోఘముగాదు దిగ్ధరణీ రవీందు లెఱుంగఁగన్' ఈ పాఠమే స. ల. సా. సం. లో కూచిమంచి తిమ్మన నిత్యవడిలో హల్లుతోడి మైత్రికిచ్చిన యీ లక్ష్యపద్యములో నున్నది. 'ఎన్నఁడున్నెని' సంధిలోని వ్యంజన మునకు 'ధరణీరవీ' లోని 'ణీ' వర్ణమునకు యతి. శిరోమణి పాఠమున 'ఎన్నఁడు న్నెని .. ధర - ణీందు' స్వరయతి సంఘటితమైనది.

(4-583) వేదాద్రీశు నిరూఢిమందిరు జగద్విఖ్యాత కీర్తీశ్వరున్ — అని పాండురంగమాహాత్మ్యము (1-8) పద్యపాఠము. 'జగద్విఖ్యాత చారిత్రునిన్' అని ల. శి. పాఠము. కీర్తీశ్వరునికన్న చారిత్రుని పాఠము సరసము.

ప్రాసమైత్రి ప్రాసలో నుదాహృతమగు ననంతుని లక్షణములో 'అమరు వన్యోన్యమును ఋ యుతాయుతములు' అను పాదము (1-40) 'అమరు ఋ ౠ యుతాయుతము లన్యోన్యముగను' అను పాఠభేదముతో సంగ్రహింపఁబడ్డది (4-389). అనంతుని లక్షణ పాఠములో ఋకార మొక్కటే కలదు. శిరోమణి పాఠములో 'ఋ - ౠ' లు రెండున్నవి. ఈ రెంటికి శిరోమణిలో లక్ష్యములు గలవు.

శరభక్రీడ — ఇది పరస్థాన-విషమవృత్తము. చిత్రకవి పెద్దన ల. సా. సం. లోని పద్యము (2-38). అందు ముద్రణలో - 'చతుర్థాంఘ్రిన్ రాఁగా మ భ స య (సమాంచద్గణంబుల్)' అను పాదమున లుప్తభాగము పూరించి కుండలీకరణమునఁ జూపఁబడినది. 'మ భ స య' గణములున్నవి. కాని తుతోక య గణము గురు ద్వయముగూడ నుండవలె.

ల. శి. పాఠమిట్లు సమీచీనముగానున్నది (3-217)

'చతుర్థాంఘ్రికిఁ గాఁగా మ భ న య య చంచ ద్గ గంబుగా'

అపరవక్త్రవృత్తము (ల సా. సం. చిత్రకవి 2-28) అందుఁ బాఠ మిట్లున్నది —

'అనఘయనమమందు భద్రిక
స్జనపతి మాలిని సర్లయందు'

ఇందలి 'జనపతిమాలిని' యర్థరహితము.

'భద్రికగా, ఁబనఁబదమాలిని సర్లయందు' అను చక్కని పాఠము ల. శి. లోఁ గలదు. (3-214) ముద్రిత కవిసంజీవనిలో లేని నూతనపద్యము 'కృతులంగల్గుటఁజేసి ద్వ్యస్తరుపసర్గేభ్యోవ ఈత్ప్రక్రియా' (4-274) అను నాదేశయతి లక్షణపద్యము శిరోమణిలో నుదాహరింపఁబడినది.

ప్లుతవడి లక్షణపద్యము 'ప్లుతమనఁబరఁగు' అన్నది కవిజనాశ్రయమున (సంజ్ఞ - 70) ప్లుతయతినిజెప్పు 'దూరాహ్వానమునందు' అను పద్యము సధస్సూచిలోఁ బ్రక్షిప్తప్రాయముగాఁ జూపఁబడినది. శిరోమణి యుద్ధారమువలన నియ్యది మూలపద్యమని యెఱుఁగనగును.

(3-233) త్రిభంగి — కవిజనాశ్రయములోని లక్ష్యలక్షణపద్యము శిరోమణిలో సంగ్రహింపఁబడినది. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత కవిజనాశ్రయములో 'న న న న న స భ మ స గ' అను గణములతో 28 అక్షరముల త్రిభంగి ముద్రితము. ఇది ప్రమాదపతితము. 'న న న న న న న స భ మ స గ' అను గణములతో 36 అక్షరములుగలది త్రిభంగి. శిరోమణిలో 36 వర్ణములుగల త్రిభంగి పాఠమున్నది.

(4 335) పోలికవడి లక్షణము కవిజనాశ్రయములోనిది శిరోమణి గైకొన్నది. 'పోలికవడి శిల ముల్లమున కెనయనఁగా శిలంబుల్లంబనఁగా' అను పాఠము క. జ. మునఁగలదు. 'శిల మ్మమల మ్మనఁగా' అను శిరోమణిపాఠము హృద్యతరము. 'దావికెనగాఁగ నెమ్మిదే దళముఁగూర్చి' అని ల. సా. సం. పాఠము (2.142), 'ఎమ్మిదోదళముఁగూర్చి' అని ల. శి. పాఠము.

(3-371) కవి మూలపాఠము శబ్దదోషమని పరిష్కర్తలు మార్చినారనుట తెలియవచ్చెడు. ఏమ్మిదో। వంటి ప్రయోగాలు 17-18 శతాబ్ది కవు లవిరళముగాఁ బ్రయోగించియున్నారు.

ధీరులెఱిఁగి రచియింతురు (ల. సా. సం. 73 పుట) — దీనికి 'ధీరులివి తెలిసి పేతురు' అను పాఠము ల. శి. లో గానవచ్చెడు (3.369). 'చేతురు' అసాధు రూపమని యిటీవలి పరిష్కర్తలు ల. సా. సం. వ సవరించినారనుట తెల్లము.

ల. సా. సంగ్రహము 3 ఆ - 20, 25 పద్యములందు (రేఫఱకార నిర్ణయము) పాదములు పాదభాగములు లోపించినవి. ఆలుప్తభాగములు శిరోమణి యుద్ధారములలో లభించెడు.

దక్షిణాంతిక — ల. సా. సం. (2.115) పాఠములు సరిగాలేవు. వాని సాధు పాఠములు శిరోమణిలో లభించెడు (3.408).

(4-118) 'ఆలముచేసిన నగ్గెలువ' అను బిందుయతి లక్ష్యపద్యము సోమయాజి యుద్యోగపర్వములోనిదిగా పీయఁబడినది. ఈ పద్యము ముద్రిత భారతమున నెందును గోచరముగాదు. పరిశీలనీయము.

ఇంకను ననంఖ్యాత సాధురమ్యపాఠములు గానవచ్చుచున్నవి. అయ్యవియెల్ల నా యా పద్యముల పుటల యధసూచిలో సమకూర్పఁబడినవి.

ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక వివరణగ్రంథములో లక్షణశిరోమణిని గూర్చి వ్రాసిన కొన్నిమాటలు —

'ఇందు యతిప్రాస విషయము నేఁడు మనకు లభించుచున్న లక్షణగ్రంథము లన్నింటికంటె విపులీకరింపఁబడియున్నది.' (ఇది కొంతవఱకు వాస్తవము). 'పెక్కు ప్రాచీన గ్రంథములనుండి లక్ష్యములు గైకొనఁబడినవి. దీనింబట్టిచూడ పీకవి అప్పకవి కంటెఁ బూర్వుఁడుగఁ దలఁపఁదగియున్నాఁడు.' (ఇందు రెండవ యభిప్రాయము సరిగాదు. అప్పకవికి గణపవరపు వేంకటకవికిని తరువాతివాఁడని సహేతుకముగా నిర్ణయించియున్నాఁడను) 'మఱియు పీవఱకు లాక్షణికు లుదాహరింపని పూర్ణార్ధబిందు ప్రాస మిందుఁ జెప్పఁబడినది.

పెక్కు నూతనవిషయములున్నవి. వానినెల్ల విస్తృతముగాఁ బ్రదర్శించితిని. కాని పూర్ణార్ధబిందుప్రాస గ్రంథమందెందును నాకుఁ గానరాలేదు. ఇందలి ప్రాసభేద ములలో అర్ధబిందుప్రాసయున్నది. అందు అర్ధబిందు నిర్బిందుప్రాస ప్రయోగ లక్షణ లక్ష్యములని వచింపఁబడినది. అది పూర్ణార్ధబిందుప్రాసగాదు.

నన్నెచోడ కుమారసంభవములోఁ బూర్వార్ధబిందుప్రాస యీ క్రింది పట్టులఁ గాననగును.

1.4 వీఁగు నపార ... వా, మాంగ — లోఁగిన — వే, దాంగు.

6-157 పోఁడిగ — మూఁడు — బ్రహ్మాండము — ఖాండము.

వీటిని అర్ధబిందు విర్పిందుప్రాస లందురు కొందఱు. 'వీంగు, లోంగిన, పోండిగ, మూండు' అను రూపములు ప్రాచీనములని కొందఱు పూర్ణబిందు సమప్రాసగా సమర్థింతురు. కాని శిరోమణి యిట్టి ప్రస్తావన చేయలేదని యెఱుఁగవలెను.

లక్షణశిరోమణిలో నూతనములగు శాస్త్రవిషయములు, అజ్ఞాతగ్రంథకవినామములు, అదృష్టగ్రంథగతపద్యములు, పద్యసాధుపాఠములు, లక్షణమతభేదములు, అటనట లక్షణసూక్ష్మపరామర్శనము ఆమూలాగ్రముగ నంతరింపఁబడి గ్రంథవైశిష్ట్యమును బ్రపంచించుచు గ్రంథనామమును సార్థకము సేయుచున్నవనుటలో సందియము లేదు.

## ప్రయోగవిశేషములు

పొత్తపి వేంకటరమణకవి నిశ్శంక లక్షణచక్రవర్తి. అతని గ్రంథము లక్షణశిరోమణి - ఛందోవ్యాకరణలక్షణగ్రంథము. కవి బహులక్ష్యలక్షణగ్రంథ పరిశోధకుఁడు. అట్టికవి రచనలో దోషముల నాపాదించుట నల్లక్షణముగాదు. కాని రమణకవి స్వీయపద్యములలో విలక్షణప్రయోగములు గానవచ్చుచున్నవి. కవికాలమున కీవల నావల (17-18 శతాబ్దులు) నవతరించిన లక్షణగ్రంథములలోఁ బ్రాచీన లాక్షణికానంగీకృత శబ్దాదిరూపములకు ననుశాసనము లున్నవి. జీవద్భాషకు ననుశాసన మెల్లప్పుడొక్కరీతిగా నుండఁజాలదు. శిరోమణికారుఁడు నిరంకుశుఁడు. ఇఁక నిందలి విలక్షణ ప్రయోగాలు —

సమాసములు :—

గ్రాసకకూర్తి (2-183); గణపోంతు, ప్రీక్ష్ణపోంతు (2-103); సమకంది కుఱుచపదముల్ (3-291); ఇవి వైరిసమాసములు. దివపతి (3-310) దివస్పతి యనవలెను; కవిసాగర గిరివాణీ భువి గౌరీమేఘవిషు (2-154) సిద్ధసమాసమధ్యలోఁ దత్సమపదము; కర్తభర్తలకు (2-58) కర్తృభర్త లనవలె; వేశతకము (1-9) మిశ్ర

ద్విగువు - ఏక వచనాంతము; ధనురాశి (2-40) ధనూరాశి యనవలె. కాని దీనిని దత్సమ సమాసముగా గ్రహింపనగు; తమదుశుభాశుభములు (2.53) ఆత్మార్థ బహు వచనమున దుగాగమము; ఉండుటుండములు (1-23) భావద్వంద్వము.

సంధులు :—

పూర్వాషాఢగు (2-36) పూర్వాషాఢ + అగు; ఎత్తుగీతన (3-18), కనకలతి కమరు (3-37); పార్శ్వనాదన, భిన్ననాదైన (2-95); నవాంశన (2.109), జలధర మాలికనెదు (2-192 , సురభన (3-106), కలహంసగును (3.27) — ఇవన్నియుఁ దత్సమస్వరసంధులు.

మునుపటట్లు (3-262), పొసఁగెటు (2-55.) — ఇది క్త్వార్థకేకారసంధి, కోమరనంతుని (1.12) కొమరు + అనంతుని, తనరనుష్టుపు (3-174) తనరుఁ + అనుష్టుపు చెల్లొకపదమును (3-355) చెల్లుఁ + ఒకపదము — ద్రుతస్వరసంధి, రూపమునన్నిద (3-381) ద్రుతద్విత్వసంధి, కేశవనంతా (3.158) కేశవ + అనంతా అని తెనుఁగు సంబోధనాంతశబ్దముల సంధి. కేశవ యనంతా యనవలె.

ఇట్టిదే కేశవాష్టగణ విరాజితంబు (3-351.) కేశవ + అష్టగణ, కల్క్యావతార (3-73 ) కల్కి + అవతార - కల్క్యవతార యనవలె.

తత్సమ శబ్దములు :—

అనునాసికలు, అంతస్థలు, ఊష్మలు (4 23) విసర్గలు (4-223.) ఉదాహరణలు (4-61, 136), విరామ (3.173) - ముపర్ణకలోపము - చరిత్రాది గణపఠనీయము. పునర్వసు (2.37), అర్ధబిందు (4-458), ఒకగురు (3-13.) - వీటికి వుపర్ణకలోపము. వర్గువు (1.84), మరుతము (2-134) - మరుత్తు అనుటకు; తిర్యగులు (1-97) - తిర్యక్కులనుటకు; బ్రాహ్మలకు (1-141) - బ్రాహ్మణుల కనుటకు, శతభిషము - హస్త (2-77) - ముపర్ణకలోప వికల్పత. ద్విపదము (3.7) ద్విపదయనుటకు. అనుష్టుపుఛందము (3.174) అనుష్టుప్ఛందమనుటకు, గుర్వు (3 257) గురువు అనుటకు - ఇది తత్సమముగానఁ బదమధ్యస్వర మాచ్ఛికమునకువలె రాదు. బహుగాను (2-198) సంస్కృతావ్యయప్రయోగము, జనైనసములు (4-179.) జన + ఏనసములు, ఏనశ్శబ్దము - ఏనస్సుకావలె. ఇది ద్వితీయైకవచనాంత రూపము.

సహిష్ణ (3-342.) - 'కృష్ణ - సహిష్ణ' అని యంత్యప్రాస - సహిష్ణు యనవలె.

అచ్చికశబ్దములు :—

తపులు (1-78.) తప్పులనవలె - అక్కటాదులందువలె జడ్డకు లోపమున్నది; వదిహేను (1-84.), పమ్మారు (3-242), పద్నాల్గు (2-109; 3-243), పదు(ద) కొండు (2-82), పొంతు (2-103), పొంతువు (2-69), పొంతువ (2-96), అవధారు (4-5.) ఇట్టిటిదే (4-158), ఇట్టిట్టిదే యనుటకు, వాటివాటికి వేర్వేఱ దేటసేతు (3-322) వానివాని కనవలె — కాని యిం దిది ప్రాసయతి నిబద్ధము. 'వీటిలోపల నొకమూఁటిచే' అని యప్పకవికూడఁ బ్రయోగించె (అప్ప - 4-453).

క్రియలు :—

చేతు (3-322.) — చేయుదు ననుటకు, రచియింపుదు, వ్రాయుచుత్తమము (2-102; 1-78) రచియింతుము, వ్రాయుదు యనుటకు - భావార్థక ట వర్ణకమునకు మాఱుడు వర్ణకము, దించఁగను (3-275) - దింపఁగ ననుటకు - ఇది ప్రాసలోఁ బ్రయుక్తము, అనేహాతువు (4-365) అనుహాతువనుటకు, హొత్తపియనేటి గ్రామనామము (1-15) అనెడి యనుటకు, పధ్యను జొరుప్రాసము (3-380) - సొమ్ము. పాదుక (3-376) - పాదుకొని - కొనికి క ప్రత్యయము.

శబ్దరూపములు :—

కర్కాటకరాశి (2-43), కర్కాటము (2-113; 116) - కర్కట(క) మనవలె, లేకణ (3-12) తప్పకణ (3-403.), రెండో గణంబు (3.308.), వాల్గో ముహూర్తము (2-137) ఎన్మిదో ముహూర్తము (2-137) చరణందనొప్పు (3-395) చరణంబనొప్పు ననుటకు. కరుణారసము (2-40) రసవాచియగుచో కరుణారస మనవలె; శార్దుల, మార్జర (2-79) శార్దూల మార్జార శబ్దములు. ఛందవృత్తము (3-174) ఛందోవృత్తమనవలె, రక్షవిపక్ష (3-346) రక్షోవిపక్ష యనవలె, వనౌక నకులాధిప (2-79) వనౌకో నకుల — అనవలె.

రేభ - రేఫ యనవలె.

రేభ అకారములో + వైభక్తికక్రమ (4-5).

ఈరూపము ప్రాసస్థితమగుటచే నిర్ధారకము. అటుగాక 'రేఫ' అని గ్రహించిన 'ఫ - భ' ప్రాసయగును. శిరోమణిలో సవర్ణప్రాసలో ఫ - భ ప్రాస చెప్పఁబడినది. (4.354) ఫ - భ ప్రాస యతనికి సమ్మతమే యనవలె. రేఫకు రేభయను రూపాంతరము గలదని కేచిన్మతము. రిఫ ధాతువునకు 'రిభ' యని కాశిపాఠము గలదు.

పోతన భాగవతమున రేభ శబ్దమంత్యాను ప్రాసనిబద్ధముగానున్నది. (చూ. భాగవత - X స్కం. ఉత్తర - 622 - సాహిత్య అకాడమీ ప్రతి.)

క॥ జలజభవ, భవుఁడు గనెనొక
నలినాక్షి నివాసమందు నతభద్రేభున్
జలదాభున్ గతలోభు
న్నలకాళిజితద్విరేభు నంబుజనాభున్.

మూరు (2-10) మూరు, జాతులవైశ్యుల + కారయఁగను (1.141).

ఇందు 'మూరు' రూపము ప్రాసలోనుంటచే నిర్ధారకము. మూరేళు (2-20) ఏళాది (3-244) నాల్గేళు (2.76) 'మూఁడు ఏడు' అనుటకు 'మూరు ఏళు' అన్నవి కర్ణాట భాషారూపములు. ఇవి యన్యదేశ్యములుగా గ్రాహ్యములు.

విభక్తిరూపములు :—

తిట్టుకు (2-5), గుడుసుకేత్వంబు (4-14) —
కువర్ణక పరకత్వమున నగాగమములేమి,

చె, తొ, చాత (చే, తో, చేత) - అను నసాధురూపములు క్రిందచోట్లఁ గాన వచ్చెడు. సాధుపాఠము లున్నవేమో ?

చను రాహు సౌమ్యదోషములు కవిచె (2- 133)

హల్లులతొ నచ్చు యుతములై చెల్లు (4-69. అధస్సూచి)

కవి భౌమ సౌరిదోషములు వాచస్పతి
చాతఁ దీఱును ఫణి సౌమ్య భాను. (2-133)

'చేత' అనుటకు 'చాత' అను వ్యావహారికరూపము యతిస్థానమునఁ బ్రయుక్తము కానోపును.

యతులు :—

కృతులవి మూలదాఁపన మ + ఱికా (1-9) ఋ - ఱి యతి.

‘ఋ - ఱి’ లు చెల్లును. శిరోమణికారుని మతమున ‘ర - ఱ’ యతిప్రాసలు విరుద్ధములు.

రుగ నల నృపచోర + మృత్యువులనఁదగు. (2-148)

ఇది రు - ఋ వడి - శిరోమణి దీనిని జెప్పలేదు.

ఋ - రు వడి గావించిన కవిప్రయోగములు పెక్కులు గలవు.

యతిభ్రంశము :—

ఆళుమాధుర్య వి + స్తార, ధీచాతుర్య (1-14 అధస్సూచి)

‘సాళు మాధుర్య విస్తార’ అన్న పాఠము గూర్పఁబడినది. అప్పట్టున సహోర్థ యతియో యఖండయతియో కాఁదగును. ఏకాక్షరీ - ద్వ్యక్ష + రీ ధురీణు. (1-14)

శిరోమణిచెప్పిన దేశియయతిచొప్పున బదమధ్య వ్యంజనముమీఁది స్వరమునకు యతి చెల్లవచ్చు. (చూ. ఓషధీశార్కనేత్ర భా + సురచరిత్ర.) (4-53)

అష్టగణంబు లో + క్కర్తు కమరు. (3-308)

ప్రాసములు :—

కలుగు పంద్రెంటి యందును + వఱలు. (2-109)

పై రెంటను ‘ల - ఱ’ ప్రాస. శిరోమణికారుఁడు ‘ల - ర’ ప్రాస చెప్పె. ‘ల - ఱ’ ప్రాస యతనికి సమ్మతముగాదు. ఒరులు దాఁజెడుటయు + నెఱుఁగలేక (2-183)

ఇందు ‘ర - ఱ’ ప్రాస యున్నది. శిరోమణి నిషిద్ధము. ఋ ళ ళా జ బూ త వ + ర ల. (2-191)

ఇందు ‘ఋ - ల’ ప్రాస. ఋ ప్రాసచే ఋ - ర లు చెల్లు. ‘ర - ల’ లు గూడఁ జెల్లుఁగాన ‘ఋ - ల’ లు చెల్లుబడియయ్యె ననఁదగును.

ఇనము — గుణము (2-61).

మణినిచయ — తనర (3-83).

పై రెంటను 'న - ణ' ప్రాస గలదు. నకారము సాధ్యణకారముతోఁ బ్రాస నందునుగాని కేవల 'న - ణ' లకుఁ బ్రాస లాక్షణికమతముగాదు.

గురులఘువుల వ్యతిక్రమము :—

దినమణి వృత్తము - సంకలితంబగు షడృతుముని (3-111).

ఇందు షడృతుల్ వద్రసుడికిఁ బూర్వాక్షరము గురువుకావలె. అయ్యది శాస్త్రవిరుద్ధము.

సీ॥ సత్త్వరజస్తమ స్వరములు మృతపంచ,
కములగ్ని వాయుతత్త్వములుర క్త। శ్యామచంద్రులును. (2 192)

ఇందు సంయుక్త పూర్వాక్షరము లఘువుగావలె.

సీ॥ ఉ ఊ లు కన్నులు నొగి ఋ ౠ లు.

ఇందు 'ఉ' - గురువు, 'ఋ' - లఘువు. (1-34)

సీ॥ అరయఫలములు అ ఆ ఉ ఊ లకుఁ
బ్రీతి ఇ ఈ లు సంతృప్తి జయము. (1-89)

ఇందు అ, ఇ - గురువులు, ఉ - లఘువు.

ఉచ్చారణమునుబట్టి గురులఘుత్వముల నెన్నవలెను.

## పరిష్కరణము

లక్షణశిరోమణి యింతవఱకు నముద్రితమై లిఖితప్రతులలో దాఁగి యజ్ఞాతమై మూలఁబడియుండినది. అందుచేత వేంకటరమణకవిపేరు కవులచరిత్ర కెక్కలేదు. దీనిఁగూర్చి లక్షణపరిశోధకులు నయితము పరామర్శింపలేదు. ఈ గ్రంథమున నేను పీఠికలో వివరించినట్లు అనేక నూతనాంశములు నిక్షిప్తములై యున్నవి. నా ఛందోపీఠులలో దీనిలోని యపూర్వలక్షణాంశముల నటనటఁ బ్రదర్శించియున్నాను. అందు

నేను వక్కాణించిన శిరోమణి విషయవిశేషములను బేర్కొంటిని దరువాత నవతరించిన ఛందఃపరిశోధనగ్రంథములు సంగ్రహించినవి. ప్రకృతము ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీవలన ముద్రణభాగ్యము శిరోమణికిఁ బ్రాప్తించెను.

లక్షణశిరోమణిని బరిష్కరించుట కుపయోగించిన లిఖితప్రతుల వివరములివి :-

1. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతి - పరిషత్పుస్తకభాండాగారమందలి 1297, 148 సంఖ్యలుగల తాళపత్రప్రతులు 1297 లో 1, 2, 3-వ ఆశ్వాసములోఁ గొంతభాగము. 148 లో 3-వ ఆశ్వాసము తరువాతిభాగము, 4-వ ఆ. లో సంధిసమాసములవఱకు అసమగ్రముగ గ్రంథము లిఖితము. వావిళ్ల సంస్థకు చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు 15.7 1949 లో వ్రాసియిచ్చిన ప్రతికి నేను 31.7.52 లో నకలు వ్రాసికొంటిని.

2. మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయప్రతులు - R 679 తాళపత్రప్రతి - తుదిభాగము లోపించినది. 4-వ ఆశ్వాసములో ప్రాసలను వివరించుఘట్టముతో ముగిసినది. R 1257 కాగితపుఁ బ్రతి. ఇది 679 ప్రతికిఁ బ్రతిక. D 3034 - తాళపత్రము - తృతీయాశ్వాసములో అసమగ్రముగా ముగియుచున్నది.

ఈ మూఁడు ప్రతులు నేఁడు మదరాసునుండి తరలింపఁబడి తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాలయమందుఁ బదిలపఱుపఁబడి యున్నవి.

3. తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాలయప్రతి 7616 (c) సంఖ్యగల తాటియాకులప్రతి. ఇది తిరుమల తిరుపతి దేవస్థానమువారి సేకరణ (T. T. D.). ఇది తృతీయాశ్వాస వృత్తాధికార ప్రారంభముననే శ్రీపెంపు వృత్తముతో ముగియుచున్నది. 7616 సంఖ్య - కట్టలో కవిచింతామణి, అనంతుని ఛందము, లక్షణశిరోమణి (1-2 ఆ), ఆంజనేయ నక్షత్రమాలిక, ఆంధ్ర కౌముది యను గ్రంథములు గలవు. చిత్రకవి బుచ్చయాచార్యుల తమ్ముఁడు రామాచార్యులు ఈ కృతిసంచయ లేఖకుఁడు. ఇందు మదరాసు ప్రతులను తిరుపతి ప్రతులక్రింద సంగ్రహించుట జరిగినది.

ఉపలబ్ధప్రతులలో కాకినాడప్రతి కొంతవఱకు సమగ్రకల్పము. గాన నయ్యది శుద్ధప్రతి నిర్మితిలోఁ బ్రధానముగ గ్రహింపఁబడినది. మదరాసుప్రతి (679) లో

4 ఆ - పద్యము తరువాతి భాగము లుప్తము. (అభేదయతివలకుఁగల భాగముమాత్ర మున్నది). కాని 679 లో చివర చిత్రకవితా పద్యములు పంద్రెండు గలవు.

ప్రధానముగా స్వీకరించిన కాకినాడప్రతి పాఠములను తిరుపతిప్రతుల (మదరాసు ప్రతు లిందే గ్రహింపఁబడినవి) పాఠములతో సరిపోల్చి పరిశీలించుట జరిగినది. ఆ పాఠాంతరములను తిరుపతి విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు, మాన్య మిత్రులు, శ్రీ జి. ఎన్. రెడ్డిగారు, తిరుపతి వాస్తవ్యులు పండిత శ్రీ T. P. భాష్యకారాచార్యులచే వ్రాయించి పంపిరి. కాకినాడప్రతిని R 679 ప్రతితో సరిచూచి పాఠాంతరములు గుర్తింపఁబడినవి. R 1257 పైదాని పుత్రికయేకాన విశేషపాఠములు లేవు. 3034, 7616 తాళప్రతు లసమగ్రములు 679 ప్రతిని బోలియున్నవి. గుర్తింపఁదగిన పాఠములు లేవు.

కాకినాడ ప్రతి పాఠములను దక్కిన ప్రతుల పాఠాంతరములతో సంప్రదించి సాధుసముచిత పాఠములు నిర్ణయింపఁబడినవి. కాకినాడప్రతికి - 'కా' అని, తిరుపతిలోని మదరాసు ప్రతులకు మఱి తిరుపతి ప్రతులకు - 'తి' అను సంకేత మొసఁగఁబడినది. తిరుపతిప్రతులు R 1257 - (తి), R 679 - (తి$_1$), 7616 - (తి$_2$) ప్రాచీనతాళపత్రలేఖన పద్ధతికి నర్వాచీనలేఖనపద్ధతికిఁ గొంత భేదమున్నది. దాని కించుక సూచన —

| ప్రాచీనపద్ధతి | అర్వాచీనపద్దతి |
|---|---|
| వలపలగిలక (మాగఱము) | సంయుతమునరేఫ (మార్గము) |
| పూర్ణబిందుపూర్వక ద్విత్వహల్లు (అంక్కిలి) | పూర్ణబిందువుపై అద్విత్వహల్లు (అంకిలి) |
| అద్విత్వహల్లునకుఁబూర్వము పూర్ణ బిందువు (వీంక) | అద్విత్వహల్లునకు ముం దర్ధ బిందువు (వీఁక) |
| మకార, నకారద్విత్వములకు ముందు నెఱసున్న (ఫలంమ్ము, అంన్న) | నెఱసున్నను దొలఁగించుట (ఫలమ్ము, అన్న) |
| పదాంతమున బిందుసున్న (లక్షణం) | పదాంతమున ముపర్ణకము (లక్షణము) |

| ప్రాచీనపద్ధతి | అర్వాచీనపద్ధతి |
|---|---|
| పదము తుదిపొల్లునకు దీర్ఘస్వరము<br>(మరియును, గణించిరి సుకవులూ) | తుదఁ బొల్లు వ్రాయుట<br>(మరియున్, సుకవుల్) |
| పద్యాంతహ్రస్వస్వరమునకు దీర్ఘము<br>(నిశ్చయముకృష్ణా) | పద్యాంతమున హ్రస్వస్వరము<br>(నిశ్చయముకృష్ణ) |

మఱియు జిహ్వ - జింహ్వ, సంజ్ఞ - సొఙ్ఞా, సొజ్ఞ, రమ్య - రంమ్య, ద్వితీయ - ద్వితియ్య, చేత - చాత, సింహ - సింహ్మ, కృష్ణ - క్రిష్ణ అనునవి ప్రాచీనాధునిక లేఖన వైఖరులు.

న - ణ లు, శ - ష - స లు, ధ - థ లు, ఱ - ర లు మున్నగు వర్ణములలో వ్యత్యయము, పదాది యకారము (యీకుఁడు) పదాది వకారము (వుండు, వొక), తత్సమములందును తాలవ్యోచ్చారణ (జెగతి), శకటరేఫలు, అరసున్నలు, చ జ ల దంత్యచిహ్నము పరిహరించుట — మున్నగునవి ప్రాఁతవ్రాఁతతీరు. నేఁటి వ్రాఁతలోను ముద్రణలోను నాధునిక లేఖనపద్ధతి యవలంబింపఁబడును.

కాకినాడప్రతికి నకలు ఇప్పటి పండితులు వ్రాసిన దగుటచే నాధునిక లేఖన పద్ధతి చాలవఱకు ననుసరింపఁబడెను. తిరుపతి ప్రతులందుఁ బ్రాచీన లేఖన పద్ధతి కాననగును.

ప్రకృతము శుద్ధప్రతియందు నేఁటి పద్ధతి సర్వత్ర పాటింపఁబడినది.

శిరోమణిలో అటనట సమీక్షారూప వచనములు వ్యావహారిక భాషలో నున్నవి. టీకలు, వివరములు, తెలివిడులు, వ్యావహారికభాషలో వ్రాయుట ప్రాచీన లాక్షణిక సంప్రదాయము. అప్పకవ్యాదులలో నిట్లేయున్నది. శిరోమణి వివరణ వచనములు లక్ష్యలక్షణాదులలో శీర్షికాప్రాయ వచనములు గ్రాంథిక వ్యావహారిక మిశ్రరచనములుగానున్నవి. అయ్యవి యథాతథముగ శుద్ధప్రతియందుఁ గైకొనఁబడెను. పాఠాంతరములు, లఘువివరణములు, ఛందోవ్యాకరణలక్షణ వ్యతిక్రమములు ఆ యా పద్యములుగల పుటలలో అధోజ్ఞాపికలో అంకములతో సూచితములు. ప్రధానముగా గ్రహించిన పాఠములు మూలగ్రంథములోను పాఠాంతరములు అధస్సూచిలోను నొసఁగఁబడెను. మఱియు నుదాహృత పద్యముల ముద్రిత ప్రతి పాఠములు భిన్నములగుచో నయ్యవి యధస్సూచిలోఁ జూపఁబడెను.

లుప్తభాగములు (వర్ణపదపాదములు) ఇతరప్రతులతో సంప్రదించి సందర్భాను గుణముగఁ బూరింపఁబడినవి. పరిష్కర్త పూరించిన, క్రొత్తగాఁజేర్చిన భాగములు నిలువుబ్రాకెట్ల [—] మధ్యఁ జూపఁబడెను. లిఖితప్రతిలోనున్నవానిలోఁ జేసినమార్పు కుండలీకరణములలోఁ (—) జూపఁబడెను. యతిప్రాసగణభంగములు దురూహ దురవగాహములైన పదములు పద్యపాదములు కుండలీకృతప్రశ్నచిహ్నముతో (?) సూచితము.

ల. శిరోమణిలో నుదాహృత లక్ష్యలక్షణపద్యములలోఁ గొన్నిపొరపాట్లున్నవి. ఆకరములలో నొకగ్రంథమునకుమాఱు మఱొకగ్రంథము పేర్కొనఁబడెను. అప్పట్టున సరియైన యాకర గ్రంథముపేరు మూలమున నుంచి, శిరోమణి పేర్కొన్న యాకర మును నధస్సూచిలోఁ జూపుట జరిగినది. ఉదాహృత పద్యములకు నాయా గ్రంథముల యాశ్వాస పద్యసంఖ్యలు నేఁటి తన్ముద్రిత ప్రతులలోనివి చూపఁబడెను.

వృత్తాధికారమున శిరోమణి లక్షణములకు టుప్పీకలవంటి వివరణములు పాఠ కుల సౌకర్యార్థము చేర్పఁబడినవి. అట్టి వివరణములు నిలువుబ్రాకెట్లలో నున్నవి.

సవరణలలో నించుక మార్పులు చేయుట జరిగినదిగాని పెద్దమార్పులు గావింపఁబడలేదు. పరిష్కర్త స్వమతానురోధముగఁ బెద్ద మార్పులుచేసి కవిపాఠము లను రూపుమాపుట సరియైన సరణిగాదుగదా?

సవరణలు చేసిన వైఖరిని బ్రదర్శింపఁ గొన్ని యుదాహరణలు —

1. పాదుక లఘువిడిన నసెమె పథ్యయగుణా (3-376) - వ్రా. ప్ర.

లేఖకుఁడు కందమనుకొని యిట్లు వ్రాసియుండును. ఇది పథ్యాకందము. ఉత్తరార్ధము 6-వ గణము ఏకలఘువు గావలె.

'పాదుక లఘువిడినఁ బథ్యయగుణా' - సవరణ.

2. సరవితో నౌపచ్ఛందసంబు మించుణా (3-403) - వ్రా. ప్ర.

ఇందు ఆదిలో మాత్రాధిక్యము గణభంగము.

'సరవిని నౌపచ్ఛందసంబు మించుణా' - సవరణ.

3. లెక్కలకును నొక్క, లెక్క నుద్దిష్టమిది సర్వవృత్తములకు (3-252) - వ్రా.ప్ర.

'లెక్కలకును నొక్క, చెక్క నుద్దిష్టమిది సర్వవృత్త' - సవరణ.

ఉద్దిష్టములో ద్విగుణించిన లెక్క మొత్తమునకు నొక్క చెక్కవలెను.

4. కమలాది గగనాద్రి హిమకర కరవాజి (3-269) - వ్రా. ప్ర.

అద్రి 7-వ సంఖ్య - కాని యిందు 6-వ సంఖ్య రావలె.

'గగనర్తు' - సవరణ.

5. కీలానల, ప్రేక్ష్యంబైన (4-30) - వ్రా. ప్ర.

ఇందు 'క్ష' ప్రాస - 'క్ష్య' చెల్లదు.

'కీలాదురు, త్ప్రేక్షంబైన' - సవరణ.

'సు - దుస్' లకుఁ బరమైన ధాతువుల శక్యార్థ య ప్రత్యయమునకు లోప మగును. దుర్ - ఉత్ప్రేక్ష్య - 'దురుత్ప్రేక్ష' అగును.

6. క్రతుభుక్తి తేజులై గలుగు రణము (2 73) - వ్రా. ప్ర.

ఈపాఠ మర్థవంతముగాదు. ఇందు దేవాసురులను వర్థము రావలెను.

'క్రతుభుగ్దితిజులై వఁ గలుగు రణము' - సవరణ.

7. ముచికుంద వరద స - ముల్లసద్బృహ్మారు

ద్రేంద్రాది సురబృంద విక్ర్చ చరణ (4-136) - వ్రా. ప్ర.

ఇది ప్రాదియతికి లక్ష్యము. 'విక్ర్చ' అప పాఠము, అర్థరహితము.

'వీడ్యచరణ' - సవరణ. వి + ఈడ్య - వీడ్య - ప్రాదియోగముగల శబ్దము. ప్రాది యతికి సరిపడును.

8. పోలఁగ పుపుబుభులకు (4-334). స్పష్టార్థము సరళాదేశ సంధిచేయఁబడదు.

9. రెండునాఱు పదునొకొండు పంద్రెండునాఁగ (2.132) - వ్రా. ప్ర.

ఇందు గణభంగము గలదు.

'రెండు నార్పదొకొండు పంద్రెండునాఁగ' - సవరణ.

10. శ్రవణోత్తరాషాఢ సార్పరోహిణులు ద
క్షిణ పార్శ్వనాశన + జగతివెలయు (2-91) - వ్రా. ప్ర.
ఇం దుత్తరార్ధమున యతిభ్రంశము.
ద, క్షిణ పార్శ్వనాదన + క్షితినివెలయు - సవరణ.

11. రఘుకులుఁడు ద్రుంచెనాదశ ముఖునినాఁగ
వచ్చె దైత్యారిపది యూవియఘ్ఝరియన (4-321) - వ్రా. ప్ర.

ఇది సవర్ణప్రాస లక్ష్యము. 1. పా. లో 'ఘ - ఖ' లకుఁ బ్రాస. అట్లే 2. పా. లో 'ఛ - ఝ' లకుఁ బ్రాస యుండవలెను. ఇందలి పాఠము సరిగాదు, మఱి యర్థరహితము.

'స్వచ్ఛ దైత్యారిపది యూవియజ్ఝరియన' - సవరణ.
దైత్యారిపది యనఁగా విష్ణుపది - గంగ - అదిస్వచ్ఛ.
విష్ణుపాదోద్భవ - వియత్ + ఝరి - వియజ్ఝరి అనుట.

12. సింహవిక్రమ వృత్తము.
శ్రీరమాధవా బుధేశ సింహవిక్రమంబెదగా
గైరజ ౹జజ ల్గజాఖ్యవిశ్రమంబైదగా (3-69) - వ్రా. ప్ర.
ఇందు ద్వితీయపాదములో యతిగణములు దప్పినవి.
శ్రీరమాధవాబుధేశ సింహవిక్రమా బెసంగై
(యా)రజ౹జజ౹లగల్ గజాఖ్యవిశ్రమంబెసంగుజా - సవరణ.

తిరుపతిప్రతిలో కాకినాడప్రతిలోలేని పద్యములు గొన్ని యధికముగ నున్నవి. ఆ పద్యములు ⁕ చిహ్నముతోఁ జూపఁబడినవి.

గణ యతి ప్రాస వ్యాకరణ ప్రకరణములలో మూలమున శీర్షికలులేవు; కాని శీర్షికాప్రాయములగు వచనములున్నవి. ఆ వచనగర్భితములైన శీర్షికలఁ బ్రత్యేకముగాఁ బ్రదర్శించుట జరిగినది. యతిప్రాసభేదముల శీర్షికలకు వరుసనంఖ్య లొసఁగఁబడినవి. మూలమున నాకరములు పేర్కొనఁబడని లక్ష్యలక్షణములకు నాకరములు చూపఁబడినవి.

పాఠకుల సౌకర్యార్థము పీఠికావిషయసూచిక, గ్రంథాంతమున ననుబంధములో నుదాహృత పద్యములయు గ్రంథములయు అకారాద్యనుక్రమణిక, చిత్రకవితలోని బంధములకు రూపచిత్రములు నంతరింపఁబడెను. ఇందలి పీఠికలో శిరోమణిలోని లక్షణవిశేషములు విస్తరముగ వివేచింపఁబడినవి; ఇందలిలోపములు వ్యతిక్రమములు పరామర్శింపఁబడినవి. స్పష్టప్రతిపత్తికై పద్యములలోఁ గొన్ని పట్టుల విసంధులు పాటింపఁబడెను.

శిరోమణికారుఁడే లేఖక దోషజ్ఞులఁగూర్చి యిట్లు మందలించినాఁడు —

'తప్పుఁదాఁజూచి వ్రాయుదుత్తమము, లేక
ప్రతిసమానంబుగా వ్రాయుదతిముదంబు,
రెండువిడిచియె వ్రాసెడు లేఖకుండు
గలుగఁ గవిచేయు భాగ్యంబుగాదె కృష్ణ' (1-78)

'తెలియని వన్ని యబద్ధ
మ్ములనియుఁగవి పదరి దిద్దఁబోకుఁడు, కవితా
కలనాపరులగు లాక్షణి
కులవలనఁ దెలియవలయుఁ గుమతులు కృష్ణా' (4-19)

లక్షణశిరోమణి గ్రంథము సంపూర్తిగా నెందేని లభించునను ప్రత్యయము గలదు. ఆ యాశయము సిద్ధించునేని మఱికొన్ని లాక్షణికాంశములు వ్యక్తములగును.

ఈనాపరిష్కరణ సహృదయామోద సంధాయకము కాఁగలదని యాశయము.

రావూరి దొరసామిశర్మ



# సంకేత వివరణము

| | |
|---|---|
| అథర్వ | అథర్వణకారికావళి. |
| అప్ప | అప్పకవీయము. |
| ఆ | ఆశ్వాసము. |
| ఆం. భా. భూ. | ఆంధ్రభాషాభూషణము. |
| ఆం. శ. చిం. | ఆంధ్రశబ్దచింతామణి. |
| క. గ. | కవిగజాంకుశము. |
| క. జ. సం. | కవిజనసంజీవని. |
| క. జ. ఆ. | కవిజనాశ్రయము. |
| కా. | కాకినాడప్రతి. |
| కావ్యా. చూడా. | కావ్యాలంకారచూడామణి. |
| కావ్యా. సం. | కావ్యాలంకారసంగ్రహము. |
| ఛం. ద. | ఛందోదర్పణము. |
| చూ. | చూడు పీఠిక. |
| తి. | తిరుపతి ప్రతి. R. 1257 |
| తి1. | ,, ,, R. 679. |
| తె. భా. ఛం. | తెలుఁగు భాషలో ఛందోరీతులు. |
| నృసిం. పురా. | నృసింహపురాణము. |
| ప. | పద్యము. |
| పా. | పాదము. |
| పాండు. రంగ. | పాండురంగమాహాత్మ్యము. |
| భార. | భారతము. |
| భాస్క. రామా. | భాస్కర రామాయణము. |
| రం. ఛం. | రంగరాట్ఛందము. |
| రా. పాం. | రాఘవపాండవీయము. |
| ల. దీపిక. | లక్షణదీపిక. |
| ల. సా. సం. | లక్షణ సారసంగ్రహము. |

| | |
|---|---|
| ల. శి. | లక్షణ శిరోమణి. |
| విష్ణు. పురా. | విష్ణుపురాణము. |
| వృత్త. | వృత్తరత్నాకరము. |
| సం. | సంస్కృతము. |
| సంశో. భా. | ఆంధ్రమహాభారతము (సంశోధిత ముద్రణము) |
| స. ల. సా. సం. | సర్వలక్షణ సారసంగ్రహము. |
| సింహా. ద్వా. | సింహాసన ద్వాత్రింశిక. |
| సు. ల. సా. | సులక్షణసారము. |
| సూ. ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు. |
| (?) | అక్షరలోపము; ఛందోభంగము; అరక్షితము. |
| * * * * | గ్రంథపాతము. |
| ( ) | వర్ణవ్యత్యయము. |
| [ ] | పరిష్కర్త పూరణము, వివరణము. |
| ♦ | తిరుపతి ప్రతిలోని యధికపద్యములు. |



శ్రీరస్తు

శ్రీ శారదాంబాయై నమః

# లక్షణశిరోమణి

## ప్రథమాశ్వాసము

## వర్ణాధికారము

### [ అవతారిక ]

క. శ్రీరామారమణ, జయ
శ్రీరమ్యగుణాభిరామ, శ్రీవేంకటలో
కారాధ్య, ప్రోవు మమ్ము, ద
యారస సుమణాము! వేంకటాచలధామా! ౧

క. శ్రీతరుణీమణి చపలా
న్వీత ఘనమనోజ్ఞగాత్ర! నీరజనేత్రా!
ఖ్యాత మహాశేషాచల
నేతా! శ్రీవేంకటేశ! నిఖిలాధీశా! ౨

క. వరద, పశుపతి, వినాయక
తురగంబులు గలుగు వేల్పుదొర లహరహమున్
సిరులొసఁగ గౌసఁగఁ బ్రోతురు
తిరముగ మము నెపుడు పార్వతీపరమేశుల్. ౩

క. తొలిపూజలు తలచలి వేలుఁ,
గెలుకలదొర బిరుదు కుదిరె, యేనుఁగు మొగముల్,
చిలువల జందెము, చెవులిఁ
గలవేలుపు, విఘ్నరాజు, గణపతిఁ గొలుతుల్.

సీ. ధాళధళ్యామూల్య ధవళతరాచ్ఛాద
నాచ్ఛాదిత సుధాకరాచ్ఛగాత్రి,
స్ఫటికాక్షమాలికా జలజాత సితశుకీ
పుస్తక వస్తు ప్రశస్త హస్త,
రంభా ఘనస్తంభ సంభావ్య సుస్నిగ్ధ
సారతరాభ వృత్తోరుయుగ్మ,
కుంభి కుంభోరు సత్కుచ కుంభ, శుంభ ద్వి
జృంభమాణాంభోజ మృదుతరాంఘ్రి

తే. ధన్యజపవాటి, సకలసౌందర్యపేటి,
స్ఫటికకృతపీఠి, కవిజనభాగ్యకోటి,
భరత కైరవహిత జూటి, పలుకుబోటి,
నిఖిల వాక్సిద్ధి భోగాప్తి నింపుఁ గాత.

క. ధరఁ [1]గలుగు సకల విద్యా
పరిణతు, [2]న(త)నుకవి సార్వభౌముని, నన్నె
ద్దురుఁ [3]దరుణీవాయి కులగురు,
నరసింహకవీంద్రు, నెమ్మనమ్మునఁ దలఁతుల్.

క. [1]పండిత బుధగురు కవిరా
ణ్మండలికిని [2]యుక్తి భక్తి మహితాసక్తిన్
దండములిడి, వే కాకవి
తండాననములకుఁ జాల దండము లిడెదన్.

---

6. [1] కలుగు(తె), [2]నతి(గా), [3]తరణి(తి), తరుణి(గా, తి).

7 [1]పండితవరరాట్పర, మండలి(గా), [2]యుక్తి(గా), యుక్త భుక్తి మహితాసక్తిన్(తె).

ఉ. [1]కొన్నిట లక్షణంబు, లేకకొన్నిట లక్ష్యములే, బహుత్వమున్
గొన్నిట, [2]జ్యోతిషంబు లేకకొన్నిట, గూఢముగా ఫలమ్ములే
కొన్నిట, నన్నిటం గలుగు గోప్యములన్నిటిఁ దేటసేతు నేఁ
బన్నుగ సత్కవిప్రతతిపాదము లొఁదలఁజేర్చి వేడుకన్. 8

చ. శతకము యక్షగానములు చాటువులున్ రచియింపలేక కా
మితమను [1]మేరలే(క)వని మిక్కుట మొక్కొక యింటనింట వే
శతకము యక్షగానములు చాటువు లోపిన మోపు లాదిగాఁ
గృతులవి మూల దాఁపన మతిన్ గృతులే యెవరిచ్చ మెచ్చెదర్. 9

తే. [1]ఇదియ కృతిగాద యంటిరా? యిదొక ఛంద
మిదియ లోకోపకారకం, బిదియ శాస్త్ర,
మిదియ కాదా తపతి జగదీశుఁ డిహము
పరము లొసఁగును గవిత సాఫల్యముగను. 10

వ. అవి నిశ్చయించి యుండఁగ నంతట. 11

సీ. శ్రీనాథు చక్రప్రసిద్ధబంధాభిజ్ఞ,
భీముని ఫణిబంధ పేశలంబు,
శబ్దశాసనుని యద్భావాగ్విలాసంబు,
కొమరనంతుని పాదగోపనంబు,
భాస్కరు వరఖడ్గబంధ సంధానంబు,
ప్రబలు సోముని పద్మబంధ మహిమ,
మాఘుని శయ్యాచమత్కారము, మురారి
కవిత త్రిపాద సంఘటన పటిమ,

తే. భారవికవి పదార్థ సద్గౌరవంబు
[1]భారతీపుత్త్రి! నీయందె పరిణమించి

---

8. [1]కొన్నిటి......లేకకొన్నిటి(శా), [2]జ్యోతిషంబదొకక్రొత్తవి(శా).
9. [1]మేరలేవవని(శా).
10. [1]ఇదియు(తి).
12. [1]భారతీవృత్తి(శా) భారతీపుత్త్రి(తి).

విలిచెఁ బుంభావలీలమై విక్క మహహ !
రమణ సుకవీంద్ర ! సత్కవిరాజచంద్ర ! 12

వ. అవి వెండియు. 13

సీ. తతచిత్రబంధ సంధాన ధౌరంధర్యు
వక్షర లక్షణాధ్యక్షు, దక్షు,
[1]సాళు మాధుర్య విస్తార ధీ చాతుర్యు,
ఘన విధాయుధ యుద్ధ కౌశలజ్ఞు,
కల్పిత వృత్తాధికారజ్ఞు, [2]హల్పుగో
పన లక్ష్యలక్షణ ప్రాభవజ్ఞు,
జ్యౌతిష గ్రంథైక సారజ్ఞు, వివిధార్థ
నానావధాన మేధా విధాను,
కలితైక రేఫ అకారోష్ఠ్య నైరోష్ఠ్య
కల్పిత వృత్త సంకలిత చతురు,
వ్యస్తాక్షరాభిజ్ఞు, వాస్తుశాస్త్రవిధిజ్ఞు,
[3]నేకాక్షరీ ద్వ్యక్షరీ ధురీణు,
ప్రౌఢప్రబంధోచిత ప్రక్రియాపద్య సం
గ్రహణ ధారణ నిరాఘాట పటిము,
సంతత నూతనేచ్ఛాకల్పి తాద్భుత
కరలిపి ప్రకటనోత్కట మనీషు,
వదిక చాతుర్య జిహ్వాచల జిహ్వాద్య
నేక చమత్క్రియా [4]స్తో(క) తాఢ్యు

తే. గణిత భరత యతిప్రాసగణ రసజ్ఞు,
నతులి[5]తాత్యేత్వ పాద[6]పద్యభ్రమక ర

14. [1]సాకు...విస్తార(కా) అను(తి) — ఈపాఠమున యతి సంఘటితము కాదు. [2]హల్లు గోపన(ల-శి.), [3]యతిభ్రంశము, [4]స్తొథకా(కా) స్తోరకా(తి), [5]కాత్యైత్వ(కా), [6]పద్యప్రవేశచణ(కా).

చన సుధీనిధి, లక్షణచక్రవర్తి
యనుచు ననుఁ జాలఁ గవిరాజు లభినుతింప. 14

సీ. నందవరంబున నలువొందఁ గా దశ
గ్రంథాలవారను గణనకెక్కి
పిమ్మటిరాయనప్రెగ్గడ వారనఁ
దనరి తర్వాతఁ బొత్తపి యనేటి
గ్రామనామమునఁ బ్రఖ్యాతిఁ గాంచి, యనంత
రంబున ధర దుర్గరాజు పేర
పౌరుషేయంబునఁ బ్రౌఢిచే గౌతమ
గోత్రుండగు, బపిండికొండ దుగ్గ(ర్గ)

తే. రాజ వెంగన పౌత్రుండ, రామఘనుని
పుత్త్రుఁడ, మదూరికొండార్య పుత్త్రుఁడైన
యెలమి రఘునాథమంత్రి దౌహిత్రుఁడఁ గవి
రాజ మిత్రుఁడ, వేంకటరమణకవిని. 15

వ. ఇట్టి నేనొక్క యక్షీణలక్షణలక్ష్యాపేక్ష్యప్రబంధ సంధాన దురంధర నితాంత కుతూహలాక్రాంత స్వాంతుండనై యగణితగుణగణాలంకారాభిజ్ఞ తజ్జ్ఞవిజ్ఞాతవ్య బంధుర గ్రంథ సంవిధాన సావధానంబుగా నొనర్పంబూని ప్రారిప్సిత గ్రంథంబు నిర్విఘ్న పరిసమాప్తికంబుగాఁ బొలయునని శిష్టాచారపరిప్రాప్త విశిష్టేష్టదేవతా వందనంబును, మాతృకా ద్యభినందనంబును, భవ్యశుభశోభిత భారతీ నమస్కారంబును, [1]జిరంత నాధునిక సకలసుకవినికర పురస్కారంబును, వివర్ణస్వర్ణకారాది నరోత్కీర్ణ వర్ణోత్పన్న కాకవిముక్త ముష్కర తిరస్కారంబును గావించి రంగ దుత్తుంగాభంగ మంగళ తరంగితాంతరంగంబుతోఁ దద్విధం [2]బెఱిం గించెద, నవధరింపుము. 16

క. గిరిజేశ్వరుచే నందీ
శ్వరుఁడు గ్రహించిన తెఱంగుఁ జదివి రొకళ్ళా

16. [1] చిరంతరాధునికవి(శా), [2] తెఱంగించెద(తి 1).

క్కరు వెస సనత్కుమార [క]
కలశజ గురుపుత్రి దేవగణముని ముఖ్యుల్. 17

క. పింగళ నాగేంద్రుండా
సంగతి రచియించినట్టి సత్ఫణికివి సా
ష్టాంగము నెఱపి మహాకవి
పుంగవులమ్మున్నదలఁచి మ్రొక్కెదఁ గృష్ణా! 18

క. కవితా లక్షణరీతులు
భువిఁగల వన్నింటఁ గవులు బొగడఁగ వరుసన్
వివరింతు నాంధ్రభాషా
[1]ప్రవిమలకృతి గతివి శాస్త్రపద్ధతిఁ గృష్ణా! 19

తే. కవియు జోస్యుండు జోస్యుండు కవియుఁ గాఁగ
వెలయు విలలోన సకల కవిత్వ తత్త్వ
లక్షణాభిజ్ఞత వహించి దక్షుఁ డగుచుఁ
బ్రొధిచే మించు గోపాలబాలకృష్ణ! 20

తే. [1]ఇంచుకటు చూచి విడువకుఁ డిందు వినుఁడు
మత్కవిత్వ చమత్కృతి మహిమ సకల
లక్షణగ్రంథములఁ గల లక్షణంబు
లన్నియున్నవి చూడుఁడీ విన్నపంబు. 21

వ. మఱియును. 22

తే. శబ్దతర్కాది సకలశాస్త్రములు వినుఁడు
యుక్తి సామర్థ్యములఁ జేసి యొకటి నొకటి
నొనర ఖండించు నటుగాన యుక్తులుంచి
యుండు టుండములేర్చి తీర్చుండు కవులు. 23

---

19. [1]ప్రవిమలగతికృతిని(తి).

21. [1]ఇంచుకరొు చూచి విడుకకుం డెదురు(రా)

[ఆంధ్రభాషాభూషణము - 10]

క. [1]గుణదోషంబు లెఱిఁగి యిది
గుణమిదిదోషమని పూఱఁ గొందురు సుకవుల్
గుణములు దోషములవి దు
ర్గుణములు గుణమనుచు పూఱఁ గొందురు కుకవుల్. 24

వ. మఱియును. 25

[ఆంధ్రభాషాభూషణము - 9]

క ఒప్పులు గలిగిన మెచ్చుఁడు
తప్పులు గల్గిన నెఱింగి తగఁ దీర్పుఁడు త
ప్పొప్పునకుఁ దొప్పు తప్పని
చెప్పకుఁడీ కవు లుపాస్తి చేసెద మిమ్ముఁగా. 26

వ. అని విన్నవించియు. 27

[గ్రంథారంభము]

సీ. వర్ణోద్భవంబు తద్వర్ణసంఖ్యాస్వర
ములు బీజములు గ్రహంబులు ఫలములు
భూషణాంబరములు పూలు గంధమ్ము లా
హారముల్ వన్నియ [1]అధిపులు విష
మామృతములు వమృతాక్షరములును వా
గీశ్వరీ వశ్యముఖియును [2]సిద్ధ

24. [1]గుణదోషంబు లెఱుంగరు, గుణమిది దోషమని పూంచి కొందఱు సుకవుల్ (కా).

2 , [1]అధిపతులు విష(కా) - ఈ పాఠమున వర్ణాధిక్యము గణభంగము నగును. కాన సవరింపఁ బడినది, [2]శుద్ధంబ్మ(కా) సిద్ధ (రం. ఛం. 2-275)

లక్ష్మీ (త్వరితలు) భారతులు నల్పప్రాణ
ములు మహాప్రాణముల్ [లలిత] వాహ

తే. నములు సురనర తిర్యగాఖ్యము లధోక్ష
రములు కులములు నన్యోన్యనములు చెలులు
అరులు పురుషులు స్త్రీలాది ధరణి యందుఁ
గలుగు నన్నియు వర్ణలక్షణము లేను
రచన చేసెద [3]రమణతో రామకృష్ణ! 28

వ. అది యెట్లుంటేని. 29

క. కవిత రచియింపఁ బూనిన
కవికి నియతి మున్ను మాతృకా పూజన, మీ
భువిఁ దత్పూజ యొనర్పని
కవి కవిత నొనర్పఁ జనదు కంసారి! హరి! 30

వ. తత్సంవిధానం బెట్టిదనిన. 31

సీ. వలనొప్ప దంతధావన [1]పూర్వకముగ న
భ్యంజన స్నానము నాచరించి
తదనంతరము [2]పరిధౌత వస్త్రసుగంధ
సుమభూషణాది వస్తువులు దాల్చి,
మాతృకాపూజ నెమ్మది షోడశోప చా
ర ప్రకారతఁ జేసి, ప్రాగుదీచి
ముఖముల [3]నభిముఖముగ సుఖాసన సుఖా
సీనుఁడై కవికృతిఁ జేయు టొప్పు,

తే. [4]నటుల రచియించి సుకవి సౌఖ్యాభివృద్ధి
గలిగి వర్ధిల్లుఁ గృతిపతి [5]ఖ్యాతికెక్కు.

28. [3]క్రమముతో (రా).

32 [1]పూర్వకంబుగ నభ్యంజన స్నానమాచరించి(తి), [2]పరధౌత(తి), [3]నభిముఖమున(రా), [4]నటులు రచియించి(రా), [5]ఖ్యాతికెక్కు(తి),

¹ఆయురారోగ్య భాగ్యములందుఁ గృతియు
శాశ్వతము గాఁగ వెలయు ⁷నిశ్చయము కృష్ణ! 32

## తన్మాతృకా పూజా¹విధి

తే. అర్చనకునై చతుస్త్రింశదంబుజాత
ఘనదళంబులఁ గాదులెల్లను లిఖించి
²యరలఁ బసనాగ్ర కుజచరేఖల స్వరములు
కర్ణికను దదంతాది యుగంబు వ్రాసి 33

సీ. వెలయఁగా టతవర్గములు రెండుపదములు,
అశలూరువులు, పఫ వర్ణములు కుక్షి,
భాక్షరంబది వెన్ను, భా నాభి, మామది,
సన్నుత శ్రీప్రీలు చన్నుదోయి,
చక వర్గయుగము భుజములు, (కంఠము నకార్)
అం బొడ్డు, ఓఔలు నమరు నోరు,
ఏఐలు చెక్కులు, ఋౠ [ఌౡలు] గోళ్లు,
ఉఊలు కన్నులు, నొగి బొమలు

తే. నలరఁ గర్ణము శ్రీ ఇఈ లాననంబు,
అద్వయము మౌళి, శ్వానంబు హాక్షరంబు
యరలవశషలు ధాతుదేహంబు క్ష
రంబు క్రోధంబునైన భారతిఁ దలంతు. 34

---

32. ¹నాయురారోగ్యములందుఁ గృతియు(తి), ⁷నిశ్చలము.

33. ¹విధానవిధి(తా), ²ఈ పాదమున 'ర - ల' - ప్రాసయతి.

34. ¹నః ణః కంఠంబు(తా), ²ధాతువుల్ దేహంబు గలిగిన(తా).

[*సిద్ధప్రదీపిక]

వ. అని తలంచి విప్రమాతృకా [వాగీశ్వరీ] [1]ధ్యాన విధి [సిద్ధ] ప్రదీపిక

చూర్ణికా॥ అథకుముదకుంద కందుక పురందర కరి శీకర గిరి కందర శరదంబుదకంబు శశిబింబ శుభ్రాం, విభ్రాజమాన ముఖరాజీవ పరిమళ విలోలబాల మధుకర గరుదంచల పవన విచలిత కుటిల కుంతలామ్, లతాంతబాణప్రాణబాణసహోదరీ నిజకృపాపాంగతరంగిత సుధాపూర పూరిత దిఙ్మండలామ్, నిజకపోలతలదర్పణ ప్రతిబింబిత రత్నకుండలామ్, అభినవవికచ [2]కల్హార కరవీర [3]కేతకీ మాలతీ మాలాలాలిత వేణీమ్, వీణాపుస్తకపాణి పల్లవామ్, [4]చందనరసాచ్ఛాదనేన విరాజిత తనులతామ్, శుకసనకసనందనాది మునిబృంద వందితామ్, [5]అరవిందజాతకేశవ వాసవ ప్రముఖ సురనికరసన్నుతామ్, సుకవిశుక ఫలిత పారిజాతలతామ్, మధూక తైల నీరాజన దీపధూప కదళీఫల చషక పరిపూరిత క్షీరోపహార ప్రియామ్, విప్రమాతృకాం ధ్యాయేత్. 35

[కవిరాజగజాంకుశమున ప 83]

చ. కలువలఁ గొప్పు దీర్చి సిరిగందమలంది మెఱుంగు ముత్తియ
ప్పులఁ దొడవుల్ బెడంగడరఁ బూని దుకూలముఁ గట్టి చేతులన్
వొలుపగు రత్నవీణయును బుస్తకమున్ విలసిల్లఁ గుంద కు
ట్మల రుచి నొప్పు విప్రకుల మాతృక సత్కవితా ప్రదాత్రియై. 36

వ. అన్నారు. ఇటువలె ధ్యానపూజలు చేసి తర్వాతఁ బ్రబంధరచనోద్యుక్తుండై యుపక్రమింపవలయు. ఇది ప్రబంధచర్య 37

---

35 'ధ్యాననిధి' [*] సిద్ధప్రదీపిక - రంగరాట్ఛందము 2 : 269), [2]కహ్లార - సాధురూపము (కే హ్లాదతే - కహ్లారమ్ పృషోదరాదిత్వాత్ దకారస్య రేఫాదేశః), [3]కేసర (రం. ఛం. 2 : 269). [4]ఛందనరసేనధవళీకృత (Ibid 2 : 269), [5]అరవిందాసనకేశవాసవ (Ibid 2 : 269).

ఇఁక చాటుప్రబంధములకు, ఆశువులకును

క. తాను బలుకు చెలిని మనో
ధ్యానంబునఁ బూజచేసి దలఁపఁగవలె, ల
క్ష్మీనాథ! గద్యపద్యము
లేనాఁటికిఁ గార్యములకు నిటువలెఁ గృష్ణా! 38

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1 - 39]

శా. ఆద్యార్యోక్తుల మాతృకార్చనలు సేయంబూనకే యూరకే
పద్యంబైనఁ బ్రబంధమైనఁ [1]దగఁ గూర్పం జూచెనా నాయకుం
డుద్యత్కీర్తులు చెందనేరఁ [2]డిల కావ్యందున్మహోత్సాహుఁడై
హృద్యశ్రీఁ గనఁ డా నిమిత్తమునకై యీ మాతృకార్చల్వలెన్. 39

వ. అన్నాఁడు. కాఁబట్టి యీ ప్రకారమ్మున వాగీశ్వరీ విప్రమాతృకాధ్యాన పూజలు చేసి పిమ్మట బ్రాహ్మలకుఁ బద్యగద్యప్రబంధంబు లూహించి పూరించవలయునట్టి ప్రబంధప్రచారం బెట్టిదం టేని; 40

## కావ్యస్వరూప లక్షణము

భీమనగారు [కవిజనాశ్రయము 1 - 7]

క. అమరఁగ వేల్పులచేఁ గ
బ్బముఁ జెప్పియుఁ గాదె వరము వడసిరి మును బా
ణమయూరాదులు సత్కా
వ్యముఁ జెప్పినఁ బడయరాని వస్తువు గలదే. 41

వ. మఱియును. 42

(కవిజనాశ్రయము 1 - 8)

క. కమనీయ సమస్తకళా
గమములకును జన్మభూమి కావ్యము, కావ్య

39. [1]దాఁ గూర్పం (ల. సా. సం. 1 : 39), [2]దఁ టె(గా).

గమ విదుఁడు సర్వవిదుఁడని
సమయ చతుష్టయమునందుఁ జదివిరి మొదలన్. 43

(కవిజనాశ్రయము 1 - 9)

క. కావునఁ గవిత్వతత్త్వము
భూవలయములోనఁ దద్ద పూజ్యంబగు న
ద్భావమునఁ జెప్పఁ గావ్య క
లావేదులు పొగడఁ గావ్య లక్షణ మమరున్. 44

వ. అన్నారు గనుక, 45

నరసభూపాలీయ రామరాజభూషణము [రామరాజభూషణుని నరసభూపాలీయము 1 - 26]

మ. పరమజ్ఞాన లతాలవాలము, [1]జగత్ప్రఖ్యాత విఖ్యాత సా
గర చంద్రోదయ, మిష్టసంఘటన రేఖాదివ్య ధేమాత్త మం
బురు [2]కారుణ్య దశావిశాదినముఖం, బుద్వేల నిర్వాణ భ
వ్యరసాస్వాద రసాయనం [3]బనవిఁ గావ్యంబెన్న సామాన్యమే. 46

వెల్లంకి తాతంభట్లువారు (కవిచింతామణి 1 - 9)

క. వేదపురాణాదుల గతి
నాదిహితప్రాప్తి మఱియు నహిత నివృత్తిన్
బాదుకొనఁజేయుఁ గావ్యము
కాదను మనుజుండు వెట్టిగాఁడా జగతిన్? 47

వ. మఱియును. 48

(కవిచింతామణి 1 - 10)

క. నవకముగఁ గీర్తి నిలుపును
వ్యవహారముఁ దెలుపుఁ జాల నాత్మానందం

46. [1]ప్రఖ్యాతి (కావ్యా. సం. 1-26), [2]కార్పణ్య (కావ్యా. స. 1-26), [3]బనిన (కావ్యా. సం. 1-2t).

బవిరతము నలుపుఁ గావ్యము
భువిలోఁ బకికింప సకలపూజ్యము [1]గాదే ? 49

అన్నారు.

[1]నీతిసారము

ఉ. ఆకులవృత్తి రాఘవశరాగ్రమునందుఁ దృణాగ్రలగ్న నీ
రాకృతి వార్ధులింకుట దశాస్యునిఁ జంపుట మిథ్యగాదె వా
[2]ల్మీకులు చెప్పకున్నఁ గృతిలేవి నరేశ్వరు వర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దాతఁడు మేరు వెత్తినన్. 50

శ్లో. "తటాకో ధన విక్షేపో, బ్రహ్మస్థాప్యం శివాలయః
వనాని సత్కృతిః పుత్రః"............... 51

వ. అని యెన్నంబడు సప్తసంతానంబులయందును గృతియ తద్దయుఁ బూజ
నీయంబగు నది యెట్లంటేని. 52

చ. పగులఁ దటాకముల్, విరియఁ బట్టణముల్, పడుగుళ్లు, సంపదల్
నొగులు, వనంబులెండు, నిధులున్ దెకతేరకుఁ బోవు, సత్కృతుల్
పగులవు పాడుపోవ విలపైఁబడ [వాఁడి]ఁ జెంద వెందవే
తగులునఁ జిక్క వారవి సుధాకరమై వెలుఁగొందు దిక్కులన్. 53

వ. అన్నారు. అటుగాన సప్తసంతానసంజ్ఞలయందును గృతి యత్యంత
ముత్తమోత్తమంబు గానఁ బ్రసిద్ధంబగు కావ్యంబు రచియింపందగు. 54
వర్ణనలెవ్వియంటేని —

*విన్నకోట పెద్దనగారు (కావ్యాలంకారచూడామణి 3 - 92)

మ. పురవారాశి మహీధరర్తు శశభృత్పూషోద యోద్యాన పు
ష్కరకేళీ మధుపాన మోహన వియోగక్షేమయాన స్వయం

---

49. [1]పూజ్యముగాదా(కా).

50. [1]'నీతిసారము' అని (తి)ప్రతియందులేదు, [2]వాల్మీకుఁడు(కా).

*వార్తాకవి రఘునాథయ్యగారు అ. కా. ప్రతి.

వర పుత్త్రోత్సవ మంత్ర [1]దూత్య రణ దోర్వైక్రాంతి సంకీర్త నా
కర మష్టాదశ వర్ణనాన్వితము [2]సత్కావ్యంబు భవ్యంబగుఁ. 55

నాగాభరణము

క. ఈ వర్ణనలొక కొన్ని య
భావములైనను మహా ప్రబంధము సుకవి
ప్రావీణ్య[1]లనుగణింతురు
భావజ్ఞులు దాని [2]కొఱఁత పఱచరు పేర్మిఁ. 56

ప్రబంధనామధేయలక్షణము — రఘునాథయ్యగారు —

క. తన చెప్పిన దాఖ్యాయిక
ఘనతరముగ నితరకృతము కథ యిది రెండై
చను సంజ్ఞా భేదంబులు
మునుకొని లక్షణ మభేద్యమునగాఁ జెప్పెఁ. 57

[నరసభూపాలీయము 2 - 53]

క. తనువగు శబ్దార్థంబులు,
ధ్వనిజీవ, మలంక్రియా వితానము సొమ్ముల్,
తనరు గుణంబులు గుణములు,
ఘనవృత్తులు వత్తులౌర ! కావ్యేందిరకుఁ. 58

వ. ఇది కావ్యస్వరూపలక్షణము. [1]ఇట్టి కావ్యలక్ష్మికధిష్ఠాతయగు నాయక
లక్షణం బెట్టం డేని. 59

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1 - 61]

---

55. [1]ద్యూతరణ(కా), [2]తత్కావ్యంబు భవ్యంబిలఁ (కావ్యా. చూడా. 8 - 92).

56. [1]అనుగణింతురు(తి), [2]గొరత బట్టరు పేర్మిఁ(తి).

59. [1]ఇట్టి కావ్యలక్ష్మి కిరవగు నాయకలక్షణ మెట్టిదం డేని(తి).

చ. కళలఁ బ్రవీణుఁడై మిగులఁ గావ్యములందుఁ బ్రియంబుగల్గి కో
ర్కులు సకలార్థి కోటులకుఁ గూర్చి యొసంగుచు దానశూరుఁడై
పొలిచి సుకీర్తియై వినయభూషణుఁడై మహిమానుభావుఁడై
నిలిచిన వాని నాయకుఁ డనిఁ వచియింతురు సత్కవీశ్వరుల్. 60

వ. మఱియును, 61

[లక్షణసారసంగ్రహము 1 - 60]

క. అతులిత బలజిత దానవ
శత ధీరోదాత్త ధీరశాంతులు ధీరో
ద్ధత ధీరలలితు లనఁగాఁ
జతుర్విధపు నాయకులకు సంజ్ఞలు [1]దెలియఁ. 62

వ. ఇది కృతినాయక స్వరూప లక్షణము. ఇట్టి నాయకునకుఁ గావ్యం బొసంగు
సుకవి లక్షణ మెట్లంటేని, 63

పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1-58]

క. ధరణిం గవియగు విప్రుఁడె
వరమతి శుచి యనుచు వేదవచనము తెల్పుఁ
బరఁగు నతఁ డొనర్చిన కృతి
పరమ పవిత్రంబు మొదవు పాలం బోలెఁ. 64

చిత్రకవి పెద్దన్నగారు [లక్షణసారసంగ్రహము 1 - 56]

శిఖరిణీవృత్తము.

శుచిఁ దక్షుఁ శాంతుఁ సుజనవినుతుఁ సూనృతరతుఁ
సుచర్యుఁ [illegible] సదయహృదయుఁ సూరివరునిఁ
బ్రచారుఁ సద్వంశుఁ గృతికుశలునిఁ భాసురతనుఁ
వచఃప్రౌఢుఁ ఛందోవిదుని గవి సర్వజ్ఞుఁడననౌ. 65

---

62. [1]దెలియుఁ (శా).

[లక్షణసారసంగ్రహము 1 - 57]

క. రౌచిక శిల్పక సార్థులు
వాచకుఁ డవివేకి మార్దవ ప్రియుడును భూ
షాచణుఁ డన నేడ్గురు గల
రాచతురత లన్ని గలుగు నతఁడు [1]సుకవగుఁ. 66

*వార్తాకవి రఘునాథయ్యగారు

క. గురువర కటాక్షమును నీ
శ్వర పూజాధ్యానదాన జపతపములు నే
వరునకు సిద్ధించునతఁడు
పరఁగుఁ ధర సుకవి యన సభారంజకుఁడై. 67

క. రౌచిక శిల్పక సార్థక
వాచక మార్దవ వివేకి వరభూషార్థి
ప్రాచుర్య కవి జనమ్ముల
నాచార్యుల వలనఁ దెలియ నగు నెట్లన్నఁ. 68

సీ. తన మనంబున రుచుల్ దవిలిన సంగతి
రచియించు నాతఁడు రౌచికుండు,
వాగ్గుంభణంబున వాచకుండును, నర్ద
[1]మార్దవతాపేక్ష మార్దవుండు.
శబ్దార్థరూప విచార గౌరవముల
విరచించు నతఁడు వివేకి యండ్రు,
అర్థసంఘటనల నలరు సార్థక కవి,
చిత్రద్వయోక్తుల శిల్పకుండు,

తే. కడఁగి కృతులందు విభవంబు గడలు కొనఁగ
బుధుల కింపుగ [2]రచియించు భూషణార్థి

---

66. [1]సుకవియా (ల. సా. సం. 1 - 57).
*రఘునాథయ్యగారివని 'తి' ప్రతి. ఈపద్యములు ల. దీపికలోఁ గానరావు.
69. [1]మార్దవతాపేక్ష(తి), [2]చెప్పను(కా).

యెలమి నీ కవిభేదంబు లేదు దెలియ
వలయు సత్కవివరుల కవశ్యముగను. — అన్నాఁడు. 69

సీ. మెలఁకువ పాదముల్ మెల్లన మున్నిందు
నరసి శబ్ద స్థితులన్ని దెలియు
సకలార్థకలన నిశ్చయముగాఁ గాంక్షించు
సత్పథాలంకార సరణి మెలఁగు
పొసఁగ రసాంతర్గత సువర్ణసంచయ
సంగ్రహబుద్ధి సంచరణి నెఱపు
అతుల దోషాన్వేషణాతి తత్పరతచే
సమయానుకూల విశ్రమత తెలిసి

తే. సకల సమ్మోహనక్రియా చతుర ఫణితి
శయ్య లరయుచుఁ బ్రౌఢిమాచరత దనర
వెలయుచో రోపమాన సద్వృత్తి సుకవి
రాజగోపాల వేంకటరమణ కృష్ణ! 70

వెల్లంకి తాతంభొట్లుగారు [కవిచింతామణి 1 - 8]

క. ఆదిపురాణాగమములు
వేదంబులు నోరగాయవేయకుఁ డుమవఁ
వాదేలా కవివరులకు
మేదిని నెవ్వాఁడు సాటి మించిన గరిమన్. 71

వ. అనుటఁ గొనబట్టి యిటువంటి సుకవిచేత నటువంటి నాయకుండు పద్యగద్య ప్రబంధంబు లందవలయు, నివి కావ్యనాయక సుకవి స్వరూప లక్షణములు — ఇఁక శత్రుమిత్రాక్షర శోధనకు. 72

## *సకలారువడచక్ర లక్షణము

సీ. సకలారువడచక్ర సంజ్ఞ షోడశ గృహ
ములఁ [1]గల్గుఁ జక్రంబు దెలియవ్రాసి

* అరివర్ణచక్రము (అప్పకవి); మిత్రారిశోధనషోడశచక్రము (అ. సా. సం.); మిత్రారిషోడశచక్రము (రం. ఛం.).

73 [1] గల్గచక్రంబు (శా).

యందాదియందు బృహద్భానుభూతేశ
ధాతృ నేత్రాబ్ధి] ²మార్తాండ దిగ్గ
వ గజ [భూప] భువన శరగిరి పక్ష వి
శ్వాఖ్యలఁ గల్గు గేహముల విట్టి
పర్యాయములను నేఁబది వర్ణముల విర్వ
దేను దిక్కులను రచించి యవియ

తే. సిద్ధసాధ్య సుసిద్ధారి చెలువు లర(సి)
నాల్గు నాల్గేసి యిండ్ల సీ నాలుగిండ్ల
నాల్గు రీతుల భువిఁ ³గృతినాథు బుక్ష
వర్ణములకును గూర్మలు వలయుఁ గృష్ణ! 73

ఇందుకు ఫలము

చిత్రకవి పెద్దనగారు (లక్షణసారసంగ్రహము 1-47)

సీ. సిద్ధంబులోనున్న సిద్ధ సాధ్య సుసిద్ధ
ములు లెన్న యరిరిపుల్కలిమి చెలుచు
సాధ్యంబులో సిద్ధసాధ్య సుసిద్ధంబు
లలరించు నందరు లక్కలముఁ జెలుచు
వల సుసిద్ధమునందుఁ గల సిద్ధ సాధ్య సు
సిద్ధముల్మేలరు శ్చెలుచు హితుల
నరియందు సిద్ధసాధ్యములు ప్రీసుత హాని
తత్సు సిద్ధారులు తనకు హాని

తే. గనుక సీ పదాఱిండ్లలోఁ గలుగు లిపుల
యందరుల్ మాని సంపత్కరాక్షరములు
కృతిముఖంబున విలిపిన యతఁడు సుకవి
వనధి గంభీర! యోగంధవహకుమార! 74

వ. అన్నారు కాఁబట్టి 75

73. ²మార్తాండబ్రహ్మద్గజేశ (తి), ³కృతినాథురిక్క (తా), బుక్ష (తి).

తే. మొదలి వర్ణంబె కవితకు ముఖ్యమగుట
వాది తద్వర్ణశుద్ధిగాఁ బాడుకొల్పు
లక్షణాభిజ్ఞతకును దల్లక్షణంబు
తేట పేసెద నవధారు దేవకృష్ణ! 76

క. ధర సమవర్ణము ఘోషా
క్షరముగ ఘోషాక్షరంబు సమవర్ణముగా
జెరచక వ్రాయుటకే నా
దరమున లేఖక జనంబు దలఁచెదఁ గృష్ణా! 77

తే. [1]తప్పు దాఁ జూచి [2]వ్రాయుదుత్తమము లేక
ప్రతిసమానముగా వ్రాయుదతి మదంబు
[3]రెండు విడిచియె వ్రాసెదు లేఖకుండు
గలుగఁ గవిచేయు భాగ్యంబుగాదె కృష్ణ! 78

వర్ణంబు లేఁబదిటికి నామధేయంబులు [*ఛందోదర్పణము 4-127]

క. వర్ణంబన నక్షరమన
వర్ణంబన [1]మాతృకనఁగ నక్కరమనఁగా
విర్ణీత సమాహ్వయములు
వర్ణితములు గృతులయందు వ్రాలకు నెల్లన్. 79

♦ఆంధ్రభాషాభూషణమున

క. లక్షణములు దెలిపెడిచో
నక్షరములు దెలియ కొఱకు ననువైన క్రియన్

78. [1]తప్పులం దాఁ జూచి. (అ. శి. వ్రాతప్రతి), [2]వ్రాయుడు=వ్రాయుట [భావ ట వర్ణకమునకు డు వర్ణకము], [3]రెండు విడిచియె వ్రాసెడి (తి).

*'వార్తాకవి రఘునాథయ్యగారు' అని అ. శి. వ్రాతప్రతి.

79. [1]మాతృకయన (ఛం. దీ. ముద్రితప్రతి. మాతృకనఁగ — మాతృక + అనఁగ - తత్సమస్వరసంధి.

♦ఇది ఆం. భా. భూ.లోఁ గానరాదు.

శిష్టార్థముగాఁ బలుకుదు
లాక్షణికులు దప్పుగాఁ దలంపకుఁడు మదిన్. 80

వ. అన్నా రట్లయగుటంజేసి విన్నవించి తద్వర్ణోత్పత్తిక్రమంబు విధించెద నవధరింపుము. 81

## వర్ణోత్పత్తిక్రమంబు

వర్ణంబులు శివశక్త్యాత్మక [1]బిందూద్భవంబు లనం బరఁగు పురుషునివలన వాయువును వాయువువలన నాదంబును సంపన్నంబులయ్యె; నన్నాదంబు హృత్కంఠ ముఖాంచితంబై కంఠ తాల్వా ద్యష్టస్థానవ్యాపకంబై పరాపశ్యంతీ మధ్యమా వైఖరులచేత నక్షర స్వరూపంబై పంచాశద్వర్ణాత్మకంబై వెడలె; నట్టి యష్టస్థాన జననంబులును, కంఠంబున అఆలును క వర్గంబును హకారంబును విసర్జనీయంబులును, తాలువుల ఇఈలును చవర్గ యశలును, ఓష్ఠంబున ఉఊలును పవర్గంబును ఉపధ్మానీయంబును, మూర్ధంబున ఋౠలును టవర్గ రషలును, దంతంబుల ఌౡలును తవర్గ సలలును, కంఠతాలువుల ఏఐలును, కఠోష్ఠంబున ఓఔలును, దంతోష్ఠంబున వకారంబును, జిహ్వామూలమ్మున జిహ్వామూలీయంబును, నాసికననుస్వారంబును ఙఞణనమలును బుట్టెఁగావున గీర్వాణమ్మునకు అకారాది క్షకారాంతంబై పంచాశద్వర్ణంబులనం బరఁగె.

ప్రాకృతభాషకు నలుబది వర్ణంబులనం బరఁగె; ఆంధ్రభాషయందు ముప్పదేడనం జెలంగె నవి యెవ్వియనిన — అకార ఆకార ఇకార ఈకార ఉకార ఊకార ఎకార ఏకార ఐకార ఒకార ఓకార ఔకార పూర్ణార్ధబిందు ద్వయంబులగు చతుర్దశ స్వరంబులును, క గ చ జ యుగ ట డ ణ త ద న ప బ మ య ర ల వ శ ష స హ లును ఆంధ్ర తద్భవ జనితంబైన ళకార అకారంబులును గూడి [2]ముప్పదేడు వర్ణంబులు శుద్ధాంధ్రం

81. [1]బిందూద్భవంబులని యనఁ బరఁగు (క), [2]ళకార ఊకారంబులను గూడి ముప్పదేడు (తి).

బునకయ్యె! తక్కిన పంచాశద్వర్ణ సంబద్ధంబైన పదేను వర్ణంబులను దత్సమ తద్భవాది భేదంబుల నాంధ్రమ్మునఁ గలిపి వర్తింపుఁ గావున నట్లగుటంజేపి విన్నవించెద. 81

## వర్ణోద్భవము

క. పురహరుని ముఖములేవిటఁ
బరువడి వర్ణంబులైదు పదులవి వరుసన్
ధరలో నాదిక్షాంతా
క్షరములు ప్రభవించె మౌనిసన్నుత! కృష్ణా! 82

వ. తద్వర్ణ సంఖ్యాకుల గ్రహముల వివరించెద నవధరింపుము. 83

సీ. ఆదుల పదిహేను కాదు లిర్వదియేను
యాదులైదును షాదులైదుఁ గూడ
నేబది వర్ణము; లిందులో ఆదుల
[పది]యేను కచట త్రివర్గములవి
భూసురుల్, తపరవల్ భూభుజుల్, యలశష
సహలు వైశ్యులు[ను]శాక్ష(అ)లు శూద్రు
లాది* త్రివర్గవర్ణాళికి రవి, కవ
ర్గవుకుఁ గుజుఁడు, చవర్గువునకు శశి

తే. జుఁడు, టవర్గువునకు భృగుజుఁడు, తవర్గ
వునకు వాచస్పతి, ప వర్గువునకు సౌరి
దనరు యశ వర్గువులు రెంటికిని గశాని
ధి, వరుస పదివర్గువులకుఁ దెలియ కృష్ణ! 84

---

84. *ఆదులకు మాత్రమే రవి; త్రివర్గములనఁగ కచట వర్గములు వానికిఁ బ్రత్యేకమైన గ్రహములు కలవు. కాన నీపాఠము పొరపాటు. "ఆది త్రిపంచ వర్ణాళికి" అని సవరింపనగునేమో!

తదక్షర వర్ణ బీజ భూత ఫలములు

సీ. *అ ఆ ఋ లూ ఞలు ఔ గ జ ట ణ త వ
బ భ ర ష స హ ళ లు బరఁగు నెఱుపు
క ఖ గ ఘ చ ఝ ఠ ఢ ధ ప క్షలు తెల్పు
ఈ ఎ డ ద శ ట లు పీతములు
ర ఇ ఊ థ య ల భ మ ౠ ఫ లు నలుపు
బీజంబు అఆ ఎకచటతపల యషలు పదియా
పరివివి ఈ ఇ ఖ ఛ ర ధ వ ర స లివియుఁ
బదియును ఊ ఓ గ బ జ డ ద ల హ

ఱ పది బూ ఔ ఫ ఝ థ ధ భ ఋ వరలు పది
యును ఞా శ క్ష అంజాఞ(న)ములు పది
పవనశిఖధాత్రి వరుణనభములు ఫలము
దైన్యమృతభూతి సుఖ దరిద్రతలు కృష్ణ! 85

వర్ణ ఫలములు

తే. శ్వేతవర్ణములవి యపేక్షించు శుభము
రక్తవర్ణములవిగోరు రణము నెపుడు
పీతవర్ణములవి యిచ్చుఁ బృథివి ధనము
కృష్ణవర్ణములవి దాల్చుఁ గీడు కృష్ణ! 86

## అక్షరాధిపతులు

సీ. అగచడఫలకును వధిపతి విష్ణువు
అం ద(ధ) వ మహాలకు హరుఁడు జాకు
ఖక్షలకును నృకేసరి తథల్ శేషుండు
షధలకును రవి ఈశలకు వింది

---

* ఈపద్యము అపపాఠభూయిష్ఠము. యతి గణ భ్రంశములు పెక్కులు కలవు

యఖలు వాయువు సణల్ వాణి ఇవలకు
మారుఁడు ళాకు కుమారకుండు
రాకగ్ని బూకు వారాహి కొకింద్రుండు
ఖాకు జినేంద్రుండు టాకుజముఁడు

తే. ణాకు భూతములగు శాబలకును దేవ
[దగ్రులాకుర్వి] లాకు చౌదంతి [మతియు]
పాకు వీరభద్రుఁడు ఝాకు భైరవుండు
ఠాకు నైరృతి పతియు రూఢముగఁ గృష్ణ! 37

తే. డఢణడౌలకును గౌరి ఊః కదితియు
వాకు వరుణుండు [శ్రనకు] వసువు ఏకు
మాధవుండు, షజలకు గణాధిపతియె
పతులు వీరలె వర్ణాధిపతులు కృష్ణ! 38

## తద్వర్ణఫలములు

సీ. *అరయ [ఫలములు] అక్షరములకుఁ
శ్రీతి ఇతరలు సంతృప్తి జయము
బుబూ శాశాల్ చంపు ఏణలు ఓహలు
ముక్తి ధీ వాక్సిద్ధి మోదములును
కలగఘలయలు శ్రీకరము దధల్ ధృతి
శభఫలు శుభము శౌశలు విభూతి
తా విఘ్నకారి నా తాపము లశలు ఊా
ద్యము చఛఝథల మృతము తెవుళ్ల

తే. ఐసలు లాభము దాకాంతి నాశనంబు
పఫలు పోషణ భయములు బవలు సుఖము

---

* వర్ణఫల నిరూపణమున అక్షరగ్రంథములందు పరస్పరము కొన్ని భేదములు కానవచ్చును. అవి లేఖక ప్రతిప్రమాదములు కానోపును.

థఞలు రణములు డషలు ఖేదము మకార
మతివిహీనత అంధైన్యమదియె కృష్ణ! 89

## అక్షర నక్షత్ర లక్షణము

సీ. †అరయ ¹అఆద్వయం బశ్విని, ఇఈబు
²ఋౠలు కృత్తికయు ఏ రోహిణిగును
ఐ మృగశిరయు ఓఔలవి యార్ద్రయు
క పునర్వసూరిక్క ఖగలు పుష్య
[సరి] ఘజలాశ్లేష చఛజలు పుబ్బ యు
ఞలవి యుత్తరయు టఠలవి హస్త
డాక్షరమది చిత్ర ఢణలు స్వాతియు, తథ
దలు విశాఖ ధన పఫ ³లనురాధ

తే. *బ[మ్మ]జ్యేష్ఠ భమలు మూల, యమ్ము పూర్వ
షాఢ రేఫకు నుత్తరాషాఢ సవన
రిక్కలవి రెండు ల ధనిష్ఠ చుక్క వశలు
శతభిషక్తారకంబు విజంబు కృష్ణ! 90

తే. ప్రబలు షసహల కాపూర్వభాద్ర ళాకు
నుత్తరాభాద్ర క్షఅలకు నుర్వి రేవ
తిభమిదవలె తారకల్ తెలిపి యిడఁగ
వలయుఁ బ్రతికావ్యమునఁ గూర్మి గలుగఁ గృష్ణ! 91

---

90. †ఇందు ఊఋ, ఞఙ ల నక్షత్రములం జెప్పఁబడలేదు.
¹ఆఅద్వయ - లో అకారము లఘువుగాను, ఇఈబు - లో ఇకారము గురువుగా చెప్పవలెను [రా].
²ఇందు 'ఋ - రు' వడి కూర్పఁబడినది; పాఠాంతరమున్నదేమో!
³అనూరాధకు రూపాంతరము అనురాధ.
*ఛందోభంగము - సాధుపాఠము లభింపలేదు.

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1 - 24]

క. కృతిమొదలనున్న వర్ణ
ద్వితయమునకుఁ బొందవలయు విధుపేరికిఁ ద
త్కృతి ముఖ వర్ణమునకుఁ గూ
ర్పుతెఱఁ గెఱుఁగ వలె వధూవరులకుంబోలెన్ — అన్నారు. 92

ఇఁక నక్షరంబులకు భూషణాంబరసుమ చందనోపహారముల
లక్షణము

తే. క ఖ గ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ఫ బ ఞ ణ లకు
వజ్రమౌక్తిక [1]భూషలు వరుస మంచి
చలువకోకలు [2]కలువపూ ల్చందనంబు
వలు నుపహార మాయానవాలు కృష్ణ! 93

తే. తథ దధ వఫ బభ మరవల్దాల్చు చంద్ర
కావి చీరలు నబ్జరాగాభరణము
లరయ మల్లెలు సంపెఁగలగరు మృగ మ
దమును గపురము ఘృత నివేదనము కృష్ణ! 94

తే. యలశషసహ ల లకును బీతాంబరములు
పుష్యరాగపు తొడవులు బొండుమల్లె
పూలు కుంకుమ గంధంబు బూసు మోన (?)
నారగించును మధురస మయము కృష్ణ! (?) 95

తే. శ క్ష ఱా ళ్యలు దాల్చు నీలముల సొమ్ము
లలరు కసురి నల్లని వలువ లరఁటి
[1]పూవు లాహార మాసవంబులు దలంపఁ
దెలియవలయును గవులకు దీనిఁ గృష్ణ! 96

93. [1]భూషణాల్ (తి), [2]కర్పూర (తి).

95. (?) 3వ పాదము. అర్థము విచార్యము. 4వ పా. (?) యతిభ్రంశము.

96. [1]పూలుసాహారమాసవంబులు (తి).

ఇఁక సురనరతిర్యగధోముఖ వర్ణ లక్షణము

సీ. చను కఖ గఘ చఛ జఝ టఠ డఢ తథ
దధ పఫ బభలు విబుధులు నాఁగ
ఫలము లారోగ్య సౌభాగ్యము లివి [శుభి]
యారయ దీర్ఘములైన మాన
వులు శుభ ఫలములు నల ఋ ౠ శ ష స శా
య వ మ ఙ ఞ ఞలు తిర్యగులు ఫలము
మధ్యమ పరిపాటి మహి రేఫ యది యధో
గతి దీని ఫలము దుర్గతి యొసంగు

తే. తోన సురనర తిర్యగధో ముఖములు
మది వితర్కించి మేలెంచి మతి వచించి
రచన చేసినఁ గృతిభర్తలకును మిగుల
ప్రమదమగుఁ గాదె బాలగోపాల కృష్ణ ! 97

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1 - 38]

క. ఈ బాగక్షరములలో
వా బలుములఁ బోక రౌరవగతులు తిర్య
క్ప్రాణిదల్యగతులు విడుతురు
క్లీబంబుల విడరు మొదలఁ గీశాధీశా ! — అన్నాఁ రిక. 98

*అమృత విషాక్షర లక్షణము

తే. అ క చ ట త ప య శ లమృత మరయ లఘువు
లవియె దీర్ఘములైన విషాక్షరములు
అమృతవర్ణంబు లైశ్వర్య మాయు నొసఁగు
విషము లెన్నఁగ బ్రహ్మకృ విధము కృష్ణ ! 99

*అమృతవిషవర్ణముల లక్షణములు (శా).

దీర్ఘాక్షరములు విషమాక్షరము లైనందుకు — లక్ష్యము భీమనగారు [చాటువు]

క. కూరడుగము కాయడుగము
నారాయఁగా నుల్లి బచ్చ లల్లమడుగ మా
పేరాముద పాకడిగినఁ
బారమ్మున పేసినట్లు [1]బాపఁడు ద్రెళ్లెన్. 100

వ. అన్నాఁడు కాఁబట్టి యన్నియు నిటువలెఁ దెలియవలెను. ఇఁక. 101

## అల్పప్రాణ మహాప్రాణాక్షర లక్షణము

తే. శిథిలి క గ ఙ చ జ ఞ ట డ ణ త ద న ప బ
యరలమవళి వల్పాఖ్యములనఁగ వెలయు
ఛ ఝ ఖ ఘ ఠ ఢ థ ధ ఫ భ లు, శ ష స హ క్ష
ళలు మహాప్రాణములు నాఁగఁ జెలఁగుఁ గృష్ణ! 102

## ఇఁక స్నిగ్ధరూక్షాక్షర లక్షణము

పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1-36]

తే. మొదల నిట్టి యల్పప్రాణములె సజాతి
యుతములై స్నిగ్ధతాఖ్య మొనరఁ జేయు
వల మహాప్రాణాక్షరములు స్వపరాక్షరయుత
ములయి రూక్షలౌ నివి యాది నిలుపఁదగదు. — అన్నారు. 103

## ఇఁక బాలకుమారరాజ వృద్ధమృతస్వరాక్షర లక్షణము

సీ. కమఁగొనఁగాఁ దగు క ఖ గ ఘ ఙ చ ఛలు
బాలస్వరంబు లాఖ్యంబుఁ జేయు
వరవిమంచఁగఁ జను జ ఝ ఞ ట ఠ డ ఢ లు
విలఁ గమారస్వరమిచ్చు ధనము

100. [1]బ్రాహ్మణు డుల్లెన్. (తి),

నలువొందఁగా నొందు ణ త థ ద ధ న నలు
రాజ్యస్వరం బవి రాజ్యమొసఁగు
పరువడి తోడుత ప బ భ మ య ర ల లు
వృద్ధస్వరం బది వృద్ధి సలుపు
తే. వ శ ష స హ ళ క్ష అ లు మృతస్వరము లరయ
జగడమునఁ జంపు నిజమిది జగతి నెందు
కవిత చెప్పెడి చోటులఁ గ్రమము [1]తోడ
తెలిసి రచియింప వలెఁ గృతి దేవ కృష్ణ! 104

ఇఁక అక్షరవాహన లక్షణము

తే. జగతి క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ
ణ ల కు హంసము త థ ద ధ న ప ఫ బ భ మ
ర వ ల కు శుకము దనరు య ల శ ష స హ ళ
క్ష్వ మాళ క్ష అ లకు సింహంబు కృష్ణ! 105

వ. మఱియు నింక. 106

అక్షరజాతి - సరస్వతీమాతృకావాహన లక్షణము

సీ. జరగు క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ
ఢ ణ లు బ్రాహ్మణ వర్ణగణన గాంచి
వాగీశ్వరీ సరస్వతి విప్రమాతృక
యనఁదగి హంస వాహనము దనరు
సరఁగు త థ ద ధ న ప ఫ బ భ మ ర వ లు
క్షత్రియకులము వైశ్యముఖ భార
తీరాజ మాతృక పేరు చిలుకతేజి
య ల శ ష స హ ళ వైశ్యాన్వయంబు
తే. సిద్ధలక్ష్మి యనంగఁ బ్రసిద్ధవాణి
వైశ్యమాతృకాఖ్య విల నశ్వంబు నెక్కి-

C4. [1]తోన, తెలిసి రచియింప (తి).

తిరుగు ళ క్ష ల ల్ శూద్రజాతి త్వరితన
శూద్ర మాతృక రాగిల్లఁ జూవె కృష్ణ! 107

అథర్వణాచార్యులు —

క. వసుధామరులకుఁ గ చ ట లు
వసుధావరులకును త ప ర వ లు వైశ్యులకుఁగా
య స హ ల శ ష ముల్ శూద్రుల
క స మున ళ క్ష ల లు చెప్పనగుఁ బద్యాదిఁగా. 108

అని అన్నారు.

ఇఁక రాజమాతృకా సరస్వత్యక్షర లక్షణములు

వ. త థ ద ధ న ప ఫ బ భ మ ర వ యీ యక్షరములు క్షత్రియకులము. ఈ యక్షరములచేతనే అంగన్యాస కరన్యాస పూర్వకముగా పూజచేసి రాజులకు గద్యపద్యము లూహించి రచింపవలయు. ఇందుకు, 109

రాజమాతృకా సరస్వతీ వశ్యముఖీ ధ్యానవిధి

సిద్ధప్రదీపిక —

చూర్ణిక॥ అథ దళిత కురువింద పురందరగోప చందన సిందూర [1]సంధ్యాభ్రబంధూక బంధురప్రభా బంధు శోణామ్, శోణార్క మాణిక్య తాటంక కంకణ కేయూర హారనూపుర భద్ర ముద్రికాది భూషణ భూషితామ్, కదంబ కుసుమ కందుక విడంబిత కుచకుంభభరావనమ్ర మధ్యామ్, విద్యాధరీనికర చికురకుసుమ పరాగపరిమళ పరంపరార్చిత మృదులపద పల్లవామ్, ఉత్ఫుల్ల మల్లికాశోక పున్నాగ చంపక కేతకీజాతి ప్రసూనమాలాబద్ధ సుస్నిగ్ధవేణీమ్, లతాంతబాణ మధురకోదండమండిత కరసరోజ యుగళామ్, మృగమదాగరు ఘనసారచందనానులేపనామ్, నవవికచదాడిమీ కుసుమ రుచిరగైరికాంబ రామ్, రాజమనోహర ధూపకాలాగరు స్నేహదీప కనక చషక పరిపూరిత ఘృతోపహారప్రియామ్, రాజమాతృకాం ధ్యాయేత్. 110

---

110. [1]సంధ్యాభ (తి).

ఆథర్వణాచార్యులు —

చ. అలవడ సంపెఁగల్ దురిమి యచ్చపుఁ గస్తురి మేనఁ బూసి కెం
పుల తొడవు ల్వహించి మఱి పుష్పశరంబును దీయ విల్లుఁ జే
తుల విలసిల్లఁ గావి జిగి దూకొను పుట్టముఁగట్టి దీపకు
ట్మల రుచిఁ బొల్పు రాజకుల మాతృక భూజన వశ్యకారియై. 111

వ. అన్నారు. ఈరీతి ధ్యానపూజలు చేసి అరంభింపవలయు. ఇంక, 112

## అన్యోన్య మిత్రశత్రుసమాక్షర లక్షణంబులు

సీ. *ఆదులు పదియేను యశ వర్గవులు పది
అదులు పదునేను కారులైదు
ఆదులు తాదులు కాదులు తాదులు
పాదులు టాదులు పాదులైదు
టాదులు నొండొంటి కన్యోన్య మిత్రులు
తాదులు పాదులు కాదులైదు
అన్యోన్య సములాను అదులు టాదులు
పాదులు అదులన్యోన్య రిపులు

తే. చాదు లాదులు తాదులు యషలు పదియు
కాది పాదులు కాదులు యషలు పదియు
పాది చాదులు సమమైత్రి యషలు పదియు
చాదు లొండొంటికివి మిత్ర శత్రులు హరి. 113

ఇందులకు ఫలము —

తే. మిత్రవర్ణయుతంబులై మెచ్చులొసఁగు
శత్రువర్ణయుతమ్ములై చంపునపుడె
మిత్రశత్రుత్వములుగాదు మిత్రతుల్య
లవియె పరిపాటిసములు మధ్యమము కృష్ణ! 114

---

* ఈ పద్యము లిఖిత ప్రతులలో భిన్నపాఠములలో లేఖక ప్రమాదభూయిష్ఠముగా నున్నది. సాధుపాఠ మెఱుఁగరాదు.

## ఇఁక సంయుక్తాక్షర లక్షణము

క. మొదలఁగ సంయుక్తాక్షర
మదికిన నారెంటికిని గ్రహంబుల మైత్రుల్
గుదురుప వలెఁ బదిపది నా
గదియించిన మేలొనంగుఁ గబ్బము కృష్ణా! 115

క. విను సాంగత్య విశేషము
వినుజెరు వెస సుగుణ దుర్గుణంబులు రెండుఁగా
ఇనుముఁగ బరుసము తెలఁగువఁ
గనకము లోహమును గూడఁ గరఁగిన కరణిఁగా. 116

*శ్రీధరుఁడు —

ఉ. లక్కనమేచి క్రైత మొదలఁగ సుగుణాక్షరముల్ ఘటింప రెం
డక్కర నేల వేఁగల యంతయు [1]మూరెల రావచేపి కొం
డొక్కటి గొల్వఁగా మెఱపి యుబ్బియు విచ్చలు విచ్చలింపుఁడీ
[2]పెక్కువ కబ్బముల్ వెలయు పెల్లుగ నెల్లెడ మెచ్చ విచ్చలుఁగా. 117

†[భీమన కవిజనాశ్రయము 1 - 35]

తే. మొదల సంయుక్త వర్ణంబు గదిపెనేని
మరల నారెంటికిని గ్రహమైత్రి వలయు
[1]నిది విచారింపరేని కృతీశ్వరుంటు
పిడుగు మొత్తిన గతిఁ గూలు బిట్టుబిట్టు. 118

---

*శ్రీనాథుఁడు - అని (శా). లక్షణగ్రంథకర్తగా శ్రీనాథుఁ డెందును పేర్కొనఁబడలేదు. శ్రీధరుఁడనుటకు మాఱు శ్రీనాథుఁడని లేఖకప్రమాద పతిత మేమో.

117. [1]మూరెల రాచబాళిశా (తి), [2]పెక్కుగ (తి).

† 'లక్షణతిలకము' అని లక్షణశిరోమణి వ్రాతప్రతిలో నున్నది (శా).

118. [1]నిది విచారింపకలయఁ గవీశ్వరుండు, పిడుగు మొత్తినగతిఁగూలు బిట్టుబిట్టు (శా).

వ. అన్నా రటుగావున సంయుక్తాక్షరములకు గ్రహవర్ణమిత్రత్వముఁ గూర్చి
మొదల నిలుపవలయును. 119

క. హ ట శ క చ [త] ల వి యాళిన్
బటుగతిఁ బురబాణయుతుల నగరుద్రుల సం
ఘటన మొనర్చినఁ బతి సం
కటపడి చెడుఁ బిడుకలేర్చు కడువడిఁ గృష్ణా! 120

ఇందులకు లక్ష్యము భీమనగారు —

చ. హయమది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు వి
శ్చయముగ నేను రాఘవుఁడ జాహ్నవి [వారిధి మారుఁ డంజనా
ప్రియ తనయుండు లచ్చన విభీషణుఁ డాగుడిమెట్ట లంక నా
జయమున బోతరక్కసుని చావును నేడవనాఁడు సూడుఁడీ.] 121

(ఇది 6-వ చోట తకారము విల్పి తనగుఱ్ఱము నపహరించిన పోతరాజును
భీమకవి తిట్టిన చాటుధార.)

శరభాంకుఁడు —

ఉ. చాపముగా నహార్యమును జక్రిని బాణముగాఁగ నారిగాఁ
బాఁప వరేణ్యుఁ జేసి దలఁపన్ త్రిపురంబులు గాల్పవే యటన్
[దీపిత తీవ్రకోపమున దేవతలెల్ల నుతింప నాఁటి విల్
పాపపు ఢిల్లిమీఁదఁ దెగఁ బాపఁగనే శరభాంక లింగమా!] 122

(ఇది ఆదియందు చకారము, ఆఱవచో హకారము, పదునొకొండవచోట
ककారమును విల్పి ఢిల్లీపట్టణమును దిట్టిన చాటుధార.)

వ. ఇటువలె నన్నింటికిఁ [1]దెలియఁదగును. 123

## ఇఁక స్త్రీపురుషాక్షర లక్షణములు

క. అచ్చులు హల్లులు నేఁబది
యచ్చుగ గుర్వక్షరమ్ము లైనను బురుషుల్

123. [1] తెలియవలయు (తి).

విచ్చలముగ లఘుమాత్రలు
మెచ్చొ స్త్రీవర్ణగణన మెలఁగుఁగా గృష్ణా! 124

ఇఁక స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ అక్షర లక్షణము

క. స్వరములు పురుషులు, నయుకా
క్షరములు వరసతులు, మఱి విసర్గలు జర్దల్
ధరబిందువు లూఁదిన య
క్కరములు నిత్యము నపుంసకంబులు కృష్ణా! 125

మఱియు గ్రంథాంతరము (?)+

క. ♦♦ లలినచ్చులు కత వర్గవు
లిలలోఁ బుసషాక్షరంబు (లిఁక) చ (ళ) ట య వ
ర్గలు సతులగును (మఱి) పవ
ర్గలు నరయంగా నపుంస కాఖ్యలు కృష్ణా! 126

క. ♦♦ స్వరయుతములైన హల్లులఁ
బరఁగుఁగా స్త్రీలింగ సంజ్ఞఁ, బదియూఅచ్చుల్
ధరపుంలింగము, లచ్చులఁ
బొరయవి వర్ణములు క్లీబములు శుభచరితా. అన్నారు. 127

ఇందుకు ఫలము —

క. మొదలఁగా స్త్రీ పుంలింగము
లదికినఁ గృతిపతికి నాయురారోగ్య శ్రీ
లొదవు, నపుంసక లింగం
బది గదియఁగ విడిన బెడఁద లదరుఁగా గృష్ణా! 128

ఇఁక నూర్ధ్వాధోముఖ పార్శ్వముఖాక్షర లక్షణము

క. తలకట్టులు గల వర్ణ
మ్ములు నోత్వములెన్న నూర్ధ్వముఖములు, గుడుసుల్

125. [1] సయుకా (కా).
+ గ్రంథముపేరు తెలియరాదు.

గల యక్షరము లధోముఖ
ములు, కొమ్ములు గలవి పార్శ్వముఖములు కృష్ణా! 129

ఇందులకు ఫలము —

ఆ. ధర నధోముఖములఁ దప్పదు రోగంబు
పార్శ్వముఖములైనఁ బాయు ధనము
మీఁద ముఖములైన మిడికించుఁ బతివింట
సహజవర్ణసమితి సౌఖ్య మొసఁగు. 130

అనంతనగారు [ఛందోదర్పణము 4 - 128]

క. [1]ఆదులు వర్గత్రయమును
భూదేవతలు తపవర్గములు రవలును ధా
త్రీ దయితులు య ల శ ష స హ
[2]లాదట మూరుజులు శ ష రాఖ్యలు శూద్రుల్. 131

ఆ. *కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ
అప్రమేయ వరద హరి ముకుంద
* * *
* * * అన్నారిఁక. 132

## ♦ వైశ్యమాతృకా సరస్వతీసిద్ధ లక్ష్మీధ్యానము

వ. య ల శ ష స హ యీ యక్షరములు వైశ్యకులాక్షరములు. ఈ అక్షరములచేతనే అంగన్యాస కరన్యాస పూర్వకముగాఁ బూజచేసి వైశ్యులకుఁ బద్య గద్య ప్రబంధము లుపక్రమింపవలయుఁ గావున. 133

---

131. [1]అకారాదులు (తా), [2]లాదటనను రూజులు శ ష రాఖ్యలు శూద్రుల్ (తి).

* ఈ పద్యమున కిందు సందర్భము తెలియరాలేదు.

♦ వైశ్యకులమాతృకకు, సిద్ధప్రదీపిక యందు — అని రం. ఛం. (2-275).

## వైశ్యమాతృకా సిద్ధలక్ష్మీధ్యానవిధి

సిద్ధప్రదీపిక —

చూర్ణికా॥ అథ దినకర తరుణకరవికర [1]ప్రకాశిత కనకకమలవారిత లాలిత విపిల జలధరాంతర్నట తటిల్లతాపుల్లత్ కర్ణికారకోరకవిభ ప్రభా భాసమానామ్, అనమాన ఘుసృణ కుంకుమ సంకుమదపంక భూషిత విపుల కుచకలశ శోభినీమ్, కనత్కనకమయ మంజు మంజీర హార కేయూర మనోహరామ్, నవవికచమాలికాకుంద శతపత్ర మల్లికా స్తబక విలసిత కబరీమ్, అమంద సౌందర్య సరస వదనారవింద కందళిత మందస్మిత చంద్రికాపాన గర్విత పరివార గీర్వాణపురంధ్రీలోచన చకోరీమ్, ఉన్నిద్ర [2]పలాశ కుసుమ పరాగ పరి[3]మళిత హరిద్రా రంజితాంబరామ్, శంబరారి హరకుటుంబినీమ్, అంబురుహ ముకుళహస్తామ్, బస్తాజ్యదీపమాహేశ్వర ధూప కలధౌత చషక [4]పూరిత మధురసోపహారప్రియామ్, వైశ్యమాతృకాం ధ్యాయేత్. 134

శ్రీధరుఁడు —

చ. వెలయఁగ [1]బొడ్డు మల్లియలు వేసవి నంగమునన్ [2]విభూషణా
వళులు ధరించి [3]లేఁ బసుపు వన్నియ పుట్టము గట్టి కుంకుమం
బలఁది పసిండి తామరలు హస్తమునన్ వెలుఁగొంద ధర్మ ని
ర్మల రుచిఁ బొల్చు వైశ్యకుల మాతృక భూరిధన [4]ప్రదాయియై. 135

వ. అన్నారు. ఈరీతి ధ్యానపూజలుచేసి వైశ్యులకు గద్యపద్యప్రబంధము లుపక్రమింపవలయు, వీఁక. 136

## విభక్త్యధిదేవతాఫల లక్షణము

సీ. మహి నెన్నఁగాఁ బ్రథమా విభక్తికిని వి
రావళి యాద్వితీయా విభక్తి

---

134. [1]వికసిత(రంగ.,పా.), [2]ప్రకాశ(కా), పలాశ(రంగ), [3]మిళిత(కా), [4]పరిపూరిత (రంగ).

135. [1]జాంతు మల్లియలు (రంగ. ఛం. 2-౬77), [2]మంభూషణా (కా), [3]లేంబసుపు (తి).

135. [4]ప్రదాత్రియై (కా).

కివి కీర్తిమాలివి దనరు తృతీయా వి
భక్తికి శుభగాఖ్య ప్రబలు మిగుల
మతి చతుర్థికి భోగమాలివి యన నొప్పుఁ
బంచమికివి గళావతియె యలరు
సతము షష్ఠికిఁ గాంతిమతి సప్తమికి రమ
సంబోధనమునకు జయ యనంగఁ

తే. దగును సప్త విభక్త్యధి దైవములివి
విక్రమఖ్యాతి శుభభోగ విభవకాంతి
సంతతైశ్వర్య విజయముల్ సరవితోన
ఫలములొనగూర్చుఁ [1]గర్త్రు భర్తలకుఁ గృష్ణ! 187

వ. 'శ ష ల' యీ మూఁడు అక్షరములు క్షుద్రమాతృకాక్షరములు. ఈ అక్షరములచేతనే అంగన్యాసకరన్యాసములుచేసి పూజచేసి తదనంతరంబ క్షుద్రులకుఁ బద్యగద్యప్రబంధ సమస్యలుపక్రమింపవలయు. 188

ఇందు క్షుద్రమాతృకా సరస్వతీ త్వరితాధ్యానవిధి

[సిద్ధప్రదీపిక] —

చూర్ణికా॥ అథ తరుణతర హరితతృణ గరుడ మణిశకల మరకతమణి పురందర నీల శ్యామలామ్, కోమలకనక కదళీదళాంకుర శ్యామల కర్బుర కేశ పాశామ్, అభినవ తారుణ్య విభవ వితాన లీలాలాలిత విలాస మందిరామ్, ఇందిరానందన సుందర హరినీల కందుక [1]ప్రస్యంద కఠినకుచతట విలుఠన్మంజు గుంజాహారలతామ్, [2]లతాంత సుభగ యూధికానువిద్ధ సుస్నిగ్ధకుండలామ్, దంతావళదంత కర్పూరగోరోచనానులేపి సర్వాంగిమ్, అనంగమోహనశర[3]దూషిత మేదుర గరళసోదర సుకుమార కజ్జలరేఖా మనోహర విచక్షణేక్షణామ్, చలచ్చలిత కర్ణవ[4]తంస కీరశాబామ్,

---

187. [1]కర్త్రు భర్తలకు (శా).

189. [1]ప్రచండకఠినకుచ (శా), [2]నితాంత (రం. ఛం. 2-279), [3]శర దూషిత (రం. ఛం. 2-279), [4]కర్ణావతంసిత (రం. ఛం. 2-279),

అకళంక శశాంక ధవళదంత తాటంక విలసితామ్, అసదృశ హరిచందన తరుణకిసలయ రచితాంశుకామ్, మల్లికా విచిత్ర బర్హిగరుదంచిత కాంచన పుంఖ విశిత శర వైణవ బాణాసన లలిత పాణిపల్లవామ్, [2]కుసుమాకర పూర్త్యైరండ తైలదీపికామ్, కాంచన చషక పరిపూరిత హాలా రసోపహార ప్రియామ్, శూద్రమాతృకాం ధ్యాయేత్. 139

వ. ఈరీతి శాస్త్రోక్త ప్రకారంబున [1]నేజాతివారికి ఆజాతి మాతృకా సరస్వతీ ధ్యాన పూజలు చేసి ఆయాజాత్యక్షరములనె పద్య గద్య ప్రబంధము సమస్యలు మొదలఁగదియించి కృతులు రచియింపఁ గర్త భర్తలు సౌభాగ్యాయురారోగ్యముల వర్ధిల్లుదురు గావున నీ ప్రకారంబునఁ గృతు లుపక్రమింపవలయు; నిది ముఖ్యపక్షము. 140

ఇఁక గౌణపక్ష లక్షణము

తే. బ్రాహ్మలకు నాల్గుజాతుల, రాజులకును
[1]మూరు జాతుల, వైశ్యుల కారయఁగను
రెండు జాతుల శూద్రుల కొండుజాతి
వర్ణములు గూర్చి రచియింపవచ్చుఁ గృష్ణ! 141

వ. బ్రాహ్మలకు బ్రహ్మ క్షత్రియ వైశ్య।శూద్ర జాత్యక్షరములు నాలుగింటను, క్షత్రియులకు క్షత్రియ వైశ్య శూద్ర [1]జాతులు మూఁడింటను, వైశ్యులకు వైశ్యశూద్ర జాత్యక్షరములు రెంటను, శూద్రులకు [2]శూద్రజాత్యక్షరములు గూర్చి కృతులు రచియింప [3]వలయు. 142

---

139. [2]కుసుమాకరధూప పాత్ర్యైరండతైల దీపికామ్.

140. [1]చతుర్వర్ణాల్కు (తి).

141. [1]మూఁడు అనుటకు 'మూరు' అనురూపము ప్రయుక్తము. ఇది ప్రాసయతి స్థితమగుటచే నిర్ధారక ప్రయోగమగును.

142. [1]జాత్యక్షరములు మూఁటను (తి), [2]శూద్రజాత్యక్షరములనే కాని ఇతరజాత్యక్షరములు కారాదు (తి), [3]రాదు (కా).

తే. జగతి నీగతిఁ దెలియఁగా సకల వర్ణ
జనన లక్షణ ఘని కవిసార్వభౌము
లార! చాతుర్య లక్షణ లక్షితజ్ఞు
లార! చూడుండు [1]నతి కవిరాజులార! 143

శా. రాధాభూధరవ త్పయోధర హరిద్రాముద్రితోరస్స్థలా!
గాధేయాధ్వరరక్ష! రాక్షస మదోగ్రగ్రావ దంభోళి ధా
రాధుర్యాయుధ సాధితైధిత యశోరాజీవి రాజద్గుణ
ప్రాధాన్యా! [1]జనమాన్యధన్యమహిమా! భక్తైక రక్షక్షమా! 144

పారిజాతవృత్తము

వందనందనాబ్జబాణ నందనార్కనందినీ
కందబృంద నవ్యదేహ కంధి వర్ణ మంథనా
మందహాస తుండ భాన మాన వాగ మంది నీ (?)
ఇందు కందళాంక రాక్షసేంద్రభాగ్యబంధనా! (?) 145

కవిరాజవిరాజితము

జనహితకారణ! సంస్మృతితారణ!
శత్రువిదారణ! శౌర్యచణా!
రణతటధారుణ! రాక్షస దారణ!
రక్షితవారణ! రమ్యఘృణా!
ప్రణత విభీషణ! పాండవ పోషణ!
భామజతోషణ! భవ్యగుణా!
మణిమయభూషణ! మంజులభాషణ!
మౌనధురీణ! రమారమణా! 146

143. [1]గతి (శా).

144. [1]మహిమాన్య (తి).

145. ఇదియే సుగంధివృత్తము. అన్యలక్షణగ్రంథము లిట్లే పేర్కొనెను. పారిజాతమన్నది ల. శిరోమణి పెట్టిన పేరు. చూ. 3-47, (?) యతిభంగము - సాధుపాఠము దుర్లభము.

## గద్య

ఇతి శ్రీమద్వేంకటరమణ కరుణాకటాక్షవీక్షణసంప్రాప్త సహజ సారస్వత, విశ్రుతాక్రాంతవిశ్రాణన సంతత సంతోషి తామం దానంద కందళిత నిఖిల ధరాబృందారకబృంద, నందవర వంశోత్తంస, సకల కవిరాజమిత్ర, పౌత్తపి వంశ పవిత్ర, గౌతమసగో, త్రాశ్వలాయనసూత్ర, సుచరిత్ర, వపిండికొండ [1]దుర్గరాజ వెంగనమంత్రి పౌత్ర, రామయామాత్య పుత్ర, మడూరి రఘునాథ [2]ప్రధాన దౌహిత్ర, [3]యశేష విద్వత్కవిజన కృతాదరణ పాత్ర, చతురుపాయధురీణ, కార్యఖడ్గప్రవీణ, నిఖిల సుకవి జనాంగీకృతదత్తనిశ్శంక లక్షణ చక్రవర్తి బిరుదాంక, వేంకటరమణార్య ప్రణీతంబైన సకలలక్షణసంయుత సుధాబ్ధి సంపూర్ణ చంద్రోదయంబగు 'లక్షణశిరోమణి' యందు, వర్ణగణవృత్త విశ్రమాధికారమ్ము లనుచతుర్విధాశ్వాసముల విస్తరిల్లుచుండు, నందుఁ బ్రబంధారంభమున శ్రీ వేంకటేశ్వర భజనమ్మును, శివకేశవప్రార్థనయు, విఘ్నేశ్వర స్తవంబును, శారదా స్తోత్రంబును, పురాతన నూతన విద్వద్గురు కవీశ్వరాభివందనమ్మును, కుకవి తిరస్కారంబును, గౌరీశ్వరులచేఁ గవిత్వతత్త్వ మహత్త్వరీతి, నందీశ్వరాది సనత్కుమార గురు శుక్ర శక్రాది దేవమునిముఖ్య లభ్యసించిన విధంబును, శబ్దతార్కికుల వేఁడుటయు, లేఖకజనస్తుతియు, రచనారంభంబునఁ గవినియమంబును, మాతృకార్చన చందంబును, [4]పంచాశద్వర్ణవృత్తి భారతీభాతియు, కావ్యస్వరూపంబును, కృతినాయక నిర్ణయంబును, సుకవిలక్షణంబును, అరువది చక్రక్రమంబును, తద్వర్ణ సంఖ్యయు. తత్కాలంబులును, తద్గ్రహ నిశ్చయంబులును, తద్వర్ణంబులును, తత్తద్బీజాక్షర ప్రకారమ్ములు, తద్వర్ణాధిపతులును, తద్వర్ణఫల విధానమ్ములును, తదక్షరనక్షత్ర నిరీక్షణంబులును, తద్భూషణాంబరసుమ చందనోపహారముల తెఱంగును, సురనరతిర్యగధోముఖవర్ణ నియ

---

గద్య. [1]దుగ్గరాజ వెంగనపౌత్ర (తి), [2]ప్రధానపౌత్ర (శా), [3]లిఖిత ప్రతియందు యకారాగమము గానవచ్చెడు. కాని సంస్కృత సమాసము మధ్య ఈ యకారము వ్రాయుట లక్షణసంతము గాదు.
[4]పంచాశద్వర్ణకృతి భారతీ భాఁతియు (తి).

మంబులును, అమృత విషవర్ణ ఫలాఫలంబులును, అల్పప్రాణ మహాప్రాణ స్నిగ్ధరూక్షాక్షర లక్షణ గణనయు బాలకుమార రాజ్యవృద్ధ మతస్వర భేదంబులును, అక్షరజాతి సరస్వతీ మాతృకాధ్యానగతియు, అన్యోన్య మిత్ర శత్రు సమమిత్ర సమ(శత్రు) శత్రుత్వ వర్ణమార్గంబులును, తత్ఫలంబులును, సంయుక్తాక్షర వృత్తియు, మృత్యువర్ణ సంధానస్థాన ఫల నిర్దేశంబును, స్త్రీపురుషాక్షర వృత్తియు, స్త్రీలింగ పుంలింగ నపుంసక లింగ త్రితయ సంగతియు, తత్ఫలమ్ముల చొప్పును, ఊర్ధ్వముఖాధోముఖ పార్శ్వముఖ వర్ణ సమవర్ణ సంధానస్థాన ఫలమ్ముల దారియు, వైశ్య మాతృకాధ్యాన విధమ్మును, విభ్యక్త్యధిదైవతఫల మహత్త్వంబును, శూద్ర మాతృకాధ్యానవిధానంబును, చాతుర్వర్ణ్య సంకీర్ణ రచనా విచారణ ప్రచారమ్ములును, సుకవిలాక్షణికుల వేడుకయునుంగల వర్ణాధికార మ ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు

శ్రీ శారదాంబాయై నమః

# లక్షణశిరోమణి

## ద్వితీయాశ్వాసము

### గణాధికారము

క. శ్రీరామారమణ! జయ
శ్రీరమ్యగుణాభిరామ! శ్రీవేంకట లో
కారాధ్య! ప్రోవు మమ్ము, ద
యారస సుమదామ! వేంకటాచలధామా! 1

క. శ్రీ రమణీ హృదయాంబుజ
సారమిళింద ప్రచార! చారు వచశ్శ్రీ
ధీర బుధాధార! సుధా
హార మనస్స్ఫురణ! వేంకటాచలరమణా! 2

తే. తరణివా యాన్వయాబ్ధి సుధాంశుఁ డనఁగ
వెలయు మద్గురుఁ జాతుర్య వివిధ కరణ
శబ్దతర్కాది [1]నిఖిలశాస్త్ర ప్రవీణుఁ
గవిజనబ్రహ్మ నరసింహకవిఁ దలంతు. 3

---

3. [1]సకలశాస్త్ర (లి).

వ. అని యిట్లు మదీయగురువందనం బాపాదించి వెండియుఁ భవదీయకృతి సంవిధానోద్యుక్తబుద్ధిచే సావధానంబున విధించెద, నవధరింపుము. 4

క. తిట్టుకు దీవించుటకుఁ
గట్టిగ భువిలోన గణమె కారణ మగుటఁ
పట్టపు కవిరాజులు చే
[1]పట్టఁగ నవియేను దేటఁ బఱపెదఁ గృష్ణా ! 5

వ. అట్టి కొలందులెట్టి వనిన. 6

సీ. కులములు గోత్రముల్ ఫలములు గ్రహములు
తారక ల్రాసులు వారములును
జనన యామములు భూషణములు కోకలు
పూవులు గంధముల్ పొంతువులును
గణములు వన్నెలు గుణములు దేశము
లధి దైవతమ్ములు నాయుధములు
గ్రహవర్ణములును దద్రస నిర్ణయమ్ములు
వేళలు నక్షత్ర వేధ లరులు

తే. మిత్రులును దత్త్వములు సమమిత్ర శాత్ర
వములు పంచకములు దశావస్థ లుచ్చ
నీచ నిర్జీవ జీవాది నిఖిల లక్ష
ణములు రచియింతు గణముల కమరఁ గృష్ణ ! 7

తే. శాస్త్ర పద్ధతిఁ [1]జెప్ప నీ చందమెల్ల
నివియె వక్రోక్తి మార్గములనుచుఁ దమరు
దెలియనేరక నవియుఁ దాఁ దెలియకునికి
కొదవయే యండ్రు నిజమెవో [2]కొదవు కృష్ణ ! 8

వ. అది యట్లుండె. వెండియుఁ గణంబులెయ్యవి యంటేవి తద్గణోద్భవ క్రమ మవధరింపుము. 9

---

5. [1]పట్టఁగ నవ్వియును (తి).

8. [1]జెప్పిన (తి), [2]కొదవ కృష్ణ (తి).

క. హరులోచనత్రయంబున
ధరగురువులు, ¹మూరు గలిగి తారు మగణమై
పరఁగఁగ దన్మగణంబునఁ
గర మరుదుగఁ దెలియ ²సకల గణములు పుట్టెఁగా. 10

## తద్గణ జన్యజనక లక్షణము

తే. మగణమునఁ బుట్టె యగణ, మయ్యగణమునకు
రగణమయ్యెను, రగణాన సగణమొదవె,
సగణమందున తగణ, మత్తగణమునను
జగణమయ్యెను, జగణాన భగణమయ్యె,
భగణ జననము నగణమై పరఁగెఁ గృష్ణ! 11

వ. అట్టి గణము లెటువలెఁ ¹దెలియ వలయు నంచేని, 12

క. గురువులు ¹మూఁడిట మగణము
ధర వెలయుఁగా బ్రథమ గురువు దగ భగణమునఁగా
²గురు మధ్యమైన జగణము
జరుగు గురువు ³తుదిని బొంద సగణము కృష్ణా! 13

క. నగణంబు లఘుత్రితయము
యగణంబునకాది లఘువు నారయధరలోఁ
దగు మధ్య లఘువు రగణము
తగణమునకుఁ దుదను లఘువు దనరుఁగా గృష్ణా! 14

తే. రెండుగురువులు గగ మగు, ¹రెండు లఘువు
లలము, వగణము లఘువును నలము, నగణ

---

10. ¹మూఁడు (తి), ²సప్తగణములు (తి).

12. ¹తెలియవడునంచేను (తి).

13. ¹మూటను (తి), ²గురుమధ్యమమై (తి), ³తుదను (తి).

15. ¹రెండు లఘువులు అని యుండ నగు.

ము గురువు, నగణము లఘువు నగము, వలము,
లఘుగురు గురులఘువు లవి లగము గలవి. 15

ఇఁక నందు సూర్యేంద్ర చంద్రగణ నిర్ణయ ప్రకారము.

### సూర్యగణములు

తే. వరుఁగ గురువులు రెండొడ్డి ప్రస్తరింప
సర్వ లఘ్వంతమున నాల్గు చను గణమ్ము
లాది రెండును గడిపి మాత్రాది గణము
న కొక మాత్ర నిల్ప రవిగణములు కృష్ణ! 16

### ఇంద్రగణములు

తే. వరుస గురువ్రాలు మూఁడిడి ప్రస్తరింప
సర్వ లఘ్వంత మెన్మిదై చను గణమ్ము
లాది రెండును డిగిచి మాత్రాదిగణము
లాది లఘువున్న నింద్రలై యలరుఁ గృష్ణ! 17

### చంద్రగణములు

తే. ♦♦ పంక్తి గురువులు నాల్గిడి ప్రస్తరింప
వలరు లఘ్వంతమునకుఁ బదాఱుగణము
లాది రెండును దిగిచి మాత్రాదిగణము
లాది లఘువిడఁ జంద్ర గణాళి కృష్ణ! 18

అనంతనగారు [ఛందోదర్పణము 1 - 18]

క. ♦♦ ద్విత్రి చతుర్గురు భవముల
ధాత్రీధర! రెండు నడువఁ దక్కిన గణముల్
[1]మిత్రేంద్ర చంద్ర గణములు
మాత్రాది గణంబు [2]లాది మాత్ర లిడఁగన్. అన్నారు. 19

19. [1]మిత్రేంద్రచంద్రులనఁ జను (ఛం ద.1-18), [2]పొందు (ఛం.ద.1-18).

### ఇఁక గణసంఖ్య

తే. ఒక్కచో నాల్గు మఱియు వేఱొకట నెన్మి
దొక్క యెడఁ బదాఱు గణంబు లుర్వి లఘువు
లెక్కనవి యిందు నొకటి మూరేళు గ్రమము
తో గణంబులు ముప్పది తొమ్మిది హరి. 20

### సూర్యేంద్ర చంద్రగణములు

తే. నగణ గల లినులు, నలము నలము నగము
భరత లింద్రులు, మలఘు భగురు భల రల
నలల తల నలా సహ నహ నగగ తగురు
సవ సవ రగురు లిందు గణములు కృష్ణ! 21

### మఱియు నిఁక గురులఘు సంజ్ఞాక్షర లక్షణక్రమము

తే. సకలభాషా కవిత్వ ప్రచారములను
రహలు సంయోగవర్ణ పరత్వమైన
పూర్వ వర్ణంబు లఘువగు భువి వికల్ప
మైన నొకచోట గురువగు నదియె కృష్ణ! 22

సీ. అదియెట్టు లన నుదాహరణ లేర్పఱచెద
హరి రయము రసిత హరి* శ్రియమన
సాధు తతి రధి తిష్ఠతి గ్రామ మనఁగ జ
యతి ప్రభు రన రేఫయుతము లయ్యె
నొనరు హకార సంయుత మేతి హ్రద మాన
హతి హ్రస్వ మనఁగఁ ద్యజతి హ్రియమన
కవి యుక్తిని తనస్త్రి క్వ నృపతి రక్షవి
క్వచిదనంగను సాధుక్వణతి యనఁగఁ

---

23. *అధోరేఖలు, సంయుక్తపూర్వాక్షరములు లఘువులనుటకు సూచన.

తే. దనరు విత్యాది శబ్దవితతి గణింప
కవరహయుతమ్ములైన యక్షరమునకును
పూర్వవర్ణంబు లఘువునై పొదలుఁ గృతుల
వసుధఁ గవు లివి దెలియఁగా వలయుఁ గృష్ణ! 23

ఇందుకు ఉదాహరణము ఛందశ్శేఖరమున పింగళ నాగేంద్రుఁడు — లక్ష్యము.

శ్లో. పాదాదావిహ వర్ణస్య, సంయోగః క్రమసంజ్ఞకః ।
¹పురస్థ్సితేన తేనస్యా, ల్లఘు తాపి క్వచిద్గురుః ॥

సర్వా స్వపిచ భాషాసు, రహయుక్తే క్షరేపరే ।
పూర్వ వర్ణస్య లఘుతా, వేష్టా తు క్వాదికే పరే ॥

తరుణం సర్షపశాకం, నవోదనం పిచ్ఛిలానిచ దధీని ।
అల్పవ్యయేన సుందరి, గ్రామ్యజనో మృష్టమశ్నాతి ॥ 24

వ. రేఫ సంయుక్తేషు చరతి భ్రమరః వసతిగ్రామే, జయతిప్రాజ్ఞః, హకార సంయుక్తే చ విష్ణుహాసః, వహతి హ్రస్వః, త్యజతి హ్రియ మిత్యాది క్వవసంయోగే - అస్తిక్వభూమౌ, వేశ్మని క్వచిత్, స్వాదు క్వణతి, ఇత్యా ద్యుదాహరణాని, ఇతి ప్రౌఢోక్తిః 25

---

24. ¹పురస్థితేన [వృత్తరత్నాకరము - నాగరలిపి ముద్రణ.]

పింగళ నాగేంద్రుని ఛందశ్శేఖరములోనివిగాఁ బై మూఁడు శ్లోకములు అ. శి. లిఖిత ప్రతిలోఁ జేర్పఁబడినవి. కాని పింగళాచార్యుల ఛందమునకు ఛందశ్శేఖరమను పేరున్నట్లు తెలియరాదు. మఱి పింగళచ్ఛందమున నీ శ్లోకములు లేవు. 'పాదాదావిహ' — అన్నది వృత్తరత్నాకరము (1-10) న నున్నది. దాని యుదాహరణము 'తరుణంసర్షప' (వృత్త 1-11). 'సర్వాస్వపిచ' అన్నది ఛందశ్శేఖరములోనిదిగా వృత్తరత్నాకర టీకోధిని వ్యాఖ్య యుదాహరించినది. ఈ వ్యాఖ్య కవిశార్దూల శ్రీనాథ విరచితము. ఇతఁడు మన తెనుఁగు శ్రీనాథుఁడు కాఁడేమో!

ఇఁక సామాన్య గురు లఘుసంజ్ఞా బోధకప్రకార సంజ్ఞాక్షర లక్షణము

క. ధర దీర్ఘము లూఁదిన య
క్కరములు నొత్తులు పిఱింది గలసిన యా య
క్షరములు గురువులు, మఱి త
ద్విరహితములు లఘువు లగుచు వెలయుఁగ గృష్ణా! 26

అనంతనగారు [ఛందోదర్పణము 1-8]

క. వివిధముగఁ జాఁపి పలికెడు
నవియును మఱి యూఁది పలుకునవియును గురువుల్
భువి నిలిపి పలుకు వర్ణము
లవి యన్నియు లఘువులయ్యె [1]నంబుజనాభా! 27

వ. అన్నాఁడు. మఱియు నిఁక, 28

గణసంజ్ఞా బోధక పద్ధతి

క. మగణము 'శ్రీకృష్ణా' యన
యగణ 'ముపేంద్రా' యనంగ నఖిలేశ మహిఁ
తగణము 'దైత్యారి' యనఁగ
భగణము 'మాధవ' యటంచుఁ బలికినఁ గృష్ణా! 29

తే. వసుధ ర గణము దగు 'కేశవా' యనంగ
పొందు జగణంబు కృతుల 'ముకుంద' యనఁగ
తనరు సగణంబు మఱి 'వరదా' యటన్న
నగణమనఁ జను 'నృహరి' యనంగఁ గృష్ణ! 30

క. 'హరి' యన లఘము 'హరీ' యన
ధర వగణము లగము నాఁగఁ దగుఁ 'జక్రి' యనఁగ

---

27. [1]వంబుధి శయనా (అ., ఛం. ద. 1-8).

బరఁగుగా హగణము గల మగుఁ
[1]బరువడి 'చక్రి' యటంచుఁ బలికిన [గగమా] 31

ఇఁక గణజాతులు

క. యగణము తగణము విప్రులు
రగణము జగణములు నివియె రాజాన్వయముల్
భగణము వైశ్యము మగణం
బగు నాలవజాతి సగణ మంత్యజము హరీ! 32

చంద్రగణముల(కు లక్ష్యములు) అనంతనగారు[ఛందోదర్పణము 1-17]

సీ. కమలనాథా! నగగంబు· కమఠరూప
నహ, యసురాంతక నాఁగ నలల,
మద్రి ధర భలంబు, భద్ర యశా యన్న
భగురు, వంభోజాక్ష మగణ లఘువు,
భువనేశ్వరాయన్న సవ, [1]మధు విద్వేషి
నహము, పీతాంబర నంజ్ఞ తలము,
కైటభారి రలంబు, గజ వరదా యన్న
నవ, మహి శయన నా నలలమయ్యె,

ఆ. రగణ గురువుదేవ రాజాయనంగఁ, బ
ద్మావతీ యనంగ తగణ గురువు,
నరహరీ యనంగ నరహరి నరసింహ
నాఁగ నొప్పు నగము నలము సలము. 33

తే. ధరణిఁ బ్రణవము పంచమదైవతాఖ్య
నాదములును గాంధార విషాద ఋషభ

---

31. [1]బయటడి చక్రి యటంచుఁ బలికినఁ గృష్ణా! (తా) — ఇది యాత పాఠము. చక్రి పునరుక్తము. గగము చెప్పఁబడలేదు గాన పైరీతి సవరింపఁబడినది.
32. [1]మఘువిద్వేషి (ఛం. ద. 1-17)

షడ్జములు మ య ర స త భ జ గణములను
గ్రమములోఁ జెందు సప్తస్వరములు కృష్ణ! 34

వ. క్రమంబుగా మ య ర స త జ భ న గణమ్ములు ప్రణవాది సప్తస్వరం బులు జయ విజయ శంఖ మహాశంఖములగు పగటి నాలుగు జాములు రామ విరామ సుప్త ప్రసుప్తంబులను రాత్రి నాలుగు జాములం గలుగు నందు మ య ర స త జ భ న గణమ్ములకు మున్ను కొందఱు లక్షణ కారులు. 35

## గణ నక్షత్రములు

క. మగణంబు జ్యేష్ఠ పుష్యమి
తగణము నుత్తర జగణము తగుఁగృత్తిక దా
రగణము పూర్వాషాఢగు
యగణము దలఁపంగఁ గావ్యలను మతిచేతన్. 36

క. స్వాతి నగణము పునర్వసు
ఖ్యాతి ప్రద! భగణమయ్యె భువివిభ్రంగిన్
జ్యోతి శ్శాస్త్ర విధిజ్ఞుల
చేతన దెలియంగ వలయుఁ జేతో మహిమన్. 37

వ. అన్నారు గావున మగణానకు బుధుఁడు గ్రహమైనయపుడు జ్యేష్ఠా వృశ్చిక రాసులు, కారాశిన్ని (?) మగణానకు బుధగ్రహము నిశ్చయంబనుట, చిత్రానక్షత్ర కన్యారాశి సిద్ధంబగుటఁజేసి తత్క్రమంబున మగణాదియగు అష్టగణాధికారము. 38

అందు మగణము —

సీ. భూమిదైవంబును బుధుఁడు గ్రహంబును
బంగరు కాంతి శుభంబు ఫలము
అగు నపుంసకలింగ మరయ ఋక్షము చిత్ర
రాక్షస గణమును రాశికన్య

వెలయుఁ గాస్యపగోత్రమలఁదు శ్రీగంధంబు
పంచ భూషణము సంపంగి విరులు
జయనామ యామంబు జననము సౌమ్య వా
రంబు నాలవజాతి రౌద్ర రసము

తే. వ్యాఘ్ర యోనియు ఖడ్గ మాయాయుధంబు
పసపు వన్నియ కోక రాజసగుణంబు
మగధ దేశంబు దనరారు మగణమునకు
భక్తజనలోల! గోపాల బాలకృష్ణ! 39

యగణము —

సీ. ధాత్రీసురాన్వయ మాత్రేయ గోత్రంబు
చందనం బలఁదు రాజసగుణంబు
[1]కరుణారసంబును గ్రహము శుక్రుండు పూ
ర్వాషాఢ రిక్క మర్కటపుయోని
ధనురాశి జలమది దైవంబు మానవ
గణము వజ్రంబు భూషణము విజయ
నామయామము జననము శుక్రవారము
చలువ దుప్పటములు జాజిపూలు

తే. స్త్రీయు లింగంబు కాంభోజ దేశవాసి
[2][తనదు వన్నియ] ధవళంబు ధనము ఫలము
నాయుధము కుంత మరయఁగా యగణమునకు
ప్రౌఢకవు లెన్నఁగాను గోపాల కృష్ణ! 40

రగణము —

సీ. క్షత్రియ కులజము కౌశిక గోత్రంబు
తామస గుణము రక్తంబు వన్నె

40. [1]రసార్ద్రమున - కరుణరసంబు - అని యుండదగియు (రా), [2]తాను గ్రహామును ధవళంబు (శా).

భౌమ గ్రహంబును ఫలము భయంబును
నధిదైవమగ్ని భయాఖ్యరసము
అజయోని పుంలింగ మగరు గంధంబును
రాక్షస గణమును [1]రాశిమేఁక
కావికోకలు కృత్తికయ రిక్క విద్రుమ
మణి శంఖనామ యామంబు భౌమ

తే. వార జననంబు తెలియంగ గౌరవాంతి
సాధనము శక్తి వింధ్య దేశంబు నెఱ్ఱ
పూవు లరయఁ గమ, రగణంబునకు జగతి
నెల్ల కవిరాజులెన్న లక్ష్మీశ కృష్ణ! 41

నగణము —

సీ. కాశ్యప గోత్రంబు గ్రహమర్కజుండును
కులము హీనంబును నలుపు వన్నె
స్వాతి నక్షత్రంబు వాయువు దైవంబు
ఫలము [1]నాశంబు బీభత్సరసము
గ్రహవర్ణమసితంబు మహిష యోనియుతుఁడా
రాశి పీలంబు నిర్జరగణంబు
శనివారమును మహాశంఖయామము జన
నము తమోగుణమును నల్లగల్వ

తే. పూలు సౌరాష్ట్రదేశంబు పీలివన్నె
పుట్టములు లింగ మదియె నపుంసకంబు
తోమరము సాధనంబు కస్తూరి లేప
నంబు నగణంబునకు రమానాథ కృష్ణ! 42

---

41. [1]రాశిమేష (తి). కవి, మేషశబ్దమును చరిత్రాదులలో గ్రహించి యుండనోపును. మేషము - మేష.

42. [1]నాశనము (తి).

తగణము —

సీ. జీవగ్రహంబు వాసిష్ఠ గోత్రంబును
వట మధిదైవంబు వలుపువన్నె
భూసురాన్వయమును [1]పుష్యమి యుక్షంబు
దేవగణంబును జీవవాస
రంబు [2]కర్కాటక రాశి పులింగంబు
సత్త్వ గుణంబును శాంతరసము
తామర పూ త్రాస నామ యామము జన
నము మేషయోని చందనము ఫలము

తే. కలిమిగ్రహ వర్ణమదియె బంగరపు కాంతి
పుష్యరాగంబు పచ్చటి పట్టములను
సింధు దేశంబు పరశువు చేతఁ గల్గి
తగణ మిరవొందు సత్కవుల్ పొగడఁ గృష్ణ! 43

జగణము —

సీ. గౌతమ గోత్రంబు గ్రహము సూర్యండును
రవియె దైవంబును రాచకులము
రక్త వర్ణము సింహరాశి యుత్తర దిక్కు
మానవగణమును ధేనుయోని
ఫలమురోగంబు జపాకుసుమంబు క
ళింగరాజ్యంబు పుంలింగ మగరు
గంధంబు కురువిందకాంతి సత్త్వగుణంబు
రవివాసరంబు [1]విరామ [నామ]

43. [1]పుష్యనక్షత్రంబు (తి), [2]కర్కాటకము — సాధురూపము. 'వాస రంబును గర్కాటరాశి' అని సవరింపవలెను.

44. [1]విరామయామము, జననము మాణిక్యమాభరణము (శా) ఇందు ఛందో భంగము కాన సవరింపఁబడినది.

తే. యామ జననమ్ము మాణిక్యమాభరణము
ఖడ్గమాయుధమును జంద్రకావి వన్నె
చీర వీరరసంబు రంజిల్లు జగణ
మునకు నిలలోన మనసిజజనక కృష్ణ! 44

భగణము —

సీ. దైవము చంద్రుండు ధవళ వర్ణంబును
హాస్యరసంబు గ్రహంబు శశియె
కులము వాణిజ్యంబు గోత్ర మాంగీరస
మహిషయోని ఫలంబు మహి సుఖంబు
మృగశీర్షమారిక్క వృషభరాశియు సుప్త
నామ యామము జననంబు సోమ
వారము తెల్లని వల్వ దేవగణంబు
* సామంతి పువ్వులు సత్త్వగుణము

తే. చందనంబును జమునదేశంబు మౌక్తి
కంబు స్త్రీలింగ మాయాయుధంబు కత్తి
తెలుపు వన్నియ భగణాన కలరుచుండు
కవిజనంబులు పొగడ విఖ్యాతి గృష్ణ! 45

[1]ఇది అష్టగణాధికారము. నగణానకు లక్ష్యము.

సీ. ♦♦ పరికింపఁగాఁ బరబ్రహ్మ దైవతము[ను]
సకల సంపత్క[రి] సౌఖ్య విజయ
సామ్రాజ్య [వై]భవ సంతతి శ్రీకర
ప్రకరంబు లొసఁగెడి భాగ్యరేఖ
దుర్గుణంగణ వర్ణదోష శోషణకారి
గుణములందెల్ల సద్గుణ గణంబు

* క. ......, చామంతులు చెంగలువలు జాజులును దగన్.
(రాధామాధవము) 4-54. —సూ. ని.

46. [1]ఇది గణాధికారము (తి).

లాయురారోగ్య పుత్రార్థ ప్రదాయక
మీప్సితార్థంబుల నిచ్చు వెంకి

తే. నిఖిల లక్షణముల కెల్ల నెలవు పట్టు
రూఢి పెంపొందు యమృత స్వరూప మెన్న
నగణగుణమెన్న నలవియె నలువ కైన?
సర్వశుభదాయి నగణంబు జగతిఁ గృష్ణ! 46

క. మున్న గ్రహమ్ముల గణముల
నెన్నుచు నగణంబు దఱ నరది గావుననె
ట్లున్నను గ్రహాది దోషము
లెన్నరు దీనికిఁ గవీంద్రు లేచందమునన్. 47

[అథర్వణాచార్యుఁడు:]

తే. పర్వతములందు మేరువు భాతియగును
[1]సర్వసురలందు శంకరు చందమునను
అడవి మృగములయందు సింహమ్ము కరణి
గణము లందెల్ల నగణంబె [2]గరిమఁదాల్చు. 48

*[కవిజనాశ్రయము - సంజ్ఞ - 51 ప.]

క. ఏగణముఁగదియు నగణం
బాగణము సమస్త మంగళావాప్తంబై
రాగిల్లు వినుము సరసము
యోగంబై షష్ఠి నన్నె మానిని తంగిన్. 49

వాదాంగచూడామణి

ఉ. గుణముల కెల్ల నాలయమగున్ గృతులయందు దాపియుండు దు
ర్గుణ గణ దోషము *ల్సరుగుఁ గోరిన వస్తువు నాత్మనైన భూ

---

48. [1]'సర్వసురులందు' అని శా. వ్యా. మతము, [2]గరిమ గాంచు (తి).
* 'గోకర్ణచ్ఛందమ్మునందు' అని వ్రాఁత ప్రతి.
50. * ఇందు 'సరుగు' క్రియగా ప్రయుక్తము,

షణముల నిచ్చుఁగావ్యముల సత్కవిశేఖరులెంచ సర్వ ల
క్షణములు గల్గియొప్పు బుధ సన్నుతమైన గణంబు శంకరా! 50

మఱిన్ని నగణమునకె —

కవిసర్పగారుడమున

మ. పరమాత్మం బధినాయకుండు జయ సౌభాగ్యైక సామ్రాజ్య పూ
జ్యరమా సంతతులీగి లబ్ధము వినోపాంతస్థ దుష్టాక్షరో
త్కర దోషార్య గణౌఘ ధూర్తగుణముల్ [1]ఖండించు నాశీలమె
వ్వరికిన్ గాదనరాదు నా నగణ మవ్యాజస్థితిన్బొల్పగున్. 51

వ. అన్నారు. ఇవి పురాతన లక్ష్యములు. ఇఁకను, 52

తే. నగణ మొక్కటి దక్క గణమ్ము లొకరి
వజ్జఁ [1]జేర్చిన నిచ్చు శుభాశుభములు
రూఢి నెటువలె సుగుణ దుర్గుణము లొరుల
సంగడివి గాదె గల్గుట జగతిఁ గృష్ణ! 53

తే. గణము గణమును వేఱొక్క గణముఁజేరి
కాని తమతమ ఫలము లీఁ గలుగ వవియు
నవవినగణంబు నొరుల [1]పొత్తైన నిచ్చు
తానె యైనను ఫలములీఁ దలఁచుఁ గృష్ణ! 54

క. ♦♦ పొసఁగెటు దామను దరులన్
బొసఁగ నగున్ జాయ దలఁపఁ బొసఁగది లేదా
యొసఁగ సమర్థుఁడు గా కొరుఁ
బొసఁగించుట గౌణ పక్షపుంగతి కృష్ణా! 55

మఱియు నగణగణ ప్రయోగసరణి,

---

51. [1]ఖండించుటల్ శీలమై (రం. ఛం. 2-99).

53. [1]జేరుచుఁ దనరు శుభాశుభములు (రా).

54. [1]కొరులఁ జేరిన (రా).

నలోదయమున — "హృదయసదేతి" యనుట.

శివభద్రంబున — "ప్రణమిత శిరసి" యనుట.

ప్రబంధపరమేశ్వరుండు ఆరణ్యపర్వశేష ప్రారంభమున,

చ. "స్ఫురదరుణాంశురాగరుచి" యనుట —

ఇటు వలెనే యన్నిటఁ దెలియ వలయును. 56

ఇఁక అష్టగణములకు గణపొందికలు

సీ. మగణంబు తోడుత మగణంబు నొందుట
భూ చక్రమంత పెంపొందనేలు
మగణంబు క్రిందట యగణంబు గదియింప
సామ్రాజ్యలక్ష్మి నిశ్చలతఁజెందు
మగణంబు చెంతనె నగణంబు నిడఁ గల్గు
సౌభాగ్య జయకీర్తి చయము లెపుడు
మగణంబు తొలుతఁ బిమ్మట సగణంబు గీ
లించినఁ బోర జయించు భర్త

తే. మగణమునఁ గూర్పఁ దగణంబు మిగుల శుభము
సగణమున దాయనిల్పిన యగణ మఖిల
శోభనంబుల నీఁ జాలుఁ జూపె పతికి
కవికి నిటువలె శుభములు గలుగుఁ గృష్ణ! 57

సీ. నగణంబుతో నేర్చి నగణంబు చేర్చిన
నణిమాది భోగములందు భర్త
నగణంబు పొంతఁ దా మగణంబు పొందింప
కర్త భర్తలకు సౌఖ్యములు గలుగు
నగణంబు జంటగా భగణంబు నిడఁ జెందు
వైభవ శోభన ప్రాభవంబు
రగణంబు పొంతల నగణంబు మించిన
ధన జయ సత్పుత్ర తతులు ప్రబలు

తే. తద్గణంబున యగణంబు తా ఘటింప
నధిక సంతోష విభవము లలవి వెలయు
రగణమునకును జోడుగా తగణ మదుక
నాయురర్థము లొనఁ గూరు నవనిఁ గృష్ణ! 58

సీ. తగణంబు తోడుత నగణంబు గిలింప
నాయురారోగ్య పుత్రాభివృద్ధి
తగణ సాన్నిధ్యాన [1]నగణంబు గదియింప
భోగభాగ్యంబులు పొదలు మొదల
జగణ సాన్నిధ్యాన భగణంబు నొందింప
సకల సంపత్సౌఖ్య వితరదాయి
జగణ సంగతముగా రగణంబు నిల్పిన
ధనధాన్య సంపద ల్దనరు మిగుల
తే. జగణ యగణమ్ములందు విజయ విభూతి
వస్తు [2]వాహన (బహు) విధ వైభవముల
నేకము లొసంగు [3]పీ లోకమెల్ల బొగడ
... ... ... ... ... ... ... ... ... 59

క. రగణముతోఁ బద్యాదివి
రగణము గిలింప సుకవిరాజును బతియుఁ
పగఁ దెగటార్చి విబుధులు
పొగడఁగ నేలుదురు విఖిల భువనము కృష్ణా! 60

క. ఇమముఁ బరునము దొరపినఁ
గనకంబై దనరునట్టి కైవడి గణముల్
గుణమిదు యోగవిశేషం
బునఁ దన దుర్గుణముఁ [1]బొలిపి పొందుమ గృష్ణా! 61

59. [1]మగణంబు (రా), [2]వాహన వివిధ వైభవములు (రా) అక్షర లోపము, గణభంగము, [3]భజల నీలోక మెల్ల (రా).

61. [1]తొలఁగఁద్రోయును (తి).

## ఇక నక్షత్రగణ లక్షణములు

సీ. మగణంబు గదిసిన భగణంబు చంపును
మగణ రగణముల మరణమొందు
మగణంబు దాపిన తగణంబు నపజయ
భంగముల్ గావించుఁ బతికిఁ గవికి
మగణంబు దొరసిన జగణంబు దైన్యంబు
మతివిహీనము లలమటలు సేయు
భగణంబు దండమ యగణంబు నిల్చిన
భయము లాపదలు తత్ప్రభువుఁ జెందు

తే. జగణ తగణమ్ము [1]లదుకఁ దక్షణమె రోగ
బాధచేఁ బొర్లుఁ జెలిమి విరోధ మొదవు
నగణ మందును నగవత యగణ మిడిన
మతియకుల నాశనంబగు నుర్విఁ గృష్ణ! 62

సీ వగణంబు రగణంబు నంధాన [1]మొందింప
భస్మమౌ నగ్నిచేఁ బతి గృహంబు
యగణంబు జోడుగా భగణంబు నిల్చినఁ
దెగి నాల్గు నెలల బాధించి చంపు
యగణంబు వలపట రగణంబు *జంటింపఁ
[2]బతి వినాశనము తప్పదు దలంప
యగణంబు చేరికఁ దగణంబు ఘటియింప
నొలుగు చేటొదుగు(దవు) నప్పుల మునుంగు

తే. రగణమునఁ గూడు భగణంబు దిగులు తెగులు
నొదవు రగణంబు తగణంబు గదియనీదు

---

62. [1]జగణ తగణమ్ము లునుప (తి).

63. [1]మొఁరింప (తి).

* జంటించు - శ్రీహరూరూపవిశేషము - చూ. బ్రౌన్, సూ. ని.

[2]ఫల వినాశనము (తి).

దనరు పగవారికైనను తగణమంద
యగణ మిడ వట్టు మానుటె తెగువ కృష్ణ! 63

వ. మఱియు తగణ జగణ నగణములకు లక్ష్యములు వ్రాయలేకకాదు. గణము లన్నియు తమ స్వఫలాఫలము లీయఁజాలవు. కనుక గణపొందికలు ఫలాఫలము లిచ్చుఁ గనుక, నట్లగుటంజేసి లక్ష్యముల న్ప్రయోజనమేమని గణపొందువలనె తెలియఁబడుఁ గావున గణపొందికలు చెప్పఁబడియున్నవి. నగణము తానైనా మఱొక గణమును జేరియైనా స్వాతంత్రికముగాఁ దమ ఫల మొసఁగుఁ గావునఁ బురాతన మహాకవి ప్రయోగములు లక్ష్యములు వ్రాపియున్నవి. గణములన్నింటికి నగణమే యుత్తమంబని తెలియవల యును. ఇది గణలక్ష్యలక్షణ ప్రకారము లిఁక జ్యోతిషము విశేషము లెట్టివనిన, 64

## జ్యోతిష విశేషములు

క. పరువడి [1]కవు [లల] ఛందము
తెరఁ గెఱఁగక కవితఁ దలఁపఁ దివిరిన వంధుం
డురువడిఁ దురగము [2]పరువుల
పరపినగతి జగతి హాస్యపరుఁడగుఁ గృష్ణా! 65

తే. జగతి షట్చాస్త్ర విద్యావిశారదునిని
జ్యోతిష పితామహునిని ప్రఖ్యాత యశుని
వితత షట్కర్మ నిరతు ఋగ్వేదగురుని
[1]అప్పభట్లను మద్గురు నభినుతింతు. 66

వ. [1]అని వినుతించియు, 67

---

65. [1]కవులం ఛందము (కా) అక్షరలోపము - ఛందోభంగము, [2]సొక్కి, పరుషారిని గదిసి (కా).

66. [1]'అప్పయభట్లు మద్గురు నభినుతింతు' అనునది అ. తి. వ్రాఁత ప్రతి. ఈ పాఠమున గణభంగము.

67. [1]అనట్లంట్లని యనియు (తి).

తే. జ్యోతిషంబు ... ... ... జోడుచూపె
జ్యోతిష మెఱుంగకున్నఁ దా సుకవి కాఁడు
జ్యోతిషజ్ఞుండు లక్షణ వ్రాత యుతుఁడు
తద్విహీనము [1]గాకవి[త్వంబు] కృష్ణ! 68

క. కవితా కన్యక గావున
భువి కన్యకు వరునకెటులు [1]పొంతువు లటులా
గవి చూచి తగిన పతిగా
[2]వివరించక యొసఁగఁ దగదు వెంకట కృష్ణా! 69

వ. అట్టి క్రమంబును దత్ఫలమ్ము లెట్టివనిన వివరించెద నవధరింపుము. 70

శ్లో. దినం గణంచ మాహేంద్రం స్త్రీ దీర్ఘం యోని రేవచ
రాశిరాశ్యధిపో దస్యుః రజ్జుర్వేధా స్తథా దశ. 71

వ. అన్నిరిందులో దినపొంతువు, గణపొంతువు, స్త్రీ దీర్ఘపొంతువులు క్రమంబున మూఁటికివి లక్షణము. 72

సీ. ప్రథువు తారాదిగాఁ బద్యాదిగణతార
లెలమి తొమ్మిదిలెక్క లెంచఁగాను
సమతార లైన శాశ్వత శుభమ్ములఁ జేయు
బేసియైనను బతి వాసిఁ జెఱుచు
పతితారగణమును బద్యాది గణతార
గణము నొక్కటియైనఁ గలుగు శుభము
దైవమానుషములై దనరినఁ బరిపాటిఁ
[1]గ్రహ భుగ్గితుజాలైనఁ గలుగు రణము

68. [1]కాకవి కవిత (అ. శి. వ్రాఁత ప్రతి) ఈ పాఠమున యతిభంగము.

69. [1]పొంతువులరయుడిక (శా), [2]వివరంబుగ జూడఁగ వలయు (తి).

78. [1]గ్రహభుక్తి శేషాలై గలుగు (శా, తి) - ఈ పాఠమర్థవంతము గాదు, కాన నించుక సవరింపఁ బడినది.

తే. దనుజ [2]మనుజాలయైన సిద్ధంబు మృతము
పద్యగణ ముత్తమాదియై ప్రభువు తార
లెన్నఁ బదు మూఁటిపై నున్న నెనఁగు జయము
వైశ్యుల కవశ్యమిది యుండవలయుఁ గృష్ణ! 73

మఱియు స్త్రీదీర్ఘపొంతువు గ్రంథాంతరమున —

ఆ. మొనపి యొకటి రెండు మూరు నాల్గైదాఱు
[1]నేట్పది పదుమూఁడు [2]నిర్వదేను
ధనుక దనరు పొత్తు నెవిమిసి తొమ్మిది
పదునొకండు [3]భాను లొదవవు హరి! 74

వ. పద్యాదిగా ౧, ౨, ౩, ౪, ౫, ౬, ౮, ౧౦, ౧౩, ౧౪, ౧౫, ౧౬, ౧౭, ౧౮, ౧౯, ౨౦, ౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౫, ౨౬, ౨౭. ఈ లెక్కలు గల్గినట్లయితే స్త్రీదీర్ఘపొంతువులేదు గనుక కారాదు. 75

ఇఁక [1]మహేంద్ర పొంతువులు రెంటికిన్ని

సీ. కృత్యాది తారకుఁ గృతివతి రిక్కకు
[2]నెంచి భావింప నాల్గేఱు పదియు
పదిమూరు పదియారు పందొమ్మి దిర్వది
రెండిర్వదైదునై యుండెనేని
మిగుల శుభమ్మునై మెలఁగుదు రిరువురు
వదిలేక యుండిన నశుభమగును
పతితారయోనియుఁ గృతిభంబు యోని దా
నేకమై యున్న ననేక జయము

తే. వివియు ... ... మధ్యమం బెన్న వైర
మదియె మృత్యువు పురుషులు వతివ లపరు

73. [2]మనుజాలపైన సిద్ధంబమృతము (కా) - ఈ పాఠము సరిగాదు.
74. [1]నేడు పదియు - అ. శే. వ్రాఁత ప్రతి. గణభంగము, [2]నిర్వదేను (తి), [3]భాను లొదవుదు హరి (కా).
76. [1]మహేంద్ర యోని (తి), [2]నెంచి (కా).

మఱియు నిరువురు స్త్రీలైన మధ్యమంబు
పురుష లిద్దఱు తమలోన నరులు కృష్ణ! 76

### తత్పురుష స్త్రీయోని సంజ్ఞలు

తే. శ్రవణ మృగశిర రేవతి శతభిషములు
ప్రోష్ఠ మవిలోత్తరాభాద్ర పుబ్బ రుద్ర
ధాత్రి మిత్ర పునర్వసు చిత్ర హస్త
లరయ నివియెల్ల స్త్రీయోను లగును గృష్ణ! 77

తే. అశ్విని ధనిష్ఠ భరణి పుష్య(మి) విశాఖ
జ్యేష్ఠ యుత్తర మఖలు వాశ్లేష మూల
స్వాతి ధాత్ర్యుత్తరాషాఢ సలిల భములు
పురుష యోనులు [1]నా ధాత్రిఁ బొదలుఁ గృష్ణ! 78

### [1]ఇరువైయేడు నక్షత్రముల యోని వివరములు:

చ. హరి గజ మేష భోగి పవనాశన కుర్కుర మార్జ వాజి మా
ర్జర ఖర మూష గో మహిష *శార్దుల మాహిష *శార్దులీ మృగీ
హరిణ కపీ వనౌక నకులాధిప మర్కట సింహ వాజి కే
సరి నవకారిణీలు వరుసందగు నశ్విని పూర్వకంబుగా. 79

---

78. [1] నా ధాత్రిఁ బొదలుచుండు (కా).

79. [1] ఇరువై నక్షత్రముల (తి), [2] నవకారణుల్ (తి).

"నవకారిణీలు, నవకారణుల్" అను రెండు పాఠములును అర్థవంతములు కావు. ఇందలి నక్షత్ర యోనులు గోవు, గజము కావలెను. "నవగోగజాలు" అని సవరింప నగునేమో!

*శార్దూలమునకు రూపాంతరముగ 'శార్దులము' అని కవి ప్రయోగించెను.

[1]కవిరాజ గజాంకుశమున [ప. 58]

క. ఉరగంబును ముంగినయును
హరిణంబును [2]గుర్కురంబు నావును బిలియుఁ
దరుచరమును మేషంబును
దురగము మహిషమును [3]జెలిమి దొరయ(వు) మఱియుఁ 80

తే. వర్ణనక్షత్రయోనియు వరుసితార
యోనియును గూడఁ [1]గుంటిన నొప్పదెందు
గణము యోనియుఁ గర్త నక్షత్ర యోని
యును మిగులఁ గొంత లోనఁగూడి యుండవలయు. అన్నారు. 81

ఇఁక రాశికూట పొంతువు

సీ. సమసప్తకములైన సకలసౌభాగ్యము
లష్ట షష్ఠములైన నందు సుతుల
షష్ఠాష్టకములైన సమయించుఁ బుత్త్రులఁ
దొమ్మిది నైదునై తొడరుఁ గీడు
నైదు తొమ్మిదియైన నమరు నారోగ్యంబు
పదినాల్గు మిగుల శుభంబుచేయు
నాలుగు పదియునై చాల దుఃఖము నొందు
పదకొండు మూఁడున భవ్యసుఖము

తే. మూఁడు పదకొండు నయ్యున ముంచుశోక
మునను బంద్రెండు రెండు శోభన మొసంగు
రెండు పంద్రెండు నైనను మృత్యువగును
రాశికూటములవి కవిరాజు లరసి
జగతి రచియింపఁదగు నవశ్యంబు గృష్ణ! 82

---

80. [1]కవిగజాంకుశే (తి), [2]కుక్కుటంబు (క. గ. అం.), [3]చెలిమి దొరయక (తి).

81. [1]కుంటిన - కుంటు = ఒక్కవోవు — అనఁగా మైత్రి కుంటువడు; వైరము గలిగియుండు ననుట, [2]ఒప్పదంద్రు (శా).

విశ్వేశ్వరుండు (విశ్వేశ్వర చ్ఛందము)

ఆ. మీను [1]తూనెకోల మిథునంబు తేలును
ఎద్దు విల్లు మొసలి పెద్దమేకము
కుండ యెండ్రకాయ గొఱియయు గోతితోఁ
గూడెనేని మిగులఁ గూడ దండ్రు. 83

మఱియు [1]కవిసర్పగారుడమున

తే. రాశియరయక పలుక నేరాశియగును
రాశికృతి పతి దుఃఖ వారాశి మునిఁగి
... ... ... ... ... ...
రాశికెక్కక పగఱ కరాపిఁ దూఱు. 84

సీ. భువి మేష వృశ్చికంబులకుఁ గుజుండును
వృషభ తౌళులకును భృగుసుతుండు
మిథున కన్యకలకు బుధుఁడును గర్కట
మునకుఁ జంద్రుఁడు సింహమునకుఁ గమల
మిత్రుండు కోదండ మీనరాసులకు గీ
ష్పతియును మకరకుంభములకు శని
రాశ్యధిపతులు, కర్కట మీన వృశ్చిక
రాసులు భూసురుల్ కేసరి తుల

తే. ధనువు(లు) నృపకులము మేషమును ఘటంబు
మిథునమును వైశ్యులంగనా [1]మృగ పశుపతి
రాసులివి శూద్రు లీరీతి లక్షణంబు
వర్ణకూటంబు దెలియఁగా వలయుఁ గృష్ణ! 85

83. [1]'తూనిక' శబ్దమునకు 'తూనియ' రూపాంతరము కానోపును.

84 [1]కవిసర్పగారుడే (తి).

౮౫. [1]మృగ - మకర రాశి - (మకరస్యాన్మృగో నక్రః — అని రాశి నిఘంటువు.)

ఇఁక నందు గ్రహమైత్రి

సీ. రవిచంద్రు లినకుజు లవిగురు ల్గురు కుజుల్
సౌరి కవు ల్బుధ సౌమ్యు లెవ్వ
డన్యోన్య మిత్రము, లాదిత్య భార్గవుల్
శశిరవు లన్యోన్య శత్రు లరయ
సౌమ్యరవు ల్గురు చంద్రులు కుజ శశుల్
శని బుధు ల్సమమైత్రి జరుగువారు
గురు భృగు ల్గురు బుధు ల్కుజ చంద్రసూనులు
శని కుజ భార్గవు ల్సౌరి చంద్రు

తే. లవని సమశాత్రవులు, తుషారాంశు బుధులు
శత్రు మిత్రులు, సురగురుశనులు శుక్ర
భౌము లన్యోన్య సములునై పరఁగువారు,
రుక్మిణీనాథ! హరి! దశరూప! కృష్ణ! 86

కవిరాజగజాంకుశమున [ప 27]

ఆ. గ్రహము ¹పొంతు కలిమి కల గణ సంగతి
మండి ²క్రూరగణము నొనఁగు శుభము
గ్రహము ³పొంతులేని గణముతోఁ బద్యాదిఁ
గూడి మంచి గణముఁ గీడుసేయు. 87

వ. మఱియును, 88

[కవిరాజగజాంకుశము - ప 23]

క. తొలుత గణగ్రహ మైత్రులు
¹దలపోయనియట్టి కుకవి తరమే హరుషం

87. ¹పొత్తుకలిమి (ముద్రిత క. గ.), ²దుష్ట (ముద్రిత క. గ.), ³పొత్తు లేని (ముద్రిత క. గ.)

89. ¹తలపోయని దుడుకఁ గవుల తరమే హర్షం (ముద్రిత క. గ. క. 28)

బొలపిన మన [2]దీవించినఁ
గలుషించినఁ [3]బద్యమందుఁ గ్రాలఁగఁ దిట్టఁగా. 89

[కవిరాజగజాంకుశము ప. 21]

క. సన్నుత గణాధిదేవత
కన్న గణగ్రహము సత్త్వమౌ బలిమిఁ గదా
మున్న [1]గవి భానుఁడని యెడి
పన్నగము స్గనలి జాయి పగులం దిట్టెఁగా. 90

[సలక్షణసారము - ప. 269]

క. తలపోసి గద్య పద్యా
దుల గణముల్ గ్రహములకును దొరఁయగ మైత్రుల్
గలుగఁగఁ జెప్పిన హస్తా
మలకంబగుఁ గాదె ఫలము మహి నిర్వరకుఁగా. 91

ఇఁక వశ్యపొంతువలు

సీ. ఆరయ మేషసింహాళులు వృషతౌళి
కౌళిరములు యుగ్మ కన్యలకును
కర్కాట ధను వృశ్చికములు కేసరి తులల్
వెలఁది మీనంబులు తుల మృగములు
వృశ్చిక కర్కాట స్త్రీలు కోదండ మీ
నములజ మకరకుంభములు కుంభ
మత్స్యరాసులు మీన మకరము లొండొంటి
కన్యోన్య వశ్యంబు లగుచు జగతిఁ
తే. బరఁగుఁ గృతిపతి రాశికిఁ బద్యగణము
రాశిని వశ్యకూటంబు దాపియున్న

89. [1]దీవింపం (ముద్రిత క. గ. ప. 23), [2]బద్య వహ్నిఁ గాల్పఁగ దిట్టఁ (ముద్రిత క. గ.).

90. [1]కవిభానుఁ డని యొఱు, పన్న మతిం గినిసి (ముద్రిత. క. గ.).

పతియుఁ గృతియును శాశ్వతప్రాభవములు
గలిగి మనుదురు లేకున్నఁ గాదు కృష్ణ! 92

ఇఁక రజ్జుపొంతువు

సీ. అశ్వని మఖయు పూషా శ్లేష శక్ర మూ
లలు పాదరజ్జువు [1]లణఁగఁ జేయు
పుష్య మ్యనూరాధ పుబ్బ పూర్వాషాఢ
భరణియు నుత్తరాభాద్ర లివియె
యూరులు ఫలము వియోగంబుఁ జేయుఁ బూ
ర్వాభాద్రయును బునర్వసు [విశాఖ]
యుత్తరాషాఢయు నుత్తర కృత్తికల్
నాభి రజ్జువు పుత్రనాశదంబు
తే. శతభిషంబును రోహిణి స్వాతి హస్త
శ్రవణ మార్ద్రయుఁ గంఠరజ్జువు ధనిష్ఠ
చిత్ర మృగశిరలివి భువి శీర్షరజ్జు
వగును నివి రెండు వర్జనీయములు కృష్ణ! 93

ఇఁక వేధపొంతువు

సీ. అశ్వని జ్యేష్ఠల *కనురాధ భరణుల
కగ్ని విశాఖల కవిల రోహి
ణులకిందు చిత్రవసుల కార్ద్ర విష్ణుల
కాశ్లేష మూలలకంబు పుష్య
తారకలకు శతభిష హస్తములకు
[1] ... ... మ పుబ్బోత్తరాభాద్రములకు

93. [1] కొంగఁ జేయు (కా) అనఁగఁ జేయు (తి) 'పాదే వియోగ దుఃఖంచ' — అని ముహూర్త రత్నావళి - శ్లో. 118. పాదరజ్జువు దుఃఖ ప్రదము 'అగలఁ జేయు' అనియు సవరింపవచ్చు.

94. * "అనూరాధ" అనుటకు "అనురాధ" అను రూపాంతరము కలదు. (చూ. సూ. నిఘంటు), [1]......(?) అక్షరలోపము (?) ఛందో

రేవతి మఖలకు పునర్వసు విశ్వ (?)
భములకు వసుధ మేల మెలయు (?)

తే. వెలయు నొండొంటి కన్యోన్య వేధ లగుచు
వేధ పరిహారముగను గవీశ్వరుండు
కృతు లొనర్చినఁ గల్యాణ కీర్తు లొదవుఁ
గానిచో బాధ రెండైనఁ గలుగుఁ గృష్ణ! ౯౪

ఇఁక నాడీ పొంతువు

సీ. అశ్విని శతభిష మార్ద్ర మూలోత్తర
లజ పునర్వసు జ్యేష్ఠ హస్త లివియు
పార్శ్వ నాడన నొప్పు, భరణి పుష్యమి పుబ్బ
మృగశిరంబు ధనిష్ఠ మిత్ర చిత్ర
(ఉ)త్తరాభాద్ర(యు) నొగి మధ్యనాడి, కృ
త్తిక మఖావిల రేవతీ విశాఖ
శ్రవణోత్తరాషాఢ పార్వ రోహిణులు ద
క్షిణ పార్శ్వనాడన [=క్షితిని] వెలయు

తే. మధ్య నాడైనఁ గృతిపతి మతియుఁ బార్శ్వ
నాడిచేఁ [1]గావ్యమపుడె వినాశమగును
పద్యగద్యాది గణకార ప్రభువు రిక్క-
లెన్నఁగా భిన్న నాడైన నెసఁగు జయము
నిర్వైరభివృద్ధిఁ జెందుచు నెపుడు కృష్ణ! ౯౫

ఇఁక రాశికూట నక్షత్ర పొంతువ

సీ. మహిమేషరాశితో మఖ వృషభంబుతో
హస్త మిథునముతో నవిల భంబు
దాపి కర్కాటక రాశితో ననురాధ
సింహంబుతో మూల చెలువతోడ

---

౯౫. [1]కార్యముఖ్యమె (తి), [2]జగతి (అ. శ. ప్రాఁత ప్రతి) అనిభంగము.

శ్రవణము తుల తోడ శతభిష క్కారయు
వృశ్చికరాశితో రేవతి శ
మరయ ధనుస్సుతో భరణి మకరముతో
రోహిణి ఘటముతో రుద్రతార

తే. కంబు మీనంబుతోఁ బుష్యభంబు గూడె
నేని మృతిఁ బొందుఁ బతియవమాని యగును
కలియు నీరీతి రాశినక్షత్రము లివి
దెలిపి రచియింపవలెఁ గృతుల్ చెలఁగి కృష్ణ! 96

[కవిరాజగజాంకుశమున - ప. 13]

సీ. అవని గణాలి గణావళి కధిదైవ
తములు వన్నియలు గ్రహములు వాని
కులములు ఫలములు కూర్ములు చెలులును
దాక్క పొంతువులు నచ్చగ నెఱింగి,
పిదప మహాభూత బీజ చింతనములు,
వర్ణ వర్గ గ్రహ నిర్ణయంబు,
నక్షత్ర వేధయు నరిమిత్ర శోధన
క్రమము తత్ఫల విచారములు తెలిసి

ఆ. [తమకు నెదురులేక దర్పించి వసుమతి
విభుల సభల బుధులు వివిధ విధులఁ
దెలఁగి పొగడఁ గవిత పెప్పెడి వారు న
క్కవులు పేరుపాటు కవులు గవులె?] 97

వ. అనట. మఱియును, 98

[కవిరాజగజాంకుశము - ప. 66]

క. పతితారకుఁ బద్యముల
[1]స్థిత తారకు మేలుఁ గీడు చింతింపక దు

---

99. స్థితి (తి).

ర్మతిఁ గవితఁ జెప్పఁ బూనిన
నతఁడు సుమీ కవిపిశాచ మారయ మర్విశా. 99

గోకర్ణచ్ఛందస్సున

చ. కులమధిదైవములా గణము కోమలకాంతియు రాశికూటముల్
ఫలములు తారలుశా గ్రహము వన్నుగఁ దద్గ్రిహ వర్ణముల్ ముద
మ్మలరఁగ యోనికూట మివి యష్టగణమ్ములకు న్నెఱుంగఁగా
వలయును సత్కవీశ్వరు లవశ్యము [1](నాదిఁ) బ్రయోగవేళలశా. 100

వ. అన్నారు. గావునను, 101

క. మహి నేరికి గణవర్ణ
గ్రహరాసులు కూర్పవలయుఁ గవియవి యాయా
వహి నంగతి *రచియింపుడు
విహితము తా జాతి కటులు వెంకట కృష్ణా! 102

మఱియు దశవిధ పొంతువులకు భంగవచనములు

సీ. గణపొంతు హీనమై గ్రహమైత్రియును రాశి
పొంతువు లుండినఁ బొసఁగి యుండు
మాహేంద్ర పొంతు సామాన్యమై గ్రహమైత్రి
రజ్జు పొంతువలున్న రహిఁ జెలంగు
స్త్రీ దీర్ఘ పొంతు రంజిల్లఁగ గ్రహమైత్రి
రాశి పొంతువులున్న రమ్యమగును
యోని పొంతువు లేక యుండినవశ్య పొం
తువు రాశికూటముల్ దొరక నెసఁగు

ఆ. రాసులెన్నకున్న రజ్జువేధాగ్రహ
పొంతుసమితియున్నఁ బొందదెందు

100. [1] నాడిఁ బ్రయోగ వేళలా (తా).

102. * రచియింపుడు అనఁగా రచియించుట. ఇందు ఛాందసకర్తకమునకు బాలుగా డు వర్ణకము ప్రయుక్తము.

గ్రహ విరోధమైన రజ్జునాడియు రాశి
పొందు యుక్త కృతులఁ బొదలుఁ గృష్ణ! 103

వ. మఱియును, 104

సీ. గోపాలబాల! నాడీపొంతు [1]వేమధ్య
మైన మహేంద్రగ్రహాదియోని
పొంతువులుండెనా పొందు సౌఖ్యమ్ముల
రాశి సంసప్తక రజ్జు యోని
గణకూటములు నైదు గలుగకుండినను నే
కాధిపత్యంబైన నన్నియొప్పు
రజ్జుపొంతువది విరహితమై స్త్రీదీర్ఘ
నాడి గ్రహ గణముల్ గూడియున్న

తే. సమర సౌనఁ గూర్పవచ్చుఁ బద్యాదులందు
గార్గ్య గురు శుక్ర వాక్య ప్రకార సరణి
పొసఁగు వివిధములగు నన్ని పొంతువులకు
కంగ వచనంబు లివియె గోపాల కృష్ణ! 105

వ. సమసప్తకములో ఘటసింహములు కారాదు. మిగిలినవి కావచ్చును. ఇఁక అవకహడచక్రక్రమము - చూ, చే చో, లా - అశ్విని. ఈ ప్రకారమున రేవతీ నక్షత్ర పర్యంతము నక్షత్ర పాదభేదములు తెలిసి రాసులేర్పఱచుట. ఇఁక అశ్విభరణికృత్తికాపాదం మేషం. ఈరీతిని పంద్రెండు రాసులు క్రమంబున నేర్పరింపవలయు. మఱియును, 106

సీ. షడ్వర్గశుద్ధి యక్షర బుక్ష వేధలు
చంద్ర తారాబల స్వరబలములు
గ్రహదశావస్థ లాగ్రహ దృష్టి దోషముల్
పొంతువుల్ తత్త్వము ల్పుష్కరములు
లగ్న నిర్ణయము తల్లగ్న శుద్ధులు నరుల్
దుర్ముహూర్తములు తద్దోషములును

105. [1] నాడీపొంతు మధ్యమంబైన (తి).

దగ్ధ జ్వలిత ధూమిత వ్యాధి విర్జీవ
జీవ నక్షత్రముల్ క్షీణమధ్య

తే. పీత సంపూర్ణ కృష్ణ సత్శ్వేత రక్త
చంద్ర విధములు వేళలంశములు పంచ
కమ్ము లాదిగఁ దెలివిడిగాఁగ వలయు
జగతి రచియించు తఱి నవశ్యముగఁ గృష్ణ! 107

వ. అవి యెటువలె నంటేని పర్యాయంబునం దేట గావించెద నవధరింపుము. 108

అందు షడ్వర్గసంజ్ఞ

సీ. నక్షత్రములకును నాలుగు పాదముల్
పాదముల్తొమ్మిది పరఁగు రాశి
రాశి యర్ధంబ హోర మఱి యారాశి భా
గత్రయంబైన ద్రేక్కాణమగును
తొమ్మిది భాగలై తొడరు నవాంశనఁ
బంద్రెండు భాగలౌ ద్వాదశాంశ
త్రింశ భాగమ్ములఁ ద్రింశాంశలనఁదగు
వరుసతో నివ్వి షడ్వర్గమరయ

తే. విందుఁ గల పుష్కరాంశలు విరువదొక గ
ణనయుఁ బద్నాల్గు విర్వది నాలుగిళ్ళ
లెక్క మేషాది నాల్గునాల్గేపి క్రమత
*గలుగు పంద్రెంటి యందును వఱలుఁ గృష్ణ! 109

109. * 'కలుగు - వఱలు' ఇందు యతి విచార్యము. 'ర - ఱ' ప్రాసయతి యీ కవికి సమ్మతము గాని 'ఱ - ల' మైత్రి యంగీకృతము గాదు. 'వఱలు'కు మాఱు 'చెలఁగు' వంటి పాఠముండెనేమో! పాఠాంతరము మృగ్యము.

అందు లగ్న ఘటికా ప్రమాణములు

తే. మీనమేషములవి నాల్గు మిథున మకర
కన్య తులలైదునుం జావు కర్కి సింహ
చాపకీటములరయ పంచార్ధ వృషభ
కుంభములు నాల్గు నలుగడల్ గోవ కృష్ణ! 110

ఇఁక నందు హోరాక్రమము

క. సమరాశికిఁ జంద్రుండు వి
షమరాశికి రవియు మొదలి సగమున [1]నడుచుఁ గా
గ్రమమున హోరాధిపతుల్
సమవిషమాధిపులు హోరసంజ్ఞలు కృష్ణా! 111.

అందు ద్రేక్కాణాధిపతిక్రమము

తే. ♦♦ కడఁగి లగ్నంబు మూరు(డు) భాగములఁ జేసి
క్రమము తోడుత లగ్నభాగములు మూఁటి
కరయ ద్రేక్కాణపతులు మేషాదిగాను
దేటఁ జేసిన వవధారు దేవ కృష్ణ! 112

సీ. మేషంబునకుఁ గుజమిత్ర వాచస్పతుల్
వృషభానకు శనికవి బుధులు, మిథు
నానకుఁ గవి భానుసూను చంద్రులు, క
ర్కాటకమునకుఁ జంద్రకుజగురులు,
సింహరాశికిఁ గుజ చిత్రభాను గురువుల్
కన్యకు సౌరి భార్గవ శశిజులు
తులకుఁ గవి శని బుధులు, వృశ్చికమునకు
శశి భౌమ గురువులు, చాపమునకు

111. [1]నడుచుఁగా - (తి).

తే. లోహితాంగ రవి గురువులు మకరమున
కుశని భార్గవ బుధులెన్నఁ గుంభమునకు
కవిశని బుధులు మీనానకు విధు భౌమ
గురు లు ద్రేక్కాణ పతులివి వరుసఁ గృష్ణ! 113

గ్రంథాంతరంబున —

శ్లో. స్యుర్ద్రేక్కాణో లగ్న పంచనవ రాశీశ్వరాః క్రమాత్ । — అనే రీతిని
జెప్పితిరి. ఇది ద్రేక్కాణ ప్రకారము. 114

ఇఁక నవాంశక్రమము

తే. మేషసింహ ధనువులకు మేషమాది,
తౌళి ఘట యుగ్మములకుఁ దత్తౌళియాది,
మకరవృషభాంగనలకుఁ దన్మకరమాది,
కర్కి మీనాళులకును దత్కర్కటాది
గాఁగ నడచు నవాంశసంగతులు కృష్ణ! 115

తత్క్రమలక్షణము

సీ. భువి మేష సింహ ధనువుకును బర్యాయ
మున మేష వృషభ మిథునకుళీర
సింహాంగనాస్త్ర వృశ్చిక ధనురంశలు
[1]మఱి వృషకన్యకా మకరములకు
మెలఁగు మకర కుంభ మీన మేష వృషభ
మిథున కర్కాటక మృగపతి తను
కన్యాంశ సంజ్ఞలు గలుగును మిథున తు
లాఘటమ్ములకుఁ దులాళిచాప

తే. మృగ ఘటీ మేష [2]వృషభ మిథునములకుఁ
గ్రమతఁ గర్కట కాళి మీనముల కరయ

116. [1]మఱియును వృషభ మకరములకును (శా), [2]అక్షరలోపము.

కర్కాటక సింహ యువతి జూకాళికార్ము
క మకర ఘట మీన నవాంశ లమరుఁ గృష్ణ! 116

## *ఇఁకనందు త్రింశాంశక్రమము

తే. కుజశని గురుబుధ కవులకు విషమముల
నైదునైదెన్మిదేశైదు నమరు వరుస
నవియె భువి సమరాసులై యైదు నేడు
నెనిమిదైదును సీక్రమంబునఁ జనుహరి! 117

విషమరాసులెవ్వియంటేని

తే. అజమిథున తౌళి కార్ముక హరి ఘటములు
బేసిరాసులు నాఁ దగుఁ బృథ్విలోన
వృషభ కర్కాటకాంగనా వృశ్చిక మృగ
మీనములు సమరాసులై మెలఁగుఁ గృష్ణ! 118

వ. ఇవి లగ్నహోరాద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశ లనఁదగు షడ్వర్గక్రమ మిఁక. 119

## నక్షత్రాక్షర వేధాలక్షణముల అంశచక్రక్రమము

సీ. అశ్వినీ ప్రథమ పాదాది రేవత్యంత
మనవాక్షరాంశ లింద్రాది దిర్వ
దేశసి వర్గద విధి తొమ్మిదే నంశ
లొక్కొక్క రాశిగా నొనర మేష
రాశ్యాదిగా నన్నిరాసులు మూడెన్మి
దంశలా చక్రము నందు వరున
నజ సింహ ధనువుల కజమాది కన్యగో
మకరమ్ములకుమ దన్మకరమాది

117. *ఇఁకనందు ద్వాదశాంశక్రమము (తి).

తే. తౌళిఘటి యుగ్మములకుఁ దత్తౌళియాది
కర్కి మీనాళులకును దత్కర్కటాది
గాఁగ నాళ్లేసి రేఖలు గలయఁ దిగిచి
యర్కుఁడాదిగ నంశ గ్రహములు దెలిపి
రచన చేయఁగఁడగుఁ గవిరాజు కృష్ణ! 120

తత్ఫలములు —

తే. క్రూర వేధాక్షరములు సంహారకములు
[1]సౌమ్య వేధాక్షరములు సీఁజాలు శుభము
లిచ్చుఁ దత్ఫల సిద్ధులు నిరువురకును
కృతులొనర్చినచో నిదిరీతి కృష్ణ! 121

కవిసర్పగారుడమున —

ఉ. వర్ణము నిర్ణయించి కృతి వక్త్రిమఁనఁగా గదియింప నాయకుం
దర్ణవవేష్టితోర్విఁ గల యంతయు నేలుఁ గవీశ్వరుండు దాఁ
బూర్ణమనోరథుండగుచుఁ బొల్చు సుఖస్థితిఁ గావ్యముల్ బుధుల్
వర్ణనసేయనోపు దిశలన్ వసుదేశసభాంతరంబులన్. 122

అన్నారు. ఇఁకనందు చంద్రతారాబలంబులయందు చంద్రబలక్రమము

సీ. అన్నవృద్ధియు ధనహానియు ద్రవ్యా
శనరోగకార్య నాశనము ధనము
నిఖిల లాభము మృతి నృ[ప]బాధ సౌఖ్య మా
దాయహానులివి పర్యాయమునను
జననరాశ్యాదిగాఁ జతురష్టభాను సం
గతుఁడయి బహుళపక్షమునఁ గాచు
ద్వినవ పంచస్థుఁడై తవరుచు శుక్ల ప
క్షమున పేఁజనిన చందమునఁ దోఁచు

121. [1]సౌమ్యవేధాంశైనను జాలుశుభము (తి).

తే. చంద్రబలమిది శుక్లపక్షమున బలిమి
బలిమి తారాబలము కృష్ణపక్షమునను
చంద్రతారాబలమ్ముల సరణు లిటులు
దెలియ వలయును గవివరుల్ దివిరికృష్ణ! 123

ఇఁక తారాబలక్రమము

సీ. జన్మ తారాదిగా సరవిఁ దొమ్మిది లెక్క-
ఫలములు నక్షత్ర పంక్తి వరుస
వహిఁజన్మ సంపద్విపత్క్షేమములను ప్ర
త్యక్సాధనములు నైధనముమిత్ర
పరమ మైత్రములనఁ బరఁగు తారాబల
ములు విల వేర్వేఱఁ గలవు ఫలము
లారయ సర్వసాధారణరీతిఁ ప్ర
త్యగ్విపజ్జన్మ నైధనము లనఁగ
తే. వాల్గు తారలు చేయు దుర్నయము తక్కు-
వట్టి తారలు మిగుల శుభావహములు
గనుకఁ దారా బలమ్ములఁ గరణి దెలియ
వలయుఁ బ్రస్తుత మిదియు నెవ్వరికిఁ గృష్ణ! 124

ఇఁకనందు బాలాదిస్వరపంచక లక్షణము

సీ. బాలాద్యమౌ స్వరపంచకం బుదయాది
నాతేపి గడియలు వేఱువేఱు
మక్కువ బాలకుమార రాజ్యస్వర
వృద్ధమృతంబులు వెలయు వరుస
ప్రాగ్దక్షిణమ్ముల బశ్చిమోత్తరముల
పీశాన్య దిశలందు నెలమితోడ

123. [1]బలమ్ముల కరణి.

లాభంబు ధనమును రాజ్యంబు జాడ్యము
సంహార ఫలముల సరణిదెలిపి

తే. యట్టి వేళల నాదిక్కు లా ఫలమ్ము
లరసి కూర్పుండి కవికృతు లవనిఁ గూర్చి
యిచ్చెనేవియు సంపదలెచ్చు నిచ్చ
ప్రకట [1]గుణలోల బాలగోపాలకృష్ణ! 125

*అనంతసగారు —

క. బాలస్వర మొకలాభము
పోలింపఁ గుమార రాజ్యములు ధనరాజ్య
శ్రీలతి బాల్యము వృద్ధం
బాలమ్మునఁగెడపు నైదు వది కృతికర్తృ. 126

అన్నాఁడిఁక గ్రహదశావస్థ లక్షణము

కాలామృతే —

శ్లో. †దీప్తః శాంతోముదితః స్వస్థః శక్తః ప్రపీడితో దీనః
వికలః ఖలశ్చ భీతః ఏవం దశగ్రహావస్థాః. 127

వ. అన్నా రట్లగుటం జేసి గ్రహముల కవస్థలు తెలియవలయు, నట్టి క్రమం
బవధరింపుము. 128

సీ. ఉచ్చ యెందుండిన నొప్పు దీనావస్థ
స్వక్షేత్రగతుఁడైన స్వస్థుఁడగును
మొనయును హృద్గేహమున ముదితావస్థ
సరవి శుభాంశను శాంతుఁడగును

---

125. [1]గుణజాలగోపాల బాలకృష్ణ! (తి).

126. *ఈపద్యము అనంతన ఛందోదర్పణమునఁ గానరాదు.

227. †ఇది కాలామృతమునఁ గానరాదు. కాలామృతములోనివి శార్దూల వృత్తములు.

సౌమ్యాంశగతుఁడైన జగతి శక్తావస్థ
తిలకింప నీచచే దీనుఁ డగును
కలుషగ్రహంబుతోఁ [1]గలియం ఖలావస్థ
యర్కాంశలుప్తుఁడై నపుడు వికలుఁ
తే. [2]దరి గృహ[స్థితు]ఁడై యున్న యపుడభీతుఁ
డగుచునుండుఁ బరాజితుఁడైనఁ బీడి
తుం డిటుల గ్రహావస్థ(ల) త్రోవలరసి
రచన చేసిన శుభమగు రామకృష్ణ! 129

తదవస్థాఫల లక్షణములు :

సీ. దీప్తగ్రహంబైనఁ దేజంబు లొనఁగూర్చు
స్వస్థగ్రహంబు నిశ్చలత నిడును
ముదిత గ్రహంబైన మోదంబు సిరి నిచ్చు
శాంతగ్రహమొనర్చు సౌఖ్యతతుల
శక్తగ్రహంబైన జయ విక్రమము లిచ్చు
దీన గ్రహంబు నొందించు దైన్య
మరయ ఖలగ్రహమైన నిర్ధనుఁ జేయు
వికలగ్రహము మది వికలపఱచు
తే. ధరణి భీతగ్రహంబు [1]సాధ్వస మొనర్చు
పీడితావస్థచే బహుపీడలడరు
తద్గ్రహావస్థ లివియు భేదంబులరసి
కవితఁ జెప్పవఁ గవి కవిగాక కృష్ణ! 130

కవిగజాంకుశమున - [ప. 24]

ఆ. ఏ యవస్థనుండి యేవేళ నేగ్రహ
మే శుభాశుభంబు లిచ్చుచుండు

---

129. [1]గలియుగ్రహావస్థ (శా), [2]దరిగృహస్థుఁడైయున్న (శా) - అక్షర లోపము.

130. [1]సాధ్వసము నొసంగు (తి).

నా యవస్థనుండి యావేళ నా¹గ్రహ
మా శుభాశుభంబు లందఁజేయు. 131

అన్నారు. ఇఁకనందు గ్రహదృష్టి లక్షణము

సీ. వెలయఁగా గ్రహములు వీక్షింతు రగ్నముల్
తేటగావించెద మూఁటఁ బదిట
పాతిక దృష్టిచే భాను సూనుఁడు చూచు
నైదిటఁ దొమ్మిది నర్ధదృష్టి
చే బృహస్పతిఁజూచుఁ జేరి నాలుగు నెన్మి
దింట ముప్పాతిక దృష్టిచేత
నంగారకుఁడు చూచు నాదిత్యచంద్రులు
బుధ దైత్యగురులు సంపూర్ణదృష్టి

తే. చేతఁ జూతురు నేఁడింటి భూతలమున
నట్టిచూపులు బలవంత మట్టి చోట్ల
రెండునార్పదకొండు పండ్రెండు నాఁగ
నిట్టి నాలుగు తావుల నెట్టి గ్రహముఁ
జూడఁ దిటువలె గ్రహదృష్ట్లజాడ కృష్ణ ! 132

ఇఁకనందు గ్రహదోషరాహిత్య లక్షణము

సీ. తొలఁగును రాహువు దోషంబు బుధునిచే
దను రాహుసౌమ్య దోషములు *కవిచె
వీలియు విధుంతుద బుధ శుక్రదోషము
లంగారకునిచేత, నణఁగురాహు

---

131. ¹ నాగణం [ముద్రిత శ. గ. అం. పాఠము].

* కదిసె (అ. శి. లిఖితప్రతి). ఈ పాఠము సరిగాదు. సందర్భమును బట్టి 'కవిచే' (=శుక్రునిచే) అనియుండునగు. గణానురోధమున 'కవిచె' అని హ్రస్వాంతము గావలసివచ్చు.

బుధశుక్రకుజ దోషములు సౌరిచేతను,
క్షీణమగును సైంహికేయ సౌమ్య
కవి భౌమ సౌరి దోషములు వాచస్పతి
(?) చేతఁ దీఱును ఫణి సౌమ్య భాను

తే. సూను గురుదోషములు చిత్రభానుచేత
నడయు మును సర్వదోషము ల్చంద్రుచేత
గార్గ్య సంయమి వచన ప్రకార సరణి
వలయుఁ దద్దోష రహితముల్ దెలియఁ గృష్ణ! 133

ఇఁక నందుఁ బంచతత్త్వ లక్షణము

సీ. మేదిని తత్త్వ మెన్మిది [1]గడియలు పొందు
కాంఢ తత్త్వము నాల్గు గడెలు చెందు
నగ్ని తత్త్వమునకు నాఱు గడియ లొప్పు
ననిల తత్త్వమునకు నైదు గడెలు
గగన తత్త్వము [2]కేఱు గడియ లీరీతిగాఁ
గ్రమమునఁ బంచతత్త్వములు భాను
శశి కుజ బుధ దివసమ్ముల నీల జ
లానల మరుతము ల్నదము మొదల

తే. ప్రాతరాదిగ గురు కవి భానుసూను
వాసరమ్ముల గగన తత్త్వములు మొదలు
గాఁగ నడుచును ఫలమెన్నఁ గలిమి సుఖము
మృతము శుభమును లేమియు మిగులఁ గృష్ణ! 134

133. (?) చేత - సౌమ్య - ఈ పాఠమున యతిభ్రంశము కలదు. ఇందు 'చాత' అను వ్యావహారిక రూపమును కవి యుపయోగించియుండు నేమో!

134. [1]ఘడియలు (రా), [2][illegible] (రా)

ఇఁక నందు *లగ్నశుద్ధి లక్షణము

శ్లో॥ ప్రవేశే ద్వాదశే శుద్ధి శ్శివప్యేకాదశ స్తథా
దశమ్యాం భోజనే శుద్ధి ర్నవమ్యాం క్షౌరకర్మణి ॥
ఉపనయనస్యాష్టమే శుద్ధి ర్వివాహే ఋతు సప్తమే
షట్పుదిర్నవ వప్రస్య జననే యాత్ర పంచమే ॥
విద్యారంభే చతుశ్శుద్ధి రౌషధం తు తృతీయకే
ద్వితీయే బీజ మాప్నోతి జన్మశుద్ధిస్తు సంగమే ॥ 135

వ. ఇందుకు వివాహే ఋతు సప్తమీ అన్నారు. కాఁబట్టి కృతులొసంగు లగ్నమునకు ఆఱింటి యేడింటి యీరెండు దావులను గ్రహములు లేనట్టుగాఁ జూచి కవితాకన్యక నీయ వలయును. 136

ఇఁక దుర్ముహూర్త ప్రవర్తక లక్షణము

సీ. నలినాది వారమ్మున బదునాలవ లగ్న,
మురుప వారమ్మున నొకటి యవల
భాను సంజ్ఞలు రెండు పరఁగ లగ్నంబులు,
కుజవారమాది నాల్గో మహూర్త
ములు, బుధవాసరముగ నెన్మిదో ముహూ
ర్తము, బృహస్పతి వాసరమున సూర్య
రస సంఖ్యలనఁ దగు లగ్నముల్ రెండును,
రాక్షసగురు వాసరమున నొక్క-

తే. పైదు నీరెండు, శనివారమాది రెండు,
దుర్ముహూర్తములని వీని త్రోవలరసి
పరఁగఁ గృతులిచ్చు వేళలు పరిహరించి
వసుధ నటు కావ్యకన్య నీవలయుఁ గృష్ణ! 137

135. *గ్రహశుద్ధి (శా).

ఇఁక నందు దగ్ధ జ్వలిత ధూమిత జీవ నిర్జీవ నక్షత్ర నిర్ణయము

సీ. రవిసూనుకుజ భాను రాహువు [1]లేరిన
  తారక ల్జ్వలితము ల్కారణములు
తద్గ్రహంబు లివిరాఁ దలఁచిన రిక్కలు
  ధూమితమ్ములివి మృత్యుభయదములు
తద్గ్రహ ముక్తము ల్దగ్ధ నక్షత్రము
  ల్ధన ధాన్య చయము లత్తఱిన చెఱచు
రాహువున్నట్టి తారకును గ్రమంబుగాఁ
  బదునాల్గు వమభవింపంగఁ దొడరు

తే. నవియె నిర్జీవములు పుచ్ఛమాది యగుచుఁ
దనరుఁ [2]బద్మాఁడు జీవయుక్తములు వరుస
జీవయుక్తము లాయువు శ్రీ యొసంగు
మృతము లతికిన హతుఁడగుఁ బతియుఁ గృష్ణ! 138

*కవిరాజగజాంకుశమున —

క. పతి మృతుఁడగుఁ బద్యాదివి
మృత నక్షత్రంబు లిడిన మేదుర సౌఖ్య
వ్రితుఁడగు [1]నెప్పుడు జీవ
[2]ప్రతతములగు తారకములు పరువడి నిలువఁగ. 139

మఱియు నందె లక్ష్యము [కవిరాజగజాంకుశము. 65]

---

188. [1]జ్జేరిన (కా), [2]దనరు బద్మ్నారు (తి).

189. *ముద్రితప్రతిలో కానరాదు. కాని ఆనందరంగరాట్ఛందమునందును నీయది కవిగజాంకుశములోనిదిగ నొసఁగఁబడెను.

[రం. ఛం. 2 : 188].

[1]నమృతములన (రం. ఛం. 2 : 188), [2]న, ప్రతిమములగు తారక ములఁ బద్యాదినిడఁగ (రం. ఛం. 2 : 188).

ఆ. *ధవముఁ గోలుపుచ్చు దగ్ధనక్షత్రంబు
చావుచేటుదెచ్చు జ్వలిత తార
[1]ధూమితంబు మారితునిఁ జేయుమన్నట్లు
గాన మొదల విడఁగఁ గాదు వీవి. అన్నారు. 140

ఇఁక నందు శవజీవరోగ నక్షత్ర లక్షణము

తే. ఇనుని నక్షత్ర మారంభ మేళు తార
లవియె శవములు పండ్రెండు నవియె జీవ
తా రలటు తొమ్మిదియె రోగతారకమ్ము
లెట్టివగు వట్టి ఫలమిచ్చు నెపుడు కృష్ణ! 141

ఇఁక నందు క్షీణ మధ్యమ పూర్ణ చంద్రుల చందంబులు

సీ. క్రమముగా క్షీణ మధ్యమ పూర్ణచంద్రుల
విధములు తేటగావింతు శుక్ల
పక్షాది పంచమీ పర్యంతమును క్షీణ
చంద్రుండు నవలి దశమి దనుక[ను]
మధ్యమ చంద్రుండు మహిశుక్ల పక్షాంత్య
మగు పూర్ణచంద్రుండు నట్లె కృష్ణ
పక్షాది పంచమీ పర్యంతమును బూర్ణ
చంద్రుండు నవలి దశమి దనుక[ను]

తే. మధ్య చంద్రుండు మఱియు *నమాస నఱకును
క్షీణ చంద్రుండు విటుల నా చెలువు లరసి

---

140. *సులక్షణసారమున (ప. 257) రంగరాట్ఛందమున (2 : 193) నీ పద్యము అథర్వణచ్ఛందములోనిదిగఁ జేర్కొనఁబడెను. జీవితంబు పూరితునిఁజేయు నెప్పుడు (ల. శి. తా. వ్రాతప్రతి); ధూమితంబు మారితునిఁజేయు నన్నట్లు (శ. గ. ముద్రితప్రతి).

141. అమాస = అమవస. దీనికిఁ బ్రయోగములు - చూడు దశావతార చరిత్ర. 8-361, శశాంకవిజయము 2-186.

యెట్టి చంద్రుండు నైన దానట్టి ఫలము
లిచ్చుఁ గావునఁ గృతులీయ నెనఁగుఁ గృష్ణ! 142

ఇఁక నందు రక్తపీతశ్వేతకృష్ణచంద్రుల లక్షణము

తే. రవికులాలఁ గూడి నప్పుడు రక్తచంద్రుఁ
డవనిఁ గవితోన గలిసిన ధవళచంద్రుఁ
డుష్ణకరసూను ఫణులతోఁ గృష్ణచంద్రుఁ
డరయఁగా గురుజ్ఞాలఁ బీతుఁడగును గృష్ణ! 143

కవిరాజగజాంకుశమున - (ప. 51)

ఆ. శ్వేత చంద్రుఁడైన పేమంబు గావించు
రక్త చంద్రుఁడైన రణమొనర్చు
కృష్ణ చంద్రుఁడైనఁ గెడయించు శుభములు
పీత చంద్రుఁడైనఁ [1]బ్రియ మొనర్చు. అన్నాఁడు. 144

ఇఁక సత్త్వ రజస్తమోవేళాఫల లక్షణములు

సీ. గురు శశి [1]వారాశి కుజ కవి దివముల
శని రవి సౌమ్య వాసరములందు
వరవితో సత్త్వ రజస్తమో వేళలు
వరుణోదయాదిగా వరుస నడచు
వాల్గేపి గడెలు కన్యాధమర్మీన క
ర్కాట రాశి వారి కారయఁగ సత్త్వ
వేళయందును రజోవేళను వృషభాజ
తౌళి వృశ్చికరాశి వారలకును
ఘటి సింహ యుగ్మ మకరరాశి వారికి
వివరింపఁగాఁ దమోవేళ యందు

---

144. [1]ప్రీతినిచ్చు (కుం. సా. ప. 267).

145. [1]గురుశశివారంబు (తి) ['వారలు' — చరిత్రాది గణమునఁ జేర్చ వలెను].

తే. [1]కృతి యొసంగిన నార్నెలల్ మితము మృతము
కవియు వారల పేరు విక్కముగ నన్ని
నెలల కాకృతి శిథిలమై నేలఁ గలియు
తథ్య మింతయుఁ గవితావిధంబు కృష్ణ! 145

ఇఁక [1]శుభవేళలు

క. [2]ఘటి మృగసింహ యుగ్మములఁ గబ్బము లీయఁగ సత్త్వవేళఁ గ
ర్కటి [3]తపమీన కన్యకల కావ్యములీయ రజోధివేళఁ దాఁ
బటుగతి మేష జూక వృషభావళి తామసవేళఁ బద్య సం
ఘటన మొనర్చి యిచ్చినను గర్త జయంబును బొందు నెప్పుడున్. 146

ఇఁక గణవేళలు

తే. జగతిఁ దగణంబు యగణంబు సత్త్వవేళ
రాజసపు వేళ నొగి మభరస గణములు
రవి గణంబు తమోవేళ కవిజనంబు
లొసఁగ వెసనేఁగుఁ బతియు నాకపమునకును. 147

ఇఁక నందు పంచక లక్షణము

సీ. తిథియు నక్షత్రంబు దినము లగ్నంబును
వేర్వేఱ రాశిగావించి పిదప
పదియేను పండ్రెండు పదియు నెన్మిది నాల్గు
క్రమమున వానిలోఁ గలయఁ గూర్చి

145. [1]కృతి యొసంగిన నాఱ్రెలు మితము మృతము (తా).

146. [1]ధేనువేళలు (తా), [2]ఘట (తి), [3]తపమీన — ధనుర్మీనములని యుండవలెను. తపమునకు ధనురర్థములేదు. 'ధను మీన' అను పాఠముండునేమో! 'ధను' నకారాంతమే కాక ఉకారాంతమును గలదు.

గ్రహసంఖ్య భాగింపఁగా నెన్మిదియు రెండు
¹(నలు) నాల్గు నాఱు నొక్కటియు మిగుల
²రుగనల నృపచోర మృత్యువులనఁదగు
పంచకంబు లవి వర్జించి పేర్కొ-
తే. రచన చేసిన పంచక రహితముగను
శుభము లింపొందు నవియుఁ దాఁ జూడకెలిమి
కవితఁ జెప్పిన యమదూత కాక కవియె
కామితప్రద! వేంకటరామ కృష్ణ! 148

వ. ఇందు "వివాహే మృత్యు పంచక" — మన్నారు గాఁబట్టి మృత్యు పంచకము పరిహరించి యీ వలయు. 149

ఇఁక ఉచ్చనీచస్థానగణ లక్షణము

సీ. అజవృష మకర కన్యా లగ్నకంబులు
మేదిని కర్కట మీన తౌళి
రాసులర్కాదియౌ గ్రహముల కుచ్చముల్
గ్రమమునఁ దుల వృశ్చికము కుళీర
మీన మృగాంగనా మేషముల్ నీచలు
పరమోచ్చలతి నీచ లరయ వరుస
పదిమూరు పదినాల్గు పదియేను నైదిర్వ
దేకిర్వదియె భాగ లివియ యుచ్చ
తే. రాశితో నెన్న పరమోచ్చ వాసి గాంచు
నీచరాసులవివె యతి నీచలగును
తావుదప్పను నీచచేఁ దద్గ్రహమ్ము
లవియె జయమిచ్చు మచ్చఁ జెన్నలరి కృష్ణ! 150

---

148. ¹నలు నాల్గు (కా, తి), ²బుగనల (కా) — ఇట రుగనల అను పాఠమే సముచితము. రుక్ = రోగము. ఆ పాఠమును గ్రహించిన నిది 'రు - బు' వడి యగును. ఈ వడిని [illegible] పేర్కొనలేదు.

అథర్వణాచార్యులు —

క. స్థానచ్యుతియగు పీఠ
స్థానగణములైన మేలు దప్పించును నా
హీనగణంబులు పతికి న
హానందము సేయు నవ్యకమరిన గణముల్. అన్నారు. 151

సీ. పరమాత్మ! యిన్నియుఁ బరిశీలనమొనర్చి
తలచె బ్రహ్మకుఁ గవిత్వంబునదువ
ధరణి దోష స్వల్పతయు గుణాధిక్యంబు
గాఁ జూచి రచియింపఁ గలుగు శుభము
బ్రాహ్మణులకుఁ బది రాజుల కెన్మిది
వణిజులకును నాఱు వసుసతోన
నాలవజాతికి నాలుగు పొందుపల్
వాలాయముగ మండపంబుఁ జూడ

తే. వరయ వక్షర యుక్తము లరుల మిత్ర
ములను శుభశబ్దవాచకములను దీని
ములను గణములు గ్రహములు దెలిపి కృతుల
రచన సేయఁగఁ దగుఁ గవిరాజ కృష్ణ! 152

క. అకలంక స్థితి నిన్నియుఁ
బ్రకటింపఁగ వశమె సుకవి రాజులకైనన్
ఒకటర లటు గూర్పఁగఁ [1]జా
లకయున్నను గొదువగా దిలం గవికి హరీ! 153

ఈ దేవ శుభ శబ్దవాచకములకు ప్రయోగలక్షణము —

క. కవిసాగర గిరివాణీ
భువిగౌరీ మేఘ విధు విబుధ కుశలార్కో
గ్ర విజయ వాచకములు న
త్కవి మొదల న్నిలువ శుభము గలుగుఁ గృష్ణా! 154

153. [1]తోలకయున్నను (రా).

ఈ దేవశుభ శబ్దవాచకములకు ప్రయోగ లక్ష్యములు :-

వ. ఏకావళియందు "ప్రాలేయాచల కన్యకా" యనుట; కల్పవల్లియందు "హేరంబ మవలంబే" యనుట; నందిసింగయ తిమ్మన త్రిస్థలీదండకము మొదల "విజయనగరి హేమకూట" యనుట; సోమయాజి విరాటపర్వము "శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వ" [1]కనుట — ఇవి దేవవాచక లక్ష్యములు.

ఇఁక శుభశబ్ద వాచక లక్ష్యములు :- కాళిదాసు శ్యామలాదండకము మొదల "జయ మాతంగ తనయే" యనుట. 155

*[కవిసర్పగారుడమున —]

తే. దేవతా వాచకముల వర్తిల్లు నేవి
శబ్ద వాచకములఁ గూడి పరఁగునేవి
సగణ సంపర్క లబ్ధితోఁ దగియె నేవి
క్రూర సంయుక్త రిపునైనఁ గూడు మొదట. 156

వ. అన్నారు గాఁబట్టి యివి తల్లక్ష్యములు. 157

ఇఁక సంహారవచన లక్ష్యములు

క. [1]కూలుఁగా గాలుఁగా రాలుఁగా
జాలిమ వచనంబు లివియె సంహారము లా
కాలుని బారిఁగా బడుదురు
వాలాయం బగుట విడువ వలయుఁగా గృష్ణా! 158

155. [1]మనుట (శా).

156. *'అనంతనగారు' అని లక్షణశిరోమణి ప్రాతప్రతి. ఛం. ద. న నిదిలేదు. రం. ఛందము దీనిని కవిసర్పగారుడములోనిదిగ ఉద్ధరించెను (2 : 137).

158. [1]కాలుఁగా (తి).

ఇఁక నందు కృతులొసంగు లక్షణము

సీ. పంచాంగ శుద్ధియై పరఁగు దినంబునఁ
జంద్ర తారాబల స్వరము లరసి
పుష్కరయుక్తమై పొల్చు షడ్వర్గంబు
గల శుభలగ్నంబుగా నెఱింగి
మృత పంచకము సప్త ముఖ శుద్ధులరసి(యు)
బాలస్వరాదుల వేళఁ దెలిసి
ధారుణి నాచంద్రతారార్కముగఁ గవి
తాకన్య వీయఁగాఁ దగును సుకవి
తే. తగిన వరునకుఁ దగనట్టి మగువ చగదు
తగని మగనికిఁ దగినట్టి తరుణిగాదు
ఎలమి నలరక్షణ మొనర్చి యేలఁ జాలు
వరునిగాఁ జూచి కన్య నీ వలయుఁ గృష్ణ! 159

వ. అటుగావున, 160

సీ. ♦♦ మృదుపదంబులచేత మెలఁకువ విహరింప
వృత్తోరు యుగళిచే వేడ్కగాంచి
పాక స్తనా భోగ పటిమచేఁ దనరారి
వర్ణహారగుణాప్తి వరునఁ బొదలి
భావజాలంకార భాసురంబై మించి
న [1]వరున విశ్రుత నటన మెఱసి
రీతి శయ్యాశబ్ద రేఖచేఁ జెలువంది
యాకృతి స్ఫూర్తి యింపలర వెలిఁగి
తే. సకల విద్వత్కవీశ్వర సమితి వినుతి
కలిగి వర్ధిల్లు నక్కావ్య కన్య నిఖిల
లక్షణ గుణాఢ్య నీయందపేక్షఁ బూని
విన్నవించితిఁ గరుణింప వలయు గృష్ణ! 161

160. [1] శరన (తి).

అద్దంకి గంగాధరయ్యగారు [తపతీసంవరణము - 2 : 84]

క. [1]మనసా కన్యకఁ బెంచియుఁ
జెనఁటైన కురూపి పాలు చేయక భువిపై
ననువైన వరున కిచ్చిన
జననీ జనకులకుఁ గడుపు చల్లనగాదే. అన్నారు. 162

నాచన సోముఁడు [చాటుధార]

క. కవితా కన్యక [1]కెందును
గవి జనకుఁడు, బట్టుదాది, గణుతింపంగా
నవరస రసికుఁడె పెనిమిటి,
యవివేకియె తోఁడఁబుట్టు వనవేమనృపా. 163

వ. అన్నారట్లగుటం జేసి మదీయ లక్షణ కావ్యకన్యకఁ జగద్విఖ్యాతిగా భవదర్పితంబుఁ జేసి సంపూర్ణమనోరథుండను, గృతకృత్యుండనునై వెండియు మెండగు కవితండమ్ముల దెందమ్ము(న) నుండు సంశయంబు గల దధి విశదంబుగాఁ దేటఁ జేసెద నవధరింపుము. 164

ఆ. లక్కణమ్ములన్ని చక్కట్లు లెక్కించి
చెప్పవచ్చు రచన సేయఁ బోల
దనుచు నిందునందు ననుకొందు రందుఁ [1]ప్ర
త్యక్ష ఫణితినవి పరీక్షఁ గనుఁడు. 165

వ. అవి వచియించి తదీయ లక్షణంబులు లక్ష్యముఖమ్ములఁ బరీక్షఁ జూపెద నవి యెటువలె నంచేని పంచాగశుద్ధియైన శుభదివసమున రాజ్య

---

162. [1]మనసార (తి) — 'మనసారఁ బెంచి కన్యను జెనఁటి యగు ... పాలుచేయక నీ కంటనువకు' (ముద్రితప్రతి) 'మనసా' — అను సంస్కృతవిభక్త్యంతప్రయోగము సవరింపఁబడి నట్లున్నది.

165. [1]ప్రత్యక్ష (తా).

163. [1]కన్యక నలుగురు. (చాటుపద్య మణిమంజరి. పుట. 82)

స్వరంబున సత్త్వవేళయందు వాగీశ్వరీ సరస్వతీ ధ్యానపూజలుచేసి కావ్యమారంభించి కృతిముఖంబున నిఖిల లక్షణములగా జెప్పెందు నాందీ పద్యంబునందు, 166

క. శ్రీరామారమణ జయ
శ్రీరమ్యగుణాభిరామ శ్రీవేంకట లో
కారాధ్య ప్రోవు మమ్ము ద
యారస సుమదామ వేంకటాచలధామా! 167

వ. అని పద్యాదిని శ్రీకారంబు శ్రేయస్కరంబగు నట్లెను; ఆ రెండవ వర్ణము రేఫ యా రేఫకు గ్రహం చంద్రుఁడు మొదలి శ్రీకార మందలి శవర్ణ రేఫలకు రెండింటికి గ్రహం చంద్రుఁడే గనుక పద్యాది రెండక్షరములకును గ్రహమిత్రంబు గలుగు నట్లెను; శ్రీరామారమణ యీ మగణము గణము లన్నింటికిన్ని మొదలి ప్రధాన గణము గనుక మంచిదని నట్లెను; ఈ మగణ జననము సూర్యోదయాదుపరి మొదలి జయ నామ యామము శుభమగు నట్లెను; ఈ మగణస్వరం ప్రణవం ఫలం శుభప్రదమగు నట్లెను; రమణ నగణం ఈ మగణ నగణములకు రెండింటికి గ్రహవైరములు మొదలుగాఁ గల దోషాదులు లేనట్లెను; మఱియు, 168

తన్నగణ లక్ష్యములు శ్రీధరుండు [శ్రీధరచ్ఛందము]

క. మున్న గ్రహమ్ముల గణముల
నెన్నుచు నగణంబు దడవరిది గావునను
.................................
................................. 169

అథర్వణాచార్యులు —

తే. పర్వతములందు మేరువుభాతి యగుచు
[సర్వసుర(రు)లందు శంకరు చంద మగుచు

చరయ మృగములయందు సింహంబు కరణి]
గణములందెల్ల నగణంబు గరిమఁ [1]దాల్చు. 170

[*కవిజనాశ్రయము - సంజ్ఞ - వ. 51]

క. ఏగణముఁ గదియు నగణం
బాగణము సమస్త మంగళావాప్తంబై
రాగిల్లు [వినుము పరుసపు
యోగంబునఁ బసిఁడి వన్నెనూనిన మాడ్కిన్.] 171

పాదాంగ చూడామణియందు —

చ. గుణములకెల్ల [1]నాలయమగుం గృతులందున దాసియుండు దు
ర్గుణ గణదోషము ల్వెలిచుఁ [2]గోరిన వస్తువు నూత్నమైన భూ
షణముఁ నిచ్చుఁ గావ్యముల సత్కవిశేఖరులెంచ సర్వల
క్షణములుగల్గ యొప్పు బుధసన్నుతమై నగణమ్ము శంకరా! అన్నారు. 172

కవిసర్పగారుడమున —

మ. పరమాత్ముం డధినాయకుండు జయసౌభాగ్యైక సామ్రాజ్య పూ
జ్యరమా సంతతులీగి లబ్ధము విజోపాంతస్థ దుష్టాక్షరో
త్కర దోషాఢ్య గణౌఘ ధూర్త [1]గుణ ముల్లంఘించు నాశీల మె
వ్వరికిం గాదపరాదు నా నగణ మవ్యాజస్థితిం బొల్పగున్. 173

---

170. [1]గరిమఁ గాంచు [రం. ఛం. 2 : 107]

171. *లక్షణశిరోమణి వ్రాఁతప్రతిలో నీపద్యము 'గోకర్ణచ్ఛందంబునందు' అని కలదు. రం. ఛం. దీనిని 'భీమనచ్ఛందంబున' అని పేర్కొనెను (2 : 104).

172. [1]నాకరములు గోరి కృతీంద్రుల దాసి (రం. ఛం. 2 : 98), [2]గోరిన వస్తు వినూత్న రత్నభూషణములనిచ్చుఁ గావున సత్కవిశేఖరు లెంచు (రం. ఛం. 2 : 98)

173. [1]గుణముల్ ఖండించుటల్ శీలమై (రం. ఛం. 2 : 99)

వ. అన్నారు కాఁబట్టి నగణయుతమైన మగణము సర్వశుభదాయియగు నన్లేను. 'శ్రీరామారమణ' దేవవాచకము. 'జయ' శుభవాచకము. 'శ్రీరమ్య గుణాభిరామ' భద్రవాచకము. ఈ దేవశుభభద్రవాచకములకు — 174

[గ్రకవిసర్పగారుడము — ]

గీ. దేవతావాచకముల వర్తిల్లె నేని
భద్రవాచకములఁ గూడి పరఁగెనేని
నగణ సంపర్క లబ్ధితోఁ దగియెనేని
[క్రూర సంయుక్త లిపులైనఁ గూడు మొదల.] 175

వ. అన్నారు గావున నీ దేవశుభ భద్రవాచకములు జయసౌభాగ్యారోగ్యదాయి యగు నన్లేను;

"శ్రీరామా రమణ" యనే మొదలి పద్యాది శబ్దవిభక్తి సంబుద్ధికి జయపతి అధిదైవతం. ఈ ఫలం విభవమగు నన్లేను; "శ్రీవేంకట లోకారాధ్య" యనిన వాక్యమునందును వేంకటశబ్దము మొదల శ్రీ తుద లకారము ఈ వేంకటశబ్దాది శ్రీ శకారరేఫ ఈకారములు త్ర్యక్షరాన్వితమైన యీ యక్షరమ్ములలో శకారరేఫలకు గ్రహం చంద్రుడు. ఈకారమునకు గ్రహం సూర్యుఁ డగును. వీరలిద్ద రన్యోన్యమిత్రులగు నన్లేను; ఈకారశకారములు రెండింటి కధిదైవతం లక్ష్మీదేవి. రేఫకధి దైవ మగ్ని "లక్ష్మీప్రదోవహ్నిః" అనే వాక్యమునను న్ను "ప్రథమాం పిబతే వహ్నిః" అనే వాక్యమున చంద్రుని మొదటి [1]కళ దీసుకునె వాడున్ను అగ్నిహోత్రుఁడే గనుక మేలగునన్లేను --

ఆ వేంకటశబ్దము తుద లకారమునకు గ్రహం చంద్రుఁడు గనుక వేంకటేశ్వరునకుభయపార్శ్వ వర్ణగ్రహ మిత్రత్వము గలిగినన్లేను; కృతిపతి వేంకటేశ్వరుఁడు గనుక యీ స్వామినామ నక్షత్రంబు మృగశిర దేవగణము. పద్యాది మగణనక్షత్రం [2]చిత్ర స్వాభావికమైన దైవరాక్షస

---

174. గ్ర'అనంతనగారు' — అని అ. శిరోమణి వ్రాఁతప్రతి శవిసర్పగారు డములోనిదిగ (రం. ఛం. 2 : 167)

176. [1] మొదటి కల యిచ్చేవాడున్ను ......... మంచిదగు నన్లేను (శా), [2] జ్యేష్ఠ ఇది రాక్షసగణం గనుక స్వాభావికమై (తి).

గణములగునట్లేమ; మాహేంద్ర పొంతువు గలుగు నట్లేను; చిత్రా మృగశిరా నక్షత్రములకు స్త్రీదీర్ఘ పొంతువు గలుగు నట్లేను; మృగశిర సర్పయోని, చిత్ర వ్యాఘ్రియోనియుఁ గనుక యోని పొంతువ గలుగు నట్లేను; వేంకటేశ్వరుని నామనక్షత్రరాశి మృగశిరా వృషభం, పద్యాది మగణ నక్షత్రరాశి చిత్రాకన్యారాసులకు పంచమ నవమంబు లగుటకు ఫలము సకల సౌభాగ్యారోగ్యంబులు చేయుఁ గావున రాశి పొంతువు గలుగు నట్లేను; కృతికర్త రాశి వృషభానకు గ్రహము శుక్రుఁడు, గణ నక్షత్రం కన్యారాశికి గ్రహం బుధుఁడు, వీరలిద్ద రన్యోన్య మిత్రులు గనుక గ్రహమైత్రి పొంతువలు గలుగు నట్లేను; మృగశిరా నక్షత్రమునకు నాడీరజ్జు పొంతువులు మధ్యమములైనను "రాశియోని సమతో యది చేన్నదోషః" అనే వాక్యప్రకారమున దోషరహితంబు గావున మంచివగు నట్లేను; మృగశిరా వృషభ చిత్రారాసులకు రాశికూట నక్షత్ర పొంతువులు గలుగు నట్లేను; దోషస్వల్ప గుణాధిక్యంబు లగుట కావచ్చును; మిగిలిన వన్ని పొంతువ లున్నవి గనుక ఒకటరలు లేకయున్నను గావచ్చు గనుక శుభకరమగునట్లేను; శకచటహల నియ్యారు వర్ణములున్న మొదటి మూఁటి నైదిటి వదనొకొంటికి పరిహరించి శ్రీసంయుక్త వర్ణములు గనుక స్త్రీలింగయోగములు మంచివిగా ప్రథమాక్షర శ్రీః జాతి వన్నె ఫలములు నక్షత్ర సురనర తిర్య గధోముఖోర్ధ్వముఖ పార్శ్వముఖ అమృత విష అల్పప్రాణ మహాప్రాణ స్నిగ్ధ రూక్షాంతస్థ ఊష్మ లక్ష్య లక్షణములు నిర్ణయించుటకు సహజ వర్ణముగాదు గమక శ్రీసంయుక్తాక్షరంబు గావున లక్ష్య మిందులకు — 176

*లింగమగుంట రామన్నగారు లక్షణతిలకంబున —

క. వినఁబడు దీర్ఘము విషమగు
నమవిది విజముగను సంయుతాక్షరమైతే
మునుపటి గుణములు విడువడి
తనరఁగ వేఱొక్క గుణముఁ దాల్చుమురారీ! 177

176. శియూష్మ (అ. శి. లిఖితప్రతి).

177. *రం. ఛం. నిది 'భీమన' పద్యముగ ఉద్ధరింపబడెను (2 : 140).

వ. అన్నారు గావున పసుపున్ను సున్నమున్ను భిన్నవస్తువులై యున్న యపుడు తమ స్వీయగుణమ్ములచేత స్వప్రకాశంబగు ; నా పసుపున్ను సున్నమున్ను ఈ రెండున్ను ఏకముగాఁ గూడియున్న యపుడు తమ స్వరూప గుణంబు విడిచి వేఱొక గుణప్రకాశమై తేజరిల్లు చందంబగునట్లెగావున — 178

క. మొదలన్వంయుక్తాక్షర
మదికిన నారెంటికి విగ్రహమ్ముల మైత్రుల్
కుదురుపవలె..................
.......................... 179

వ. అనుట గాఁబట్టి శ్రీకారప్రధానము గనుక తత్పల విదానములు చూడ వలయుఁగావున తత్ఫలంబు లున్నవి యవియును మంచివగునట్లేను ; రాహుగ్రహం ఉత్తరాషాఢా నక్షత్రముననుండుఁ గావున కృతికర్త నక్షత్రం మృగశిర, జీవనక్షత్రం మంచిదగు నట్లేను ; సూర్యాంగారక శశిరాహువు ఉత్తరాషాఢా శ్రవణాశ్వినీ నక్షత్రముల నున్నారు గనుక జ్యేష్ఠా మృగశిరా నక్షత్రము దగ్ధ జ్వలిత ధూమిత శవరోగ తారలుగా నట్లుగా ఫాల్గుణ శుద్ధ ౧౦ శుక్రవారం పూర్ణచంద్రుఁడు కర్తరాశి గ్రహ గణగ్రహములైన శుక్రబుధులు ఉచ్చస్థానగతులై శుభావస్థల మండఁగా చంద్రతారాబలోపేతమై ఏకవింశన్మహాదోషములు పరిహరించి పంచక రహితమైన సుముహూర్తాన మత్కావ్యకన్యను చతుర్దశ భువనాధీశుండైన ఐహికాముష్మిక ఫలప్రదాతయైన శ్రీ వేంకటేశ్వరునకు సమర్పితము చేసియున్నది. ఈ సకల లక్షణ లక్షితములు [1]జ్యోతిషవిశేషజ్ఞులు సుకవిరాజులు పరిశీలనముచేసి యనుగ్రహింపవలయు నిందులకు లక్ష్యము. 180

గ్రలక్షణ తిలకంబునందు —

సీ. వినుత పద్యాది నిల్చిన వర్ణమునకు నా
ల్గవ వర్ణమున కరి దొరకుండ

180. [1]జ్యోతిష (కా).

181. గ్రహది సులక్షణసారములోనిదని (ఠం. ఛం. 2 : 763) లో నుదా హృతము.

మొదలి రెండక్షరమ్ములు గణద్వంద్వంబు
గ్రహవైరములు [1]చేతఁ గదియకుండ
కృతి నాయకుని పేరికిని కార్శ్వ వర్ణముల్
క్రూరగ్రహ ప్రాప్తి గూడకుండ
దగ్ధజ్వలిత ధూమిత వ్యాధి నిర్జీవ
తారక లాదులు చేరకుండ

తే. గణ జనన యామములు తత్త్వగతులు రసము
[2]లొప్పఁగా వాని నెంతువ ల్దప్పకుండఁ
[3]గలుగు శబ్ద మొక్కటి చాలు గంపెఁడేల
లక్షణ విహీనము ల్దగ్రదక్ష రామ! 181

వ. అన్నారు కాబట్టి 182

సీ. గ్రాస కకార్త్తి [1]బేగ్మాదిగా కవిచేతఁ
బద్యమందినను బ్రాభవము చెడును
కాదు నానావిధ కష్టహేతువులకు
మూలంబు కవిదాఁకి మొఱఁగి తిరుగు
లాక్షణికుఁడు గాక లాఘవం బెఱుఁగక
యొరులు దాఁజెడుటయు నెఱుఁగలేక
యల్లనఁ బద్యంబు లందిన మఖయాత్ర
నాపదవాటిల్లు టరిది మిగులఁ

తే. తెలిపి కృతులందు వలయుఁ దాఁ దెలివి కవిత
ఘవిని రచియింప వలయు నగ్గువ తరంబు
కవులు దాతలు గల్గుటఁగాదె చెప్ప
మీఁఱటలు దాత కవులౌట మితమె కృష్ణ! 183

---

181. [1]తోడ (రం. ఛం.), [2]లొప్పఁగాఁ బొత్తువులు తప్పకుండఁ, [3]బలుకు శబ్ద మొక్కటియే చాలు (రం. ఛం.).

183. [1]సరియగు పాఠము తెలియరాదు.

క. మిడుకుచుఁ జిడుముడి పడుచుఁ
తడఁబడుచుఁ దొడఁబడి విడిచి తడఁబడు పెదవుల్
దడుపుచు నెడనెడ సంధులు
చెడ వడకుచు మొఱఁగి తిరుగు చెనఁటి న్గవియే! 184

తే. పృథివి నెవ్వరి పెండ్లిండ్లు పెన్నఁ గలిపె
నేవి తేవయ్యరూకన్న [1]సామెతగను (?)[1]
గ్రాస కక్కుర్తి కృతిదరిచేపి కవులు
చావ నొల్లరు [2]బ్రతుకుపేక్షించి కృష్ణ! (?)[2] 185

*లక్షణతిలకము —

క. ధరపై గురకుర కవితల
నరపిన శుభలక్షణంబు లబ్బవు సుమ్మీ
పరిపరి గతుల మహాకవి
వరుల కవిత్వంబు నున్న వైఖరిరామా। 186

వ. మఱియును, 187

[సులక్షణసారము] —

క. [1]లక్షణ మెఱుగవి కవి యవ
లక్షణుఁడు తదీయ కవిత లాఘవమగుఁ బ్ర
త్యక్షముగఁ గీడుఁ జూపఁ బ
రోక్షంబున స్వర్గసౌఖ్య మబ్బదు రామా! 188

[1][సులక్షణసారము] —

ఆ. గ్రుడ్డియెద్దు జొన్నఁ బడ్డట్లు సన్మార్గ
మెఱుఁగలేక కవితలెట్లు చెప్ప

---

185. (?)[1], [2] యతిభంగము 1. నానుడిగను - సవరణ. 2. బ్రతుకు పేక్షఁగొని - సవరణ.

186. *ఇది 'సులక్షణసారము' లోనిదని (రం. ఛం. 2 : 257).

188. [1]ఇది 'సులక్షణసారము' లోనిదని (రం. ఛం. 2 : 259)

189. [1]ఇది సులక్షణసారము లోనిదని (రం. ఛం. 2 : 260).

నగును జెప్పెనేని హాస్యాస్పదము గాన
లాక్షణికుఁడు గావలయును ²గృష్ణ! 189

క. *తిట్టిన దీవించిన భువి
గట్టిగఁ దత్ఫలము లొనఁగుఁగద కబ్బంబుల్
నెట్టన లక్షణ మర్థిగఁ
బట్టుగ నేర్చినను దీనపాలన రామా! 190

శత్రువధోపాయలక్షణక్రమము

అరువది వక్రంబు నందలి స్థానాక్ష
రములన్ని గగన బీజములు విలిపి,
దగ్ధజ్వలిత ధూమిత వ్యాధి నిర్జీవ
శవతార లాదుల సంఘటించి,
శతసహస్రశ మృత స్వరముల సంధించి
వృద్ధమృత స్వర వేళ లరసి,
¹ఋ, ౠ, ఌ, ౡ, ఙ, ఞ త న ల శ చ ఛ ఝ ర థ ఫ
ధ జ ట (ఠ) అమ్మ షతతి విధించి

తే. మొదటి పాళ్ళూర్ధ్వముఖ మధోముఖ విధాక్ష
రములు విషదీర్ఘ సంగతి క్రమము దెలిపి
కటచశహలాది మూఁటనైదిట రసాద్రి
రుద్ర సంఖ్యల విడుతత్స్వరూప మెంచి. 191

సీ. మగణ భగణములు మగణ రగణములు
మగణ తగణములు జగణ సగణ

189. ²రామ (రం. ఛం. 2 : 260).

190. *రామ సంబద్ధి గలదనుట సులక్షణసారములోనిదిగా దోఁచును.

191. ¹సాధుపాఠ మూహ్యము.

రగణ భగణములు మగణ జగణములు
భగణ యగణములు సగణ యగణ
నగణ రగణములు రగణ తరణములు
యగణ తగణములు [1]యగణ (జ)గణ
యగణ భగణములు పగయొక్క టొకటికిఁ
గావున మగణ భగణము లందు
వెసనొప్పు భ్రమర విలసిత వృత్తము జల
ధరమాలికనెడు వృత్తంబు క్రౌంచ
పదము మందాక్రాంత విదిత వృత్తంబులు .
మగణ రగణయుగమైన చంద్ర
రేఖయు స్రగ్ధరావృత్త సువదనముల్
మగణ తగణ యుక్తమైన శాలి
[2]నీ కుసుమితలతా వృత్తము రెండిట (?)
జగణ ద్వయమ్మునఁ జనెడు పృథ్వి
తగు రభరజగణ ద్వయములఁ గల హారి
ణాత వృత్తము పాంచజన్య సింహ
విక్రమ వృత్తముల్ వేనిడి యిరువది
యాఱు ఛందమ్ముల వేఱు వఱచి
మఱియుఁ దక్కినయట్టి మజ, భయ, నయ, సర
రభ, రత, యర, యత, యభ గణములు
గల వృత్తములను నీకరణిరా వన్యోన్య
శత్రుగణగ్రహ సరణి నునిచి
అది దైన్య మృత దరిద్రావస్థ లొనఁగూర్చి
సంహార వచనము ల్పొంఘటించి
కారాని పొంతువ ల్చేరికగాఁ జేసి
వృద్ధ మృత స్వరవేళ లరసి

192. [1]యగణ తగణ - లిఖిత ప్రతి — ఇది పునరుక్తి. యగణ జగణములకు విరోధము గలదని లక్షణదీపిక (40) - దానింబట్టి జగణమని సవరింపఁబడెను, [2]యతిభంగము.

సత్త్వ రజస్తమస్సరణులు మృతపంచ
కము లగ్ని వాయుతత్త్వములు శిరక్త
శ్యామచంద్రులును నీచస్థాన గణములు
ప్రథమ వర్ణద్వయ బంధకములు
కృతిపతి పేరిటికిని బార్శ్వ వర్ణ ద్వి
తయమునఁ గల విరోధక్రమములు
శాపించి యీగతి సన్నిహితము గాఁగ
విరచించు వేళఁదా వెదకి మొదల
సన్నియుఁ జేరఁగా విడఁ గూడ దనఁ గొన్ని
ముఖ్య ప్రయోగము ల్మొదటఁ గూర్చి
ప్రతినచే నొసఁగిన బ్రహ్మరుద్రాంతక
మృత్యువుల్గాచిన మృతము సతము

తే. కడఁగి యీగతి యిఁకఁ గొన్ని కంద విషయ
సీసగీతుల యందైనఁ జెప్పఁ దగును
నిటుల గణ వర్ణ విషమంబు లెన్నఁ బడిన
పద్యదోషంబు లెల్లను బరిహరంబు
మిమ్ము మతియించు కతన విఱమ్ము కృష్ణ! 192

*భీమనగారు —

సీ. తొలుత శత్రు గృహంబు లలవడ గాలించి
తుదమృత్యుగణముతోఁ గదియఁగూర్చి
వైరి నక్షత్రంబు వైరి నామంబును
మృత్యు బీజంబున మేళవించి
ఆ గణం బటుతఁ దా నరి గణంబును నిల్పి
విషదగ్ధ వర్ణముల్వేసక మనిచి

---

192. శారక్తశ్యామ — ఇందు 'క్త' లఘువుగా నెన్నవలెను, లేకున్న గణభంగమగును.

193. * ఈ పద్యము కవిజనాశ్రయమున లేదు.

హకచటతపలైది టాటిట నేడింటఁ
బదునొకొండింటను బరిల పఱచి
తిలతైల మొక్కింత తలమీఁద విడుకొని
మూఁడు శిఖలుగాను ముళ్లువేసి
ధానుదగ్ధములు కపాలంబు మోపిది (?)
దుత్తూర కలమునఁ దూలవ్రాసి

తే. గగన మార్గంబు గనుఁగొని పగతులడఁచి
కడఁగి యేడిచి పద్యంబు గాలవేయ
వఱఁడు [1]గాచిన హరిహరు లడ్డపడిన
చిచ్చపడు మిత్త్రకైవడిఁ జచ్చు నరుఁడు. 193

వ. అన్నారు. ఏతల్లక్షణ లక్షిత దీక్షాదక్షుండై దక్షిణైశాన్యాభిముఖంబున రచియింపవలయు నిది బ్రహ్మాస్త్రప్రయోగమనఁబడు నిఁక నందు — 194

కవిరాజగజాంకుశమున - (వ. 8)

క. నక్షత్రగ్రహ రసభూ
తాక్షర గుణదోష నిర్ణయం బొనరింపఁగా
దక్షులగా రిది గాదని
శిక్షించిన కన్నులెఱ్ఱపేతురు కుకవుల్. 195

అన్నారిఁక మదీయము —

చ. గణము తుటాకి తారక చౌకాటపు మందు విషాక్షరమ్ములన్
పెను కొడి ద్రాదు రంజకము బీజము రాశి గజంబు వర్ణ మా
యనలము వేళ బాదరగ్రహంబది సీసపు పట్టు గుండు దు
ర్జనుఁడు తదీయ లక్ష్య మటలాక్షణి కుండిల వేఁటకాఁడగున్. 196

193. [1]గాంచిన (కా) - గాచిన (రా) 'కాపాడు' అను నర్థమున — ఇది నిర్బంధుకము.

193. (?) 'మోపిది' - అర్థము విచార్యము.

క. ఘటనా ఘటనాద్య[1](ఖిలం
బటు) మత్పటులక్ష్య లక్షణాబ్ధిగత ప్ర
స్ఫుటమతి(వి) జేయు భువిన
వ్నిటఁ గల లక్షణము లిందు విలుపుటఁ గృష్ణా! 197

తే. గ్రంథ విస్తరమగుమ లక్ష్యముల వనుచు
వ్రాయలేదిందు బహుగాను వసుధఁ గల్గు
లక్షణములన్న వన్ని పరీక్షఁ జూడుఁ
డఖిల లక్షణముల యందు నార్యులార! 198

తే. జగతి గతి నాలవాలమై సద్వివేక
జనన గుణగణ లక్షణ స్థాన మిదియుఁ
జక్కఁగాఁ జూడుఁ డీ! కవి చక్రవర్తు
లారా! వందనమిదె, కవిరాజులార! 199

మ. శరణార్థీకృతమౌవి విర్జర! జరానందాది భంగప్రదా
కరదీభూత సమస్త భూవర! వర గ్రైవేయ కేయూర నూ
పుర సత్కంకణ కింకిణీధర! ధరాపూర్ణ ప్రజాభార సు
స్థిరతా మోచన ధిక్కృతాదర! దరస్మేరాననాంభోరుహా! 200

పంచచామరవృత్తము.

ధరాధరా వరాపహారి ధైర్యధుర్య రుగ్ధరా
హరాహరాది వర్ణనీయ హర్యవార్య సంగరా
చరాచరాద్యనంత జంతు సంతతావనాదరా
పరాపరా పరాంబు రాశి బాడబీ భవత్పరా! 201

గద్య. ఇది శ్రీమ ద్వేంకట కరుణాకటాక్ష వీక్షణ సంప్రాప్త సహజ పారస్వతాక్రాంత విశ్రాణన సంతత సంతోషిత, అమందానంద కందళిత నిఖిల ధరాబృందారకబృంద నందవర వంశోత్తంస, సకలకవిరాజమిత్ర, పౌత్తపి వంశ పవిత్ర, గౌతమసగోత్రాశ్వలాయన సూత్ర, సుచరిత్ర,

197, [1]బలంబడు (శా).

వసిండి కొండ దుర్గరాజ వేంగనమంత్రి పౌత్ర, రామయామాత్య పుత్ర, మదూరి రఘునాథ ప్రధాన దౌహిత్ర, యశేష విద్వత్కవిజన కృతాదరణ పాత్ర, చతురుపాయధురీణ, కావ్యశబ్దప్రవీణ, సకల కవిజనాంగీకృత విశ్వంకలక్షణ చక్రవర్తి బిరుదాంక, వేంకటరమణాచార్యప్రణీతంబైన సకల లక్షణ సంయుత సుధాబ్ధి సంపూర్ణ చంద్రోదయంబగు లక్షణ శిరోమణియందు వర్ణగణవృత్త విశ్రమాధికారమ్ము లను చతుర్విధాశ్వాసముల విస్తరిల్లు నందు గణనిరూపణంబును, తదుద్భవలక్షణంబును, తజ్జన్యజనక క్రమంబును, తద్గణ నియమంబును, తత్పూర్వేంద్ర చంద్ర గణ నిర్ణయంబులును, తద్గణ సంఖ్యయు, గురులఘు వర్ణసంజ్ఞలును, తద్గణబోధక పద్ధతియు, తజ్జాతిరీతులును ఉపరిగణప్రవణయు, తన్మగణాది గణమ్ములకు ప్రణవాది సప్తస్వర ప్రకారంబును, తద్గణజనన యామ భేదమ్ములును, తత్కులగోత్రనామ యామ సుమగుణగణమణివార వర్ణ గ్రహ తద్గ్రహకాంతి రాశి రససాధనాదిదేవతా ఫల చందన తార యోని రాజ్య వస్త్ర లింగ సంగతులాదిగాఁ గలుగు వివిధ భేదమ్ముల విలసిల్లినట్టి యష్టగణాధికార ప్రకారంబును, అందు నగణగుణగణ మహిమయు, తల్లక్ష్య నిరీక్షణ లక్షణ విధంబును, తత్ప్రయోగ సరణి తెఱంగును, గణ బాంధవ సందర్భ శుభాశుభ విధానమ్మును, జ్యోతిష కవితావిశేషంబు బును, కవితా కన్యకా నాయకులకుఁ గూర్పును, దినగణ స్త్రీ దీర్ఘ మాహేంద్ర యోని రాశి రాశ్యధిపతద్గ్రహమిత్ర తచ్ఛత్రు తత్సమ తత్సమ మిత్ర శాత్రవ తచ్ఛత్రు మిత్ర తదన్యోన్య సమత్వ రూపంబగు గ్రహ మైత్రియు, వశ్యరజ్జు వేధా నాడి కూటము లనఁదగు ద్వాదశవిధ పొంతువుల పొందులును, రాశికూటాది నక్షత్ర సంగతులును, తద్భేదాది ప్రకారంబులును, తదుదాహరణమ్ములైన మహాకవి ప్రయోగములును, తద్గుణ వర్ణగ్రహ రాశిసంధాన విధులును, అవకహడ చక్రరీతియు, రాసులేర్పఱుచు కరణియు, మఱియు షడ్వర్గమార్గ పుష్కరగతులును, లగ్నఘటికా ప్రమాణంబులును, నక్షత్రాక్షర వేధా విధానమ్ములకు నంశచక్రప్రక్రియయు, తత్ఫలమ్ములును, తల్లక్ష్యంబులును, చంద్రతారాబల నిశ్చయంబు, బాల కుమార రాజ్యవృద్ధమృతస్వర పంచక సంచయంబులును, తల్లక్ష్యంబులును, తద్దశాభిముఖ ఫలాఫలంబుల చొప్పును, తల్లక్ష్యంబులును,

తద్గ్రహదృష్టులును, తద్దూషణ విశేషభాషణములును, పంచతత్త్వ మహత్త్వ వృత్తులును, తత్ఫలమ్ములును, లగ్న విశుద్ధులును, దుర్ముహూర్త ప్రవర్తనంబును, దగ్ధజ్వలిత ధూమితజీవ నిర్జీవ శవరోగ ఋక్షము లనందగు చుక్కలచక్కియు, రక్తశ్వేతపీత కృష్ణచంద్రుల చందంబును, తల్లక్ష్యంబును, సత్త్వరజస్తమోవేళా విధమ్ములును, తత్ఫలాఫలమ్ముల యొప్పును, తద్గణకాలలీలలును, పంచకవల ప్రకృతియు, ఉచ్చనీచస్థానగణ సంధానప్రాధాన్యమ్ములును, తదుదాహరణమ్ములగు మహాకవి ప్రయోగమ్ములును, అందు దోషస్వల్పతాగుణాధిక్య నియతియు, దేవభద్రశుభవాచక ప్రచుర రచనానిచయమ్ములును, తత్ప్రయోగమ్ముల జాతులును, సంహార [1]వచనరచనమ్ములును, కవితాకన్యక నొసంగు శుభలగ్నమునకు నిర్దేశమ్మును, తత్కన్యకా పరిగ్రహదక్షుండైన నాయకు విధంబును, కావ్య కన్యకా కన్యకోల్లేఖా కౌశలంబును, ప్రబంధాది నాందీ పద్యాది గణ గుణాదులు మొదలుగా సకల లక్షణంబులును ప్రత్యక్షంబుగా నుండఁ జూపుటయు, లక్షణ కవిత్వ లక్ష్యంబులును, కుకవి లోభి ప్రభు వ్యాపారంబులును, కుకవి నిరసనంబు లగు మహాకవుల లక్ష్యంబులును ఘటనాఘటనా లక్ష్యలక్షణ సంఘటనా చమత్కృతి పటిమయు సకలసుకవి రాజ లాక్షణికజన వినుతియుం గల్గు గణాధికారమను నిది ద్వితీయాశ్వాసము.



[1] వచనారచనమ్ము (వ్రాత ప్రతి).

శ్రీరస్తు

శ్రీ శారదాంబాయై నమః

# లక్షణశిరోమణి

## తృతీయాశ్వాసము

### వృత్తాధికారము

క. శ్రీరామా రమణ జయ
శ్రీరమ్య గుణాభిరామ! [1]శ్రీశ భక్తమునీం
ద్రారాధ్య! ప్రోవుమమ్ము, ద
యారస సుమదామ! వేంకటాచల ధామా! 1

క. విక్రమ నిర్వక్రగుణో
పక్రమ శుక్రప్రశిష్యబలధిక్కరణ
ప్రక్రమ నక్రాపహ చ
క్రాక్రమణక్రమణ! వేంకటాచల రమణా! 2

తే. తరుణివాయాన్వయాబ్ధి సుధాంశుఁడనఁగ
వెలయు మద్గురుఁ [1]జాతుర్య వివిధకవిత
శబ్దతర్కాది సకలశాస్త్ర ప్రవీణుఁ
గవిజన బ్రహ్మ నరసింహకవిఁ దలంతు. 3

వ. అని యిట్లు మదీయ గురువందనం బాపాదించి వెండియు నేతత్కృతిపతి సంవిధానంబు విధించెద నవధరింపుము. తత్క్రమం బెట్టిదనిన, 4

---

1. [1]శ్రీవేంకటలోకారాధ్య (తి).

3. [1]చాతుర్యస్ఫూర్తకవిత (తి).

క. వృత్తమ్ములు కవిరచనా
యత్తమ్ములు కావ్యకన్యకాలంకరణో
దాత్తమ్ములు చిగురెత్తఁగఁ
జిత్తమ్ములు వరుసఁదేటఁ జేసెదఁ గృష్ణా! 5

వ. అది యెయ్యది యంచేని — 6

సీ. సమవృత్తగతులు, స్వస్థాన, పరస్థాన
విషమ, వృత్తోపరివృత్తములును,
షట్ప్రత్యయమ్ముల సంజ్ఞలు, గురులఘు
పరిణామములు, పంచపాదభేద
ములు, కందములు, గీతములు, సీసములు, షట్ప
ద, త్రిపద, ద్విపదములు, చౌప
దమ్ములు, రగడ పద్ధతులు, నార్యాప్రకా
రంబులు, శతక తారావళిని

తే. దానము లుదాహరణ సప్తతాళ వృత్త
గద్య తర్వోజ పద యక్షగాన తురగ
శంఖ మండూక డింకిణీ చక్రవాళ
వృత్తభేదము లాదియై వెలయు మఱియు. 7

క. లలివిద్యా వాక్యమ్ముల
కళికగతుల్ కుఱుచబోద కందములు భువిఁ
గలవైతాళియ [1][విధ]
మ్ములు [ను] జతుర్భద్రకాది మాత్యములు హరీ! 8

సీ. వెండియు న్మంజరి ద్విపద గః శి
మంజరి కలియుగ మంజరియును,
గణపతి గతి బిరుదావళి(?) చతురుత్త
రము జయఘోషయు రంగఘోష

8. [1]కరం (అ. తి. బ్రాఁతప్రతి).

త్యాగఘోషయును జిహ్వావల జిహ్వాచ
లోష్ఠ్య విరోష్ఠ్యములు త్వకంద
మును బాదగోపనమును భద్రకాశివృ
త్తము పద్యగుణితంబు లటహిపటహి (?)

తే. వృత్తకమ్ములు చిత్రకవిత్వవృత్త
బంధరీతులు నల్లంట్ల పద్ధతియుఁ ద్రి
పాదసంఘట్ట నోత్కళికాది వివిధ
వృత్తరీతులు తేటగావింతుఁ గృష్ణ!

క. ◆◆పదుమూఁడు కోటులును నలు
వదిరెండగు లక్ష లవలఁ బదియేడ్వేలా
తుద [మఱియు] నేడు మాఱిరు
వదియాఱును వృత్తజాతి వర్గము *భర్గా! 10

[సమవృత్తాధికారము]

వ. అన్న[రు.] అది యెటువలెనంటేని క్రమంబుగా నిరువదాఱు ఛందమ్ములం గల సమవృత్తమ్ములు ౧౩ కోట్ల ౪౨ లక్షల ౧౭ వే(ల) ౭౨౬ సమవృత్తమ్ములు నాలుగేసి పాదమ్ములై యొక్క అక్షరమ్ము మొదలుకొని క్రమంబుగా నొక్క గణాక్షరమ్ములు సమానమై యిరువదాఱు ఛందంబులు వేఱువేఱ [1]విరచించియుండు నవియెయ్యవి యంటేని, ఉక్త, అత్యుక్త,

9. (?)అర్థము విచార్యము. యతిభంగము.

10. * ఈ పద్యము ల. శిరోమణికారుని పద్యముకాదు. దీని యాకరము తెలియరాదు. 'భర్గ' సంబుద్ధిగల ఛందోగ్రంథములు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహము, నైషధము తిమ్మకవి గరళపురీ చ్ఛందము. కూచిమంచికవి కృతిలో వృత్తప్రకరణము లేదు. గరళపురీచ్ఛందమున వృత్తప్రకరణము గలదు. ఈ పద్యమా ఛందములోనిది కానోపును.

11. [1]విరచించి (తి).

మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి, యను ఛందస్సు లిరువదాఱును, తదుపరి యిరువది యేడవ భూశ్ఛందస్సును, ౨౮ వ. భువశ్ఛందస్సును, ౨౯ వ. సువశ్ఛందస్సును, ౩౦ వ. మహాశ్ఛందస్సును, ౩౧ టో జనశ్ఛందస్సును, ౩౨ వ. తపశ్ఛందస్సును ౩౩ వ. సత్యచ్ఛందస్సును, ౩౪ వ. ఊర్ధ్వశ్ఛందస్సును, ౩౫ వ. స్వరశ్ఛందస్సును, ౩౬ వ. విరాట్ఛందస్సునుంగూడి ౩౬ ఛందస్సులవి ట్లుత్త[రోత్తర]ముగ నూత్న ప్రయత్న వృత్తరత్నంబులు వర్తిల్లుట కాకరంబైన ఛందస్సముద్రంబునందునొందు వృత్తరత్న ప్రవర్తకంబులు వివిధమ్ములు వేఱువేఱు ప్రశస్తమ్ములై విస్తరితంబులై ప్రవర్తిల్లునవి యెట్లంటేవి పర్యాయంబుగా తేటగావించెద నవధరింపుము. 11

క. ఎక్కువ తక్కువ [1]లేకణా
జక్కఁగ గణనియమ యతులు సమవృత్తములం
దొక్క సమంబుగ వచ్చుణా
జక్కటి యా యిరువదాఱు ఛందములుహరీ! 12

అందు గురులఘుసంజ్ఞ

తే. వసుధ గురులఘుసంజ్ఞ గవర్ణమునకుఁ
దెలియఁ దలకట్టు నొక గురు దీర్ఘమైన
వటులు గురువులు రెండు లవర్ణమటులె
గణము లీరీతి సంజ్ఞ లీకరణిఁ గృష్ణ! 13

[నూతన కల్పిత సమవృత్తములు]

వ. అందు క్రమంబున మొదలి ఉక్తాఛందస్సునందు ఒక్కొక్క యక్షరంబై యొక్క పాదంబుగా వృత్తమ్ములు పుట్టె నందు, 14

---

12. [1] 'లేకణా' — ద్రుతాంతముగఁ బ్రయుక్తము.

మొదలి శ్రీయను గురువృత్తము —

[1]శ్రీ, ఱం, బ్రో, వుఱా.

[గ.] 15

అందు రెండవదియగు హరి యను లఘువృత్తము —

ము, ర, హ, రి.

[ల.] 16

వ. అందు రెండవ అత్యుక్తా ఛందస్సునందు రెండేసి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగాఁ గలుగ వృత్తములు పుట్టెనందు, 17

మొదలి శ్రీపెంపను గురువృత్తము —

శ్రీపెం, పోపుఱా, [1]ప్రాపుఱా, గాపుఱా.

[గ, గ.] 18

అందు రెండవదియగు రమా యను వృత్తము —

రమా, యమా, నమో, నమో.

[ల, గ.] 19

వ. అందు మూఁడవ మధ్యాఛందస్సునందు మూఁడేసి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ఁ వృత్తములు పుట్టె నందు, 20

మొదలి శ్రీకారయుక్త యను గురువృత్తము —

శ్రీకాంతా, లోకైకా, శ్రీకీర్తుల్, మాకిమ్మా.

[మ.] 21

అందు మూఁడవదియగు భారతి యను వృత్తము —

భారతీ, సారథీ, వేశమే, కోరితిఁ.

[ర.] 22

---

15. [1]శ్రీ, ఘం, బ్రో, వుఱా. (తి)

18. [1]ప్రోపుఱా (తి).

వ. అందు నాలుగవ ప్రతిష్ఠాఛందస్సునందు నాలుగేసి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౧౬ వృత్తములు పుట్టె నందు, 23

నాలుగవదియగు [1] హేయగ మను వృత్తము —

జగతీశాహే, యగమయ్యేశా.
వగమింపుశా, దగఁగృష్ణా!

[న, గ.] 24

అయిదవదియగు సుకాంతి యను వృత్తము —

జకారముశా, గకారముశా
ప్రకాశమౌ, సుకాంతికిశా. [జ, గ.] 25

వ. అందు అయిదవ సుప్రతిష్ఠాఛందస్సునందు అయిదేసి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౩౨ వృత్తమ్ములు పుట్టె నందు, 26

౧౨ వదియగు కలహంస మను వృత్తము —

నలగమ్ములశా, విలసిల్లగాశా
విలుషశాభువిశా, గలహంసగుశా.

[న, వ.] 27

అందు పదహారవదియగు మలహరి యను వృత్తము —

వెలువలరశా, నలగములశా
విలుపవలెశా, మలహరికిశా.

[న, వ.] 28

వ. అందు ఆఱవదియగు గాయత్రీ ఛందస్సునందు ఆఱేసి యక్షరము లొక్కొక్క పాదమ్ముగా ౬౪ వృత్తములు పుట్టె నందు, 29

౧౬ వదియగు హయపద మను వృత్తము —

ప్రియగతిశోదశా, వయయుతమైనశా
హయపదమొప్పుశా, జయజయకృష్ణా!

[న, య.] 30

---

24. [1] సోమగ మను (తి).

అందు ౩౨ వదియగు ప్రసవంబను వృత్తము —

వసుధంగృతివిం, బొసఁగంబొసఁగ౯
వసలింపొసఁగు౯, బ్రసవంబునకు౯.

[స, స.] 31

వ. అందు ఏళవ ఉష్ణిక్ఛందస్సునందు ఏడేసి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౧౨౮ వృత్తమ్ములు పుట్టె నందు, ం2

౨౨ వదియగు కుసుమశర వృత్తము —

రసికవరులెన్న౯, బొసఁగుఁగృతులందు౯
నసగయుతమైన౯, గుసుమశరముర్వి౯.

[న, స, గ] 33

అందు ౪౦ దవదియగు సుధాధామ యను వృత్తము —

క్షితిని రంజిల్లను, తత్కృతులఁ బ్రఖ్యాతమై
నతగలింపొందునం, తతసుధాధామతు౯.

[న, త, గ.] 34

వ. అందు ఎనిమిదవ అనుష్టుప్ఛందస్సునందు నెనిమిదేసి యక్షరము
లొక్కొక్క పాదమ్ముగా ౨౫౬ వృత్తములు పుట్టె నందు, 35

౫౫ వదియగు షట్పద మను వృత్తము —

భాగగముల్ రచియింప౯, బాగగు షట్పదమయ్యె౯.

[భ, భ, గ, గ.] 36

అందు ౧౨౮ వదియగు కనకలతిక యను వృత్తము —

ఘనకృతుల నెనయ౯, బెనఁగొనఁగ వరుస౯,
ననలగము లిడిన౯, గనకలతి కమరు౯.

[న, న, న.] 37

వ. అందు తొమ్మిదవ బృహతీఛందస్సునందు తొమ్మిదేసి యక్షరమ్ము
లొక్కొక్క పాదమ్ముగా ౫౧౨ వృత్తములు పుట్టె నందు, 38

౧౮౪ గవదియగు రాజమరాళ వృత్తము —

నభరముల్ చెలువందు ది
క్ప్రభల రాజమరాళకున్.

[న, భ, ర.] 39

అందు ౨౨౦ దగు మంజుల వృత్తము —

నగణత్రయముం బొసఁగిం
పఁగ మంజుల వృత్తమగున్.

[న, న, న.] 40

అందు ౨౫౧ దియదు సుధారసలహారి యను వృత్తము —

వానవార్చిత ర, న సలున్
[¹అసుధార] సలహారికిన్.

[ర, న, స.] 41

తే. ప్రాసగణములు వింత పర్యంత మిఁకను
విశ్రమస్థాన గణప్రాస వితతి విలువ
వలయుఁ గావున నెయ్యెడ విలువఁదగిన
నయ్యెడన వాని విలిపెద నరపి కృష్ణ! 42

వ. అందు పదవ పంక్తిచ్ఛందస్సునందు ౧౦ పి యక్షరమ్ములు ఒక్కొక్క-
పాదమ్ముగా ౧౦౨౪ వృత్తములు పుట్టె నందు, 43

౧౬ వదియగు ప్రియవచన మను వృత్తము —

నయమగము ల్బా - ర్ణం బైయున్నన్
ప్రియవచనంబన్ - పేరిద్ధాత్రిన్.

[న, య, మ, గ. *6+] 44

---

41. వసుధ్రస (అ. శ. ప్రాఁతపతి).

44. *సంస్కృత లక్షణానుసారము ప్రాచీనులగు తెలుఁగు లాక్షణికు లెన్నవ యక్షరము యతిస్థానమందురో, దాని తరువాతిది ప్రథమాక్షర మైత్రికలదిగ నుండవలెనని యర్థము. దానిని సూచించుటకై యిందు యతిసంఖ్యపై '+' గుర్తుంచఁబడెను. ఉదా: 6 + = 6 అక్షరముల తరువాత ననఁగా 7-వ అక్షరము యతి.

అందు ౩౩ వదియగు భాసుర మను వృత్తము —

సంతత భా మ గ - సంయుక్తంబై
వింత[గ]భాసుర - వృత్తంబొప్పుఁ.
[భ, భ, మ, గ. 6+] 45

అందు ౪౫౯ దియగు గంధగజేంద్ర మను వృత్తము —

చేరును గంధగ - జేంద్రమునాఁగఁ
పార భ భా గ గ - సంయుతమైనఁ.
[భ, భ, భ, గ, గ. 6+] 46

వ. అందు ౧౧ వ త్రిష్టుప్ఛందస్సునందు ౧౧ పి యక్షరమ్ము లొక్కొక్క-
పాదమ్ముగా ౨౦౪౮ వృత్తమ్ములు పుట్టె నందు 47

౨౦౮ దవదియగు కంఠీరవ మను వృత్తము —

రయమున కంఠీ - రవ మిద్ధాత్రిఁ
న య స గ గల్ చె - న్నగు శ్రీకృష్ణా!
[న, య, స, గ, గ. 6+] 48

అందు ౧౫౩౨ ది యగు వనమాలి యను వృత్తము —

రహిఁజెందఁ న భ - ర ల్లగఁ దగుఁ
మహివెన్న న్వన - మాలి కందమై.
[స, భ, ర, లగ. 6+] 49

అందు ౯౨౫ దియగు గజరాజ మను వృత్తము —

రాజితమై గజ - రాజం బలరం
గాఁజను భా త ల - గ మ్మల్పెనఁగఁ.
[భ, భ, త, లగ. 6+] 50

వ. అందు ౧౨ వ జగతీ ఛందస్సునందు ౧౨ పి యక్షరమ్ము లొక్కొక్క-
పాదమ్ముగా ౪౦౯౬ వృత్తమ్ములు పుట్టె నందు 51

౬౭౦ వదియగు మృగమద మను వృత్తము —

వ గణము జా యగ - ణం బొనఁగూర్పఁ
మృగమద వృత్తము - మేదిని నొప్పుఁ.

[స, జ, జ, య. 7+] 52

అందు వెయిన్ని తొమ్మిదివందలడెబ్బదియేనవది యగు* శ్లోకపద మను
వృత్తము —

ప్రాభవమొప్పఁగ - భావజ జనకా
భాభనలిమ్ముగఁ - బద్మిని కలరుఁ.

[భ, భ, భ, వ. 6+] 53

వ. అందు ౧౩ వ అతిజగతి యను ఛందస్సునందు ౧౩ యక్షరమ్ము
లొక్కొక్క పాదమ్ముగా ౮౧౯౨ వృత్తమ్ములు పుట్టెను. అందు, 54

౫ వేల ౫౬౦ దియగు మత్తమయూర మను వృత్తము —

న వ భ భ గురువుం - దగ నందమునఁ
దనరఁగవిడ మ - త్తమయూర మగుఁ.

[న, వ, భ, భ, గ. 7+] 55

అందు ౪ వే ౪౭ వదియగు సలలిత మను వృత్తము —

జయయుతభాతిఁ - సలలితమనఁగాఁ
వయవవగ¹ర్ది - న్నగఁదగుమ హరి!

[వ, య, వ, న, గ. 8+] 56

అందు ౭ వే ౬౫ వదియగు బలభిన్మణి యను వృత్తము —

---

53. *[illegible] "శ్లోకపదము" అనియు, పద్యమున "పద్మిని" అనియు
కలదు.

56. ¹చిన్నఁగ - పార్థివేంద్రుకనుఁగ అ. తి. ప్రాఁతప్రతి.

గ్రక్కున భ న నా - గ యుతములిడినఁ
మక్కువ బలభి - న్మణి యనఁ దనరుఁ.
[భ, న, న, న, గ. 6+] 57

వ. అందు ౧౪ వ శక్వరీ ఛందస్సునందు ౧౪ పి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౧౬ వేల ౩౮౪ వృత్తములు పుట్టె నందు, 58

౪ వే ౯౬ వదియగు సురతరునికర మను వృత్తము —

గరిమను నననన(న) - గగయుతమైనఁ
విరతము సురతరు - నికరముకృష్ణా!
[న, న, న, న, గ, గ. 8+] 59

అందు ౭ వే ౧౬౬ వదియగు విద్రుమలత యను వృత్తము —

జగతివిడంగ న - జననగణములఁ
లగమున విద్రుమ - లతయనఁదనరుఁ.
[న, జ, న, న, లగ. 7+] 60

అందు ౭ వే ౧౭౭ దవది యగు కలరవ మను వృత్తము —

ననసాలగములఁ - జనువిరఁబరమిఁ
గనకాంబరధర - కలరవమునకుఁ.
[స, న, న, న, లగ. 7+] 61

వ. అందు ౧౫ వ అతిశక్వరీ ఛందస్సునందు ౧౫ పి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౩౨ వేల ౭౬౮ వత్తమ్ములు పుట్టెనందు, 62

౧౦ వే ౯౨౩ దియగు పారిజాత మను వృత్తము —

పారసాక్ష! వే[రజల్]ర - జల్ రసంయుతంబున
బ్బారిజాతమొందు [1]విశ్రు - తం బదెన్మిదింటిపై.
[ర, జ, ర, జ, ర. 8+] 63

---

63. [1]"విశ్రుత" మనఁగా విశ్రమము = యతి. యతికి పర్యాయపదముగా విశ్రుతపదమును పొత్తపికవి పేర్కొనెను. (అ. శి. 4-15.) విశ్రుత శబ్దమునకు "విశ్రమము" (యతి) అను నర్థము లేదు. "విశ్రుత" మను

అందు ౧౫ వే ౧౬౯౮౧ వదియగు [బాల]కౌముది యను వృత్తము —

పదయాంతరంగ వి - న్యజభా సహితమై
ముదమొందు బాలకౌ - ముది సప్తవిరతితో.

[స, జ, భ, భ, స. 7+] 64

అందు ౧౫ వేల ౩౨౭౬౮ వదియగు కిసలయ మను వృత్తము —

సతతము ననవన - నగణములిడ స
త్కృతులను వసుయతి - కిసలయమునకున్.

[న, న, న, న, న. 8+] 65

వ. అందు ౧౬ వ అష్టిచ్ఛందస్సునందు ౧౬ పి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౬౫ వే ౫౩౬ వృత్తములు పుట్టెనందు 66

౪౩ వే ౬౮౯ వదియగు చక్రవాక మను వృత్తము —

వనజనాభకృష్ణ ¹చక్ర - వాక నామధేయమై
చనునరజ్జరజ్జ[గల్]ర - సాఖ్య విశ్రమంబునన్.

[న, ర, జ, ర, జ, గ. 8+] 67

అందు ౪౩ వేయి ౬౫౪ వదియగు చంద్రరేఖ యను వృత్తము —

చంద్రరేఖ రసయతి ప్ర - సన్నహేమభిరామతా
సాంద్రమై రనజరజల్గ - సంయుతంబుగావిడన్.

[ర, న, జ, ర, జ, గ. 9+] 68

అందు ౫౪ వే ౬౧౪ వదియగు సింహవిక్రమ వృత్తము.

శ్రీరమాధవా బుధేశ - సింహ విక్రమా బెడంగై
[యా]రజల్రజల్గగల్ గ - నాఖ్యవిక్రమం [బెసంగున్].

[ర, జ, ర, జ, ర, గ. 8+] 69

---

యతికిఁ బర్యాయముగ లాక్షణికు లెవ్వరును జేర్కొనలేదు, ఇం దీ రూపము యతిస్థాన ప్రయుక్తమగుటచే నిర్ధారకము. అ. శ. 3-168 పద్యమందును నిది ప్రయుక్తము.

67. ¹చక్రవాళ (తి).

అందు ౩౨ వే ౨౨౪ వదియగు హరిహాయ మను వృత్తము —

ఎనపి నసనల్ భనగ - లిమ్ముగను గృతులఁ
దనరువది పద్మజయు - తంబు హరిహాయమై.
[న, స, న, భ, న, గ. 9+] 70

వ. అందు ౧౭ వ అత్యష్టిచ్ఛందస్సునందు ౧౭ వి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౧౩౧ వే ౭౨ వృత్తమ్ములు పుట్టెనందు, 71

౪౩ వే ౭౬౮ వదియగు మేఘరంజి యను వృత్తము —

నభసము ల్జరలగము ల్పె - నంగ విశ్రమంబున
బ్రభసమొందఁ బదిట మేఘ - రంజి భంజితాసురా!
[న, భ, స, జ, ర, లగ. 10+] 72

అందు ౪౪ వే ౨౭ వది యగు దేవదత్త మను వృత్తము —

దేవదత్త మనఁగఁబరఁగు - దిగ్విరామమొప్పఁ [1]గ
ల్క్యవతార, రననజరల - గమ్ము లిమ్ముగా విధఁ.
[ర, న, న, జ, ర, లగ. 10+] 73

అందు ౬౪ వే ౫౧౨ వదియగు చమరివాల మను వృత్తము —

నననజనలగములఁబె - నంగిదశవదిగాఁ
వనజభవనుత చమరి - వాలమనఁబరఁగుఁ.
[న, న, న, జ, న, లగ. 10+] 74

అందు ౬౪ వే ౯౯౨ వదియగు గగనమణి యను వృత్తము —

గగనమణి వృత్తమనఁ - గాఁదగు నసనభనల్
లగయుతముగా విధివి - తానమిదఁ బదమిలోఁ.
[న, స, న, భ, న, లగ. 9+] 75

---

73. [1]కల్కి + అవతార = కల్క్యవతార అనునది సాధురూపము. ఈ సాధురూపమును గ్రహించిన గణభంగ మగును.

వ. అందు ౧౮ వ ధృతిచ్ఛందస్సునందు ౧౮ ది యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౨ ల ౬౨ వే ౧౪౪ వృత్తములు పుట్టెనందు,

౧ ల ౨౫ వే ౯౧౨ వ పుష్పమాలిక యను వృత్తము —

♦♦పొసఁగుఁ బుష్పమాలికయనఁ - బొందు నందు నరనజల్
భసయుతమ్ముగాఁగ విడినఁ - బద్మనాభ! దశయతిన్.

[న, ర, న, జ, భ, స. 10+] 77

♦♦అందు ౧ లక్ష ౨౦ వే ౪౨౭ వదియగు వేణునాద మను వృత్తము —

వేణునాద మనెడుపేర - వృత్తమలరు సభలలో
జాణలెన్నవిధి విరామ - సంఖ్య రనజభనసలున్.

[ర, న, జ, భ, న, స. 9+] 78

అందు ౧ ల ౩౧ వే ౩౨ వదియగు కవివినుత మను వృత్తము —

భువికవులు దశవిరమ - మున నననననసల్
కవివినుత మనఁదనరు - ఘనకృతుల విరఁగాన్.

[న, న, న, న, న, స. 10+] 79

వ. అందు ౧౯ వ అతిధృతిచ్ఛందస్సునందు ౧౯ వి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౫ ల ౨౪ వే ౨౮౮ వృత్తమ్ములు పుట్టెనందు, 80

౨౦ ల ౯౬ వే ౯౯౧ వదియగు సింహానందన మను వృత్తము —

నందకధ[ర]! సింహనందన - మున భసజననగల్
పొంది విరతి తొమ్మిదింటఁ - బొసఁగునవిరి కవివరుల్.

[భ, స, జ, న, న, న, న, గ. 9+] 81

అందు ౨ ల ౬౨ వే ౧౫౫ వదియగు పాంచజన్య మను వృత్తము —

అంచతేజినెక్కి తిరుగు వ - తని మతి వియతిదగున్
పాంచజన్య వృత్తమునకుఁ - [1]బరఁగు రజననననగల్.

[ర, జ, న, న, న, న, గ. 9+] 82

82. [1]'పరంగు' - అనునది అ. ళి. వ్రాఁతప్రతి పాఠము. ఈ శబ్దము సాధు
బిందుక మనుట కీ లేఖన సంప్రదాయము ప్రమాణము.

అందు ౨ ల ౬౨ వే ౧౪౪ వదియగు మణినిచయ మను వృత్తము —

మణివిచయ మనఁదగు - మహి ననననననగల్
దనర దశవిరమణయు - తఘుగ విలిపిన హరీ!
[న, న, న, న, న, న, గ. 10+] 83

వ. అందు ౨౦ దియగు కృతిచ్ఛందస్సునందు ౨౦ పి యక్షరమ్ము లొక్కొక్క-
పాదమ్ముగా ౧౦ ల ౪౮ వే ౫౭౬ వృత్తములు పుట్టెనందు, 84

౫ ల ౩ వే ౭౬౯ దవదియగు పంచబాణ మను వృత్తము —

ద్విరదవరద! శరధిశయన! - వేదవేద్య! మునిమనో
భరిత! నననరనలగలఁ - బంచబాణ మినయతిఁగా.
[న, న, న, న, ర, న, లగ. 12+] 85

అందు ౫ ల ౨౨ వే ౨౪౮ వదియగు మురళి యను వృత్తము —

శౌరి! దనుజహరణ! భనన - సల్ ననలగములను గం
సారి! పదియునొకటి విరతి - నందమరయ మురళికిఁగా.
[భ, న, న, స, స, స, లగ. 11+] 86

అందు ౫ ల ౨౨ వే ౬౪౬ వదియ[గు] లలిత మను వృత్తము —

అమరవినుత శేషనగవి - హార ననభసననముల్
గ్రమతలగము రుద్రవిరతి - గల్గ లలిత మనఁదగుఁగా.
[న, న, భ, స, న, న, లగ. 11+] 87

అందు ౪ ల ౭౬ వే ౧౧౮ దియగు *రతివిలసిత మను వృత్తము —

రామనామ! భవవిరామ! - రనజననగలములఁగా వి
రామ మద్రిభవగణాఖ్య - రతివిలసితమ[గును]శౌరి.
[ర, న, జ, న, న, న, గల. 8+] 88

---

88. *రతివిలసితము లఘ్వంత వృత్తము. మఱి యే తెనుఁగు ఛందోగ్రంథమూ అందును లఘ్వంత వృత్తప్రసక్తి గోచరింపదు, ఇమఱఁగ (శా).

వ. అందు ౨౧ టగు ప్రకృతిచ్ఛందస్సునందు ౨౧ పి యక్షరము లొక్కొక్క-
పాదమ్ముగా ౨౦ ల ౯౭ వే ౧౫౨ వృత్తములు పుట్టె నందు, 89

౩ ల ౨౩ వే ౫౨౧ గు భూధర మను వృత్తము —

శ్రీలక్ష్మిప్రాణేశా - స్థితమమననభల్ - చెలువుమీఱగా యయమ్ముల్
పాలాక్షిస్త్రీ షట్ప - ప్తవిరమములతో - ధరమనగా వృత్తమయ్యెగా.
[మ, మ, న, న, భ, య, య. 8+, 7+] 90

అందు ౭ ల ౮౬ వే ౧౦౪ వదియగు రతిరాజ మను వృత్తము —

క్రమమున న్రతిరాజరాజము - ఘనకృతులనిడఁగా న్రమా
రమణ రుద్రవిరామమైన భ - రననరయుతమై తగుగా.
[న, భ, ర, న, వ, న, ర. 11+] 91

అందు ౧౦ ల ౪౮ వే ౫౬౮ వదియగు మదగజ మను వృత్తము —

నలిననాథ! సుకవివరులు - నభనననననయుతమై
మలయ రుద్రవిరమణమున - మదగజమనిరి నృహరీ!
[న, భ, వ, న, వ, న, స. 11+] 92

వ. అందు ౨౨ వ ఆకృతిచ్ఛందస్సునందు ౨౨ పి యక్షరమ్ము లొక్కొక్క-
పాదంబుగా ౪౧ ల ౯౪ వేల ౩౦౪ వృత్తములు పుట్టె నందు, 93

౯ ల ౭౮ వే ౬౭౧ దగు సుగంధి యను వృత్తము —

నందకకరాభజన - నమ్ములభజల్ సగగ - [జ]మ్ములు చెలంగగా
మందరధరా విరమ - ణమ్ములు గణాష్టగణ - నందగు సుగంధిగా.
[భ, జ, స, వ, భ, జ, స, గ. 8+, 8+] 94

అందు ౧౪ ల ౨౫ వే ౨౪౮ దియగు హల్లకమాలిక యను
వృత్తము —

దినకరకులజ! మౌనినుత - దేవ! విరామము రుద్రసంఖ్యయుగా
వనజసనసజగమ్ముల ఘ - నమ్ముగ హల్లకమాలికైతగుగా.
[వ, వ, జ, వ, వ, వ, జ, గ. 11+] 95

అందు ౪౧ ల ౯౪ వేల ౧౫౨ వదియగు కుసుమవిశిఖ మను వృత్తము —

నలినవయన! తరణి విరమ - ణము, ననననననగల్
వెలయువిధఁగఁగవులు గుసుమ - విశిఖమనిరి తగహరీ!

[న, న, న, న, న, న, న, గ. 12+] 96

వ. అందు ౨౩ వదియగు వికృతి ఛందస్సునందు ౨౩ వి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౮౩ ల ౮౮ వే ౬౦౮ వృత్తంబులు పుట్టె నందు, 97

౪౧ ల ౨౭ వే ౬౫౫ దవదియగు గజలీల యను వృత్తము —

శౌరి హరికృష్ణవి - ర్జర వంద్యభజభభన - జల్నలగయుక్తమై
[1]మీఱిగిరిధాతృవి - ర్మిత విక్రమము౯గజ - లీల యనఁబరఁగుఁ౯.

[భ, జ, భ, భ, న, జ, న, లగ. 7+, 9+] 98

అందు ౪౧ [ల] ౯౩ [వే] ౬౩౪ వదియగు కుముద వృత్తము —

తరుచరార్చితచరణ సారస - తరణి! విరమము నభనభల్
వరుసనానలగములచేఁ గవి - వరులు కుముదమనఁగహరీ!

[న, భ, న, భ, న, న, న, లగ. 12+] 99

అందు ౪౧ ల ౯౪ వే ౧౫౨ వదియగు విజయశంఖ మను వృత్తము —

విజయశంఖమనంగఁదగు విన - విరతి నలవడి జగతిలో
భజనసేయుఁగఁ గావ్యముల నభ - భనననలగ యుతముగా౯.

[న, భ, భ, న, న, న, న, లగ. 12+] 100

98. [1]ఇందు "గిరిధాతృ జుతి" యనఁగా 7+, 9+ : మీ - ర్మి - లీ. మొదటి యతిస్థానమున (మీ - ర్మి.) మకారమునకు, మకారమైత్రి సరియే. రెండవ యతిస్థానమున (ర్మి - లీ) ర - ల ల యతి. ఇది సంయుక్త జుతినియతికి భంగము. ఇందు 'ర - ల' ప్రాసయుఁ గావనగును.

వ. అందు ౨౪ వ సంకృతి ఛందస్సునందు ౨౪ వి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౧ కో ౬౭ ల ౭౭ వే ౨౧౬ వృత్తమ్ములు పుట్టె నందు. 101

౭౨ ల ౭౬ వే ౬౭౮ వదియగు జగద్ధిత మను వృత్తము —

[1] శ్రీవేంకటగిరి నిలయా - శ్రితపోషకవిధి విధా - తృనీమల వశ్లి
న్గావింపనమరు [తనము - న్నసముల్ ననజయముల - న్జ] గద్ధిత
మొప్పగా.

[త, న, న, న, న, న, జ, య. 9+, 9+] 102

అందు ౪౧ ల ౯౩ వే ౭౮౦ వదియగు ఆనంద మను వృత్తము —

జగదాధారా నిగమోదారా - సతయ
భవననయ - సహితములై నగా
దగు నానందం బొగినిద్ధాత్రిం - దళవసు
విరతులం - దనరుచుం గృష్ణా!

[స, త, య, భ, న, న, న, య. 10+, 8+] 103

అందు ౮౦ ల ౭౪ వే ౧౯౩ వదియగు కలకంఠ మను వృత్తము —

గరుడతురంగా - కలితశుభాంగా
కలకంఠంబనం - గా బుతుమతష
ద్పరితయతుల్లా - ర్పనయనయల్సల్ -
భభసల్ చెల్వగు - బంధురతహరీ!

[న, య, న, య, స, భ, భ, స. 6+, 6+, .+] 104

అందు ౨౫ వ అభికృతి ఛందస్సునందు ౨౫ వి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా [1] కోట్ల ౭౫ ల ౫౪ వే ౪౭౨ వృత్తములు పుట్టె నందు. 105

---

102. [1] తా కృత్తికతినిబట్టి 9+, 10+ అను యతిస్థాననియతి రమ్యతరము.

105. [1] ౩, ౩౫, ౫౪, ౪౩౦ (తి).

౪౧ ౦ ౭౯ వే ౯౦౪ వదియగు సురభి యను వృత్తము —

నవభసతనలుగా - నయగలిడగా
శ్రీ - నాయక! ముని ఋతు - వగయు[క్తం]బై
తవరు విరతులం - దముగభువిగా
జం - దమ్ముల సురభన( - దగు వృత్తంబై.
[న, న, భ, స, త, వ, న, య, గ. 7+, 6+, 7+] 106

అందు ౧ కో ౬౬ ౦ ౪౪ వే ౩౧౧ వదియగు విభవ మను వృత్తము —

*పన్నగ శయనా పన్న శరణ్యా! -
భసభతవసనవ్ - పర(గ(గ నగలగా
జెన్నగు విభవం బెన్న( గవీంద్రుల్ -
శివనగముల రం - జిలు వదులిడ(గాగా.
[భ, స, భ, త, వ, స, న, వ, గ. 11+, 7+] 107

అందు ౧ కో ౬౩ ౦ ౩౬ వే ౬౦౧ యగు జలరుహా మను వృత్తము —

పారావార విహారా కనకాం - బరధర హరి మన -
భభననననగల్
పారం బై యవతారాష్టయతుల్ - జలరుహమునకవి -
చదివిరి కృతులగా.
[మ, స, భ, భ, న, వ, న, వ, గ. 10+, 8+] 108

వ. అందు ౨౬ వ ఉత్కృతి ఛందస్సునందు ౨౬ పి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౬ కో ౭౧ ౦ ౮ వే ౮౬౪ వృత్తమ్ములు పుట్టె నందు 109

---

107. *విభవ వృత్తమునకు శివనగ యతి, అన(గా 11+, 7+ యతులు. ఇందు క్రొంచపదమునకు 6 మీ(ద ప్రాసయతి కన(బడుచున్నది.

౩ కో ౨౩ ల ౩౦ వే ౪౯౨౬ వదియగు సురభూరుహా మను వృత్తము —

♦♦వననిధిశయనా - వారిజనయనా -
వరముని షడ్గిరి - వళ్ల నమరుచుఁ
ననతనభసనల్ - [నల్గురు] యుతమై -
వనుసురభూరుహ - నామము వెలయుఁ.
[న, న, త, న, భ, స, న, న, లగ 7+, 6+, 7+] 110

♦♦అందు ౩ కో ౩౫ ల ౪౮ వే ౨౧౫ వదియగు దినమణి వృత్తము —

పంకజ లోచన - భావజ జనకా -
భాభస భనసన - భరిత లగములఁ
[1]సంకలితంబగు - *షడృతుమునిస -
త్పంజ్ఞల విరతులు - దగు దినమణికిఁ.
[భ, భ, భ, స, భ, న, న, న, లగ. 6+, 6+, 7+] 111

అందు ౩ కో ౬౫ ల ౫౪ వే ౪౩౨ ది యగు కవిజనముదిత మను వృత్తము —

నసన ననన నన లగలఁబె - నఁగ రవిమునిగ -
జన యతులను బెం
పునను నుమపుదనరి కృతులఁ - బొనఁగఁగవిజన -
ముదిత మనఁదగుఁ.
[న, న, న, న, న, న, న, న, లగ. 12+, 7+] 112

వ. ఇవి యిరువైయాఱు ఛందస్సుల నూతన కల్పిత సమవృత్తములు. 113
ఇఁక మొదలి యుక్తచ్ఛందస్సున రెండు వృత్తము లాదిగా విరువది
యాఱవ ఉత్కృతి చ్ఛందస్సు పర్యంతముగా నుద్భవిల్లిన,

---

111. [1]బహుయతి నియతి భంగము, *"షడృతు" — శబ్ద మందలి పూర్వాక్షరము గురువను భ్రాంతిచే భగణముగ బ్రయుక్తము.

సమవృత్తసంఖ్య

క. చతు ఋతు వసు గజనిధిశా
శతిగిరి మతసంజ్ఞవృత్త పరిమితముక్త
ద్వితయాదిగఁదగు షడ్విం
శతి సమపాదాఖ్య వృత్తసంఖ్యగుఁ గృష్ణా! 114

[26 ఛందముల సమవృత్తసంఖ్య = 67103864]

మఱియు ముక్తాదిగా నుత్కృతి చ్ఛందస్సు పర్యంతంబైన యిరువదాఱు ఛందమ్ములంగల,

సర్వసమవృత్తసంఖ్య

క. ధర [[1]ఋతు]యుగగిరి నగశశి
కర వేద కృశాను చంద్రగణనగా వృత్తా
కర షడ్వింశతి ఛందము
లరయఁగ సమవృత్తసంఖ్య నలవడుఁ గృష్ణా! 115

[సర్వసమవృత్తసంఖ్య = 134217726]

వ. ఇఁక పురాతనమైన భీమనగారు రచియించిన సమవృత్తాధికారమునందుఁ బ్రశస్తమైన వృత్తము లెవ్వియం టేని, 116

[భీమన ఛందమునందలి ప్రసిద్ధ సమవృత్తములు]

అందు ౧౧ వ త్రిష్టుప్ ఛందస్సునందు ౪౧౭ వదియగు ఇంద్రవజ్ర మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 42]
ఇత్తాజగా సంగతి - నింద్రవజ్రా
వృత్తంబగు [1]వృన్నుత - వృత్తరేఖా!

[త, త, జ, గ, గ. 7+] 117

---

115. [1]గజ (అ. శ. ప్రాఁతప్రతి.)

అందు ౩౫౮ వది యగు ఉపేంద్రవజ్ర మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 43]
స పద్మ పద్మా! జత - జల్గగంబుఁ
ఉపేంద్ర వజ్రాఖ్యము - నొప్పుఁజెప్పుఁ.

[జ, త, జ, గగ. 7+] 118

అందు ౩౫౮ వది యగు ఉపజాతి యను వృత్తము —

[కవిజనాశ్రయము - ప్రక్షిప్త పద్యము. 4]
ఈరెండు వృత్తమ్ములు - నిందుఁ గూర్పఁ
సరోజ నేత్రా! యుప - జాతి యయ్యెఁ.

[బేసి పాదములలో, త, త, జ, గగ. (ఇంద్రవజ్ర) 7+
సరిపాదములలో, జ, త, జ, గగ. (ఉపేంద్రవజ్ర) 7+] 119

అందు ౪౩౯ వదియగు [1]తోయద మను వృత్తము —

శ్రీయుత భత్రయ - సేవ్యగగంబుల్
తోయజలోచన! - [2]తోయదమయ్యెఁ.

[భ, భ, భ, గగ. 6+] 120

మఱియు ౧౨ వదియగు జగతీ ఛందస్సునందు ౨౭౪ వదియగు భుజంగప్రయాత మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 51]
జగద్గీత కీర్తీ! భు - జంగప్రయాతం
బగు న్నేచవా! యద్వ - య ద్వంద్వమైనఁ.

[య, య, య, య. 7+] 121

---

117. [1]సంగతి (అ. ఈ. ప్రాఁతప్రతి).

120. [1]తోటకమను వృత్తము (తి), [2]తోదకమయ్యెఁ (తి), తోటక మైత్రిఁ (కా).

అందు ౧౧౭౧ యగు స్రగ్విణీ వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 57]

వాగ్వధూ వల్లభా! - వార్ధి రేఫా వళుల్
స్రగ్విణీ వృత్త [1]వి - శ్రాంతమున్గా మహిన్.

[ర, ర, ర, ర. 6+] 122

అందు ౧౭౫౬ వదియగు తోటక మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 52]

తుదినాఁక సకార చ - తుష్కముగా
విదితమ్ముగఁ దోటక - వృత్తమగున్.

[న, స, న, స. 8+] 123

అందు ౧౪ వ శక్వరీ ఛందస్సునందు ౨౯౩౩ వదియగు వసంతతిలక మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 69]

సారమ్ముగాఁ దభజ - జంబు వసంత రాజా
కారా! వసంత తిల - కంబగు గాయుతంబై.

[త, భ, జ, జ, గగ. 7+] 124

అందు ౩ వే ౮౨౩ వదియగు వనమయూర మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 71]

నందితగుణా! భజస - నంబులు గగం బిం
పొంది చనఁగా వనమ - యూరమగు ధాత్రిన్.

[భ, జ, స, న, గగ. 8+] 125

అందు ౧౫ వదియగు అతిశక్వరీ ఛందస్సునందు ౪ వే ౬౭౨ వదియగు మాలిని యను వృత్తము —

122. [1]విశ్రాంతి యాతింటిపై (ము. ౧. ప్ర.)

[కవిజనాశ్రయము - ప్రక్షిప్త పద్యములు. 17]
ననమయయ యుతంబై - నాగ విశ్రాంతమై యి
ట్లనుపమగుణ! మాలి - న్యాహ్వయంబయ్యె ధాత్రిన్.
[న, న, మ, య, య. 8+] 126

అందు ౧౬ వదియగు అష్టిచ్ఛందస్సునందు అనంతనగారు ౨౧ వే ౮౪౬ వదియగు పంచచామర మను వృత్తము —

[ఛందోదర్పణము. 2-76]
జరేఫలన్ జరేఫలన్ జ - నంయుతమ్ములై తగన్
గురూపరిస్థితిం బొసంగి - గుంభనం బెలర్పఁగా
విరించి సంఖ్యనందమైన - విశ్రమంబులంఘ్రులన్
బ్రరూఢమైన పద్మనాభ - పంచచామరంబగున్.
[జ, ర, జ, ర, జ, గ. 8+] 127

అందు ౧౮ వదియగు ధృతిచ్ఛందస్సు [నందు] ౯౩ వే ౧౯ వదియగు మత్తకోకిల యను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 92]
శ్రావకాభరణాంక! విశ్రమ - జాతరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల - యంద్రు దీనిఁగవీశ్వరుల్.
[ర, స, జ, జ, భ, ర. 10+] 128

అందు ౧౯ దవ అతిధృతిచ్ఛందస్సునందు ౧ ల ౪౯ వే ౩౩౭ వదియగు శార్దూలవిక్రీడిత వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 95]
పారావారవిశారదా! యన యతిన్ - శార్దూల విక్రీడితా
కారంబై మసజమ్ములిమ్ముగ సతా - గప్రాప్తమై చెల్వగున్.
[మ, స, జ, స, త, త, గ. 12+] 129

అందు ౧ ల ౮౬ వే ౪౦ దియగు తరళ మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 97]
ప్రవరరుద్రవిరామ యుక్తిన - భమ్ములన్ రసజాగముల్
కవిజనాశ్రయ! పొందియందము - గా విడం దరళంబగున్.
[న, భ, ర, స, జ, జ, గ. 11+] 130

అందు ౨౦ వదియగు కృతిచ్ఛందస్సునందు ౨ ల ౯౮ వే ౬౭౬ వది యగు మత్తేభవిక్రీడిత మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 101]
స్మయదూరా! విలసత్త్రయోదశయతిన్ - మత్తేభవిక్రీడితా
హ్వయమయ్యెన్ సభరమ్ములన్నమయవ - వ్రాతమ్ములం గూడినన్.
[స, భ, ర, న, మ, య, వ. 13+] 131

అందు ౩ ల ౫౫ వే ౭౯౯ దియగు ఉత్పలమాలికా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 102]
భానుసమాన! విన్భరన - భారంగమ్ములఁగూడి విశ్రమ
స్థానమునందుఁ బద్మజయు - తమ్ముగ నుత్పలమాలయైవనున్.
[భ, ర, న, భ, భ, ర, వ. 9+] 132

అందు ౨౧ దియగు ప్రకృతిచ్ఛందస్సునందు ౩ ల ౨ వే ౯౯౩ వదియగు స్రగ్ధరా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 106]
శ్రీమన్మూర్తీ! మకారా - శ్రిత రభనయయా - సేవ్యమైసామమద్వి
శ్రామంబున్ సానుమద్వి - శ్రమమునమరఁగా - స్రగ్ధరావృత్తమయ్యెన్.
[మ, ర, భ, న, య, య, య. 7+, 7+] 133

అందు ౭ ల ౧౧ వే ౬౦౦ దియగు చంపకమాలికా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 107]

నజభజజజ్జరేఫలఁబె - నంగి [1]దిశాయతితోడఁ గూడినన్
ద్రిజగద [2]భీష్టదా! బుధవి - ధీ! వినుచంపకమాలయైచనున్.
[న, జ, భ, జ, జ, జ, ర. 10+] 134

౨౨ వదియగు ఆకృతిచ్ఛందస్సునందు ౬ ల ౫ వే ౯౦౦ దియగు
మహాస్రగ్ధరా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 112]
లసదుద్యత్కీర్తివల్లీ - లలితగుణగణా - లంకృతాంగా! [1]సతానాం
తసరాగమ్ముల్ మహాస్ర - గ్ధరకు [2]వసుమువి - స్థాన విశ్రాంతినొప్పున్.
[స, త, త, న, స, ర, ర, గ. ౯+, 7+] 1౦5

అందు ౧౨ ల ౯౨ వే ౫౫౯ వదియగు మానిని వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 114]
[1]కారకముల్క్రియ - గన్గొనవేడు భ - కారములొక్కగ - కారముతో
గారవమైచనఁ - గావలు [2]లన్నియుఁ - గల్గినమానిని - కామనిభా!
[భ, భ, భ, భ, భ, భ, భ, గ. 6+, 6+, 6+] 136

అందు ౨౩ వ వికృతి ఛ్ఛందస్సునందు ౩౫ ల ౯౫ వే ౧౨౦ దియగు
కవిరాజవిరాజితము —

క్రమమున నొక్క న - కారము నాఱుజ -
కారములున్ బరఁ - గంగ వకా
రమును నొడంబడి - రాఁ గవిరాజ వి -
రాజిత మన్నది - [1]రాజనిభా!
[న, జ, జ, జ, జ, జ, జ, వ. 7+, 6+, 6+] 137

134. [1]దశాయతి (అ. శి. వ్రాఁతప్రతి), [2]త్రిజగదభిస్తుతా (క. జ. అ.)
135. [1]సతానష్ఠ (క. జ. అ), [2]వసుమతి (అ. శి. వ్రాఁతప్రతి).
136. [1]కారకభావల్గియుగా మన్నాభభ, గణములు నొక్కగ కారముతో (అ. శి. వ్రాఁతప్రతి), [2]యతి వంద్రిట (క. జ. అ.)
137. [1]కామనిభా (క. జ. అ.) రాజునిభా (కు. అ. పా.)

అందు ౨౪ వ సంకృతి ఛందస్సునందు ౧౬౭ ల ౭౭ వే ౨౧౬ దియగు క్రౌంచపద వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 113]

పంచశరాభా! సంచితపుణ్యా! -
భమసభననయ - [1]పరివృతమైనన్
క్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెన్ -
[2]గ్రమదశవసుయతి - కవితలుపేయన్.

[భ, మ, స, భ, న, న, న, య. *10+, 8+] 138

అందు ౨౬ వ ఉత్కృతి ఛందస్సునందు ౬ కో ౭౧ ల ౦౮ వే ౮౬౪ దియగు మంగళమహాశ్రీ యను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 124]

శ్రీమహిత! [1]లోకనుత! - శిష్టజనసేవిత!
వి - శేషగుణ! మంగళమహా శ్రీ
నామమగు నబ్జజన - నమ్ములకదన్
భజన - సంబులు గగంబులు పెనంగన్.

[భ, జ, స, న, భ, జ, స, న, గగ. 8+, 8+, 8+] 139

[వృత్తరత్నాకరమునందలి ప్రసిద్ధ వృత్తములు]

వ. ఇరువదాఱు ఛందమ్ముల వివి భీమనగారు రచియించిన సమవృత్తములందు ప్రసిద్ధ వృత్తములు. మఱియును, 140 కేదార భట్టాచార్యుల వృత్తరత్నా

---

138. [1]పరిమితమైనన్ (క. జ. అ.), [2]గ్రమయతి దశవసు కలితము గాఁగన్ (క. జ. అ.), *లక్షణమునఁ జెప్పఁబడలేదుగాని లక్ష్యమునఁ గ్రౌంచపదమునకు అయిదక్షరములపైఁ బ్రాసయతి గానవచ్చును.

139. [1]లోకహిత (క. జ. అ.).

కరమందు ౧౧ వ త్రిష్టుప్ఛందస్సునందు ౨౮౯ దియగు శాలిని యను వృత్తము. [*3-7]

మ, త, త, గగ లు. యతి ౭ టను.

అందు ౪౪౩ దియగు స్వాగత మను వృత్తము. [3-11]

ర, న, భ, గగ లు.

అందు ౪౮౭ వదియగు [1]మౌక్తికమాలా వృత్తము. [3-17]

భ, త, న, గగ లు.

అందు ౬౮౦ వదియగు సుముఖి యను వృత్తము. [3-5]

న, జ, జ, లగ లు.

అందు ౯౯౯ యగు భ్రమరవిలసిత మను వృత్తము. [3-9]

మ, భ, న, లగ లు. 141

ఇంక నందు ౧౨ వ జగతీ ఛందస్సునందు ౨౪౧ వదియగు జలధరమాలా వృత్తము. [3-18]

మ, భ, స. మ లు. యతి ౯ టను.

**అందు ౩౬౫ వదియగు వైశ్వదేవి యను వృత్తము. [3-1.]

మ, య, య, య లు. యతి [1]౬ టను.

అందు ౩౮౧ దియగు *పుష్పవిచిత్ర యను వృత్తము.

న, య, న, య లు.

అందు ౩౮౧ దియగు *మణిమాలా వృత్తము. [3-13]

---

141. *వృత్తరత్నాకరమున 3-వ అధ్యాయమున 11-వ ఛందస్సునందు 7-వ వృత్తము. ఇట్టిందలి రెండవసంఖ్య నా యా ఛందస్సులక్రిందఁ జూచుకొనవలయును. [1]మౌక్తికమాల (కా) శ్రీ (తి).

142. [1]5 మీఁదనని వృత్తరత్నాకరము, "పంచాశ్వైః" = 5+, 7+. ఇందు రెండవది సంస్కృతసంప్రదాయ పాదాంతయతిసూచకము. *"పుష్పవిచిత్ర, మణిమాల" యను రెండు వృత్తములను జేర్కొటియు.

త, య, త, య లు. యతి ౭ టను.

అందు ౯౭౬ వదియగు కుసుమవిచిత్ర మను వృత్తము. [3-8]

న, య, న, య లు.

అందు ౧౩౮౧ యగు [1]ఇంద్రవంశ మను వృత్తము. [3-3]

త, త, జ, ర లు.

అందు ౧౩౮౨ దియగు వంశస్థ మను వృత్తము. [3-2]

జ, త, జ, ర లు.

అందు ౧౩౯౨ దియగు మాలతి యను వృత్తము. [3-21]

న, జ, జ, ర లు.

అందు ౧౩౯౭ దియగు లలిత మను వృత్తము. [3-1]

త, భ, జ, ర లు.

అందు ౧౪౦౦ దియగు ప్రియంవద యను వృత్తము. [8-14]

న, భ, జ, ర లు.

అందు ౧౭౭౨ దియగు ప్రమితాక్షరా వృత్తము. [3-15]

స, జ, స, స లు. 142

ఇఁక నందు పదుమూఁడవదియగు అతిజగతిచ్ఛందస్సునందు ౧౧౫౪ దియగు చంచరీకావళి యను వృత్తము. [3-1]

య, మ, ర, ర, గ లు.

అందు ౧౪౦౧ యగు ప్రహర్షిణి యను వృత్తము. [3-3]

మ, న, జ, ర, గ లు. యతి ౮ టను.

అందు ౨౭౯౦ దియగు *మత్తహాసిని యను వృత్తము.

జ, త, స, జ, గ లు.

---

143. * ఈ వృత్తము వృత్తరత్నాకరమున మృగ్యము.

అందు ౨౭౯౬ దియగు మంజుభాషిణి యను వృత్తము. [3-6]

స, జ, స, జ, గ లా. 143

ఇంక నందు ౧౪ గవ శక్వరీ ఛందస్సునందు [1]౩౦౯౭ వదియగు [2]ఆలోల యను వృత్తము. [3-6]

మ, స, మ, భ, గగ లా. యతి ౭ టను.

అందు ౮ వే ౧౨౮ వదియగు [3]ప్రహర్షణకలిత యను వృత్తము. [3-4]

న, న, భ, న, లగ లా. యతి ౭ టను. 144

ఇంక నందు ౧౫ అతిశక్వరీ ఛందస్సునందు ౪౬౮౯ దియగు చంద్రరేఖ యను వృత్తము. [3-5]

మ, ర, మ, య, య లా. యతి ౭ టను.

అందు ౧౧ వే ౧౮౪ దియగు ప్రభద్రక మను వృత్తము. [3-5. నాగరలిపి వృత్త - రత్న.]

న, జ, భ, జ, ర లా.

అందు ౧౬ వే ౩౮౪ దియగు మణిగణనికర మను వృత్తము. [3-3]

న, న, న, న, స లా. 145

ఇంక నందు ౧౬ వ అష్టిచ్ఛందస్సునందు ౧౧ వే ౧౮౪ దియగు [1]సతి వృత్తము. [3-2]

న, జ, భ, జ, ర, గ లా. 146

ఇంక నందు ౧౭ వ అత్యష్టిచ్ఛందస్సునందు ౩౭ వే ౮౭౩ దియగు మందాక్రాంత మను వృత్తము. [3-4]

మ, భ, న, త, త, గగ లా. యతి ౬ టను ౪ టను.

---

144. [1]౩౦౯౬ (తి), [2]'అలోలము' అని వృత్త - రత్న, [3]'ప్రహర్షణకలిత' యని నాగరలిపి వృత్త - రత్న. 'ప్రహర్షణతిలక' యని తెనుఁగులిపి వృత్త - రత్న.

146. [1]'వాణిని' అని వృత్త - రత్న.

అందు ౧౭ వే ౩౨౦ దియగు పృథ్వి యను వృత్తము. [3-2]

జ, స, జ, స, య, లగ లు. యతి ౯ టను.

అందు ౨౬ వే ౬౪౦ దియగు నర్కుటమను వృత్తము. [3-6]

న, జ, భ, జ, జ, లగ లు.

ఇంక నందు ౨౯ వే ౧౧౦ దియగు శిఖరిణి వృత్తము. [3-1]

య, మ, న, స, భ, లగ లు. యతి ౬ టను.

అందు ౬౪౯౦౩ దియగు వంశపత్రపతిత మను వృత్తము. [3-3. నాగరలిపి వృత్త - రత్న.]

భ, ర, న, భ, న, లగ లు. 147

ఇంక నందు ౧౮ వ ధృతిచ్ఛందస్సునందు ౩౨౦౩౩ వదియగు కుసుమితలతా వృత్తము. [3-1. నాగరలిపి వృత్త - రత్న.]

మ, త, న, య, య, య లు. యతి ౫ టను ౬ టను.

అందు ౩౪ వే ౯౪౪ దియగు నిశా యను వృత్తము. [3-2]

న, న, ర, ర, ర, ర లు. యతి ౧౦ టను. 148

ఇంక నందు ౧౯ దవ అతిధృతిచ్ఛందస్సునందు ౩౨౩౧౪ దియగు మేఘవిస్ఫూర్జిత మను వృత్తము. [3-1]

య, మ, న, స, ర, ర, గ లు. యతి ౬ టను, ౬ టను. 149

ఇంక నందు ౨౦ దియగు [1]కృతి యను ఛందస్సునందు ౪౬ ౦౬ వే ౦౩౩ దియగు (సు)వదన మను వృత్తము. [3-1. తెలుఁగులిపి వృత్త - రత్న. వ్యాఖ్య.]

మ, ర, భ, న, య, భ, లగ లు. యతి ౭ టను, ౭ టను. 150

---

150. [1]కృతియను ఛందస్సునందు ౪౬౩౦౩౩ దదియగు పదస మను వృత్తము — మ, ర, భ, న, య, భ, లగ లు (తి).

ఇక నందు ౨౧ వదియగు ప్రకృతి చ్ఛందస్సునందు ౧౦ ల ౪౮ వే ౫౭౬ దియగు *కనకలతా వృత్తము.

న, న, న, న, న, న, న లు. 151

ఇక నందు ౨౨ వ ఆకృతిచ్ఛందస్సునందు ౧౦ ల ౪౮ వే ౫౭౬ దియగు [1]ప్రభద్రక మను వృత్తము. [3 1]

భ, ర, న, ర, న, ర, న, గ లు. యతి ౧౦ టను. 152

ఇక నందు ౨౩ వికృతిచ్ఛందస్సునందు ౩౮ ల ౬౧ వే ౪౨౪ వదియగు *అశ్వవిలసిత మను వృత్తము. [3-1. నాగరలిపి వృత్త - రత్న.]

న, జ, భ, జ, భ, జ, భ, లగ లు. 153

ఇక నందు ౨౪ వదియగు సంకృతి చ్ఛందస్సునందు ౪౧ ల ౫౫ వే ౩౬౩ దియగు తన్వి యను వృత్తము. [3-2]

భ, త, న, స, భ, భ, న, య లు. యతి ౫ టను ౩ టను. 154

ఇక నందు ౨౬ వ ఉత్కృతిచ్ఛందస్సునందు ౨ కో ౩౮ ల ౫౪ వే ౭౪౭ దియగు భుజంగవిజృంభిత మను వృత్తము. [3-1]

మ, మ, త, న, న, న, ర, స, లగ లు. [1]యతి ౧౧ టను. 155

వ. ఇవి వృత్తరత్నాకరమున కేదారభట్టాచార్యులు చేసిన [1]ప్రసిద్ధ వృత్తములు. 156

---

151. *ఈ వృత్తము నేఁటి వృత్త - రత్న న మున్యము.

152. [1]'సుభద్రక' మని వృత్త - రత్న.

153. *ఇది వృత్త - రత్నన లేదు. అందిగణములతో 'అశ్వలలిత' మను వృత్తము కలదు.

155. [1]8+, 11+ అని వృత్త - రత్న.

156. ప్రయోగ (కా).

క. ఎక్కువ తక్కువ లేకఁ
జక్కఁగ గణనియమ యతులు సమవృత్తములం
దొక్కసమంబుగ వచ్చిఁ
జక్కటి యీ యిరువదాఱు ఛందముల హరీ! 157

వ. ఇది సమవృత్తాధికారము. [సనయతినియమపద్ధతి]

ఈ సమవృత్తములకు యతులు నిలుచుటకు లక్షణము.
అనంతనగారు —

క. *వరగణ వర్ణము దీర్ఘ
స్వరమగుచును గణయుగంబు సనయతుల సుధా
కరకరగుణ గతి శరరుచి
గిరిగజ రంధ్రాది సంజ్ఞ కేశవనంతా! 158

వ. అని యీ పద్యార్థము — గణ నిర్ణయాక్షరము దీర్ఘస్వరాలై రెండు గణములని తెలియవలె ననుట. [1]సమయతులు సుధాకర ౧ కర ౨ గుణ ౩ గతి ౪ శర ౫ రుచి ౬ గిరి ౭ గజ ౮ రంధ్ర ౯, యీ సంజ్ఞప్రకారము మొదటి ఉక్త ఛందస్సునుంచి తొమ్మిదో బృహతీ ఛందస్సుదనుక నీ వ్రాసిన లెక్కప్రకారము క్రమముగా యతులు చెప్పవలెననుట. మొదటి ఛందస్సు వృత్తానకి మొదటి యక్షరమే యతి. రెండో ఛందస్సు వృత్తమునకు రెండో అక్షరమే యతి. ఈ ప్రకారము ఎన్నో ఛందస్సయితే అన్నో అక్షరమే తొమ్మిదో ఛందస్సు పర్యంతము యతులని తెలియవలెను. ఈ లెక్కలన్ని కూడితే యెన్ని అవుచున్నవో అన్ని యతులని యతి నిర్ణయము తెలియవలె ననుట. ఉక్తాది బృహతీ ఛందస్సు దనుక తొమ్మిది ఛందస్సులకు యతి నియమప్రకారము లక్షణకారకులు చెప్పలేదు.

యతులు నిలుపుటకు సనయతులు అన్నాడు గనుక సా ౭ నా ౧౦ అనే సంకేతము.

---

158. * ఈ పద్యము నేఁటి ముద్రితచ్ఛందోదర్పణమునఁ గానరాదు.

159. [1] సనయతులు (తి).

ఇఁక ౧౦ పంక్తి ఛ్ఛందస్సునుంచి యతులు విలుప్తకు నిర్ణయం ౧౦ న్ని అనే సంకేతము. ఆ పదో పంక్తిఛందస్సునుంచి యెంచఁగా ఏడోది అయిన ౧౬ అష్టిచ్ఛందస్సుదనుక ౭ టను ౮ టను ౯ టను పదింట ౧౧ టను ౧౨ టను ౧౩ డింటను యతిరాఁ జెప్పవచ్చుననుట.

ఇఁక నా అనేది అత్యష్టి అనేది ౧౭ వ ఛందసారభ్య. తక్కిన ఉత్కృతి అనే ౨౬ వ సా అనే ఛఁదస్సు పర్యంతము ౧౦ ఛందస్సులకు ఈ క్రిందటి సా అనే సంకేతమునకైన మఱియు ౧౪ ట ౧౫ ట ౧౬ ట ౧౭ ట ౧౮ ట ౧౯ ట ౨౧ టను మఱి యేఁట లెక్కలు హెచ్చించి యతులఁ జెప్పవచ్చును. ఇరువదాఱు ఛందస్సుల మీఁదటి ౬ ఛందస్సులకున్ను ఈ సంఖ్యప్రకారము యతుల నిర్ణయము.

ఇఁక ద్వంద్వయతులు ప్రస్తున్నవి గనుక మొదటి ౨ ఛందస్సుల సంజ్ఞ రావచ్చుననుట. తొమ్మిదో బృహత్ ఛందస్సునుంచి సనా తక్కిన ౧౭ ఛందస్సులలో సనా ౧౦౭ వృత్తములకు ఈ యతి నియమ మనుట. ఈ యతి నియమం చేసిన ౧౦౭ వృత్తములకు వివరము, 10 దో పంక్తి ఛందస్సునందు మయూరసారణి యను వృత్తము — త్రిష్టుప్ఛందస్సునఁ గల శాలిని, వాతోర్మి, ఇంద్రవజ్రము, ఉపేంద్రవజ్రము, ఉపజాతి, తోదక, స్వాగత, రథోద్ధత, చంద్రికా, కాంతా, మందారదామ అనే వృత్తములు ౧౧. జగతీ ఛందస్సున విశ్వదేవి, జలధరమాలా, భుజంగ ప్రయాతము, దోదక, చంద్రవర్త్మ, హయరచితప్రభా, ఇంద్రవంశ, పుట, కుసుమవిచిత్ర, ప్రియంవద, కలహంస, ప్రమితాక్షర, జలోద్ధతము లనియెడి వృత్తములు ౧౩. అతి జగతీఛందస్సునందు ప్రభాత, ప్రహర్షిణి మత్తమయూర, మంజుభాషిణి, రుచిర, జలద, ప్రీతి, క్షమా అనెడి వృత్తములు ౮; శక్వరీ ఛందస్సున అసంబాధా, వసంతతిలక, సింహోద్ధత, మధుమాధవి, ఉద్ధర్షిణి, భూమత, వనమయూర, సుందరి, అపరాజిత, ప్రహరణకలిత, పుష్పదామము లనియెడి వృత్తములు ౧౧; అతిశక్వరీ ఛందస్సున మాలిని, సుకేసరి, మణిభూషణ, మనోజ్ఞ, మణిగణనికర, ప్రభద్రకము లనియెడి వృత్తములు ౬; అష్టిచ్ఛందస్సున చంద్రశ్రీ, మేదిని, ప్రియకాంత, పద్మ, పంచచామర, మదనదర్పణ, అశ్వగతి అనెడి

వృత్తములు ౭; అత్యష్టిచ్ఛందస్సున మందాక్రాంత, శిఖరిణి, పృథ్వి, ఫలసదన, త్వరితపదగతి, హరిణి, సుగంధి, నర్కుటం, వంశపత్ర, పతిత, పలాశదళ, సరసిరుహము లనియెడి వృత్తములు ౧౨; ధృతిచ్ఛందస్సున కుసుమితలతావేల్లితము, మత్తకోకిల మను రెండు వృత్తములు; అతిధృతిచ్ఛందస్సున [1]మేఘవిస్ఫూ[ర్జిత], శార్దూలవిక్రీడిత, భూతిలక, తరళ, చంద్రకళ లనెడి వృత్తములు ౫; కృతిచ్ఛందస్సున మత్తేభవిక్రీడిత, ఉత్పలమాలిక, అంబురుహ, ఖచరప్లుత, [సువదన], భుజగవృత్తము లనెడు వృత్తములు ౬ ను; ప్రకృతిచ్ఛందస్సున స్రగ్ధర, లాటీవిట, చంపకమాలిక, వనమంజరి, మణిమాలిక, భ్రమరకూజిత, కరిబృంహితము లనెడి వృత్తములు ౭; ఆకృతిచ్ఛందస్సున మహాస్రగ్ధర, అష్టమూర్తి, మానిని, చంద్రిక, మృగనాభి, తురగ, విచికిలస్తబకము లనెడి వృత్తములు ౭;

♦♦వికృతిచ్ఛందస్సున కవిరాజవిరాజిత, పద్మనాభ, అశ్వలలితము లనెడి వృత్తములు [౩];

సంకృతిచ్ఛందస్సున క్రౌంచపద, సరసిజవృత్తము లనెడి వృత్తములు ౨; అభికృతిచ్ఛందస్సున బంధుర, భాస్కరవిలసితము లనెడి వృత్తములు ౨; ఉత్కృతిచ్ఛందస్సున భుజంగవిజృంభిత, మంగళమహాశ్రీ యను వృత్తములు ౨; అందు ౧౦ దో పంక్తి ఛందస్సు మొదలుగా ఇరువదాఱవది యగు ఉత్కృతిచ్ఛందస్సు పర్యంతము ఛందస్సులు ౧౫౦ ట వృత్తములు ౧౦౭ న్ను, సనయతి నియమప్రకారము యతులు గలుగు ననుట. మఱియు మంగల కవికల్పిత ప్రక్షిప్తవృత్తములు ఈ సనయతులనే వృత్తములు రచియింపవలెననుట. మఱియు గణసమక నిబద్ధములైన వృత్తములకున్ను మాత్రాసమక నిబద్ధములైన కంద, గీత, సీస, రగడ, చౌపదాదులు మొదలయిన జాతులకున్ను ఈ సనయతి నియమప్రకారమే కృతుల యతులు రచియింప వలయుఁగావున మూలమర్మభేదంబులు తెలిపి, యతులు నిలుప వలయును. 159

159. [1]మేఘవిస్ఫూర్తి (అ. శి. వ్రాఁత ప్రతి).

160. * ఈ పద్యము నేఁటి ముద్రిత ఛందోదర్పణమునఁ గానరాదు.

అనంతన్నగారు —

క. *యతికందసీసవృత్త
ప్రతతికి నన సంజ్ఞ మొదలిబ్రహ్మాచ్ఛంద
స్థితి శశికర [1][పు]ర [బ]ల శర
ఋతుగిరి కరి రత్నశోభ నేర్పడుఁ గృష్ణా! 160

ఈ ననయతులకే భీమనగారు,
[కవిజనాశ్రయము - సంజ్ఞ. 75]

క. హిమకరకరవైశ్వానర
సముద్రబాణర్తుముని భుజంగమనందా
ద్యమిత గణితోక్తి సంజ్ఞా
క్రమ మెఱుఁగఁగవలయు నెన్నఁగాఁ దగునెడలన్. 161

వ. అన్నారు. ఇది ననయతి నియమపద్ధతి. ఇఁక నందు, 162

## [ప్రాసభేద వృత్తప్రకారము]

### మలహరి వృత్తము

వ. ధృతిచ్ఛందస్సున నాలుగు పాదములకు ప్రాసము ప్రత్యేకము వచ్చిన మ, జ, భ, ర, భ, ర. గణములును, యతి పదింటను నిలుచును. ఇది మలహరి వృత్తలక్షణము. ఇఁక, 163

---

160. [1]ఖర జల (అ. కే. వ్రాఁతప్రతి). ఈ పాఠము అర్థవంతము కాదు, ఇందు, '3, 4' అను సంఖ్యల యర్థముండదలయును. సవరణలోని 'పుర, బల' మూలకు త్రిపురములు, చతురంగబలము అని యర్థము. 'ఖర జల' అను పాఠమును సహితము గ్రహింపవచ్చును. ఖర = అగ్ని - త్రేతాగ్నులు [ఖరారుద్రాగ్నిగర్దభాః - నానార్థరత్నమాల] జల - జ్యోతిశ్శాస్త్రమున లగ్నమునకు చతుర్థస్థానమని యర్థము కలదు. (సూర్యరాయాంధ్రనిఘంటువు.)

## తురంగ వృత్తలక్షణము

గీ. దళమునకుఁ [1]బంచవర్ణము(ల్భ)లల యుక్తి
పరఁగునట్టి దళంబులు పదియు నాలు
గూర్చి తుద మూఁడు లఘువు[2](ల) గుచ్ఛమునుప
ఏకప్రాసంబునఁ దురంగ వృత్తమంద్రు. 13

[పంచవర్ణములగు లలల గణమొక దళము. అట్టి దళములు పదునాలు వ్రాసి, తుద మూఁడు లఘువులు గుచ్ఛముగాఁ గూర్చి యేకప్రాసముగా వ్రాయవలెనని పై లక్షణము దెల్పుచున్నది. ఇందు లక్ష్యము గానరాదు. లోపించెనేమో! ఈ లక్షణ మస్పష్టము.

గణపవరపు వేంకటకవిప్రణీత ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసమున[3] తురంగవృత్తమొకటి కలదు.

(808 వ పద్యములోని పీసగర్భితమైన తురంగవృత్తము - పుట. 256) అది యిట్లున్నది:

సారస సమనేత్రయుగళ నారదరుచికాంతి సరఘనపవిత
ధీర విశద పీనతురగ భైరవ భవచైత్ర భరకుభకర
హారవిసరచారణహరి సారసహితచంద్ర శరజజయనుత
శారదవరపూజితపద గౌరవకటిఖడ్గ గరళవశ.

పై లక్షణమునకు నీలక్ష్యమున కించుక భేదమున్నది. ఈ లక్ష్యమునుబట్టి లక్షణ మిట్లుండవలెను: పాదమునకు లలల గణములు నాలుగు వరుసగా నిలిపి, తుద మూఁడు లఘువులు (నగణము) గూర్పవలెను. ఇట్లు నాలుగు పాదములు వ్రాసి, ప్రతిపాదమున రెండు సగములలో ప్రాస ఘటింప వలెను. దీనికి యతి నియతి లేదు.]

ఇది ప్రాసభేద వృత్తప్రకారము.

---

164. [1]పంచవర్ణము లలలయుక్తి (తి) వర్ణము లలలయుక్తి (తా), [2]లఘువులు (తా), [3]ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురణము - 1977.

క. ఎక్కువ తక్కువ లేక
జక్కఁగ గణనియమగతులు సమవృత్తములం
దొక్క సమంబుగ వచ్చు
నక్కటియా యిరువదాఱు ఛందములందున్. 165

వ. ఇది సమవృత్తాధికారము. ఇఁక నందు, 166

## విషమ వృత్త లక్షణము

క. సమవృత్తము లేతద్పా
దములందలి యతులు ప్రాయఁదప్పక క(వు)లా
క్రమమునఁ బెనఁచిన యవియ వి
షమవృత్తములయ్యెఁ గృతుల జగతిని గృష్ణా! 167

వ. అట్టి విషమ వృత్తముల లక్షణంబు లెటువలె నంటేని — అసమ సమ విశేష విషమ వృత్తమ్ములు నొక్కటి మొదలుగా లెక్కింప త్రిదశసంఖ్య లెక్కనెక్క స్థాన సంజ్ఞలకెక్కుడై, కొలందికి మిక్కుటంబులై పరిమిత రహితంబులై వివిధ విధంబుల వర్తిల్లు; విషమ వృత్తమ్ముల మొత్తమ్ములు లెక్కింప నప్పరమేష్ఠికి నశక్యంబైయుండునది; యట్లుండె వెండియున్ దద్విషమ వృత్తమ్ములయందు ప్రశస్తమ్ములై విస్తరిల్లు స్వస్థాన పరస్థాన విషమ వృత్తమ్ములన రెండు విధమ్ములై పరంగునవి యెయ్యవి యంటేని, స్వస్థాన విషమ వృత్తమ్మును పరస్థాన విషమ వృత్తమ్మును నాఁదనరు. అందు నొక్క స్వస్థానమ్మున వృత్తమ్ములు చతుర్విధములయ్యె. అవి యెయ్యవి యంటేని స్వస్థానైకపాద విషమ వృత్తంబును, స్వస్థానార్ధ సమ విషమ వృత్తంబును, స్వస్థానత్రిపాద విషమ వృత్తంబును, స్వస్థాన సర్వచతుష్పాద వృత్త విషమంబనాఁ దనరు. అందు ఏకపాద విషమ వృత్తంబన్నది ఉక్తాది షడ్వింశతి ఛందస్సులలో నొక్క ఛందస్సునం దొక్క వృత్తంబున ప్రథమ తృతీయ చతుష్పాదములును, ఆ చెప్పిన ఛందస్సునందే మఱియు నొక వృత్తంబున రెంతవ పాదంబును గల్గఁజెప్పిన నది స్వస్థాన ఏకపాద విషమ వృత్తంబనం బరఁగును.

మఱియు నందు స్వస్థానార్ధ సమ విషమ వృత్తంబన్నది ఉక్తాది షడ్వింశతి చ్ఛందస్సులలో నొక్క ఛందస్సునందు ♦♦ప్రథమ తృతీయ పాదంబులున్ను ఆ చెప్పిన ఛందస్సునందె మఱియు నొక్కొక్క వృత్తంబున ద్వితీయ చతుష్పాదంబు గలుగంజెప్పిన స్వస్థానార్ధ సమ విషమ వృత్తంబనం బరఁగు.

మఱియు నందు స్వస్థాన త్రిపాద విషమ వృత్తంబన్నది ఉక్తాది షడ్వింశతి చ్ఛందస్సులలో నొక్క ఛందస్సునందు ఒక్క వృత్తంబున ప్రథమ ద్వితీయ తృతీయ పాదంబులను ఆ చెప్పిన ఛందస్సునందె మఱియు నొక వృత్తంబున నాలుగవ పాదంబును గలుగంజెప్పిన నది స్వస్థాన త్రిపాద విషమ వృత్తంబనం బరంగు.♦♦

మఱియు నందు వేర్వేఱ నాలుగు వృత్తముల నాలుగు పాదమ్ములు గలుగఁజెప్పిన నది స్వస్థాన సర్వ చతుష్పాద విషమ వృత్తంబనఁ బరంగు. అట్టి తల్లక్షణంబు లక్ష్యంబునుం గ్రమంబుగా తేటఁజేసెద నవధరింపుము. 163

అందు తొమ్మిదవ బృహతీ ఛందస్సునందు ౧౭౮ [వ] వృత్తంబున ప్రథమ తృతీయ చతుష్పాదములున్ను, ఆ చెప్పిన బృహతీ ఛందస్సునందే ౨౫౧ [వ] వృత్తంబున రెండవ పాదంబునుం గలుగు చిత్రమను స్వస్థాన ఏకపాద విషమ వృత్తము —

చిత్రమొప్ప రనరల్ హరీ, ధాత్రియందు రనసలిడఁగా
మిత్రవంశ రఘురామయే, కత్రిపాద విషమంబగుఁగా.

[పా. 1, 3, 4. ర, న, ర.
పా. 2. ర, న, స.] 169

అందు స్వస్థానార్ధ విషమ వృత్తంబన్నది ౧౭ వ అతివృతిచ్ఛందస్సునందు ౧ ౮ ౭౦ వే ౨౫౦ వృత్తంబున ప్రథమ తృతీయ పాదంబులున్ను ఆ చెప్పిన అతిధృతి చ్ఛందస్సునందే ౧ ౭ ౭౮ వే ४౩ వ వృత్తంబున ద్వితీయ చతుష్పాదంబులం గలుగు

బిరుదాంక మను స్వస్థానార్ధ విషమ వృత్తము

సారసద్గుణ దిగ్వడిఁ రస - జసజజల్ గురువొందినఁ
గారవమున భ నర్సలఁ జజ - గంబు రుద్ర విరామముఁ
సారసాక్షసురాధి వానవ - సకలలోక విహార హో
రారి మదగజకేసరీ బిరు - దాంక వృత్తమనందగుఁ.

[పా. 1, 3. ర, స, జ, స, జ, జ, గ. 10+
పా. 2, 4. భ, స, ర, స, జ, జ, గ. 11+] 170

అందు స్వస్థాన త్రిపాద విషమ వృత్తంబన్నది ౧౦ దౌ పంక్తి ఛందస్సు నందు ౧౬ వ వృత్తంబున ప్రథమ ద్వితీయ తృతీయ పాదంబులున్ను ఆ చెప్పిన పంక్తిఛందస్సునందే ౧౫౦ వృత్తంబున నాల్గవ పాదంబునుం గలుగు,

మదేభక్రీడ యను స్వస్థాన త్రిపాద విషమ వృత్తము

జయహరి మూఁటి - న్వాంగత్యంబై
నయ మగము న్వం - ధా వింపఁ న
క్కృియను మదేభ - క్రీడాఖ్యం బౌ
రయమొప్పఁ నభ - రల్గమొందఁ.

[పా. 1, 2, 3. న, య, మ, గ. 6+
పా. 4. న, భ, ర, గ. 6+] 171

మఱియు నా త్రిపాద విషమ వృత్తమె ౧౬ వ అష్టిచ్ఛందస్సునందె ౨౧ వే ౨౫౩ వ వృత్తంబున ప్రథమ ద్వితీయ తృతీయ పాదంబులున్ను ఆ చెప్పిన అష్టిచ్ఛందస్సునందే ౩౧ వే ౪౦౩ వ వృత్తమున నాలుగవ పాదంబునుం గలుగు.

చకోర మను స్వస్థాన త్రిపాద విషమ వృత్తము

శ్రీగౌరివంద్య! రనజరల్ జ - గంబులొందు వైరి సం
హార! విశ్రమము పితామ - హాఖ్యతోఁ దగుఁ [ధరఁ]

172. శ్రవందు ర - ల ప్రాసము.

వేఱు వేఱ విధఁ బకోర - వృత్తమంద్రు మూఁటిపై
వే రజల్ రజల్ నగల్గ - వీంద్రు లష్టవిరతిలోఁ.

[పా. 1, 2, 3. ర, న, జ, ర, జ, గ. 9+
పా. 4. ర, జ, ర, జ, వ, గ. 8+] 172

అందు స్వస్థాన సర్వచతుష్పాద విషమ వృత్తంబన్నది ౧౬ వ అష్టి
చ్ఛందస్సునందు ౨౨ వే ౪౪౩ వ వృత్తంబున మొదలి చరణంబును
ఆ చెప్పిన అష్టిచ్ఛందస్సునందే ౨౪ వే ౨౩౫ వ వృత్తంబున రెండవ
చరణంబును ఆ చెప్పిన యష్టిచ్ఛందస్సునందే ౨౧ వే ౧౦౩ వ వృత్తం
బున నాలుగవ పాదంబునుం గలుగు ౨

తురంగి యను స్వస్థాన సర్వచతుష్పాద విషమ వృత్తము

రామనాగ విక్రమంబు - రజభసల్ జగంబులఁ
ప్రేమదంతి విశ్రుతంబు - రేఫ జరనజగ్గురుల్
రామకృష్ణ విధి [1]విరామ - రన్నజల్ రజల్గ వి
శ్రామ మబ్జజాఖ్య రజన - రల్ జగల్ దురంగికిఁ.

[పా. 1. ర, స, భ, స, జ, గ. 8+
పా. 2. ర, జ. ర, న, జ, గ. 8+
పా. 3. ర, న, జ, ర, జ, గ. 9+
పా. 4. ర, జ, న, ర, జ, గ. 9+] 173

అందు అనుష్టుప్ఛందస్సున సర్వచతుష్పాద విషమ వృత్తంబగు,

## శ్లోక లక్షణము

తే. శ్లోకలక్షణ మనిరి ప్రస్తుతము కవుల
[1]కరయఁ దల్లక్షణంబు లేర్పఱుతు వరుస

173. [1]'విరామము' అనుటకు 'విరామ' అను రూపము ప్రయుక్తము.
దీనిని చరిత్రాది గణమున సంగ్రహింపనగును.

174. [1]కంర (రా) ఇందు 'ర - అ' ప్రాసము.

నెనయ నిన్నూట యేఁబదాఱనఁగఁ గృతులఁ
దనరనుష్టుపు ఛందవృత్తములు కృష్ణ! 174

తే. పదచతుష్టయ మందలి తుదల గురువు
వరుస లఘువగు నైదవ వర్ణమెన్న
తత్ప్రథమ తృతీయాంఘ్రి సప్తమము గురువు
తద్ద్వికము చతుర్థము లఘుల్దనరుఁ గృష్ణ! 175

వ. వెండియు, 176

సీ. శ్లోకలక్షణ మనుష్టుపు ఛందమున సర్వ
వృత్తంబు లిన్నూట యేఁబదాఱు
వెలయునీ స్వస్థాన విషమ వృత్తంబులే
శ్లోక పాదంబు సుశ్లోకమయ్యె
తల్లక్షణంబు పాదాంతమ్ములను గురు
వైదవ వర్ణంబులవి లఘువులు
ప్రథమ తృతీయ చరణము నేఁటవి
దితమౌ గురు [వుమతి] ద్వికచతుర్థ

తే. పదయుగంబున లఘువు సప్తమమునందుఁ
దనరు విట్లు [1](సు)బోధాభిదాన కాళి
దాసకృత లక్ష్యలక్షణోదాహరణముల
నమరసింహాది సకల కావ్యములఁ గృష్ణ! 177

తే. ధరసమ విషమ వివిధ వృత్తములఁ గవిత
లమరఁ గృతులఁ దత్తల్లక్షణములఁ జేయ
నదియె బుధులు వృత్తశ్లోకమంద్రు దీని
రాజగోపాల! గోపికారమణ! కృష్ణ! 178

శ్లో. శ్లోకే షష్ఠం గురుజ్ఞేయం, సర్వత్రలఘు పంచమమ్,
ద్విచతుష్పాదయోర్హ్రస్వం, సప్తమం దీర్ఘమన్యయోః. 179

---

177. [1]సంబోధా (అ. లి. వ్రాఁతప్రతి). కాళిదాసకృత ఛ్ఛందస్సునకు 'శ్రుతబోధ' మను పేరు ప్రసిద్ధము.

వ. అన్నారు. ఇది స్వస్థాన విషమవృత్తాధికారము.

[పరస్థాన విషమ వృత్తములు]

మఱియు నీఁక నందు పరస్థాన విషమ వృత్తమ్ముల విధమ్ము లెటువలె నంటేని పరస్థానంబు వృత్తమ్ములు నాలుగు విధములయ్యె నవి యెయ్యవి యంటేని పరస్థాన ఏకపాద విషమ వృత్తంబును పరస్థానార్ధ సమ విషమ వృత్తంబును, పరస్థాన త్రిపాద విషమ వృత్తంబును, పరస్థాన సర్వ చతుష్పాద విషమ వృత్తంబనా నందు మున్ను స్వస్థాన విషమ వృత్తంబులకు చెప్పఁబడిన చొప్పున ఉక్తాది షడ్వింశతి చ్ఛందస్సులలో నొక్క ఛందస్సునందలి యొక్క వృత్తంబున ప్రథమ తృతీయ చతుష్పాదములున్ను ఆ చెప్పిన మీఁది ఛందస్సునందు మఱియొక్క వృత్తంబున రెండవ చరణంబునం గలుగఁజెప్పిన యది పరస్థాన ఏకపాద విషమ వృత్తంబన నొప్పును.

మఱియు పరస్థానార్ధ సమవిషమ వృత్తంబన్నది ఉక్తాది షడ్వింశతి చ్ఛందస్సులలో నొక్క ఛందస్సునందలి యొక్క వృత్తంబున ప్రథమ తృతీయ చరణములున్ను ఆ చెప్పిన మీఁది ఛందస్సునందలి వేరొక్క వృత్తంబున ద్వితీయ చతుర్థ చరణమ్ములుం గలుగఁజెప్పిన నది పరస్థానార్ధ సమ విషమ వృత్తంబన నొప్పు.

మఱియు పరస్థాన త్రిపాద విషమ వృత్తంబన్నది. ఉక్తాది షడ్వింశతి చ్ఛందస్సులలో నొక్క ఛందస్సునందలి యొక్క వృత్తంబున ప్రథమ ద్వితీయ తృతీయ చరణమ్ములున్ను ఆ చెప్పిన మీఁది ఛందస్సు నందలి యొక్క వృత్తంబున నాలుగవ చరణంబునుం గలుగఁజెప్పిన నది పరస్థాన త్రిపాద విషమ వృత్తంబన నొప్పును.

మఱియు పరస్థాన సర్వచతుష్పాద విషమవృత్తం బన్నది ఉక్తాది షడ్వింశతి చ్ఛందస్సులలో క్రమంబుగా నాలుగు ఛందస్సులయందలి నాలుగు వృత్తమ్ములను నాలుగు చరణమ్ములుం గలుగఁజెప్పిన నది పరస్థాన సర్వచతుష్పాద విషమ వృత్తంబన నొప్పును. 180

మఱియు నందు క్రమంబున పరస్థాన ఏకపాద విషమ వృత్త లక్ష్యము ౧౭ అత్యష్టిచ్ఛందస్సునందు ౪౭ వే ౭౬౮ వ వృత్తంబున ప్రథమ తృతీయ చతుర్థ చరణమ్ములున్ను ఆమీఁదటి ౧౯ వ అతిధృతిచ్ఛందస్సునందు క్రమంబున ౨ ల ౬౭ వే ౧౨౯ వ వృత్తంబున రెండవ చరణంబునుం గలుగు.

బంధుర మను పరస్థాన ఏకపాద విషమ వృత్తము

భవవిదూర! లలిత శాతి - బంధు రాహ్వయంబనఁగా
రావణారి! తొమ్మిదిట వి - రమము రజనననగల్
దివిజవంద్యపదయుగాబ్జ! - దిగ్విరామయుక్తమై
కవిజనుల్ నభసజరల్ల - గల్ పెనంగఁ బల్కినఁగా.

[పా. 1, 3, 4. మ, భ, స, జ, ర, లగ. 10+
పా. 2. ర, జ, న, స, న, న, గ. ౯+] 181

అందు పరస్థానార్ధ సమ విషమ వృత్తము ౧౮ వ ధృతియను ఛందస్సునందు ౧ ల ౨౦ వే ౪౨౭ వ వృత్తంబున ప్రథమ తృతీయ చరణములున్ను ఆ మీఁదటి ౧౯ దవ అతిధృతిచ్ఛందస్సునందు ౨ ల ౩౬ వే ౬౬౬ వ వృత్తంబున ద్వితీయ చతుర్థ చరణమ్ములుం గలుగు.

మందర మను పరస్థానార్ధ సమ విషమ వృత్తము

చక్రహస్త! వడి విరించి - సంఖ్య రనజభనసలుగా
శక్రవినుత! భవసజల్భ - నల్గ దిగ్విరమణమువి
ర్వక్ర విక్రమమువ నక్ర - రాజ గళము దునిమి భూ
చక్రమునను వెలయు శేష - శాయి! మందరమనఁదగుఁగా.

[పా. 1, 3. ర, న, జ, భ, న, న. ౯+
పా. 2, 4. భ, స, స, జ, భ, న, గ. 10+] 182

అందు పరస్థాన త్రిపాద విషమ వృత్తము ౧౩ వ అతిజగతిచ్ఛందస్సునందు ౭ వే ౩౨ వ వృత్తంబున ప్రథమ ద్వితీయ తృతీయ చరణము

బున్న ఆ మీఁదటి ౧౪ వ శక్వరీఛందస్సునందు ౮ వే ౧౭౬ వ వృత్తం
బున నాలుగవ చరణమ్మును గలుగు.

[1] చక్ర మను పరస్థాన త్రిపాద విషమ వృత్తము

ధరధరవిగమో - ద్ధరణాకరణా
కరశర[వి]ధిశ్రీ - కర! చక్రమనం
బరఁగు ననభభల్ - వరుసన్ గురువుల్
మరుజనకా! దగు - నజననలగలన్.

[పా. 1, 2, 3. న, న, భ, భ, గ. 7+
పా. 4. న, జ, న, న, లగ. 7+] 183

అందు సర్వపరస్థాన విషమ వృత్తము ౧౦ వ పంక్తిఛందస్సు నందు ౪౫ వ వృత్తంబున మొదలి చరణంబు ౧౧ వ త్రిష్టుప్ఛందస్సునందు ౨౦ వ వృత్తంబున రెండవ చరణంబును ౧౨ వ జగతీఛందస్సునందు ౧ వే ౧౫ వ వృత్తంబున మూఁడవ చరణంబును ౧౩ వ అతిజగతీ ఛందస్సునందు ౪౬౨ వ వృత్తంబున నాలుగవ చరణంబునుం గలుగు.

సన్మాని యనుసర్వపరస్థాన విషమ వృత్తము

పూవిక భా[భ]గ - ముల్ చె[లఁగc]
గను నయనల్గాఁ - గలితంబై స
న్మాని యనన్ భభ - నయ గణముల్ సొం
పూ వినఁదనరున్ - భువి[భ]ననగల్.

[*పా. 1. భ, భ, భ, గ. 6+
పా. 2. న, య, న, గగ. 6+
పా. 3. భ, భ, న, య. 6+
పా. 4. భ, న, న, న, గ. 6+] 184

183. [1] చక్రవాళ (తి).

184. *పా త్తపికవి చేర్చోఁనిన (గ్రా త్ర వృత్తము.

వ. ఇది పరస్థాన విషమ వృత్తాధికారము.

మఱియు స్వస్థాన పరస్థానార్ధ సమ విషమ వృత్తములు భీమన గారు రచియించిన ప్రకారము, చిత్రకవి పెద్దనగారు రచియించిన ప్రకారము. అందు, 185

## స్వస్థానార్ధ సమవృత్తములన్నవి

[లక్షణసార సంగ్రహము 2 - 7]

తే. విశియు, విపరీత సంజ్ఞయో విశి, రతిప్రి
య, మఱితప్రతా, పోవ చిత్రాఖ్యలైన
యవియు, నారీప్లుతంబన నాఱుగతుల
జరుగుచుండు స్వస్థానార్ధ సమములగుచు. 186

అందు క్రమంబున విశి యను స్వస్థానార్ధ సమ వృత్తంబు

[లక్షణసార సంగ్రహము [2 - 8]

తేపింద్ర వజ్రంబునఁ - బేర్చిరాఁగా
నెనంగఁగా నర్లను - పేంద్రవజ్రా
కాపిల్లఁగాఁగూర్చియు - బాగుమీఱ
న్వెనవ్విశినామను - వృత్తమయ్యెన్.

[పా. 1, 3. ఇంద్రవజ్ర.
పా. 2, 4. ఉపేంద్రవజ్ర.] 187

వ. *ఇదియె ఉపజాతి యను వృత్తము. [1]దీనికే మఱివ్ని, 188

[లక్షణసార సంగ్రహము 2 - 9]

ఈవింతతో తేసుల - నింద్రవజ్రం
బివుర్పఁగా నర్లను - పేంద్రవజ్రం

---

188. *'విశికే' ఉపజాతి యను నామాంతరము. [1]దీనికే మఱియు నామాంతరము.

లీవై ఖరిన్ రెండును - విట్లు గూర్పన్
నవజ్రదేహా! యుప - జాతియయ్యెన్. 189

అందు విపరీతనిశి యను స్వస్థానార్ధ సమవృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 10]

ఇర స్తుతా! చేసిను - పేంద్రవజ్రన్
హీరాంగ సర్లిందును - వింద్రవజ్రన్
ధరాధిరాజా! యిది - దాధరిత్రిన్
శ్రీకీతి నొప్పు న్విప - రీతపూర్వన్.

[పా. 1, 3. ఉపేంద్రవజ్ర.
పా. 2, 4. ఇంద్రవజ్ర.] 190

అందు రతిప్రియ మను స్వస్థానార్ధ సమవృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 11]

ఖ్యాతి న్వేసుఁ సంప్ర - హర్షిణిం దలిర్పన్
యుక్తంబుగా రుచిరము - యుక్పదంబుఁన్
నీతిం గూర్పఁగనున్ మ - నీషులైన కావ్య
ప్రతిప్రియఁ బనుచుఁ ద - లంతురో కృతిన్.

[పా. 1, 3. ప్రహర్షిణి. 7+
పా. 2, 4. రుచిర. 8+] 191

అందు అజితప్రతాప మను స్వస్థానార్ధ సమవృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 12]

అజర స్తుతాంగ ప్రమి - తాక్షరతో
నజమతి స్ఫుట ప్రి - యంవదాఖ్యతో
నజిత ప్రతాపమన - నయ్యెనయా
సుజన కల్పకము - సూనులెంచఁగాన్.

[పా. 1, 3. ప్రమితాక్షరము. 8+
పా. 2, 4. ప్రియంవద. 7+] 192

అందు ఉపచిత్ర యను స్వస్థానార్ధ సమవృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 13]

అనమంబుల సానవ - లంది యా
ర్యానుత దోదక - మయ్యెను సర్ల
క్రసిక స్తుత సద్గుణ - రత్న హో
రాసురభంజన - యాయుపచిత్రకా.

[పా. 1, 3. స, స, స, వ. 8+
పా. 2, 4. భ, భ, భ, గ. 6+ (దోదకము) 193

అందు నారీప్లుత మను స్వస్థానార్ధ సమవృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 14]

వేసుల్ శాలిన్యాఖ్య - వృత్తంబుగాఁగా
పీసూటితో సర్లమ - నింద్రవజ్రం
బైపేయు న్నారీప్లు - తాఖ్యాత నామం
బో సత్యసంగా! లన - దుజ్జ్వలాంగా!

[పా. 1, 3. శాలిని - మ, త, త, గగ. 6+
పా. 2, 4. ఇంద్రవజ్ర. - త, త, జ, గగ. 7+] 194

వ. ఇవి యాఱు స్వస్థానార్ధ సమవృత్తములు. ఇంక నందు, 195

స్వస్థాన విషమ వృత్తము లన్నవి

[లక్షణసార సంగ్రహము 2 - 30]

తే. ధరణియు, వరాంగి, యంగజాస్త్రము, నదీప్ర
హోషమును, వాల్గుపేరులఁ గొమరు మిగిలి

ఛందమొక్కటిఁ దగిలి ప్రశస్త మగుచుఁ
దనరు స్వస్థాన విషమ వృత్తంబులనఁగ. 196

అందు క్రమంబున ధరణి యను స్వస్థాన విషమ వృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 32]

మును విల్చుము, దోటక - మూఁడు మణిపై
జానుగాఁ దర్కి వి - క్రాంతిరా రవముల్
వనయతి ననన - నలౌ మమ సా
త్రానేవింట కృ - శ్లిస్నలగు ధ్ధరణిఁ.

[పా. 1. స, స, స, స. 8+ (తోటకము)
పా. 2. ర, ర, ర, స. 6+
పా. 3. న, న, న. న. 7+
పా. 4. మ, మ, స, స. 5+] 197

అందు వరాంగి యను స్వస్థాన విషమ వృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 33]

ఖరన్నుధుల్ మెచ్చ ను - పేంద్రవజ్ర
వ్మరుత్తనూజా! ప్రత - మద్వితుర్యల్
హేరాళమై యుండఁగ - నింద్రవజ్రా
వరాంగికిఁ త్ర్యంఘ్రికి - వైపుదావుఁ.

[పా. 1, 2, 4. ఉపేంద్రవజ్ర.
పా. 3. ఇంద్రవజ్ర.] 198

అందు అంగజాస్త్ర మను స్వస్థాన విషమ వృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 34]

రూపయి మించ - మ్రుగ్యవతిమ్మిఁ
దీపితమై యుం - డెఁ యగరాఁగాల్

ప్రాపై శుద్ధ వి - రాట్టు నన్మితం
బైపై నర్ధము - వంగజాస్త్రమా.

[పా. 1, 2. త, మ, వ, గ. 5+ (రుగ్మవతి)
పా. 3, 4. మ, స, జ, గ. 5+ (శుద్ధవిరాట్టు)] 199

అందు నదీప్రఘోష యను స్వస్థాన విషమవృత్తము

[లక్షణసార సంగ్రహము 2 - 15]

బాలవాద్యంఘ్రికిఁ - స్రగ్విణీ వృత్తముం
దలంపఁగాఁ దక్కిన - తత్త్రియాంఘ్రులం
జెలంగ వంశస్థమ - చిత్రరీతి సం
ధిలంగఁ గూర్చంగ న - దీప్రఘోషమా.

[పా. 1. ర, ర, ర, ర. 6+ (స్రగ్విణి)
పా. 2, 3, 4. జ, త, జ, ర. 7+ (వంశస్థము)] 200

వ. ఇవి నాలుగు స్వస్థాన విషమ వృత్తములు. ఇది స్వస్థానార్ధసమ స్వస్థాన విషమ వృత్తాధికారము. ఇఁక నందు, 201

పరస్థానార్ధ సమ వృత్తము లన్నవి

[*లక్షణసార సంగ్రహము 2 : 16 - 28]

తే. కేతుమతి, వేగవతి, వియోగిని, పరావ
తియును, ధృతమధ్యయును, గోమతియును, మణివి
తానకాంతి, మనోహర దనరుఁ బుష్పి
తాగ్ర, భద్రవిరాట్టును, నపరవక్త్రి. 202

క. శ్రీనాయక భృత్యపర
స్థానార్ధ సమంబులివియుఁ దగుఁ బదునొకఁడై

---

*ఇటనుండి (ప. 202 - 214) లక్షణసారసంగ్రహములోని (2 : 16 - 28) పద్యములు సంగ్రహింపఁబడినవి.

పూని ప్రసిద్ధములైనవి
గానెఱుఁగఁగ వలయు వివిగతులు కవీంద్రుల్. 203

అందు క్రమంబున కేతుమతి యను పరస్థానార్ధ సమవృత్తము

దమ బేసుల న్స - జసగాప్తి
న్వాను సమా! సరిభ - భ్రనగగంబుల్
తనరం గవీంద్ర - తతి యెన్నం
దోనమరింపఁగే - తుమతి మించుఁ.

[పా. 1, 3. స, జ, స, గ, 6+
పా. 2, 4. భ, ర, న, గగ. 6+] 204

అందు వేగవతి యను పరస్థానార్ధ సమవృత్తము

తగు బేసుల స - త్రయగంబు
ల్బాగుగ దోదక - పాటిలుసర్లం
బొగడొందఁగ [1]నొ - ప్పునఁగూర్చ
న్వేగవతీవర - వృత్తము మించుఁ.

[పా. 1, 3. స, స, స, గ. 6+
పా. 2, 4. భ, భ, భ, గగ. 6+ (దోదకము)] 205

అందు వియోగిని యను పరస్థానార్ధ సమవృత్తము

అసమంబుల - యందు పాజగల్
వసనర్లందు స - భర్లవంబులిం
పెసఁగన్రచి - యింపఁజెల్వమ
య్యు సమర్థించు వి - యోగివిందగఁ.

[పా. 1, 3. స, స, జ, గ. 6+
పా. 2, 4. స, భ, ర, వ. 6+] 206

---

205. [1] చేర్చిన (అ. సా. సం. 2 - 19).

అందు *పరావతి యను పరస్థానార్ధ సమవృత్తము

బేసులందు హంబు లాఱు - పెట్టియొౘల
దెనన్లగంబు లాఱు గంబ - దిన్పరిన్రాఁ
జేసిరేఁ బరావతీప్ర - సిద్ధసంజ్ఞఁ
దొసంగుపేరి వృత్తమౌను - భూరికీర్తి.

[పా. 1, 3. ఆఱు హగణములు 8+ (12 వ ఛందస్సు)
పా. 2, 4. ఆఱు లగములు, గ. 9+ (13 వ ఛందస్సు)] 207

అందు ధృతమధ్య యనే పరస్థానార్ధ సమవృత్తము

ఆరయ దోదక - మంటును బేసు
ల్పరులను దోదక - లక్షణమొందుఁగా
మారుతి! యాధృతి - మధ్యకునెందు
న్పరన కవీంద్రులు - సమ్మతిఁ గూర్పఁగా.

[పా. 1, 3. భ, భ, భ, గగ. 8+ (దోదకము)
పా. 2, 4. న, జ, జ, య. 7+ (తోదకము)] 208

అందు కోమలి యను పరస్థానార్ధ సమవృత్తము

అనిలజ! దోదగ - మౌ విషమాంఘ్రు
ల్జనస్తుతా రుచిర యె - నంగు ¹సర్లలోఁగా
ఘనతరమై తగుఁ - గావ్యములందుఁగా
వినంగఁగోమలి యను - వృత్తమొప్పగుఁగా.

*అప్పకవి యీ పరావతికి బేసులందు ర. జ, ర, జ, గ సరులందు జ, ర, జ, ర, గ అను గణములను జెప్పెను. ఇందన్నిపాదము లేకచ్ఛందో జాతము లగుటచే (13 వ ఛం.) నియ్యది పరస్థానార్ధ సమవృత్తము కాఁజాలదు. అప్పకవి లక్షణము ప్రమాదము. చిత్రకవి బేసుల 12, సరుల 13 ఛందస్సులను గ్రహించెను. ఇది వృత్తరత్నాకరమతము. ఇందు బేసి పాదములు లఘ్వంతవృత్తములు.

209. ¹యుక్కలకా (అ. పా. సం. 2 - 28)

[పా. 1, 3. న, జ, జ, య. 7+ (తోదకము)
పా. 2, 4. జ, భ, స, జ, గ. 8+ (రుచిర)] 209

అందు మణివితానకాంతి యను పరస్థానార్ధ సమవృత్తము

రంగొ శుద్ధ వి - రాట్టు బేసుల
న్వంగతిన్సరులఁ - జాల్రథోద్ధత
గ్రంగత్సార ధు - రంధరాత్రమా
తంగ విన్మణి వి - తాన కాంతికిఁ.

[పా. 1, 3. మ, స, జ, గ. 5+ (శుద్ధవిరాట్టు)
పా. 2, 4. ర, న, ర, వ. 6+ (రథోద్ధతము)] 210

అందు మనోహర మను పరస్థానార్ధ [సమ]వృత్తము

బేసిన్గవికాంతమ - బేర్చియు విం
పెసఁగ న్సరితోటక - వృత్తముతో
భాసిల్ల నొనర్చిన - భవ్యయశో
వినరాథ్య మనోహర - వృత్తమగుఁ.

[పా. 1, 3. త, జ, జ, వ. 7+ (కవికాంత)
పా. 2, 4. స, స, స, స. 8+ (తోటకము)] 211

అందు పుష్పితాగ్ర యను పరస్థానార్ధ సమవృత్తము

[1]వరఁగ నసమమందు - భద్రికాగ
ల్వరులఁ ప్రభాత యె - సంగుఁ బుష్పితాగ్రఁ
హరికులమణి యంజ - నాత్మజాతా
శరవిధిలంఘన - శౌర్యసత్యసంధా!

[పా. 1, 3. న, న, ర, య. 8+ (భద్రిక)
పా. 2. 4. న, జ, జ, ర, గ. 7+ (ప్రభాతము)] 212

212. [1]పరంగ (అ. 1. వ్రాఁతప్రతి).

అందు భద్రవిరాట్టను పరస్థానార్ధ సమవృత్తము

కాఁజెందనమాన - తభ్రజగా ప్తి
ద్రాజిల్లుద్ధ వి - రాట్టుగంబు నర్లం
దేశోవిజితార్క - తేటగాఁగఁ
భ్రాజద్భద్ర వి - రాడ్విధంబు మించఁ.

[పా. 1, 3. త, జ, ర, గ. 6+
పా. 2, 4. మ, స, జ, గగ. 5+

శుద్ధవిరాట్టుగంబు = శుద్ధవిరాడ్గణములమీఁద (మ, స, జ, గ.)
ఒక గురువు.] 213

అందు అపరవక్త్ర యను పరస్థానార్ధ సమవృత్తము

అనఘ! యసమ - మందు భద్రిక
న్ననఁబరమాలిని - నర్లయందు ని
ల్పనది యపర - వక్త్రవృత్తమా
నమమను సత్కవు - లంద్రు మారుతీ.

[పా. 1, 3. న, న, ర, వ. 6+ (భద్రిక)
పా. 2, 4. న, జ, జ, ర. .+ (పదమాలిని)] 214

వ. ఇవి పరస్థానార్ధ సమవృత్తములు. ఇఁక నందు క్రమంబున — 215

పరస్థాన విషమవృత్తములన్నవి.

[లక్షణసార సంగ్రహము 2 : 37 - 40, 42 - 46]

క. క్షమ శరభక్రీడయు, శ్రీ
రమణ, రతగమన మనోహరమనియనెడు వృ
త్తములీత్రయంబు విదళిత
విమత! పరస్థాన విషమ వృత్తములయ్యెఁగా. 216

అందు క్రమంబున శరభక్రీడ యను పరస్థాన విషమ వృత్తము

కృతిగా చంద్రశ్రీ ప్రథమమున - రెండింటి యందుగా
చతుర్థాంఘ్రిగా రాఁగా మఖనయ య - చంచ్చల్లగంబుగా
చాతుర్యంబొప్పఁగ సువి - శాలరీతిగా దృతీయాంఘ్రిగా
ప్రతిజ్ఞా వాక్పాలా! వినుము శర - భక్రీడ యయ్యెగా.

[పా. 1, 2, 4. య, మ, న, వ, ర, గ. 11+ (చంద్రశ్రీ)
పా. 3. మ, భ, స, య, య, లగ. 8+ (విశాల)] 217

అందు శ్రీరమణ మను పరస్థాన విషమ వృత్తము

రూపయి యాది - రుగ్మవతి రా
నాపయి దోదక - మంఘ్రులమూఁటగా
దీపితమైనను - ధీరులు మెచ్చగా
శ్రీపతి సేవక! - శ్రీరమణంబౌ.

[పా. 1. భ, మ, స, గ. 5+ (రుగ్మవతి)
పా. 2. 3, 4. భ, భ, భ, గగ. 6+ (దోదకము) 218

అందు రథగమనమనోహరమను పరస్థాన విషమవృత్తము

ప్రథననరజగా ప్తిఁ - గాటలంగ నయ్యెగా
ప్రథమ తృతీయ చతుర్థ - పాదముల్ జయోద్య
త్ప్రథనజజరయల్ ద్విపాదయుక్తిఁ జెందగా
రథగమన మనోహ- రంబగుగా సుధీ!

[పా. 1, 3. 4. వ, న, ర, జ, గగ. 8+
పా. 2 వ, జ. జ, ర, య. 9+] 219

వ. ఇవి పరస్థాన విషమ వృత్తములు. ఇఁక నందు 220

సర్వపరస్థాన విషమవృత్తము లన్నవి

తే. తనర పీడాచరన, యుద్గతంబు, మధుర
యనఁగ, మణిదీపికయు నన, నమరు నాల్గు

పేర్లు గలిగిన వృత్తముల్ పృథులశౌర్య!
వినుము సర్వపరస్థాన విషమము లగు. 221

అందు క్రమంబున పీణారచన యను సర్వపరస్థాన
విషమ వృత్తము

స్పారంబుగ నాదిఁ దయ - సాగురువుల్రా
నారెండవ యంఘ్రి తజన - భాస్తిగగంబై
భారంజిత మూఁట తజన - భల్ నగణము పీ
ణారచనకగు భనజ - వల్గురువు తుదన్.

[పా. 1. త, య, న, స, గ. 8+
పా. 2. త, జ, న, భ, గగ. 9+
పా. 3. త, జ, న, భ, న. 9+
పా. 4. భ, న, న, జ, న, గ. 10+] 222

అందు ఉద్గత మను సర్వపరస్థాన విషమ వృత్తము

జగతి స్సజ - ల్గ గణంబు
నగణసజగ - ల్నపీనధీ
నాగభనజగ - ణంబులతో
నొగి మంజుభాషిణిగ - నుద్గతంబగున్.

[పా. 1. స, జ, జ. 5+ (లఘ్వంతము)
పా. 2. న, స, జ, గ. 6+
పా. 3. భ, న, జ, వ. 7+
పా. 4. స, జ, స, జ, గ. 8+ (మంజుభాషిణి)] 223

అందు మధుర మను సర్వపరస్థాన విషమ వృత్తము

పరఁగఁగ మున్ను ప్ర - భాత వృత్తమయ్యెన్
స్థిరమతి మఱి యుల్ల - పిల్లఁ బరాజితన్
స్మరరిపుసుత! మూఁటన్ - మాలిపీ వృత్తరీతిన్
వరవిమధురన్ నసల్ల - జ జంబుగమౌఁదువన్.

[పా. 1. న, జ, జ, ర, గ. 7+ (ప్రభాతము)
పా. 2. న, న, ర, న, లగ. 8+ (అపరాజితము)
పా. 3. న, న, మ, య, య. 8+ (మాలిని)
పా. 4. న, స, జ, జ, గ. 9+ (కల్పితము)] 224

అందు మణిదీపిక యను సర్వపరస్థాన విషమ వృత్తము

పరఁగు నాదిపదమున - భత్రయ సగణబంధుర మయిరా
గరిమను ననసలుమ సజభల్పు - కారముగా ద్వితపదమగుం
దొరిని మూఁడవ యంఘ్రి నభ్రస - ముల్నసయుగముతోడను దగునిదం
దరళ నాల్గవ పాదమొందుచుఁ - దానగున్మణి దీపికగా.

[పా. 1. న, భ, న, భ, న, భ, న. 9+
పా. 2. న, న, న, స, జ, భ, స. 13+
పా. 3. న, భ. ర, న, న, న, న, స. 11+
పా. 4. న, భ, ర, స, జ, జ, గ. 11+ (తరళము)] 225

వ. ఇవి సర్వపరస్థాన విషమవృత్తములు.

ఇది స్వస్థానార్ధసమ, స్వస్థానవిషమ, పరస్థానార్ధసమ, పరస్థానవిషమ, పర్వపరస్థానవిషమ వృత్తాధికారము. మఱియు నందు, 226

## ఉపరివృత్త లక్షణము

క. ఇల విరుపదియాఱక్షర
ములకెక్కువ లిడెడి వర్ణములుగల చరణ
మ్ముల వృత్తములీ గతులన
వలుపగు దరలలిత ఘనవినదములు మొదలై. 227

అందు క్రమంబున [౨౭ యగు] ఓం మహః అనే ఛందస్సున ౧౩౪ కో ౨ వె ౬౬౨ పదియేగు దరమను ఉపరి వృత్తము.

ననన, నలుమ నన - ననలునౌ భనలఁబె -
నఁగొనఁగ నసుగజ - నాగ విరమముల్

దనరివ దరమనఁ - దగు ధరదశరథ -
దశరథ తనయుఁడు - ధస్తుత నృహరీ!

[వ, వ, వ, వ, వ, వ, వ, వ, భ, వ. 8+, 8+, 8+] 228

అందు ౩౬ వదియగు విరాట్ఛందస్సున [1]లలిత మను ఉపరివృత్తము

మొదలను నెనిమిది గణ - ములు నవల నొక నగణ -
మును తుద నగణ ద్వయ - మును యగణముర్విం
గదిపి దశదిశ విధులఁ - గలుగు యతుల నిడివర -
కవులు లలిత కందము - గ విలిపినఁ గృష్ణా!

[వ, వ, వ, వ, వ, వ, వ, వ, వ, వ, వ, య. 10+, 10+, 9+] 229

అందు ౩౬ విరాట్ఛందస్సున ఘనవినద మను ఉపరి వృత్తము

నవనవ జనజనములు - వనభనల్గల విరమ -
జమ్ము నవవిధి యతుల - నలువొప్పఁగవివరుల్
ఘనవినదమనఁ గృతి న - గణిత పక్కువి విమతి -
గల్గి చెలువలరు [1](మరు) - గతులందముగ హరీ!

[వ, వ, వ, వ, జ, వ, జ, వ, వ, వ, భ, స. 10+, 9+, 9+] 230

మఱియు నందు [౩౦ వదియగు] మహాఛ్ఛందస్సున భీమనగారు

లయగ్రాహి యను ఉపరి వృత్తము

[కవిజనాశ్రయము - వృత్త. 127]

అంబరఁగా భజన - సంబులకడఁ భజన -
సంబులు భకారము నొ - దంబడి లయగ్రా
హింబరఁగఁ జెప్పఁగల - శం బిడినయట్ల యగ -
ణంబు కృతిమీఁద నమ - ...

229. [1] పలితమను (తి).

230. [1] రుద్ర (అ. శి. [illegible]



[భ, జ, స, న, భ, జ, స, న, భ, య. 8+, 8+, 8+.
ఇవి ప్రాసయతులు] 231

అందు ౩౪ వ భూర్భువః ఛందస్సున,

లయవిభాతి యను ఉపరి వృత్తము

[కవిజనాశ్రయము - వృత్త. 128]
ననననసనంబులును - నసననసగంబులును -
నెసఁగఁగ్రృతి పాదముల - రసికతను జెప్పఁగా,
గుసుమశరవత్సుభగ! - యసదృశగుణా! వినుత -
రస! లయవిభాతి యని - రసమసుకవీంద్రుల్.

[న, స, న, న, స, న, న, స, న, న, స, గ. 9+, 9+, 9+.
ఇవి ప్రాసయతులు] 232

అందు ౩౪ వ భూర్భువశ్ఛందస్సున,

త్రిభంగి యను ఉపరి వృత్తము

[కవిజనాశ్రయము - వృత్త. 129]
ననలును ననలును - ననలును నసభమ - లను
నగయుక్తములైనఁగా మృదువైనఁగా బ్రస్తుతమైనఁగా
ననరుహభవ విభ! - మనమలరఁద్రిభం - గిని
జెప్పఁగా నదిదప్పఁగా బ్రాసము లొప్పఁగా.

[న, న, న, న, న, న, స, స, భ, మ, స, గ. 8+, 8+. ఇవి ప్రాస
యతులు. 23-27-32 అక్షరములపై అంత్యానుప్రాసము.] 233

---

233. కవిజనాశ్రయము మొదలుకొని యెల్లఛందములందును 27 అక్షరములుగల అపవాహ వృత్తలక్షణము చెప్పఁబడియున్నది. లక్షణశిరోమణి దానిని సంగ్రహింపకుండుటకు కారణము దురూహము. శిరోమణి కారుని మతమున 26 ఛందస్సులే కలవు. 27 వ దగు అపవాహ నతఁడుపేక్షించెనేమో!

అందు ఉపరి వృత్తమను దండకము

[కవిజనాశ్రయము - వృత్త. 131]

అమరఁగ ననహంబులం దాదిగానొందెఁ, [1]గాదేని యాదిన్ దకారంబుగా
నొందె, లోనన్ దకారంబు లిమ్మైఁ గకారావసానంబు గాఁ జెప్పినన్,
దండకంబంద్రు దీనిం గవీంద్రుల్. అన్నారు.

[తొలుత వరుసగా న, న, హ గణములు, తర్వాత విచ్చవచ్చినన్ని
తగణములు, తుద గురువు నిల్చిన దండక వృత్తమగును. మొదట
తగణములనుంచి, తుద గురువు నిల్చిన దానిని తగణ దండక
మందురు.] 234

వ. మఱియు నీ యుపరివృత్తమ్ములందు దండకమను వృత్తమ్ములు దశవిధ
ములైయుండు; నవి యెయ్యవియంటేని వివరించెద నందు: చండవృష్టి
యను దండకమ్మును, శంఖమను దండకంబును యగణ దండకంబును,
తగణ దండకంబును, అర్ణమను దండకంబును, అర్ణవమను దండకం
బును, వ్యాళమను దండకంబును, జీమూతమను దండకంబున, లీలాకర
మను దండకంబును, ఉద్దామమను దండకంబును. నిట్లు దండకమ్ములు
దశవిధములై సిద్ధమ్ముగా ప్రసిద్ధమ్ములై కబ్బమ్ములందు నొందు; నందుఁ
గ్రమంబున ౨౭ అక్షరమ్ములు మొదలుగా నొక్కొక్క గణంబు నెక్కువగా
నెక్కుచు తత్పర్యాయమ్మునం గలుగు దండకమ్ములందు మొదలి, 235

చండవృష్టి యను దండకము

మొదలను నగణ ద్వయంబావలన్
రేఫలేడొందినన్ జండ[1]వృష్టిం (ద)గున్ శ్రీహరీ!

[న - న - 7 రగణములు.] 236

---

234. [1] కాదేని నాఁడన్. (క. జ. అ.)

236. [1] వృష్టంబగున్. (అ. కీ. వ్రాఁతప్రతి)

అందు అర్ణమను దండకము

మొదలను నగణ ద్వయం బావల రేఫలందెన్మిదౌ
నర్ణమన్దండకాఖ్యందగున్.

[న - న - 8 రగణములు.] 237

అందు అర్ణవమను దండకము

మొదలను నగణ ద్వయం బావలన్ రేఫలం దొమ్మిదౌ
నర్ణవాఖ్యందగున్ దండకంబాల్ చెలంగున్ హరీ!

[న - న - 9 రగణములు.] 238

అందు వ్యాళమను దండకము

మొదలను నగణ ద్వయం బావల రేఫలొప్పంబదై
వ్యాళమన్దండకాఖ్య రమానాథ శ్రీగోపికావల్లభా.

[న - న - 10 రగణములు.] 239

అందు జీమూతమను దండకము

మొదలను నగణ ద్వయం బందు రేఫల్ పదొక్కండు
జీమూత మన్దండకం బొప్పు విఖ్యాత లోకైకవీరా! క్రమంబైహరీ!

[న - న - 11 రగణములు.] 240

అందు లీలాకరంబను దండకము

మొదలను నగణద్వయం బందుఁ బన్రెండురేఫల్
క్రమంబైన లీలాకరాఖ్యన్దగున్ దండకంబండ్రు
వైకుంఠ ధామా! రమా వల్లభా!

[న - న - 12 రగణములు.] 241

అందు ఉద్దామమను దండకము

మొదలను నగణద్వయం బందుఁ బద్మూఁడు రేఫల్
గ్రమంబైన నుద్దామనామంబుదా దండకంబయ్యె నో
పుండరీకాయతాక్ష! క్షమాభూసమా!

[న - న - 13 రగణములు.] 242

అందు శంఖమను దండకము

మొదలను నగణద్వయం బందుఁ బద్నాల్గు రేఫల్
క్రమంబొప్పఁగాఁ జెప్పిన శ్శంఖమన్దండకం
బండజారాతిపర్యంక పంకేరుహాక్ష నమస్తే హరీ!

[న - న - 14 రగణములు.] 243

అందు యగణ దండకము

మొదలను నగణద్వయంబంటి యాజంట రేఫల్
క్రమం బొప్పనేళాది యొక్కొక్క పాదంబునన్ దద్గణంబందు
నొక్కొక్క టెక్కింపఁగాఁ జండ వృష్ట్యాది యౌదండకంబుల్
చెలంగు, న్గపుల్ వీనియొక్కొక్కటిన్మావిఁ మాయిన్మతి
న్వేయుమం జెప్పఁగా నొప్పు నొక్కొక్క పాదానఁగాదేవి
నాల్గేపి పాదమ్ములన్నేర్పుగాఁ గూర్పఁగా వచ్చు, వీరీతి
నద్వంద్వమాదిన్ [1 వివర్తించి యాపై] యకారమ్ములన్
బొందుగా నొందు వందమ్ముగా నొందఁగావించి యే
కాదిగా మున్నుగావించు చందమ్మున న్పాద మం
దొక్క టెక్కించి యీరీతి నేకోనమైనట్టి మాయి న్సహ
స్రాఖ్య సంఖ్యం దగం జేయఁగా నొప్పు నొక్కొక్క
పాదానఁగాదేవి నాల్గేపి పాదమ్ములన్ దండకంబుల్ క్రమంబై

244. 1 గుడిర్పాభవబందున్. (అ. శి. వ్రాఁతప్రతి)

ఘవిగ జంద వృష్ట్యాది నామంబులంజేసి యానేర్పుగా
గూర్పఁగా వచ్చు, ఎంకఁ హరీ; యాదిన ద్వంద్వముల్ లేక
యందుఁ తకారాదిగాఁ దద్గణంబుల్ ఘనం బొప్పఁగా విల్పితా
ప్పేచ్ఛగా గాంత మందుం దగం జెందఁ బొందింపఁగా వచ్చు;
వింకొక్కటౌ దండకంబుఁ మహిఁ; దగుహరి ననహమ్ములం
దాది యందొందఁ గీలించి యామీఁద నైనైన విచ్చా
గతిఁ గబ్బమందుఁ తకారమ్ములంతంతకుఁ దండకాం
తంబునఁ గాంతమై యుండఁగా విట్లుగావింపఁగా వచ్చు
వో పచ్చశిరాచిల్క తేజీవజీరుం దగం గన్న యాలచ్చితో
ముచ్చటఁ గొన్న యో యచ్యుతా పాహిమాం పాహిమాం
పాహి లోకేశ సర్వాపరాధఁ క్షమస్వాఖిలేశా జగద్వం
ద్య గోపాలకృష్ణా నమస్తే నమస్తే నమః. 244

వ. ఇది ఉపరి వృత్తాధికారము. ఇఁక నందు 245

గురులఘు పరిమాణసంజ్ఞ

క. గురు లఘు పరిమాణములని
ధరనంగుళమెద్దియొంత దగునిడ మణియుఁ
గురువమరు విదియు చందురు
కరణి న్లఘు వమరు నంబకముగతిఁ గృష్ణా! 246

ఇఁక నందు షట్ప్రత్యయ లక్షణము

తే. అరయఁ బ్రస్తారము దిష్టమధ్వవృత్త
సంఖ్య [నష్ట] లగక్రియా చక్రమనెడి
యాఖ్యలవి యాఱు షట్ప్రత్యయములనంగ
వెలయుఁ గవులివి తెలియఁగా వలయుఁ గృష్ణ! 247

---

244. శిరాజిల్కఁ (అ. కి. బ్రాఁతప్రతి)

అందు క్రమంబునఁ బ్రస్తారప్రత్యయ లక్షణము

సీ. అరయఁగా గురువాలు నర్ధచాలుగ నొద్ది
విడు చాలు లాక్రింద నిలుపవలయు
నెట్లన్నఁ దగ మొదలింటి యాగురు వాది
నొక్కొక్క గురు లఘు వొనరఁజెనఁచి
యవని రెండవ చాలునందు రెండేసి గు
రువులును రెండులఘువులు మూఁట
నారెట్టి నాల్గేసి యమరికగాఁజేర్చి
యీరెట్టి [నాల్గిట] నెనిమిదేసి

తే. వ్రాయ నిటువలెనిడు చాల వరుసలన్ని
సర్వలఘ్వంతమైనఁ బ్రస్తారమగును
ఎన్ని ఛందమ్ములకు గురులన్నియొద్ది
ప్రస్తరించిన గోపాల బాలకృష్ణ! 248

[ఒక ఛందమున నేయే వృత్తములు పుట్టునో విస్తరించి చెప్పుట ప్రస్తారము. ప్రస్తారమునకు రెండు పద్ధతులు గలవు.

మొదటిపద్ధతి పై సీసమున వివరింపఁబడినది.

ఎన్నవ ఛందమునకుఁ బ్రస్తార మడుగుదురో, యన్నిగురువుల నర్ధముగా, వరుసగా వ్రాయవలెను. నిలువుగా మొదటి గురువుక్రింద నొక లఘువు, నట్లే దానిక్రింద నొక గురువు, ఒక లఘు వను క్రమమున వ్రాయవలెను. రెండవ నిలువుచాలున రెండేసి గురువులు, దానిక్రింద రెండేసి లఘువులను క్రమమునను, మూఁడవ నిలువుచాలున దానికి రెట్టింపు అనఁగా నాలుగేసి గురువులు, నాలుగేసి లఘువులను క్రమమునను, నాలుగవ నిలువుచాలున దానికి రెట్టింపు అనఁగా ఎనిమిదేసి గురువులు, ఎనిమిదేసి లఘువులను క్రమమునను, నిట్లే తరువాతి యర్ధచాలులోని గురువుంక్రింద గురులఘువులు రెట్టింపుగ తుది యర్ధచాలు సర్వలఘ్వంతమగువఱకు ననఁగా నన్నియు లఘువులగునంత వఱకు నిలిపినఁ బ్రస్తారమగును.

ఉదా: 4.వ ఛందమునకుఁ బ్రస్తారము —

| | | | |
|---|---|---|---|
| U | U | U | U |
| I | U | U | U |
| U | I | U | U |
| I | I | U | U |
| U | U | I | U |
| I | U | I | U |
| U | I | I | U |
| I | I | I | U |
| U | U | U | I |
| I | U | U | I |
| U | I | U | I |
| I | I | U | I |
| U | U | I | I |
| I | U | I | I |
| U | I | I | I |
| I | I | I | I |

[*అనంతనగారు, ఛందోదర్పణము. 3 - 66]

క. చాలఁగ సర్వగురువులిడి
లాలితముగ గురువుక్రింద లఘువు వలపటన్
ఓలి నెమంబై దాపలి
వ్రాలకు మఱి గురువులిడినఁ బ్రస్తారమగున్ ! అన్నారు. 249

మఱియును వృత్తరత్నాకరమున కేదారభట్టాచార్యులు.

[అధ్యా. 6. శ్లో. 2, 3]

249. *భీమనగారు (తె). 1 వ్రాలకు గురువులను నిలుపఁ బ్రస్తారమగున్.
(ఛం. ద.)

శ్లో. పాదేసర్వగురా వాద్యాల్లఘుంన్యస్య గురోరధః
యథోపరి తథాశేషం భూయః కుర్యా దముం విధిమ్.
ఊనే దద్యాద్గురూ నేవ యావ త్సర్వేలఘుర్భవేత్
ప్రస్తారోఽయం సమాఖ్యాత శ్ఛందోవిచితివేదిభిః. అన్నారు. 250

[ఎన్నవఛందమునకుఁ బ్రస్తారమువలయునో యన్నిగురువులు వరుసగాఁ బెట్టుకొని, యావరుసలో మొదటిగురువుక్రింద లఘువువ్రాసి, దానివలపటఁ బైవరుసలో నున్నవానినే — యనఁగా దానిప్రక్కనున్న గురువులక్రింద గురువులే విల్చుకొనఁగా రెండుబంతు లేర్పడును. ఆ రెండవవరుసలో మొదటిగురువు ఎద్దియో దానిక్రిందఁ దిరుగ లఘువుంబెట్టికొని, వలపల నున్న గురువులక్రింద గురువులంబెట్టి, దాపలనున్న లఘువుక్రింద గురువు వలయు. ఇట్లేర్పఱచుకొని యేవరుసలోనైనను, మొదటిగురువుక్రింద లఘువుపెట్టుకొని వలపలఁ బైవరుసలోనున్నవానికి సమముగా గురువు క్రింద గురువును, లఘువుక్రింద లఘువునుబెట్టుకొని దాపలనున్న లఘువులక్రింద గురువులు పెట్టుకొనవలయును. ఈ ప్రకారము సర్వము లఘువులగువఱకును వ్రాయవలయును. ఇది ప్రస్తారమున 2 వ పద్ధతి.]

వ. ఇది ప్రస్తార ప్రత్యయము. ఇఁక నందు 251

## ఉద్దిష్టప్రత్యయము

సీ. ఏవృత్త మడిగిన నావృత్త చరణంబు
నొక్కటఁ గలిగిన యక్కరములు
నర్ధచాలుగ నొడ్డి యందుఁ గ్రమ్మఱఁ ద ద
క్షరముల గురులఘు ల్పంపుటించి
గురులఘువుల యడుగులు నొక్కటాదిగా
మితిరెండు నాల్గునెన్మిది పదాఱు
నలర ముప్పదిరెండు నఱువదినాల్గు నూ
టిరువదెన్మిది యిట్టి కరణి రెట్టి
తే. లెక్కలిడి యందు గురువ్రాలలెక్కలుడిపి
లఘువు క్రిందివి యా లెక్కలను నొక్క

[1](లె)క్క నుద్దిష్టమిది సర్వవృత్తములకు
నిట్టిదియె సంజ్ఞ దేవకిపట్టి కృష్ణ! 252

[ఉద్దిష్టమనఁగా — ఈ గణములు గల వృత్త మేఛందములో నెన్నవది యని యడుగఁగాఁ జెప్పెడువిధము. ఆ వృత్తగణములందలి గురులఘువుల వరుసగా వ్రాసికొని, వానిక్రింద ఒకటిమొదలుకొని లెక్క లినుమడించి వ్రాసి, వానిలో లఘువులక్రింద లెక్కలన్నిటిని మాత్రము కలయఁ గూడి, యా సంఖ్యతో నొక్కటి కలిపిన, నెన్నియగునో యయ్యది యన్నవ వృత్తమగును; గురులఘువు లెన్నియిచ్చిరో యన్నవ ఛందమగును.

ఉదా॥ I U U I U U — ఇది యెన్నవఛందమున నెన్నవవృత్తము

| | | |
|---|---|---|
| I U U I U U | } | లఘువులక్రింద సంఖ్యలు 1 + 8 = 9 దానితో |
| 1, 2, 4, 8, 16, 32 | | ఒకటి కూడఁగా 9 + 1 = 10 వృత్తము. |

గురు లఘువు లారుండుటచే నీవృత్తము 6-వ ఛందమున 10-వ వృత్త మనవలెను. (తె. ఛం. కి. 1962. పుట 370-371).]

ఇఁక నందు అధ్వప్రత్యయ లక్షణము

సీ. ఎన్నిఛందంబుల కన్ని వర్ణాంగుళ
ద్విగుణంబు నొక్కటి దిగిచి నిలిపి
నది పరిణాహమై యలరుఁ దదుద్భవ
వృత్తాంగుళమ్ముల వినుమడించి
యొక్కటి దివియఁగాఁ దక్కిన తత్సంఖ్య
తిలకింప నదియదా దీర్ఘ మట్టి
పరిణాహమున దీర్ఘపదము గుణింపఁగా
వచ్చు లబ్ధం బది వరుసతోన

తే. వెడలుపు నిడుపు వృత్తనివేశనంబు
లలిత ప్రస్తార మార్గాంగుళములసంఖ్య

252. [1] లెక్క. (అ. శి. ప్రాఁతప్రతి).

తేటపడు సిద్ధమార్గంబు ధీరమతులు
తెలియనిది యధ్వయోగమై వెలయుఁగృష్ణ! 253

[*అనంతవగారు. ఛందోదర్పణము. 3-76]

క. తిరముగ ఛందోఽక్షరములు
నురుతరముగ వృత్తసంఖ్యయును ద్విగుణములై
పొరి నొక్కండు దొలఁగినచోఁ
బరిశిష్టాంగుళము లధ్వభాగము [1]హనుమా! 254

వృత్తరత్నాకరమున కేదారభట్టాచార్యులు [అధ్యా. 6. శ్లో. 9.]

శ్లో. సంఖ్యైవ ద్విగుణైకోనా సద్భిరధ్వా ప్రకీర్తితః
వృత్తస్యాంగుళికీ వ్యాప్తి రధః కుర్యా త్తథాంగుళిమ్. 255

వ. అన్నారు. సంఖ్యాన ప్రమాణంచేత లబ్ధమయినసంఖ్య ద్విగుణించిన లెక్కలో ఒకటి విడిచిన నది యధ్వ[1]సంఖ్య. వృత్తాక్షరముల తదంతరాళ మొక్కొక్క యంగుళమున్ను కూడ కూడిన నందు ఒక్కటి తీసి వేయఁగా వృత్తాక్షరాంగుళ ద్విగుణమగును. ఇది అధ్వయోగ ప్రత్యయము. ఇఁక నందు, 256

[అధ్వమనఁగా విన్నవఛందము ప్రస్తరించుట కెన్నియంగుళముల పొడవు వెడల్పు గల భూమి కావలె నని యడిగినఁ జెప్పెడివిధము. అడిగిన ఛందోక్షర సంఖ్యను రెట్టించి యొకటి తీసివేయఁగా నెంతయైనదో యన్ని యంగుళముల వెడల్పును, ఆ ఛందమునందు జనించు వృత్తసంఖ్యను రెట్టించి యొకటి తీసివేయఁగా వచ్చినన్ని యంగుళముల పొడవునుగల భూమి తచ్ఛందఃప్రస్తారమునకుఁ గావలయునని చెప్పవలెను.

---

254. *'చిత్రకవి పెద్దనగారు' అని అ. ఓ. వ్రాఁతప్రతి.
[1] భాగము పేంద్రా: (ఛం. ద.) "హనుమ" అనునది చిత్రకవిపెద్దన లక్షణసారసంగ్రహమందలి సంబోధనము. ఇట "ఉపేంద్ర" కు బదులు "హనుమ" అనునది పాత్రపికవి కల్పితమే మో!

256. [1]గంజ. (అ. ఓ. వ్రాఁతప్రతి).

ఉదా: 4-వ ఛందము ప్రస్తరింప నెంత భూమి కావలెను?

ఛందస్సంఖ్య 4 X 2 = 8 - 1 = 7 అం. వెడల్పు.

వృత్తసంఖ్య 1( X 2 = 32 - 1 = 31 అం. పొడవు.

(తె. ఛం. శి. 1962 పుట. 376)]

## వృత్తసంఖ్యాప్రత్యయ లక్షణము

సీ. వరవి విర్వదియాఱు ఛందాలలోఁ దన
కిష్టమౌ ఛందాన కిందుకెన్ని
వృత్తము లిపుడు తెల్పేడి చేయుమాయని
యడిగినఁ దొడిఁబడ కపుడెకడఁగి
[1]ఇరువదాఱనఁ గల్గు నిట్టి ఛందముల దా
రడిగిన ఛందమెయ్యదియొ యన్ని
గురువక్కరము లిడికొని యొందురెందు నా
లుగునెన్మిది పదాఱు జగతినిటుల

తే. నొక్కటాదిగ రెట్టించి లెక్కలిడియు
[2]నందు రెట్టెనఁ దుదగుర్వు క్రిందలెక్క
వినుమడించిన లబ్ధంబు వృత్తసంఖ్య
యనెడు ప్రత్యయ మవధారు[3] వినుతకృష్ణ! 257

[వృత్తసంఖ్య యనఁగా ఇన్నవ ఛందమున ఎన్నివృత్తములుపుట్టె నని యడుగఁగా సరిచెప్పెడి విధము. ఎన్నవ ఛందమడుగుచున్నారో యన్ని గురువులు వరుసగా నిలిపి వానిక్రింద నొకటి మొదలుగా రెట్టించుచు వ్రాసి తుది గురువుక్రింది లెక్కను రెట్టింపఁగా నెన్నియగునో యన్నివృత్తము లాఛందమునఁ బుట్టినవని చెప్పవలెను.

ఉదా: 6-వ ఛందమునఁ బుట్టిన వృత్తము లెన్ని?

U U U U U U
1 2 4 8 16 32 X 2 = 64 వృత్తములు.

257. [1]ఇరువదాఱును (తి), [2]నందు రెంటైన (తి), [3]వినుఁడు (తి).

ఆంగ్ల గణితపద్ధతిని దీనిఁ గనుఁగొనుట కీ క్రింది సులభమార్గ మొకటి గలదు. మొదటి ఛందములో 2 వృత్తములు పుట్టును. రెండవ ఛందము నుండి యెన్ని ఛందములకుఁ గావలయునో యన్నిసార్లు రెంటిని గుణింపఁగా నెంతవచ్చునో యన్నివృత్తములని చెప్పవలెను.

ఉదా: 6-వ ఛందములోఁ బుట్టెడు వృత్తముల సంఖ్య —

$2 \times 2 \times 2 \times 2 \times 2 \times 2 \ ( = 2^{6} ) = 64.$

ఇట్లే 26-వ ఛందములోఁ బుట్టెడు వృత్తముల సంఖ్య - $2^{26}$

(రెంటికి 26-వ ఘాతము) = 67108864

- తె. ఛం. రీ. 1962. పుట. 371.]

సీ. అవధరింపుమ[1] యిర్వదాఱు ఛందములలో
నిష్టమౌ ఛందాన నింతవఱకు
మొదటి ఛందము వృత్తములు రెండు మొదలుగా
నన్నియుందుల కెన్నియయ్యెననిన
అడిగిన ఛందాన నాపైఁది ఛందంబు
వృత్తసంఖ్యను రెండు వీడఁదిగిచి
మిగిలిన విన్నవి తగనొప్పఁగాఁ జెప్పు
కాదేని యీఁక నొక క్రమము గలదు

తే. అడిగి నందలి వృత్త సంఖ్యలను వ్రాసి
యవియు రెట్టించి మునుపటియట్ల రెండు
దిగిచి నిలిచిన విన్నవి తేటసేయ
మహినదియె వృత్తసంఖ్యాక్రమమ్ము కృష్ణ! 258

వ. మఱియును, 259

క. [1]కడపటి వృత్తంబుల యను
మడిలోపలఁ బ్రథమ వృత్తమందలిఁ దీర్పఁగ

---

258. [1]అవధరింపుము నిర్వదాఱు. (ఆ. శ్రీ. వ్రాఁతప్రతి).

260. [1]వృత్తము రెట్టిను, మడిలోన ప్రథమవృత్తమందలి దింపగ. (ఆ. శ్రీ. వ్రాఁతప్రతి).

వడి విష్టచ్ఛందంబులఁ
బొడమిన వృత్తముల వెరసు [1]పొలుపగుఁ గృష్ణా! 260

[మొదటి ఛందము మొదలుకొని యిరువదాఱు ఛందములలోఁగోరిన ఛందమునకు ఎన్నివృత్తములని యడిగిన సరిజెప్పెడివిధము వృత్తసంఖ్య. ఎన్నవఛంద మడుగుదురో యా ఛందమునఁబుట్టిన వృత్తసంఖ్య నినుమడించి యా వచ్చిన సంఖ్యలో రెండు దీసివేయఁగా నెంత లెక్క యేర్పడునో యన్నివృత్తములు పుట్టెనని చెప్పవలెను.

ఉదా: మొదటి ఛందమునుండి యాఱవ ఛందమునకుఁ బుట్టిన వృత్తముల మొత్తమెంత?

6.వ ఛందమునఁ బుట్టిన వృత్తసంఖ్య - $2^6 = 64$. దీనిని రెట్టింపఁగా $64 \times 2 = 128$ అగును. అందు రెండు దీసివేయఁగా $128 - 2 = 126$ అగును.

ఛందము లిరువదాఱు మాత్రమే గ్రహింపఁబడును. ఇది ఉత్కాదిజ వృత్తసంఖ్య.

మొదటి ఛందమునుండి 26 వఱకుఁగల ఛందములలోఁ బుట్టిన సర్వసమవృత్తసంఖ్య మొత్తమును ఉత్కాదిజ వృత్తసంఖ్య యందురు.

ఆ సంఖ్య = 13,42,17,726. — తె. ఛం. కీ. పుట. 572.]

ఇఁక నందు నష్టలబ్ధి ప్రత్యయ లక్షణము

సీ. ఈఛందమందున నెన్నవయది గల్గు
            శిష్టవృత్తం బది నష్టమొందె
[నా] వృత్తమెటులుండు నదియు నెప్పటి యట్ల
            నుద్ధరింపుమటన్న, నుర్వివార
లడిగిన వృత్తంబునది బేసియైనచో
            నొక్కటి కలిపి యా లెక్కనగము

260. [1] బొల్పగు శౌర (తి).

చేయుచు గురువునుంచి సరియే నర్థించి
లఘువు నిల్పుచు నిట్టులనె మతెన్ని

తే. లెక్క లొక్కటి పర్యంత మక్కజముగ
వ్రాసి యటుమీఁద నావృత్తవర్ణసంఖ్య
లెన్ని యన్నియు గురుసంజ్ఞలేర్చి నిల్చి
నదియె నష్టలబ్ధియను ప్రత్యయము కృష్ణ! 261

[నష్టలబ్ధి ప్రత్యయమనఁగా ఇన్నవ ఛందమున ఇన్నవ వృత్తమునకే యే గణంబులని యడుగఁగాఁ జెప్పెడివిధము. ఎన్నవ వృత్తమడిగెదరో యా లెక్క నర్థింపవలయును. సరిసంఖ్య నర్థించుచో లఘువును, బేసిగా నుండిన నొకటి గూడికొని యర్ధించి గురువును వ్రాసికొనునది. ఎన్నవ ఛందములోని వృత్తమడుగఁబడునో యన్ని యగునట్లు గురులఘువులు వ్రాసి యవి గణములుచేసి (త్రికములుగా విభజించి) చెప్పవలయును.

ఉదా: 6-వ ఛందమునఁ బుట్టిన 10-వ వృత్తమునకు గణములేవి?

```
2 | 10
    5 — I (ల)
    1
2 | 6
    3 — U (గ)
    1
2 | 4
2 | 2 — U (గ)
    1 — I (ల)
    1
2 | 2
    1 — U (గ)
```

ఆఱవ ఛందములోని వృత్తమున కా అక్షరము లుండునుగాన నందలి పది యవ వృత్తము లక్షణము (గణములు)

{ I U U , I U U
య య }

ఈరీతిగా నుండును. ప్రస్తరించి సరి చూచుకొనునది.

1
2 | 2
1—U (గ) —తె. ఛం. రీ. పుట. 370]

అందు లగక్రియా చక్రప్రత్యయ లక్షణము

సీ. అతినైపుణి విచిత్ర మవధాన మవధారు,
చక్రి! లగక్రియా చక్రమార్గ
మర్ధమేరువు మేరువనఁ గల్గుచక్రంబు
లాది నొక్కటిఁ బెట్టియందుఁ గ్రింద
రెట్టించి లెక్కలు రెండు నాల్గెన్మిది
పదియాఱిటుల నిడి పంక్తి (విడుపు
టిండ్లను) ద్విగుణంబులెల్ల నొక్కటివేసి
విలిచిన యొద్ది పంక్తుల లిఖించి

తే. మొదలినిడి పంక్తితుదలెక్క కధికమైన
విలిచి కడముకుఁ బైపంక్తిఁ గలుగు కుఱుచ
లెక్క లినుమడు లిడిమూఁడులెక్క మునుప
టట్ల నొక్కటి తిగిచివ్రాయఁగను గృష్ణ: 262

సీ. క్రమముతోఁ జక్రాదిఁ గల యర్ధపంక్తిలో
సర్వ [1]గురుల వృత్తసంజ్ఞగలవి
యాక్రిందియోలియం దమరిన లెక్క న
లరిన వృత్తము లొక్కలఘువు గలవి
యా [వెన్కచాలి]లో నందిన వృత్తము
లవియె రెండేసి లఘువులు గలవి
యా నాలుగవ వీధియందుండు వృత్తము
లవియ మూఁడేసి లఘువులు గలవి

263. [1]గురువుల వృత్త (అ. శ. వ్రాఁతప్రతి).

తే. ఇటులఁ గల పంక్తులన్నిటి కిట్టి కరణి
సంజ్ఞ తుదపంక్తి వృత్తముల్ సర్వలఘువు
లవి లగక్రియాప్రక్రియ యనఁగఁ బరఁగు
ప్రత్యయములీల బాలగోపాలకృష్ణ! 263

[ఇన్నవ ఛందమునందు ఒకలఘువాదిగాను ఎన్నేసి లఘువుల వృత్తములు ఎన్నవ యెన్నవయని యడిగిన తెలుపునట్టి చక్రము లగక్రియా చక్ర ప్రత్యయము.

ఈ చక్రము నిర్మించు పద్ధతి :

అడిగిన ఛందము వృత్తసంఖ్య నిర్ణయించుకొని ముందుగా నొకయిల్లు వ్రాసి యాయింట నొకటి (సంఖ్య) నుంచి దానిక్రింద నిలువుగా నిల్లువ్రాసి యందుఁ బైసంఖ్యను రెట్టించివచ్చిన యంకెను (రెండు) నిలిపి, యా రెండవయింటి కడ్డముగా నిండ్లు వ్రాసికొంచు నందు ఆ చాలులోని మొదటియింటిలోని యంకెను (రెండు) ఇనుమడించుచు నొక్కటి త్రోసి మిగిలిన లెక్కను సారెసారెకు వేయుచుండవలెను. ఆ ఛందములోని వృత్తసంఖ్య కాలెక్క మించునేని మానవలెను. మఱల నిలువునఁ గ్రింది యింటఁ బైలెక్కను రెట్టించివచ్చిన సంఖ్యనుబెట్టి యడ్డముగానున్న యిండ్లలో దానిని రెట్టించుచు నొక్కటొక్కటి తీసివైచి మిగిలిన లెక్కను మునుపటివలె వ్రాయుచు, వృత్తసంఖ్యకు మించునేని యదిమాని పైచాలులో రెండవయిల్లుమొదలుకొని యున్నవానిలోని లెక్క నొక్కొక్కటిని రెట్టించి తొలుత వ్రాసి తరువాత రెట్టించి యొకటితీసి వ్రాయవలయు. ఆ లెక్క వృత్తసంఖ్య కెక్కువ యగునపుడు విడిచిపెట్టవలయు. పై చాలు లోని యంకెలలో దేవినైనను దొలుత నినుమడించునపు డెంతవచ్చునో యట్లే వ్రాయుచు నటనుండి మఱల ఆయంకెల నెన్నిమాఱులు రెట్టించినను ఒక్కటొక్కటి తీసివేసి మిగిలినలెక్క వ్రాయవలెను. పై చాలులోని యంకెలన్ని రెట్టించినమీఁదట నా క్రిందటి చాలులోని యంకెల మునుపటి యట్లే గుణించి లెక్క దానిక్రింది చాలున నిలుపునది. ఎన్నవఛంద మడుగుదురో యా ఛందస్సంఖ్యకన్న నొకటి యెక్కువ యిండ్లునిలువున నుండును. ఇందొకయింట వచ్చిన యంకె మఱల నెందును రాదు.

ఈ చక్రమున మొదటిబంతిది సర్వగురు వృత్తము. రెండవబంతి యిండ్లలోనివి యొంటిలఘు వృత్తములు. మూఁడవచాలుననున్నవి రెండేసి లఘువుల వృత్తములు. నాల్గవచాలుననున్నవి మూఁడేసి లఘువుల వృత్తములు. ఇట్లే తక్కినవి. కడబంతిలోనిది సర్వలఘు వృత్తము.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | —సర్వగురువృత్తము (1) | | | | | | | | | |
| 2 | 3 | 5 | 9 | 17 | —ఒంటిలఘువుగల వృత్తములు (5) | | | | | |
| 4 | 7 | 13 | 25 | 6 | 11 | 21 | 10 | 19 | 18 | —రెండేసిలఘువులవి (10) |
| 8 | 15 | 29 | 14 | 27 | 26 | 12 | 23 | 22 | 20 | —మూఁడేసిలఘువులవి (10) |
| 16 | 31 | 30 | 28 | 24 | —నాల్గేసి లఘువులవి (5) | | | | | |
| 32 | —సర్వలఘువృత్తము (1) | | | | | | | | | |

లగక్రియాప్రత్యయములో మేరువు, అర్ధమేరువు, శకటమేరువు అని మూఁడురకముల చక్రములను శిరోమణికారుఁడు పేర్కొనెను. కాని యొక్క లక్షణమునే చెప్పెను. ఆ చెప్పిన లక్షణము శకటమేరువునకు సంబంధించినది. అప్పకవి దీనినే శకటచక్రమని పేర్కొన్నాఁడు. శిరోమణి కారుఁడు వివరింపని మేరుచక్ర నిర్మాణపద్ధతి అప్పకవీయమునఁ గలదు.

మేరుచక్రము వేయుపద్ధతి :

మొదలనడ్డపీఠిగా రెండిండ్లువ్రాసి యాక్రింద 3 ఇండ్లు అడ్డముగా నేర్పఱచి యాక్రింద 4 ఇండ్లు ఈవిధముగా నొక్కొక్క యి ల్లధికముగాఁ గ్రిందఁ గ్రింద వ్రాయవలెను. మొదటిబంతి మొదటిఛందమును దెల్పును. రెండవ బంతి రెండవఛందమును దెల్పును. ఇట్లే యాఱువదాఱుబంతు లిరువదాఱు ఛందములకని యెఱుఁగునది. ఏఛందమున కడుగుదురో యా ఛంద స్సంఖ్యకు నొకటి యెక్కువయగు నిండ్లు ఆ ఛందమును దెలుపు బంతిలో నుండును. ఉభయపార్శ్వములందలి కడపటియిండ్లు రెంటియందును ప్రతిచాలున ఒకటి సంఖ్య వ్రాయవలెను. అట్లు వ్రాయఁగా మొదటి వరుసలోఁగల రెండిండ్లలో ఒక్కట్లసంఖ్య లుండును. రెండవవరుసలోఁ

గడ యిండ్లలో నొక్కొట్ల సంఖ్యయుండును. తరువాత మొదటివరుసలో రెండిండ్లలోని సంఖ్యలఁగూడిన మొత్తమును రెండవవరుసలో రెండవ యింట వ్రాయవలెను. తరువాత మూఁడవ వరుసలో నీవలావలఁగడ యిండ్లలో నొక్కొట్ల సంఖ్యలు వ్రాసి, రెండవ వరుసలోని మొదటి రెండిండ్ల సంఖ్యలఁగూడిన మొత్తమును, రెండు మూఁడిండ్ల సంఖ్యలఁ గూడిన మొత్తమును మూఁడవ వరుసలోని రెండవ మూఁడవ యిండ్లలో వ్రాయవలెను. ఇట్లే క్రిందివరుసలలోఁ బైవరుసలలోని రెండేసి సంఖ్యలఁ గూడఁగా వచ్చిన మొత్తమును వరుసగా నిలుపవలయును. ఈ మేరు చక్రమందుఁ బ్రతి వరుసలో మొదటి యిండ్లనున్న యొక్కొక్కటి సర్వగురు వృత్తములు; తుది యిండ్లనున్న యొక్కొక్కటి సర్వలఘు వృత్తములు. రెండవయిండ్ల నెన్నియుండిన అన్ని ఒంటిలఘు వృత్తములు; మూఁడవయిండ్లవి రెండేసి లఘువుల వృత్తములు; నాల్గవ యిండ్లవి మూఁడేసి లఘువుల వృత్తములు. ఈ ప్రకారమే తక్కిన యిండ్ల కరయునది. మఱి యీ బంతిలోనున్న యంకెల నన్నిటిఁ గలయఁ గూడిన ఆఛందమునఁబుట్టిన వృత్తసంఖ్య వచ్చును.

ఈ క్రింది చక్రమున విది స్పష్టమగును.

5-వ ఛందమునకు మేరుచక్రోద్ధారము :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛం. 1 | 1 | 1 | | | | |
| 2 | 1 | 2 | 1 | | | |
| 3 | 1 | 3 | 3 | 1 | | |
| 4 | 1 | 4 | 6 | 4 | 1 | |
| 5 | 1 | 5 | 10 | 10 | 5 | 1 |

ఇందుఁ గడపటిబంతి యైదవ ఛందమును తెల్పును. ఈ బంతి మొదటి యింటిలోని యొకటి సర్వగురు వృత్తము, రెండవయింటి 5 ఒంటి లఘువుల వృత్తములు (ఒంటి లఘువనుటచే 4 గురువులు గల వృత్తములవి ప్రకారాంతరమున నెన్నసగును), మూఁడవయింటి 10 రెండేసి లఘువుల వృత్తములు, నాలుగవయింటి 10 మూఁడేసి లఘువుల వృత్త

ములు, ఆయిదవయింటి 5 నాలుగేసి లఘువుల వృత్తములు. కడపటి యింటి యొకటి యయిదు లఘువుల వృత్తములు అనఁగా సర్వలఘు వృత్తము 5-వ బంతిలోని యంకెలఁ గూడఁగా 5-వ ఛందములోని వృత్త సంఖ్య 32 అగును. —తె. ఛం. కి. 1962 పుట. 373-34]

వృత్తరత్నాకరమున కేదారభట్టాచార్యులు. [అధ్యా. 6. శ్లో. 4-7]

శ్లో. వర్ణాన్ వృత్తభవా నైకా నౌత్తరాధర్య తస్థ్సితాన్
ఏకాదిక్రమశశ్చైతా నుపర్యుపరి నిక్షిపేత్.
ఉపాంత్యేతో నివృత్తేతాన్ త్యజన్నైకైక మూర్ధ్వతః
ఉపర్యాద్యాద్గురో రేవమేకద్వ్యాది లగక్రియా
లగక్రియాంక సందోహో భవేత్సంఖ్యా విమిశ్రితే. 264

వ. ఇది షట్ప్రత్యయాధికారము. ఈ లగక్రియా చక్రమున మేరువు అర్ధ మేరువు శకటమేరువు వ్రాపి ఉన్నవి. సరిచూచుకొనేది. 265

ఛందస్సులకు గురులఘువులు గల క్రమము

వరకవి వెంకట్రామన్నగారు. లక్ష్యము —

సీ. *సోములు, వేదము, ల్పూర్యులు, రాగముల్ (1, 2, 3, 4)
గ[గ]నేభములు, కరగ్రహవసుమతు, (5, 6)
లష్టాబ్ధి సింధుపు, లబ్ధి లోచన శూన్య (7, 8)
వసుమతు, ల్గతి (శూన్య) వహ్నియుగము, (9)
గగనాక్షి శశిసాయకములు, నంబు[ని]ధి శా (10, 11)
ప్రకరచంద్రమశశుల్, దర్శనాద్రి (12)
శరవేదనేత్రముల్, కరవేదలోచన (13)
పావకబాణముల్, వసు భుజంగ (14)

15
ఆ. శాస్త్రవేద చంద్రశశులు నంబరఋతు
16
తురగ పంచవేదకరము లష్ట
17
కరికరాబ్ధి బాహు శరములు నయనాబ్జ
చంద్రగతి ధరాబ్జశశులు దనరు. 266

వ. మఱియు. 267

18
సీ. *షణ్ణవకర రంధ్రశరవహ్నికరములు
19
రసరామగిరిశూన్యవసువిధిగతు
20
[1]అంబరాంగాగాస్త్రయహివేదగగనాబ్జు (?)
21
లంగ పద్మ[భవ]శూన్యాం[బ]రాక్షి
22
గగనాక్షికరములు విగమాబ్ధిలోకాశ్వ
23
వహ్నిమేదిని శాస్త్ర వార్ధు లక్షి
24
విధిరంధ్ర గజశాస్త్ర విగమాంగ విధులక్షి
గ్రహ (శర) ఋతునేత్రకాలచంద్ర

25
తే. గగన బాహులు శూన్యగగనగతిన [భ]
26
పుర జల [ధి]విధి శశిగతుల్, కరగుణాక్షి

---

268 (?) సిద్ధసమాసమధ్యమున యతిదాగమము. 1 అంతరాజాగౌ (శా). అంబరాంగాశాస్త్రయహి వేదగగనాంబు, లంగ పద్మజశూన్యయాంబరాక్షి. (అ. తి. వ్రాతప్రతి).

266 & 268 *మీఁది సంఖ్యలు ఆయా ఛందస్సంఖ్యల సూచించును.

బాణ శశివర్ణ నేత్రాది ఫణులు నిరువ
దాఱు ఛందసుల గురువులమరు [చుండు] 268

సీ. అమరఁగా నిరువదియాఱు ఛందమ్ముల
సర్వగురువులు ప్రస్తారఫణితి
కమలారి [1]గగన(ర్తు) హిమకర కరవాజి
శైలాద్రి దర్శన శశులఁ దనరు
నన్నియే లఘువులో నన్నిగురులఘుల
లోచనాంబర * * * *లోక జలధి
వర్ణత్రి రర లోకవహ్నుల సంఖ్యను
సర(ణి) లగక్రియాచక్రమునను } (?)

తే. తెలిపి యీ రీతిఁ జేసితిఁ దేటపడఁగ
ఛందములకెన్ని గుర్వుల సంఖ్యగలవో
లఘువు లన్నియుఁ గలవందు లాలితముగ
వేంకటాచలధామ! పవిత్రనామ! 269

వ. అన్నారు. ఇది గురు లఘు సంఖ్య. [1]మఱియును ఛందస్సులకు. 270

[1]గురులఘు సంఖ్యాక్రమము

క. ఎన్నవ ఛందంబడిగిన
నన్నిటి దారన్నిమాఱు లవి రెట్టిఁడఁగా
నెన్నగు నన్నియె గురువులు
నన్నియె లఘువులగు నిరువదాఱిటికి హరీ! 271

---

269. [1]గగనాద్రి. (ల. శి. వ్రాఁత ప్రతి). (?)సాధుపాఠము తెలియకున్నది

270. [1]మఱియు ఛందస్సులకు (ల. శి. వ్రాఁత ప్రతి).

271. [1] (i) గురు లఘు సంజ్ఞాసంఖ్య, (ii) గురు లఘు సంజ్ఞా సంఖ్యాక్రమము (తి. తి1. తి2.).

సీ. ఒకటికి నొండు, రెంటికి నాల్గు, మూఁటికిఁ
బం(డెండు, ముప్పదిరెండును [1]నెమ
బదియును, నూట తొంబదిరెండు, నన్నూట
[2]నలుబదెన్మిది, వేయి విరువదియును
నాలుగా, ద(ట) రెండువేలు మున్నూట నా,
ల్గేను వేలును నూట యిరువదియు మ
ఱియుఁ బదకొండు వేలిన్నూట యరువది
వాలు గిర్వది నాల్గువేలు నైదు
నూఱులు డెబ్బది యాఱు, నేఁబదిమూఁడు
వేలు నిన్నూటిపై వెలయు (నలువ)
తే. దెనిమి దీకీతి పదుమూఁటి కెన్నఁదగును.
గురువు లెన్నియొ లఘువులన్నిరువదాఱు
ఛందములకెల్లఁ దెలియఁ దత్సంఖ్యలిటులె,
రాజగోపాల! రాధికారమణ కృష్ణ! 2:2

వ. (1) మఱియు నా క్రమంబున నడిగిన ఛందో(ద్ప)వ సర్వవృత్త సంఖ్య అర్థింపఁగా నిలిచిన లెక్క ఆ యడిగిన ఛందస్సంఖ్య ఎన్నోదో అన్నిటను గుణింపగా వచ్చిన లబ్ధసంఖ్య గురువులు, అన్ని లఘువులని తెలిసేది.

(2) మఱియు నొకక్రమము అడిగిన ఛందస్సు ఎన్నోదో ఆ ఛందస్సు క్రిందటి ఛందస్సునఁ బుట్టిన సర్వ వృత్త సంఖ్య బెట్టుక ఆ అడిగిన ఎన్నో ఛందస్సో [అన్నిటి] చేత హెచ్చింపఁగా వచ్చిన లబ్ధ సంఖ్య అన్ని గురువులు, [అన్ని లఘువులు అని తెలిసేది].

(3) [మఱియొక క్రమము. అడిగిన ఛందస్సు ఎన్నోదో అన్ని గురువులు] పెట్టి ప్రస్తరింపఁగా నెన్ని నిడిపంక్తులగుచున్నవో ఆ నిడిపంక్తుల యాదట నిడిపంక్తిగల గురువులెంచి ఆ గురువుల ప్రకారం నిడి పంక్తు లెన్నియగునో అన్నిటిచేత ఆ మొదటి (అర్థ) పంక్తి గురువులు

272. [1] నెనబది (అ. ౪. (వాఁత(పతి). [2] ఇందు 'ర - అ' ప్రాసయతి.

హెచ్చింపఁగా వచ్చిన లబ్ధసంఖ్య అన్ని గురువులున్ను అన్ని లఘువులని తెలిసేది. ఇదియొక ఛందస్సునఁగల గురులఘు సంఖ్యాక్రమము. ఇఁక. 273 [న్యాసము.

(1) 4-వ. ఛందస్సునకు న్యాసము—

4-వ. ఛందస్సు సర్వవృత్త సంఖ్య = 16

ఛందస్సంఖ్య = 4

వృత్తసంఖ్య నర్ధింపఁగా = $\frac{16}{2} = 8.$

అర్థించిన వృత్తసంఖ్యను ఛందస్సంఖ్యచే గుణింపఁగా = $8 \times 4 = 32.$

.˙. 4-వ. ఛందమున 32 గురువులు + 32 లఘువు లుండును.

(2) అడిగిన ఛందస్సు = 4

దాని క్రిందటి ఛందస్సు = 3

ఆ 3-వ. ఛందస్సులోని సర్వవృత్త సంఖ్య = 8

అడిగిన ఛందస్సంఖ్యను పై సర్వవృత్త సంఖ్యచే హెచ్చింపఁగా = $4 \times 8 = 32$

.˙. 4-వ. ఛందమున 32 గురువులు + 32 లఘువులు.

(3) 4-వ. ఛందఃప్రస్తారమున మొదటి అర్ధపంక్తిలోని గురువుల సంఖ్య = 4

ప్రస్తరింపఁగా వచ్చు విడి పంక్తులు = 4

ప్రతి విడిపంక్తిలోఁగల గురువులు = 8

విడి పంక్తిలోని గురువుల సంఖ్య X మొదటి అర్ధ పంక్తిలోని గురువుల సంఖ్య = $8 \times 4 = 32.$

.˙. 4-వ. ఛందమున 32 గురువులు + 32 లఘువులు. ఈ లెక్కను 4 వ ఛందపుఁ బ్రస్తారము నందు సరిచూచుకొనునది.]

## అర్ధసమ విషమవృత్త సంఖ్య

ఆ. వసుధ వృత్తసంఖ్య వర్గించి యందుఁ ద
ద్వృత్తసంఖ్య దీసివేయ నదియె

క్రమతఁ దనరు నర్ధసమవృత్తసంఖ్యయౌ
చిరువదాఱిటికివి నిటులె కృష్ణ! 274

ఇఁక నందు విషమవృత్త సంఖ్య

ఆ. జగతి నిట్టి యర్ధసమవృత్త సంఖ్యచే
వర్గు చేయఁగాను వచ్చు సంఖ్య
నమరు నందు నర్ధసమవృత్తసంఖ్య దిం
చఁగను విషమవృత్తసంఖ్య కృష్ణ! 275

వ. ఏ ఛందస్సుకు అడిగితే ఆ ఛందస్సునఁ బుట్టిన సర్వవృత్త సంఖ్యచే వర్గింపఁగా అయిన వృత్త సంఖ్యలో ఆ అడిగిన ఛందస్సు[న] పుట్టిన సర్వవృత్త సంఖ్య తీసివేయఁగా మిగిలిన సంఖ్య అవి అన్నీ అర్ధ సమ వృత్తములవి తెలిసేది. ఆ అడిగిన ఛందస్సునఁ [బుట్టిన వృత్త సంఖ్యా వర్గమును వర్గింపఁగా వచ్చిన వృత్త సంఖ్యలో ఆ మొదటి సమవృత్త సంఖ్యా వర్గమును] తీసివేయఁగా నిలిచిన వృత్తసంఖ్య ఆ ఛందస్సునఁ బుట్టిన విషమ వృత్తములవి తెలిసేది. 276

ఇందుకు భాస్కరాచార్య విరచిత లీలావతీ గణితసూత్రము — [గణో త్తర శ్రేఢి. సూ. 11].

శ్లో. పాదాక్షరమితే గచ్ఛే
గుణవర్గఫలంచయే ద్విగుణే,
సమవృత్తానాం సంఖ్యా
తద్వర్గో వర్గవర్గశ్చ
స్వస్వపదో నౌ స్యాతా
మర్ధసమానాంచ విషమాణామ్. 277

[అత్రోదాహరణమ్]

సమానా మర్ధతుల్యానాం విషమాణాం పృథక్పృథక్,
వృత్తానాం వీదమే సంఖ్యామనుష్టుప్ఛందసి ద్రుతమ్. 278

ఇందుకు సూత్రము [లీలావతి గణితము. గుణోత్తర శ్రేఢి. సూ. 10]

విషమే గచ్ఛేవ్యేకే గుణకస్థాప్యస్సమే ఒర్ధితే వర్గః
గచ్ఛ క్షయాంతమాంత్యా, ద్వ్యస్తం గుణ వర్గజం ఫలం యత్తత్,
వ్యేకం వ్యేక గుణోద్ధృత, మాది గుణం స్యాద్గుణోత్తరే గణితమ్. 279

[సమవృత్త సంఖ్య]

వ. గచ్ఛక్షయాంత మనఁగా నిలిచిన ౧ అనుట. గచ్ఛ అంటే యిష్టమైన లెక్క సంఖ్య అనుట. ద్విగుణోత్తరం అంటే రెండెట్టి గుణించు టనుట. తొమ్మిదో బృహతీ ఛందస్సు గచ్ఛ. తొమ్మిది విషమ సంఖ్య గనుక వకటి తీసివేస్తే నన్నిగచ్ఛ గుణకమని వ్రాసేది. పిమ్మట ౮ ఆ ౮ గచ్ఛసమము గనుక ఆది అర్ధించగా ౪ సమము గనుక ఆ గుణము క్రింద వర్గము అని వ్రాసేది. ఆ ౪న్ను సమము గనుక అది అర్ధించగా ౨న్ను సమము గనుక ఆ క్రింద తిరిగి వర్గమని వ్రాసేది. ఆ నిలిచిన ౨ సమము గనుక అర్ధించగా ౧ నిలిచె గనుక ఆ క్రింద వర్గమని వ్రాసేది. ఆ నిలిచిన ౧టిన్ని గుణోత్తరము. రెంటిచేత గుణించి వానిచేత ఆ వర్గములసంఖ్య వర్గించగా ౨ వి. వర్గము - వర్గము - వర్గము - గుణము గనుక ఆ వ్రాసిన ప్రకారము ౨ వర్గించగా ౪. ఆ ౪ వర్గిస్తే ౧౬. ఆ పదహారు వర్గిస్తే ౨౫౬. ఆ ౨౫౬న్ను గుణము ౨ గనుక ఆ గుణమునే ౨ చేతను గుణించఁగా ౫౧౨. ఇది తొమ్మిదో బృహతీ ఛందస్సునఁ బుట్టిన సమవృత్త సంఖ్య - ౫౧౨. 280

[వృత్త సంఖ్యను గనుకొను విధానము :

I సమవృత్తసంఖ్య - న్యాసము :

ఇందు అర్ధించునపుడు బేసి సంఖ్య అయినచో నొకటి తీసివేయవలయును. బేసి సంఖ్యను గుణమని, సరిసంఖ్యను వర్గమని గుర్తించుకొనవలెను. గచ్ఛ యనగా ఇష్టసంఖ్య.

ఉదా ॥ (i) బృహతీ ఛందస్సు = 9 వ. ఛందస్సు.

9 – గచ్ఛ. ఇది గుణము.

9

— 1 256 X 2 = 512

2 | 8 – వర్గ 16 X 16 = 256

2 | 4 – వర్గ 4 X 4 = 16

2 | 2 – వర్గ 2 X 2 = 4

1 X 2

∴ 9 వ. ఛందస్సున సమవృత్త సంఖ్య = 512

(ii) 13 వ. ఛందము గచ్ఛ. ఇది గుణము.

13

— 1 4096 X 2 = 8192

2 | 12 – వర్గ 64 X 64 = 4096

2 6 – వర్గ 8 X 8 = 64

3 – గుణము 4 X 2 = 8

— 1

2 | 2 – వర్గ 2 X 2 = 4

1 X 2

∴ 13 వ. ఛందస్సున సమవృత్త సంఖ్య = 8192 ]

[ అర్ధసమవృత్త సంఖ్య ]

వ. ఈ ౫౧౨ వర్గిస్తే వచ్చిన ౨ల ౬౨వే ౧౪౪న్ను ఈ అయిన లెక్కలో బృహతీ ఛందస్సునఁ బుట్టిన ౫౧౨ సమవృత్త సంఖ్య తీసివేయగా నిలిచిన ౨ల ౬౧వే ౬౩౨న్ను అర్ధసమవృత్తములని తెలిపేది. 281

[అర్ధసమవృత్త సంఖ్య:

సమవృత్తసంఖ్యను వర్గించి, వచ్చిన లెక్కలో ఆ సమవృత్తసంఖ్యను తీసివేయగా లభించు సంఖ్య ఆ ఛందస్సునఁ బుట్టిన అర్ధసమవృత్తసంఖ్య

ఉదా॥ 9 వ. ఛందస్సు సమవృత్తసంఖ్య = 512.

దానిని వర్గింపఁగా = 512 X 512 = 2, 62, 144.

ఆ ఛందస్సునఁ బుట్టిన సమవృత్తసంఖ్యను తీసివేయఁగా

= 2,62, 144 - 512 = 2, 61, 632.

పై గణన పద్ధతికి సూత్రము = $(512)^2$ - 512 = 2, 61, 632.

.˙. 9 వ. ఛందస్సున అర్ధసమవృత్తసంఖ్య = 2, 61, 632.

[ విషమవృత్త సంఖ్య ]

వ. ఆ మొదటి ౨ ల ౬౨ వే ౧౪౪న్ను వర్గిస్తే అయిన లెక్క ౬ అర్బుద ౮ శంఖ ౭౧ కో ౯౪ ల ౭౬ వే ౭౩౬. ఈ లెక్కలో ఆ మునుపటి ౨ ల ౬౨ వే ౧౪౪ తీసివేస్తే నిలిచిన ౬ అర్బుద ౮ శంఖ ౭౧ కో ౯౨ ల ౧౪ వే ౫౯౨ న్ను, ఇవి విషమవృత్తసంఖ్య అని తెలిసేది. 282

[ విషమవృత్త సంఖ్య :

సమవృత్తసంఖ్యయొక్క వర్గమును వర్గించి దానిలోనుండి సమవృత్త సంఖ్య వర్గమును తీసివేయగా లభించు సంఖ్య విషమ వృత్తసంఖ్య. 9 వ. ఛందస్సునందలి విషమవృత్త సంఖ్యావర్గము = 512 X 512

= 2, 62, 144.

పై సంఖ్యను వర్గింపఁగా = 2,62,144 X 2,62,144 = 6,8,71,94 76 736.

పై సంఖ్యనుండి సమవృత్త సంఖ్యావర్గమును తీసివేయగా

= 6,8,71,94,76,736 - 2,62,144 = 6,8,71,92,14,592.

.˙. 9 వ. ఛందస్సున విషమవృత్తసంఖ్య = 6, 8, 71, 92, 14, 5·2. ]

వ. ఈ ప్రకారమే ఇరువదాఱు ఛందస్సులకు సమవృత్త [అర్ధ సమవృత్త] విషమ[వృత్త] సంఖ్యలు తెలియనగును. ఇది షట్ప్రత్యయాధికార లగ క్రియాచక్ర మేరువు, శకట మేరువు, సవ్యాపసవ్య అర్ధమేరువులు గురు లఘు ప్రకార నిర్ణయములున్ను ఇందుఁగల సమ విషమవృత్త సంఖ్యా ప్రకార లక్షణములు సమాప్తము. 283

ఇఁక నందు పంచపాదవృత్త లక్షణము

క. సమవృత్తము సీసము గీ
తము లీమూఁటందుఁ జెప్పఁదగుఁ గవిత లకా-
వ్యములందుఁ బంచ పాదము
లమరాధిప విబుధనుత పదాంబుజ! కృష్ణా! 284

పంచపాదికి లక్ష్యము —

ఉ. వారక నారకర్థి(?)కవి వల్లభులెంచఁగఁ బంచపాదికల్
వేరచియింతు రేర్చి సమవృత్తము సీసము గీతమెందు శృం
గార రసోక్తియుక్తి నవకంబుగఁ గూర్చుతఱిన్ మనంబులో
వీరసమూవి యన్య విరపించు నెదన్నతిసేయు చోటనా
రీరతి రాజవైఖరీ వృత్తకాంతి యురీ హరీ. (?) 285

దీపికయందు వార్తాకవి [1]రఘునాథయ్య గారు —

క. స్తుతి యెడ శృంగారరస
స్థితి పట్టునఁ దివిరియొరులఁ దెగడెడు చోటన్
చతుర కవు ల్రచియింతురు
వితతంబుగఁ బంచపాదవృత్తము పేర్మిన్. 286

మఱియు నందే లక్ష్యముగా —

ఉ. శ్రీపతిఁ బేరురమ్మున ధరించిన భోగి చతుర్ముఖుండు నా
భీ పరసీరుహంబునకు బిడ్డఁడుగా విలసిల్లు మేటికై
లాసనగావ మందు జడల వ్వవరించినయట్టి వట్టియిల్
భాసుర పాదపద్మమవి బల్లిదుఁడే విభుఁడంచు నన్నుతుల్
చేసిరి నన్మసీంద్రులనఁ జెన్నగు వృత్తము పంచపాదియై. అన్నారు. 287

285. (?) గణభంగము. అర్థము విచార్యము.

286. [1] రామయ్య. (రా).

మఱియు లక్ష్యము పెద్దవగారు విష్ణుచిత్తీయము. పాం(డ్య)రాజు కొలువు వర్ణనము. పంచపాది సీసము. లక్ష్యము. [ఆముక్త. 4 - 58].

సీ. పసిఁడిగ చ్చమర సోపానముల్ మూఁటఁ దుం
గిత విశాలికయుఁ జిత్రితయు నైన
[ పటమహాకుథముపై శార్దూల చర్మకం
బావృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టిరా హార నందిరు
ద్రాక్షయుతముఁ దాల్చి యశిక భూతి
సురటిగాడ్పులరాల వరుణాయతాక్షుఁడై
కుఱు గద్దె బిల్లఁ బ్రకోష్ఠముంచి
వంది ముద్రితపాణియందుఁ జెక్కూఁది యా
గమములు వినుచు హేమము పొదివిన

తే. యంఁతి రుదురాకగమి కుట్టులందు మెఱయ
వెలిదపారంబు మించ దువ్వలువ గప్పి
యదపమును వాఁడివా లొక్క యతివ దాల్ప
శార్య వింజామరిడ నొప్పు పాండ్యుఁ గనియె ] ౫౮

వ. అనే సీసము పంచపాది లక్ష్యము. ఇవి పంచపాదివృత్త లక్షణ లక్ష్యములు.

ఇఁక నందు మఱియు కందపద్య లక్షణంబును, గీతపద్య విధంబును, సీసపద్యరీతియు, ద్విపద జాతియు, చౌపదంబుల యొప్పును, మంజరుల చొప్పును, రగడలవగలును, కందగీత వృత్త సీసమాలికల తెగలును, ఉదాహరణ కళికోత్కళికల తెఱంగును, తారావళి కొలందులును, చాటు ప్రబంధ విబంధన గతియును, ఆర్యాప్రసిద్ధ పద్ధతియును, నవ్య గతియును, యక్షగానాష్టక నానావిధ పద విధానంబును, తద్వ్యాజయందంబును, ఉపజాతి వృత్తంబుల చందంబును, తురంగ శంభు మండూక డింకిణీ లటహా పటహా తమ్మట భద్రక వృత్తాది విశేష వృత్త వృత్తులును సూళాది సప్త తాళ వృత్తముల గతియు, రంగఘోష జయఘోష త్యాగ

హోచ విశేషంబులును. భోగావళియు, గుణావళి, బిరుదావళి, త్రితయ జాతులును, మఱియు చతురుత్తరంబును, చక్రవాళంబును, చతుర్భద్రిక మొదలైన కవికల్పిత వృత్త విధంబును, మఱియు వైతాళీయ వక్త్రి వృత్త భేదంబులును ఇవి మొదలుగా నొనవు వాని వాని లక్షణ లక్ష్యంబులును, విశదంబుగా వివరించెద నవధరింపుము.

[కంద భేదములు]

అది యెట్లంటేని — అందు క్రమంబున కందంబులు పదునాల్గు విధంబులఁ బ్రసిద్ధమ్ములై వెలయు - నవి యెయ్యవి యంటేని సమ కందంబును, విషమ కందంబును, ఆర్యా కందంబును, కుటిల కందంబును, విరుద కందంబును, ద్వివిధ కందంబును, చతుర్విధ కందంబును, నల చతుష్కందమును, జగణ చతుష్కందంబును, వృత్తగర్భిత కందంబును, శాస్కర విలపిత కందద్వయంబును, క్రౌంచపద కందద్వయంబును, ప్రమితాక్షర కందద్వయంబునా నిట్లు పదునాల్గు విధమ్ముం బిలపిల్లు; నందు క్రమంబున. 284

సమకంద లక్షణము

క. భనల జగానల కందము
లను మూఁడైదు గణముల నలజములు నాఱిం
టను చరగురువును బరిమూఁ
టను దగు బేసుల జగణమితఁ జనను కృష్ణా! 285

[సమకందమున గగ, భ, జ, స, నల అను చతుర్మాత్రా గణములే ప్రయోగ్యములు. బేసి పాదములందు మూఁడు గణములు, సరిపాదములందు అయిదు గణములు, రెండు సగములందును 6 వ గణము నలమో, జగణమో కావలయును. తుదలందు గురు వుండవలయు. బేసి గణములందు జగణము రాదు. 2 వ, 4 వ పాదములందు మూఁటిపై యతి.]

అందు విషమ కంద లక్షణము

క. సమకంద కుటిల పదముల్
క్రమమునవిధి [యనల] నార్యకంద విరుద పా

[దములను విలుపంగఁ దగును]
గమలాధిప యదియె విషమ కందము కృష్ణా!

[సమ కందముయొక్క కుఱుచ పాదము లోకవరుసగఁ దరువాత నిడుద పాదము లోకవరుసగఁ గూర్చిన విషమకందము. 1, 2, కఱుచ పాదములు. 3, 4, నిడుద పాదములు.] 291

అందు ఆర్యా కంద లక్షణము

క. కందము నిడుద పదమ్ముల
యందుల తుద లఘువులిడిన నది భువి నార్యా
కందంబగుఁ [సమ కందము
నందుం] గల లక్షణముల నమరున్ గృష్ణా! 292

[కందము నిడుద పాదముల తుదలందు లఘువు లిడినచో నార్యాకందము.]
లక్ష్యము -

క. *యదుకుల పావన రాధా
హృదయ వ్యాకోచజలజ భృంగరమాధవ
సదయాంతరంగ దితిజా
మదభంగా దశతురంగ మహినార్యయగును. 293

అందు కుఱుచ కంద లక్షణము

క. ఈ క్షితిఁ గృతి ముప్పది నా
ల్గక్షరములఁ గుఱుచ కందమగు నఱువది రెం
డక్షరములు గలిగినఁ గమ
లాక్షా! యది నిడుదకంద మనఁదగుఁ గృష్ణా! 294

[కుఱుచ కందమునందలి యక్షరము లన్నియు గురువులు. 6 వ. చోట మాత్రము జగణముండును. దీనికి మొత్తము 34 అక్షరములు.]

---

293. *ల. శిరోమణి లక్ష్య లక్షణములలో ఆర్యాకందము లఘ్వంతముగ నున్నది. గుర్వంతముగా నితర లాక్షణికులు నిర్దేశించిరి.

లక్ష్యము, - చిత్రకవి పెద్దనగారు [లక్షణసార సంగ్రహము. 2-87]

లంకాగ్రావప్రోద్య
ట్టంకా, రక్షోవనీకుఠారా, జేజే
శంకాదూరా, దుష్టా
శంకాంభోదానిలా యుదంచత్కీర్తీ ! 295

అందు నిడుద కందము

[లక్షణసార సంగ్రహము. 2-88]

కపిమనఁగి మొనవఁ దలఁచిన
మొసలివి దునిమితివి బలిర మునినుత చరితా
నిసరుహభవముఖరులకు ¹వ
వసమగు భవదసమ బలము ; వసుమతిఁ బొగడన్. 296

[నిడుద కందమునందు నక్షరములన్నియు లఘువులు. నిడుదపాదముల తుదలందు గురువులుండును. దీనికి మొత్తము 62 అక్షరములు].

[ ద్వివిధ కంద లక్షణము

లక్షణసార సంగ్రహము. 2-89

క. చదువఁగ నేయర్థమువలె
నది మొదలుగఁ జదువఁ గ్రియకు నమరెడుక్రియకై
తుదయర్థము మొదలర్థము
కదియక వేఱైన ద్వివిధ కందమనఁదాగున్.] 297

[పూర్వోత్తరార్ధములు విడివిడిగనుండి, ముందువెనుకలు చేసి చదువుట కనువుగ నుండునది ద్వివిధ కందము ]

---

296. ¹వ (ల. సా. సం.) ల. ౧ : 'అనసమ' – దుష్టసమాసము. "అనళ ము" నన్నతో సాధుసమాసము ; కాని "వ – ళ" ప్రాసయతికాదు.

అందున చతుష్కంద లక్షణము

క. [నలజములం దొక్కటి వ
ర్తిలి కుఱుచదుగలను గగము రెండవయదిగా
వెలయఁ జతుష్కందం బది
యలఘు పదము పంచమగణమాదిగఁ జదువన్.] 298

[ ఒక కందమునే నాలుగు కందములుగాఁ జదువ వీలగునది చతుష్కందము. ఉన్నదున్నట్లు చదువుట మొదటి కందము. ఉత్తరార్ధముతో నారంభించి చదువుట రెండవ కందము. పూర్వోత్తరార్ధములందలి పంచమ గణములాదిగాఁ జదువ నేర్పడునవి 3 వ, 4 వ. కందములు ఇది గర్భ కవితావిశేషము. "గగము రెండవ యదిగా వెలయ" అని లక్షణమున నున్నది. కాని యీ 'గగ' గణ ప్రసక్తి యనవసరము. ఈ నియతి లక్ష్యములందును కవిపించుటలేదు.]

[నల చతుష్కందమును, జగణ చతుష్కందమును లక్షణము

[లక్షణసార సంగ్రహము. 2-91]

నలమది రెండవ గణమై
తొలఁగక యుఱమన్న నలచతుష్కందమగుఁ
వెలయఁగ నటువలె జగణము
తొలఁగక యుండిన జగణ చతుష్కందమగుఁ.] 299

[కుఱుచ పాదములందు 2 వ గణమున నలము గలది నల చతుష్కందము జగము కలది జగణ చతుష్కందము]

[అందు నల చతుష్కంద లక్ష్యము

లక్షణసారసంగ్రహము. 2-92

క. తనర వ్విమతులు చేపెద
పమవిఁ బలసహిత వజ్రకాయు న్నలదుఁ

వినయుఁడు జయనయ భద్రుఁడు
హనుమఁడు దళితాసురేంద్రు నధిపుం జెలువుఁడు.] 300

[దీనిని చతుష్కందములుగ విడఁదీయు విధానము :—

పైపద్యము ప్రథమ కందము.

ద్వితీయ కందము :

వినయుఁడు జయనయభద్రుఁడు
హనుమఁడు దళితాసురేంద్రు నధిపుంజెలువుఁడు
తనర న్వినుతులు చేసెద
ఘనుఁడు బలసహిత వజ్రకాయు న్ఫలదుఁడు.

తృతీయ కందము :

బల సహిత వజ్రకాయుఁడు
ఫలదుఁడు వినయుఁడు జయనయభద్రుఁడు హనుమఁడు
దళితాసురేంద్రు నధిపుం
జెలువుఁడు దనర న్వినుతులు చేసెద ఘనుఁడు.

చతుర్థ కందము :

దళితాసురేంద్రు నధిపుం
జెలువుఁడు దనర న్వినుతులు చేసెద ఘనుఁడు
బలసహిత వజ్రకాయుఁడు
ఫలదుఁడు వినయుఁడు జయనయ భద్రుఁడు హనుమఁడు.]

అందు జగణ చతుష్కంద లక్ష్యము

[లక్షణసారసంగ్రహము. 2-93]

క. కొలుతుం గపీంద్రు సొంపునఁ
దలఁతుఁడు శ్రీరామభక్తిధనుని ధీరుఁడు
నలినాప్తకోటి తేజుఁ
గలితున్మేరూపమానకాయుఁడు కాతుఁడు. 301

[ఇందలి చతుష్కందములు :

పై లక్ష్యమే మొదటి కందము.

2 వ. కందము :

నలినాప్తకోటి తేజః
కలితు న్మేరూపమాన కాయుఁ శూరుఁ
గొలుతుం గపీంద్రు సొంపునఁ
దలఁతుఁ శ్రీరామభక్తి ధనుని ధీరుఁ.

3 వ. కందము :

శ్రీరామ భక్తి ధనునిఁ
ధీరుఁ నలినాప్తకోటితేజఃకలితుఁ
మేరూపమానకాయుఁ
శూరుఁ గొలుతుం గపీంద్రు సొంపునఁ దలఁతుఁ.

4 వ. కందము :

మేరూపమాన కాయుఁ
శూరుఁ గొలుతుం గపీంద్రు సొంపునఁ దలఁతుఁ
శ్రీరామభక్తి ధనునిఁ
ధీరుఁ నలినాప్త కోటితేజః కలితుఁ.]

[లక్షణసారసంగ్రహము. 2-84]

క. కందంబులు బహుగతులను
వందంబగుఁ గుఱుచకందమన విదురుదయనే
కందంబు ద్వివిధకందము
నందుఁ జతుష్కందమాదియైనవి పెక్కుల్. 302

వ. అన్నాఁడు. మఱియు నందు ద్వివిధ కందంబును, చతుర్విధ కందంబును, వృత్తగర్భిత కందంబును, భాస్కరవిలసిత కంద ద్వయంబును, క్రౌంచ

వేద కంద ద్వయమును, మణిగణనికర కందంబును, భ్రమితాక్షర కందం బును నానివి చిత్రకవిత్వంబునం బ్రవర్తిల్లు. అవి విశ్రమాధికారంబునం జిత్ర విధంబునం దేటపఱుతు.

ఇది యార్యాకంద భేదము లాదిగాఁగల్గు కదంబుబు పదునాల్గు విధమ్ముల విలసిల్లును. 303

[కంద గురు లఘు సంజ్ఞా క్రమము]

వ. అందు సమకందాది కందముల గురు లఘువుల సంజ్ఞా క్రమంబెటువలెఁ దెలియునంటేని కందపద్య ధ్రువము ౬౪ కి కందపద్యాక్షరము లెన్నఁగ ఆధ్రువానకు తక్కువైన సంఖ్య గురువులు. ఆ పద్యాక్షర సంఖ్యలో ఆ గురు సంఖ్యాక్షరము - పోఁగా వి(లిచి)న యక్షరములు. ఈ గురు లఘు వర్ణములు కలియఁ గూడఁగా ఆ కందాక్షర సంఖ్యలఁ గూర్చునది.

[కందపద్యమునకు 64 మాత్రలు. అనఁగా 64 లఘ్వక్షరములు. ఈ 64ను కంద పద్యమునకు ధ్రువమగును. కంద పద్యమునందలి అక్షర సంఖ్యను ధ్రువమున తీసివేయఁగా మిగిలినసంఖ్య గురువులు.

ఉదా ॥ కం. "ఈ క్షితిఁ గృతి ముప్పది నా". [ల. ల. 3-294]

| | |
|---|---|
| ఈ పద్యమునందలి యక్షర సంఖ్య | = 52 |
| ధ్రువసంఖ్య | = 64 |
| ధ్రువ సంఖ్యలో నక్షర సంఖ్యపోఁగా | = 64 - 52 = 12. |

ఈ శేషము గురువులు పై పద్యమునందు గుర్వక్షరములు 12. కలవు. పద్యాక్షర సంఖ్యలో గుర్వక్షరసంఖ్య పోగా = 52 - 12 = 40. ఈశేషము లఘ్వక్షరములు. పై పద్యమునందు లఘ్వక్షరములు 40 కలవు. ఈ గురు లఘు సంఖ్యాక్షరములు కలియఁగూడఁగా పద్యాక్షరసంఖ్య వచ్చును.

∴ 12 + 40 = 52.]

[సీస గీతంబుల విధంబులు]

వ. మఱియు వీఁక నందు సీస గీతమ్ముల విధమ్ములు వివరించెద నవధరింపుము. ఉపరివృత్తంబులు ఇరువది యేళాదిగా భూః, భువః, సువః, మహః

జనః, తపః, సత్య, భూర్భువః, స్వరః అవియెడి ఉపరిచ్ఛందస్సులు తొమ్మిదియును గూడి ౩౧ ఛందస్సులలో *లయగ్రాహి యను వృత్తంబు 30 వ. మహాశ్ఛందస్సునందును, లయవిభాతి, త్రిభంగి యను వృత్తంబులు ౩౪ వ. భూర్భువశ్ఛందస్సు [న]ను ; లలిత దండకాదులవి కొన్ని తదుపరి వృత్తములనంబరఁగు ; వందు తదుపరి విరా¹ట్ఛందోద్భవంబగు సీస గీతుల లక్షణము. 304

ఋగ్వేద బ్రాహ్మణమునను :

విచ్ఛేదంగా । ప్రాసంద్విః । దివస్పతి షడార్కాయుగా ।
చత్వారింశోత్తరశతలశ్చతుః । ప్రసన్నవద్యుతా సమా ।
శతుః పంచాధికో లః విషమా । జాతిరిత్యాహ ।
మహర్షి । స్సీసావదేతి । విరాట్ఛందో భవేతి । నాగాకలత్రపు
మనోజ్ఞాపశలి భేవాః పంచాశత్ ॥

విచ్ఛేదమ్మనే యతి ఏదో గణానను ప్రాసము. ద్విః - రెండో గణము మీఁద ప్రాసయతి రావలెను. ద్వివస్పతి షడార్కాయుగే - ఇంద్రగణము లాఱున్ను అర్కగణము రెండున్ను ఒక చరణాన కనుట. చత్వారింశోత్తర శతలశ్చతుః - చతుః - నాలుగు చరణాలకున్ను చత్వారింశోత్తర శతలః - నూట నలభై లఘువులనుట. ప్రసన్నవద్యుతా సమా - ప్రసన్న వతి అనేపేరు గలిగిన ఆటవెలఁది గీతితో కూడినదై, సమా - సమసీస మనిపించును. చతుఃపంచాధికో లః విషమజాతిరిత్యాహ - నూట నలభై లఘువుల మీఁద నాలుగైదు లఘువులెక్కువైనది విషమ సీసమనిపించు కొనును. ఈ సీసముపేళ్లు జాతులనిన్ని మహర్షిః సీసావదేతి - సీసములని మహర్షులు పలుకుదురు. విరాట్ఛందోభవేతి - ఈ సీసములు విరాట్ఛందో

---

304. *అ. ల. అంక 37. అక్షరముల 'లయహారి' పరిగ్రహింపఁబడలేదు. చూ. పీఠిక.

¹ ఛందస్ + ఉద్భవము = ఛందోద్భవము అని కాఁజాలదు. ఛందోభవమనుట సాధురూపము.

ధృవములు, నాగ కల త్రపు మనో జ్ఞావళి భేదాః పంచాశత్ - ఈ సీసములు 'నాగ' అనిన్ని 'కల' అనిన్ని 'త్రపు' అనిన్ని 'మనోజ్ఞ' అనిన్ని 'అవళి' యనిన్నియు అయిదు భేదములు. ఈ అయిదున్ను ఒక్కొక్కటి పదేసి భేదములై యేఁబది సీసంబులయ్యెను. ఇది సీసజాత్యధికారము. 305

౩౦౬ నందు గీతా నిర్ణయము

గభస్తిత్రిః ద్వేంద్ర పంచార్కార్ధా ద్ర్యర్ణ విచ్ఛేదః షట్ సమానటీ ప్రసన్నపదాహంసేంద్ర గభస్త్యేక ద్వౌ ద్వౌ ఖుభ్రగీతా సీసాన్వితా కేచిద్గాగ [య]తిః పవళిః ఇంద్రాదిత్య గణైక్యతాః మనోజ్ఞాయుతేతి బ్రహ్మ వాచినో గీయతాం గీతాభవన్తి.

టీక ॥ జగత్త్రిద్వేంద్ర పంచార్కార్ధాద్ర్యర్ణ విచ్ఛేదషట్.

సమానటీ ప్రసన్నపదా - 'ప్రసన్నది' అనే పేరు.

గలిగిన సమగీతికి 'నటి' అనే పేరుగలదు. కావున నటి యనఁగా తెలుఁగున ఆటవెలఁది గీతియనుట. ఆగీతికి గభస్తి త్రిః - సూర్యగణములు ౩న్ను, ద్వేంద్ర - ఇంద్ర గణములు ౨న్ను, పంచార్కార్ధా - సూర్యగణములు ౫న్ను కూడా పద్యార్ధానకు అనఁగా రెండు చరణముల కనుట. మొదటి చరణానకు సూర్యగణములు ౩, ఇంద్రగణములు ౨న్ను, రెండో చరణానకు ౫ సూర్యగణములనుట. అద్ర్యర్ణ విచ్ఛేదః - అంటేను ఏడో అక్షరం యతి యనుట. మూఁడవ గణము మీఁద నాలుగో గణము మొదలి వర్ణము యతి గనుక అద్ర్యర్ణ విచ్ఛేదః అన్నాఁడు. సూర్యగణములు నగణ హగణములు రెంటిలో హగణమే శాస్త్ర సమ్మతమనుట. ఈ ప్రసన్నపది అనేది గీతిక - షట్ - ఆఱు భేదములని తెలియఁదగినది. హంసేంద్ర గభస్త్యేక ద్వౌ ద్వౌ ఖుభ్రగీతా సీసాన్వితా కేచిద్గా గ [య]తిః పవళిః - పవళి యనే గీతిక, ఖుభ్రగీతా - ఖుభ్రగీత అనేపేరు గలుగుట చేతను తెనుఁగున తేటగీతి యనఁబడెను. సీసాన్వితా కేచిత్ - ఈ పవళి యనే గీతికి, కేచిత్ - కొన్ని మతముల సీసంతో కూడునమట. ఆ పవళి గీతికి హంసేంద్ర గభస్త్యేక ద్వౌ ద్వౌ - షణ్ణవ - సూర్యగణములు ఏక -

ఒకటిన్ని, ఇంద్ర - ఇంద్రగణములు, ద్వౌ - రెండున్ను, గభస్తి - సూర్య గణములు, ద్వౌ - రెండున్ను కూడ ౫ గణములు చరణమున కనుట. గాగ [య]తి - గా మూఁడు గురువులు, అఙ లఘువులు గనుక ఏడో అక్షరము యతి యగుననుట. ఏడు గురువు లనఁగా సూర్యగణానికి మూఁడు లఘు వులున్ను, ఇంద్రగణములు ౨కిన్ని ౧౦ లఘువులుకూడ ౧౩ లఘువు లాయెఁ గనుక రెండు లఘువులు ౧ గురువు గనుక ౧౩ లఘువులు ౬ గురువులు గనుక తక్కిన ౧౪ లఘువుల యతి విలుపవలెను గావున "గాగయతిః" అన్నాఁడు. గ - అంటే గురువున్ను, అగ - అంటే ఏడనుట. ఇంద్రగణములలో నగ, నల ర గణ, త గణములు అయిదేని లఘువులు గలవి గనుక సీ గీతికి ఈ శాస్త్ర పద్ధతి సంకేతము. ఇంద్రగణ ములే కూర్చవలెను. ఇంద్రాదిత్య గణైక్యతాః మనోజ్ఞాయుతేతి బ్రహ్మ వాదినో గీయతాం గీతా భవంతి - సీస గీతులయందు వచ్చే గణములు సూర్యేంద్ర గణములు వినాగా మఱి యితర గణములు రావు గనుక యీ సంబంధమున గీతుల యందు వచ్చే గణములు సూర్యేంద్ర గణములు. మనోజ్ఞాయుతేతి. 'మనోజ్ఞ' అనే గీతి సీస భేదము గనుక సీసపద్యముల తోనే గీతులు గూర్చవలె ననుట. బ్రహ్మ వాదినః - వేదాంత వేత్తల చేత, గీయతాం - పలుకఁబడినది గనుక, గీతా భవన్తి - గీతమనే పేరు గలిగినది. ఈ సీస గీతులకు మాత్రలతోఁగూడిన నియమములున్నవి. గనుక నివి మాత్రా సమక నిబద్ధములయిన జాతి భేదములని జ్ఞాపకము చేయుట. కాఁబట్టి వృత్త గీత కంద సీసములకు ననయతులనే వాక్యముచేత, పా - యేదిం టనే యతి సిద్ధమగుననుట. ఇవి సీస గీత లక్షణ ప్రకారములు. 306

## గీతులు

తే. రవులు మూఁ(డి)౦ద్ర యుగ భాస్కర శర గణము
లెన్న [1]గిరి వర్ణయతులు ప్రసన్న పదికి
[2]శరిగురుల వడియొక దివాకరుఁడు విం(ద్రు
లిరుగు లిను లిర్వురై వవడినగుఁ గృష్ణ! 307

---

307. [1] ఈ [2]ఈ గిరివర్ణ, శరి గురులు " - ఇందు పి.ని యర్థము దురూహము.

వ. ఆటవెలఁది గీతము ప్రసన్నపది, నటి యనఁబడును. తేటగీతియె పవడి, శుభ్రగీతి యనఁబడును. ఇవి గీత సీస జాత్యధికార లక్షణములు. 308

సీసక్రమము

వరకవి వెంకటరామన్నగారి లక్షణమునను —

సీ. దివిజేంద్ర షట్కంబు రవి యుగ్మమును గూడి
యష్టగణంబు *లొక్కర్తు కమరు
నలుపదంబులు నూట [1]నలువది మాత్రలై
యలరారు నాలుగై దళితమైన
లేకున్న(ను) [2]సమాంఘ్రి గాకున్న విషమమౌ
యతి సప్తగణముల నతిశయిల్లు
రెండో గణంబుపై నుండుఁ బ్రాసము తుద
పసిడి నాఁగఁ బ్రసన్నవదియు నాఁగ

తే. తెలుఁగు గీతుల నొకటున్న సీసమగును
జాతులగు సీసములు [3]విరాట్ఛందజనిత
భేదముల నేఁబదై యొప్పు విషమ సీస
మవని నృపతికిఁ జెప్పరాదహిగిరీశ ! 309

వ. అన్నారిది విషమసీస జాత్యధికారము.

మఱియు నందు గీతుల లక్షణము లవధరింపుము. విరాట్ఛందోద్భవంబులగు ప్రసన్నపది, నటి యని ఆటవెలఁది రెండుపేరుల విలసిల్లు. పవళి, శుభ్రగీతి అని రెండుపేర్ల తగు తేటగీతివ్ని; యీ రెండు గీతులను తద్భేదంబులేక విధంబులం గూడి గీతులు తొమ్మిది భేదంబులఁ బ్రవర్తింతు వవియెయ్యవి యంటేవి. సమగీతి ద్వయంబును, విషమగీతి

309. *యతి భంగము.

309. [1] నలుబది (అ. శి. వ్రాఁతప్రతి). [2] సమమాంఘ్రి (అ. శి. వ్రాఁత ప్రతి. [3] 'ఛందోజనిత' అను పాఠమునకు గ్రహించిన గణభంగమగును.

త్రయంబును, ఆర్యాగీతి చతుష్కంబును అని యిట్లు గీతులు తొమ్మిది రీతుల విలసిల్లు; నవి యెయ్యవి యంటేని ఆటవెలఁదియు, తేటగీతియు నానివి సమగీతిద్వయంబునఁ దనరు; మఱియు ఎత్తుగీతియు, పవడ గీతియు, మలయగీతియున నివి విషమగీతిత్రయంబన వెలయు; వెండియు గీతియు, ఉపగీతియు, ఉద్గీతియు, ఆర్యాగీతియునన నివి ఆర్యా గీతి చతుష్టయంబనఁ బరఁగును. ఇట్టి గీతులు తొమ్మిది విధమ్ములఁ బ్రసిద్ధంబులయ్యెం గావున నట్టి గీతుల రీతులు క్రమంబునఁ దేటి చేసెద; నందు సమగీతులగు ఆటవెలఁది తేటగీతు లన్నింటికిన్ని అర్ధ అర్ధంబున లక్షణంబును లక్ష్యంబును గానుపింప వివరించెద నవధరింపుము. 310

[సమగీతి ద్వయ లక్షణము]

గీ. *రవి గణత్రితయము దివపతి ద్వయమును
నర్కులైదుగు రగు నాటవెలఁది
కినునిపై విద్విఱింద్రులు విరువురినులు
తేటగీతికి వడిమూఁటఁ దెలియఁ గృష్ణ! 311

వ. ఇది సమగీతి ద్వయ లక్షణము. ఇఁక నందు, 312

విషమగీతిత్రయ లక్షణము. ఆ విషమగీతి త్రయంబునందు మొదలి

ఎత్తుగీతి లక్షణము

యతి రెంటఁ బ్రాస - ముమరు
శతమన్యు [1]గణము - జలజ
హితులిర్వుర విధ - విటులం
కృతి నెత్తుగీతి - కృష్ణ! 313

---

311. *ఇందు పూర్వార్ధము ఆటవెలఁది. ఉత్తరార్ధము తేటగీతి. కాన నిది గీతద్వయ సమ్మేళనము.

313. [1] గణోర్ధ్వ (ల. శి. వ్రాఁతప్రతి) ఈ పాఠమును గ్రహించిన గణభంగము.

[ఎత్తుగీతి - 1 ఇం + 2 సూ ; రెండు గణములపై యతి; ఇట్లు నాలుగు పాదాలు].

అందు పవడగీతియు, మలయగీతియు నను నీ విషమ గీతులు రెండిటికిన్ని అర్థార్థంబున లక్షణంబును, లక్ష్యంబును -

ఆ. అటవెలఁది పదము - లందుఁ బ్రాసములు న
ప్పాట నిలుపనదియె - పవడగీతి.
నగణ యుగళ మొకటి - నలయుగమిడ పదు
లదరు గతుల మలయ - మలరుఁ గృతులహరి! 314

[ప్రాస సహితమైన ఆఁటవెలఁది పవడగీతి.

మలయగీతి - 3 నగణములు + 2 నలలు. మూఁటిపై యతి. ప్రాస నిర్బంధము లేదు. ఈ గీతి యితరచ్ఛందములలోఁ జెప్పఁబడలేదు.

విషమగీతి త్రయమున నితర లాక్షణికులు 'మేలనగీతి'ని జెప్పిరి. శిరోమణికారుఁ దద్దానిని సంగ్రహింపఁ డయ్యెను. మేలనగీతి మారు మలయగీతిని చెప్పఁగా వలయు].

వ. ఇది విషమగీతిత్రయ విధమ్ము. ఇఁక నందు. 315

## ఆర్యాగీతి చతుష్టయరీతులందు, గీతి లక్షణము

తగఁబథ్యార్యా పూర్వా
ర్థగరిమ రెండర్ధములను దారంతి
ల్లఁగఁ జెప్పిన గీతియ నా
ఁగఁదిందగుఁ గృతుల నిదియె శార్ఙ్గధరా! 316

[పథ్యార్య పూర్వార్ధ లక్షణమే పూర్వోత్తరార్ధములందుఁ గలిగినది గీతి. ఇందు పథ్యార్యాపూర్వార్ధ లక్షణ ప్రకారము 6 వ. గణము నలము జగణములలో నొక్కటిగా నుండును].

అందు ఉపగీతి లక్షణము

తగఁబథ్యార్యా వరమా
ర్ధ గణన రెండరల రారంజి
ల్లఁగఁ జెప్పిన నుపగీతియ
నఁగఁ బరఁగుఁ గృష్ణ! నలినాక్ష! 317

[పథ్యార్య ఉత్తరార్ధ లక్షణమే పూర్వోత్తరార్ధములందుఁ గలిగినది ఉప
గీతి. ఇందు 6 వ. గణ మేకలఘువు మాత్రమే].

అందు ఉద్గీతి లక్షణము

మొదలి(టి) పథ్యార్యార్ధము
తుద తుదయర మొదట దొరపినచో
నదియుద్గీతియ నాఁదగు
యదుకుల [1]జల (నిధి సుధాంశు) హరికృష్ణా! 318

[పథ్యార్యాపూరార్ధమునను గలది ఉద్గీతి].

అందు ఆర్యగీతి లక్షణము

క. మొదటరసైఁ దుద యరసై
వదలక నొక్కొక్క గురువు వాలాయము(గా)
గదియించి పద్యమడఁచిన
నది యార్యాగీతి కంద [మగు] హరి కృష్ణా! 319

[రెండు సగములందును పథ్యార్యపూర్వార్ధ లక్షణము కలిగి తుదనొక
గురువధికముగాఁ గలది యార్యాగీతి. ఇదియే తెలుఁగు సహజకంద
మగును].

వ. ఇది ఆర్యాగీతిచతుష్టయ లక్షణ లక్ష్యము; లిది గీతి జాత్యధికారము.
ఇఁక నందు. 320

---

318. [1] జలధి సుధాకర (అ. కి. వ్రాఁతప్రతి).

## సీస లక్షణములు

వ. అందు విరాట్ఛందోద్భవంబులైన ఉపరివృత్తములందు ఋగ్వేద బ్రాహ్మణమున గీత సీస విధమ్ముల లక్షణములు తేఁటఁజేసియుండు నందు సీసమ్ము లేదింటికి నాంధ్రకృతులందు సీసములు ద్వాదశవిధమ్ములఁ దెలుఁగు నవియెయ్యవి యనిన తల్లక్షణంబులును లక్ష్యంబులును దేటఁ జేసెద నవధరింపుము. 321

క. సురపతి గణషట్కంబును
బరువడి రవి గణయుగంబుఁ బదపదము(న) కే
కరణిఁ దుదగీతి కృతులన్
బరఁగన్ రచియింప సీసపద్యము కృష్ణా! 322

[సీసమునకుఁ బ్రతిపాదమున 620 + 2 సూ. గణములుండును. ఇట్టి నాలుగు పాదములఁ దుద గీతియొకటి (ఆటవెలఁది, తేటగీతి) చేర్పవలయును. పాదముయొక్క రెండు ఖండములందు రెండేసి గణములపైఁ బ్రత్యేక యతులుండును. యతిగాని, ప్రాస యతిగాని చెల్లును. పాదాది ప్రాస నియతి లేదు ]

అట్టి ద్వాదశవిధ సీసము లెవ్వియంటేని,

సీ. దైత్యసంహార! వృత్త ప్రాస సీసంబు,
సర్వతః ప్రాససీసంబు, సర్వ
సమసీస, మవకలి సమసీస, మవకలి
వడిసీస. మవకలిప్రాస సీస,
మురు సర్వలఘు సీస, ముత్సాహ వేదండ
విషమ సీసంబు, భువి సమనామ
ప్రాససీసము, సమసీసంబు, గీత ర
హిత [1]చతుష్ప్రాస సహిత సుసీస

---

323 [1] చతుఃప్రాస. (అ. శి. బ్రాఁత ప్రతి).

తే. ము, వది సీసంబు నా ద్వాదశవిధ సీస
ములను రంజిల్లఁ గృతులందు మోదమలర
వాటి వాటికి వేర్వేఱఁ దేట పేతు
తగ నుదాహరణంబు లందముగఁ గృష్ణ! 323

వ. అందు క్రమంబున, 324

(i) వృత్త్యప్రాస సీస లక్షణము

సీ. శ్రీ క్షేమ శుభనామ, సింధు బంధన రామ,
జితదానవస్తోమ, శిష్టనామ,
రాక్షసకులనాశ, రాజిత భువనేశ,
రవికోటి సంకాశ, రహితపాశ,
పక్షిరాజ తురంగ, పావన రుచిరాంగ,
భరిత కృపాపాంగ, భవ విభంగ,
దాక్షాయణీస్తోత్ర, ధరణీ వరకళత్ర,
తతధర్మ చారిత్ర, ధవళనేత్ర,

తే. పంచశరవేష, సంతత భక్తపోష,
దనరు ప్రాసమ్ము నాల్గు పాదముల విటులఁ
జేరవిడిన వృత్త్యప్రాస సీసమనఁగఁ
బరఁగు జయశీల బాలగోపాలకృష్ణ! 325

[సీసము పెద్దపాదముల నాల్గింట నాదికో వృత్తమునకు వలెఁ బ్రాసము గలది వృత్త్యప్రాససీసము].

అందు (ii) సర్వతిప్రాస సీసము

సీ. నిరుపమ చారిత్ర, నరపిశదళనేత్ర,
పురహరసన్మిత్ర, తరణిగోత్ర,
శతనిధిబంధన, శరణాగతత్రాణ,
విరతభక్తాధీన, గరుడగమన,

వరకౌస్తుభ విభూష, పరిచితాశ్రిత పోష,
    పరమాత్మదశవేష, పరమపురుష,
పురుహూత వందిత, పురుషోత్తమ ఖ్యాత,
    ధరణీసుతానేత, సురసమేత,

తే. విరచితావర కిన్నర గరుడ ఖచర (?)
నరవరావన! యిట్లన్ని చరణములను
జరపఁదగు సర్వతః ప్రాసనరన సీస
మరయ జయకృష్ణ, కంస సంహరణ కృష్ణ! 326

[గీత సహితముగ సీసము నన్ని పాదములయందుఁ బ్రాసయతి నియమము గల సీసము సర్వతః ప్రాససీసము. ఇందు 24 చోటులం దొకటే ప్రాసాక్షరము.]

అందు (iii) గీతరహిత చతుష్ప్రాస సీసము

సీ. శతపత్త్రి దళనేత్ర, శతపత్ర హితగోత్ర,
    శతపత్త్రి భవపుత్ర, తతచరిత్ర,
దశరథనందన, దశవరస్యందన,
    దశకంఠఖండన, కుశధిశయన,
శతకోటి రవితేజ, శ్రితకోటి సురభూజ,
    తతరూపరతిరాజ, నతబిడౌజ,
విహిత చతుష్ప్రాస సహిత చరణగీత
    రహిత సీసమ్మిది మహిని గృష్ణ! 327

[గీతములేని సీసము గీతరహిత చతుష్ప్రాస సీసము. ఇందు సీసము పెద్దపాదములు నాల్గుమాత్రముండును. మఱియందుఁ బ్రతిపాదములో నేర్వేఱ నేకప్రాస నియతి గలదు.]

---

326. (?) అర్థము దురూహ్యము.

అందు (iv) సర్వవడి సీసము

సీ॥ కమలామనోహర, కనకాద్రిసమధీర,
కారుణ్యరసపూర, [1]కంసహార,
కలితమేఘశరీర, కర్పూరలయకార,
కౌస్తుభమణిధర, కలుషదూర,
కమలాసనాధార, కంజాప్తకులవర,
కనకాక్షసంహార, కదనశూర,
కంధినద్గంభీర, కమనీయగుణహార,
కంబుకంధర, త్రిలోకైకవీర,

తే. కమలలోచన, యదువీర, కాంతిసార,
కపటనాటక సంచార, కవులు [2]దనర
కవిత లిట్లన్ని పదములకడల [3](వడులు)
గలుగ వడిసీసమగు శుభాకార కృష్ణ! 328

[సర్వత్ర ఏకాక్షర వడినియతిగలది సర్వవడి సీసము.]

అందు (v) ఉత్సాహ వేదండవిషమసీసము

శ్రీహరీ రమాంక! హనలుఁజెల్లు నేశు నొకగురుఁడా
మోహనాంగ! పదపదమున మునముతో నిరంతరో
త్సాహ విరతి నాలుగింటఁ జనునిడంగఁ దనరును
త్సాహమనఁగ రుక్మిణీశ చక్రపాణి పాహిగో

ఆ. పాలబాల (శౌరి) ప్రౌఢకవుల్ దుదం
దాటవెలఁది గీతమమర నిలుప
నుర్వియందుఁ గృతుల నుత్సాహవేదంత
విషమసీసమనఁగ వెలయుఁ గృష్ణ! 329

---

328. [1]కంసకహార (శా), [2]తనరు=సంతసించు, [3]పడగ (ఆ. శి. ప్రాఁశ ప్రతి).

[ఉత్సాహపై గీతముచేర్చి వ్రాసినది ఉత్సాహవేదంత సీసము. ఇందు సీసము పెద్దపాదములకుమాఱు ఉత్సాహపద్యపాదములు నాలుగుండును.]

అందు (vi) అర్ధసమసీసము

సీ. కమలామనోహర, కనకాద్రి సమధీర,
కారుణ్య రసపూర, కంసకహర,
కలితమేఘశరీర, కర్పూరలయకర,
కౌస్తుభమణిధర, కలుషదూర,
నిరుపమచారిత్ర, సరసిజదళనేత్ర,
పురుహూత సన్మిత్ర, తరణిగోత్ర,
శరవిధి బంధన, శరణాగతత్రాణ,
విరతభ స్త్రాధీన, గరుడగమన,

గీ. *కమలనయన, మోక్షకారణ యీరీతిఁ
జెలఁగి కృతుల విదిత సీసగీతు
లర్ధమొకటందు నర్ధమొక్కందు ననుప
నవియ దా యర్ధసమసీసమగును గృష్ణ! 330

[సీసము తొలిరెండు పాదముల యతి, మలిరెండు పాదముల ప్రాసయతి నియమము, మఱియు నెత్తుగీతియందుఁ బూర్వార్ధమున ఆటవెలఁది, ఉత్తరార్ధమున తేటగీతి లక్షణముగలది అర్ధసమసీసము.]

అందు (vii) సర్వలఘుసీసము

సీ. వనచర కమఠ కిటి నరహరి వటు ద
శశతకరమథన దశరథసుత
హలధర జినముని హయతమధర, తర
ణి శశినయన, జలధిశయన, హరి

---

330. *ఇందు పూర్వార్ధమున ఆటవెలఁది. ఉత్తరార్ధము తేటగీతి. ఇది ఉభయగీతి సమ్మేళనము.

శుచి తరణి జరజని చర వరుణపవ
 న నవనిధిప గిరిశనుతచరణ,
నగధర, మదనజనక, యదుకులతిల
 క, మురదనుజహర, గరుడగమన,

తే. వరవితరణ, కరివరద, పరమపురుష,
కపట నటన విహరణ, సకనకపట, వి
లసిత గుణగణ, జలజ సదృశముఖ (యిది)
సకల లఘుగతికృతిఁ జను జగతివిహరి! 331

[గీతసహితముగ సీసపాదములన్నియు లఘువులతోఁ గూర్పఁబడినది సర్వలఘుసీసము.]

అందు (viii), (ix) సమసీస, అవకలిసమసీసము

రెంటికిన్ని భీమనగారు [కవిజనాశ్రయము. జాతి. 15.]

సీ. పాదముల్ నాలుగు పాదముల్గాఁజేసి
 మొదటి మూఁటను లోకవిదితమైన
నలనామ గణములు నిలవిరుమూరిడి
 మానుగాఁ దక్కిన వానియందు
నగణముల్ రెండిడి తగఁగూడ పాదముల్
 నాలుగు విప్పాట లీలనిలిపి
సమసీసములు చెప్పఁడమరంగ రెంటికిఁ
 బ్రాసముల్ వేఱుగాఁ జేసియొనర

గీ. సలలితమ్ముగాఁగ విలసత్పదంబుల
[1]రసికమైన రచన లెసఁగి యుండఁ

332. [1]రసికమైనరేచ! యొసఁగియుండు
కవిజనాశ్రయాంతఁ దశకవి సమసీస
పాటికిదియె కృతులఁ దేటపడఁగ. (అ. కి. ప్రాఁతప్రతి).

గవిజనాశ్రయాంకుఁ దవకలిసిన మి
ప్పాటఁజెప్పఁ బనిచెఁ దేటపడఁగ. 332

[సామాన్య సీసము సమసీసము.
అన్నిచోట్లనుఁ బ్రాసయతి నియమముగలది అవకలివసమసీసము.]

అందు (x) సమనామప్రాసనీసము

అనంతన్నగారు. [ఛందోదర్పణము. 3-27]

సీ. భామిని చేనున్న పట్టు [1]తోరము చూచి
ప్రల్లదమ్మునఁ దెంచి పాఱవైవ
నామహాద్రోహ మత్యంతమై కనుపట్ట
యతిదరిద్రునిఁ జేయ నార్తినొంది
భూమి వెల్వడి పోయి పురపురఁ బొక్కుచు
పుండరీకాక్ష యో భువనవంద్య
స్వామి! నాయపరాధశతసహస్రంబులు
పైరింపవే కృపా జలధియనుచు

ఆ. ప్రేముడించు కౌండిన్యుని భీతిఁబాపి
పృథుల సౌఖ్యంబు లొసఁగు గాంభీర్యమమర
పాముపైఁ బవ్వడించిన ప్రభుఁడవనినఁ
బ్రాససీసంబు విలసిల్లుఁ బద్మనాభ! 333

[సీసము నాల్గు పెద్దపాదములలోను గీతి బేసి పాదములలోను నేకప్రాసాక్షరముగలది పమనామసీసము.]

అందు (xi) *అవకలిప్రాసనీసము

[ఛందోదర్పణము. 3.30]

సీ. ఉరగతల్పునిఁగాని యుల్లంబులోఁగొల్వ
శరధియల్లునిఁగాని సంస్మరింప

333. [1]దారము (అ. శే. వ్రాఁతప్రతి).
* "అక్కిలి" అని అనంతుఁడు.

మురఘస్మరునిఁగాని మ్రొక్కఁల గుడిచేయ
నరమృగేంద్రునిఁగాని నమ్మికొల్వ
గరుడవాహను పేరెగాని వీనులఁ జొన్పఁ
బురుషోత్తమునిగాని పూజసేయ
హరిప్రసాదమెకాని యర్థిఁగైకొన నొల్లఁ
బరమాత్ము పనిఁగాని భక్తిఁబూన

తే. ధరణి నివియెల్ల నియతవర్తనములనుచుఁ
బరఁగు వ్రతిఁగాని నీవు చేపట్టవనిన
జరగు నవకలి ప్రాససీసంబు కృతుల
పరభృతాతపి పుష్పాభ! పద్మనాభ! 334

[సీసపాదముల రెండు ఖండములలోను గీతి నాల్గుపాదములలోను అనఁగా 12 చోట్ల నొకచే ప్రాసాక్షరముగలది అవకలిప్రాససీసము.]

అందు (xii) అవకలివడిసీసము

[ఛందోదర్పణము. 3-32]

సీ. పద్మాక్షి! యీతఁడే బలి రసాతలమేలు
మని పంపనేర్చిన యధిక బలుఁడు
హరిణాక్షి! యీతఁడే యల విభీషణు లంక
పట్టంబుగట్టిన బల్లిదుండు
తొయ్యలి! యీతఁడే ధ్రువుని మున్నతపదం
బునఁ బ్రతిష్ఠించిన భూరి యశుఁడు
[1]ధవళాక్షి! యీతఁడే ధనువుద్రుంచిన యట్టి
రఘువంశ తిలకుండు రాఘవుండు

తే. బాణబాహావిఖండన ప్రౌఢుఁ డితఁడు
వీలగళసు ప్తికరబాణ విపుణుఁ డితఁడు

335. [1]తగ = మర్త్యస్వర్గపాతాళలోకంబులు. నితఁడిచ్చిన శ్లేశ్వఁ డీయనో [illegible]
(అ. శి. ప్రాఁతప్రతి).

ననుచు నవకలివడి *సీనము నను వేల్పు
పదఁతులు నుతింతురౌ విన్నుఁ బద్మనాభ! 335

[అన్నిచోట్లను వడినియమముగలది అవకలివడిసీసము.]

వ. ఇది సీసజాత్యధికారము. మఱియు నందు ద్విపద లక్షణములు వివరించెద
నందు ద్విపదలు నాల్గురీతుల విలసిల్లు నవి యెయ్యవి యంటేని షట్పదము,
త్రిపదము [ద్విపదము], ఏకపదమంజరీ ద్విపదయు నన నాల్గురీతుల వర్తిల్లు
నందు క్రమంబున — 336

## షట్పద లక్షణము

వాసవులార్గురి
పై [సుధాంశుఁ] డొకండు
[చేసిన] యర్ధపదంబునకు
ప్రాసమ్ములొందు రెం
డేసి గణమ్ముల
భాసిల్లు షట్పదనా శ్రీకృష్ణ! 337

[6 ఇంద్రగణములు + 1 చంద్రగణము గలది సగము షట్పది పద్యము. ఈ 7 గణములు, 3 పాదములుగఁ గూర్పఁబడును. 1, 2, 4, 5 పాదములలో రెండేసి ఇంద్రగణములుండును. 3, 6 పాదములలో 2 ఇంద్రగణములపై నొకచంద్రగణముండును. మొత్తము పాదము లాఱు. ఈ ఆఱింటికి ప్రాసముగలదు. దీనికి యతిలేదు.]

అందు *త్రిపద లక్షణము

1. సరవి మొదల పురం - దర గణములు నాల్గు
పరఁగ రెండవ మూరు పదము
ల రచియింపఁదగు నింద్రులిరు

335. *సీసమమర. (ఛం. ద.)

*త్రిపద లక్ష్యమును లక్షణకర్త త్రిపద త్రితయమున సమకూర్చెను.

2. వురు రవియొక్క - రుం - డిరవుగా నొక్కొక
చరణంబునకును బ్రాసములు
జరుగువడుల్ లేకకృతులు,

3. మొదలి పదమునకుఁ - గుదురుపవలె రెండు
మదమునఁ బ్రాసము లిలఁ
గదియింపఁ ద్రిపద శ్రీకృష్ణ! 338

[త్రిపదమునకు మూఁడు పాదములు. ఇందలి గణము లిట్లుండును:
పా. 1 — 4 ఇంద్రగణములు. రెంటిపై ప్రాసయతి.
పా. 2, 3 — 2 ఇంద్రగణములు + 1 సూర్యగణము. యతిలేదు.
దీనికి పాదాది ప్రాసగలదు.]

అందు ద్విపద లక్షణము

శ్రీవేంకటేశ ల - క్ష్మీహృదయేశ
దేవకీనందన - దేవాధిదేవ
లలితమై నవరసా - లంకారముగను
జలజాక్ష యొక్కొక్క - చరణంబునకుఁ బ
రందరుల్ ముప్వురు - రవి గణంబొకటి
పందర్పముగను బ్రా - సంబులు రెండు
పదములఁ గల్గ ద్వి - పదనామ మొకటి
విదితముగా జగద్విఖ్యాత చరణ
చరణమ్ములందు వి శ్రమములు రెంటి
తెరఁ గొప్పవిడఁగఁదా ద్విపద శ్రీకృష్ణ! 339

[ద్విపదకు రెండేసి పాదములు. పాదమునకు 3 ఇంద్రగణములు + 1 సూర్యగణము. రెండు గణములపై యతి. ప్రాసకలదు.]

అందు ఏకపదమంజరీ ద్విపద లక్షణము

శ్రీ విలసిత వక్ష త్రిభువనాధ్యక్ష!
పారసద్గుణ హార! జగదేకవీర!

వానవుల్మువ్వురు వనజాప్తుఁడొకరుఁ
దొక్కొక్క పదమున నొనరి ద్వివిధమున
కవివరుల్ [1](వడి) రెండు గణములయందు
తగవిడిప్రాసముల్ దప్పించి కృతుల
నటు ప్రతిపదము క్రియాపదాంతముగ
నలరించి యందు నంత్యప్రాసమొంది
సమసంఖ్య పదముల జరుగు నీరీతి
దీపింప మంజరీ ద్విపదయై పరఁగె
బంధుర పదనిగుంఫనల రంజిల్లు
చరణమ్ములందుఁ బ్రాసమ్ములు విడవి
దొక్కటి తక్కగా నుర్వి (వి) ద్విపద
తిలకింప మంజరీ ద్విపద శ్రీకృష్ణ! 340

[ప్రాసములేని ద్విపద ఏకపదమంజరీ ద్విపద. ఏపాదమున కాపాదము విడివిడిగా నుండును.]

వ. ఇది ద్విపద జాత్యధికారము. ఇఁక నందు పదలక్షణము. మఱియు నందు చౌపదమ్ములు త్రివిధమ్ములై పరఁగు; నవియె మహానవమి పద్యమ్ములన వెలయు, నవియెయ్యవియంటేని శుద్ధచౌపదంబును, [1]కర్ణాట చౌపదంబును వితాళచౌపదంబును నాఁ ద్రివిధంబులయ్యె నందు క్రమంబున, 341

### శుద్ధచౌపద లక్షణము

నలగగభసల గణమ్ములఁ జెందుచు
నలలితముగ నొక చరణమునందుచు
విరమము రెంటను వెసఁ [1]బ్రాలొందుచు
ధరఁ జౌపదములఁ దగుఁ గృతులందుచు. 342

---

340. [1]వది (అ. శా. వ్రాఁత ప్రతి).

341. [1]కర్నాట - అని అ. శా. వ్రాఁత ప్రతి.

342. [1]ప్రాసమొందుచు - అను అ. శా. వ్రాఁత ప్రతి పాఠమును గ్రహించిన గణభంగమగును.

[శుద్ధచౌపదమునకుఁ బ్రతిపాదమున చతుర్మాత్రాగణములు (నల, గగ, భ, స) నాలుగుండును. రెంటిపై యతి. అంత్యానుప్రాసగలదు.]

అందు కర్ణాట చౌపద లక్షణము

జరుగు నగ నలల తల - నలభలరలొందుగా
దురితహర ! చరణంబు - తుదగగముఁజెందుగా
ధరఁబ్రాసములు ; (రెంటఁ) దగియతి [1]సహిష్ణా
వరఁగుఁ గర్ణాట చౌ - పదమిదియె కృష్ణా ! 343

[ప్రతిపాదమున పంచమాత్రాగణములు (నగ, నలల, తల, నల, భల, ర) మూఁటిపై రెండు గురువులుండును. రెంటిపై యతి.]

అందు విశాళి చౌపద లక్షణము

చిత్రకవి పెద్దనగారు [లక్షణసార సంగ్రహము. 2-122].
రవియుగము చతు - ర్లఘు గణయుగము
నవలను నొక లఘు - వై పదపదము
దవిలిన నదియె వి - శాళము క్రమము
జవరనొసు వి - భ్రమమీవిధము. 344

[విశాళ చౌపదమున పాదమునకు 2 సూర్యగణములు + 2 చతుర్మాత్రాగణములు + 1 లఘువుండును. 8 మాత్రలపై యతి.]

వ. ఇది చౌపదాధికారము. 345

ఇఁకనందు మంజరీ లక్షణము

వ. మంజరులు రెండువిధములై పరఁగు, నవి యెయ్యవి యంటేని శుద్ధ మంజరియు, కలియుగమంజరియు నాఁగ రెండు విధములై వెలయు, నందు — 346

---

343. [1]సహిష్ణా - అని యుండదగెను. అప్పుడది యానుప్రాసనియతిభంగము.

## శుద్ధమంజరీ లక్షణము

శ్రీ యదుకుల వర - సింధు సుధాకర!
మాయా మృగహర! - మందర గిరిధర!
[1]గగనల భ స జ ల - గణములు నాల్గిడఁ
దగుప్రాసములు వ - దమ్ముల నలవడ
చతుర [2](గతిఁగ) వి - శ్రమములు రెంటను
వితత దయాంబుధి - వెలయును జంటను
రంజిలు మంజరి - [3]పక్షవిపక్ష
కంజదళాక్ష స - కౌస్తుభవక్ష! 347

[శుద్ధమంజరి యందు పాదపాదమునకు చతుర్మాత్రాగణములు (గగ, నల, భ, స. జ) నాలుగుండును. రెంటిపై యతి. రెండు పాదముల కేకప్రాస, లక్ష్యమున నంత్యానుప్రాస గలదు.]

అందు **కలియుగ మంజరీ లక్షణము**

శ్రీవల్లభ! రం - జిత వరకౌస్తుభ
ధామ! దయారస - ధామ! హసలు నల
గ గ స గ భ స ర జ - గణముల నొక్కొక
చరణం బందుమ - జను నాల్గేనిడఁ
దనరు విశ్రమములు - దగు రెంటను గృతి
ప్రాసములు మనక - పరిపరి విధముల
ధరిత్రియందు మో - దంబుగఁ జెప్పిన
మలయును గలియుగ - మంజరి వృహరీ! 348

---

347. [1]గగ నగ భస నల గల నగణములనిడ (అ. శి. వ్రాఁతప్రతి).
[2]గణమ్ములు (అ. శి. వ్రాఁతప్రతి).
[3]రక్షోవిపక్ష - అనునది సాధురూపము. అట్లు గ్రహించిన నిందు గణభంగమగును.

[కలియుగమంజరి యందు గగ, నగ, భ, న, ర, జ అను గణములలో ప్రతిపాదమున నాలుగు గణములుండును. రెండు గణములపై యతి. దీనికి ప్రాసవియతి లేదు.]

వ. ఇది మంజరి లక్షణము. ఇఁక నందు, 349

రగడ జాత్యధికారము – రగడ లక్షణములు

వ. మఱియు నందు రగడలు వైతాళీయ భేదంబులఁ బెక్కురీతులు గల, వవి యెయ్యవి యంటేని - హయప్రచార రగడయు, తురగవల్గనంబను రగడయు, విజయమంగళయను రగడయు, ద్విరదగతి రగడయు, జయభద్ర రగడయు, మధురగతి రగడయు, హరిగతి రగడయు, వృషభగతి రగడయు, హరిణగతి రగడయు. వన రగడలు తొమ్మిది విధమ్ములఁ బ్రసిద్ధములై యుదాహరణాది చాటుప్రబంధంబులఁ బ్రవర్తిల్లు (చు) మందు నందు క్రమంబున — 350

[రెండేసి పాదములకు ఆదిప్రాసయు, నంత్యప్రాసయుఁ గలిగియుండుట రగడ సామాన్య లక్షణము.]

(i) హయప్రచార రగడ లక్షణము

సురవరేణ్య - సుజనమాన్య
విరత పుణ్య - విగమ గణ్య
పాహి గోప - బాల రూప
పాహి భగ్న - భర్గచాప
అమరు [1]రె(ంట) - యతుల ప్రతి ప
దమున నాల్గు - దనరు నగణ
హగణములు హ - యప్రచార
రగడ పొగడ - రచన మీఱ
భాసురముగఁ - బ్రాసమొందు
వాసుదేవ - వాటియందు

351. [1] రెట్టి. (అ. శ. బ్రాఁత ప్రతి.)

నటులఁబటు హ - యప్రచార
ఘటన పటిమ - కలుషదూర. 351

[ఇందు పాదమునకు 4 సూర్యగణములు (3 మాత్రల గణములు). 6 మాత్రలపై యతి.]

అందు (ii) తురగవల్గన రగడ లక్షణము

శరదనిభ శరీర! హనలు - జరగుఁ జరణ చరణములకు
విరతి శరధి సంఖ్యమీఁద - వెలయుఁబాద పాదమునకు
నా సురారి శౌరి కేశ - వాష్టగణ విరాజితంబు
ప్రాసముల్పదంబులందుఁ - బరఁగుఁ దురగ వల్గనంబు.

[హయప్రచారమునకు రెట్టింపు. అనఁగా 8 సూర్యగణములు; 4 గణములపై యతి.] 352

అందు (iii) విజయమంగళంబను రగడ లక్షణము

[1]శ్రీధరా (ధరా) ధరాబ్జ - చిత్రభాను నేత్రదేవ!
దేవరుక్మిణీ ధవాది - దేవసత్ప్రభావభవమ
రాధిపస్తవాంఘ్రి పీఠ - జాద్రి జాత పతిత లతిత -
యాహవోగ్ర జాగ్రదాసు - రాగ చక్రపాణిగోప;
రమణ తరణి హనగణములు - గ్రమతఁజెల్లు జలధియుగళ -
రధుల విరమణములు దగుతు - రంగవల్గన (ద్వయాప)
దముల నొక పదమ్ము నమ్మ - దమ్ము లిమ్ముగా విడంగఁ -
దనరు విజయ మంగళాళి - దానమొందుఁ గృతులయందు.

[తురగవల్గనమునకు రెట్టింపు. పాదమునకు 16 సూర్యగణములు. నాల్గేసి గణములపై మూఁడుచోట్ల యతులు.] 353

అందు (iv) ద్విరదగతి రగడ లక్షణము

శ్రీరమణ సుర శరణ - సేవింతు నీ చరణ
నీరేజముల రుక్మి - ణీధవ! కృపాభరణ

353. [1] ఇందు మొదటిపాదము ఏకాక్షరయతి నియతికి భంగము.

విరతి రెండిట దాపి - వెలయు యతినాగ్రేసి
చరణమున గణములిడఁ - జనుఁబ్రాసములు సల, ర,
త, న. గ, భల, నలల, ములఁ - దనరు నీ ద్విరదగతి
యనఁ బరఁగు రగడ కా - వ్యముల మృదురచనగతి. 354

(పాదమునకు పంచలఘు గణములు (సల, ర, త, నగ భల, నలల) నాల్గు. రెంటిపై యతి.]

అందు (v) జయభద్రరగడ లక్షణము

జయభద్ర రగడ (యది) - చను నలల, త, నగ. భల, -
నల. రగణముల నొక్క - చరణమునకె(న్మి) దతి
నియతి యతి రెండింట - నిలుచు నా ద్విరదగతి -
నెకవుగా [1]జంటింప - నెగడు జయభద్రగతి. 355

[ద్విరదగతి రెట్టింపు. పాదమునకు 8 పంచమాత్రాగణములుండును. రెండేసి గణములపై మూఁడుచోట్ల యతులు.]

అందు (vi) మధురగతి రగడ

సిరి యురమున రం - జిలు యదునందన
కరుణాకర వర - కంధి నిబంధన
నల, గగ, భ, సముల - నాలుగు ముదమున
చెలువదరఁగ నిడఁ - జెల్లొక పదమునఁ
జను పదములు ప్రా - సంబులు రెంటను
దనరు విరతి యం - దంబుగఁ జెప్పను
తిరముగ మధురగ - తిరగడ వినుతిగా
బరఁగుగా గనకాం - బర మధురగతిగా. 356

[చతుర్మాత్రాగణములు నాలుగు. రెంటిపై యతి. ఇందు గౌ, భ, స, నల గణముల వాడుదురు. జగణము లక్షణమున నిషిద్ధము.]

---

355. [1]జంటించు = కోడించు, కూర్చు.

అందు (vii) హరిగతిరగడ లక్షణము

శ్రీకాంతా హృదయాబ్జేందిందిర - చెలువగు నల, గగ, భ, న గణముల లో
కైకగుణాకర! వడినాల్గిటిపై - విరఁజెల్లొక్కొక పదమున కిలనెవి
మిది గణములు ప్రాసములొందును గా - మిత ఫలదాయక! రాధానాయక!
యదుకులభూషణ! క్రతుభుక్పోషణ! - హరిగతి రగడజగతి హరికృష్ణా!

[మధురగతి రెట్టింపు. అనఁగా నాలుగుమాత్రల గణము లెనిమిదుండును. 4 గణములపై యతి.] 357

అందు (viii) వృషభగతిరగడ లక్షణము

శ్రీరమాధవకృష్ణ! యాదవ - సింహగా భ న నలల దారిధి
సారెసారెకు వినగణముపైఁ - జనువిరంగను గణములెన్మిది
క్రమమునఁ తోడుతఁ బదపదమ్మునఁ - గలుగ విడి వడి నాల్గుగణముల
నమరఁజేసిన నొప్పు వృషగతి - నార్యులెన్నఁ గలటులఁ గృతులఁగా.

[1 సూర్యగణము + 1 చతుర్మాత్రాగణము. (వెరసి 7 మాత్రలు) ఇట్టి గణద్వయ మొకపాదమున నాలుగేసియుండును. అనఁగా పాదమున కెన్మిది గణములుండును. నాలుగు గణములమీఁద యతి.] 358

అందు (ix) *హరిణగతి రగడ

విషధి కన్యా! - వినుత సార్థమ
వృషభ గతిలో - వెలయు నర్థము
వినువితోడను - విర్వవిర్వరుఁ
దనరుఁ గ్రమమునఁ - దాము నత్వరు
పదపదమునకుఁ - బ్రాసమొందును
విదితయుగమున - విరతిఁ జెందును

* హరిణగతి గణములకు రెట్టింపు వృషభగతి రగడ. కాన హరిణగతి తరువాత వృషభగతిని చెప్పుట యుతరచ్ఛందో గ్రంథకర్తలు పాటించిన క్రమము.

న, ల, భ, స, గగ గ - ణములు చెల్వగు
సలలితమ్ముగ - జగతిఁ బొల్పగు
హరిణగతి కృతి - యందమై (హరి)
ధరణిఁదగు యా - దవ నృకేసరి. 359

[వృషభగతిలో సగము హరిణగతి. అనఁగా 1 సూర్యగణము + 1 చతుర్మాత్రాగణము చేరిన గణద్వయము పాదమునకు రెండేసి యుండును. రెండు గణములమీఁద యతి.]

వ. ఇది రగడ జాత్యధికారము. మఱియు, 360

రగడ చౌపద తాళభేదచాటుప్రబంధలక్షణము

సీ. ప్రబల హయప్రచారంబును దురగవ
ల్గనము విజయమంగళ రగడలవి
రూపకంబునఁ జెందు రూఢిచే మధురగ
తిరగడ [1] యెకతాళి దివిరి నడుచు
రహిమించఁ గాంచు ద్విరదగతి జయభద్ర
రగడలు ఝంప తాళమున మెలఁగు
హరిగతి రగడయు నటతాళమునఁ బొందు
వృషభ హరిణగతుల్ వెలయుఁ ద్రిపుట

తే. చౌపదమ్ములు మూరును ఝంపదరువు
మంజరులరెండు నెకతాళి మార్గమిటుల
భవ్యకావ్యాది చాటు ప్రబంధ యక్ష
గాన కృతులందు విడినను గవులగృష్ణ! 361

మఱియు పెద్దనగారు, [లక్షణసారసంగ్రహము. 2-141].

సీ. వృషభగతి త్రిపుటరే కంప్రియుగమగు
దుదనేడు లఘువులు తొలఁగఁజేయ

361. [1] 'ఎకతాళి, ఏకతాళి' అని ద్వైరూప్యము కలదు. 'ఏకతాళి' కి చూ. ప. 362.

ఝంపరేకునకు లక్షణము ద్విరదగతి
యగుఁగొన నొకలఘు వందుమాన
రచ్చరేకగును దురగవల్గనము గతి
మఱి యేకతాళియో మధురగతివి
అటతాళమున మాత్ర లంఘ్రి కిర్వదినాల్గు
నాల్గిట విరతి పద్మాలుగింట

తే. విలుదు నర్ధంబు నర్ధచంద్రికలు దీన
యక్షగానాది కృతులలో నార్యలెన్న
రగడ భేదంబులివి యౌను రమ్యచర్య!
యవిత విజదానసముదాయ! యాంజనేయ! 361

అందు మహానవమి పద్యలక్షణము

శ్రీధరచ్ఛందస్సున -

క. సురుచిరముగ ద్విరద (గతిఁజా)
జరణము వందొమ్మిదేసి సరసపుమాత్రల్
పరఁగిన డిండిమ వృత్తమె
యరయ మహానవమి పద్యమదియె ధరిత్రిఁజా. 363

[ద్విరదగతిచ్ఛాయలోఁ జరణమునకుఁ బందొమ్మిదేసి మాత్రలుగలది మహానవమి. ద్విరదగతికి 20 మాత్రలు.]

వ. ఇవి లక్షణములు. గణక సమనిబద్ధములుగాఁ జెప్పినారు. గనుక వీరీతి గణబద్ధములని చెప్పినవి యీ రగడలు పూర్వాదులఁగూడిన మాత్రాసమక నిబద్ధములని కవిరాక్షస యక్షగానాది కృతివిన్యాసములు చేసిరి గనుక ఆరీతివిన్న తెలిసేది అన్నారు. 364

ఇఁకనందు కందవృత్త సీసమాలిక లక్షణము

వ. మఱియు నందు కందమాలికయు, వృత్తమాలికయు, సీసమాలికయు త్రివిధమ్ములై వెలయు నీ మూఁటికివి లక్షణము. 365

[సీసమాలిక లక్షణము]

క. పది, పదిరెండును, బదునెని
మిది సీసములందు గీతిమితి సరిపదముల్
గుదురుపడగు నవి దితిసుత
మదగజ హర్యక్ష సీసమాలిక కృష్ణా! 366

[10, 12, 18. ఇంకను నిచ్చవచ్చినన్ని పాదములతో మాలికగా రచింపఁబడినది సీసమాలిక. పాదములు సరిసంఖ్యలో నుండవలెనను నియమము గలదు.]

మఱియు శతకతారావళి చాటుప్రబంధ సంధానాభిధాన లక్షణము -

ఆ. శశికరపుర శరగజ విధాత్ర సంఖ్యనం
జ్ఞలవి ముక్తక ద్వికత్రికములు
పంచరత్నము లనఁబరఁగు గజావళి
రత్నమాలికలన రామకృష్ణ! 367

తే. తరణి తారక పన్న శతాష్టయుతశ
తాఖ్య నామావళియనఁ దారావళియన
జరుగుఁ బంచశతాభిఖ్య శతకమనఁగ
నలరు నష్టోత్తర శతకమనఁగఁ గృష్ణ! 368

వ. మఱియు నుదాహరణంబును, చక్రవాళంబును, చతుర్భద్రికయు, రంగ ఘోషయు, త్యాగఘోషయు, భోగావళియు, గుణావళియు, బిరుదావళియు, నివి మొదలగు కృతులు కవి కల్పితములు. లక్ష్యములమ్మున విశదంబుగాఁ బ్రసిద్ధమ్ములై యుండు నవి యట్లుండె; వెండియునంచు, 369

ఉదాహరణ లక్షణము

పెద్దనగారు, [లక్షణసారసంగ్రహము. పుట 73. 2 వ ఆ.]

క. వీరావళి మొదలైనవి
యారయఁగాఁ గలవు పెక్కుదాహరణంబుల్

ధీరు[1]లివి దెలిపి సేతురు
సారాలంకార శాస్త్ర సరణిం ధరణిన్. 370

[లక్షణసారసంగ్రహము. 2 : 142-143]

సీ. సప్తవిభక్తులు సంబోధనంబునం
గలుగు నెన్మిది విభక్తులం గ్రమమున
బతిపేరితోం గూడం బద్యమొక్కొక్కటి
రచియించి రగడమార్గముల జాడం
గళికకు నెనిమిది దళములుగాం జెప్పి
తత్పదార్థమున నుత్కళికం జెప్పి
యడియు నేక సమాసమై యేళుదళముల
కొన విభక్త్యర్థంబు గనంగం జేసి

తే. దానికెనగాంగ నెన్మిదో దళముంగూర్చి
పద్యమొక్కటి సార్వవిభక్తికముగ
నందు తుదం గూర్ప నది యుదాహరణమగును
ధీర! యోయాంజనేయ! సుధీవిధేయ! 371

[ఉదాహరణమనంగా సంబుద్ధితోంగూడ నెన్మిది విభక్తులతో నెనిమిదేసి పద్యములును, రగడ భేదములగు కళికలును, ఉత్కళికలును గలుగునట్లు చెప్పంబడిన ప్రబంధభేదము.

దీని వివరణము - సంబోధనముతోంగలిపి యెన్మిది విభక్తులు గలవు. ప్రథమావిభక్తిక్రమమున నొక్కొక్క విభక్తి తుదిలో వచ్చునట్లు మొదట నొక పద్యము (వృత్తము) తరువాత రగడ ఛాయలో నెన్మిది పాదములుగల యొక కళికయుం, దదనంతరము కళిక పాదము సగము మాత్రాసంఖ్యలోం గూర్పంబడిన పాదము లెన్మిది గల యుత్కళికయు రచింపవలెను. ఇట్లే ప్రతివిభక్తికి మూండు పద్యములు వ్రాసి తర్వాత సార్వవిభక్తికమగు వృత్తమొకటియుం, దుదిలోం గవిపేరు, కృతిపేరు

370. [1] శెతింగి రచియింతురు. (అ. పా. సం.)

లేదా కృతిపతిపేరు దెల్పుపద్యము చేర్పవలెను. ఇట్లు వ్రాసిన, మొత్తము 26 పద్యములగును. ఇదియే మధురకవితాభేదమగు నుదాహరణకృతి.

— తె. భా. ఛం. పుట. 185]

సీ. అన్నియుత్కళికల నటు విభక్త్యాభాస
రాఁజేసి చెప్పిన రహివహింపుఁ
గాదేని షష్ఠి నుత్కళికనేవిఁ జతుర్థి
నేని రాఁజెప్పిన నెసఁగియుండుఁ
బ్రథను వీరావళి ప్రబల ద్వితీయఁ గీ
ర్తిమతిరా సుభగ తృతీయ నలర
మఱి చతుర్థికి భోగమాలివియును బంచ
మికి గళావతియు షష్ఠికివి గాంతి
ఆ. మఱియు సప్తమికిఁ గమలయును సంబోధ
నమునకు జయవతియు నమరఁగూర్ప
ఫల ముదాహరణ విభక్త్యధి దేవతల్
కరుణ నిడుదురయ్య కవికులార్య! 372

వ. అన్నాఁడు గాఁబట్టి యుదాహరణలక్షణ మిఁక నందు, 373

ఆర్యాప్రకార లక్షణము

అనంతనగారు, [ఛందోదర్పణము. 3.5]

ఆ. *నరవిఁ బథ్య, విపుల, చపలార్య, ముఖ, జఘ
నాఖ్యచపల లనఁగ నార్యలైదు. 374

పెద్దనగారు, [లక్షణసారసంగ్రహము. 2-73]

క. కవివర! పథ్యయు, విపులయుఁ,
జపలయు, ముఖచపల, జఘనచపల, లిప్పైద
చ్చపుటార్యలు ... ... ... 375

---

373, 374. * ఈ పద్యములందు ఉత్తరార్ధమున గీతిభేదములు పేర్కొనఁబడెను. భేదములు ముందే చెప్పఁబడెను.

(అ. క. 3-315-318).

వ. అన్నా రందు లక్షణ లక్ష్యమ్ములు తేటఁజేసెద నందు క్రమంబున, 376

పథ్యార్యా లక్షణము

క. ఆది పదంబున రెండవ
పాదమ్మున రెంట నాఱుపై గురువుగన్
ఆదట నాఱవ గణమునఁ
బాదుకలఘు విడినఁ [1]బథ్యయగుగన్. 377

వ. మఱియును, 378

క. కందగణమ్ములె పథ్యకుఁ
బొందగు నటులుందు వడులు పూర్వార్ధం
బందునఁ బరమార్ధంబునఁ
[1]రెం[దును యతులిట్లె] శ్రీకృష్ణా! 379

క. ఆదిపదంబున [నేడిటి]
పైఁదగు నిడనొక్క గురువు [1][పరికింపగన్]
ఆదటఁ బరమార్ధమునం
దై[ది]టిపై లఘువునగుఁ బథ్యగన్. 380

[ఆర్యలు కందపద్యముల వంటివి. ఆర్యల కన్నింటికి సామాన్యముగా పూర్వోత్తరార్ధములందును నేడు చతుర్మాత్రాగణములపై (గా, భ, జ, స, నల) నొక గురువుండును.

పథ్యార్యకు పూర్వార్ధమున 6 వ గణమున నలముగాని, జగణముగాని యుండును. ఉత్తరార్ధము 6 వ గణమున నొక్క లఘువు మాత్రమే యుండును. నాలుగు పాదములందును నాదిప్రాసము. సమపాదములందు మూఁటిపై యతి.]

377. [1]విడిన నదియే పథ్యయగుగన్. (అ. శ. వ్రాఁతప్రతి).

379. [1]రెండు నిట్టి యతులు. (అ. శ. వ్రాఁతప్రతి). ఈ పాఠమును గ్రహించిన గణభంగము.

380. [1]పై గణముగన్. (అ. శ. వ్రాఁతప్రతి).

అందు విపులార్యా లక్షణము

క. అమరఁగఁ బథ్యను జొరు ప్రా
నములను సమపదముల వ్రచ (న) సేయఁగా
కమలాధిప! విపులార్యా
క్రమమిదియగునంద్రు కవులు హరీ! 381

[పథ్యార్యాలక్షణముగలదై బేసిపాదము కడిపటిపదము సరిపాదములోఁ జొచ్చియుండును. 1-2, 3-4, పాదముల సంధిలో నేకపదముండవలెనని భావము.]

అందు చపలార్యా లక్షణము

క. సమపద మాదిం జగణం
బమర్చి రెండరలను విపులార్యా రూ
పమునన్నిదఁ జపలార్యా
ఖ్యమాధవ! దగుభువి హరికృష్ణా! 382

[ఆర్యయొక్క సమపాదములలోఁ దొల్తటి గణము జగణముగా నుండవలయు.]

అందు ముఖచపలార్యా లక్షణము

క. చపలార్యా రూపమునఁగా
గృపాబ్ధి! ప్రథమార్ధమున నృకేసరి! ప
థ్యపరార్ధంబగుఁ దుదముఖ
చపలార్యకు నిటులఁ జమఁ గృష్ణా! 383

[మొదటి సగమున ననఁగా ముఖమందు చపలార్యా లక్షణము, రెండవ సగమునఁ బథ్యార్యా లక్షణముగలది ముఖచపలార్య.]

అందు జఘనచపలార్యా లక్షణము

పెద్దనగారు, [లక్షణసారసంగ్రహము. 2-79]

మును పథ్యా పూర్వార్ధము
గను మొదలర్ధమయి చపలగలతుదయం,

టును జఘన చపలకుఁదుదం
[1]గన ద్వచో(వి)జిత కద్రూజా! 384

[పూర్వార్ధమునఁ బథ్యాలక్షణము, ఉత్తరార్ధమునఁ జవలాలక్షణముకలది జఘనచపలార్య.]

వ. ఇది ఆర్యాజాత్యధికారము. ఇఁక, 385

## అక్కరజాతి వృత్తలక్షణము

వ. మఱియు అక్కరజాతి వృత్తమ్ము లైదువిధమ్ము లై వెలయు; నవి యెయ్యవి యంటేని, 386

పెద్దనగారు, [లక్షణసారసంగ్రహము. 2-102]

క. అక్కర లనఁదగు నైదు మ
హాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, మఱియ
ల్పాక్కర [యు, నంతరాక్కర,
యెక్కువ సత్కవులు కృతుల నిడుదురు పీనిఁ.] 387

వ. అన్నాఁడు. క్రమంబున వివరించెద, 388

మొదటి మహాక్కర లక్షణము

మొదల సూర్యుండు పిమ్మటనే గురు -
పురుహూతు లందుపైఁ జంద్రుఁడొందు
వదపదమ్మున కీరీతి నాల్గిటి -
పై యతి దగుఁ బ్రానములు దనరుఁ
గదియ నొక్కొక తఱి రెండు నాలుగు -
గణముల చోట్లను వినగణంబు
ముదముతో నెడసొచ్చు మహాక్కర -
మొనసి కావ్యములందు విదఁ(గ) గృష్ణ! 389

384. [1]గనద్వచో జితకద్రూజా (ల. సా. సం.) ఈ పాఠమున లక్షణాను సారము 6 వ గణమగు జగణము లోపించెను.

[1 సూర్య + 5 ఇంద్ర + 1 చంద్ర = 7 గణములు. 4 గణములపై యతి ]

అందు మధ్యాక్కర లక్షణము

గసుర (పతి) ద్వయముపై నొక్క - సూర్యుందు పిమ్మట విటుల
వరుసతోఁ జెప్పింపఁగఁ గవి - వరులిట్లు పాదపాదమున
కిరవుగా నాజేపి గణము - లెసఁగించి మూఁటిపై విరతి
(వి)రచించి ప్రాసము లనుప - వెలయు మధ్యాక్కరనుహరి ! 3 0

[2 ఇంద్ర + 1 సూర్య + 2 ఇంద్ర + 1 సూర్య = 6 గణములు. 3 గణములపై యతి.]

గఅందు మధురాక్కర (లక్షణము)

రవిగణమొకటి పిదప పు - రందరుల్ మువురు [1]హిమ
రవి యట నొకఁడు నిటులఁ జ - రణమున గణములైదు
భువిఁ దగుఁ మూఁటిపై వడిఁ - బొసఁగించి ప్రాసముల్ న
రవి నిడఁ గృతుల మధురాక్క - ర దనరు రామకృష్ణ ! 391

[1 సూర్య + 3 ఇంద్ర + 1 చంద్ర = 5 గణములు. 3 గణములపై యతి.]

అందు అంతరాక్కర లక్షణము

అనంతనగారు, [ఛందోదర్పణము. 3-43]
ఇనుఁ డొకండును నింద్రు - లిద్దఱు నొక్క
వనజవైరియుఁ గూడి - వైభవ మొనర్ప
గనకవస్తువి గృత్త - కైటభుని గొలుతు
రనుచుఁ జెప్పుదు రంత - రాక్కర బుధులు. 392

[1 సూర్య + 2 ఇంద్ర + 1 చంద్ర = 4 గణములు. 3 వ గణము కడపటి వర్ణము యతి.]

---

391. [1]హిమరవి = చంద్రుఁడు. ఇందిది చంద్రగణమనుట.

అందు అల్పాక్కర లక్షణము

వాసవద్వయము పై - వాశ్రుకుందు
భాపిల్లువడి రెంటి - పైఁ బాదాన
కేసూటి మూరేపి - యెనఁగుఁ గృష్ణ
ప్రాసమ్ము లొప్పున - ల్పాక్కరకుఁగ. 393

[అనంతనగారు, ఛందోదర్పణము. 3-44]

ఒకరిద్దఱింద్రులు - నొకవిధుండు
జగతీధరుని పదా - బ్జములు గొల్తు
రగణితభక్తి నం - చభినుతింప
నెగడు నల్పాక్కర - వియతితోడ. 394

[2 ఇంద్ర + 1 చంద్ర = 3 గణములు. 2 గణముంపై యతి.]

వ. ఇది అక్కరజాత్యధికారము. మఱియు నందు, 395

తరువోజ లక్షణము

హరిహయ త్రయముపై - నాదిత్యుఁడొకరుఁ -
దరయఁగా విరు[1]ల)ర - లందులఁగూడి
చరణం[2]బనా నొప్పు( - జరణంబునకును -
జరుగును రెండు వి - శ్రమములు విట్టి
కరణిఁ జెందును రెండు - గణముల మీఁదఁ -
[3]గ్రమమున వడినొప్పుఁ - బ్రాసంబులొనరు
ధరణిఁ దర్వోజప - ద్ధతి యిది కృతులఁ -
దగియుండుఁ గృష్ణ! యా - దవవంశతిలక. 396

[ప్రతిపాదమున 2 ఇంద్ర + 1 సూర్య + 2 ఇంద్ర + 1 సూర్య గణము లుండును. రెండేసి గణములపై యతులు.]

---

396. [1] 'ఇరుసురలు' (అ. కి. వ్రాఁతప్రతి.) ఇందు యడాగమము అసాధువు. [2] 'అనన్' అనుటకు 'అనా' అని ప్రయోగము. [3] ఈ పాదమున బహుయతి నియతిభంగము.

ఇఁకనందు వైతాళీయ వృత్తలక్షణము

వ. వెండియు వైతాళీయ భేదంబులు పెక్కురీతుల విలసిల్లినందు, వైతాళీయం బను ఔపచ్ఛాందసంబును, ఆ పాతళికయు, దక్షిణాంతికయు, ఉదీచ్య వృత్తియు, ప్రాచ్యవృత్తియు, ప్రవర్తకంబును, పరాంతికయు, చారుహాసిక యనవిట్లు తొమ్మిది విధమ్ములై ప్రవర్తిల్లు నందు క్రమంబున తద్భేదంబుల వివరించెద నవధరింపుము. 397

వృత్తరత్నాకరమున. [2 అధ్యా. వైతాళీయ ప్రకరణము. శ్లో. 1.]

శ్లో॥ షడ్విషమేష్టౌ న మేకలా, స్తాశ్చ
సమేస్యుర్నో విరంతరాః॥
నసమాత్ర పరాశ్రితా కలా
వైతాళీయే ఒంతేరలౌగురుః. 398

వ ఇది వైతాళీయ వృత్తము. వైతాళీయమునకు బేసిన చరణములకు ఆఱు మాత్రలమీఁదటను న్ని సరిచరణములకు ఎనిమిది మాత్రల మీఁదటను న్ని రగణ వగణములు రావలెను. విచ్ఛేదమున్ను ఈ రీతిగానే రావలెను. తెలుఁగునకైతే బేసి చరణములకు ఆఱుమాత్రలమీఁదట సరిచరణములకు ఎనిమిది మాత్రలమీఁదటను యతి గలిగి రగణ వగణము లుండవలెను. నాలుగు చరణములను ప్రాసల న్నిలుపవలెను. ఇవి మాత్రాసమక విబద్ధ ములు. 'కళా' - అట్టి మాత్రయనుట. తెలుఁగు సంస్కృతములకు నాలుగు చరణంబులకు గురు లఘువులు గలిసియుండఁ జెప్పవలెఁగావి అన్నిన్ని గురువులున్ను అన్నిన్ని లఘువులుగాను జెప్పరాదు. రెండు నాలుగు ఆఱో అక్షరములు గురువులై అవలి యక్షరాన కలియరాదు. అవి లఘు వక్షరములైతే కలియదనుట. ఇవి వైతాళీయ వృత్త లక్షణములు. ఇందులకు చిత్రకవి పెద్దనగారు చేసిన వైతాళీయ వృత్తములు. 399

*[లక్షణసారసంగ్రహము. 2 : 109 - 120.]

---

* ఇటనుండి. (ల. శి. 400 - 418) లక్షణ సారసంగ్రహములోని (2 : 109 - 120) పద్యములు సంగ్రహింపఁబడినవి.

తే. జరగుఁ గృతుల వైతాళీయ జాతులందు
రగణ భేదంబులందు నేర్పఱచియున్న
గురులు రెండేసి లఘులుగాఁ గూర్పవలయు
లక్షణజ్ఞుల సంజ్ఞచే [1]నక్ష (హారి!) 400

తే. అసమ పదముల లఘుషట్కమైన మీఁద
సమపదంబుల లఘ్వష్టకమున కవలఁ
బెనుపవలయు వైతాళీయమునను వళ్లు
ప్రకటకరుణావివాస! శ్రీరామదాస! 401

## తెలుఁగున వైతాళీయ వృత్తక్రమము

[1]ఋతుగజయతి - రేఫవంబు లా
యుతమై యసమన - మాంఘ్రులంటి న
మ్మితమైలఘు - మీఁద రాక పా
[2]లితయశ వైతా - ళీయ వృత్తమౌ. 402

[బేసి పా. 6 లఘువులు + ర, వగణము. 6 లఘువులపై యతి.
సరి పా. 8 లఘువులు + ర, వగణము. 8 లఘువులపై యతి.]

వ. ఈ మొదట వ్రాసిన శ్లోకార్థము ఈ వైతాళీయ వృత్తమునకు సరిచూచు
కొనేది. ఇఁక నందు 403

## ఔపచ్ఛందసి యను వృత్తము

ధర లఘువుల్ - దప్పక రయంబుల్
చరణంబులపై - సంధిలఁ గవీంద్రుల్
విరచింపఁగ - వింతలై తలిర్పఁ
[1]సరవి(వి) నౌప - చ్ఛందనంబు మించుఁ. 404

---

401. [1]నక్షహారి (అ. కీ. వ్రాఁతప్రతి.) నక్షయారి (అ. సా. సం.) ఇవి రెండును నపపాఠములు.

402. [1]ఋతుగజఁ రేఫవంబు లా (అ. సా. సం.), [2]పాలితమై (తి).

404. [1]సరవితో (అ. కీ. వ్రాఁత ప్రతి.) దీనిని గ్రహించిన మాత్రాధిక్య మగును.

[బేసి పా. 6 లఘువులు + ర, యగణము. 6 లఘువులపై యతి.
సరి పా. 8 లఘువులు + ర, యగణము. 8 లఘువులపై యతి.]

వ. ఈ ఔపచ్ఛందసవృత్తానకు వైతాళీయ వృత్తంవలెనే యతులు ప్రాసము లుండి ఆ వృత్తంవలెనే లఘువుల సంకేతములన్ని గలిగియుండి రగణ వగణములు వచ్చేచోట రగణ యగణములు నాలుగు చరణములకువస్తే అది ఔపచ్ఛందసి వృత్తము. ఈ పద్యాననే సరిచూచేది. ఇఁక నందు, 405

### [1]ఆపాతళిక వృత్తలక్షణము

అవుఁ దల్లఘు - లట్లు భకారం
బవలఁ గాతో - నంటుకొనఁ ద
ర్కవిరతి నా - గస్థయతుల్ రా
భువి [2]నాపాతళి - పొల్పగు హన్మా! 406

[బేసి పా. 6 లఘువులు + భ, గగ. 6 లఘువులపై యతి.
సరి పా. 8 లఘువులు + భ. గగ. 8 లఘువులపై యతి]

వ. దీనికి వైతాళీయ వృత్తమునకు వలెనే యతులు ప్రాసములు లఘువులుండి రగణ వగణములు వచ్చేచోట భగణ గగములుంటే అది ఆపాతళిక వృత్తము. ఈ పద్యాననే లక్ష్యము సరిచూచేది. ఇఁక నందు, 407

### దక్షిణాంతిక వృత్తలక్షణము

వసుల్ [1]లముల్ - వచ్చుటట్లనై
రలఁ గముల్ పై - రాఁ [2]ద్వితీయలం
మ్ములఁ [3]ద్రిలఁ - బూన్చునంఘ్రులఁ
దలిర్చు మారుతి - [4]దక్షిణాంతికఁ. 408

406. అపతాళిక (అ. శి. వ్రాఁత ప్రతి). [2] భువినాపతాళి. (అ. శి. వ్రాఁత ప్రతి). పవనసుతా యాపాతళికాఖ్యన్. (అ. సా. సం.)

408. [1] లఘుల్ (అ. శి. వ్రాఁతప్రతి). [2] ద్వితీయంబులం. (అ. సా. సం). ఇందు మాత్రాధిక్యము. [3] ద్రిలను (అ. సా. సం.) 2-వ. 3-వ. మాత్రలుచేరి గురువై యుండవలయును. ఈ పాఠమున నట్లు లేదు. [4] దక్షిణాంతికాఖ్యన్. (అ. సా. సం.) ఈ పాఠమున మాత్రాధిక్యము.

[బేసి పా. 6 లఘువులు + ర, వగణము. 6 లఘువులపై యతి.
సరి పా. 8 లఘువులు + ర, వగణము. 8 లఘువులపై యతి.
వైతాళీయ లక్షణము గలిగి ద్వితీయ, తృతీయ మాత్రల సంయోగము గలది దక్షిణాంతికము.]

వ. వైతాళీయ వృత్తరీతిని యతులు, ప్రాసములు, గణములు, లఘువులు నుండి రెండోచరణమున నాలుగోపాదాన నక్కరనైనా మూడేసి లఘువులుండఁ జెప్పితే దక్షిణాంతిక వృత్తము. ఈ పద్యాననే లక్ష్యము సరిచూచుకొనేది. ఇఁక నందు, 409

### ఉదీచ్యవృత్తలక్షణము

తగఁ బునుఁ - దక్షిణాంతికా
ఖ్యగ యుక్పద మది - [1]యంటకుందు రీ
తిగా నగు ను - దీచ్యవృత్తి మె
చ్చుగ వాతాత్మజ! - సూరి సన్నుతా! 410

[వైతాళీయ లక్షణముతో విషమపాదములందు మాత్రము ద్వితీయ, తృతీయ మాత్రా సంయోగము గలది.]

వ. ఇందుకు దక్షిణాంతిక వృత్తమువలెనే సరిచూచుకొనేది. ఇఁక నందు, 411

### ప్రాచ్యవృత్తిలక్షణము

అయిదవ లఘు - వంటి క్రిందమా
త్రయెసఁగ స్వరులఁ - బ్రాచ్యవృత్తిఁ బొ
ల్చయు వైతా - ళీయ జాతి నొం
ది యిది యొప్పుగుఁ - దేవమారుతీ! 412

[వైతాళీయ లక్షణముతో సమపాదములందుఁ జతుర్థపంచమమాత్రా సంయోగము గలది ప్రాచ్యవృత్తి.]

---

410. [1] యంటుకున్న (అ. తి. వ్రాఁత ప్రతి.) ఇది యపపాఠము.

వ. ఇది వైతాళీయ వృత్తమువలెనే యతిప్రాసగణలఘు సంకేతములుండి పరిచరణముల అయిదు మాత్రలమీఁద నొక లఘువుండఁ జెప్పినది (?) ప్రాచ్యవృత్తి. ఇఁక నందు, 413

## ప్రవర్తకము

స్థిర న్మొద ను - దీచ్యవృత్తియుం
[1]బరఁగ సర్లఁదగఁ - బ్రాచ్యవృత్తియున్
జొరంగ యతిఁ - జూడ విట్లయై
వరుసతో విడఁ బ్ర - వర్తకంబగున్. 414

[బేసులందు ఉదీచ్యవృత్తిలక్షణము, సరులందు ప్రాచ్యవృత్తి లక్షణము కలది ప్రవర్తకము.]

వ. బేసి చరణము లుదీచ్యవృత్తివలెనే, సరిచరణములు ప్రాచ్యవృత్తివలెనే యుంటే అది ప్రవర్తక మనఁబడును. ఇఁక నందు, 415

## పరాంతిక వృత్తలక్షణము

[1]వన్నెమీఱఁగఁ బ్ర - వర్తకాఖ్యతో
మన్నదాన్ సర్ల - నుందు లక్షణం
[2]బన్నియంఘ్రులను - నంటఁగూర్పఁ దా
నెన్నఁగాఁ దవకు - నీ పరాంతికన్. 416

[ప్రవర్తక సమపాదలక్షణము నాల్గుపాదములం గలది. ఇట్లనుటచే నాల్గుపాదములలోను దొలుత ఎన్మిది మాత్రలుండునవి యరయనగు.]

---

413. ? అయిదు మాత్రలమీఁద నొక లఘువనుట సరికాదు. 4, 5 మాత్రల సంయోగ ముండవలయును.

414. [1]పరంగ (అ. శి. వ్రాఁత ప్రతి.)

416. [1]వన్నెగాఁ బ్రవర్తకాఖ్యతో (అ. శి. వ్రాఁతప్రతి.)

[2]బన్నియంఘ్రులంటి గూర్పఁడా (అ. శి. వ్రాఁతప్రతి).

వ. ప్రవర్తక వృత్తము సరిచరణములవలెనే నాలుగు చరణములతు నుంచె యది పరాంతిక వృత్తము. ఇఁక నందు 417

### *చారుహాసిని యను వృత్తము

కవులొప్పగఁ - గాఁ బ్రవర్తకా
ఖ్య వృత్తమునఁ - గల్గుబేసి పా
దసైఖరు - ల్దాల్చి నంబ్రఫలిగా
జవాంచితా - చారుహాసినీ. 418

[ప్రవర్తక విషమపాదలక్షణమే నాల్గుపాదములం గలది చారుహాసిని.]

వ. ప్రవర్తక వృత్తము బేసి చరణములవలె నాలుగు చరణములు సమముగా యతులు ప్రాసములు గణలఘు సంకేతములు ఉంటే అది చారుహాసినీ వృత్తమనఁబడును. (ఇవి) తొమ్మిది వైతాళీయ వృత్తభేదముల లక్షణ లక్ష్యప్రకారములు. ఇఁక నందు 419

### వక్త్రవృత్తములు

అనుష్టుపులయిన వక్త్రవృత్తములందు వక్త్రియు, పథ్యావక్త్రియు భవిపులయు, మవిపులయు, రవిపులయు, యవిపులయు నవిపులయు, తవిపులయు ననఁదగు వక్త్రవృత్తమ్ము లెన్మిదియు లక్ష్యముఖంబునం దెలియవలయు నవి యెట్లుంటె విఁక నందు 420

### గద్యలక్షణము

మఱియు నందు గద్యయు నైదు భేదమ్ముల విహరించునవి యెయ్యవి యంటేవి - గద్యయు, బిరుద గద్యయు, చూర్ణికయు, వచనంబును [1]విన్నపంబు నన గద్యభేదమ్ము లైదును బ్రమోదమ్మున వివిధ విధమ్ముల నొందించునందు గద్యక్రమం[2]బెటు వలెనంటేవి

---

418, * చారుహాసిని, చారుహాసిక పర్యాయనామములు. (చూ. 8 - 396).

421. [1]విన్నపంబులన (అ. శే. బ్రాఁత ప్రతి.)

[2]బెట్టు. (అ. శే. బ్రాఁత ప్రతి.)

గద్యయను కరణశబ్ద యుక్తంబై యొప్పు, నందు బిరుద గద్యసంబోధ
నాంత పదబంధురంబై వర్తిల్లు, నందు చూర్ణిక లేక వచన ద్వివచన
బహువచన సందర్భంబులగ విభక్త్యామశాసవిక సమాసాదిత కల్పానల్ప
జల్పితంబై వెలయు, నందు వచనంబులు బహుప్రకార రచనావిచయ
ప్రాచుర్యమ్ములై సంచరించు, నందు విన్నపంబులెన్నఁ దిన్నలై ఋజు
మార్గంబుల ననుగమించు, ఏ పంచవిధమ్ములు మితరహితమ్ములై స్వేచ్ఛా
కల్పనా గౌరవమ్ముల కొలందుల విలసిల్లు; నందు — 421

క్రమంబున గద్యలక్షణాదు లనంతనగారు, [ఛందోదర్పణము 2 : 2]

క. కమఁగొనఁ బాదరహితమై
సమపది హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు [1]గద్యయది దాఁ
బున మెఱయు గద్యయది దాఁ
దెనుఁగు కృతుల వచనమనఁగ దీపించు [2]హరీ! 422

అందు బిరుదు గద్ద లక్షణము - భోజరాజీయము.

చూర్ణిక. *శ్రీమదఖిల జగజ్జేగీయమాన విజకథాసుధాధార సారస వాహినీ మానవ సరోవర విహారహార హీర పటీర ప్రహసన పటుయశః పూరపూరితభువన భువనైక భవ భవ నళిన భవశతమఖముఖ సురవరనికర మకుటతటఘట తవిజ కిరణ విఘటిత గరిమ తరుణకరణ కిరణ వికచదరుణ చరణాంభో రుహ భోజరాజా పర్వశార్వరీ వనితానుకృత లీలామదనగోపాలాదిదైభవ విదైభవా. 423

అందు మదీయ చూర్ణిక లక్షణము

శ్రీమదఖిలసురవరనికరమకుటతటఘటిత చటుల మణిమృణి పరికల్పితా వల్పాలంకృత పరిష్కృత విజచరణ సరసిజ యుగయుగయుగ తత్త్వహి తమహిత రూపాటోపా పాదానశీలగోపాలబాల రమణీయ రుక్మిణీరమణీ రమణ పాహిపాహిత్వాం వందే. 424

---

422. [1]గద్యమది. (ఛక. ద. [2]దుణ్. (ఛం. ద.)

423. * ఈ చూర్ణిక కేఁటి ముద్రిత ప్రతియందు గానరాదు.

మఱియుఁ బ్రబంధమ్ములఁ గలుగు వచనంబులును, విన్నపంబులును,
నెల్లవారికిం దెల్లంబగు నవి, యట్టిదై వెండియు యక్షగానాష్టక పదాష్టపదు
లివి నాలుగు విధములు నొక్కొక్కటి పెక్కు విధమ్ములై యష్టకంబులు
పదంబులు అష్టపదులును వివిధరీతుల నానానామమ్ముల విహరించు, నివి
సంగీత తాళనిర్ణయముల గీతసృష్టి గీతపుష్టి మాత్రాధిక్యమాత్రాలోపమ్ముల
రాగతాళమ్ముల, పదమ్ముల (న)ర్తన భరతమ్మున ఏంలవి వాని లక్ష
ణమ్ములు చెప్పఁబడియుండు. నందు, 425

శ్లో. కర్ణాట లాట గౌ ళాంధ్ర ద్రవిళానాంతు భాషితం
ఏళా వృప్తవిధా జ్ఞేయా ప్రోక్తా మ(త్యా)ది తాళతః. 426

వ. అన్నారు గావున నీదేశభాషల పదములు చెప్పవచ్చుననిన్ని, ఏలనఁగా
పదములనిన్ని, మూఁడు చరణములకు ఖండికాత్రయము అని పేరుగల
దనిన్ని, పల్లవము, ఉపపల్లవము అనిన్ని, యివి మాత్రాసమత విబద్ధములైన
షగణాదులతోఁ గూర్చవలెననిన్ని సూళాదుల (క్ర)మగు (ణ)ముగా నుంచ
వలెననిన్ని, సంగీతరత్నాకరము మొదలయిన గ్రంథము(లు) అర్జున
భరతాది నేళా ప్రకారంబున షగణాదుల రాగతాళమ్ముల సంగీతరీతిని తేట
పడియుండుఁగావన నీ సాహిత్యమార్గంబున లక్షణంబునఁ జేర నవి
యట్లుండె, మఱియు తురంగవృత్తంబును, శంఖవృత్తంబును, మండూక
వృత్తంబును, డింకిణీవృత్తంబును, లటహపటహవృత్తంబును, తమ్మట
వృత్తంబును, భద్రకాళివృత్తంబును, ఇవిమొదలుగాఁగలుగు విశేషవృత్త
భేదమ్ములును,

[చిత్రకవితానిర్దేశము]

వెండియుం జిత్రకవిత్వంబును, పాదభ్రమకంబును, సౌగంధికకుసుమ
మంజరీ గర్భితోత్పలమాలికావృత్తంబును, కందగర్భిత చంపకమాలికా
వృత్తంబును, వృత్తకందఖడ్గగర్భితసీసంబును, వృత్తకందగర్భితసీసం
బును, మంగళమహాశ్రీ నవమయూరగర్భితలయగ్రాహియు, మణిగణనికర
నవాక్షరకందత్రయషడ్విధగర్భిత సరసిజవృత్తంబును, గీతగర్భితవృత్తం
బును, ఖడ్గగర్భితసుగంధివృత్తంబును, హ్రస్వకందంబును, [అత్వకందం

బును, ఇత్వకందంబును] ఉత్వకందంబును, ఏత్వకందంబును, ఔత్వ కందంబును, పద్యగుణితంబును, ఓష్ఠ్యనిరోష్ఠ్యంబును, జిహ్వాచల జిహ్వాం బును, శంఖబంధంబును, చక్రబంధంబును, గదాబంధంబును, ఖడ్గబంధం బును, శార్ఙ్గబంధంబును, ఛత్రబంధంబును, చామరబంధంబును, యక్ష యంత్రబంధంబును, గోమూత్రికాబంధంబును, మఱియు నొకఖడ్గబంధం బును, కంకణబంధంబును, నాగబంధంబును, పద్మబంధంబును, కాలచక్ర బంధంబును, హరిబంధంబును, మహాబంధంబును, హలబంధంబును, మణిబంధంబును, పుష్పమాలికాబంధంబును, పుష్పగుచ్ఛబంధంబును, పంచావరణచ్ఛత్ర బంధంబును, రథబంధంబును, మహామేరుచ్ఛత్ర బంధం బును, ఛురికాబంధంబును, దశావరణచక్ర బంధంబును, పాదగోపనంబును ఇవి మొదలగు బంధపద్ధతులును, ఇచ్ఛావాక్యరీతియు, నల్లంటి విధంబును, త్రిపాద సంఘట్టన, ద్విపాద సంఘట్టన ఏకపాద సంఘట్టనలను సంఘటన త్రితయ చమత్కృతి మార్గంబులును కల్పిత కల్పవల్లియనా నివి మొదలుగాఁగల చిత్రకవితాప్రకారమ్ముల సుకవిరాజానుమతంబున వాని వాని మతమ్ముల లక్షణంబులును లక్ష్యమ్ములును విశదమ్ముగా విశ్ర మాధికారమను నాలుగవ యాశ్వాసంబునఁ జిత్ర విచిత్ర రీతులఁ దేటఁజేసి యుండుదు నవధరింపుము. 427

అందు అష్టపది లక్ష్యము

జయదేవుఁడు. [అష్టపది. దశమసర్గము - 19.]

ఇతి చటుల చాటుపటు చారు మురవైరిణో
రాధికా మధువచన జాతమ్,
జయతు పద్మావతీ రమణ
జయదేవకవి భారతీ భణిత మితిగీతమ్
చారు శీలే ప్రియే చారు శీలే. 428

[అష్టపది లక్షణము : గీతగోవింద కావ్యమున

అష్టపదులు 4 మాత్రలు, 5 మాత్రలు, 7 మాత్రలు గల గణములచే వివిధ రీతులఁ గూర్పఁబడియున్నవి.

శిరోమణికారుఁ డుదాహరించిన అష్టపదిలో నాఱు పంచమాత్రాగణములపై
నొక గగము కల పాదములు రెండున్నవి.]

వ. ఇటుకలెనె అన్నింటికిఁ దెలియకలెను. 429
భీమనగారు [కవిజనాశ్రయము. సంజ్ఞ. 8]

క. కమనీయ సమస్త కళా
గమములకును జన్మభూమి కావ్యము, కావ్యా
గమవిదుఁడు సర్వవిదుఁడని
సమయ చతుష్టయమునందుఁ జదివిరి మొదలన్. 430

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 9.]

క. కావునఁ గవిత్వతత్త్వము
భూవలయమునందుఁ జద్ద పూజ్యం (బగు) న
ద్భావమునఁ జెప్పఁ గావ్యక
[1]శావేదులు పొగడఁ గావ్యలక్షణ మహిమన్. 431

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 6.]

క. అతిశయముగఁ జెప్పిన స
త్కృతి కవుల కుదాత్తఫలముఁ గీర్తియుఁ జేయున్;
[1]మతిఁ దెలియక చెప్పిన దు
ష్కృతి కవుల కుదాత్తఫలముఁ గీర్తిఁ జెఱుచున్. 432

వ. అన్నారు గావున, 433

క. అరుదొక్కొక కవి యిప్పు డిరు
గురు ముప్వురు నలుగురైదుగురు నార్వు(రు) నే

431. [1]క, శా వేదులు వొగడఁ గావ్య లక్షణము మహిమన్. (క. జ. ఆ.)

432. [1]మతి దెలియక. (క. జ. ఆ. పా) మతి మఱచి చెప్పినన్. (తి. శి. 1257).

ద్గురు తొమ్మండ్రు పదుగురై
ధర [1]కైతరులింట వింటఁ దఱచగుఁ గృష్ణా! 434

వార్తాకవి రఘునాథయ్యగారు,

క. క్షితి కవులిరువుర రోచికి,
సత్పదార్థ్యవహారి నాఁగ జరుగుదురు కవుల్
మతిరుచి వెదకు నరోచికి
సత్పదార్థ్యవహారి పశువుచాటున మెలఁగుఁ. అన్నారు. 435

చిత్రకవి పెద్దనగారు, (లక్షణసారసంగ్రహము. 1-4.)

క. లక్షణ మెఱుఁగక కావ్యము
వీక్షణమునఁ గూర్తుమనుచు నెగిరాడు కుక
వ్యక్షకుమారుల నదలిచి
లాక్షణికులు [1]మెచ్చ వారి లా వణఁగింతుఁ. 436

క. *కవితా కన్యక గుణములు
కవికున్నత సంజ్ఞఁ దెఱుఁగుఁగామిని సురతో
త్సవము వసతంబ్రిదెలియునె
చవిఁ గొనుపతి తెలియుఁగాక సౌజన్యవిధీ! 437

వ. అన్నారగుటంజేసి, 438

తే. జగతి గతి నాలవాలమై సకల వృత్త
జనన లక్షణ భవి కవిసార్వభౌము
లార! చాతుర్యలక్షిత లక్షణజ్ఞు
లార! రతిఁజూడుఁడిది కవిరాజులార! 439

వ. అవి విన్నవించి, 440

---

434. కైతగు. (ల. శి. వ్రాఁత ప్రతి). కైత + అరి = కైతరి = కవి.

436. [1]మెదిచి. (ల. సా. సం.)

437. *ఈ పద్యము నేఁటి ముద్రిత లక్షణసారసంగ్రహమున గానరాదు.

క. [1]దెసగురు విడుకొని మన్మా
ననమున మీకృపను గృతియొనర్చితిఁగాకీ
యనహాయ సాహసంబిది
వసమగునే యొకని కెంత వానికిఁ గృష్ణా! 441

మ. కనకక్ష్మాధరధీర! ధీరహితరక్షః శిక్షణానూనచ
క్రనికాతాత తధార! ధారణ గుణద్రాఘిష్ఠ సన్మౌని రా
డన(ఘ) స్వాంతవిహార! హారమకుటాద్యాబద్ధ భూషాకన
ద్ఘనగోభా సుకుమార! మారశతరాకాచంద్ర సాంద్రద్యుతీ! 442

చక్రవాళ వృత్తము

ఉ. కైరవ మిత్త్రమిత్త్రయుగ గౌరవినేత్ర వినేత్ర (విత్ర) సం
చారణజైత్ర (జైత్ర) కృత సమ్మత పుత్రవపుత్రయాతనా
కారణ చిత్రచిత్ర కళికాయిత విత్ర సువేత్ర కౌస్తుభ
శ్రీరత గోత్రగోత్రధర చిత్రపవిత్ర విశేషవిత్రకా. 443

సుగంధివృత్తము.

*కంధరనుతస్ఫురణ కంధిశయనా జలజకంధర ఖగేంద్ర
స్కంధలగితా నిభృతగంధవహసంభవ సుగంధి వదనాబ్జా
సైంధవ వధాకలితసంధ విజయార్థ [1]పరిసంధిత సముద్య
ద్బంధుర రథాంగహిత (బం)ధిత హరి(ధ్వజ(ము) బాంధవముకుందా. 444

గద్య. ఇతిశ్రీమద్వేంకట రమణ కరుణాకటాక్షవీక్షణ సంప్రాప్త సహజసారస్వత
విశ్రుతాక్రాంత విశ్రాణన సంతత సంతోషితామందానంద కందలిత నిఖిల
ధరాబృందారక బృంద నందవర వంశోత్తంస, సకల కవిరాజమిత్ర,
[1]హొత్తపివంశపవిత్ర, గౌతమగోత్రాశ్వలాయనసూత్ర, సుచరిత్ర,

---

441. [1]దెస (కా.)

444. *"సుగంధి" హొత్తపికవి 22 వ. ఛందమున నూతన కల్పిత వృత్తము (8-.

[1]పరిపథిత. (అ. శి. వ్రాఁత ప్రతి.)

గద్య. [1]హొత్తపు.

పసిండికొండ దుగ్గరాజు వెంగనమంత్రిపౌత్ర, రామయామాత్యపుత్ర,
మదూరి రఘునాథయ్య ప్రధానదౌహిత్ర యశేషవిద్వత్కవిజనకృతాదరణ
పాత్ర, చతురుపాయ ధురీణ, కార్యఖడ్గప్రవీణ, సకల సుకవిజనాంగీకృత
దత్త పిశ్శంకలక్షణచక్రవర్తి బిరుదాంక, వేంకటరమణార్య ప్రణీతంబైన
సకల లక్షణ సంయుత సుధాబ్ధి సంపూర్ణ చంద్రోదయంబగు లక్షణ
శిరోమణియందు వర్ణగణవృత్తవిశ్రమాధికారమ్ము లను చతుర్థాశ్వాసమ్ము
లను విస్తరిల్లుచునుండు, నందు క్రమంబున నిష్టదేవతాప్రార్థనంబును
మఱియ గురువందనంబును కార్యసంవిధానంబు నాపాదించి వెండియు
సకలవృత్త వివిధనామధేయంబుల జాడ చూపుటయు తద్వృత్త నియమో
పాయంబును గురులఘు పరిమాణసంజ్ఞలును, మఱి నిరువదాఱు ఛందంబు
లందుఁగలుగు సమవృత్త సంఖ్యయు, ఛందోనామభేదంబులం బ్రత్యేకానేక
ప్రకారంబులం బ్రకాశించు తచ్ఛంద స్సందోహంబులం గ్రమముగా నుద్భ
విల్లు వివిధ వృత్తభేదంబుల వెలయు నూతన వృత్తంబుల మొత్తంబుల
వృత్తులను, ఇరువదాఱు ఛందంబుల నొందు సర్వవృత్తసంఖ్యాపరంబును,
అందు భీమనగారు మొదలగు మహాకవులచే విస్తరింపఁబడిన ప్రశస్త
వృత్తలక్ష్యంబు లను స్వస్థాన పరస్థాన విషమవృత్తభేదశోధన ప్రకారంబు
లకు తదుపరి వృత్తంబుల తెరంగును, అందు చండవృష్ట్యాది దండకంబు
లందు పర్యాయంబులును, షట్ప్రత్యయ ప్రవణలును, పంచపాదంబులం
బొంకింపందగు పద్యంబుల సంకేతంబులును, మఱియు వివిధ నామధేయం
బులం బ్రవర్తిల్లు వృత్తంబు లుగ్గడింపుటయు నందు క్రమంబున కందం
బుల చందంబేర్పరించుటయు, గీత జాతి రీతులును. సీసవిశేషకౌశలంబును,
ద్విపదమార్గంబులును, చౌపదలక్షణంబును, మంజరుల యందంబును,
రగడతెగ లలితములును, తద్రగడ చౌపదతాళభేద విధానంబులును, కంద
వృత్తసీసమాలికల కొలందులును, శతకతారావళి చాటుప్రబంధ సంధా
నంబులును, ఉదాహరణ లక్ష్యంబులును, చతురుత్తరంబును. చక్రవాళం
బును, ఆర్యామర్యాదలును, అక్కరజాతి వృత్తంబుల వృత్తులును,
తరువోజయు, వైతాళీయ వైఖరులును, వక్త్రివృత్తవృత్తులును. గద్య
గతియును, తద్భేదంబులగు బిరుదగద్య, చూర్ణిక, వచన విన్నపంబుల
మార్గంబులును యక్షగానాష్టక పదాష్టపదుల పథంబులును, తురంగళంబు

మండూకాది విశేషవృత్తములును, [1]చిత్రకవిత్వంబునంగల పద్యపాద భ్రమకగానాది వృత్తంబులును, తద్గర్భిత వృత్తంబులును, శంఖచక్ర బంధాది చిత్రకవితారీతు లేర్పఱచుటయు, కావ్యకవిత్వమహత్త్వంబును, కవిసంజ్ఞలును, లక్షణ విహీన కవిలక్ష్యంబులును లక్షణపరీక్షకుఁగాను సుకవి లక్షణ లాక్షణికుల వేఁడుటయుంగలుగు వృత్తాధికారమను నిది తృతీయాశ్వాసము.

మంగళమహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



1. ఈ చిత్ర కవితారీతులను చతుర్థాశ్వాసమున విశదీకరింతునని కవి పేర్కొనెను. (అ. క. 8 _ 424). కాని చతుర్థాశ్వాసము తుదిభాగము లుప్తము. అయిదాఱు పద్యములు మాత్రమే లభ్యములు. వాని నా యాశ్వాసమునఁ జూచునది.

శ్రీరస్తు
శ్రీ శారదాంబాయై నమః

# లక్షణశిరోమణి

## చతుర్థాశ్వాసము

### విశ్రమాధికారము

క. శ్రీరామారమణ, జయ
శ్రీరమ్య గుణాభిరామ! శ్రితభక్తమునీం
ద్రారాధ్య, ప్రోవు మమ్ము ద
యారస సుమదామ, వేంకటాచలధామా! 1

క. శ్రీధర! రాధాదివ్య ప
యోధరయుతగంధహృదయ, హతభుజ్నయనా
రాధితపదసాధితపద,
వేధోముఖ విబుధభరణ, వేంకటరమణా! 2

తే. తరణివాయాన్వయాబ్ధి సుధాంశుఁడనఁగ
వెలయు మద్గురుఁ జాతుర్య వితత కలిత
శబ్దతర్కాది సకలశాస్త్ర ప్రవీణుఁ
గవిజనబ్రహ్మ, నరసింహకవిఁ దలంతు. 3

వ. అని యిట్లు మదీయ గురువందనం బాచరించి వేండియుఁ భవదీయకృతి
విధానంబు సావధానంబుగా విధించెద నవధరింపుము. 4

సీ. జగతి విరతులు ప్రాసస్థాన సంజ్ఞలు
వడులు ప్రాసములుఁ దత్ప్రాసవిధులు

[1]రే(భ) బకారముల్ [2]వైభక్తికక్రమ
సంధి సమాస విచారములను
దశవిధదోషభేదంబులు నవరస
సంగతుల్ చజయవన ర లబియెడి
వర్ణసంకేతముల్ వట్రువల్ క్రారలు
కవికల్పితములైన కవులకృతులఁ
తే. చిత్ర లక్షణ కవితా విశేషములను
మఱియు రచనలఁగల యన్నిమార్గములను
కవుల కృపచేత నిత్యాదికంబులన్ని
తేటఁ జేసెద నవధారు దేవ! కృష్ణ! 5

క. వివిధగతి నవ్యకావ్య
ప్రవిమల హృద్యానవద్య పద్యమ్ముల న
త్కవితలు నుడివెడు (ప్రా) కడు
లివి మున్నుగఁ దెలియవలయు నెంతయుఁ గృష్ణా! 6

క. గాథలు ద్రవ్యక మిక్కిలి
మాధురిగాఁ బూర్వసుకవి మతములు పెక్కుల్
శోధించి [1]తెలియఁ జెప్పెద
సాధనముగ సకల యతుల సంజ్ఞలు కృష్ణా! 7

తే. అమర మున్నుగ యతి లక్షణములు నొడివి
బిత పురాతన కవుల సమ్మతులు వ్రాసి
లాక్షణిక దక్షులెల్ల [1]భళాయనంగ
రచన చేసెద యతులేను రామకృష్ణ! 8

---

5. 1 రేఫబకారముల్ (కా.) ప్రాసయతి నిర్వహణ కొఱకు 'రేభ' అను రూపము గ్రహింపఁబడినది. రేఫ శబ్దమును గూర్చిన సమీక్షకు చూ. పీఠిక.
2 బువిభక్తిక (కా).
7. 1 తెలియఁ జేసెద (తి).
8. 1 'భళా' అనురూపము. యతిస్థానఘటకముకొఱకు చేసిన ప్రయోగము.

వ. అట్టిక్రమం బెట్టిదనిన నెఱింగించెద నవధరింపుము. 9

విశ్రమస్థాన సంజ్ఞలు

తే. జరగుఁ జరణాది విశ్రమస్థాన మనఁగ
పరఁగు రెండవ వర్ణంబు ప్రాసమనఁగఁ
దనరుఁ బ్రాసంబు నాల్గుపాదములఁ బెనుప
వలయు యతులన్ని పదముల న్నిలుపఁ గృష్ణ ! 10

క. గురులిడిరేనియు నాల్గం
జరణాదులనెల్ల గురులె చను విడ, మొదలన్
ధర లఘు విడిరేనియుఁ ద
చ్చరణాదుల నెల్ల లఘువె చనువిడఁ గృష్ణా ! 11

[*అనంతుని ఛందోదర్పణము - 1-129]

క. ఎన్నిట యతిరావలెనని
రన్నిట సంస్కృతమునందునగు విచ్ఛేదం,
బెన్నిట యతి రావలెనని
రన్నిటఁ దెలుఁగునకు మొదటి యక్షర మమరున్. 12

వ. అన్నా. రిఁక గుణితప్రకారంబున నక్షరంబునకు యతులు
నిలుచునట్టి లక్షణము, 13

తే. అరయఁ దలకట్టు దీర్ఘంబు నైత్య మౌత్వ
మొనరు నొండొంటికిం గొమ్ము నోత్వమునకుఁ
దనరుఁ దమలోన గుడుసు కేత్వంబు సుడులు
తమతమకు విల్పఁదగు విస్తృతముగఁ గృష్ణ! 14

యతుల పేళ్ళు

క. యతి విశ్రాంతి విరమము వి
రతి విశ్రమ విరమణము విరామము వడి వి

12. *వార్తాకవి రఘురామయ్యగారి దీపికయందు అని వ్రాఁతప్రతి. (శా).

శ్రుతి విశ్రామము లనునివి
యతులకుఁ బదిపేళ్ళుఁ జెల్లు నారయఁ గృష్ణా! 15

వ. అట్టి యతుల నామధేయంబులను [1]నక్కోలందుల తెలుంగున వివరించెద నది యెట్టం టేనియు —

సంస్కృతంబునకు యతి పాదచ్ఛేదసంజ్ఞఁ దనరు, నాంధ్రభాషా కవనంబున వర్ణోత్పత్తిస్థాన ప్రయత్నంబున ప్రత్యాహార ప్రయుక్త సూత్రంబున నాంధ్రప్రాకృత శాస్త్రోద్భవ తద్భవ తత్సమ వర్ణ నిరూపణ సామ్యంబునంజేసి వర్ణంబుల కన్యోన్య సంబంధంబులగుటచేత నాదిమ కవులు వివరించిన యతులలోఁ దెలుఁగున మొదటి యక్షరంబునకు విచ్ఛేదస్థానంబున రావలయుఁ గావునఁ దద్వర్ణోత్పత్తి క్రమంబు వివరించెద నవధరింపుము. అప్పరమేశ్వరు వలన వాయువును నా వాయువు వలన నాదంబును సంపన్నంబయ్యె; నన్నాదంబు హృత్కంఠ ముఖాంచితంబై కంఠతాలవ్యాద్యష్టస్థానజనితంబై యక్షరస్వరూపంబయ్యె; నయ్యష్టస్థానములెయ్యవి యనిన వివరించెద; నందు కంఠంబునందు అ ఆ లును కవర్గంబును హకారంబును విసర్జనీయంబులుం బొడమె; తాలువులను ఇ, ఈ లును చవర్గంబును యశలుం గడంగె; ఓష్ఠంబున ఉ ఊ లును పవర్గంబును ఉపధ్మానీయంబులుం బొడమె; మూర్ధంబున ఋ ౠ లును టవర్గంబును రషలును జెలంగె; దంతమున ఌ ౡ లును తవర్గ సలలును మెలంగె; కంఠతాలువుల ఏ ఐ లును, కంఠోష్ఠముల ఒ ఔ లును దంతోష్ఠముల వకారంబును, జిహ్వామూలంబున జిహ్వామూలీయమును, నాసిక ననుస్వారంబు నుద్భవించె; నందు తెలుంగున స్వరములతోఁ గూడిన స్వరయతుల యందలి అకార ఆకార ఐకార ఔకారములు కంఠస్థాన జనంబులు కావునను, ఇకార ఈకార ఏకారములు తాలుస్థాన జననంబులు కావునను ఉకార ఓకారంబులు ఓష్ఠస్థానజననంబులు గావునను ఏకస్థాన సామ్యంబు గలిగి అకార ఆకార ఐకార ఔకారముల కున్ను ఇకార ఋకార ఌకార (ఏకారము)లకున్ను, ఉకార ఓకారముల కున్ను ఇవి యొండొంటి కన్యోన్యంబులగుట స్వరయతి యనపలసి

16. [1] అక్కోలందుల (అ. తి. వ్రాఁతప్రతి).

వచ్చుటఁజేసి యివి స్వరయుక్తంబైనవి; గనుక స్వరయతి యనఁబరఁగు ఈ స్వరములు బహుభేదంబులఁ బ్రవర్తిల్లు; నవి యెయ్యవి యంటేని— స్వరయతి[యన],గూఢస్వరయతి[యన],కాకుస్వరయతియన, ఋకారస్వర యతియన, శకంధ్వాదియతియన, భిన్నయతియన. అఖండయతియన. నిత్య సమాసయతియన, దేశ్యయతియన, విభాగయతియన, ప్రభునామాంత యతి యన. ఆదేశయతియన, ప్రాదియతియన, ప్లుతయతియన. వృద్ధియతియన' తవల్కారయతియన, స్వరవిరామయతియన. ఘఞ్యతియన, నఞ్సమాస యతియన, అలుగ్విరతియన నిన్నిభేదముల స్వరయతులయందు నంతర్భా వమేయని ప్రౌఢకవులు వాడుదురు. మన్మతంబున నందుఁ గొన్నిగ్రహించి, స్వరయతియే ముఖ్యముగా నెంచినార; మిఁక నందు — వర్గయతికి — కంఠమున కవర్గువున్ను, తాలువున చవర్గువున్ను, మూర్ధంబున టవర్గు వున్ను, దంతమ్ముల తవర్గువున్ను, ఓష్ఠంబుల పవర్గువున్ను జనించెఁ గావున ఆయావర్గ చతురక్షరమ్ములకు నన్యోన్య సంబంధమ్మున వర్గయతి యనం బరఁగె. ఇఁక నందు సరసయతి — శకార చవర్గులు తాలుస్థాన కమ్ములుగావునఁ బ్రాకృతాంధ్ర సూత్రముల శవర్ణసామ్యంబు సవర్ణంబు నకుఁ గావున శకార షకార సకారమ్ములు ఏకప్రత్యాహారసూత్రప్రయుక్త మ్ములై సరసమగుటయున్ను, అకార హకారమ్ములు కంఠస్థాన జననమ్ము లగుటను, హకార(యకార)మ్ములు ఏకప్రత్యాహార యుక్తములగుటకు అయహలన్యోన్య సరసంబులయ్యె. ణకార నకారమ్ములకుఁ బ్రాకృత సూత్రాదులచేత సారూప్యంబున సరసంబయ్యెఁ గావున శషసలకు చఛ(జ) ఝలును, అయహలును, నణలును, అన్యోన్యసంబంధంబులగుట సరస యతులనఁ బరఁగె. అభేదయతి — పవర్గ వకారమ్ములు, ఓష్ఠస్థాన జని తమ్ములు గావున పఫబభలకు వకారము అభేదయతియనఁ బరఁగె. సంయుక్తయతి — ఈ యతులు వర్ణంబుల కియ్యక్రారవత్తు గిలక వట్రు వలవలన సంయుక్తంబైయున్నకతన సంయుక్తయతియనఁ బరఁగె. ఇవి కారణంబులుగా వర్ణంబులకు సారూప్య సామీప్య ప్రత్యాహార ఏకస్థాన సంబంధబాంధవంబులు విచారించి యతులు నిర్ణయించి నిలుపవలయు. ఈ సంబంధ వివరణంబులు పూర్వకవివరులు నిగూఢంబు చేసిరి గావున నవి వివరించి తేటఁ జేసితి నవధరింపుము.

యతులు కవితామాహాత్మ్యంబునందాది భీమన్నగారి మతంబున దశవిధము లనఁబడియె. తదనంతరంబ యనంతన్న శ్రీధరాథర్వణాచార్యాదు లైన లాక్షణిక దక్షుల లక్షణమ్ముల [2]పదియే నిరువది నాలుగన నెన్నఁ జెన్ను వహించె నేఁడియు వార్తాకవి [3]రఘునాథయ్యగారి దీపికయందును, ఛందస్సార సంగ్రహాది మహాకవుల లక్షణమ్ముల నిరువదేశ(ద)నగ జాలప్రసిద్ధిచే గణనకెక్కె. మఱియు నుభయకవి లక్కాభట్లు, తాతంభట్లు గారు రచింపగ వెలయు ఛందమ్ముల [4]నేఁబదైదనఁ దగిల యతులు కృతులం బ్రకాశముగాక నిగూఢంబైయుండె; నిన్నిమతంబులం బ్రబంధంబులం బ్రసిద్ధమ్ములై ప్రకాశించునట్టి యతులు ముప్పదెన్మిదనంగలిగి వెలయు; నవి యెయ్యవియంటేని తల్లక్షణమ్ములను నన్నయభట్టు, సోమయాజి, యెఱ్ఱాప్రెగ్గడనందగు ప్రబంధపరమేశ్వరుండును, భాస్కరుండును, సూరపరాజు, ఆంధ్రకవితాపితామహుండగు [5]అలసాని పెద్దనాది మహాకవి ప్రయోగలక్ష్యమ్ములను విశదంబుగాఁ దేటతెల్లమై యుండు; నట్లు [6]ముప్పదెన్మిదగు నతుల యతుల నామధేయమ్ములను దల్లక్షణమ్ములను లక్ష్యమ్ములను వివరించి ప్రపంచమ్మున సంచరింపఁ గల వన్నియుఁ గ్రమంబుగ వివరించెద నవధరింపుము. — 16

---

16. [2] అనంతన ఛందోదర్పణమున 24 యతులున్నవి. శ్రీధరాథర్వణ చ్ఛందము లుపలబ్ధములు కావు. అథర్వణచ్ఛందమున 29 యతులు, శ్రీధరచ్ఛందమున 30 యతులున్నట్లు రంగరాట్ఛందమునఁ జెప్పఁబడెను. (3-11, 14).

[3] రఘునాథయ్య దీపికలో 36 యతులున్నవి. (మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయములోని వ్రాఁతప్రతి. D. No. 1829). ఛందస్సార సంగ్రహము. అలభ్యము.

[4] లక్కాభట్ల ఛందము అలభ్యము. తాతంభట్ల కవిచింతామణియందు 15 యతులే కలవు.

[5] 'అలసాని' అని లక్షణశిరోమణి వ్రాఁతప్రతి.

[6] 'ముంబదెన్మిది' అని ల. శి. వ్రాఁతప్రతి.

సీ. స్వర, వర్గ, సరస, దేశ్య, జ్ఞో, భయా, ఖండ,
బిందు, భిన్న, ప్రా, ద్యభేద, వృద్ధి,
మా, ప్లుత, విత్యసమాస, గూఢస్వర,
వ్యంజన, ఋత్వ, విభాగ, కాకు,
సావర్ణ్యములు, ననుస్వారోష్మ, [1]ఋత్వాను
నాసికా, దేశముల్ ప్రాస విరమ
ణము, వికల్ప, ప్రభునామ, సంయుక్త, శ
కంధులును, యశవర్గ ద్వయంబు,

తే. చక్క-, టెక్కటి, పోలికల్, సరవిరివడి,
యన మఱియు సవర్ణప్రాసయతి, యలుక్స
మాసయతి(యును) ఘళ్, నళ్ సమాసము లన,
యతులు [2]ముప్పదియెన్మిదౌ నన్ని సుకవి
రాజు లెన్న నౌనర్తు(ను) రామకృష్ణ! 17

క. భువి యతి ప్రాసము లెఱుఁగవి
కవి కవితలు వితలు, వెతలుగాక కవితలా?
భువి యతుల ప్రాస(ము)లగతి
కవి దెలిపి రచింపవలయుఁ గబ్బము కృష్ణా! 18

క. తెలియవి వన్ని యబద్ధ
మ్ములవి(యుఁ)గవి పదరి దిద్దఁబోకుఁడు కవితా
కలనాపరులగు లాక్షణి
[1]కులవలనఁ దెలియవలయుఁ గుమతులు కృష్ణా! 19

17. [1]ఋత్వాను (అ. శే. వ్రాఁతప్రతి). [2]ఇందు "ముప్పది తొమ్మిదా" అని అ. శే. వ్రాఁతప్రతి పాఠము. కాని 16 వ. వచనమున, 2వ పద్యమున "ముప్పది యొనిమిది" అను పాఠమే కలదు. ఈ గ్రంథమున వివరింపఁబడిన యతిభేదములు ముప్పదియొనిమిదే.

19. [1]కులవలనం దారు తెలిసికోఁదగుఁ గృష్ణా! (తి).

సీ. మార్జాల మొకటి నెమ్మదిఁ దెచ్చి యందఱ
నాలుగు పాదాలు నఱచుఁ గడఁగి
తుదనెత్తుగిశనఁ దోఁక లేవఁగఁ బట్టి
పరువడిఁ బరువడిఁ దఱుమఁదఱుమ
వడి నీవు మీతాత వచ్చిన యంటినా
బొమ్మని యదలింపఁ బోవ యతులు
మునులు, సన్యాసులు పనుపఁ బద్యంబు ప
ద్యస్య లక్షణమనునదియె కాక

తే. పఱిగలుగ రాట్నమున నాలుగడుగులందు
ప్రాసములు గల్గునే క్రిందఁ బైనఁ గలవఁ
టనుచుఁ బలికెదు సర్వజ్ఞులైన కవుల
కిట్టి లక్షణ లక్ష్యము లేల కృష్ణ ! 20

ఆంధ్రభాషాభూషణము - (వ. 10)

క. గుణదోషంబు [1]లెఱింగిది
గుణ మది దోషమని పూజఁ గొందురు సుకవుల్
[2]గుణములు దోషములని దు
ర్గుణములు గుణములని పూజఁ గొందురు కుకవుల్ 21

వ. అవినా రటుగావున అక్షణహీనుండయ్యును లక్షణజ్ఞుండైన విధంబున మేధావిహీనుండయ్యును క్షుద్రార్థ నిమిత్తంబుగా దాంబికాడంబర నామధేయంబు లిడికొని వేషంబులు గైకొని సంచరించు కించిజ్జ్ఞల కిందలిలక్షణంబులం జవులు నొరవు. పఱన గహ్వరంబులం జొచ్చి వెడల వవి యట్లుండె వెండియు లక్షణ కవితా విశేషజ్ఞులకు వలయుఁ గావునఁ దద్విభ్రమ బోధకంబులు తేటగా నిరూపించెదను. సావధానంబుగా [1](నవ)ధరింపుము. 22

21. [1] లెఱిఁగి యున్ గుణమిది. [2] గుణదోషము లెఱుఁగక దుర్గుణములె గుణములని పూజఁ గొందరు కుకవుల్. (ముద్రితప్రతి పాఠములు).

22. [1] సాధరింపుము. (కా).

తే. అచ్చులనఁగా స్వరములన నాదులొప్పు
హల్లులన వ్యంజనములనఁ గాదులొప్పు
నమరు ననునాసికలనఁగ ఞ మ ఙ ణ న లు
భువివి నంతస్థలన యరలవలు చెలఁగు
మూష్మలనఁ జెల్లు శషసహ [1]లొనరఁ గృష్ణ! 23

వ. మఱియు, 24

యతుల నామధేయములు

సీ. స్వర వర్గ నరసదేశ్యజ్ఞోభయాఖండ
బిందు భిన్న ప్రా ద్యభేద వృద్ధి
మా ప్లుత విత్యసమాస గూఢస్వర
వ్యంజన ఋత్వ విభాగ కాకు
పావర్ణ్యములు ననుస్వారోష్మ [1]చుత్వాను
నాసికాదేశముల్ ప్రాసవిరమ
ణము వికల్ప ప్రభునామ సంయుక్త శ
కంధులును యశవర్గ ద్వయంబు

తే. చక్కటెక్కటి పోలికల్ సరవి రివడి
యన మఱియు సవర్ణప్రాసయతి యలుక్స
మాస యతియును షుక్ నక్ సమాసములన
యతులు ముప్పది యెన్నిదో నన్ని సుకవి
రాజు లెన్న నొనర్తు(ను) రామకృష్ణ! 25

క. ధర సహజ స్వర గూఢ
స్వరకాకు వ్యంజనములు చను నెల్లెడలన్
స్వరయతులు నాల్గు తెలుఁగులు
పరువడి తద్విధము తేట [1]పఱపెదఁ గృష్ణా! 26

---

23. [1] ఒనరు (అ. శి. వ్రాఁతప్రతి పాఠము).

25. [1] ఋత్వాను (అ. శి. వ్రాఁతప్రతి).

26. [1] తేట బఱపెద (అ. శి. వ్రాఁతప్రతి పాఠము).

వ. అట్టి, స్వరయతులు చతుర్విధము, అందు మొదలి (1) సహజ స్వర యతి లక్షణము. 27

తే. పద్యచరణాది నచ్చు(లు) వరఁగ నిలిచి
యచ్చు హల్లులపై స్వరమందు నంది
యదియె సహజస్వర విరామ మండ్రు సుకవి
వరులు స్వరయతుల(ందు గోపాల) కృష్ణ! 28

*(అనంతుని ఛందోదర్పణము - 1.92)

తే. ప్రాది నిత్యసమాస శబ్దములు గాక
పెఱ పదంబులపై నచ్చు బెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబగురుఁడు
శ్రీకుఁ దమరాన్వయాబ్ధి పూర్ణేందుఁ డనఁగ. 29

[కవిజనాశ్రయము - సంజ్ఞ - వ. 63]

క. అఆఐఔలకు మఱి
ఇఈలు ఋకార సహిత మె ఏలకునై
ఉఊల్ దమలో నొదఁబడి
ఒఓలకు వళ్ళగు న్నయోన్నత చరితా! 30

అనంతవగారు - [ఛందోదర్పణము - 1.82]

ఆ. అగు వకారమునకు నైత్వౌత్వములు వడి
ఈకి ఋత్వమునకు నేత్వ మమరు
మత్వమునకుఁ దనరు నోత్వ మీగతి స్వర
యతులు విస్తరిల్లు నబ్జనాభ! 31

తత్ప్రయోగ లక్ష్యములు - [*కావ్యాలంకారచూడామణి - 7.33]

29. *ఇత్యాది "రఘునాథయ్యగారి దీపికయందు" - అని అ. శి. వ్రాఁత ప్రతి (రా).

తే. అవని ధర్మజుఁ బోలు విశ్వార్య చర్య
నాదిరాజుల దొరయు విశ్వేంద్రభూతి
అరులఁ బ్రహరించు బాహు దండౌఘమునను,
విధుకులాగ్రణి చాళుక్య విశ్వవిభుఁడు. 32

వ. మఱియును — 33

[కావ్యాలంకారచూడామణి - 1.34]

ఆ. ఇనజుఁ[1]దీగి భారత్రీకుండు చతురత
నేకవీరుఁ డాజి బుజాతయందు
[2]బూజరిపుఁడు సిరి నహీనుండు భూవహ
నమున [3]విశ్వమనుజనాథ విభుఁడు 34

చిత్రపు భీమన పీనములో గీతి —

తే. భృగు వసిష్ఠాది (ముని) మనోభీష్టఫలద
ఋగ్యజుస్సామ నుతపద యీశ భక్త
సమితి రక్షింపు మనియెడి సంజ్ఞలెల్లఁ
గూడఁ జెప్పిన పీగతి గుణకమైత్రి. 35

*భాస్కరుఁడు —

తే. ఉర్వి నగ్రజభక్తుఁడై యొప్పు గలిగి
ఊర్మిళానాథువలె మఱియొక్క పురుషుఁ

32. *"శ్రీధరుఁడు" అని అ. శి. వ్రాఁతప్రతి.

34. [1]"ఈఁగి" పారబిందుకముగా శా. ప్రతి. [2]బుత్తువిభుఁడు సిరి నృపేంద్రుఁడు భూవహ (వ్రాఁతప్రతి పాఠము). [3]విశ్వనాథనృపవరుండు (వ్రాఁతప్రతి పాఠము. దీనిని గ్రహించిన యతిభంగమగును).

36. ఈ పద్యము భాస్కర రామాయణమునఁ గానరాదు. భాస్కరచ్ఛందములోనిది కానోపును. గణపవరపు వేంకటకవిగారి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు భాస్కరచ్ఛంద ముదాహృతము.

దురు శరముఁ బూన నేర్పునే యొనరననుచు
సన్నుతించిరి సాకేత జనము లెల్ల. 36

శబ్దశాసనుఁడు - ఆదిపర్వము చంపకము ౧-వ పాదమున సహజస్వర యతి ప్రయోగ లక్ష్యము — [1-15]

చ. అమల సువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేద విప్రులకు దానముఁ జేసినఁ దత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథాశ్రవణాభిరతి న్మదీయ చి
త్తము సవిశంబు భారత[1]కథాశ్రవణప్రవణంబు గావునన్. 37

సంకుసాల వరనన్న కవికర్ణరసాయనము చం. నాలుగుపాదాల లక్ష్యము [5-122]

చ. అడుగని యండజాదులకు నాఁకలి దీఱక యున్నె, దీనుఁడై
యడిగెడివాఁడు నెంత ఘనుఁడైనను హీనుఁడు గాఁడె, హీనుఁడై
యడిగెడివాఁడు తృప్తిపరుఁడౌనె, యతృప్తుఁడు సౌఖ్యమొందునే,
యడుగుట యెన్నిజన్మముల కాఱడి నెవ్వగవో తలంపఁగన్. 38

*అచ్చవెల్లి రంగన్నగారు రామాయణము ద్విపద ౧ పాదార్ధమున సహజ స్వరయతి లక్ష్యము —

ద్విపద. ఎసఁగి దివ్యులఁ బెంప ఋషుల మన్నింప
నసురుల శిక్షింప నవనిఁ బాలింప. అన్నారు 39

వ. ఇవి సహజస్వరయతికి లక్షణప్రయోగలక్ష్యములు. ఇఁక నందు — 40

---

37. [1]. థాశ్రవణంబు గావునన్ (తి).

39. * ఈ ఆశ్వాసమునందలి 220 పద్య శీర్షికయందు 'అచ్చవెల్ల రంగనాథుఁడు' అని లిఖితమై యున్నది. ఇందు "అచ్చవెల్ల - వెల్లి" అను నుభయరూపములు గానవచ్చెడు.

## (2) వర్గయతి లక్షణము

సీ. కరతలాంచిత దర గాంభీర్య సాగర
ఖగరాజ(సు)తు రంగ ఘున విభాంగ
చక్ర నందక పాంచజన్యాది సాధన
ఛత్ర గోవర్ధన ఝుష శరీర
టంకారి చాప కుఠార శోభితకర
డంభప్రపంచనాటక విహార
తలఁప నన్నియును మిథ్యయు నీవ తథ్యంబు
దశారి విమత సంధా విధాన

తే. పరమ కరుణాలవాల వైభవ విశాల
ఫాలలోచన సఖ గోపబాల యిటులఁ
జను కచటతప వర్గు లణ నఙఞమలు
దక్కఁ దక్కిన యా నాలుగక్కరముల
యందు విలిపిన నది వర్గయతులు కృష్ణ! 41

భీమనగారు [కవిజనాశ్రయము - సంజ్ఞ. ప. 65]

క. ఏక్కువమయ్యెడ వర్గుల
యక్కరముల వళ్ల విలుపనగు ఙఞణనమల్
దక్కఁ బెఱ నాలుగింటను
దిక్కరి సన్నిభుఁడ! దేవ! ధీజన వినుతా! 42

అనంతనగారు - [ఛందోదర్పణము - 1-105]

క. [1]నెలకొని కచటతపంబుల
తలకొక్కక వ్రాయి దొలఁగఁ దమ తమ నాల్గణ
విలపిల్లు వర్గయతులనఁ
గలికల్మషతిమిరహరణ ఘనవిభ వర్ణా! అన్నారు. 43

43. [1]తలకొని (ఛం. ద. పా.)

ఇందుకు ప్రయోగము శబ్దశాసనుఁడు ఆదిపర్వము ఉ. ४-వ పాదమున లక్ష్యము [1-22]

ఉ. భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసి ఘోర సం
సారవికార సంతమసజాల విజృంభముఁద్రోచి సూరిచే
తో రుచిరాబ్జ బోధన రతుండగు దివ్యపరాశరాత్మజాం
భోరుహ మిత్రుఁగొల్తు మునిపూజితు భూరియశోవిరాజితున్. 44

వ. అన్నారు. ఇది వర్గయతికి ప్రయోగ లక్ష్యము. ఇఁక నందు — 45

(8) సరసయతి లక్షణము

సీ. అయహ లొండొంటితో నమరును, మఱి ఙనల్
చను నొక్కొకొకటితో సరవితోన,
చ ఛ జ ఝ ములఁ జెందు శషసలు దమలోన
నవియెట్టులన నుదాహరణ లివియె
ఆశ్రితామరభూజ యాదవకులరాజ
యమిత సంతతభోగ హారియనఁగ
నవనీతచోర గుణాఢ్య సర్వే(శ్వర)
సకలలోకాధీశ జానకీశ

తే. శాశ్వతోదారధీర కచ్ఛప శరీర
చక్రధర నక్రహర సుభాషావిశేష
సర్వ కారుణ్య రస వినిర్ఝర సమూహ
యనఁగ నీరీతి సరసవ ళ్లమరుఁ గృష్ణ! 46

అనంతనగారు [ఛందోదర్పణము 1-107]

ఆ. ఙనలు చెల్లుఁ గమలనాథ యొండొంటికి
నయహ లొనరి యుండు హస్తి వరద

శషస లొనరి యుందు [1] చఛజఝమ్ములతోడ
సరస వళ్లనంగ జలధి శయన! 47

ఇందుకు ప్రయోగ లక్ష్యము - శబ్దశాసనుఁడు ఆదిపర్వము కందము ౨-వ పాదమున యకారహకారములకు లక్ష్యము - [1-16]

క. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్. 48

మఱియు నందే యీ వడికే అకార హకారములు యతి నిల్చినందుకు ఉత్పలము. ౪-వ చరణమునను నన్నయభట్టు ప్రయోగ లక్ష్యము. [ఆది. 6-111]

ఉ. ఇమ్ముల నాత్మరక్ష విధియించు విధమ్మున మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగా వలయుఁ దత్పరిరక్షణశక్తి నెల్ల కా
ర్యమ్ములు సిద్ధిఁబొందుఁ బరమార్థము మంత్రవిభేదమెన్నఁ గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతికైనను నేరఁ బోలునే. 49

మఱియు నందే ఋకార సవర్ణంబులకు కం. ౨-వ పాదము లక్ష్యము. [ఆది. 6-112]

క. పలుమఱు శపథమ్ములు నం
జలియును నభివాదములును సామప్రియ భా
షలు మిథ్యావినయంబులు
గలయవి దుష్టస్వభావ కాపురుషులకున్. 50

మఱియు అకార హకారములకున్ను, ఋకార నకారములకున్ను కృష్ణ-గోపికాలంకారమున - ఉత్పలము ౧-వ పాదమున ౩-వ యడుగున ౪-వ చరణంబున ప్రయోగ లక్ష్యము —

---

47. [1] ఒనరియుండుఁ జఛజఝ - అని ముద్రితముపై సరళాదేశము చేయబడె. లిఖిత ప్రతిలో సరళాదేశము లేదు. స్పష్టార్థము ఇందును జకారాదేశము చేయఁబడలేదు.

ఉ. హారము లున్నత స్తనములం దొదఁ గూర్చు రచించుఁ బెక్కలం
కారములన్ గరమ్ములఁ దగన్ దనలీలల వింపొనర్చు శ్రీ
ధారుచిఁ జూపు మాత్మరతి నైపుణ భేదములం బెనంగు నీ
శౌరి లతాంగి యౌవనము సర్వము నీవిభుచేతఁ జిక్కదే. 51

వ. ఇవి సరసయతికి ప్రయోగలక్ష్యములు. ఇఁక నందు — 52

(4) దేశీయయతి లక్షణము

తే. అ ఇ ఉ ఏ ఓ లు మొదలైన యచ్చులందు
హల్లులొక్కొక్క యెడఁ జెల్లు యతులు కృతుల
ఓషధీశార్క నేత్ర! భాసుర చరిత్ర!
యనఁగ దేశీయ సంజ్ఞలఁ దనరి కృష్ణ! 53

తే. అవని దేశీయ పదగత హల్లులకును
అ ఇ ఉ ఏ ఓ లు మొదలైన యచ్చులకును
నెలమి దేశీయ సంజ్ఞలై కృతులఁ జెల్లు
నెలమి రాణించి నీచె తెమ్మొరలు చాల
ఇలను సుకవులు మెచ్చఁ గ్రిక్కిరిసెఁ గృష్ణ! 54

వ. మఱియును, 55

తే. అఖిలకెంతయుఁ బ్రియము నెత్తమ్ము లనఁగ
నీశ్వరుఁడు మౌళిదాల్చెఁ గ్రొన్నెల యనంగ
నచ్యుతు భజింపు మీవు గ్రన్నన యనంగ
నమరు నీరీతి దేశీయ యతులు కృష్ణ! 56

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము - 1-19]

తే. అచ్చుతోఁ గూడి దేశీయ మనెడి విరతి
యెన్న నొక్కొకచోటఁ గ్రిక్కిరియుఁ గృతుల
సరస లక్షణ కవులు గ్రచ్చుఱ నొనర్చ
భంజితాసుర సముదాయ! యాంజనేయ! — అన్నారు. 57

ఇట్టి దేశీయపదంబు లెట్టి వంటేని —

సీ. *మక్కువ, యెక్కటి, చక్కటి, సూడిద,
యేడ్తెఱ, పుయిలోట, యెల్లిదంబు
గ్రచ్చఱ, మచ్చిక, పుచ్చడీక, బిడారు,
(వెలుతురు), రవణము, వెరవు, నెమ్మి,
గారదము, వెడ, వెక్కసముచు, వెవ, వెన్ను,
పీనులు, (సా)మే(ను), పీపె, లగ్గు,
అలుక, రజ్జులు, వంత, యాబిడ, యీబిడ,
విరు, (డో)గిరంబును, వింగి, కడిఁది,
ఎఱుకువ, యెసకము, నఱిముఱి, కఱకటి,
యోహరిసాహరి, యుల్ల, మలఁతి,
బమ్మెర, నెమ్మోము, ప్రబ్బ, కట్టఁడి, టక్కు,
కైలాటమును, లలి, గాలి, కడిమి,
అకు, విలాతి, సయ్యాట, ముంగడ, యెల్లి,
చిదురుట, పదరుట, పదరు, లలివు,
వాలాయ, మక్కటి, వరకువ, వేనలి,
వాఁగు, పొక్కుడు, మేటి, వాఁక, తోఁట,

తే. కనలు గదురుట, తివురుట, కనవు, క్రేణి,
పొలఁతి, కోరలు, వి(సుగు), వందురి, రపంబు,
(చేను), మన్నన, చొప్పు, లొచ్చెము లనంగ
నవవి దేశీయభాషలై యలరుఁ గృష్ణ! 58

వ. (దీనికి వివరము) మక్కువ, ఎక్కటి, చక్కటి, సూడిద, ఏడ్తెఱ = భయము, పుయిలోట, ఎల్లిదము = జాగ్రత్త; గ్రచ్చఱ, మచ్చిక =

---

58. *ఇది ప్రాఁతలోఁ బద్యరూపమున లేదు. క్రింది పదచ్ఛేదరూపమునను నటనటఁ డీకలతోను నున్నది. తేటగీతి తుదిపాదము గలదు. ఇందలి పదక్రమము కూర్చి సీసపద్యము రూపొందింపఁబడినది.

పరిచితి; పుచ్చడీక, బిలారు = గని, [1]వెలుతురు - కాంతి, రవణము = ఒరరుకొనేది, వెరవు, నెమ్కి, గారడ, వెక్కసము, వెడ = చూరము, వెన, వెన్ను, పీనులు, హరమేరు, లసున, పీఁక, వెర, లగ్గు, యోగి, మాగి, వెపలు, అలుక, రజ్జులు, వంత = దుఃఖము, సొగసు, అబిద, ఈబిడ, నిరుఓగిరంబు = అన్నము, వింగి = ఆకసము, కడింది, ఎలుకువ = తెలివి, ఎపకము = హేళనము, మాడ్కి, అరిముఱి, కలుకటి, ఓహరి సాహరి = పోవుట వచ్చుట, ఉల్లి = తక్కువ, మలంతి, బమ్మెర = ఇంటిపేరు, నెమ్మోము, తగుల్నది, ప్రద్వ, కట్టెఁడి, టక్కు = చేతిముడుకు, కైలాటము, లలి, గాలి, కడిమి, ఆకె, విలాతి, నయ్యాట, ముంగడ = సామీప్యము, ఎల్లి, చిదురుట, వదరులు, ఉలివు = మణిగేది, వాలాయము, అక్కటిక, వరకువ = కోపము, వేనలి, వాఁగు, సొక్కుడు, మేటి, వాఁక, తోఁట, కనలు, గదురుట, తివురుట, కసువు, శ్రేణి = సమూహము, సొలఁతి, కోరలు, విసుగు, వందురి, రవంబు, అలమన్నన, చొప్పు లొచ్చెము — 59

వ. (ఇవి) దేశీయ యతికి లక్షణ లక్ష్యములు. 60

## (5) జ్ఞయతి లక్షణము

సీ. యజ్ఞంబునకు జన్న మాజ్ఞప్తి కానతి
యాజ్ఞ కానరు సంజ్ఞకరయ సన్న
విజ్ఞాపనమునకు విన్నపంబను నివి
జ్ఞాకు నాతెలుఁగుల జరగు తద్భ
వములనఁ గలిగిన వానిలో జ్ఞయతినాఁ
జను విల్చిన జనలు జ్ఞాకు వడులు
క్రమమున, దదుదాహరణలు దెల్పెదను సు
జ్ఞానాదికులు సర్వసములు నాఁగ
తే. జ్ఞానహీనులు దుష్టమానవు లనంగ
జ్ఞాతి హితుఁ డనరాని విజంబు నాఁగ

---

59. [1]వాతిరి. (అ. శి. వ్రాఁతప్రతి.)

నళిన నాభుఁడు వచ్చె యజ్ఞమున కనఁగ
జ్ఞయతు లీగతిఁ జెల్లును జగతిఁ గృష్ణ! 61

అనంతనగారు [ఛందోదర్పణము I-113]

తే. అప్రసిద్ధముల్ జ ఞ ఙ శబ్దములందు
[1]జ్ఞాజ సంయుక్త తద్భవ వ్యాజమునను
నజలతో నొంది విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహోదరాశ్రితులు [2]సంజ్ఞాను లనఁగ. 62

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము I-22]

తే. జ్ఞాకుఁ దెనుఁగు తద్భవమయ్యె నా దలిర్చు
దాన భువి [1]నావడి జ్ఞాకుఁ దగు విడంగ
నవ యశోజిత చంద్ర! ప్రజ్ఞా ఫణీంద్ర!
ఖండితాసుర సముదాయ! యాంజనేయ! 63

భీమన ప్రార్థనాపంచకము - ఉత్పలము 3-వ పాదాన నకారజ్ఞకారములకు జ్ఞయతి ప్రయోగము లక్ష్యము.

ఉ. శ్రీలలనా తనూభవ (విశేష) జగజ్జయ మూల, మన్మథా
జ్ఞాలతికాలవాల, రతినాథ [1]కరాళ మదాంధ గంధ శుం
డాల విలో(ల) బాహు విలుఠత్కుశవాల, విశాల, మంచవా
తూల, మదీయ కాంత ధృతి దూలఁగ నేపునవీవకుందుమీ. 64

---

62. [1] జ్ఞాజ సంయుక్త (ల. శి. వ్రాఁతప్రతి).
[2] సుజ్ఞానులనఁగ (ఛం. ద.).

63. [1] నావడిజ్ఞాజ — ఈపాఠమే ల. సా. సం. ముద్రితప్రతిలోను నున్నది. ఇందు వడిలోని 'డి' గురువు కావలసివచ్చును. భిన్నపదములు గాన గురువు కాఁజాలదు. అప్పటున గణభంగమగును. 'దానభువిని నావడి జ్ఞాజ' అని సవరింపనగును.

64. [1] మరాళ (సులక్షణసార పాఠము).

మఱియు సోమయాజి ప్రయోగము - శాంతిపర్వము - కందము ౪-వ పాదమున న వర్ణమునకు జ్ఞాయతి లక్ష్యము [౬-90].

క. జ్ఞానంబు వడయుటకు వా
జ్మానసములను నియతములు గావింతురు న
న్మానిత శాంతి కొఱకు వి
జ్ఞానంబున నాత్మనియతి సలుపుదురు బుధుల్. 65

మఱియు వరాహము ఉ. ౩-వ పాదమున నకారమునకు జ్ఞయతి ప్రయోగ లక్ష్యము [1-95].

ఉ. ఆనలినాక్షి నవ్వుటయు నంతన నామహిమంబు దూలెనో
కాని వసుంధరాధిప! వకావకలై పడిపోయి బ్రహ్మ వి
జ్ఞానము, వేదశాస్త్ర పఠన ప్రతిభా విభవంబు గానవి
ద్యా నిపుణత్వముల్, దపము, ధర్మవిధిజ్ఞతయుల్, వివేకముల్. 66

జ్ఞకారమునకు అల్లసానిపెద్దనగారు నత్యావధూప్రణయప్రబంధమున మత్తేభము ౧-వ పాదము లక్ష్యము.

మ. కనువిందై యభిషిక్తుఁడైన విభునాజ్ఞం గొల్వలో సీత యి
చ్చిన ముక్తామణిహారమెవ్వఁడు ధరించెన్ మేరుకూటంబుఁ జు
ట్టిన మిన్నేఱనఁగా మెఱల్ బెడఁగుఁ బుట్టింపంగ నయ్యాంజనే
యు నజేయుల్ గరుణావిధేయు విరపాయుం గొల్తు వాంఛారతిన్. 67

వ. ఇది జ్ఞయతి లక్షణము. ఇఁక నందు, 68

## (6) ఉభయయతి లక్షణము

తే. వెలయు యుష్మదస్మచ్ఛబ్దముల దకార
[1]హల్లుతో నచ్చు యుతములై చెల్లు విశ్రు

69. [1] హల్లులతో నచ్చు — అని లిఖితప్రతిపాఠము. తృతీయావిభక్తి ప్రత్యయము 'తో' దీర్ఘాంతము. ఈ హ్రస్వాంతరూపము అసాధువు. కాన సవరింపఁబడినది.

తమ్ముభయయతియన యుష్మదంఘ్రియుగళ
మాశ్రయించెద మతి నస్మదవన కృష్ణ! 69

*అనంతనగారు—

ఆ. [1]యుష్మదస్మదనెడి యుభయంబునకుఁ [2]బొల్లు
నచ్చుగూడి ద్వివిధమయ్యె విరతి,
తరమె కృష్ణ! యుష్మ దవతార కథనమ్ము
లభినుతింప నస్మదాదులకును. 70

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1-15]

తే. జగతి యుష్మదస్మచ్ఛబ్ద యుగళమునను
తగునుభయరూపయతి యస్మదలఘు సుకృతి
యనని వెలయుటయది యుష్మదతిశయమన
భంజితాసుర సముదాయ! యాంజనేయ! 71

ఇది లక్షణ; మిఁక నన్నయభట్టు ఆదిపర్వము సర్పయాగము పట్టు;
క. ౨-వ పాదమున ఉభయయతి ప్రయోగము లక్ష్యము [2-216].

క. ప్రస్తుత ఫణి [1]సత్త్రిభయ
త్రస్తాత్ములమైన యస్మదాదుల కెల్లన్
వ్యస్తియొనర్పఁగ నవసర
మస్తికునకయ్యె విప్ర తంబుజనేత్రా! 72

వ. ఒక్కొక్కదిక్కున వికల్పయతిన్ని ఈ ఉభయయతిన్ని ఒకతీరై కనఁ
బడును. ఇది ఉభయయతి లక్షణము. ఇఁక నందు, 73

---

70. * ఈపద్యము నేఁటి ముద్రిత ఛం. ద. న కానరాదు.

1 యుష్మదస్మదనెడి - యుష్మదస్మత్తనెడి - అని యుండవలెను. మూలపాఠములోని అనుకరణసంధి విలక్షణమైనది.

2 పొల్పు (పొ).

## (7) అఖండయతి లక్షణము

తే. ఉక్కళన గ్రచ్ఛళన నేపథోలమాన
గ్రక్కదల తెమ్మెరనఁగ నారాయణాఖ్య
నాకలోకైకము లఖండనామయతుల
కిరవు హల్లులపై స్వరమిడినఁ గృష్ణ! 74

అథర్వణాచార్యులు [అథర్వణచ్ఛందము]

క. ఆనారాయణ లోకే
కానేక పదమ్ము లచ్చు లక్షరములు రూ
పైన తదక్షర మేవడి
గావిడిన నఖండ నామకంబగుఁ గృతులన్. 75

దీపికయందు వార్తాకవి రఘునాథయ్యగారు —

తే. ద్వీపనాక నిత్యప్రభు దేశ్యయతులు
వ్యంజన స్వర గూఢస్వరాది యతులు
వృద్ధియతులు నిజాఖ్యల వెలయు నివియె
నగు నఖండముల్ యతులకు హల్లులిడఁగ. 76

మఱియు రఘునాథయ్యగారు —

క. [1] అలనిత్యసమాసములో
పలఁజూమ్మి దేశ్యయతులు ప్రభునామయతుల్
తలఁపఁగ నిత్యసమాసమె
యలరు నఖండంబనంగ నయ్యెయెడలన్. 77

చిత్రపు భీమనగారు —

ఉ. ఉక్కళనాఁగఁ దెమ్మెరన నొప్పుగ నేపథు నోలమావ నా
గ్రక్కదలంగనా మఱియు గ్రచ్ఛళనాఁ జమవిట్టివన్నియున్

72. [1] థయాయస్తా (సంశో. భా. పాఠాంతరము)

77. [1] అలినిత్య (తి.)

నెక్కొను దేశ్యపున్యతులు నిత్యసమానములంగా వచించినా
రొక్కమతంబునం దివియు నుర్వి నఖండములండ్రు సత్కవుల్. 78

వ. మఱియును, 79

♦♦క. *ఉక్కళ దెమ్మెర లేపఱ
గ్రక్కద లన నోలమాస గ్రచ్చఱ లనఁగా
నెక్కుపదము లిరుదెఱఁగుల
నిక్కమని యఖండయతి గణించిరి సుకవుల్. 80

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 1-16]

తే. ఒక్క వర్ణంబె స్వరమూఁద నొకట స్వరము
గలియకుండఁగఁ గూర్తు రఖండయతుల
[1]రామపదపద్మసేవా వరాళియనుచు
ఖండితాసురసముదాయ! యాంజనేయ! 81

[*కవిజనాశ్రయము. సంజ్ఞ. 66]

ఉ. మానుగ విశ్రమాక్షర సమన్వితమై స్వరమూఁదినం దదీ
యానుగుణాక్షరంబె కొనియైనను జెప్పఁగనొప్పు నీక్రియగా
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
[1]పూనికతో నఖండవడి పొల్పగు నాదికవిప్రణీతమై. 82

వ. మఱియుఁ బాఠాంతరమున — 83

ఉ. *మానుగ నింద్రచంద్రగణ మధ్యమునందు యతి ప్రయుక్తమై
కానఁగఁ బడ్డఁ దత్స్వర వికల్పముచేయక యక్షరంబకాఁ

---

80. * ఇది యేలక్షణగ్రంథము లోనిదో?

81. [1] రామ పదపద్మలోల వరాళి. (తి; ల. సా. సం.)

82. * 'పాలుకురికి సోమేశ్వరుఁడు' అని ల. శి. వ్రాఁతప్రతి.

[1] పూనికతో నఖండయతి (క. జ. ఆ.)

84. * ఆంధ్రప్రయోగరత్నాకరము దీనిని ఛైరవచ్ఛందములోనిదిగఁ జేర్కొనెను.

బూన నఖండనామవడి పొల్పగు నాదికవి ప్రణీతమై
భాను సహస్రభాసి వృషభాధిపుఁడన్నటు లర్థయుక్తమై. 84

కవిలోకసంజీవనియందు ముద్దరాజు రామభద్రయ్యగారు [1.89]

మ. సుకవిస్తుత్యముగా నఖండవడి విల్పు న్విశ్రుతంబై యొకా
నొకచోటం జలజాతజాతశతమన్యుల్ సన్నుతుల్సేయఁగా
సకలోర్వీవలయంబుఁగాచుటకుఁ గంసాదిప్రమత్తాభియా
తికులంబెల్ల నడంచినాఁడు జితదైత్యేంద్రుం డుపేంద్రుండిలన్. 85

వ. అన్నారు. మఱియును — 86

క. ఛందస్సూత్రంబులలోఁ
బొందైన యఖండయతులు బుధనుతముగఁ జెం
పొంద లిఖించితి నింకొక
ఛందంబున వళ్లఖండసంజ్ఞను జెల్లన్. 87

క. అవి కొందఱు మెచ్చరు మే
లవునని కృతులందు సుకవులయ్యె యెడలన్
దివిరి రచించిరి గావున
వివరింతున్ దత్క్రమంబు విశ్రుతఫణితిన్. 88

ఆ. ఈయఖండయతి మహితబుద్ధిఁ దెలియని
వారు వెల్లదనుట కారణమునఁ
జతురబుద్ధిఁ దెలియ సమ్మతుల్ వ్రాయుదు
విచ్చ సుకవి వరుల మెచ్చుగాఁగ. 89

సోమయాజి కర్ణపర్వము చం. ౩.వ పాదమున 'అక్కట' యనుటకు అఖండయతి ప్రయోగము. లక్ష్యము [8.304]

చ. మఱియు [1]నతండు సూరసుతు మర్మవిభేదన [2]మాచరింపఁగ
న్మెఱుఁగులు గ్రమ్మ నమ్ముల నివిశ్చల ధైర్యముపేర్మి నాతఁ డు

90. [1] నరుండు సూతసుతు. (సంశో. భా.)
[2] శరింపఁ గ్రొమ్మెఱుఁగులు. (అ. శి. వ్రాఁతప్రతి) ఇంకను ఆఱిటి చెల్లదు.

క్క—అగఁ బెనంగినట్టియెఱ నగ్గలికన్ వెస నమ్మహాభుజుం
డతిమతి చీఁకటిం గవియునట్లుగ రోదసినించె నమ్ములన్. 90

'గ్రచ్చఱ' యనుటకు సోమయాజి ఉద్యోగపర్వము చం. ౪-వ పాదమున అఖండయతి ప్రయోగము. లక్ష్యము [1-176]

చ. తఱియగునంతకున్ రిపునుదగ్రత సైఁచుట నీతి, నీవు నా
కఱపినయట్లు చేయుము తగం జనియాతనిఁగాంచినన్ను నే
తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దలఁతేనియు నింకనేల గ్ర
చ్చఱ మువివర్గవాహనుఁడవై చనుదె మ్మనునంత దీతెదున్. 91

'ఓలమాన' యనుటకు సోమయాజి ఆనుశాసనికము కందము ౨-వ పాదమ్మున అఖండయతి ప్రయోగము. లక్ష్యము [1-68]

క. అతిథి వినుఁగోరెనేనియు
మతిఁగింకిరిపడక యోలమూనగొనక నీ
వతనికిఁ బ్రియంబు సలుపుము
నతికిన్ బతిపనుపుచేఁత సద్గతి గల్గున్. 92

'గ్రక్కదల' యనుటకు [ఎఱ్ఱన] నారసింహపురాణము, చం. ౩-వ పాదమున అఖండయతి ప్రయోగము. లక్ష్యము [3-34]

చ. చదువులు గోలుపోయి యొకజాడయుఁగానక బమ్మరించు న
మ్ముదుసలివేల్పుదేర్చి వెసముచ్చుబడిన్ బ్రళయాబ్ధినీటఁగ్ర
క్కదలకదాడి వెట్టిన [1]సగర్వభవత్తిమిరూప[2]మప్డు న
మ్మద మలరారియుండు మునిమానస పూరముల న్జగన్నిధీ. 93

'తెమ్మెర' యనుటకు సర్వదేవుని ఆదిపురాణము, చంపకము, ౪-వ పాదమున అఖండయతిప్రయోగము లక్ష్యము —

చ. మరువముఁ బొందిపొంది విరిమల్లియపూవులఁ జెంది చెంది వే
సరములు గ్రోలిక్రోలి జలజాత పరాగము దోలితోలి క

93. [1] యఖర్వ (ముద్రిత నృసిం. పురా.)
[2] మిప్పుడున్ మదరుచిగ్రోలుచుండు (ముద్రిత నృసి. పురా.)

వ్వరముల నెంచియెంచి సురపొన్నల తావుల నందియుంది తె
మ్మెరలు నిరంతరంబును భ్రమించుచునుండు వనాంతరంబులన్. 94

'నారాయణ' శబ్దమునకు ఎఱ్ఱాప్రెగడ అరణ్యపర్వ ఉత్పలము ౪-వ పాదమున అఖండయతి ప్రయోగము లక్ష్యము [7-272]

ఉ. నీయభిలాషయేను మదినిక్క మెఱుంగుదు నుగ్రశౌర్యుఁడే
డోయుదుఁ బార్థు నోర్తునని చూచెద నీకటులేల తీఱు, రా
ధేయ దయావిధేయుఁడు విధేయజగత్త్రయుఁ డవ్యయుండు నా
రాయణుఁ డమ్మహాత్మునకు రక్షకుఁడేటికి వాఁడు సాధ్యుఁడే? 95

'నాక' శబ్దమునకు సోమయాజి విరాటపర్వము కందము ౨-వ పాదమున అఖండయతి ప్రయోగము లక్ష్యము [5-124]

క. మును వెఱతునేయ మీరలు
నను నేసినఁగాని యనుచు నాకేశసుతున్
ధనురాచార్యుఁడు నిరువది
సునిశిత బాణములనేసెఁ జూపఱు పొగడన్. 96

'లోకైక' శబ్దమునకు వృద్ధియతియున్యను అఖండయతియైనందులకు లక్ష్యము భాస్కరరామాయణము విభీషణవాక్యము ఉత్పలము ౨-వ పాదము ప్రయోగ లక్ష్యము [యుద్ధకాం. 165]

ఉ. ఓకపివీరులార! కరుణోదధి నీ రఘురాము సర్వలో
కైక శరణ్యునిన్ గొలువఁగా నిటువచ్చితి నొండుగాదు నా
రాక, మహాపరాధియగు రావణు తమ్ముఁడ, నే విభీషణా
ఖ్యకుఁడ, వీరు నాసచివు లర్కకులాగ్రణి! చిత్తగింపవే. 97

ఇఁక 'ఏక' శబ్దమునకు ఏకభీమనగారు కందము ౨-వ పాదమున అఖండయతి ప్రయోగము లక్ష్యము —

క. [1]భీమకర కామక్రోధా
నేకానల విస్ఫులింగ విఘాతహతిన్

98. [1] భీకర భీమక్రోధా. (తి.)

గాకవకారాగారము
ప్రాకటధూమాగ్నివట పరావృతమయ్యెన్. 98

ఇఁక సహజ హల్లులకు అఖండయతి ప్రయోగలక్ష్యము.

శబ్దశాసనుఁడు ఆదిపర్వము కందము ४-వ పాదమున అఖండయతి ప్రయోగము. [5-131]

క. నావచనమున నపత్యము
గావింపుఁడ గుంతి మీకుఁ గడు నెయ్యముతో
మీ వగచిన యీ యర్థముఁ
[1]జూవె మనంబునను దలఁచుచుండెద నేనున్. 99

భీమనగారి చంపకము మూఁడవపాదమున హల్లుకు అఖండయతి ప్రయోగము లక్ష్యము.

చ. వెలవెలఁబాఱి తాల్మి గడు వేగెద వగ్గముడింగి దీధితుల్
[1]పొలుపఱికుందికంది ననుబోటియబోలెను వాపినూచి చం
చలగతిఁ బొంది చిక్కితిఁ గృశాంగుఁడనైతి శశాంక ! నీవునున్
గళిత సురంగమంగళ వికాస విభాసిని కుందభాసితే. (?) 100

భాస్కరుఁడు రామాయణము విభీషణవాక్యము ఉత్పలము ३-వ పాదమున అఖండయతి ప్రయోగము లక్ష్యము [యుద్ధకాం. 142]

చ. అన్నవు తండ్రియట్ల విను మంతియకా దటమీఁద రాజ వే
మన్నను లెన్సయౌను [1]మణిమండనముఖ్యములైన కానుకల్
మున్నుగ సీతనిచ్చి జనలోకహితుంగని మమ్ముఁబ్రోవుమీ
వన్నపుకార్యముల్ వలను సంధియ మే లటుగాక తక్కినన్. 101

---

99. [1] చూచె మనంబునఁ దలంతు సుందరి యొప్పుడున్. (అప్ప. 3-204)
99. 101 పద్యములలో అప్పకవి అఖండవడి పాఠమును దొలఁగించెను.

100. [1] పొలుపఱికందిపొంది. (తి.)

101. [1] మణిహారములాదిగఁ జెక్కు కానుకల్. (అప్ప. 3-207).

క్షేమేంద్రుఁడు కందము ౨-వ పాదమున హల్లుకు అఖండయతి ప్రయోగ లక్ష్యము —

క. ఒకమతమున మ ధ్యానా
మికలను నిరుద్రేల సవ్యమిడి మఱియపన
వ్యకరముగ విడఁ బ్రిషంబ్రము
ప్రకటమహాపాతకప్రపంచముఁ దెలుచుఁ. 102

సూరపరాజుగారు రాఘవపాండవీయము ద్వితీయాశ్వాసమందు కందము ౨-వ పాదమున హల్లుకు అఖండయతి ప్రయోగ లక్ష్యము [4-153]

క. వేమఱు మన గుర్వశ్వ
త్థామలకీ ఘోరవీరతరుబాణకదం
బామిత వర్షము దుస్తర
మై మెఱసెఁ దదప్రభేద్యుఁడయ్యె నితండుఁ. 103

శబ్దశాసనుఁడు అరణ్యపర్వము చంపకము ౪-వ పాదమున హల్లుకు అఖండయతి ప్రయోగము లక్ష్యము [6-357]

చ. ఉరమునయందుఁ గన్నులు పృథూదరదేశమునందు నోరుఁ బ్ర
స్ఫురిత భుజద్వయంబునను భూమి ధరోన్నతభావముఁ గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోఁడ నశేషసత్త్వ[1]ఘ
స్మరుఁడగుచున్నవాని [2]దివిజారిఁ గబంధునిఁ గాంచి రచ్చటఁ. 104

సోమయాజి భీష్మపర్వము ప్రథమాశ్వాసము మొదల కందము ౪-వ పాదమున అఖండయతి ప్రయోగము లక్ష్యము [1-6]

క. కాలం బగుటయు నృపులకు
నాలము సమకూరె దీని కతలకు మదిలో

104. [1] సంహారుఁడగు ...... దివిజారి. (అఖండకడితాని పాఠము. అప్ప. 8-210).

[2] ఖటుసత్త్వ. (సంశో, ఖా.)

నాలోకింపఁగ వలసిన
[1]పీలోవికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రీ! 105

సోమయాజి విరాటపర్వము ధర్మరాజు వాక్యము. ఆయుధ నిక్షేప సమయము. చంపకము ౪-వ పాదమున అఖండయతి ప్రయోగము లక్ష్యము. [1-160]

చ. ఇది పెనుపాముచందమున నెంతయు భీషణమై జనంబులన్
బెదరఁగఁజేయు నట్లగుటఁ బెట్టిచనన్వలయుం దలంచి నా
హృదయము దీనిఁబాయుటకు నియ్యకొనంజన దెట్లు చెప్పినన్
దుదినొకచోట [1]నైచుట యథోచిత కార్యము నయ్యెడుంగదా. 106

వ. అన్నారు. ఇటువలె మహాకవి ప్రయోగములు అఖండవడికి వెదకి వ్రాసి యున్నది. ఇఁక నందు — 106

(8) బిందుయతి యనఁబడు అనుస్వారయతి లక్ష్యలక్షణములు

సీ. వరుసఁ గచటతప వర్గవులేనింటి
తుద ఙ ఞ ణ న మ లు దొడరు ఙ ఞ ణ
వప్రసిద్ధములు శబ్దాదుల యందలి
తక్కిన ణనమలు దనరు మూఁడు
తమతమ పూర్వోత్తరముల నాల్గేసి య
క్కరములు బిందువుల్ గదియ నిడినఁ
జన బిందుయతులన స్వరయతులన నిరు
విధములై కృతులలో వెలయు విరమ

తే. ణములు బొజ్జను గమలజాండములు నిలిపి
నాటకముఁ బూని నందనందముఁడవయ్యు
మహినివర్తిల్లు విను మతింపన్వశంబె
యనఁగఁజెల్లు ననుస్వారయతులు కృష్ణ! 108

---

105. [1] శీలోనికి (సంశో. భా.)

106. [1] నైచుటయు తోఁచిన కార్యము (సంశో. భా.) ఇది యఖండవడిలేని పాఠము.

అనంతనగారు [ఛందోదర్పణము 1-116]

తే. భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
గ్రాకునిట నాల్గుఁజెల్లుఁ బాండవసహాయ!
నాకు నిట నాల్గుఁ జెల్లుఁ గంధర్వజనక!
మాకు నిట నాల్గుఁజెల్లు సంపదలరాజ! 109

భాస్కరుఁడు రామాయణము శార్దూలము ౩-వ పాదమున బిందుయతి ప్రయోగము లక్ష్యము [యుద్ధకాం. 143]

శా. క్ష్వేళాఘోషంబు నిరంతరం (బగుచు) ప్రోయం[1] బెల్లదంభోనిధా
రాఘోరాస్త్ర పరంపరల్ తరఁగలై [2]రంజిల్ల నాపూరితా
మోఘావృష్టిఁ దనర్చు రామధనురంభోరాశిదోర్విక్రమ
శ్లాఘా[3]పుంజము నేఁడు ముంచుఁ బెలుచన్ లంకాపురీద్వీపమున్. 110

మఱియు నందే భాస్కరుఁడు పవర్గునకు బిందుయతి చంపకము ౪-వ పాదమున ప్రయోగ లక్ష్యము. [యుద్ధకాం. 372]

చ. కవియెద[1] రెల్లరక్కసులు కమ్మలపండువుగాఁగఁ బైపయిన్
కనదురురత్నపుంజ కలికారుచిజాల నిరంతరంబులై
కనలుచు లంకపైఁ [2]దొరుఁగఁగా దశకంఠ కఠోరకంఠజం
బనవరత చండ మార్గణగణ స్ఫురణస్ఫుట విస్ఫులింగముల్. 111

భీమనగారు చాటుధార, తవర్గు, చంపకము ౧-వ పాదమున బిందుయతి ప్రయోగ లక్ష్యము —

చ. మనసిజు మాఱుమామ యభిమాన మణంచిన మేటిమామ నం
దమువి విరోధి వందమువి నందవి సుందరి మేనమామఁ ద్రుం

110. [1] జెల్లు. (శా.)
[2] రాజిల్ల వారి పూరితామోఘావృత్త (ముద్రిత భా. రామా.).
[3] శ్లాఘాగాథము (తి, ముద్రిత భాస్క. రామా.)

111. [1] కవిసెద రెల్లి (ముద్రిత భా. రామా.)
[2] నిగుడఁగా. (ముద్రిత. భా. రామా.).

చిన జగజెట్టిపట్టి పడనేసిన శూరుని తండ్రి తండ్రి సూ
నుని విజనాథుఁ బొక్కలి తమాళవునాయువు మీకు నయ్యెడుఁన్. 112

విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు టతప వర్గువులు మూఁటికి చంపకము ౨-వ పాదమున ౩-వ చరణమున ౪-న యడుగున విశ్రమంబుగా బిందు లక్ష్యము. [7-58]

చ. కినుకఁ జళుక్యవిశ్వనృపకేసరి చేసిన సత్కృపాణ దం
డనమున నబ్బుఁబో సురగణత్వము, తత్పదపారిజాత వం
దనమున నబ్బుఁబో మనుజనాథపదత్వము, దర్శనావలం
బనమున నబ్బుఁబో గహన మధ్యగృహత్వము వైరికోటికిన్. 113

వ. మఱియు నీబిందుయతియందే విశేషము. 'జ్ఞా'కు 'నా' తద్భవంగనుక 'జ్ఞా' కల తవర్గునకు బిందుయతి ప్రయోగము. 114

వరాహపురాణము మత్తేభము ౪-వ పాదమున లక్ష్యము.

మ. *అని గౌరీపతికిన్ భవానికిని నాహ్లాదంబుగాఁ బల్కి వే
చని లోకైక పితామహు న్నలువ నాస్థానంబులో నుండఁగాఁ
గని దేవా శశిఖండమౌళికి నుమం గల్యాణి నాకూర్మినం
దన నీనాత్మఁ దలంచి దేవరకు విజ్ఞాపింప నేతెంచితిన్. 115

వ. అన్నాఁడు. ఇది విశేషము. 116

శ్రీధరుఁడు —

తే. అరయ ననునాసికా పూర్వమగుచు వర్గ
పంచకములాది తత్తద్విభాతినున్న
చెల్లు ననునాసికల మీఁదఁ జేర్చిరేని
వినుతి కెన్నంగఁ బిన్న భూవరుని సోమ. అన్నాఁడు. 117

సోమయాజి *ఉద్యోగపర్వము ఉత్పలము ౩-వ పాదము బిందుయతి ప్రయోగము లక్ష్యము —

115. * ఈపద్యము నేఁటి ముద్రిత వరాహపురాణమునఁ గానరాదు.

*ఉ. అలము చేసి న న్నెలవ నన్నలినాక్షన కైనఁగాని కు
తిక్కలవిభేదనందనునితోఁ జనునే లఘువృత్తిదాల్చి మా
[1]పాలికి వచ్చిరేని వినుమావనమాలి కొసంగువాఁడ నేఁ
బోల సమస్త వస్తువులు ముందుగ ధర్మజు యజ్ఞవాహముల్. 118

వ. ఇది నిర్బిందుయతి విశేషము. మఱియు — 119

సోమయాజి ఉద్యోగపర్వము కందము. [1-226]

క. సవరణల నొప్పి యనిఁ బాం
డవ బలముల మార్కొనంగ [1]నడచుచు నత్యు
త్సవమునఁ బేర్చిన సేనల
నవకాశము లేమ విడియ హస్తిపురమునన్. 120

విష్ణుచిత్తీయము శార్దూలము ౩-వ పాదమున లక్ష్యము. (ఆముక్తమాల్యద 1-84)

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నఘరే యాలించినన్మ్రోయు నెం
తేనాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధాన ధ్వానము 'నాస్తిశాక బహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదన సౌష్ఠవంచ, కృపయాభోక్తవ్య' మన్పల్కులున్. 121

మనుచరిత్ర మత్తేభము ౨-వ పాదమున లక్ష్యము. [1-7]

మ. వనజాక్షోపము వామలూరు తనయుల్ ద్వైపాయనుల్ భట్టబా
ణుని కాముల్ భవభూతి భారవి సుబంధుల్ విల్హణుల్ గాళిదా
సుని మాఘుల్ శివభద్రు మల్హణకవుల్ చోరు న్మురారి న్మయూ
రుని సౌమిల్లుని దండిఁ బ్రస్తుతులఁ బేర్కొందున్ వచస్సిద్ధికై. 122

---

118. * భారతము సంశోధిత ముద్రణమున నిది కానరాదు.

[1] ఇందు కేవల పకారమునకు మకారముతో యతి గలదు. బిందుపూర్వక పకారము మకారముతోఁ జెల్లుట లక్షణసమ్మతము. లక్షణకారులే దీనిని నిర్బిందుయతివిశేష మనుచున్నారు.

120. [1] గడంగుచు. (సంశో. భా.)

పరావృతము అప్పన బృందాసంభవము ఉత్పలము ౨-వ పాదమున లక్ష్యము —

ఉ. లేజవరాంధ్ర చూపు చితికి న్మెఱుఁగెక్కిన కల్కి రేకు బం
డా జలిపించి తత్కుపిత నాథుల తాల్మిచిరాలు పచ్చతే
జీ జగరౌతుకంపెు వడిఁజించి హళాహళిసేయఁగాని యం
దే జగడంబులేమ భటులెన్న నలంకరణార్థ సాధకుల్. 123

రాఘవపాండవీయము మత్తేభము లక్ష్యము. [1-11]

మ. జననస్ఫోటకపాటిత క్షితిరజస్సంక్రాంతిచే నింకు పిం
ధువులం గ్రమ్మఱ నుర్వికిన్ దివికిఁ దోడ్తోనించెఁ దన్నాగముల్
నవవిర్యన్మద విస్ఫురౌఘమున కుండాళికరోద్ధ వ్రవ
ర్షవిధిం దానను కేసి సింధురములన్ బ్రఖ్యాతి గాంచెంగరుల్. 124

వ. అన్నారు. ఇవి బిందుయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నంను 125

(9) భిన్నయతి లక్షణము

తే. ఇలను హరివరించెను ధరియించె, గిరిభ
రించె భరియించె ననియెడి రీతి జగణ
మధ్యయతివగు, వడి యట్టిమధ్యరేఫ
విరళమై యుత్వమౌ భిన్నవిరతిఁ గృష్ణ! 126

అనంతన్నగారు [ఛందోదర్పణము 1-122]

క. అంచిత తిలకము శౌరి ధ
రించెననన్ జగణమధ్య రేఫ విరతి యౌ
నంచిత తిలకము హరివరి
యించెననన్ భిన్నవిరతి కిత్వమువచ్చున్. 127

వ. మఱియు, 128

[ఛందోదర్పణము 1-123]

తే. అట ఇకారాంతపదము మీఁదటివికార
మది యనంగ నవ్వల భిన్నయతికిఁజెల్లు
దివిజ విభవంబు శౌరిచేనిది యనంగ
నసుర వాళంబు హరిచేతియదియనంగ. 129

♦♦మ. *ఘనతం దర్వినలేఖ విల్పిశతసంఖ్యంబెంచి యిచ్చార్థముల్
వనధిన్ హెచ్చ గుణించి రాశి భజియింపన్ గల్గు లబ్ధంబు ***
*** లేదా *** వంబుఁజేయనగు సుప్రీయూధనాథుండు మీ
కనయంబుందగ విచ్చుఁగాత (శుభ) సౌఖ్యావాప్తి భాగ్యోన్నతుల్. 130

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము. 1-12]

తే. ప్రేమచే నీవు మమ్ము రక్షింతువనిన
జగణ మధ్యంబు భిన్న విశ్రమము దనరు
నీనవిత్వంబు విరళమై పూనుఁగనుక
భంజితాసురసముదాయ! యాంజనేయ! అన్నారు. 131

శ్రీరంగమాహాత్మ్యము ఉత్పలము 4-వ పాదమున భిన్నయతి ప్రయోగము లక్ష్యము —

ఉ. గంధపుఁగొండనెత్తములఁ గందువ నేలకి తీవయిండ్లలోఁ
గ్రొందలిరాకు పాన్పున సుఖించి వితాంత రతిశ్రమంబునుం
జెందిన వెంచుగుబ్బెతల చెక్కులఁజిమ్ము జవాదివాసనల్
విందులు సేయుచు న్మెలఁగె వేఁకువఁ గోమలగంధవాహముల్. 132

వ. ఇవి భిన్నయతిప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు 133

---

130. * ఈ పద్యమున శాకరము దెలియరాదు. ఈ పద్యపాఠము సరిగా లేదు. అర్థముకూడ దురూహము. మఱి యింతు భిన్నయతి లక్ష్యముగా గానరాదు. 'గుణించి, భజియించు' శబ్దములున్నవిగాని యవి యతి స్థానస్థితములుగావు. ఈ పద్యమున కింతఁగల ప్రయోజన మరగతము గాదు.

## (10) ప్రాదియతి లక్షణము

తే. ప్రాదులిరువదికోసనప్యాజ్ఞలనఁగ
వెలయునుపసర్గలివి రెండు తెలుఁగుకృతులఁ
జొరవు మిగిలిన వానిపై స్వరములూన
అచ్చులకు హల్లులకుఁ బ్రాదియతులు కృష్ణ ! 134

వ. ప్ర, ఉప, ఉత్, అభి, నిర్, (దుర్), సమ్, వి, అను, అవ, అతి, అనఁ
బడిన యీ ఉపసర్గలకు క్రమంబుగా ప్రాదియతులకు ఉదాహరణ
లక్ష్యము — 135

సీ. అంభోజ భవముఖ ప్రార్థిత చరణాబ్జ
యిందిరాకౌస్తుభ శోభిత వక్ష
దానవ భీకరోదగ్ర చక్రాయుధ
యిహపరముఖ సుఖాభీష్టఫలద
అణిమహాత్మ్యార్థ నిరంతర వైభవ
రావణాద్యఖిల దురాత్మదూర
ముచికుంద వరద సముల్లసద్బ్రహ్మరు
ద్రేంద్రాది సురబృంద (వేద్య) చరణ

తే. అమిత సద్యోగమౌని మనోనురాగ
భక్తలోకైకపోష యపాస్తదోష
అసమగుణ సీమరాజితా త్యధికమహిమ
యనఁగఁ బ్రాదుల కివి యుదాహరణముహరి ! 136

భీమన్నగారు [కవిజనాశ్రయము. సంజ్ఞ. 67]

క. ప్రపరాపసమనుసుప్ర
త్యపి నిర్దురధిన్యుపాభ్యుదా ఙ్వ్యత్యవవ
ర్యుపసర్గ వింశతికి వ
ళ్లుపరి స్వరయుక్తమైన నుభయముచెల్లుఁగా. 137

[ప్ర - పరా - అవ - సమ్ - అను - సు - ప్రతి - అపి - నిర్ - దుర్ - అధి - ని - ఉప - అభి - ఉత్ - ఆఙ్ - వి - అతి - అవ - పరి — ఇవి యిరువది యుపసర్గలు]

అనంతన్నగారు [ఛందోదర్పణము 1.93]

క. ధర ముపసర్గలు ప్రాన్వవ
దురపాభిప్రతి సువిన్యుదుప పర్యధివమ్
విరతిపరాఙపు లిరువది.
పరాఙపులు చొరవు తెలుఁగు [1]భాసము నెందుఁగా. 138

చిత్రకవి పెద్దన్నగారు [లక్షణసార సంగ్రహము 1.3]

తే. ప్రాదు లిరువదిలోఁ బరాఙపులు దక్క
నవ్వియుపసర్గలు స్వరసమన్వితముగఁ
బ్రాదియతులగుఁ గీర్తిపై భవుఁడవంగ
ఖండితాసుర సముదాయ! యాంజనేయ! 139

వ. భీమన్నగారు ఇరువది ఉపసర్గలకున్ను ఉపరిస్వరయుక్తమైన మైత్రియముఁ జెల్లునన్నారు. అనంతన్నగారు, పెద్దన్నగారు, పరా, ఆఙ్, అపి యనఁ బడు ఈ మూఁడు ఉపసర్గలు తెలుఁగునఁ జొరవు. మిగిలిన ౧౭ ఉపసర్గయుఁ జెల్లునన్నారు గాఁబట్టి అందులకుఁ గ్రమంబున ప్ర - అవ - సమ్ - అను - సు - ప్రతి - నిర్ - దుర్ - అభి - వి - ఉప - అధి - ఉత్ - వి - అతి - అప - పరి - యనంబడు పదునేడు ఉపసర్గలకు శబ్దశాసన సోమయాజులు మొద లగు మహాకవి ప్రయోగంబులు వివరంబులుగాఁ దెలియ లక్ష్యంబులు వ్రాసెద, నవధరింపుము. 140

అందు మొదలి 'ప్ర' అనే ఉపసర్గకు [భాస్కరుఁడు, రామాయణము] కందము ౨-వ పాదమున ప్రాదియతి ప్రయోగ లక్ష్యము [భాస్కర రామాయణము. బాల. 518]

---

138. [1] భాసకు (అ. తి. వ్రాఁతప్రతి.)

* ఈ పుణ్యాశ్రమ వనమును
ప్రాపించి యనేక శతసహస్రాబ్దము లు
ద్దీపిత తప[1]మంచిత వి
ద్యాపరుఁడై గౌతముం [2]డహల్యయుఁ జలుపన్. 141

'సమ్' అనే ఉపసర్గకు శబ్దశాసనుఁడు, ఆదిపర్వము కంద ౪-వ పాదమున ప్రాదియతి ప్రయోగము హల్లులకు లక్ష్యము. [4-40]

క. చల్లని దక్షిణ మారుత
మల్లన వీతెంచి తగిలి యాలంబనాథ
మ్మెల్ల కుసుమాంగ రాగ స
మ్మోల్లసన సుగంధి యగుచు మునివరు మీఁదన్. 142

'అను' అనే ఉపసర్గకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము కందము ౨-వ పాదమున ప్రాదియతి ప్రయోగము లక్ష్యము. [4-68]

క. గురునాశ్రమంబునను [1]న
న్నరుదుగఁ బతి పిల్వఁగవిన *యనురాగము నా
దరణము ననుగ్రహంబును
గరుణను సంభ్రమము నపుడు గానక [2]యుంటిన్. 143

'సు' అనే ఉపసర్గకు సోమయాజి ఉద్యోగపర్వము చతుర్థాశ్వాసము చంపకమ్ము ౪-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [4-426]

---

141. * శబ్దశాసనుఁడు, ఆదిపర్వము అని అ. శి. వ్రాఁతప్రతి.
[1] మంత్రతి. (అ. శి. వ్రాఁతప్రతి).
[2] అహల్యం జొనిపెన్. (అ. శి. వ్రాఁతప్రతి).

143. * ఇది ప్రాదియతికి లక్ష్యము కాదు. చూ. పీఠిక.
[1] మున్నరుదుగ (సంశో. భా.).
[2] యుండలేన్. (సంశో. భా.)

చ. కమలభవాండ దైవతము లస్ఫుట విగ్రహ ప్రశస్తవా
గమృత రసప్రసార కవితాంచిత [1]శేఖర విప్రకర్షసం
గమనము దీక్షితోల్లసన కందళిత ప్రహసద్దయాలతా
*సుమహాదుపాశ్రయా ప్రమదశోభిత విశ్వజగన్మధు[2]వ్రతా. 144

'నిర్' అనే ఉపసర్గకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము సౌపర్ణోపాఖ్యానము కందము ౪-వ పాదమున ప్రాదియతి ప్రయోగము హల్లుకు లక్ష్యము. [2-122]

క. ఈ సౌపర్ణాఖ్యానము
భాసురముగ వినినఁ బుణ్యపరులకు నధిక
శ్రీసంపదలగు దురిత ని
రాసంబగుఁ గాయుమరగ రక్షోభయముల్. 145

మఱియును 'నిర్' అనే ఉపసర్గకు సోమయాజి విరాటపర్వము భీముని వాక్యము సీసములో గీతి రెండవపాదమున ప్రయోగము లక్ష్యము [2-204]

తే. వారు [1]ప్రేరణచేసి దుర్వారమైన
*నిరతిశయ దుఃఖభారంబు [2]విస్తరించి
సౌఖ్యమొందరె నీవు నాచందమునను
నాపదలకోర్చి సంపద లనుభవింపు. 146

'దుర్' అనే ఉపసర్గకు భీమనగారు శివస్తుతి కందము ౨-వ పాదమున ప్రాదియతి ప్రయోగము హల్లుకు లక్ష్యము.

---

144. [1]పేశవిధిప్రకర్ష (సంశో. భా.)
[2]వ్రతా. (అ. శి. ప్రాఁతప్రతి)

146. [1]ప్రేరణచేసి (సంశో. భా.)
[2]విస్మరింప (అ. శి. ప్రాఁతప్రతి) ఇందు యతిభంగము.

144, 146. *ఇవి ప్రాదియతికి లక్ష్యములు కాఁజాలవు.

క. ఎంతయును దుస్తరంబు దు
రంతము సంసారవారిరాశియిది వెసఁ
గంతుకొన మాపు కొండక
యింత శివస్మరణ చేసి యేచిన భక్తిన్. 147

'అభి' అనే ఉపసర్గకు విజయసేనము నాంది విఘ్నేశ్వరస్తుతి ఉత్పలము ౪-వ పాదమున ప్రాదియతి ప్రయోగము హల్లుకు లక్ష్యము.

ఉ. అల్లనఁ దుండమెత్తి శివునౌఁదల యేటి జలంబువుచ్చి సం
పుల్లతఁ బాదపీఠకము పొంతనయున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనా కమలసంహతిఁ బ్రోక్షణసేయునట్లు శో
భిల్లు గజాననుండు మదభీప్సిత సిద్ధికరుండు గావుతన్. 148

'ఉప' అనే ఉపసర్గకు సోమయాజి భీష్మపర్వము కందము ౪-వ పాదము ప్రాదియతి ప్రయోగము లక్ష్యము. [1-298]

క. శాంతనవుఁడు శేజో దు
ర్దాంతుండై వెలుఁగ బ్రహ్మదరకెల్లను జా
లింతు వినుఁడస్త్రశైలో
పాంతమునకుఁ జనిన నేమియనినట్లుండెన్. 149

మఱియు *నందే కందము ౪-వ పాదమున హలుకు లక్ష్యము. [సభా. 2-155]

క. ఇంద్రప్రస్థంబునకు సు
రేంద్ర గురుప్రతిముఁ డరిగి యింద్రసమానన్
[1]రుంద్రయశు వనజ సహితు ను
పేంద్రుఁడు ధర్మజునిఁగాంచి యెంతయుఁ బ్రీతిన్. 150

'పరా' అనే ఉపసర్గకు పురుషార్థసారము, ఉత్పలము ౨-వ పాదమున ప్రాదియతి ప్రయోగము లక్ష్యము.

---

150. *ఇది భీష్మపర్వములోనిదని అ. శి. వ్రాఁతప్రతి.
[1]చంద్ర. (సంశో. ఖా.)

ఉ. రాజుల సమ్మతిం దరతరమ్మున బ్రాఁతల భక్తియుక్తులన్
రాజిత శస్త్రపాణులఁ బరాక్రమవంతుల నప్రమత్తులన్
భోజనహేమవస్త్రపరిపుష్టులఁ దుష్టులునైనవారిఁగా
నోజ నొనర్పఁగావలయు నొద్దన పాయక యుండ భృత్యులన్. 151

అన్నారు.

ఇఁక 'ఆఙ్' అనే ఉపసర్గకు వీరభద్రారెడ్డికిఁ జేసిన కంద శతకములో భాస్కరుఁడు చెప్పిన కందము లక్ష్యము.

క. [1]పేకేటి మృగాంకుఁడు జడి
[2]సాకులపాటొందఁ గల్పమాదికి నొందన్
కాకోదరపతి పీయక
*నాకలిత ద్యుతులమీఁద నల్లయవేమా! అన్నారు. 152

'అవ' అనే ఉపసర్గకు భీమన్నగారు మిత్రపద్ధతి. కందము ౪-వ పాదమున ప్రాదియతి ప్రయోగము అచ్చుకు లక్ష్యము.

క. భువిలో మిత్రుండగు వాఁ
డవిరతమును వేఱులేక యాత్మీయ మహో
త్సవ ముఖకృత్యమ్ములన
*వ్యవసాయం బెఱుక వరుసనగు సుప్రీతిన్ 153

'ఉత్' అనే ఉపసర్గకు శబ్దశాసనుఁడు ♦♦ఆరణ్యపర్వము. ఈశ్వరార్జునుల వెంట పట్టున, చంపకము ౪-వ పాదమున ప్రాదియతి ప్రయోగము హల్లుకు లక్ష్యము. [1-305]

♦♦చ. పటు విశిఖంబునం ద్రిదశపాలతనూజుఁడు పందిఁ జేసె తో
డఁట పరమేశ్వరుండును రయంబున దానినయేసె విట్టు లొ

152. [1]పేంకటి (తి).
[2]సాకుం పాటొంద (తి).

152, 153. *ఇవి ప్రాదియతికి లక్ష్యములు కానేరవు.

క్కొటఁ బడి కూలఁగా హరార్జునుల ఘోరశరంబులు వందిపైఁ గుర్భ
త్తటముపయిఁగా వడిందును నుదగ్ర మహాశనులట్లు మ్రోయుచుఁగా. 154

♦♦'వి' అనే ఉపసర్గకు శబ్దశాసనుఁడు సభాపర్వము, కందము ౨-వ పాదమున ప్రాదియతి ప్రయోగమున హల్లుకు లక్ష్యము. [1-38]

♦♦క. ఉపధా శుద్ధులఁ గావ
వ్యపగత బుద్ధుల విపీతవర్తుల సములఁగా
సుపరీక్ష వియోగించితె
విపుణుల వర్థార్జనాది నృపకార్యములఁగా 155

♦♦'అతి' అనె ఉపసర్గకు సోమయాజి భీష్మపర్వము ఉత్పలము ౪-వ పాదము ప్రాదియతి ప్రయోగము హల్లుకు లక్ష్యము. [3-248]

ఉ. శాంతనవుం డనేకబలసంతతి నుద్భట శౌర్యసారదు
ర్దాంత పరాక్రమస్ఫురణఁ దాఁకి సముజ్జ్వలశాతసాయకా
క్రాంత పరీత [1]నిర్మథిత కంపితపాతిత మూర్తిఁ జేసి య
త్యంత రయంబునం దనరథంబు గతుల్ మెఱయం బ్రదీప్తుఁడై. 156

వ. ఇవి ప్రాదియతులు. ఈ తక్కినవి, ప్రతి - వి - [1]అప - పరి - అనే యీ ఉపసర్గలకు విట్లు వలయు. ఇవి ప్రాదియతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 157

## (11) అభేదయతి లక్షణము

సీ. రలయోరభేదంబు రళయోరభేదంబు
లళయోరభేదంబు లడలభేద
వర్ణములనఁ జెల్లు వపయోరభేదాఖ్యఁ
దనరు నైందులకు నుదాహరణలు
*రల రళ (లళ) లడల్ వపలు నొండొంటికిఁ
జనునిడ వడులు ప్రాసములు గృతుల

---

156. [1]నిర్మిత వికంపిత (శా).

157. [1]అవ - పర - పరి - అనెడి (తి).

రాజిల్లు సప్తతాళములు ద్రెవ్వఁగనేసి
లలితమౌ లవణ వారాశిఁగట్టి
లంకశోధించి వైళమె రావణునిజంపి
లక్ష్మణార్కజ కపుల్ డాసికొలువ

తే. వనితతోఁజేరె సాకేత పట్టణంబు
ప్రేమ రఘువీరుఁడనఁగ నభేదయతులు
దళము దదమన జలధినా జదరినాఁగ
జరుగు విటువలె నన్ని ప్రాసములు కృష్ణ! 158

చిత్రపు భీమన ఉత్తమగండచ్ఛందస్సునందు —

క. 'లడయోరభేద' యనుచును
నుడివెడి వచనంబు గలుగ నూతన భంగిన్
వడి నిట్టిదే కృతులం
దొడఁబడి ప్రాసములుఁ జెల్లుచుండుట గలుగున్. 159

వ. మఱియు నందే, 160

తే. లలిత వీణారవంబుతో ¹ఢక్కసరియె
రమ్యమణిరాజ రాజితో లక్కసరియె
భరిత భువనార్ణవంబుతో పంకసరియె
యనఁగఁజెల్లు నభేదనామాదియతులు. 161

---

258. *రల రళ లడ ళడ నప లొండొంటికి (అ. శి. వ్రాఁతప్రతి). ఈ పాఠమున యతిగణభంగములు కానవచ్చును. పాత్రపిళవి మతమున దీనిని యళవర్గద్వయ యతి (ర - న) యని సమర్థింపవచ్చును. కాని యీ యతికిఁ బ్రామాణిక లక్ష్యలక్షణములు చూపట్టవు. కావున సవరింపఁ బడినది. సవరణ పాఠమున 'ర - ల' యతి కలదు. అయ్యాది పాత్రపి ప్రభృతి లాక్షణిక సమ్మతము.

161. ¹దక్క సరియె (సు. అ. పా. 130).

'¹వ - భ' లకు నన్నయభట్టు ఆదిపర్వము మత్తకోకిల ౩-వ పాదమున అభేదయతి ప్రయోగము లక్ష్యము. [8-29]

మత్తకోకిల. ధీరులీ ధృతరాష్ట్రపాండు లతి ప్రసిద్ధగుణుల్ ప్రశ
స్తోరు కీర్తులు నాకు ²నందను లొక్కరూప తలంపఁగా
వీరు వారనునట్టి బుద్ధి ³విభేదమెన్నఁడు లేదుగాం
ధారి పుత్త్రశతంబునందుఁ బృథాతనూభవు లందిలన్. 162

మఱియు సోమయాజి ద్రోణపర్వము కందము ౪-వ పాదమున వ - బ లకు అభేదయతి ప్రయోగము లక్ష్యము. [5-51]

క. తురగము తురగముఁ గరికరి
¹నరునరునిన్ దేరుతేరు నలిఁదాకినయ
ప్పురుసఁ దనమేమి చెప్పుదుఁ
బోరి మిఱుఁగుఱు లెగసెఁ గ్రైదువ్వుల పొడిరాలెన్. 163

మఱియు శ - ద లకు ప్రాసము నిలుచుటకు సోమయాజి ఉద్యోగపర్వము కందము ౨-వ పాదమున అభేదప్రాస ప్రయోగ లక్ష్యము. [1.220]

క. కొడుకును దానును గుఱ్ఱపు
¹దళిములు కరిఘటలు భటరథ వ్రాతములున్
పుడమి చలింపఁగ ద్రుపదుఁడు
కడువేగము తోడు సూపెఁ గౌంతేయులకున్. 164

మఱియు ల - డ లకే సోమయాజి భీష్మపర్వము కందము ౩-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [1-93]

క. కొడుకులుఁ దమ్ములు గుఱ్ఱపు
దడములు పెక్కైన బలవితానము తగుమైఁ

---

162. ¹త ప ల కు (అ. శి. వ్రాఁతప్రతి).
²నిద్దఱు (సంశో. ఖా.)
³విభేద మెన్నఁడు (కొన్ని ప్రతులని సంశో. ఖా.)

163. ¹నరుఁడు నరుఁడు (సంశో. ఖా.)

164. ¹దడములు (సంశో. ఖా.)

[1]దలపింపుచు మేలపు నం
గదములతో నడుచు శకునికడు నొప్పారెఁగా. 165

౧-౪ లకు భాస్కరుఁడు తోటక వృత్తము ౨-వ పాదమున అభేదప్రాస ప్రయోగము లక్ష్యము.

తోటకము. చెలువార గణాజిన చేలముతో
గళ పీలిమతో నహికంకణుఁడై
తల చంద్రకళం గలదైవము మా
కులదైవము దైవతకోటులలోఁగా 166

మఱియు ౧-౮ లకు ప్రబంధపరమేశ్వరుఁడు అరణ్యపర్వము దారువన క్రీడ పట్టు. తోదకవృత్తము రెండవ పాదమున అభేదప్రాస ప్రయోగము లక్ష్యము.

తోదకము. *కాలిమి దూలిన కావన వత్సుల్
ప్రీడవపంబుల పీడ్కొని చేరఁగా
లోల మదాలస లోచన పంక్తిఁగా
చాలఁగ నొప్పెను శంకరు లీలఁగా. 167

మఱియు ౧-౮ లకు సోమయాజి ఉద్యోగపర్వము కందము ౧-వ పాదమున అభేదప్రాసము ప్రయోగము లక్ష్యము. [1-126]

క. [1]వెక్షలె బలరిపుఁడు చలమునఁ
[2]గలహమునకుఁ జొచ్చె వృత్రు ఘనబాహుబలం
బలవికి మీఱెను దంభ్రివి
మల తపమునఁజేసి సురలమనముల దలఁకఁగా. 168

---

165. [1]వడపించుచు (సంశో. భా.)

167. *నేఁటి ముద్రిత భారత ప్రతులందుఁ గానరాదు.

168. [1]వెంలి (సంశో. భా.)
[2]కలహము లోరగ (?)

మఱియు ద - ఢ లకు నందే కందము ౩-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [1-237]

క. గాండీవధరుని యాహవ
పాండిత్యముఁ దలఁప నతని ఖండనమున మా
[1]ర్కాండుని యొకఁడు గడఁగుట
కొండంగని తగరు దాఁకఁ [2]గోరుటగాదే! 169

మఱియు ర - ళ లకు [1]కేతరాజుగౌరన్న హరిశ్చంద్రకథ ద్విపద ౨-వ పాదము అభేదయతి ప్రయోగము లక్ష్యము.

ద్వి. చీఁకటి విరియించుఁ జిఱునవ్వు పసిఁడి
[2]రేకులతో మురాళించు చెక్కుళ్లు 170

మఱియు వ - బ లకు సోమయాజి ఉద్యోగపర్వము ఉత్పలము ౨-వ పాదమున అభేదయతి ప్రయోగము లక్ష్యము. [4-201]

ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁడిందును గొన్నివన్నినఁ
బాయక రజ్జులెప్పుడు నవారణ నీవిటులాడితేవియుఁ
వేయునవేల పార్థులను విష్ణుని వెంబడి నీటవచ్చినఁ
జేయుదుమేము కయ్యమొక చీరికి సంపదఁ బంచియిత్తుమే. 171

మఱియు వ - బ లకు సోమయాజి ఉద్యోగపర్వము కందము ౪-వ పాదమున అభేదయతి ప్రయోగ లక్ష్యము. [2-245]

క. పరిజనులకు నీకును వి
ద్దరలోన సగంబె చాలుఁ దక్కిన సగముం
కర ముచితమ్ముగఁ బాండవ
వరుఁడగు ధర్మజునకిచ్చి బ్రతుకుము పుత్త్రా! 172

---

169. [1]మార్కాండుని (సంశో. భా.)
[2]కీడఁగుటకాదే (శా)

170. [1]పోతరాజు గౌరన్న (తి)
[2]రేకలతో మెదిరించు చెక్కులను (అప్ప)

మఱియు వ-వ లకు శబ్దశాసనుఁడు ఆరణ్యపర్వము చంపకము ౨-వ పాదమున అభేదయతిప్రయోగము లక్ష్యము. [3-78]

చ. సతత [1]కృతోపవాసముల శాకఫలోదక మూలపారణ
వ్రతముల [2]దేవపూజల నపార జపంబులఁజేసి విష్ణుతో
నతుల తపంబుచేసె నమరాపగమర్త్యకిఁదేర వేడ్కతో
ధృతియుతుఁడై దిలీపకులదీపుఁడు దివ్యసహస్రవర్షముల్. 173

మఱియు వ-వ లకు [*శబ్దశాసనుఁడు ఆది]పర్వము కందము ౨-వ పాదమున అభేదయతిప్రయోగము లక్ష్యము. [7-109]

క. [1]వీరుండగు నరుఁడేయు న
పారశరావళుల నడుమ వారింపంగా
నేరక యేటుదిగి మహా
శూరుఁడు రాధేయుఁ డింద్రజున కిట్లనియెన్. 174

మఱియు వ-వ లకు ఆంధ్రకవితాపితామహుండు ఆముక్తమాల్యదయందు చంపకము ౨-వ పాదమున నభేదయతిప్రయోగము లక్ష్యము. [4-85]

చ. ఎడపకమున్ను మింటిపయి నే తగులంబును లేక మూర్ఛలన్
వ్రాలెడుచోఁ గఠోరఘనబృందము లడ్డమువడ్డ, వానిమే
యుడియె జవోర్మిఁ దాఁకెడు రవీందుల దట్టపు బండికండ్ల చ
ప్పుడుగతిమ్రోసె [1]రేవగలు భూరిభయంకర గర్జలత్తఱిన్. 175

వ. ఇవి యభేద యతిప్రాస ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 176

173. [1]కృతోపచారముల (క).
[2]దేవపూజల నపారజపంబులనిల్పి విష్ణుతో (క).

174. *సోమయాజి విరాటపర్వమని అ. తి. వ్రాఁతప్రతి.
[1]వీరుఁడగు నరుని రేయి (సం. ఖా.)

175. [1]రేఁబగలు. అని అ. తి. వ్రాఁతప్రతి.

177. [1]నియమము. అని అ. తి. వ్రాఁతప్రతి.

## (12) వృద్ధియతి ప్రయోగ లక్ష్యములు

క. లోకైకపద విడౌజో
నాకౌకశ్శబ్దములకు [1]నయముగవృద్ధుల్
చేకుఱును వకారైకా
రౌకారములెనయు యతుల నౌకోకటహారీ! 177

వ. మఱియును, 178

సీ. ఉగ్రారిశైల విడౌజుఁడౌ శ్రీహరి
యనుజుఁడై కలిగె విడౌజునకని
యుత్సుకులగుచు నాకౌకసుల్ వినుతింప
నభయంబులిచ్చె నాకౌకసులకు
నింద్రోపమాన శౌర్యైక పరాయణుం
డక్రూరుఁ బ్రోచె లోకైక మతుఁడు
శ్రీశజన్మశతార్జితైనోహరణ యన్న
నతఁడు హరించు జనైనసముల
తే. ఉదధిశయనుండు వాంఛితార్థప్రదాయి
యస్మదీయ మనోవాంఛితౌఘ మెలమి
నిద్ధశరవహ్ని దగ్ధాసురైధనుఁడవ
నవని పెగడి వృద్ధివల్లమరుఁ గృష్ణ! 179

*అనంతన్నగారు —

క. లోకైక ముఖ్యపదముల
నాకౌకః ప్రభృతులను జనస్తుత! వృద్ధుల్
[1]శోక వికారము కారము
గైకొనఁదగు వరుసయతి వకారము చెల్లఁగ. 180

---

180. *ఇది నేఁటి ముద్రిత ఛం. ద. నలేదు.
[1]శోకఁ ఇకారము ఉకారము, గైకొన ... యతిఁ అకారము.

ముద్దరాజు రామభద్రయ్యగారు కవిసంజీవనియందు. [1-69]

క. ఐక్రృతులయందు నేకా
ౖరౌకారంబులును వృద్ధియతి యరఁజెల్లుఁగా
కాకోల ధురంధర [1]విధి
ౖత్రైక పరాక్రముఁడు హలధరానుజుఁ డనఁగన్. 181

చిత్రకవి పెద్దనగారు [ల. సం. యతులు. 1-9]

తే. ఏకమోజంబు మొదలుగా నెనఁగు సంధి
వృద్ధియతులగు దేవలోౖకైక మాన్య
యున్నతాహితౖశైల భిద్భోజ యనఁగ
భంజితాసుర సముదాయ! యాంజనేయ! 182

రఘునాథయ్యగారు దీపికయందు ఆంధ్రకవితాపితామహుని అలంకారమున గీతి లక్షణముగా ప్రయోగము వ్రాసినది. [ల. దీ. ప. 339]

తే. ఇందురేఖాకలాప లోౖకైకసేవ్య
యురగకంకణనుత విభూఘ యనిన
నెఱుఁగ నివి వృద్ధియతులయ్యె నరయుఁపీని
నెలవున నకారమైనను నిలుపవచ్చు. అన్నారు. 183

ఇఁక సోమయాజి విరాటపర్వము ఉత్పలము 3-వ పాదమున వృద్ధియతి ప్రయోగము లక్ష్యము. [3-33]

ఉ. ఆకమలాక్షి రూపమహిమాతిశయంబు మనోహరంబు భో
ౖగైక పరాయణుల్పురుషు లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతసర్వలోకుఁ డటు చేటు పురంబున వారికిమ్మెయిఁ
గాకెటులుండు విట్టియవగాఢపుపొత్తు మనంగవచ్చునే? 184

భాస్కరుఁడు రామాయణము విభీషణవాక్యము శార్దూలవృత్తము 3-వ పాదమున ఓకశ్శబ్దమునకున్ను వృద్ధియతి ప్రయోగము లక్ష్యము. [సుందర కాం. ప. 449]

181. [1] భక్తైక. (క. జ. సం.)

శా. నీకంఠార్పిత కాలపాశము శిరోనిర్ఘాతపాతమ్ము లం
క్షాకప్రంచయ కాలరాత్రి [1]కరబద్ధోదగ్ర కాలాహిక
వ్యాకారాగతమృత్యు వీ జనకకన్యన్వేగ మొప్పించి లో
[2]కైక త్రాణుని రాముని౦గనుము నీకిబుద్ధిగాకుండినన్. 185

సూరపరాజుగారు రాఘవపాండవీయము తృతీయాశ్వాసము కందము ౪-వ పాదమున ఏకశబ్దమునకు వృద్ధియతి ప్రయోగము లక్ష్యము. [3-9]

క. జనులందఱు నీయం ద
త్యనురాగము కలిమి నెఱపెదరు [1]సత్యమహా
త్త్వ విరూఢిఁ బొస్పసఁగు నీ
యనుజులు భవదీయ శాసనైకాయత్తుల్. 186

వ. ఇది వృద్ధియతి ప్రయోగ లక్ష్యము. ఇఁక నందు, 187

## (13) మకార బిందుయతి లక్షణము

తే. యరలవల యందు శషసహాక్షరములందు
నాదిబిందు[1]యుతము నైమయతి (యొసంగు)
యరలవ శషసహల బిందులందుఁ గదియ
విడకయుండిన యతివర్గవడులు కృష్ణ! 188

ఈ మకారయతి కుదాహరణము మదీయము.

సీ. మదన గోపాల! సంయమిజాలనుతశీల!
మదగజత్రాణ సంరంభ విపుల!
మారుక్మిణీ స్వయంవర విశేషామోద!
మదనారివంద్య సంశ్లాఘ్యపాద!

---

185. [1]కళ. (భాస్క. రామా.)
[2]లోక + ఏక ... నీక + ఈ. ఇందు సహితము వృద్ధియతి యున్నది.

186. [1]సత్త్వ. (రా. పాం.)

188. [1]యుతిమ్మునై మయతి యగును. (అ. శి. వ్రాఁతప్రతి.)

మధు విరోధి! యదువంశ పవిత్ర! [1]హరమిత్ర
మహిత భూభరణ దంష్ట్రాధురీణ!
మాధవ! దుష్టకంసహర! దైత్యాంతక!
మానిపీ కలుషసంహరణ చరణ!

తే. యనిన నీకీర్తిఁ గృతులందు య ర ల వ శ ష
స హ ల నొండొంటి తోఁ దదక్షరములందుఁ
గదియబిందువులిడిన మకారబిందు
యతులనఁగఁజెల్లు సుకవిసమ్మతివి గృష్ణ! 189

అనంతనగారు [ఛం. ద. 1-117]

తే. య ర ల వ ళ శ ష స హ లను నాదిబిందు
యుతములై మకార విరామయుక్తిఁదనరు
మారుతాత్మజుఁ దరిసెసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహారుఁ డనంగ. 190

భీమనగారు చంపకము ౪-వ పాదమున మకారయతి ప్రయోగము
లక్ష్యము [చాటుధార]

చ. గరళపుముద్ద లోహ, మవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్,
హరునయనాగ్నికొల్మి, యురగాధిపుకోఱలు పట్టుకార్లు, ది
క్కరటి శిరంబు దాయి, లయకాలుఁడు కమ్మరి, వైరివీరసం
హరణ గుణాభిరాముఁడగు మైలమభీమన ఖడ్గవృష్టికిన్. 191

వ. అన్నారు. ఇవి మకారయతిప్రయోగ లక్షణములు. ఇఁక నందు 192

(14) ప్లుతయతి లక్షణము

క. ప్లుతయతుల గతుల తెలియఁగ
నతులిత కృతులందు నాలుగనఁబడుఁ గవిన
మ్మతముగ దూరాహ్వానం
బతిరోదన గీత సంశయములనఁ గృష్ణా! 193

ఈ నాలుగు తెఱఁగుల కుదాహరణములు —

సీ. పరవి దూరాహ్వాన సంగీత సంశయ
రోదనమ్ముల నాఁగ రూఢి నాల్గు
తెఱఁగులై ప్లుతములు దీపించు సంగీత
మున ... ... ... ... ... ... ... ...
గాన సాహిత్యమార్గములరేను నిజంబు
తక్కిన మూఁటి [1]ఉదాహరణలు
ఏమినాస్వామి రా నెయన నొప్పు దూ
రాహ్వాన మనెడి ప్లుతాహ్వయంబు

తే. ఆశ్రితుల నేఁచ నీకు మే.గా ... రాది
యనఁగ రోదన ప్లుతమగు నంబుజాక్ష!
ఎటులఁ బ్రోచెద వానతి నీ యటన్న
సంశయప్లుత మనఁజను జగతిఁ గృష్ణ! 194

శ్రీమునగారు [క. జ. ఆ. సంజ్ఞ. పుట. 21. అనసూచి. 1917]

క. ప్లుతమనఁబరఁగుఁ ద్రిమాత్రా
న్విత వర్ణము దానిమీఁద వితతస్వరముల్
గృతిపై యతిపరమునఁ జనుఁ
జతురానన [1]సన్మశ వల్లి చక్కటిఁ జెల్లున్. అన్నారు. 195

దూరాహ్వాన ప్లుతానకు సోమయాజి అనుశాసనికము ఉత్పలము ౪-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [1-53]

ఉ. అనరనాయకుండొక మహాధ్వర మెంతయు పేర్కఁజేయఁగా
బూని మహీసురావళికిఁ బూజయొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయమారఁగా ననలుఁ దాతని పాలికివచ్చి నాకు నీ
వే నృపనీమ పుత్రి ప్రియ మేర్పడ దానముగాఁగ నావుడున్. 196

---

194. [1]ఉదాహరణలు - చరిత్రాది గ్రంథముల గ్రహింపవలెను.

195. [1]జతురానన చతుర (యతులు) (క. జ. ఆ.)

రోదనప్లుతానకు భాస్కరరామాయణము ఉత్పలము ౨-వ పాదమున ప్లుత యతి ప్రయోగము లక్ష్యము. [యుద్ధ. కాం. ప. 41]

ఉ. ఏజనకాత్మజకా దశరథేశ్వరు కోడల రాముభార్యఁ జం
డో జనులార! యడ్డపడరో సురలార! సురారి కించు నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతినేఁగుచో
వీజలరాశిఁజూచి మదినెంత దలంకెనొ యేమిసేయుదుకా. 197

సంశయప్లుతమునకు సోమయాజి ఉద్యోగపర్వము ఉత్పలము ౪-వ పాదమున ప్లుతయతి ప్రయోగము లక్ష్యము. [2-162]

ఉ. ఒక్కఁడొకం డనేక విధ యుద్ధజయంబులు గొన్నవారు దా
రెక్కడ నేమిసేసెదిరఁ దీతని తమ్మని నాజిఁగూల్చి యు
క్కొక్కన పార్థుపైఁ గవిసె నీవసి నాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడలేఁడె వీడు భవదాత్మజుఁగోల్పదె ఘోషయాత్రలో. 198

మఱియు సంశయప్లుతమునకు సోమయాజి ద్రోణపర్వము ౫-వ ఆశ్వాస మందు అశ్వత్థామ వాక్యము ఉత్పలము ౪-వ పాదమున ప్లుతయతికిన్ని, ౨-వ పాదమున వ-బ ల అభేదయతికిన్ని ప్రయోగము లక్ష్యము. [5-336]

ఉ. దావులు లేపెయందు నవిఁజచ్చుట యొప్పదె యిట్లు లోకనం
భావితు నమ్మహాత్ముఁ దలపట్టి నొకండను [1]వాఁడిమాట యే
మ్మైనది దాఁకి చిత్తమునకార్తి యొనర్ప సహింపరాదుగా
కేవిన నుక్కి వాఁడెఱుఁగఁడే నను విమ్మెయి భంగపెట్టునే. 199

మఱియు సంశయప్లుతము సోమయాజి కర్ణపర్వము ౩-వ ఆశ్వాసము చంపకము ౨-వ పాదమున ప్లుతయతి ప్రయోగము లక్ష్యము. [3-188]

చ. హయములఁజంపి, ముప్పది శితాస్త్రములం దెగటార్పఁజూచి, తం
ద్రియముఖి వందమై [1]తెగితినేఁటి వీరుఁడనంచు నేయుదుకా

198. [1]వాఁడిమాట. (అ. శి. ప్రాఁతప్రతి).

200. [1] తెగితిరే. (సంశో. భా.)

భయదమహోగ్రతఁ గిగుడ నారసములఁ నడుమఁ శిలీముఖ
త్రయమునఁద్రుంచి మేనఁ బ్రదర త్రితయంబు శిఖండిఁగ్రుచ్చినన్. 200

వ. ఒక్కొకదిక్కున ఈప్లుతయతియు కాకుస్వరయతియు ఒక్కరీతిగా కనఁబడును. ఇవి ప్లుతయతి లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 201

## (15) నిత్యసమాసయతి లక్షణము

సీ. శబ్దముల్ విభజింపఁ జనరాక నన్యశ
బ్దంబుఁజేకొని చెప్పఁబడిన యక్ష
రము లు సమాస మధ్యమమునఁ గనుపట్టి
నాస్తి నారాయణానంత పదము
లేపలు మక్కలు లెన్నఁగఁ బిన్నది
రూపలు చూపలు కాపదియనఁ
గ్రిక్కిఱించెను ధిక్కరించెఁ దెమ్మెర ప్రస
రించెఁ గట్టఁడి యలరించె ననెడి

తే. శబ్దములు పోల్కిగలయవి శబ్దములకు
నచ్చుహల్లైన సంధిసేయంగఁ గృతుల
మహిని రంజిల్లు నిత్యసమాసయతులు
సకల లక్షణములు దీపికాదకృష్ణ! 202

తే. మఱియుఁ బ్రభునామ నిత్యసమాసవిరతు
లొక్కవిధమునమందు నొక్కొక్కయెడల
నట్టి తద్భేద వాదము లరసి నిశ్చ
యింపవలెఁ జూపె యవి విభజించికృష్ణ! 203

వార్తాకవి రఘునాథయ్యగారి దీపికయందు —

తే. ఒరుల నమ్మయ్యయనుచోట నూఁదఁబడక
ద్వివిధమైనట్టి ప్రభునామ విరమణంబె
యూఁదినను రెంట నూఁదక యున్నరెంట
జాపి యతులొంద నిత్యసమాసమయ్యె. 204

గోకర్ణచ్ఛందంబునందు —

క. [1][సుకవుల్] పిన్నక్కను వి
న్నకయనగా రన్నగార(నన్) గృతుల(ను) నొ
క్కొకచో నిత్యసమాసము
లకు నీగతి వర్ణుఁ జెల్లు లక్షణమహిమన్. 205

*మఱియు నంద, [కావ్యాలంకారచూడామణి. 7-70]

క. చెన్నక్కకుఁ జెన్నకమా
చన్నన మాచన యనంగ నచ్చట వళియై
చెన్నగు నకారమార్యుల
మన్నన హల్లేని గలుగు మఱియొక్కొకచోన్. 206

అనంతన - ఉక్కఱ - ఏపఱ లను నీరెంటికి లక్షణ లక్ష్యములు. [ఛందోదర్పణము. 1-101]

తే. [1]అఱియనుట పోవుటయె యర్థమరయ నట్టి
సంధి నిత్యసమాసోక్తి జరుగు రెండు
నసుర వీరులనెల్ల నుక్కఱ వధించె
దానుతులుఁడు రావణుని నేపఱిచె ననఁగ. 207

మఱియు ననంతనగారు [ఛందోదర్పణము. 1-103]

ఆ. ఏవియను పదంబుతో నాది పదమంది
సంధి నిత్యయతులు జరుగురెంట
నెట్టి క్రూరకర్ముఁ డేని పద్ధతి నొందు
నిమ్ము నాత్మఁ దలఁచె నేవి కృష్ణ! 208

205 [1]సుకలాపిన్నక్కను వి
న్నక యనగా రన్నగారన యనఁగృతుల (అ. తి. వ్రాఁతప్రతి).

206. *ఇది గోకర్ణచ్ఛందములోనిదిగ అ. తి. వ్రాఁతప్రతి.

207. [1]అఱియనంగను బోవుటర్థమైన (ఛం. ద.)

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము. 1-5]

తే. పదము లేర్పాటుగాఁజేయ బాగుగాని
సంధి నిత్యసమాస విశ్రమము దనరు
నవ్య సద్గుణరత్న రత్నాకరయన
భంజితాసురసముదాయ! యాంజనేయ! 209

ముద్దరాజు రామభద్రయ్యగారి కవిలోకసంజీవనియందు. 1-98]

క. చను నాపోశన వాతా
శన వాతాయనములను వెనం గృతి రామా
యణము పరాయణ నారా
యణ నిత్యసమాసములకు యతులిరుదెఱఁగై. 210

*విక్రమార్క చరిత్ర [సింహాసన ద్వాత్రింశిక. 4-208]

క. ఇది చేతిది వోచకపి
న్నది [1]కట్టఁడి దానికంటె [2]నల్లన యను వీ
పదములు నుభయము గొనను
న్నది [3]నిత్యసమాసమగును వరలోకేంద్రా! 211

వ. ఇవి [నిత్యసమాసయతి] లక్షణములు. ఇఁక నందుకు లక్ష్యములు. 212

గోకర్ణచ్ఛందస్సునందు —

తే. ఇమఁడు పూర్వాపలం బలరింపఁజేసె
మించె వనరాజి కమ్మఁ దెమ్మెరల చేత

---

211. *ఇయ్యది జక్కన విక్రమార్క చరిత్రలోనిది కాదు. కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికను విక్రమార్క చరిత్రయన్నది నామాంతరము నుండుటకు. [సింహా. ద్వా. 1-59],

[1]కట్టెఁడు. (సింహా. ద్వా.)

[2]నల్లలు. (సింహా. ద్వా.)

[3]జళ్లను సనుమతంబు. (సింహా. ద్వా.)

ఇంతి చనుదోయి దాఁగ్రిక్కిఱించె ననఁగ
మనుజవర! యొప్పు నిత్యసమాసయతులు. 213

నాస్తి. నారాయణ. అనంత. రసాయన శబ్దములు. నిత్యసమాసయతికి లక్షణమును లక్ష్యమును. [*వంపోదర్పణము. 1-97]

ఆ. నాస్తియనక మహిసనంత సంపదల నా
రాయణుం డొసంగు రమ్యమగు ర
సాయనంబు బుధుల కతఁడన్ను నిత్యస
మానయతులు రెంట నంటియుండు 214

మఱియు వామనచరిత్ర నాస్తి శబ్దంబునకు కందము ४-వ పాదమున అచ్చునకు నిత్యసమాసయతి ప్రయోగము లక్ష్యము.

క. స్వస్తియని పలుకుచుం గను
లాస్తన కస్తూరికాసు లాంఛనమగు శ్రీ
హస్తంబు సాఁచి వేఁడిన
నాస్తి యనం బలుకనగునె యాదిమ పురుషుల్. 215

మఱియు నారాయణ, పరాయణ శబ్దములకు ప్రబంధపరమేశ్వరుఁడు అరణ్యపర్వం నాంది కందము ౧-వ పాదమున ४-వ చరణంబున హల్లుకు నిత్యసమాసయతి ప్రయోగము లక్ష్యము. [5-1]

క. శ్రీయువతీ ప్రియుఁగ్రొవ నా
రాయణ విబుధాంక తీమ! రమణీయ గుణ
శ్రీయుత! విన్మలవర్మ ప
రాయ ! రవితేజ! రాజరాజ నరేంద్రా! 216

మఱియు నేకాంత శబ్దమునకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము గీతి ౧-వ పాదమున నిత్యసమాసయతి ప్రయోగము. హల్లుకు లక్ష్యము. [8-74]

214. *లక్షణసారము అని అ. తి. వ్రాఁతప్రతి.

తే. కామదేహంబులకును నేకాంత గృహము
పొలిచెఁబో మోక్ష ధర్మార్థములకు నదియె
యాస్పదంబన వర్గత్రయానిరుద్ధు
లైన జనులకెంతయు నొప్పు నప్పురంబు. 217

జనార్దన శబ్దమునకు ప్రబంధ పరమేశ్వరుఁడు ఆరణ్యపర్వము చంపకము ౧-వ పాదమున నిత్యసమాసయతి ప్రయోగము లక్ష్యము. [4-393]

చ. నగినగిమేనియుఁగా విను జనార్దన యెన్నఁడు బొంకుఁబల్కఁ మ
త్యగణిత విక్రమోరు బలధైర్య సమగ్రుల మల్లుగాక కా
లగతి తొలంగఁద్రోవఁగఁ దలంబగునే యసుఁగాక నీకు మె
చ్చగ నిదె ప్రాణ మిచ్చెదను సుక్కఁను దావున కాత్మనేమియుఁగా. 218

వార్తాకవి రఘునాథయగారి దీపికయందు,

తే. సరవిమించు విశ్వామిత్ర శబ్దమునకు
అమ్రహల్లైన యతియయ్యెనాది కృతుల
నదియె నిత్యసమాసంబయాంధ్రు బుధులు
ధీనిమల కీవిలెప్పగాఁ దెలియవలయు. అన్నారు. 219

విశ్వామిత్ర శబ్దమునకు భాస్కరుఁడు రామాయణము మత్తేభము ౨-వ పాదమున నిత్యసమాసయతి ప్రయోగము హల్లుకు లక్ష్యము. [సుందర. కాం. 263]

మ. హరకోదండ విఖండనుండు జనకక్ష్మాధీశజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు విశ్వామిత్రయాగాహితా
మరసంహారి విరాధకాలుఁడు ఖరాధ్వంసి మారీచ సం
హరుఁ డన్యప్రమదావరాఙ్ముఖుఁ డయోధ్యానాయకుండావటా. 220

అచ్చవెల్లి రంగనాథుఁడు రామాయణము, ద్విపద. విశ్వామిత్ర శబ్దమునకు రెండవ యర్థచరణాది అచ్చుకు నిత్యసమాసయతి ప్రయోగలక్ష్యము.

ద్వి. ఎక్కడా గురుఁడవి యెఱుఁగవి నీకు
అక్కటా, గురుఁడు విశ్వామిత్రుఁడయ్యె. 221

వ. అనుట నివి నిత్యసమాసయతి లక్షణ ప్రయోగములు. ఇఁక నందు, 222

## (16) గూఢస్వరయతి లక్షణము

తే. తగు విసర్గలు దొలఁగు నోత్వంబుతోడ
హల్లుపై స్వరమందిన యట్టి సంధి
యదియె గూఢస్వరయతినాఁ బొదలుఁగృతుల
నెన్న గూఢస్వరవిభేద మిటులఁ గృష్ణ! 223

[ఛందోదర్పణము. 2-86]

తే. స్వరము తుదనుండ లుప్తవిసర్గ కోత్వ
మైన స్వరవిరామంబు దాసోఽహమనఁగ
అచ్యుతాశ్రితు లర్థి నన్యోన్య మిత్రు
లనఁగ నమ్ముకుందుండు యశోఽర్థి యనఁగ. 224

(*అథర్వణచ్ఛందంబున - రం. ఛం. 3-119)

తే. అరయ నన్యోన్య శబ్దపరోక్షములకు
న్యోరు వర్ణంబులగు నుర్వినుతచరిత్ర
వినుము గూఢస్వరములగు వీనియందు
అచ్చులకు హల్లులకు వళులగునటంద్రు. 225

సర్వదేవుఁడు ఆదిపురాణము కందము ४-వ పాదమున పరోక్ష శబ్దమునకు
అచ్చుకు గూఢస్వరయతి ప్రయోగము లక్ష్యము.

క. శిక్షణము ధృతియు నాప
ద్రక్షణమును జేయు తల్లిదండ్రులు నను ప్ర
త్యక్షపు దైవములౌందఁ బ
రోక్షపు దైవములఁ గొలువ నలజడియేలా? 226

225. *మతి రఘునాథయ్యగారి దీపికయందు - ఆరి ం. శ. వ్రాఁతప్రతి.
ఇది దీపిక వ్రాఁతప్రతిలోఁ గానరాదు. (మద్రాసు ఓరియంటలు
లైబ్రరీ. డి. 1809)

అన్యోన్య శబ్దమునకు పెద్దిరాజు అలంకారము ఉత్పలము ౩-వ చరణమున్న, ౪-వ అడుగునను, గూఢస్వరయతి ప్రయోగము లక్ష్యము. [కావ్య. చూడా. 7-68]

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్య హితత్వ సంపదల నొందిరి, దంపతులింపు నింప న
న్యోన్య సుఖానుకూలతల నోమిరి, విప్రులు పేర్పుఁబిందు న
న్యోన్య సుపుష్టితుష్టికుశలాదులఁజెందిరి నాఁడు నాఁటికిన్. 227

ఇఁక నందు, (17) వ్యంజనస్వరయతి లక్షణము

తే. వ్యంజన స్వరమున నధికాదులైన
హల్లులందులఁ బైస్వరమందెనేని
యదియు దా వ్యంజన స్వరయతి యనఁజను
వ్యంజన స్వరయతిభేద మదియు కృష్ణ! 228

అనంతనగారు [ఛందోదర్పణము. 1-91]

క. స్వరములు కాదుల నొందిన
వరయఁగ స్వరయతులె విఖ్యాత్రమలఁగాకు
స్వరముల విత్వనమాసా
సురసంఘుల రెండునగు భుజంగమ శయనా! 229

భీమనగారు, కందము ౨-వ పాదమున వ్యంజన స్వరయతి ప్రయోగము లక్ష్యము.

... ... ... ... ...

(సోమయాజి భీష్మపర్వము ఉత్పలము ౨-వ పాదమున వ్యంజన స్వరయతి ప్రయోగము లక్ష్యము.) [1-71]

ఉ. ప్రాంశువయోదవీలతనుభాసికు నుజ్జ్వల దండధారుఁ డిం
గాంశు జటాచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థతత్త్వవి
న్యంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్. 230

*భాస్కరుఁడు రామాయణము కందము ౨-వ పాదమున వ్యంజన స్వర యతి ప్రయోగము లక్ష్యము.

క. ఓ కాకుత్థ్సపతీ నీ
కాకపివరుతోడి సఖ్యమర్థము సుమ్మా
నాకుం దోఁచిన విధమిది
నీకార్యంబతఁడె తీర్చు నిక్కము కడిమిన్. అన్నారు. 231

వ. ఇది వ్యంజన స్వరయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 232

(18) ఋత్వయతి లక్షణము

తే. గరిమ స్వరరూపమైన ఋకారమునకు
రేఫతోఁగూడ వడి యొనరించిరేని
ఋత్వయతియన నదియొప్పుఁ గృతులయందు
ఋషిమనోంబుజ మత్తద్విరేఫ కృష్ణ! 233
చిత్రపు భీమన్నగారు —

క. అచ్చులలోని ఋకారం
బచ్చుపడన్ రేఫతోడ నసువైన యెడన్
వెచ్చెర వడిగా నిలుపుట
పొచ్చెము గా దాదికావ్యముల మున్నికిన్. 234
అనంతన్నగారు. [ఛందోదర్పణము. 1.87]

తే. క్షితి ఋకారరూప స్వరయతులు జరుగు
ఋగ్యజుస్సామ వినుతుండు కృష్ణుఁడనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁడనఁగ
హేమపీతాంబరుఁడు దేవ[1]వృషభుఁడనఁగ. 235

కవికంఠపాశమున చంపకము ౧-వ పాదమున రెండవ చరణమునను ఋత్వయతిన్ని నాల్గవ పాదమున రివడికిన్ని ప్రయోగము లక్ష్యము.

---

231. * ఈ పద్యము నేఁటి ముద్రిత భాస్కరరామాయణమున నుపలభ్యము.
235. [1] ఋషభ (అ. శ. వ్రాఁతప్రతి).

చ. *కృతిపతి నామ¹తార (గణ) ఋక్షములంగల రెంటియందుఁ ద
త్కృతిముఖపద్య ముఖ్యగణ ఋక్షమునన్ మెలఁగంగఁ జూచు త
త్కృతి ముఖమైన పద్యమునఁ గిలితవర్ణము తారఁ బొందుత
త్కృతిపతినామఋక్ష మురరీకృతభంగిగఁ జెప్పు పెంపుగన్. 236

శబ్దశాసనుఁడు సభాపర్వము రాజసూయ యాగము పట్టున సీసము ౨-వ పాదమున ఋక్షయతి ప్రయోగము లక్ష్యము. [2-11]

సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ వసుమతీశ
ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మనియతి
[యాచార్యుఁడని వినయమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ గృపుఁడునుండ
ధూనాథుఁడనియెదు బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁదఁ

ఆ. పూజనీయులైన పురుషులలోపల
నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ డిట్టులేల
పూజ్యులయిన వారిఁ బూజింప నొల్లక
భీష్మపమపుఁజేసి బేలవయితి.] 237

వరాహపురాణము గీతి ౧-వ పాదమున ఋక్షయతి ప్రయోగము లక్ష్యము. [5-10]

తే. ఋషికులైక వతంస నిస్స్పృహుఁడనైన
విను విచారింపకొని మేదినీజనావ
నానుభావ ధురంధరుఁడైన దుర్జ
యుని విచారించి దయతోడ నెనయవలయు. 238

236. *ఇందు ఋక్షయతికి, రివడికి రెంటికి లక్ష్యములు గలవు. ఋక్షయతి రివడి - ఇవి వేర్వేఱు యతిభేదములు. చూ. రివడి.
¹ తారతిని. (అ. శ్రీ. వ్రాఁతప్రతి).

మఱియు నందే కందము ౨.వ పాదమున ఋత్వయతి ప్రయోగము లక్ష్యము. [1-138]

క. మీఁరెఱిఁగినంత యెఱుఁగుదు
[1]నేరాజీవాక్షమహిమ - ఋషులార! వినం
గారా దిదిగో శ్రీమ
న్నారాయణుఁబోల వచ్చునా యెవ్వరికిన్. 239

వ. ఇవి ఋత్వయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 240

(19) విభాగయతి లక్షణము

తే. సంఖ్య కొలఁదులు నొడివెడి శబ్దవితతి
పైవిభాగోక్తి పరఁగు శబ్దముల తుద వి
ధించిన విభాగయతులు [1]రెండేసి కృష్ణుఁ
డిదె కలికి మాడలిడు [2]జారెఁడేసి యనఁగ. 241

మఱియు [అనంతన్నగారు. ఛందోదర్పణము. 1-121]

తే. సంఖ్యకును బరిమాణ సంజ్ఞలఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించు నప్పుడు యతులు రెండేసియగు ను
పేంద్రుఁడిచ్చు నర్థము మోపెఁడేసి యనఁగ. 242

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము. యతులు. 1-2]

---

289. [1]ఇది (ఏ - ఋలకు మైత్రి) అ. శిరోమణి మతమున సహజస్వరయతి యగును. ఋత్వయతిక్రిందఁ జెప్పుట సరిగాదు.

241. [1]విధించిన ... రెం° డేసి - ఇందు ఇంచులోని ఇకారమునకు యతిలోని ఏకారమునకు మైత్రి.

[2]జారెఁ డేసి - జారె = కలవంటి జారెమూలుంచు సంచి అని సూ. ని; జారె + ఎఁడు = జారెఁడు.

తే. సంఖ్యయందును బరిమాణసంజ్ఞసంఘ
టిల విభాగాఖ్య యతులు రెండ్రేపి యగుఁ గ
పీశ్వరుల కర్థమీ గంపెఁడ్రేపి యనఁగ
భంజితాసుర సముదాయ! యాంజనేయ! 243

వ. ఇవి విభాగయతి ప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 244

(20) కాకుస్వరయతి లక్షణము

వ. కాకుస్వరయతియును వ్యంజన స్వరయతియును నొకవిధంబునై కానఁ బడును గావున తద్భేదంబులు వివరించెద; నందు కాకుస్వరయతి సంబోధ నాంత పరమయ్యును దీర్ఘవర్ణంబై స్వరముగావ్రిందు నదియే కాకుస్వర యతి యగుఁగావి కాదులైన హల్లులపై స్వరమందిన అదియు కాకుస్వర యతి యనఁబడు, కాదులపై స్వరమందిన యది వ్యంజనస్వరయతియై సిద్ధంబగుఁ గావున నట్టి కాకుస్వరయతికి లక్షణము, 245

అనంతనగారు. [ఛందోదర్పణము. 1-97]

తే. వరుస దీర్ఘాంత సంబుద్ధి వచన [1]రచన
కమరుఁ గాకుస్వర [2]విరామమై సహస్ర
నామశోభిత గోపకృష్ణాయనంగ
(నమర వందిత గోప కృష్ణాయనంగ.) 246

వార్తాకవి రఘునాథయ్యగారు దీపికయందు [లక్షణదీపిక. 321]

తే. [1]తుదల దీర్ఘంబు లందినఁ దోఁచు నిడుద
[2]యచ్చు ప్రశ్న కాకుస్వరయతికి రెండు
వర్ణములు చెల్లు హరిఁ జూడవాలతాంగి
యతివ చూచితె లెవ్వాఁడా యనంగ. 247

---

246. [1]యతులు (ఛం. ద.)
[2]స్వరంబు పరమసహస్ర. (ఛం. ద.)

247. [1]తొలుత. (అ. శి. వ్రాఁతప్రతి).
[2]అచ్చు హల్లు కాకుస్వర. (అ. శి. వ్రాఁతప్రతి).

[*అనంతన్నగారు. ఛందోదర్పణము. 1-96]

ఆ. వలదు కృష్ణయెఱుఁగవా నన్ను నిది తగ
వా విరుద్ధ భాషలాడ నేల
లోననెట్టి యలుకలో నాఁగఁగాకున్న
రోక్తి రెంటఁజెల్లు నొగిధరిత్రి. 248

వెండియు ననంతనగారు. [ఛందోదర్పణము. 1-95]

క. కాకుస్వరయతి యగు నితఁ
డేకద జలనిధిని బన్నఁడించె ననం త్ర
న్నాకలిత దీర్ఘమున నితఁ
డేకవ్వడి రథము గడపె నిమ్ముల ననఁగన్. 249

ఇందుకు ప్రయోగము సోమయాజి ఉద్యోగపర్వము కందము ౪-వ పాద
మున కాకుస్వరయతి ప్రయోగము లక్ష్యము. [2-250]

క. నీచెప్పిన వీరలు ద్రో
ణాచార్యులు మొదలుగాఁగ నవి కొల్లని వా
రైచన్నవారలం గవి
యే చక్కంబెట్టు వాఁడ నే పాండవులన్. 250

భాస్కరరామాయణము కైకసి వాక్యము గీతి ౪-వ పాదమున కాకుస్వర
యతి ప్రయోగము లక్ష్యము. [యుద్ధ కాం. 156]

ఆ. అన్నపీవు బుద్ధులన్నకుఁ జెప్పుచు
మన్నమాటలేమ విన్నఁగోలె
పొగులుచున్నదాన మొగమొప్పకున్నది
యేమి తెలుఁగుఁ జెప్పవే కుమార ! 251

శ్రీనాథుఁడు నైషధము. శార్దూలము ౪-వ పాదమున కాకుస్వరయతి
ప్రయోగము లక్ష్యము. [2-32]

---

248. * మంత్రి యు రఘు రామ య్య గారు, (ఆ. ౧. వ్రాఁతప్రతి).

శా. కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీలుంటాకము చందనాచలతటీ శ్రీగంధసంపుష్పిత
వ్యాళస్ఫారఫణాకఠోరవిష నిశ్వాసాగ్నిపాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము పక్ష్మీచేయు దాక్షిణ్యముల్. 252

వ. ఒక్కొక్క దిక్కున ఈకాకుస్వరయతియు ప్లుతయతియు ఒక్కతీరుగాఁ గానఁబడు; ఇవి కాకుస్వరయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 253

(21) సావర్ణ్యయతి లక్షణము - అందు సమయాసులు

ఇందుకు సమ్మతులు - ఆంధ్రకవితాపితామహుఁడు ఆముక్తమాల్యద ఉత్పలము ౧-వ పాదమున ట - త వర్గులకు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [5-122]

ఉ. డిగ్గిన యంచదూఁడు కొని తీర వనేక్షువు వంకమీఁదుగా
నగ్గిర పుల్లకేసరము [నందు వసింపఁగ నెక్కునాలిను
న్నొగ్గమునం దనారత మరంద సర స్యరవిందగోష్ఠికిన్
వెగ్గలమాడుతేంట్లు మరువింటికిఁబూనె గుణద్వయశ్రమున్.] 254

సోమయాజి ఉద్యోగపర్వము ఉత్పలము ౧-వ పాదమున త - ట వర్గులకు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [2-52]

ఉ. దక్కను రాజ్యమంచు నకటా యిటు దమ్మువిభాగమీక నీ
వెక్కడ మ్రింగఁజూచెద వదేటికి (దక్కను మీనులోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పునూవె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లమునున్నటు లాడఁగూడునే.) 255

మఱియు సోమయాజి ద్రోణపర్వము, అభిమన్యువాక్యము, చంపకము ४-వ పాదమున లక్ష్యము ద - ట లకు ప్రయోగము లక్ష్యము. [2-11]

చ. ఇదియొక పిన్నవాఁ డదరి యెక్కుడు మూఁకల గ్రందుదోలెడున్
గదుపులవెల్వ గోపకునికై వడినంచు జనుల్నుతింపఁ (జే
పెద నినిమామప్రీతి విలపిల్లఁగఁ దండ్రియు సంతసిల్లఁ) బె
ట్టిదుఁడగు కౌరవేంద్రునకు [1] దెప్పరమయ్యెడు భంగిఁబేర్చెదన్. 256

256. [1] డెప్పర. (సంశో. ఖా.)

మఱియును సోమయాజి ద్రోణపర్వము ద - ధ లకు సావర్ణ్యయతి ప్రయో
గము చంపకము ౧-వ పాదమున లక్ష్యము. (1-109)

ఉ. ఆకట యజాతశత్రుఁడను నప్పులు కిప్పుడు విక్రమయ్యెనా
నీకిఁ గురునాథ! యిట్టులతనిం దెగఁజూచుట ¹గోరకాని నా
డ్డి కొనఁగఁ గోరి యీ విధము ²దప్పర మెంతయు నీతెఱంగు గో
ర్కికిఁ గతమేమొ పాండవులగెల్చి ధర న్నగమీఁ దలంచితే. 257

మఱియు సోమయాజి విరాటపర్వము ధర్మరాజ వాక్యము. ఉత్పలము
౧-వ పాదమున ద - ధ లకు యతిప్రయోగము లక్ష్యము. [1-92]

ఉ. ఒప్పెడు మేనఁ బెంపుగల యుల్లము నాగరికంపుఁ జందముం
దెప్పక చూపకేతని విశేషముఁ దెల్పెదుఁ గొల్చుటెంతయుం
దప్పర మేమిచేయుమఁ గడింది విచారము పుట్టె, నెట్లితం
డప్పురి నంచరింపనొకొ యన్యులెఱుంగక యుండునట్లుగన్. 258

ప్రబంధ పరమేశ్వరుఁడు అరణ్యపర్వము మత్తేభము ౧-వ పాదమున
కవర్గ తవర్గులకు బిందు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము.

మ. *వెలఁదింగానక కోటులయ్యెడల నన్వేషించు రారాజు మం
జుల కుంజంబులఁ గమ్మపుప్పొడుల సంక్షోభించి కల్హార కాం
గం దేశంబుల మాధవీ ఘుసృణకాంతారాటవీ క్షోణులం
గల సు ...దిత చక్రచక్రముల సత్కాసారాంతరాంతమ్ములన్. 259

మఱియు నాంధ్రకవితాపితామహుఁడు మనుచరిత్ర శా. ౪-వ పాదమున
బిందుసావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [1-55]

శా. శీలంబుం గులముం శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయముం
బోలంజూచి యితండు పాత్రుఁడని యేభూపాలుఁడీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కు దం
డాలంబందు నొకప్పుడుం దఱఁగదింటం బాఁడియుం బంటయున్. 260

257. ¹సారకాంతి. (అ. శ. వ్రాఁతప్రతి).
²డప్పర. (సంశో. భా.)

259. *ఈపద్యము నేఁటి ముద్రితభారతమున దృశ్యము.

రాయన భాస్కరుని చాటువు. మత్తేభము ౨-వ పాదమున టవర్గ తవర్గులకు బిందు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము.

మ. నరిబేసైరిపుడేల భాస్కరుని భాషానాథ! పుత్రా! వసుం
ధర నందొక్కఁడు మంత్రియయ్యె వినుకొండన్ రాయనామాత్య భా
స్కరుఁడో? యౌ, నయితే సహస్రకరశాఖల్లే, వదే యున్నవే
శిరమై దానముసేయుచో, రిపులహేతిన్వ్రేయుచో, వ్రాయుచో. 261

శ్రీనాథుఁడు నైషధము, ఉత్పలము ౨-వ పాదమున టవర్గ తవర్గువుల కున్న సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [2-137]

ఉ. రాకసుధాంశు మండలము రాహువు నూవు మొగంబుఁ బట్టుచో
డీకొని వచ్చు దండధర దిక్పవమాన మదక్షిణాంబువుం
గాక వియోగికిన్ గుసుమకార్ముకశృంగము వంగఁజేయునీ
కీకరపంకజాతము రతీశ్వర! దక్షిణమైన నాఁటికిన్. 262

*సారసంగ్రహము —

క. వర్గాక్షర విపరీత మ
నర్గళ బిందు ప్రశస్త మనికిన తగుచో
వర్గములకు సావర్ణ్యము
భర్గప్రణిపాతచరణ పంకజనాభా! 263

వ. అన్నారు. డిగ్గి - [దిగ్గి]; దక్కను - దక్కను; డీకొని - డీకొని; అవి యిట్లు రెండు ప్రయోగములు గలవని యందురు. రూఢి పదములు డిగ్గి, దక్కను, డీకొని యనునివి ప్రశస్తముగా వాడిక పదములు ముఖ్యముగాఁ దెలియు నట్లుగుదహరించేసిన విని సావర్ణ్యయతి ప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక, 264

## (22) అనుస్వారోష్మయతి లక్షణము

తే. శషసహలునాఁగ నవని యూష్మలు దనర్చు
బిందుయుక్తమైన శషసలఁ బెనఁచి యడిన

263. *ఛందస్సారసంగ్రహము కానోపును.

నవి గృతుల నమస్వారోష్మయతులనంగఁ
దనరు నూష్మల నాల్గింటఁ బెమపఁగృష్ణ! 265

ఉదాహరణము —

తే. *శరధి విశగాత్ర విమల [1]సంగత చరిత్ర
సర్వగీర్వాణ మిత్ర పంకజ[2](వి) నేత్ర
హంస వంశ పవిత్ర సంభరిత గోత్ర
యనఁగఁదగు నమస్వారోష్మయతులు కృష్ణ! 266

ఛందస్సార సంగ్రహమున —

క. మిగుల నమస్వారోష్మల
కగువర్ణ ఘటింప శషసహలు మూలతుకఁగా
బిగిగొవి బిందువు గూర్పం
దగునది మవిరామ మమర సమర విరామా! అన్నారు. 267

లక్ష్యము రామాయణము ౪-వ పాదమున సవర్ణమునకు అమస్వారోష్మ యతి ప్రయోగము.

మ. సమరాగ్రమ్మున రామఁడమ్ముఁదొడిగెఁగా చాపంబునన్నాటిగా
నమరారిద్రుమరాజి దావదహన వ్యాలోల కీలచ్ఛటా
సమరోషోగ్రకషాయితేక్షణము[1]లం బ్రధ్వస్తదిక్పాలఁ బం
క్తిముఖుఁగా దుర్వారసాహిదానమదసంకేతంబు లక్షించుచుఁగా.* 268

---

266. *ఈ యనుస్వారయతిమైత్రీ విశేషమునుగూర్చి పీఠికను చూచునది.
[1] సంశత (అ. శ. వ్రాఁత ప్రతి).
[2] వినేత్ర. (అ. శ. వ్రాఁత ప్రతి).

268. [1] లన్ప్రధ్వస్త. (అ. శ. వ్రాఁత ప్రతి).
*ఈ పద్యము నేఁటి ముద్రిత భాస్కరరామాయణమున మృగ్యము. లక్షణశిరోమణికిఁ బూర్వికములైన కవిచింతామణి, లక్షణదీపిక, ఆంధ్ర ప్రయోగ రత్నాకరము పై పద్యమును రామాయణములోనిదిగ నుదాహరించినవి. అందలి పాఠములెల్ల భిన్నభిన్నములై పొంది పొసఁగకున్నవి.

వ. అన్నారు. ఇవి అనుస్వారోష్మయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁకఁ
నందు, 269

(23) *చుత్వానునాసిక యతిలక్షణము

సీ. మత్ త్వత్ భవత్ యుష్మదస్మద్యత్ తత్ (1)
ఇవియు యుష్మదస్మ ద్విధములను గృతుల (1)
చజల ననునాసికల సంధి సంఘటింప
నవియె చుత్వానునాసిక యతులు కృష్ణ! 270

ఉదాహరణము —

తే. తలమె బ్రహ్మాదులకు మద్వచ్చరణ మహిమ
దలఁప నేరికిఁ దీఱ మజ్జనక! నంత
తమును భజింయింతునే భవచ్చరితలనిన
నటులు చుత్వానునాసిక యతులు కృష్ణ! 271

చుత్వానునాసిక యతిప్రయోగము లక్ష్యము. ఛందస్సారసంగ్రహమున —

తే. యుష్మదస్మత్ప్రకారమై యొనరు విరతి
చుత్వమనునాసికము పూనుచో ఘటింప
ధాత్రి మజయము కృష్ణు మన్మానసాబ్జ
ధామమున విల్చికొల్తుఁ ద్వచ్చరణమనఁగ. అన్నారు. 272

ఇందుకు శాకుంతలము కందము ౨-వ పాదమున లక్ష్యము.

.... .... .... .... ....

(24) ఆదేశయతి

మఱియు నాక శబ్దమునకు *గౌరవ ఉత్పలము ౪-వ పాదమున ఆదేశయతి ప్రయోగము హల్లులకు లక్ష్యము.

---

*చుత్వానునాసిక (అ. శి. వ్రాఁతప్రతి) 270, 271, 272. పద్యములలోను వ్రాఁతప్రతులందు 'ఋత్వ' అనియే లిఖితమై యున్నది. (చూ. ౬౪౪)

(1) ప్రథమపాదమున గణభంగము. ద్వితీయపాదమున యతిభంగము.

273. *ఇది గౌరవ చాటుధార. (అప్పు. 3-153).

ఉ. ప్రాకటదర్పులై సకలరాయని లక్కనృపాలవాజిలోఁ
దాఁకు విరోధి సైన్యము మదంబొదవ న్వెరియింప వచ్చుచో
నాకసమెల్ల నందుకొను సంచిత దివ్యవిమాన సంచర
న్నాక విలాసినీ చరణ నూపుర భూరి ఝణంఝణధ్వనుల్. 273

ముద్దరాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవని యందు ఆదేశయతి ప్రయోగము.

మ. *కృతులం గల్గటఁజేసి ద్వ్యంతరుపసర్గేభ్యోప ఈత్ప్రక్రియా
న్వితులౌటన్ యతు లచ్చు హల్లులనగున్ ద్వీపాంతరీపంబులన్
హితుఁడై ధర్మజుఁ బ్రోచి ఖాండవమహాద్వీపంబొసంగెం గురు
క్షితిపవ్రాతము సేవదంచె గుణరోచిష్ణుండు కృష్ణుండనన్. 274

వ. ఒక్కొక్కదిక్కున ఈ ఆదేశయతి నిత్యసమాసయతి. అఖండయతిన్ని ఈ మూఁడున్ను ఒక్కరీతిగా కనఁబడును. రఘునాథయ్యగారు ఆదేశయతి నిత్యసమాసయతిలో భేదమగుఁ గనక నాకశబ్దము అఖండయతి యనవచ్చు నన్నారు. ఇవి ఆదేశయతి ప్రయోగలక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 275

## (25) ప్రాసయతి లక్షణప్రయోగ లక్ష్యములు

తే. పదములను సీసముల గీతపద్యములను
వృత్తములలోన నొక కొన్ని వృత్తభేద
ముల లయగ్రాహి రగడల నిలుచుఁగాని
యితరములఁ జెల్లదిదఁ బ్రాసయతులు కృష్ణ! 276

వ. ప్రాసయతి యనునది - యిరువది ప్రాసభేదము(లు). సమనామ విషమ మొదలుగాఁ బ్రాసమ్ములు. పదగీత సీసమ్ములయందును ఉపరివృత్తాదులలో లయగ్రాహి మొదలగు కొన్నివృత్తములను రగడభేదములను

---

*ప్రాకటగర్వులై (అ. తి. ప్రాఁతప్రతి).

274. * ఈ పద్యము కోఁటి ముద్రిత క. జి. సం. అందు లుప్తము.

మఱియు సమవృత్తభేదములలోఁ గొన్ని వృత్తంబులను బ్రాసయతి చెల్ల
వింతియేకాని తక్కినవానియందు ప్రాసయతులు చెల్లకుండుటను బ్రసిద్ధంబు
లగు విది ప్రాసయతి లక్షణము. ఇఁక నందు, 277

(26) వికల్పయతి లక్షణము

తే. హల్లులందు [1]హకారంబునందు సంధిఁ
జేసిన వికల్పయతి (యనఁ) జెల్లు ఙ ఞ ణ
నమలనఁగ గల్గు ననునాసికములు గూర్చ
నదియె యనునాసిక వికల్పమయ్యెఁ గృష్ణ! 278

వ. మఱియును, 279

తే. హయుతమైనట్టి హల్లులయందు మఱియుఁ
గాకు బిందువుతోడి జకారమునకుఁ
గలిపి యొక్కొక తఱివి వికల్పయతులు
దనరు వాదిమకవి సమ్మతమునఁ గృష్ణ! 280

అనంతనగారు [ఛందోదర్పణము. 1-124]

తే. హయుత వర్గహల్లు వికల్పయతుల జరుగు
దేవకీనందనుఁడు జగద్విభుఁ డనంగ
హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
ననవిమోచినయవి కకుబ్భిత్తులనఁగ. 281

చిత్రకవి పెద్దనగారు. [లక్షణసారసంగ్రహము. యతులు. 1-11]

తే. సంధులను రెండు రూపముల్ జరుగు వర్ణ
ముల వికల్పాక్షర యతులు దనరుఁ గృతుల
తలఁపు హరిపైన నిడిన నన్మతివి యనిన
ఖండితాసురసమువాయ! యాంజనేయ! 282

278. [1]వకారంబు (అ. కి. వ్రాఁతప్రతి).

## జకారమునకు వికల్పయతి లక్షణము

[*ఛందోదర్పణము. 1-125]

తే. నలిజకార హ ళ్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్పయతులఁ
గలుగుఁ బ్రక్రి వల్లవసుదృఙ్నాదముఁడనఁగఁ
గమలనేత్రుఁడు సకల దిఙ్నాహుఁడనఁగ. 283

ఇందుకు సోమయాజి శాంతిపర్వము, కందము ౨-వ పాదమున ఞకారము నకు వికల్పయతి ప్రయోగము లక్ష్యము. [5-90]

క. జ్ఞానంబు వడయుటకు వా
ఙ్మానసముల సునియతముల గావింతు రొగి
న్మానితశాంతికొఱకు సు
జ్ఞానంబున నాత్మనియతి నలుపుదురు బుధుల్. 284

వ. ఈ వికల్పయతిన్ని, ఉభయయతిన్ని, ఞయతిన్ని ఒక్కొక్కచిక్కున ఒక రీతిగాఁ గనఁబడును. ఇవి వికల్పయతి ప్రయోగ లక్ష్యములు, ఇఁక నందు, 285

## (27) ప్రభునామయతి లక్షణము

తే. ఏకశబ్దంబె ద్వివిధమై యూఁదఁబడక
యూఁదఁబడియున్న తెఱఁగున నొనరుఁగృతుల
విరతి పదములఁ బ్రభునామ విరమణంబు;
వీవిలక్ష్యంబు తేట గావింతుఁ గృష్ణ: 286

తే. అవనినాథుఁడు గోపకృష్ణయ యనంగ
జలజనేత్రుఁడు గోపకృష్ణయ యనంగ
అతనిసామేను రామ,*యాయన యనంగ
హరికి గారాపురాణి *యాయమ్మయనఁగ. 287

283. *వార్తాకవి రఘునాథ కృష్ణగారు దీపిక యందు (అ. శే. ప్రాఁతప్రతి).

287. *ఈ యూఁదు, నాలుగు పాదములలోని ప్రభునామయతికి లక్ష్యములు కాఁజాలవు.

వ. మఱియును, 288

తే. అహిగిరి నివాసుఁడవని వెంకన్న యనఁగ
గరుడగమనుఁడు పురమి వెంకన యనంగ
కలిమి కల యలమేలు మంగమ్మ యనఁగ
అరయ సిరి యలమేలు మంగమ యనంగ 289

అనంతన్నగారు. [ఛందోదర్పణము. 1-120]

తే. ఒరుల నన్నమయను దోఁప నూఁదఁబడక
ద్వివిధముగఁ జెల్లుఁ బ్రభునామ విరమణంబు
మహినయోధ్యకు రాజు రాముని యనంగ
నతవి పట్టపుదేవి సీతమ యనంగ. 290

వ. ఇది ప్రభునామయతి లక్షణము. 291

(28) [సంయుక్తయతి లక్షణము]

తే. (క)షల సంయుక్తి కాక్షర గణన నొంది
[1](చఛఝఘుల కఖగఘుల శషసలనందు)
శియ్యవర్ణుషవ్రాసయు గిరుక వరుకఁ
బడిన సంయుక్తయతులఁ గాన్పదము కృష్ణ! 292

భీమనగారు [కవిజనాశ్రయము సంజ్ఞ. 71. అధస్సూచి]

క. వెలయఁగ సంయుక్తాక్షర
ములలో నేనియైన మునుకొని వడిగా
విలువఁదగుం బావమ్ముల
వలఘుపరాక్రముఁడ! దేవ! యనదృశ విభవా! అన్నారు. 293

వార్తాకవి రఘునాథయ్యగారు దీపికయందు —

క. వసుమతి కషయోగజమై
యెనఁగిన శాతోదీ యతికి నెనయును శషసల్

292. [1]నజల శబలాలిగా వ్రాలునసంభవోతు. (అ. కి. ప్రాచీనప్రతి).

వనగల కళగము చఛ(జ)ఝ
(ల)స దృశగతి నాదికవుల యనుమతి వలనన్. 294

వ. మఱియును, 295

[*ఛందోదర్పణము. 1-110]

క. వడి నెలవులలోఁ జేరువ
యెడ నొకసంయుతమునొలయెడ నొకటినిఁ దా
రిడిరేవి కవులు తప్పుట
యొడఁబడదు పృథగ్యతి ప్రయోగముల హరీ! 296

[ఛందోదర్పణము 1-109]

క. ఒక్కడుగున విశ్రాంతులు
పెక్కడుచో సంయుతములు పెమపకమును జ
ద్దక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యనుపవలయు నన్నిటను హరీ! 297

¹లక్ష్యము శ్రీరంగమహత్త్వము రగడ సంయుక్తమైన తకారమునకు ప్రయోగము [ఛందోదర్పణము 1-111]

త్స్నావలయమంతయు విషాణమునసెత్తు కిటి
మహిమవలపోయ నక్క జ మనుచు విట్లిడక
త్స్నావలయమంతయు విషాణమునసెత్తుకిటి
సత్త్వమరుదన నొప్పు సంయుక్తవడి చెడక. 298

---

296. *దీపికయందే (ఆ. శీ. వ్రాఁతప్రతి)

298. ¹ద్విరదగతిరగడ కుదాహరణముగ ఛందోదర్పణమున నీపద్యము కలదు [1-111]. అనంతుఁడు స్వీయలక్ష్యములనే యొసఁగును కాని యితరులవి గ్రహింపలేదు. మఱి యీ పద్యము సంయుక్తయతి లక్ష్యలక్షణములఁ దెలుపుచున్నది. కాన నిది శ్రీరంగమహాత్మ్యములోనిది కా కిరదు.

*మఱియు నొకరగడ. లక్ష్యము [ఛందోదర్పణము. 1-112]

రంపముల ప్రచ్చగతి ప్రచ్చె నఖముల రిపుని
వక్షము నృసింహుఁడన రావడియుఁ [1]జొరదుకృతి
ఱంపముల ప్రచ్చగతి ప్రచ్చెనఖముల రిపుమ
రమ్ము నరసింహుఁ డన[2]వ్రాయ సంయుక్తయతి. 299

భాస్కరుఁడు రామాయణము శా. [1]౪-వ పాదమున సంయుక్తయతి ప్రయోగము లక్ష్యము. [యుద్ధకాం. 79]

శా. రక్షోనాయక మమ్ము మిమ్ము సచివవ్రాతంబు నీ సేనల
న్రక్షింప న్వలకేని పుమ్ముమరల న్వైదేహి నీవెన్న నా
జిక్షోణి స్థలినల్పుఁడే [2]ఖరుఁడు ప్రక్షిప్తోగ్ర [3]కీలాముఖ
త్ప్రేక్షంబైన రఘుక్షితీశ శరవహ్నిం ద్రోపు గంటేగదా! 300

వ. ఇవి సంయుక్తయతి లక్షణప్రయోగ లక్ష్యములు. ఇఁక నంచు, 301

---

299. * "అట్లు మఱియొక విధంబగు రగడ" అని అనంతుఁడు దీని నుదాహరించెను. (ఛం. ద. 1-112).

[1]సొంపగుఁగృతి. (అ. శి. వ్రాఁతప్రతి).

[2]వ్రాలు. (ఛం. ద.)

300. ఇందు నాలుగు పాదములందును సంయుక్తయతులు గలవు.

300. [2]వరుఁడు. (అ. శి. వ్రాఁతప్రతి)

[3]కీలానల, ప్రేక్షంబైన (అ. శి. వ్రాఁతప్రతి) ఈ పాఠమును గ్రహించిన "ప్రేక్ష్యంబైన" అను రూప ముండవలసి వచ్చును. అప్పుడు ప్రాసభంగమగును. నా, దుస్సులకు పరమైన ధాతువునకు యప్రత్యయము రాదు. దుర్ + ఉత్ప్రేక్ష్య = దురుత్ప్రేక్ష. కాన దురుత్ప్రేక్షమను పాఠము సమీచీనము.

## (29) శకంధుయతి లక్షణము

తే. ప్రౌఢకవు ల(చ్చు) హల్లులు భవ్యకావ్య
ములఁ బ్రయోగింతు రొకతఱి ముఖ్యకృతుల
యతులు చెల్లుటఁజేసి వేదండ వరద
(¹యవి శకంధ్వాది గణయతులగును గృష్ణ!) 302

వ. అట్టి శకంధు గణశబ్దంబులెట్టి వంటేవి, 303

సీ. గణుతింపఁగ శకంధు కర్కంధు లాంగలీ
షాహలీ షా (మనీషలు నలక్త)
కులటాపతంజలి కుద్దాలకుత్కీల
సారంగసీమంత నారికేళ
మందారవేదండ మార్తాండ కర్పటి
ద్వీపాంతరీప ప్రతీప నాక
మంజీర కోష్ఠిష మస్తిష్క ముఖములౌ
శబ్దంబులు శకంధు సంజ్ఞకములు

తే. తనరువిందులఁ గొన్నిశబ్దము లఖండ
యతులు నిత్యసమానంబు లంద్రుగృతుల
విరతు లొనరించుచోటఁ గవీంద్రులరయ
ధరశకంధ్వాది గణముల కరణిఁగృష్ణ! 304

మఱియు విందు కుదాహరణము —

సీ. అరయఁగా సిరికి మందారదామముచేత
దయమీఱభక్త మందారుఁడనఁగ
ఇందిరారమణు మనీషవర్ణింతురు
నిరతంబు భక్తి మనీషులనఁగ
ఇష్టసిద్ధికి నారికేళార్పణం బా(బు)
కేత(మన)కు నారికేళమనఁగ

---

302. ¹యను శకంధ్వాది గణయతులనఁగఁగృష్ణ! (అ. తి. ప్రాచీనప్రతి).

ఆతవుఁడు వితత సారంగ చర్మాంబర
రతుఁడన ధరితసారంగుఁడనఁగ

తే. ఈశ్వరుఁడు దాల్చెమంజు మంజీరమొకటి
జితదితిసుతుండు వేదమంజీరుఁడనఁగ
నవని విట్లు శకంధ్వాది యతులు కృతుల
నచ్చునకు హల్లునకుఁ జెల్లునండ్రు కృష్ణ! 805

[*కవిచింతామణి 3-24]

సీ. అరయ శకంధు కర్కంధు సీమంత మ
[1]నీషలుఁగా బెరసి హలీషలవలు
కుల్కుల లాంగలీ షోష్ఠీషకులటలు
తెలియమంజీర మస్తిష్కములును
పరఁగంగఁ గుద్దాల [2]వ(ర్కటా)లత్తకం
బాదిగా నివి శకంధ్వాది గణము
మఱియు వేదండముగా మందారనాకముల్
ద్వీపాంతరీప ప్రతీపములును

తే. నారికేళము లివియాదిగా [3]రసజ్ఞ
లన్వితములను, నిత్యసమాసములు, న
ఖండములనన వడులొప్పుఁ [4]గావ్యవశత
దగ్గరించిన స్వరమఖండంబుగాదు. 806

మఱియు నందే శకంధుయతి ప్రయోగము లక్ష్యము, [కవిచింతామణి 3.26]

---

806. *'లక్షణసారము - లింగముగుంట రామన్నగారు' అని అ. శీ. వ్రాఁత ప్రతి. 806, 807 కవిచింతామణిలోనివి.

[1]'నీవపతంజలి హలీవ లవలి' అను అ. శీ. పాఠమున గణభంగము.

[2]పర్కటా అత్తకము. (రా.)

[3]గాఁగ సంజ్ఞ (అ. శీ. వ్రాఁతప్రతి. యతిభంగము).

[4]గాత్యమమర. (అ. శీ. వ్రాఁతప్రతి.)

సీ. క్షుత్కీల కన్యక క్షుదురాజధరుఁడిచ్చెఁ
గుత్కీల మంజులక్షుంణ విహృతి
హిమభూమి భర్త కుక్షీషంబు గంగగ్రా
న్నాలపువ్వు పన్నగోష్ఠీష(¹తల)కు
(నిర్జరాచార్య మనీషమించిన యామ
నీషి వాగ్వైఖరు లెన్ననేల)
హారిరాణి పదము సీమంతినీ నివహ సీ
మంత్ర రేఖాధార్య మణి విశేష)

తే. మొద్దినరివచ్చు జాంబవద్ద్వీపమునకు
వివిధ వస్తుచయంబు లీద్వీపమందె
నాకపతి తమ్ముఁడిం దనయాత్మఁదలఁచు
నరుల కబ్బున గొబ్బున నాకసుఖము. 307

ముద్దరాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవనియందు. [1-55]

తే. ధ్వాంత వేదండ మార్తాండ శబ్దములకు
యతులు మతయంబునగు బుధస్వాంతములకు
అతిసుఖావహుఁడెపుడు వేదండ వరదుఁ
డవఁగ హరిదైత్య తిమిర మార్తాండుఁడవఁగ. 308

చిత్రకవి పెద్దనగారు. [లక్షణసారసంగ్రహము. ఆశ్వా. 1-24]

తే. అలకకంధ్యాది గణమున కచ్చుహల్లు
యతులొనర్తురు సుకవి వేదండ రచిత
నిఖిల కృతులను జూచి మనీషివరులు
రంజితాసురసముదాయ! యాంజనేయ! 309

---

307. ¹అతల (అ. శి. వ్రాఁతప్రతి.)

శబ్దశాసనుఁడు ఆదిపర్వము [1]ఆశ్వాసగర్భము మత్తకోకిలలో ౪-వ పాదమున వేదండ శబ్దమునకు శకంధుయతి హల్లుకు ప్రయోగము లక్ష్యము. [3-228]

మత్తకోకిల. దండితాహితవీర! సూరివిధాన! దానవినోద! కో
దండపార్థ! పరాక్రమప్రియధామ! దిక్పరిపూరితా
ఖండ పాండుయశోనిధీ! పరగండభైరవ! వైరివే
దండ గండ విదారి ఘోరతరాపి భూరిభుజార్గళా! 310

సోమయాజి విరాటపర్వము స్వాంత శబ్దమునకు ఉదాహరణము - ఉత్పలము ౧-వ పాదమునను హల్లులకు శకంధుయతి ప్రయోగ లక్ష్యము. [2-331]

ఉ. స్వాంతము దాహగర్వఘనసంతమసాంధముగాఁగ శంకయా
వంతయులేక కీచకుఁడ హంకృతి ముంగలిగాఁగ మండపా
భ్యంతరసీమఁజొచ్చి తటియంజవి యారపిపెట్టఁగాంచి య
త్యంతముదావహాంబగుడు వంతరయంబునఁ గేలుసాఁపఁగన్. 311

ఈ స్వాంత శబ్దమునకు శ్రీనాథుఁడు నైషధము గీతి ౧-వ పాదమున అచ్చునకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము. [2-82]

గీ. అధికరోషకషాయితస్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్యదోషోచ్ఛ్రయంబునఁ బరుసనైన
జిహ్వకును బంచదారయుఁ జేఁదుగాదె. 312

మఱియు నీ స్వాంత శబ్దమునకే [1]షష్ఠంలో ఉత్పలము ౩-వ పాదమున అచ్చుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము.

---

310. [1]ఆశ్వాసగర్భమున అశ్వాసాంతమని కవి భావము కానోపును.

312. [1]శృంగారషష్ఠమని సు. ల. సా. సం. 2-262. దీనినే కవుల షష్ఠమని లాక్షణికులు వ్యవహరించిరి.

ఉ. సంతత భక్తియుక్తి కొనసాఁగకయుండిననుండ నిమ్ము దై
త్యాంతక పాదపద్మముల(యందు) నొకానొకయప్పుడే నిజ
స్వాంతము తద్గుణాభి[1]నుతుఁడై నరుఁడెప్పుడు గీలుకొల్పవాఁ
[2]డంతక తత్పటాకలనకైనను జూడఁడు భూవరోత్తమా! 313

మఱియు నందే మత్తేభము, ౧-వ పాదమున శకంధుయతి ప్రయోగము 'స్వాంత' శబ్దమునకు అచ్చుకు లక్ష్యము.

మ. అని యీ విద్యగురుప్రపన్నుఁడు వృథు స్వాంతుండునౌ చిత్రకే
తు నృపాలాగ్రణికిచ్చె నారదముఁనీంద్రుం దంగిరోయుక్తుఁడై
చనియెఁ బంకజగర్భగేహమున కానర్వంసహాభర్తదా
(వినుపాపించి) చరించె నేకహములఁ విద్యాధరా దక్షతఁ. 314

'మార్తాండ' శబ్దమునకు సోమయాజి ద్రోణపర్వము మత్తేభము ౧-వ పాదమున హల్లుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము. [5-378]

మ. ధరణీచక్రము దిద్దిరందిరిగె మార్తాండుండు కుంతీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడంకె [1]విన్న దల్పెన్మహీ
ధర సంతానము కోలి గ్రక్కదలె నువ్వారింతంబులై యంబుధుల్
వారలెం గట్టులమీఁదఁ [2]తేటుపిడుగుల్ మ్రోసె న్మహోగ్రంబుగఁ. 315

మఱియు నీమార్తాండ శబ్దమునకే షష్ఠంలో గీతి ౪-వ పాదమున అచ్చుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము.

తే. వలవదు భయంబు వారెంత వారలైన
నట్టివారలు మనకర్హమైనవారు

---

313. [1]రతుఁడై నరుఁడెప్పుడు (సు. అ. పా. సం.)
[2]డంతకుఁద్భటాలిఁగనైనను (సు. అ. పా. సం.)

314. [1]వినుతాపించి. (అ. శ. వ్రాఁత ప్రతి.)

315. [1]మిన్నఁ గాల్చెఁ. (సం. కో. భా.).
[2]చిట్టపిడుగు. (సం. కో. భా.)

వారు విరయంబునకుఁ గాపువచ్చువార
లనుచు బుద్ధిగఁజెప్పె మార్తాండ[1](సుతుఁడు.) 316

మఱియు వేదండ శబ్దమునకు సోమయాజి భీష్మపర్వము - ఉత్పలము ౪-వ పాదమున హల్లుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము. [1-234]

ఉ. పాండు నృపాలనందనులుపావని మున్నుగ నేచియిట్లు భీ
ష్ముండు కడంకమై నడచుచోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచియోం
డొండకడంగి సేనతన యుబ్బునకుబ్బఁగ నన్యసైన్య వే
దండముఖాంగముల్ తృణవి తానముగాఁగొని విర్వికారులై. 317

వ. అన్నారు. ఇవి శకంధుయతి లక్షణప్రయోగ లక్ష్యము(లు). ఇఁక నందు, 318

## (30) యశవర్గద్వయయతి లక్షణము

తే. యరలవశషసహల బిందులాదివిడక
యున్న యశవర్గయుతయతు లొప్పుఁగృతుల
యరలవలయందు శషసహాక్షరములందు
వాదిబిందుయుతములై మయతియుఁగృష్ణ! 319

శ్రీధరుఁడు —

క. యశవర్గద్వయ యతికిఁగా
విశదముగఁ దదక్షరములు వెలయుఁగ వకులా
కుశలత లమరును సంపద
శశినొఁదలఁ దాల్చునతఁడు హరుఁడను మాక్కిఁగా. 320

ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వము గీతి ౧-వ పాదమునకు యశవర్గద్వయ యతి ప్రయోగము లక్ష్యము,

తే. [2]యతులతోఁగూడి యకులిత క్షమముకోడ
లలితమైపొల్చు నొకసరోవరమదెంత

---

316. [1]విభుఁడు. (అ. శ. వ్రాఁతప్రతి).

321. [2]ఈపద్యము నేఁటి ముద్రిత భారత ప్రతులందుఁ గానరాదు. దీని తీరు వరయునిది యొక లక్షణగ్రంథములోనిదిగాఁ దోఁచుచున్నది.

రమణఁజూపుట విశ్రమస్థలమునందు 321
... ... ... ... ... .... ...

శబ్దశాసనుఁడు నన్నయభట్టు చంపకము ౨-వ పాదమున యశవర్గద్వయ
యతి ప్రయోగము లక్ష్యము. [ఆది. 8-232]

చ. జలరుహనాభ రమ్యగిరి సానువనమ్ముల వేఁటలాడుచుఁగా
[1]సలుపుద మీ నిదాఘ సమయమ్ముల నీవును నేము నెమ్మదిఁగా
(నలినరజస్సుగంధియమునాహ్రదతుంగతరంగసంగతా
విలసితస్థలాంతర వినిర్మితనిర్మల హర్మ్యరేఖలఁగా.) 322

వ. అన్నారు. ఇటువలెనే తెలియవలెను. ఇవి యశవర్గద్వయయతి ప్రయోగ
లక్ష్యములు. ఇఁక నందు, 323

### (81) చక్కటి యతి లక్షణము

తే. మునుల కథయంబులిడు పూర్వ పురుషుఁడనఁగ
మోక్షమీఁజాలు నీచతుర్భుజుఁడనంగ
మూఁడు మూర్తులు నీవంద్రు బుధులనంగ
మొనయుఁ జక్కటి యతు లతి స్ఫురణఁగృష్ణ! 324

[*సులక్షణసారము. ప. 101]

క. చిక్కంబుగ వుభుబుధులకుఁ
జక్కటి వడి యయ్యె శృంగ వహితమకారం
బక్కమల జాది దివిజుల
మొక్కులు గైకొను సమస్త భువనాధీశా. 325

---

322. [1]జలంపుదమీ నిదాఘ దివసంబుల నీవును నేను నున్నివ — ఇది సం. శో. భా. పాఠము. ఇది సమయతి పాఠమగును. ఇందు అ. క. లోని యశవర్గద్వయయతి పాఠము కానరాదు. (చూ. ౬౪౮).

325. “అనంతనగారు” అని అ. క. వ్రాఁతప్రతి పాఠము.

వసంతవిలాసము - కందము ४-వ పాదమున చక్కటియతి ప్రయోగము లక్ష్యము.

క. అత్తఱి విటనాగరికుల
చిత్తముల వసంతకేళి చిగురొత్తంగా
మొత్తముగఁ గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుఱ్ఱట కొమ్ముల్. 326

వ. ఇవి చక్కటియతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నంను 327

(32) ఎక్కటి యతి లక్షణము

తే. మహిత మాయాచరిత్రుఁ డీ మాధవుండు
రక్కసులఁద్రుంచు యాదవరాజనంగ
లవణజలనిధి లోనుండు లంకనంగ
వఱలఁజన విట్టు లెక్కటివదుడు కృష్ణ! 328

అనంతనగారు. [ఛందోదర్పణము. 1-118]

క. ధరనెక్కటి వర్ణై తగు
శరమఱవలు వావిలోఁ [1](జెలంగుమ) లాకుఁ
సరి కాయన విశ్రమషే
శ రమాధిప రెండునుం గలపి వర్తించుఁ. 329

సోమయాజి అనుశాసనికము మత్తేభము ౧-వ పాదమున మకారమున కున్ను ఈ మూఁడింటికిన్ని ఎక్కటియతి ప్రయోగము లక్ష్యము. [1-44]

మ. మనువంశంబునఁబుట్టి సర్వజనతా మందారమైనేల యె
ల్లను బాలించి జగత్త్రియాప్రణుత లీలంబొల్చె దుర్యోధనుం
డను రాజద్విపుఁడోపు నర్మదకుఁగామావేశముఁ జేసినఁ
వనితారూపముదాల్చి వచ్చెనతనిఁ వద్వర్థ మూహింపఁగఁ. 330

329. [1] దళంగక. (అ. కి. ప్రాఁత ప్రతి).

మఱియు మకారమునకుఁ బరతత్త్వరసాయనము చంపకము ౧-వ పాదమున ౨-వ చరణమున ౪-వ యడుగునను ఈ మూఁడింట్రములను మకార యెక్కటియతి ప్రయోగ లక్ష్యము.

చ. *మృదుసలి గద్దియక్షరము మ్రుఃక్షము వేల్పులలావు మేనిలో
మొదలి వెలుంగునెత్తి తుదమోవఁగుఁజేయుటచెర్పు జంత్ర మ
భ్యుదిత తమాసరోజముఁలనూవిన గాడ్పులయాటపట్టు నం
మఃదమలరారఁగా ప్రణవమంత్రము మాకుఁ బ్రసన్నమయ్యెడుఁగా. 331

భీమనగారు కవిజనాశ్రయమను ఛందంబున కందము ౪-వ చరణమున రేఫకు ఎక్కటియతి ప్రయోగ లక్ష్యము. [సంజ్ఞ. ప. 5]

క. కడుఁ గవితా మహిమకుఁ దివి
[1]రెడుకవి కిచ్చదువు తెలుఁగెఱింగినఁగాకె
క్కడమండి వచ్చు బెడఁగడ
రెడు కబ్బము చెప్ప నురు పరిజ్ఞానమిలఁగా. 332

వ. అన్నాఁడు. ఇవి యెక్కటియతి లక్షణ ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 333

## (౩౫) పోలిక యతి లక్షణము

తే. పోలు దేవర లీదైవమునకు సరియె
పోలు పురములు వైకుంఠమునకు సమమె
భువిని మఱి విద్యలు కవిత్వమునకు సరియె
యనెడి పోలిక పోలికయతులు కృష్ణ! 334

---

331. *ఈ పద్యము నేఁటి ముద్రిత పరతత్త్వరసాయనమునఁ గానరాదు. (1941 Madras University Publication).

332. [1]ఇందు 'ర - ఱ' యతిమైత్రి కానవచ్చుచున్నది. పాఠాంతరము మృగ్యము.

[*భీమన కవిజనాశ్రయము. సంజ్ఞ. ప. 73]

క. పోలుఁగ పుష్పబుధులకు మా
పోలికవడి శీలముల్లమున మోతురవఁగ
శీలమ్మమలమ్మవఁగా
భూలోకంబమర లోకమున(కు) నమమనఁగ. 335

శబ్దశాసనుఁడు ఆదిపర్వము కందము ౪-వ పాదమున పోలికయతి ప్రయోగము లక్ష్యము. [2-36]

క. దారుణ కల్పాంత మరు
త్ప్రేరిత ¹హవ్యవహశిఖల పెల్లిదియని బృం
దారక ముని బృందస్తుతి
ఘోరవఁగా వగ్నిసూక్తములతో నెగపెఁగ. 336

మఱియు నందే కందము ౨-వ పాదమున పోలికయతి ప్రయోగము లక్ష్యము. [ఆది. 5-56]

క. ఎట్టి విశిష్టకులంబునఁ
బుట్టిన సదసద్వివేకములు గలిగియు మునఁ
గట్టిన కర్మఫలమ్ములు
నెట్టన చొప్పడకయుండ నేర్తురె మనుజుల్. 337

మఱియు నందే కందము ౪-వ పాదమున పోలికయతి ప్రయోగము లక్ష్యము. [శాంతిపర్వము. 4-3]

క. రాజోచిత ధర్మంబుల
¹యోజవిశదత భంగిఁజెప్పి తుజ్జ్వల విలస

---

335. *"అనంతన గారు" అని అ. శి. ప్రాఁత ప్రతి.

336. ¹హవ్యవహ శిఖాకలాప మిదియో యని బృం. — అని అ. శి. ప్రాఁత ప్రతి. ఈ పాఠమును గ్రహించిన గణాధిక్యమగును.

338. ¹యోజనుదగు విశదభంగినుజ్జ్వల. (అ. శి. ప్రాఁత ప్రతి).

త్తేజోధన నాకు సకల
భూజన వరమహిత ధర్మములు చెప్పు గృపణా. 338

[*కావ్యాలంకార చూడామణి] గీతి ౪ పాదములను పోలికయతి ప్రయోగము లక్ష్యము. [7-46]

తే. పుడమి విశ్వవిభుని భుజమునకుఁ దొడవు
ఫుల్ల పద్మాలయ వితీర్ణమునకు బోటి
బుధులు విద్యావివేచనమునకు సాక్షి
భువనములు కీర్తికి నివాసములు దలంప. 339

వ. ఇవి పోలికయతి ప్రయోగము లక్ష్యములు. ఇఁక నందు, 340

(34) రివడి లక్షణము

తే. ఋత్వమును వ్రుల్ వడిరీకివిడిన
కృతమహాకవి మతముల రివడి యదియు
... ... ... ... వలయేలు ఋత్వమునకు } (?)
విడివడి ఋత్వ(యతి) యనవిదియె కృష్ణ! } 341

వ. మఱియును, 342

తే. ... ... వ్రుడవ లొండొంటి రీకి విరతి
కృతుల విడఁజెల్లుఁ గవివ(రుల్) రివడి యనఁగ
మృతుల ధారాళియు మురారియే యనంగ (?)
ఋక్షనాథార్క నేత్రుఁడీ కృష్ణుఁడనఁగ. 343

అనంతనగారు [ఛందోదర్పణము. 1-87]

క. [1]వెలయంగ ఋకారము వ
ర్ణిలు రీవిరమణము శౌరి ఋషులకు శశ్వ

---

339. *ఆంధ్రభాషాభూషణమని. అ. శి. వ్రాఁతప్రతి.

344. 1విలసుద్రికారమును వ, ర్ణిల రీవిరమంబు (ఛం. ద.)

త్పలభుండనఁగ ఇ, ఈ లకు
దలపఁగ రీతోడి విరతి [2]దలకొనదెందుఁ. 344

*వరాహపురాణము గీతిపాదమున [1]వస్తువకు రివడి ప్రయోగము లక్ష్యము.

గీ. పృథివి యిట్లను యజ్ఞమూర్తి స్తుతి ప్ర
కారమానతియిమ్ము భూదారవర్య
వినఁగవలెనన్న దేవుండు ఘనఘనా ఘ
నార్భటీ విస్ఫురోక్తి నిట్లని వచించె. 345

అథర్వణాచార్యులు శార్దూలము ౨-వ పాదమున రివడి ప్రయోగము లక్ష్యము.

శా. తృష్ణాతంతు నిబద్ధబుద్ధులగు [1]రాధేయాదులన్మించి శ్రీ
కృష్ణుంగేవల మర్త్యుఁగాఁ దలఁచి మర్దింపంగ నుత్సాహ వ
ర్తిష్ణుండయ్యె [2]శివత్తనూజుఁడటు ధాత్రీనాథ యూహింపుమా
యుష్ణీషంబునఁగట్ట వచ్చునె మదవ్యాఘోగ్ర శుండాలముఁ. 346

[*మనుచరిత్రము సీస.] ४-వ పాదమున ఋకారమునకు రివడి ప్రయోగము లక్ష్యము. [2-36]

సీ. (వదనప్రభూత ... ... ...)

---

[2]తలఁకొను నెందున్. (అ. శి. వ్రాఁత ప్రతి).

345. *ఈ పద్యము ముద్రిత వరాహపురాణమునఁ గానరాదు. అ. శి. వ్రాఁత ప్రతియం దపపాఠములతో నసమగ్రముగనున్నది. తిరుపతి ప్రా. వ. సంస్థలో మానుమచ్ఛందస్సునను సాధుపాఠ ముపలబ్ధము.

[1]వస్తువునకు (అ. శి. వ్రాఁత ప్రతి).

346. [1]రాధేయాదులవ్వచ్చి (స. ల. సా. సం. 2-224) రాధేయాదులున్ గూడి (రం. ఛం. 3-294).

[2]సుయోధనుండకట. (స. ల. సా. సం; రం. ఛం.)

347. *వారాహపురాణము. (అ. శి. వ్రాఁత ప్రతి)

ప్రతిఘటించు చిగుళ్లపై నెఱ్ఱఁదారిన
రీతి మన్నవి వీవి మృదుపదములు. 347

ఉభయకవి లక్కాభట్లు శతపత్రసంవాదము శార్దూలము ౩-వ పాదమున రివడి ప్రయోగము లక్ష్యము.

శా. నీవీబంధము వీడు మోవియదరున్ నేత్రంబు లల్లాడు చన్
ద్రేవల్ గానఁగవచ్చుఁ గ్రొమ్ముడి విరుల్ పృథ్వీస్థలిన్ జెందు స
ద్భావాగారము కోను చెమ్మగొనుఁ జిత్తంబుత్తలంబొందు నా
నావిభ్రాంతులు పుట్టు వింతురకుఁ జెంతన్వింత వారుండినన్. 348

వ. ఇవి రివడి లక్షణ ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 349

(35) సవర్ణప్రాసయతి లక్షణము

తే. చనఁగ వర్గాది వర్గ పంచకములందు
దొరపి వర్గ ద్వితీయ చతుర్థవర్ణ
విరతి నిర్బిందులెన్న సబిందులైన
ప్రాస మొనరింపఁ గృతుల భూభరణకృష్ణ! 350

వ. మఱియును, 351

తే. కవులు వర్గవులైదగు కచటతపలఁ
గూడియున్నట్టి తద్వర్గ ఘోష వర్ణ
యమళములు సవర్ణప్రాసయతికిఁ గృతుల
విదుదు రొక్కొక్కచోట(ను వెలమిఁ) గృష్ణ! 352

వ. మఱియును, 353

తే. రఘుకులోద్రుదుంచె నాదశముఖుని నాఁగ
([1]స్వచ్ఛ) దైత్యారి పది లూవి (య)జ్ఝరియన
దృఢ మనోభీష్టములు భవత్ప్రతన చేత
సఫలమగు ([2]నందలు)కు యనుప్రభవ కృష్ణ! 354

---

354. [1]స్వచ్ఛ దైత్యారి. (అ. శి. వ్రాఁతప్రతి).
[2]సెనదలు. (అ. శి. వ్రాఁతప్రతి).

తే. ఘోషవర్ణ ద్వితీయాప్తి కొమరు మిగుల
ప్రాసవడి గూర్ప రిపుజనప్రాణ హరణ
వైఖరిఁ జెలంగు వితవి యమోఘ బాణ
సాధు వనఁగ నీతఁడు ప్రజానాథుఁ డనఁగ. 355

ఇందుకు సోమయాజి ప్రయోగము విరాటపర్వము మత్తేభము ౩-వ పాదమున తవర్గ ద్వితీయ చతుర్థ వర్ణములగు థకార ధకారములకు సవర్ణ ప్రాసయతి లక్ష్యము. [3-155]

మ. రథముల్ మంచివిగాఁగ నాయి గతిశ్రీప్రవ్యాప్తి సత్త్వంబులున్
ప్రథితంబైన తురంగమోత్కరము సంగ్రామార్హ చాపంబుల
[1]శ్లథవర్మంబులు వీరికిమ్ము రణలీలాదక్షత న్మన్మనో
రథముల్ దీర్పఁగ [2]వీరలోపుమరు దోర్గర్వంబఖర్వంబుగన్. 356

మఱియు నందే కందము ౩-వ పాదమున థ - ధ లకు సవర్ణ[ప్రాస] ప్రయోగము లక్ష్యము. [4-148]

క. *పృథయను పేరు మనంబునఁ
బ్రథితంబై యునికిఁజేసి పార్థుఁడనైతిన్
వ్యథ యనఁ బలుకుదునే యవి
తథ వచనంబైన ధర్మతనయు ననుజుఁడన్. 357

*ముద్దురాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవనియందు. [1-5]

తే. ప్రాసమొనరింప బిందు పూర్వకముగాఁగఁ
గలుగఁజెల్లు ధకార థకారములకు

---

356. [1]'శ్లథ' పాఠము థ - ధ ప్రాసకు లక్ష్యము కాఁజాలదు. పొత్తపికవి దీనిని 'శ్లధ' గా గ్రహించుట ప్రమాదము.
[2]వీరలొప్పుదురు. (అ. శి. వ్రాఁతప్రతి).

357. * ఈ పద్యమునందలిది థకార సమప్రాసమగునే కాని థ - ధ ప్రాసము కాదు.

358. *'ముద్దరాజు' అనుటకు 'ముద్దురాజు' అనునది యొప్పట్టున వ్రాఁత ప్రతి పాఠము.

సింధు మథన శిలోచ్చయ న్యంచునకు ధు
రంధర పదంబు మామక గ్రంథమనఁగ. 358

మఱియు (*ఎఱ్ఱాప్రెగ్గడ) ఉత్పలము ౩-వ పాదమున థకార సవర్ణప్రాస ప్రయోగము లక్ష్యము. [ఆరణ్య. 4-159]

ఉ. అంధక వృష్ణి భోజకుకురాన్వయ భూపతులెల్ల పీదెనఁగా
బాంధవ సౌహృదప్రణయ భవ్య విశేషములొప్పఁ మనో
గ్రంథి యథంగఁజేయ నెనకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయంబు మెయిఁగా మనకుర్వియిత్తురే. 359

వ. రామభద్రయ్యగారు బిందుపూర్వకము చెల్లినన్నారు. అయినను సబిందు విర్బిందువులకు సవర్ణప్రాస ప్రయోగములు చెల్లుటకు మహాకవి ప్రయోగ ములు లక్ష్యములు వ్రాసియున్నవి. ఇవి సవర్ణప్రాసయతి లక్షణ లక్ష్య ములు. ఇఁక నందు 360

(3౮) అలుక్సమాస యతి లక్షణము

తే. రహివి సప్తమికివి లుక్కురాక యొకట
మహివి సమపించిన నలుక్సమాసమయ్యె
పరవి యతిచెల్లు నయ్యలుక్సమాసమునకు
అచ్చుహల్లు(ల)కుమ గృతులందుఁ గృష్ణ! 361

ఇందుకు లక్ష్యము —

క. పాకారి వంద్యుఁడవి కం
శేకాల సహాయుఁడవి సురేశ్వరుఁ డవినఁగా
లోకులు వర్ణింతురు పా
ణౌకృత కమలుఁడవి (విమ) జనార్దన! కృష్ణా! 362

ఈ యలుక్సమాసయతి కుదాహరణ సూరపరాజు రాఘవపాండవీయము షష్ఠ్యంతములలో కందము ౪-వ పాదమున అలుక్సమాసయతి లక్ష్యము. [పీఠిక. 41]

---

359. *శబ్దశాసనుఁడని అ. శి. వ్రాఁతప్రతి.

క. లోకైక స్తుత్యునకు వి
[1]రా[2]కృతనతజన జను ర్జరామృత్యునకున్
త్రైకాల్య సత్యునకుఁ
[3]ణ్ణాకృతగిరిరాడపత్యునకు నిత్యునకున్. 363

వ. ఇందె ఋకారప్రాసమున్ను ఈ రెండవ పాదమున ప్రాదియతిన్ని. ఇఁక నందు, 364

## (37) ఘఞ్ యతి లక్షణము

క. తోఁచు 'లపివ్యక్తాయాం
వాచి' యనే ధాతువునను [1](వచ్చు) ఘఞంతం
బై చెలఁగిన యాలాపం
బౌచితి ఘఞ్ స్ఫూర్తి యతికి నంబుజనేత్రా! 365

ఇందుకు ప్రయోగము విష్ణుచిత్తీయము, ఉత్పలము ౩-వ పాదమున ఘఞ్ యతి లక్ష్యము. [ఆముక్తమాల్యద. 6-95]

ఉ. గోపురకందరాళికడకు న్శశిపుష్కరిణీ కణార్ద్రిత నం
తాపహరానిలంబులు [1]వితాన రణన్మణి కింకిణీ కలా
లాపముల న్పఱుంబడుగ నాఁటిఁబొచ్చి యకాండగాహనా
చాపల కృన్మరుద్గణముఁ జందుఁదదల్పెదులోని వాకిటన్. 366

మూర్తి వసుచరిత్ర ఘఞ్ యతి ప్రయోగము గీతి ౧-వ పాదమున లక్ష్యము.

తే. *అంచితంబైన కోకిలాలాపనంబు — అన్నాఁడు. 367

---

363. [1]ప్రాదియతి,
[2]ఋకారప్రాసము.
[3]అలంకృ్న్నమాసయతి.

365. [1]వచ్చు. (తా)

366. [1]పతాక. (వావిళ్ల ప్రతి)

367. *వసుచరిత్రలో నిది మృగ్యము.

వ. ఇవి షష్ యతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు 368

(38) నఞ్ యతి లక్షణము

క. నసమాస నఞ్ సమాసము
లనమంబున (న)చ్చు హల్లులన్వడిఁ జెల్లుఁ
లనదుదర సరోరుహామధు
రసజలకేళీధురంధర మరాళహయా! 396

ఇందు నఞ్ సమాసయతికి సూరపరాజు రాఘవపాండవీయము మహా స్రగ్ధరావృత్తము ౪-వ పాదమున లక్ష్యము. [2-13]

మహాస్రగ్ధర. తలపి ట్లుత్సాహమొందం దనయజనపరిత్రాణమర్థించియక్కం
దళితాపత్యానురక్తిఁ మహిపునమగతిం దానురాఁబూనకుండఁ,
వలనొప్ప [1]న్మార్చిస్వస్థానమునకుఁ జనియెఁ రామునాత్మేశుఁప్రేమా
త్యలఘుశ్రేయస్సుమిత్రానవరతనయయోగాఢ్యుఁ డొద్దొంచు
[2]వెంటఁ. 370

వ. అన్నారు. ఇది నఞ్ యతి లక్షణము. ఇఁక నందు 371

నసమాస యతి లక్షణము

విష్ణుచిత్తీయము, పురవర్ణనము, చంపకము ౪-వ పాదమున నసమాస యతి లక్ష్యము. [1-62]

చ. (మలఁచి పయోజ కోశములమాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపు బెట్టిదాల్పొమిదికంబులతో నపరంజియోదు బి
ల్లల వలపై జయంతముఁ జలంబునఁ గెల్వఁగ దంతితంబులై)
[1]నిలిచినయట్లమాడుగు లనేకములుండుఁ బురంబు లెన్నఁగఁ. 372

370. [1]మాన్చి. (వావిళ్ల రా. పాం. ప్రతి).
[2]జెద్కన్. (వావిళ్ల).

372. [1]నిలిచినయట్లు మాడువులనేకము లుల్లసిలున్ బురంబునన్. (వావిళ్ల

వ. అన్నాఁడు. ఇది ననమానయతి లక్షణము. ఈ యతులకున్ను మహాకవి
ప్రయోగ లక్షణ లక్ష్యములు వ్రాసియున్నవి. 373

తే. తెలిపినంతయు యతులన్ని తేర్చి యేర్చి
కూర్చి వ్రాసితినే నేర్చుకొలఁది నవియు
([1]సురుచిరంబుగఁ) గైకొని చూచి తీర్పు
వలయు నిది విన్నపము కవివర్యులార! 374

యతులు పుట్టుటకు *వార్తాకవి రఘురామయ్యగారు దీపికయందు —

శా॥ శ్రీదేవా స్వరసంధిభేదమొదవన్ రీ యెక్కటి న్పుట్టె కా
క్వాదేశ ప్రభునామముల్ ప్లుతము విశ్యాఖండ [1]భిన్నోభయ
ప్రాదుల్ వృద్ధి విభాగముల్ స్వరజముల్ మానుస్వరంబుల్ విక
ల్పాదుల్ సంయుతజాతి వర్గమహలాద్యా పోల్కి చక్కట్లనన్. (?) 375

వ. మంగళం మహత్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీం జేయుఁగా. శుభమస్తు.
ఇఁక నందు, 376

## ప్రాస లక్షణము

తే. *జరుగుఁ జరణాది విశ్రమస్థానమనఁగ
వరఁగు రెండవ వర్ణంబు ప్రాసమనఁగఁ
దనరు యతులన్ని పదములఁ గోమవ విలుప
వమరుఁ బ్రాసంబు నాల్గు పాదములఁ గృష్ణ! 377

వ. అట్టి ప్రాసంబు లెట్టివనిన, 378

---

874. [1]సురుతరంబుగ. (శా)

875. *ఈ పద్యము వార్తాకవి లక్షణదీపికయందు కానరాదు. అందుకు మాఱుగ వేఱొక సీసపద్యమున్నది (528) ఈ పద్యపాఠము సరిలేదు. సవరింప ననువుగాకున్నది.

[1]భిన్నోదయ. (ల. శి. వ్రాఁతప్రతి).

877. *ఈ యాశ్వాసాది 10-వ పద్యమే యిందించుక మార్పుతోఁ గూర్పఁబడినది.

క. ద్వాదశ విధములు షడ్విధ
భేదమ్ములు మఱియు రెండుఁ జెప్పఁగఁ దత్త
ద్భేదములు పూర్వ సత్కవి
వాదమ్ముల లక్ష్యములను వ్రాసెదఁ గృష్ణా! 379

అట్టి ప్రాసనామధేయమ్ములు
[*అనంతనగారు. ఛందోదర్పణము. 1-35]

క. సమనామ ప్రాసము ప్రా
సమైత్రి ఋత్రిలును త్రాదిసమలఘువు విక
ల్పము బిందువర్గ బింద్వా
భ్య ముభయ సంయుక్త సంధిగత సంజ్ఞకముల్. 380

వ. అనఁగలుగు ప్రాసంబులు ద్వాదశవిధంబులయ్యె నందు మొదలి, 381

(1) సమనామప్రాస లక్షణము

క. *అరసున్నలు నెఱసున్నలు
నొరసిన వర్ణములు జడ్డయును ప్రాసములై
బెరసినచో సమవర్ణము
లరసి తగవ్విలుపవలయు నంబుధిశయనా! 382

అనంతనగారు, [ఛందోదర్పణము. 1-37]

క. [1]పరువడిఁ బ్రాసములు సమా
క్షర సంశోభితములయినఁ, జాలును మఱి త
త్స్వర వైసాదృశ్యంబులు
పరిహరణీయంబులందుఁ బంకజనాభా! 383

---

380. *వార్తాకవి రఘునాథయ్యగారు అని అ. శి. వ్రాఁతప్రతి.

382. *ఈ పద్యమునకును ఛందోదర్పణమునందలి పద్యమునకును (1-36) ఇంచుక భేదము కలదు.

383. '[1]పరిహరణీయములుగావు' అను అ. శి. వ్రాఁతప్రతి పాఠము అర్థ వ్యతిక్రమము.

లక్ష్యము. [ఛందోదర్పణము. 1-31]

ఆ. కుటిల కుంతలములు విటలంబుపై వ్రాల
వోటలేక దేమవాటమునకు
నడ యశోదపట్టి గదలెఁ బొమ్మవినఁ బ్రా
పాద్రి తేటపడును మోదమెసఁగ. 384

♦♦మఱియు కంకంటి [1]పాపరాజు ఉత్తరరామాయణము సప్తమాశ్వాసములో లవణాసురవధ అయిన వెనుక వాల్మీకులు శత్రుఘ్నుని స్తోత్రము చేసిన తావున కకారామ్కా బిందుయతి ప్రయోగము. [7-169]

♦♦ఉ. ఇంకొక నాఁటికిన్ లవణుఁడీల్గనె లోకులబాధ దీఱునే,
శంక దొరంగి పీవి నవిఁ జంపెడి శూరుఁడు భూమిఁబుట్టునే,
యంకలి లేకయుండుదురె యంచుఁ దలంపుదు మాతలంపుపీ
వంక ఫలించె నేఁడు బుధవత్సల! నిన్ను నుతింప శక్యమే. 385

♦♦మఱియు [శంబు]కాఖ్యుని వధచేసిన తావున పకార లకారమునకు ఉత్పల ౪ పాదముల లక్ష్యము. [ఉత్తరరామాయణ. 7-218]

♦♦ఉ. విప్లవముల్ హరించి పృథివీభర మీవుభరింప శోక పా
రిప్లవతా వికారములు రీణములయ్యె భవత్కృపాణధా
రాప్లవపూతుఁడై వృషలుఁ డంగముతో దివికేఁగెడిన్ సురా
నుప్లవవృత్తి వాఁడదె కనుంగొనుమయ్య దశాననాంతకా. 386

♦♦మఱియు నందె ఖ - ఖ లక్ష్యము. [ఉత్తరరామాయణము. 7-216]

♦♦చ. శిఖకరుఁ జల్లనైన మదుశేఖరుఁ దుష్టగుణంబుఁ బొందినన్
[1]విఖల శరణ్య! మీరనెడు విశ్వయవాక్కుల బొంకుపెందునే

385. [1]పాపిరాజు (తా).

387. [1]నఖిల (అ. తి. ప్రాఁతప్రతి).

స్వఖరకరాసి శంబుకుఁ జంపినయప్పుడె ప్రాణవంతుఁడై
సుఖముననున్నవాఁడు ద్విజసూనుఁడు సూనుఁడుగాక [2]భూవరా! 387

వ. ఇది సమనామప్రాస లక్షణము. ఇఁక నందు 388

## (2) ప్రాసమైత్రిప్రాస లక్షణము

[అనంతుఁడు. ఛందోదర్పణము. 1-40]

తే. లళలు రెండును నొండొంటఁ గలసివచ్చు
[1]నమరు [ఋౄయుతాయుతము లన్యోన్యముగను]
బిందు పూర్వమై తమలోనఁ బొందు బమలు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు కృతుల. 389

ఈ పద్య(ము) క్రమంబుగా ల - ళ, బ - మ, [1]ఋ - ౄ యుతము లకు, గీతి మూఁడవ పాదమున లక్ష్యము [ఛందోదర్పణము. 1-41]

ఆ. [1]పీలవర్ణ గర్భగోళంబు నందు లో
కంబు లెల్లనుండు నెమ్మితోడ
శ్రీకి నొడయఁడుజ్జ్వలాకృతి యతఁడన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరఁగుఁ గృతుల. 390

మఱియును. [ఛందోదర్పణము. 1-42]

తే. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరఁగు వచ్చుపు జడ్డతోఁ బ్రాసమైత్రి

---

387. [2]కేడుకన్. (అ. శి. వ్రాఁతప్రతి).

389. [1]నమరు నన్యోన్యమును ఋ యు తా యుతములు (ముద్రిత. ఛం. ద.)
[2]నమరు నన్యోన్యముగను ఋ ౄ యుతములు. (అ. శి. వ్రాఁతప్రతి. ఇందు అక్షరలోపము, యతి భంగము).

390. ఈ పద్యమున 3వ. పాదమున ఋ యు తా యుత ప్రాసకు లక్ష్యమున్నది. గాని ఋ - ౄ యుతమునకు లేదు.

యక్కృపావిధి హరిఁగని మ్రొక్కి రవఁగ
సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁడవఁగ. 391

సోమయాజి (భీష్మపర్వము 2-246) కందము ౩-వ పాదమున ద - మ యీ రెండు వర్ణములకు ప్రాసమైత్రి ప్రాసప్రయోగము లక్ష్యము.

క. అమ్ముల వేమఁగు కొమ్ముల
నమ్మత్తగజంబు నొంప నతిముతి మన పై
వ్యాంబెల్ల జడియఁబఱచె భ
యమ్మున మొనవిఱిగె దిక్కులద్రువ నొరులచుఁ. 392

మఱియు ఋకారాన్వితప్రాసమునకు సోమయాజి ఉద్యోగపర్వము కందానను లక్ష్యము. [3-351]

క. ఈకృష్ణుని పారథ్యము
వాకృష్ణుని గాండివంబునై తోఁచక ము
[1]న్నీకొలఁదిం జక్కంబడి
యీకురువంశంబు గావు మిభపురనాథా! 393

మఱియు సావర్ణ్యప్రాసము

"ఋ ౡ వర్ణయో ర్మిథ స్సావర్ణ్యం వాచ్యమ్" అనే శబ్దసూత్రము చేతను ఋకారసంయుక్తప్రాసము వలెనే ౡకార సంయుక్తప్రాసము గలుగుటకు సూరపరాజు రాఘవపాండవీయము ప్రథమాశ్వాసము శార్దూలవృత్తము ౨-వ పాదమున లక్ష్యము. [పీఠిక. 3]

శా. లోకత్రాణరతిం దదాదిమ మహీలోకప్రవేశోత్క భా
షాక్లృప్త ప్రథమ ద్వితీయపదగుంజన్మంజు మంజీర గ
ర్జాకల్పామల రామ భారతకథా సర్గంబులన్ మించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థ సంసిద్ధికిన్. 394

393. [1]నీ కొలఁదిఁ జక్కఁబడి నీ, పితరు. (సంశో. ఛా.)

ఇఁక నందు (3) ఋప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-43]

క. అరయ స్వరగణమయ్యు ఋ
కారము ఋప్రాస మనఁగఁ గదియును రేఫన్
జేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁబిసికె నచ్యుతుఁ డనఁగన్. 395

మఱియును, [ఛందోదర్పణము. 1-44]

తే. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుటఁ బ్రాసంబయ్యె రేఫకిట్టు
లిదియె పరవర్ణయుతమయ్యెనేని ప్రాస
మైత్రియగుఁగాని రేఫసంబంధిగాదు. 396

శబ్దశాసనుఁడు అరణ్యపర్వము కందము ౧-వ పాదమునను ప్రయోగము లక్ష్యము. [3-104]

క. ఆ ఋషికుమారు కట్టిన
చీరలు మృదులములు నవ్యచిత్రములు మనో
హరములు నతని పృథుకటి
భారంబున నొక్క కనక పటముఁ బ్రాలన్. 397

లక్షణము

తే. తగు ఋకారాంత శబ్దముల్ ద్వంద్వమైన
యపుడు మీఁదటి ఋత్వంబు లణఁగి రేఫ
లగును దద్వర్ణమిత్రంబులగు మహేంద్ర
ధాత్ర శంకరమత పద్మనేత్ర కృష్ణ! 398

శబ్దశాసనుఁడు ఆదిపర్వము ఉత్పల ౪-వ పాదమున ద్వంద్వసమాసం బగుట ఋకారాంతము రేఫయగుటకు ప్రయోగము లక్ష్యము. [2-175]

ఉ. క్షత్రియ వంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రులనఁగాఁ దగు నాలుగు జాతులన్ సుచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుగాచినయట్లు రామ మాం
[1]ధాత్ర రఘుక్షితీశులు ముదంబువఁగాచిరె యే యుగంబునన్. 399

వ. ఇవి ఋకారప్రాస లక్షణ లక్ష్యప్రయోగములు. ఇఁక నందు, 400

## (4) త్రికారప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-45]

తే. సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాస సంజ్ఞ గలిగి
అత్రివిక్రముఁ దభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ. 401

మఱియును [ఛందోదర్పణము. 1-47]

తే. ఇ ఉ ఋ ఌ ల కచ్చు పరమయ్యేనేని సంధి
యవర లాదేశమగునట్టి యవరలకును
నదరి ఇ ఉ ఋ ఌ లాదేశమయ్యేనేని
అదిగ్రుతుల సంప్రసారణ మండ్రు బుధులు. 402

మఱియును [ఛందోదర్పణము. 1-48]

తే. ఈత్రికారంబునకుఁ దీయ యొసఁగఁ గ్రింద
రేఫ సంప్రసారణమున ఋత్వముగఁ దృ
[1]తీయ యగు నీ త్రికారశక్తికిని జూడ
నాత్రికారంబునకుఁ బ్రాసమైత్రి విచట. 403

---

399. [1]మాంధాతృ. (అ. శి. వ్రాఁతప్రతి.) ఇట లక్షణ ప్రకారము ఋత్వము రేఫ కాతలయును. కాన ' ధాతృ ' అను పాఠము సరికాదు.

403. [1]తీయయగు నీ త్రికారమరసిచూడ, నాతకారంబునకుఁ బ్రాసమయ్యె నచట. (ముద్రిత. ఛం. ద.)

ఱకారంతో, (6) ప్రాదిప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-48]

తే. ప్రాదియై యనశబ్దంబు ప్రాణమగుటఁ
బరఁగు ణన లకు వేర్వేఱఁ బ్రాసమగుట
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగుప్రాణమనఁగ
దానవారాతి ప్రేతలప్రాణ మనఁగ. 404

మఱియును [కాశీఖండము. 5-286]

క. ప్రాణాపాన వ్యానో
దానసమానములు దృప్తి దలకొనఁ జేయం
గాన్పోపెడునది యన్నమ
ప్రాణంబన వన్నమనఁగఁ బర్యాయంబుల్. 405

రామభద్రయగారు [కవిజనసంజీవని. 1-49]

క. చను బత్వ విధాయక సూ
త్రనిమిత్తాగత ణకారరాజి నకారం
బునకుఁ బ్రాసముగా విడఁ
బ్రణుతి యొనర్చెద మురారి పదముల కనఁగన్. 406

'ణ - న' లకు ప్రాసము *త్రికవుల షష్ఠము కందము ४-వ పాదమున లక్ష్యము.

క. అనుటయుఁ గృష్ణద్వైపా
యనతనయుం డిట్టులనియె నవహితమతియై
వినుమతి గుహ్యము నారా
యణ కవచము భక్తవాంఛితార్థప్రదమున్. 407

407. *శృంగార షష్ఠమునిండ్. ఐ. సం. (1-51), అప్ప. (8-338).

*మదనసేనము కందము ౨-వ పాదము ప్రాదిప్రాస ప్రయోగము లక్ష్యము.

క. పోనుద్యోగముఁ జేసిన
ప్రాణంబా యింక నీకుఁ బాశేయంబీ
మానిని మందస్మిత మధు
రానన చంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 408

వ. ఇవి ప్రాసలక్షణ ప్రయోగ లక్ష్యములు. 409

లఘువుల మీఁద అర్ధబిందుప్రాస ప్రయోగము. ద్రోణపర్వము మత్తేభము ౪-వ పాదమున లక్ష్యము. [5-114]

మ. కదకన్నెఱ్ఱవి చెల్వుదాల్చ నరుఁ డుగ్రస్ఫూర్తి విల్ద్రుంచి యొ
క్కఁడు కోపంబున సూతు మస్తకముతోఁ గూడన్ దురంగంబులన్
కడిఖండంబులుచేసి యారథికుపైఁ గాఁడంగఁ బెక్కమ్ములే
¹యుఁడు వల్లెపలిపాటి యెక్కెఁ గృపుతే రుర్వీశ నిర్లజ్జుఁడై. 410

మఱియు నందుకె వారాహము కందము ౪-వ పాదాన లక్ష్యము. [8-65]

క. నృగుఁడన్ ధాత్రీపతి మృగ
మృగయార్థము వాహినీ సమేతుండై పో

---

408. * ఈపద్యము 'మదనసేనము' నందలిదని అప్ప. (8-337). సు. ల. సా. సం. (2-64) పేర్కొన, లం. ఛం. లో, నిది 'పరాంతము అప్పన్న బృందావనసంభవము' లోనిదిగ ఉదాహృతము. (8-87).

410. ¹ఇందు నాలుగవ పాదము అర్ధ బిందు ప్రాసమునకు లక్ష్యముగ గొనఁగఁబడెను. అందలి "ఏయుఁడు" అను నానంతర్యార్థక 'డు' ప్రత్యయము సబిందుకముగ పొత్తపికవి భావించెఁగానోపును. ఆనంతర్యార్థక "డున్" ప్రత్యయము సబిందుకముగ ప్రాచీన వ్యాకర్తలు ప్రదర్శింపలేదు. కాని వైకృత చంద్రికలో దీని కాకరము లభించుచున్నది. (చూ. ౬౦౪)

యి గహన భాగంబునఁ జం
పె [1]గవయ శార్దూల సింహ భేరుండములఁగా. అన్నారు. 411

ఇఁక (6) వికల్పప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-50]

తే. సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయలగు వికల్పప్రాసమై యెలర్చు
బ్రాఙ్నగంబుపై రవి దోఁచె నగ్నివోలె
ప్రాఙ్ముఖుండయి వినుతించె వాఙ్మయనఁగ. 412

*క్షేమేంద్రుఁడు. కందము ౩-వ పాదమున వికల్పప్రాస లక్ష్యము.

క. పద్మాననమావయగు మన
పద్మావతిఁ జూచి ధరణిపాలసుతుండు
దృఙ్మోదంబునఁ దనముఖ
పద్మము వలరించె వనుచుఁ బరిజను లలరఁగా. 413

వ. ఇది వికల్పప్రాస లక్షణము. 414

ఇఁక వందుఁ (7) సమలఘుప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-49]

తే. ఒలిరేఫతోఁగూడియు నూఁదఁబడక
తేలి తెమఁగులఁ దమయట్టి వ్రాలతోన

---

411. [1]ఇందు నాలుగవ పాదమున, 'చంచెఁగవయ' అనుచోట అర్ధబిందు వుండుట కవకాశము లేదు. ఈ పాఠమే ముద్రిత వరాహపురాణము నందును గలదు. అట్లైని యీయది అర్థము కాఁజాలదు. దీనిని "చెంచెఁగవియు (= చంచెన్ + కవియు) అని సవరించుట అర్థ్యానుగుణము.

413. *దీనిని 'అనంతచ్ఛందము' లోనిదిగ రం. ఛం. (8-110) ఉదాహరించెను. కాని యది అనంతచ్ఛందమునఁ గనఁబడదు.

సమలఘుప్రాసమగు తెక్కలమరఁబట్టి
విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కులద్రువ ననఁగ.

(8) బిందుప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-51]

తే. పేర్చి పొల్లనకారంబు బిందు వగుచు
మీఁదనున్న ధకారంబునూఁది ప్రాస
బంధమగుఁ గృష్ణుఁడుదయించినంధరిత్రి
యంతయును నిరుపద్రవంబయ్యె ననఁగ. 416

ముద్దరాజు రామభద్రయ్యగారు [కవిజనసంజీవని. 1-32]

తే. అమరఁ గృతులందు నాంతపదములమీఁద
క చ ట త ప వర్గవర్ణముల్ గలయఁ బలుక
పిఱుఁదనున్న నకారంబు బిందువగుచు
కచటతప లెవ్వియైనను గ జ డ ద బ లు. 417

కచటతప వర్గువులకు మఱియు నందే లక్ష్యము. [కవిజనసంజీవని. 1-33]

తే. అంగజగురుండు కరుణఁగాచెంగజంబు
కంజదళలోచనుండుప్రోచుం జగంబు
అండజహయుండు దనుజశక్తిం డిగించు
ననఁ బ్రయోగింపఁదగుఁ గాశియాహిదమన. 418

మఱియును [కవిజనసంజీవని. 1-34]

తే. నందనందనుఁ డారగించెందవంబు
నంబుజాక్షుండు మదమడంచెం బలీంద్రు
తమ్మియిమ్మగు కొమ్మ డాల్పు [1]మ్మురారి
యనఁగ వర్తిల్లు నంబుదశ్యామ! రామ! 419

---

419. [1]ఇందలి లక్షణప్రకారము "డాల్చుంమురారి" అని పొల్లునకారమునకు బిందురూప ముండవలెను.

నాచనసోముఁడు చకారంబు జకారమైనందుకు కందము ౩వ. పాదాదులను బిందుప్రాసప్రయోగము లక్ష్యము. [ఉత్తర హరివంశము 1-75].

క. అంజెదవుగాక నమఁ జెం
తంజేరఁగనీక యెంత తడిపిన మిరియా
లంజొన్నల నరిపోవే
లంజెతనములందుఁ గొమరెలన్ గెలువ[1]వకే. 420

ఆంధ్రకవితాపితామహుఁడు ఆముక్తమాల్యద చకారము జకారమై ప్రాస న్నిలుచుటకు ఉత్పలము [4వ పాదాన] నకారము బిందువై నందుకు 3 పాదాల ప్రయోగము లక్ష్యము [2-28]

ఉ. అంజనమాన వాయుగణమంతయు ఉంజతఁ జిక్కె నజ్జవో
ష్మంజవియించు చిక్కని సమానపువాయువులో నొకండుగ
ల్మంజవియించు దుర్యశమ మేల్కని లేహనవేళ వాజ లా
ర్పంజెదుమాణిబంధముకురంబుల కాళిమపేరఁ గార్కొనన్. 421

మఱియు నకారము బిందువై నిలిచినందుకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము లయగ్రాహి ౧వ పాదమున రెండవప్రాసము ప్రయోగము లక్ష్యము. [5-138]

లయగ్రాహి. కమ్మని లతాంతములకు [1]మ్మొనసివచ్చు మధు
వమ్ముల సుగీతవినదమ్ము లెసఁగన్ జొ
త్తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి కుసు
మమ్ములను నానుచుముదమ్మొనర వాచా

---

420. గెలువ కోకో. (అ. శ. ప్రాఁతప్రతి.)

422. [1]ఇందు అక్షరప్రకారము 'అడిలి మొనసి' అని బిందురూప ముండదు తెలెను.

లమ్ములగు కోకిలకులమ్ములును భాసుర [1]ర
వంబుగను [2]వీచెననిళంబు సుమనో భా
రంబున నశోక నికరమ్ములును చంపక చ
యంబులును గింశుకవనమ్ములును నొప్పెఁ. 422

వ. ఇదియే బమలకు ప్రాసమైత్రిప్రాస లక్ష్యము. ఇవి బిందుప్రాస ప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 423

## (9) అర్ధబిందు ప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-52]

తే. సార్ధబిందువై తేలినయట్టి పటల
కరయఁ బ్రాసంబు నిర్బిందువైనఁ జెలు
వీఁపు మూఁపులు మఱి తలమోపులయ్యె
మాట లేఁటికి ధాత్రి తామేఁటి కనఁగ. 424

మఱియును [కవిజనసంజీవని. 1-9]

తే. అర్ధబిందువు నిర్బిందువగు పదముల
ప్రాసములు దీర్ఘములమీఁదఁ బలుకఁజెల్లు
మూఁడు మూర్తులు నేకమై కూడె ననఁగ
కోఁకు మూఁకల నణఁచె నిక్ష్వాకుఁడనఁగ. 425

మఱియుఁ గుఱుచలమీఁద సున్నలకు, [ఛందోదర్పణము. 1-34]

ఆ. కుఱుచమీఁది సున్న మఱి తేలవాయఁ బ్రా
సద్వయాప్తి విట్లు జరుగు నయ్య

---

422. [1]రవంబు – అనిళంబు – భారంబు – చయంబు అను శబ్దములందు ద్విత్వ మకార రూపముతో – రవమ్ము ఇత్యాదిగా – ముద్రిత భారత ప్రతులం దెల్లఁ జూపట్టుచున్నవి. అట్టిచో 'బ – మ' ప్రాస ప్రసక్తి యనవసరము.

[2]వివెచ్చె. (సంశో. భా.)

తుఁడు సమస్త వల్లభుఁడు నాఁగ వయ్యచ్యు
తుండు సకలవల్లభుం డనంగ. 426

మఱియును [ఛందోదర్పణము. 1-39]

తే. అయుపేంద్రుని బొడఁగాంచుటే యుపాయ
మనెడి దీర్ఘాదు లచట [1]హ్రస్వాదు లయిన
అయ్యుపేంద్రుని బొడఁగాంచు టెయ్యుపాయ
మన సమప్రాసమగు మూఁదఁజనదు రహల. 427

అరసున్నలు, నెఱసున్నలు, ఐద్దలు, అర్ధబిందు విర్పిందులకు గీతి v గు
చరణములను ప్రయోగము లక్ష్యము, అనంతనగారు. [ఛందోదర్ప
ణము. 1-38]

ఆ. వీఁ డుపేంద్రుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండయెత్తె వితఁ డితండు ద్రవ్వె
నడ్డగెడపు పడఁగ దొడ్డరా జేలెడి
వీఁడనంగఁ బ్రాస మీఁడు వచ్చు. 428

శబ్దశాసనుండు ఆదిపర్వము కందము ౨-వ పాదమున అర్ధబిందు విర్పిందు
వులకు ప్రయోగము లక్ష్యము. [2-44]

క. ఆ పన్నగముఖ్యులఁ దన
వీఁపునఁబెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకల ది
శాపతిపురములును జూపెఁ జవి వారలకుఁజా. 429

మఱియు నందే కందము ४-వ పాదమున అర్ధబిందు విర్పిందువులకు
ప్రయోగము లక్ష్యము. [ఆది. 8-209]

క. [1]వీఁకఁ బఱతెంచి వలుగడఁ
దాఁకినఁ గడు వలిగి ఘోరతరశరహతి న

427. [1]ప్రాసాదులైన. (అ. శి, వ్రాఁతప్రతి).

430. [1]వీంకఁ బఱతెంచి ... ... దాంకిన, (అ. శి, వ్రాఁతప్రతి).

[1]మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ
డాక్రమముగ నేసె నుగ్రుఁడై రణభూమిన్. 430

వ. ఇవి అర్ధబిందు విర్బిందు ప్రాసప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక 431
నందు,

## (10) ఉభయప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-53]

క. చూడఁగ లకార రేఫలఁ
గూడియు వేర్వేఱఁదా నకుంఠిత గతితోఁ
దోడన యుభయప్రాసము
[1]జాడఁబడును సంయుత ప్రసంగతిఁ గృష్ణా! 432

లక్ష్యము. [ఛందోదర్పణము. 1-54]

ఆ. పాఁడి మరగి బ్రతుకువాం డ్రిల ప్రేతలా
వాం డ్రవెన్నరేల తండ్రి [1]నీకు
పిండ్ర కొలఁకు నొరుల యిండ్లకుఁబోకు కృ
ష్ణుండ నీకు బ్రాఁతె పండ్లు లిచట. 433

మఱియు నొక ప్రకారము, [ఛందోదర్పణము. 1-55]

తే. రలయు లాయుత ప్రాసమార్గము దలంప
వాండ్ల రేఁజూపుమోములఁ దీండ్ర లమరె

---

430. [1]'మూఁకలు' అని 3-పాదమున నిర్బిందుకముగా ఆ. శి. వ్రాఁతప్రతిలో నున్నది. దీనికిచ్చిన నిర్దేశ వచనములో 4-పాదమున నిర్బిందువని సూచితము. కాన 'మూఁక'లో అరసున్న యుండవలెను.

432. [1]'జాడఁబడును' అనునది ఆ. శి. వ్రాఁతప్రతి. ఈ పాఠమును గ్రహించిన యతిభంగ మగును.

433. [1]యనఁటి, పండు కొలఁకు వింతయిండ్లకు. (ఛం. ద.)

నను చు రెండును గూర్చిన నమవు దప్పు
నంద్రు నిఖిలార్థ విదులైన దండికవులు. 484

వ. ఇది ఉభయప్రాస లక్షణము. ఇఁక నందు, 485

## (11) సంయుక్తప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-56]

ఆ. పాదునూరుఁ బ్రోలు బహువచనమ్ములై
([1]పరఁగు)చుండ మూఁదఁబలికినపుడ
తేలఁ బలికినపుడు దీపించు సంయుత
ప్రాస మిరు దెఱఁగులఁ బద్మనాభ! 486

లక్ష్యము [ఛందోదర్పణము. 1-57]

ఆ. పాళ్లు మనుజులెక్క మూళ్లుగాఁ [1]దొంఁగిన
మూళ్లు మిగుల బలపి ప్రోళ్లుగాఁగ
[2]భాగ్యవంతులేలు పాళులు నూళులు
ప్రోళులయ్యె గ్రాఁతె కూళులిచట. 487

మఱియు [ఛందోదర్పణము. 1-58]

ఆ. [1]తెమఁగువందులేదు మును క్రిందసుడి, గ్రుచ్చెఁ
గ్రుమ్మెననఁగఁ [2]గ్రారకొమ్ము గాని
ప్రాసమైత్రి చౌరదు, దావంయుతప్రాస
మగుమ రేఫయుతము వమసరించి. 488

---

486. [1]పలుకు (ఆ. తా. వ్రాఁతప్రతి).

487. [1]దొంఁగిన. (ఛం. ద.)

[2]భాగ్యవంతుఁ డేలు. (ఛం. ద.)

488. [1]తెలుఁగువందు లేదు అవి. (ఛం. ద.)

[2]రేఫ కొమ్ముగాని (ఛం. ద.)

లక్ష్యము [ఛందోదర్పణము. 1-59]

క. ఈ క్రిందటి రేఫలు సమ
మై క్రాలుచుఁ దేలిప్రాసమగు సంయుక్తం
[1]బా క్రూర వక్రభయమున
వా క్రువ్వదె గజము భక్తవత్సలు ననఁగన్. 439

వ. ఇది సంయుక్తప్రాస లక్షణము. ఇఁక నందు, 440

## (12) సంధిగతప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-60, 61]

క. ధ్రువముగ సంధి జనిత రూ
పవిశేషప్రాసమగుచుఁ బరఁగు పకారం
బవిరళ వకారమగు, వ
య్యవదాఅవ పాలెఱుంగ ననఁగ ముకుందా! 441

వ. అది యెట్లంటేని, 442

[ఛందోదర్పణము. 1-62]

క. ప్రథమాంత విభక్తులపైఁ
గథితములగు కచటతపలు గసడదవలగున్
పృథివి నవి గ జ డ ద బ లగుఁ
బ్రథమపు సున్న లగు నాంతపదముల మీఁదన్. 443

లక్ష్యము [ఛందోదర్పణము. 1-63]

తే. వాఁడు గమవాఁడు పేకొనువాఁడు డెక్కు-
లాడువాఁడు [1]దపోనిధి వాఁడు పెద్ద

---

439. [1] శైత్రార సక్రభయమున, వాక్రువ్వఁడె గజము భక్తవత్సలుఁడనఁగన్. (అ. శి. వ్రాఁతప్రతి).

444. [1] వాఁడు + తపోనిధి = వాఁడు దపోనిధి - ఇందు సంధియందుఁ దెలుఁగు మీఁది సాంస్కృతిక తకారమునకు దకారాదేశము.

చిక్కెఁ గరిమ్రొక్కెఁ జెలివాక్కుఁ దక్కువెట్టె
శౌరిఁ దలఁచె ²వినఁ బిలిచె నానందు లిట్లు. 444

వ. ఇది సంధిగతప్రాస లక్షణము. ఇవి ద్వాదశవిధప్రాసలక్షణ ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు శబ్దాలంకారములంగల షడ్విధప్రాసవిశేషము లెట్టివనిన, 445

[శబ్దాలంకార ప్రాసములు]

[ఛందోదర్పణము. 1-70]

క. అమరఁగ దుష్కరమును ద్వం
ద్వము త్రి¹చతుష్ప్రాసములును దగనంత్యప్రా
సమును నను ప్రాసము ననఁ
గ్రమమున షడ్విధములయ్యెఁ గంసారాతీ! 446

ఈషడ్విధములందు మొదటి (1) దుష్కరప్రాస లక్షణము
[ఛందోదర్పణము. 1-71]

క. దోఃకీలిత మణికటక, యు
రఃకేళి రమాభిరామ, రంజితసుజనాం
తఃకరణ, ఖండితారి శి
రఃకందుక యనిన దుష్కరప్రాస మగున్. 447

మఱియును [కవిజనాశ్రయము. సంజ్ఞ. 80]

క. స్వఃకాంతాసమయోషిదు
రఃకృతరతి చిహ్నదుష్కర ప్రాసంబా
విఃకృతముగ నిట్లు సుపు
త్రః కులదీపక యనంగఁదగును మహాత్మా! 448

---

444. ²వినంబిలిచె - అని ఛం. ద. పాఠాంతరము.

446. ¹చతుఃప్రాస. (అ. శి. వ్రాఁతప్రతి).

అందు (2) ద్వంద్వప్రాస లక్షణము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. ౯2]

క. దోసంబులేక వస్తు వి
వాసంబై వెలయఁ జెప్పవలయును ద్వంద్వ
ప్రాసంబు చిత్తాక్షర వి
న్యాసంబుగఁ గృతుల దేవ! నయతత్త్వనిధీ! 449

[ఛందోదర్పణము. 1-72]

క. కంజనయన భవభీతి వి
భంజన శుకశౌనకాది బహుముని చేతో
రంజన ద్వంద్వప్రాస మ
వంజము విప్పాటఁ బల్కనం గృతులందున్. 450

అందు (3) త్రిప్రాస లక్షణము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 84]

క. దానమున సత్యమున నభి
మానమునం బోల్ప నీనమానులు ధరణిం
గాన మనం ద్రిప్రాసము
దానమనోహరమగును బుధస్తుతచరితా! 451

మఱియును [ఛందోదర్పణము. 1-73]

క. శ్రీ నవనీత ప్రియుఁడన
దానవ నిర్మూలనైక తత్పరుఁడన స
న్మౌని వినుతుఁడన త్రితసుర
ధేను వనఁగఁ గృతులయందుఁ ద్రిప్రాసమగున్. 452

అందు (4) [1]చతుష్ప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-73]

క. వారణ వరద విశాల వి
దారణ వీరావతార ధరణీ వలయో
ద్ధారణ విరచిత సత్యవ
ధూరణవరవిజయ యనఁ జతుష్ప్రాసమగుఁ. 453

అందు (5) అంత్యప్రాస లక్షణము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 38]

క. జనమత ధీమతనూజా!
సునయార్జిత విభవ! దేవ! సుభగమనోజా!
వినుత విశిష్టసమాజా!
యన నంత్యప్రాస మి ట్లుదంచత్కీర్తీ! 454

అందు (6) అనుప్రాసము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 86]

క. చిత్రస్తోత్ర పవిత్ర చ
రిత్రజిత త్రిదశ వరధరిత్రీమిత స
న్మిత్రాంబుజ మిత్రాలయ
మాత్రయనుప్రాస మదియ మల్లియరేచా! 455

వ. ఇవి షడ్విధప్రాస లక్షణ లక్ష్యములు. మఱియు నేక సుకర ప్రాసంబును
అర్ధబిందు ప్రాసంబన నిరువిధమ్ము లందు, 456

సుకర ప్రాసము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 78]

క. పరమోపకార ధరణీ
సురవర సురభూజ సుగుణసుందర తరుణీ

453. [1]చతుఃప్రాస (అ. ఓ. ప్రాఁతప్రతి).

[1]స్మరవిధ సుకరప్రాసం
బరుదుగఁ గృతులందుఁజెందు నళినుతచరితా! 457

అందు

### అర్ధబిందుప్రాసము

క. [1]కొల్ఁకుచునుండిన తామర
కొల్ఁకులకడ కరిగి హంసకులమెల్లను వా
కొల్ఁకుల నాడుచునున్నను
దల్ఁకక యను నర్ధబిందు తగుప్రాసమగుఁజా. 458

వ. మఱియు నందు విశేషమ్ములగు లాటానుప్రాస, ఛేకానుప్రాస, వృత్త్యను
ప్రాస, సమపదప్రాసమ్ము లనందగు చతుర్విధమ్ములయందు, 459

### లాటానుప్రాస లక్షణము

[కావ్యాలంకారచూడామణి. 6_17]

క. పాటిగఁ జెప్పిన శబ్దము
వాటుగతిఁజా సొరిదిఁబద్కూ చక్కఁద మర్థా
ఘాటోత్కర్షము చేసిన
లాటానుప్రాస మనఁగ లలితంబయ్యేఁజా. 460

లక్ష్యము, కావ్యాలంకారచూడామణి, *విన్నకోట పెద్దిరాజు. [6_18]

చ. ధరణిఁ జతుర్థ్య విశ్వవిభుదానము దానము, కీర్తి కీర్తి, భీ
కరమగు వాలువాలు, రణగర్వము గర్వము, గాక; కల్పితే
తరనృపనామధారకుల దానము దానమె, కీర్తి కీర్తియే,
కరమున వాలువాలె, రణగర్వము గర్వమె పౌరుషక్రియఁజా. అన్నారు. 461

---

457. [1]మరు. (అ. శ. ప్రాఁత ప్రతి).

458. [1]అర్ధబిందు ప్రాసమున అర్ధబిందువు ప్రాసాక్షరమునకుఁ బూర్వ ముండ వలయును. ఇట పరమునను న్నది.

461. *విన్నకోట పెద్దిరాజు (అ. శ. ప్రాఁతప్రతి).

ఇఁక నందు ఛేకానుప్రాస లక్షణము

నరసభూపాలీయము, మూర్తి. [4-70]

తే. అం దనుప్రాస భేదంబులైన శబ్ద
భవదలంకారముల మున్ను ప్రస్తుతింతు;
నదర నెడలేక రెండు రెండక్షరంబు
లెనయు నియమంబు ఛేకమౌ నెట్లటన్న. 462

[నరసభూపాలీయము. 4-75]

పంచచామరము. స్ఫురత్కృపా బలప్రతాప భూతిధైర్య భూధరా
ర్చి రంగదాన బుద్ధివైభరి న్హరిన్హరిస్ఫుధా
హరున్హరు న్గిరిన్గిరి న్మహానలు న్నలప్రమా
గురున్గురు న్జయింతువౌఁ; దగు న్నృసింహ భూవరా. 463

అందు వృత్త్యనుప్రాస

[నరసభూపాలీయము. 4-76, 77]

తే. ఒక్క వర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ
బరఁగు జృంభణ వృత్త్యను ప్రాసమయ్యెఁ;
దలఁపఁ బునరుక్తియయ్యుఁ దాత్పర్యభేద
మెనయు నియమంబు *లాటమౌ; నెట్లఁటన్న. 464

చ. సమద విపక్ష శిక్షణ విచక్షణ దక్షిణదోరనక్షణ
క్షమదపిదుర్నిరీక్ష సమరక్షపితక్షితపక్షతక్షర
త్పమధిక శోణితక్షర కృతక్షణరక్షిత పక్షిలోక వి
గమలదళాక్షుఁడేలు బలగౌరవసింహ! నృసింహభూవరా! 465

వ. అన్నారు. మఱియు సమపదప్రాసంబును యమకంబును పాదాంతపాదాది ముక్తపదగ్రస్తమ్ము లనఁదగు నివి ప్రాసభేదమ్ముల ప్రకారమ్ములు. మఱియు నిఁక తప్పిన పద్ధతి. అందు, 466

454. *ఈ క్రింది 465 పద్యము వృత్త్యనుప్రాసకు లక్ష్యము. లాటానుప్రాసమునకు లక్ష్యము ఇందు కానరాదు. గ్రంథపాతమేమో!

## వర్గప్రాస లక్షణము

తే. వర్గములు ప్రాసములఁ గూర్పవచ్చునంద్రు
స్నిగ్ధరూపాక్షరములఁ బ్రసిద్ధకృతుల
బుధులు గొలుతురు కాంచన రథవివాహ
నాదితేయులు పద్మిపి నాథులనఁగ. 467

లక్ష్యము శబ్దశాసనుఁడు ఆదిపర్వము ఉత్పలము ౨-వ పాదమున ద - ధ లకు ప్రయోగము లక్ష్యము. [1-124]

ఉ. కావన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ ! నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కా
కోదర సంహతిఁ హుతవహోగ్ర సమగ్ర శిఖాచయమ్ములఁ. 468

వెన్నెలగంటి సూరప్పగారు - విష్ణుపురాణము, కందము ౪-వ పాదమున ద - ధ లకు ప్రాసప్రయోగము లక్ష్యము. [3-85]

క. అదివిఁ దిరిగియుండును
స్వాదూదక జలధి దాని సమవిస్తృతమై
భూదేవ యిట్లు సప్తవ
యోధుల యందొక్క కొలఁది [1]నుండు జలంబుల్. అన్నాఁడు. 469

## [శబ్దరూప భేదములు]

మఱియు ఐ - ఔ లకు, హ్రస్వదీర్ఘపదములకు లక్షణ లక్ష్యములు రెంటికిన్ని కందము. [ఛందోదర్పణము 1-75]

క. క్రియనై ఔలకు హ్రస్వ
ద్వయము నమరు నాంధ్రభాషితప్రకరములో
నయిదనఁ దగు నైదనుచో
జయకీర్తులు నవుననంగఁ జను నౌననుచోఁ. 470

469. [1] నొనరు (విష్ణు. పురా.)

'వసియించు - వసించు' ననుటకు భారతము, సోమయాజి. [ఉద్యోగ. 2-326]

తే. ఎల్లయందును దాన [1]వసించుచెల్ల
యదియుఁ దనయందు వసియించు (నంద్రు) వాసు
దేవుఁడనుపేరి యర్థంబు దెల్లమింత
యెఱుఁగు జనులందుఁ దగ వసియించు శుభము. 471

'ర - ల' లకు ప్రాసము నిల్పుట సోమయాజి శల్యపర్వము ఉత్పలము ౧-వ పాదమున రేఫకున్ను కడమ మూఁడు చరణమ్ములను లకారములు గల లక్ష్యము. [1-322]

ఉ. [1]వారి యెలుంగు చూచి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు
ద్వేలిత విక్రముండగుచు మేమెయి నాతనిఁ దాఁకె నప్రవి
ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత వారలు వారివారి దో
ర్లీలలు చూచిరోటు పడిరెండు బలంబుల[2]యోధ్ద వీరులుణా. 472

అన్నారు. ముద్దరాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవనియందు. [1-12]

తే. సంధిఁ గూర్పంగఁ బ్రథమాంత శబ్దవితతి
పైఁ గచటతపలకు వికల్పంబు చెల్లు
కాకు సంబోధనావ్యయ కర్మధార
యమ్ముల నచేతనమ్ముల నబ్జనాభ! 473

మఱియును [ఛందోదర్పణము. 1-64]

ఆ. ఆయచేతన ద్వితీయతాదిజరూప
మయ్యుమందుఁ బ్రథమయట్లమందు

471. [1]వసియించు. (సం. శో. భా.)

472. [1]వాలి (సంశో. భా.) ఈపాదమున ర - ల ప్రాసమునకుఁ బ్రసక్తి యుండదు.
[2]యోధ. (సంశో. భా.)

[1]క్రతువుగాచె దాశరథి క్రతువుంగాచె
వనఁగ విల్లు రెండు నమరుఁ గృష్ణ! 47

అందుకు లక్ష్యము. [కవిజనసంజీవని. 1-19]

సీ. మతిపేతుమనగూడునె తలంప వశమగు
నెవ్వమోవిదూరనీ పదయుగంబు
రచియింతుఁ గృతులు కృష్ణచరాచరాది దే
వసిరంత[1]నో(క్తి) నీకనదృశముగ
అపరాధి నగుదునైన పద్మాశ్రితుఁడఁగావు
న[2]నపవిత్రుఁ జేయునజా భువన వినుత
మకరేంద్ర చకితుఁడైన కరీంద్రుఁ బాలించి
న [3]కృపానిధివి నీవు జగదధేయ

తే. కోవిదులు నీదు పదభక్తిచే చదినను
పాకశాసనపదమైనఁ జేకొనంగఁ
గోరుదురె వారు నారద శారదాభ్ర
చంద్రవిభకీర్తి! దేవతా చక్రవర్తి [redacted]న్నారు. 47

మఱియు నవు - నగవు ; పువు - పూవు లన్నందుకు లక్ష్యము.

క. నవు నవ్వు నగవు నగునా
పువు పువ్వనఁ బూవనంగఁ బూదగుఁ దిగిచెజా

474. [1]గ్రతువు గాచె దాశరథి కృష్ణుఁడొక పర్వ,
తమును గొడుగుభంగిఁ దాల్చెననఁగ (ఛం. ద.)

475. [1]నో్ద్ర. (అ. శ. ప్రాఁతప్రతి.)
[2]కావున + పవిత్రు - అవ్యయమునైై గసడదవా దేశమని క. జ. సంధి
వని మతము. కావునన్ - ద్రుతప్రకృతికమని కొందఱు.
[3]పాలించిన + కృపా - తత్సమక్రియనైఁ దత్సమ పదమునకు గసడద
వాదేశము.

దివిచెను బిగదము వవదము
దగిలించెఁ దగిల్చె నాఁగఁ దగునిదఁగృష్ణా! 476

క. పువు పువ్వు పూలనంగాఁ
బువుఁదీఁగనఁ బువ్వుఁదీఁగ పూఁదీఁగనఁగా
దవు దవ్వనఁగాఁ దగు న
త్కవి సమ్మతి యతులు ప్రాసగతులిదఁ గృష్ణా! 477

[*కవిచింతామణి. 2-13]

ఆ. ఆదిలఘులమీఁద నర్ధబిందువునిల్వ
దొందె పైఁ దకారమున్నఁ గలుగు;
వరయఁ దఱుచుగా ననాది వకారంబు
కవిత (నొ)ప్పఁగా గకారమగును. 478

అది యెట్లంటేని,

[కవిచింతామణి. 2-14]

క. పవడము పగడము పేఁకువ
వివరాలించును జలంబు లిగరాలించుఁగా
దివిచెను దిగిచెను చేతం
(దవిలిచెఁ దగిలించె) నన నుదాహరణంబుల్. 479

లక్ష్యము - సోమయాజి శాంతిపర్వము రెండవాశ్వాసము పురోహిత పద్ధతి.
కందము ౨-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [ 2-308 ]

క. వివిధోత్పాతంబులకును
నవళ్లలోఁ దోఁచు కీడునకుఁ దోడ్తో శాం
తివిధానంబున నిరసన
మును బురోహితుని చేత ననవద్యముగాఁగా. అన్నారు. 480

478. *రామభద్రయ్యగారు అని అ. శి. వ్రాఁతప్రతి.

ఇఁక 'పువు' అన్నందుకు నైషధము కందము ४-వ పాదమున లక్ష్యము. [శృంగార నైషధము. 1-80]

క. శ్రవణావతంసమయ్యెఁ
ధవలాక్షి గుణంబు లపుడు ధరణీంద్రునకుఁ
శ్రవణా వతంసమయ్యెఁ
బువ్వువింటి గుణంబులపుడు పుష్పాస్త్రునకుఁ. 481

'పూవు' అన్నందుకు ఆముక్తమాల్యద ఉత్పలము ౨-వ పాదమున లక్ష్యము. [1-62]

ఉ. వేవిన మేడపై వలభి వేణికజంట రహించియింపుగాఁ
బూవులు గోటమీఁటుతతిఁ బోయఁడు తీఁటులమ్రోఁతగామి కం
కావహమౌఁ గృతాభ్యసనలౌటను దంతపుమెట్ల వెంబడిఁ
జేవడిపీణమీఁటుటలు చిక్కొడలించుటలుఁ సరింబరఁ. 482

మఱియు రెట్టవగారు. [*రెట్టమతశాస్త్రము. ఆ. 1. పుట. 19]

ఉ. పూవులు నక్షతంబులును బొందుగదోయిటఁబట్టి వానకై
భావములోన మానవుఁడు ప్రశ్నయొనర్పఁగఁ బక్షియయ్యెడఁ
[1]వావిరి బేసిగాఁ బలికినఁ బహుళంబుగ వచ్చువాన, గో
త్రావలయంబునం దొకమతం బిది వేంకటరాజశేఖరా. 483

'దవు' అన్నందుకు సూరవరాజుగారు రాఘవపాండవీయము ३-వ పాదమున సమాసమధ్యంబునను లక్ష్యము. [2-59]

మ. అనయంబుఁ మదనామితాప్రకలనాత్యంతార్తిరాకుండఁ జ
య్యనమౌచిత్యకృతేష్టసిద్ధితఁ దిరంబైపోయె దేదీప్యమా

483. *కన్నడమున రెట్టన రచించిన శకున శాస్త్రమును అయ్యల భాస్కర కవులు ఆంధ్రీకరించిరి. ఈ జంటవులు క్రీ. శ. 16వ. శతాబ్దాంతమున నుండినవారు. ఈ గ్రంథము కనకరాయ మొదలారి వారి జీవరక్షామృత ముద్రాక్షరశాలయందు, చెన్నపట్టణమున క్రీ. శ. 1906వ. సం. న ముద్రితము.

[1] వావిరి బేసిగాఁ బలుక వారిద వృష్టియుఁ గల్గునండ్రు. (ముద్రితప్రతి.)

న విరూఢిం బయిఁబడ్డ యాదవుల నానావీరధర్మప్రవృ
త్తి విరర్థం బనిపించి యాత్మపురికిం దేవేరితోఁగూడఁగన్. 484

[*కవిచింతామణి. 2-10]

క. భిన్నపదప్రథమలపై
నున్నపకారంబు వత్వమొందును వశికిన్
*మున్న(న్ని)టి రూపముప్రాసము
వన్నవ రూపమునమందు నాశికాక్షా! 485

అన్నారు. పకారము వకారప్రాసమైనందుకు (*శృంగారశాకుంతలము) శార్దూల వృత్తము ౪-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [2-188]

శా. ఆ వాలుంగనుదోయి యానగుమొగం బాగుబ్బపాలిండ్ల పెం
పా వేణీరుచి యాతనూవిలసనం బాయొప్పు లేచూచినన్
గైవారంబగుఁగాని యెయ్యెడ శిరఃకంపంబుతోఁగూడ నా
హావృట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి వీక్షించినన్. 486

ఇఁక 'కర్మువు - ధర్మువు' లనుటకు —

క. కర్మువు కర్మమనంబను
ధర్మువు ధర్మంబనాఁగఁ దగు వికృతులన్
కర్మువులు గలఁచి మీకృప
ధర్మువు లొనఁగూర్పు భక్తతతికనఁ గృష్ణా! 487

'కర్మువు' అన్నందుకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము చంపకము ౩-వ పాదంబున ప్రయోగము లక్ష్యము. [4-250]

చ. అవని యరాజకంబయినయత్తఱి భూప్రజలందు సర్వ క
ర్మువులు దొఱంగు దేవముని ముఖ్యుల వాయుదు రోలి వృష్టిలే

485. *రామభద్రయ్యగారు అని అ. శ. వ్రాఁతప్రతి.
1 మున్నిటి. (అ. శ. వ్రాఁతప్రతి.)
4-6. *భాస్కరరామాయణము అని అ. శ. వ్రాఁతప్రతి.

దవు, మఱి [1]యర్థముఁ దఱుఁగునందురు గావునఁ గాలయాపనం
బవితథవాక్య! చేయక నయంబున నిల్పుము రాజ్యమిత్తఱిన్. 488

'ధర్మవు' అన్నందుకు సోమయాజి శాంతిపర్వము చంపకము ౨-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [1-1]

చ. భువనభయంకరమ్ములగు పోరులఁ దమ్ములతోడఁ గూడ నీ
వు వెడలు టొప్పు లెస్స యలవుఁ బలముఁ వెలయించుచోట ధ
ర్మ్మవున కొకింతయుఁ దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు దీనఁ గౌ
రవకులముఖ్య! యుమ్మలికఁ గ్రాచితె చిత్తము శాంతిఁ బొందెనే? 489

వ. మఱియును, 490

క. కనుకన్ను కన్నుఁగవ నాఁ
గనుఁగవ కన్గవ యనంగఁ గన్నుంగవనన్
కనుదోయి కన్నుదోయనఁ
జనుఁ గందో యనఁగ సుకవిసమ్మతిఁ గృష్ణా! 491

వ. మఱియును, 492

క. చివురనఁగఁ జిగురనంగను,
నెవమన నెపమనఁగ, నేతు నేర్తుననంగన్,
భువిఁ దగుఁ దీవనఁ దీఁగనఁ
గ వెలతె వెడలె వనిచెప్పఁగాఁ జనుఁగృష్ణా! 493

మఱియు చను - కను - చివు ర నేందుకు లక్షణము —

క. చను చన్ను చన్నుఁగవనాఁ
జనుఁగవ చన్గవ యనంగఁ జన్నుంగవనన్
గను చందోయి యనంగను
చనుదోయనఁ జన్నుదోయి చనువిడఁగృష్ణా! 494

---

488. [1]యర్ఘ్యముల్ (సంశో. ఫా.)

‘వువు - పువ్వు’ అన్నందుకు ప్రయోగము *(సు)భద్రాపరిణయము ౧-వ పాదమున, చివురన్నందుకు ఆరెండవ పాదమునను లక్ష్యము. [1-84]

ఆ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక,
చివురు నవురు జవురు మవిదమోవి,
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి,
(మెఱవు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను.) అనుట. 495

‘నెపము’ - అన్నందుకు శబ్దశాసనుఁడు (*ఆదిపర్వము) కందము ౪-వ పాదమున లక్ష్యము. [8-112]

క. విపరీతగతిని సుందుఁడు
నుపసుందుఁడు దాఁకి పోరి రొండొరులు మహా
కుపితాత్ములై తిలోత్తమ
నెపమున దృఢఘోరముష్టి నిర్ఘాతములన్. 496

‘నేతు’ - అన్నందుకు సోమయాజి విరాటపర్వము కందము ౨-వ పాదమున లక్ష్యము. [1-196]

క. ద్యూతక్రీడకుఁ గొండొక
నేతుఁ గపటమునకు నోపని జనమ్ములు నా
చేతి ధనమెల్లఁగొని పరి
భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. 497

‘చివు’రన్నందుకు మఱియును ప్రయోగము, శ్రీనాథుఁడు నైషధము మత్తేభము ౧-వ పాదమున లక్ష్యము [శృంగారనైషధము. 3-31]

మ. పవిసంగంబునఁ దావమొందిన శచీప్రాణేశు కెంగేలికిం
జివురుం గైదువుజోదు వైద్యముపదేశించెన్ రహస్యంబుగా

---

495. *చేమకూర వేంకటకవి విజయవిలాసమునకు ‘సుభద్రాపరిణయ’ మని నామాంతరము.

496. *సభాపర్వమని ఐ. శి. వ్రాఁతప్రతి.

పీవనీహారపయోమిళన్మలయజ స్నానార్ద్రపర్యంతమై
యివతాళించు విదర్భరాజతనయా హృద్యస్తన ద్వంద్వముల్. 498

'వెలలె' నన్నందుకును మఱియు నందే శ్రీనాథుఁడు చంపకము ౨-వ పాదమున లక్ష్యము. [శృంగార నైషధము. 4-24]

చ. చిలుకలు గూయునో చెవులు చిల్లులువోవఁగనంచు నెన్నఁడుల్
వెలలఁడు నందనోపవనవీథులకై; యటుమౌళిభాగవి
ర్మలశశిరేఖసేయు నపరాధము నంగజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి, నీదెసఁగూర్మియెట్టిదో! 499

'జలజాత' శబ్దము 'జడజాత'మనినందులకు ప్రౌఢకవి మల్లనగారు రుక్మాంగద చరిత్ర సంధ్యావళి వాక్యము పంచమాశ్వాసము కందము, ౩-వ పాదమున 'జడజాత' శబ్దప్రయోగ లక్ష్యము. [5-47]

క. *పడఁతీ, నీతలిదండ్రులం
కడకుల్ గావిపోమనిన్నుఁ, గలఁగకుమవి యా
జడజాత నేత్రిఁ బద్మిని
నొడఁబడఁగా గారవించి యుచితప్రీతిన్. 500

'చన్నుఁగవ' అన్నందుకు ప్రయోగము సోమయాజి విరాటపర్వము కందము ౪-వ పాదమున లక్ష్యము. [1-291]

క. వలవలి నెక్కు నొకించుక
మలఁగంగాఁ దుఱిమి తుఱుము మాపుడుపుట్టం
బలవడఁ గట్టి జరతన
ర్కలముల [2]నెఱిదుల్కి చన్నుఁగవఁ గప్పితగన్. 501

500. *వావిళ్ల ప్రతిలో 'జలజాతనేత్రి' అని ౨-వ ప్రాసమున్నది. ఇది పరిష్కర్తల కార్యము కానోపును. అ. శే. లో 'నేత్రి' అను రూపమున్నది.

501. [2]నెవ్వెఁగఁ జన్నుఁగవ (పంశో. ప్రా.)

'కన్నుఁగవ' అన్నందుకు ప్రయోగము సోమయాజి *శల్యపర్వము గీతి ౨-వ పాదమున లక్ష్యము. [1-230]

తే. నెరయ కిమక పెన్వెఁడయై విప్పులురల
కన్నుఁగవ శల్యుఁజూచిన యున్నయునికి
నతఁడు పీఁజగాకుండుట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ! 502

[శ ష స ప్రాస]

మఱియు శ ష స లు ప్రాసము చెల్లుటకు కౌస్తుభాభరణాంకుఁడు లక్షణము.

క. అసదృశ శషసలు పాతో
సుషమంబుగఁ బ్రాసమా శషోస్పషయనఁగా
విశదముగ సూత్రసమ్మతి
నసమాయుధ జనక కౌస్తుభాభరణాంకా! 503

అన్నాఁడు. ఇందుకు ప్రయోగము [*వేములవాడ భీమకవి చాటుధార] చంపకము ౧-వ పాదమున శ - స లకు ప్రాసప్రయోగము.

చ. బిసరుహగర్భుబ్రాఁతయును విష్ణువు చక్రము వజ్రివజ్రముఁ
మసకపుఁబాము కాటును గుమారుని శక్తియు[1] మౌని కోపముఁ
దశరథసూను బాణమును ధర్మజు వాక్యము [2]కర్ణునీతియుఁ
పశుపతి కంటిమంటయును [3]బ్రహ్మణశాపము రిత్తవోవునే? 504

---

502. *శర్ణపర్వమని అ. శి. బ్రాఁతప్రతి.

504. *శబ్దశాసనుఁడు ఆదిపర్వము అని అ. శి. బ్రాఁతప్రతి.

[1]మౌని కోపమున్ కాలుదండము. (అప్ప. 3-91).

[2]మౌనిశాపము. (అప్ప. 3.91).

[3]పండిత వాక్యము. (అప్ప) 'బ్రాహ్మణ' అనుటకు 'బ్రహ్మణ' అని ప్రయోగించెను.

'బీభత్స' శబ్దము 'బీబచ్చుం'డన్నందుకు బ - భ లు[ప్రాసము చెల్లుటకు సోమయాజి ఉద్యోగపర్వము కందము ౧-వ పాదమున లక్ష్యము. [1-238]

క. [1]ఆ బీబచ్చుని భూరి భు
జాబలమును దుర్నివారశౌర్యము శరవి
ద్యా బహుళతయును బంటికి
నై బవరము సేపినట్టి హరుఁడ యెఱుంగుఁగా. 505

డ - ధ లు[ప్రాసము చెల్లుటకు [ప్రయోగము సోమయాజి కి(ర్ణప(ర్వము) [ప్రథమాశ్వాసము గీతి ౪-వ పాదమున లక్ష్యము. [1-80]

తే. శక్తులను దోమరమ్ముల సరభసముగఁ
బోరుచో భీమసేనుని పేరురమున
క్షేమధూర్తి సముజ్జ్వలతోమరమ్ము
లేదు నాటించె దర్పమ్ము [1]రూఢికెక్క. అన్నారు. 506

ఇఁక రామభద్రయ్యగారు. [కవిజనసంజీవని. 1-40]

క. ఏవాఁడెవ్వఁ డెవ్వఁడు
నావర్తిలఁ గృతులయందు నళినాక్షు గుణ
శ్రీ వర్ణింపఁగ సురలం
దేవాఁడు గలాఁడు వనజగేశతురంగా. 507

'ఏవాఁడ'న్నందుకు [ప్రయోగము సోమయాజి ([2]శాంతి)పర్వము కందము ౧-వ పాదమున లక్ష్యము. [1-52]

---

505. [1]ఆ బీభత్సుని (సంశో. భా.) కవి నిర్దేశించిన ట్లిందు బ - భ [ప్రాస లక్ష్యము గానరాదు.

506. [1]రూఢికెక్క. (భార. వావిళ్ల.)

508. [2]విరాటపర్వమని ఆ శి. [వ్రాఁత[ప్రతి.

క. ఏవాఁడు బంధుమిత్రులు
జీవధనంబులను నొంపఁ జెందుదురు గృహం
గా వాని వెన్నఁగాఁ దగుఁ
గేవల తనుకార్యయుతుఁడు కృకుఁడే తలఁపఁగా. 508

మఱియు సందేకందము ౪-వ పాదమున లక్ష్యము. [విరాట. 2-256]

క. [1]ఏవొకతేల మఱిం బది
వేవురనే [2]వెదకి పట్టి వేఁడిన నడ్డం
బైవచ్చిన వలదన విం
దేవాఁడు [3]గలాఁడు పీవు నెఱుఁగవు గంటే. 509

ముద్దరాజు రామభద్రయ్యగారు. [కవిజనసంజీవని. 1-45]

క. [1]పూంచెఁ మంచెఁగా బంచె న
టంచుఁ బ్రయోగింపఁ జెల్లు నమరశ్రేణిఁగా
మంచె మనోరథసుకరము
[2]పూంచె రమాధవుఁడు భక్తపోషణుఁడనఁగఁగా. 510

[1]'పూంచె' నను ప్రయోగము సోమయాజి విరాటపర్వము ౩-వ పాదమున లక్ష్యము. [4-15]

క. కాంచనమాలాలంకృత
చంచత్తనులీలమెఱయ జవనాశ్వములఁగా
[2]బూంచి రథమ్మున మణిమయ
పంచానన కేతువెత్తె బంధురభంగిఁగా. 511

---

[1]ఏవొకతేల యిల. (సంశో. భా.)
[2]తఱచి పట్ట వెదకిన (సంశో. భా.)
[3]మగండు దీవి. (సంశో. భా.)

510. [1]పూంచెం బూనిచెఁ బూన్చె. (క. జ. సం.)
[2]'పూన్చె' అని ఆ. శీ. వ్రాఁతప్రతి.

511. [1], [2] 'పూన్చె' అని ఆ. శీ. వ్రాఁతప్రతి. ఈ సంయుక్తరూపమును గ్రహించిన ప్రాసభంగమగును.

[1]'మంచితి' నన్నందుకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము ఉత్పలము ౨-వ పాదమున లక్ష్యము. [2-200]

ఉ. పెంచితి ధర్మమార్గములఁ బ్రీతియొనర్చుదు ధారుణీప్రజన్.
మించి తనేకయాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వఁడు నీసమానులే? అన్నారు. 512

సోమయాజి శల్యపర్వము చంపకము ౩-వ పాదమున లక్ష్యము; శల్యవధార్థము ధర్మరాజు పరమేశ్వరుని వేఁడుట. [1-265]

చ. స్ఫురితషడర్ధనేత్రునిఁ ద్రిశూల సముజ్జ్వలు నిర్గుణున్ గుణా
దరసముదాత్తమూర్తిఁ గలితప్రభవస్థితి సంహతిక్రియా
విరత వివర్తిత త్రిభువనీ మహనీయుని దైత్యమర్దన
ప్పురుషవరున్ జతుర్భుజు విభుత్వమహోజ్జ్వలు నాశ్రయించెన్.
అన్నారు. 513

[ అగస్త్య వ్యాకరణ విషయము ]

వ. మఱియు నందు నీశ నగస్త్యవ్యాకరణంబున అగస్త్యప్రోక్తంబైన వికృతివ్యాకరణంబునందు ఆంధ్ర మైదువిధంబుల వర్తిల్లు; నవియెయ్యవి యంటేని - తత్సమంబనియు, తద్భవంబనియు, శుద్ధాంధ్రంబనియు, అపభ్రంశమనియు నైదు(?)విధంబులఁ బ్రవర్తిల్లు. అందు తత్సమంబనునది సంస్కృత ప్రాకృత శబ్దములతో సమానంబైయుండు, నదియెట్లంటేని యందులకు వికృతి వ్యాకరణసూత్రములు.

సూ. మహతోఽత ఉత్॥ వృ. మహతః అతః ఉత్.

---

512. [1]'మన్చితి' అని ల. శ. వ్రాఁతప్రతి. ఈ రూపము గ్రహించిన ప్రాస భంగమగును.

514. (?)అయిదవ విధము పేర్కొనఁబడలేదు. ప్రతిలో ఆదర్శము లుప్తమై యుండును. ఇచట దేశ్యమను విభాగముండవలయును.

సూ. మహతస్సోర్డుక్॥ వృ. మహత స్సుప్రత్యయపరే డుక్ స్యాత్. అన్నారు.
ఇందుకు శబ్దశాసనుఁడు ఆంధ్రశబ్దచింతామణియందు

ఆర్యావృత్తము॥ 'స్త్రీపశుజడాద్వినాన్యేమహదాఖ్యా
స్త ద్విశేషణా శ్చాపి।
మహతోఽత ఉద్విభక్తౌ
మహతస్సోర్డుజవితో భవేత్సుంసి.' (ఆజంత. శ్లో. 3.)

అన్నాఁ డిందుకు స్త్రీవాచక పశువాచక జడవాచకములైన శబ్దములు వినాగాఁ గల పురుషవాచక శబ్దములున్ను వాటికి విశేషణములున్ను మహత్తులనే సంకేతము కాఁబట్టి 'మహతోఽత ఉత్' అనే సూత్రంచేతను మహత్తైన పురుషవాచకశబ్దముయొక్క, అతః అత్తుకు, ఉత్ ఉత్వము వచ్చును. ఎటువలెనంటేని - రామః అనే శబ్దము పురుషవాచకము గనుక మహత్తైన పురుషవాచకశబ్దము తుదనుండే విసర్గలకు లోపము వచ్చి ఆ మకారము మీఁదనుండే అత్తుకు ఉత్తువచ్చును. 'రాము' అని యుండును. 'మహత స్సోర్డుక్' అనే సూత్రముచేత ఆ మహత్తైన 'రాము' అనే శబ్దము యొక్క సోః - సు ప్రత్యయమైన ప్రథమైక వచనమునకు డుక్ వచ్చును. 'రాము డుక్' అని యుండును. 'అను క్త్తమన్యతః' అను శబ్దాను శాసనము అనుటచేత శబ్దశాస్త్రమున 'హలన్త్యం' అను సూత్రముచేత కత్తుకు లోపము వచ్చును గనుక డుకారముమీఁద ఉండే డాకు లోపము వచ్చి 'రాముఁడని' ఉండును. ఈ ప్రకారంగానే కృష్ణుఁడు, పురుషుఁడు, ఇవి మొదలైన పురుషవాచక శబ్దముల కన్నిటికిని సరిచూచుకొనేది. "సువర్ణదండైక సితాత పత్రిత జ్వలత్ప్రతాపావళి కీర్తిమండలః" అనే నైషధ కావ్యమందు (1 - 1) నుండే 'మండలః - మండలుండు' అని తెలుఁగున తత్సమమేలాగయ్యెనంటేని - యీ రీతి కీర్తిప్రతాపములు గల నలునికి విశేషణం గనుక, అనల శబ్దము పురుషవాచక మహత్తు గనుక ఆ పురుషవాచక శబ్దానకు విశేషణము గనుక 'మండలః' అనే విసర్గకు లోపము వచ్చి లకారము మీఁద అత్తుకు ఉత్తువచ్చి ఆ ప్రత్యయమైన ప్రథమైక వచనానకు డుగాదేశము వచ్చి కత్తుకు లోపము వచ్చి 'మండలుఁడు' అని అర్ధానుస్వారంతో నిలచెను. పూర్ణానుస్వార అర్ధాను

స్వారములు తెలుఁగున ముఖ్యముగా వచ్చును గనుక 'మందలుండు' - మందలుఁడు' అని యుండును. "హ్రస్వోవా ఖండః. పూర్ణోవాఖండః. ఖండఏవ దీర్ఘం స్యాత్." అనుటచేత నీలాగ తత్సమశబ్దములకు వాటి విశేషణములకున్ను పరిచూచుకోవలయును.

ఇఁక నందు తద్భవ శబ్దములకు —

తద్భవమనఁగా సంస్కృత ప్రాకృత శబ్దములంబుట్టిన తెలుంగు లనుట. 'త్రిలింగ' శబ్దమున 'తెలుఁగు' అనే శబ్దము నటువలెనె పుట్టె. అది యెట్లంటేనియు — శ్రీ పర్వత కాళేశ్వర ద్రాక్షారామ మధ్య దేశం త్రిలింగాకారమ్ గనుక, ఆంధ్రదేశానకు సంస్కృతాన త్రిలింగరాజ్యం అనే పేరుగలది. ఆ త్రిలింగ అనే పేరు ఒక 'త్రి' అను మొదల వర్ణమునకు — "రవలామధశ్చ - అధో వర్తమానానాం రేఫ వకార లకారాణాం లోపస్స్యాత్" అనే అగస్త్య వ్యాకరణసూత్రం చేత తకారం క్రిందగా నుండే రేఫకు లోపం వచ్చును. 'త్రిలింగా' అనేటప్పుడు 'త్రిలింగ' అని యుండును. 'ఇనైచావనో్యన్యం' అనే సూత్రంచేత 'ఇన్ను' కల 'ఏచ్చు'కు 'ఉన్ను'ను, కావలసినచోట తెనుఁగుల కూడివచ్చును గనుక తకారంమీఁద ఇనైన ఇకారానకు ఏజైన ఏకారం వచ్చెఁ గనుక తెలింగా అని ఉంటేను 'ఉదితశ్చ' అనే సూత్రంచేత ఇకారానకు ఉకారం, ఉకారానకు ఇకారం వచ్చెఁ గనుక లకారంమీఁద ఉండే ఇకారానకు ఉత్వము వచ్చు గనుక 'తెలుఁగా' అని యుండెను. 'అచః ప్రతిపదం కాత్యాయనశ్చ' అనే సూత్రంచేత తెలుఁగున అచ్చునకు ప్రతిపదం కద్దు గనుక 'తెలుగు' అని ఉండెను. హ్రస్వాక్షరంమీఁద పూర్ణానుస్వారం వికల్పంగనుక 'తెలుంగు' అని ఉండెను. 'తెలుఁగు' అని అనవచ్చును.

"నణ దలా మిహో న్యాన్యం" — అనే సూత్రంచేత యీ తెలుఁగులో నకార ణకార దకార లకారములకు అన్యోన్యం కద్దు గనుక 'తెలుగు' అనే పదములో ఉండే లవర్ణమునకు నకారం వచ్చి 'తెనుగు' అని యుండును. త్రిలింగ శబ్దముమీఁద తద్భవమై పుట్టిన తెనుఁగుశబ్దం. ఇది సుశబ్దం ఆ తెలుఁగు శబ్దానకు అభేదముగాఁబుట్టిన శబ్దం 'తెనుఁగు'

అనే శబ్దం కాఁబట్టి 'తెలుఁగు' అనే మాట ముఖ్యమైన తద్భవమనుట. 'తెనుఁగు' అనే శబ్దం కేచిత్పక్షం.

మఱియు, "మనయా మధోవర్తమానానాం - అధోవర్తమానానాం మకార, నకార యకారాణాం లోపస్స్యాత్" అనే సూత్రంచేత నీ తెనుఁగున ద్విత్వములైన మకార నకార యకారములకు లోపము వచ్చును. అది యేప్రకారమున నంటేని 'ముత్యం' అనేటప్పుడు ఆ క్రిందనుండే ద్విత్వయకారమునకు లోపంవచ్చి 'ముత్తెం' అని యుండును. 'కన్య' అనేటప్పుడు యకారానకు లోపంవచ్చి 'కన్న' అని యుండును. 'భగ్నం' అనేటప్పుడు ద్విత్వనకారమునకు లోపంవస్తే చతుర్థ భకారం తృతీయ వర్ణం బకారంవచ్చి 'బంగ' అని యుండెను. 'బంగపాటు' నటువలెను. ఈరీతి సకల శబ్దములకు తెలియవలెను. ఇది అగస్త్య వ్యాకరణసూత్రప్రకారము. *అథర్వణాచార్యులు, 'ఆంధ్రశబ్దచింతామణి' వ్యాఖ్యానం మొదటను,

"వాచా మాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమో భవత్
ఆచార్యం తం కవీంద్రాణామ్
వందే వాగనుశాసనమ్."

అన్నాఁడు. కాఁబట్టి ఆంధ్రకవనమునకు శబ్దశాసనుఁడె ముఖ్యం డనుట. మఱియు నిఁక నందు, 514

## రేఫ ఱకార లక్షణములు

తే. పరఁగు రేఫకురేఫమె ప్రాసమగు (ఱ)
కారమైన ఱకారంబు (గలుగు)ఁ గృతుల
కవిత రేఫ ఱకారసంకలితముగను
చెల్లవిడ, మూఁటి కొక్కటి చెల్లుఁగృష్ణ! (?) 515

514 *ఈ శ్లోకము బాలసరస్వతీయము లోనిది. (సంజ్ఞాపరిచ్ఛేదారంభము).

515. (?)ఈ పాదభాగార్థము స్పష్టము గాదు.

వ. మఱియు నెట్లంటేని, 516

తే. సంస్కృత పదమ్ములందుఁ దత్సమములందుఁ
దద్భవములఁ గ్రియాపదాంతాక్షరములఁ
గల్గు రేఫలు గృతుల నిక్కముగ నీవి
మీఁద బండి [1]ఱకారములేదు కృష్ణ! 517

## శకటరేఫ ఱకార ప్రకారము

సీ. అద్వయ యాద్వయ యిద్వయ ఏ ఓ లఁ
గలుగును రేఫఱకారములు, [1]ఋ
ౠ ఌ ౡ ఐ ఔ ం రేఫలు గలిగినఁ
గలుగదు లేదు ఱకార మరయఁ
యను హల్లులను క గ చ జ త ద న ప బ మ
[ర వ స ల] లనెడి వర్ణములపైన
రేఫఱకారముల్వెలయును ఖ ఘ ఛ ఝ
ఞ ట ఠ ఢ థ ధ ఫ భ య శ ష హ క్ష

తే. లనెడి వ్రాలందు రేఫలే దనరుఁ గాని
ధర ఱకారంబులేదు సిద్ధంబుఁ గృతులఁ
జూపె నన్నయభట్టాది సుకవి వరుల
కవితలందెల్ల వెదకినఁ గనఁగ కృష్ణ! 518

వ. మఱియు ఱు, ఱూ, లంబును శబ్దముల యందలివి యప్రసిద్ధంబులగుట నెల్లవారికిం దెల్లంబగు నది యట్లుండె. మెండియు శకటరేఫ ఱకార ప్రకారంబు ప్రకాశంబగు తెఱంగెఱింగించెద నవధరింపుము. 519

చిత్రకవి పెద్దనగారు. [లక్షణసారసంగ్రహము. 3-4]

---

517. [1]రకారము. (ఆ. శి. వ్రాఁతప్రతి).

518. [1]ఋ, ౠ, ఌ, ౡ లు సంస్కృతాక్షరములు. శుద్ధాంధ్రమున నుండవు. వీనిపై ఱకారము లేదని చెప్పుట యనవసరము.

తే. పృథివి శీవుఁడీశుఁడను నభేదవాది
వలెనె వాదించి కుకవి దుర్వాది సభల
తాను రేఫకుఱాకు భేదమెయ్యమనది
కృతులఁజెప్పుట సుకవి సమ్మతముఁగాదు. 520

[ల. సా. సం. 3-9]

క. ఇఱఁదగు రేఫకు రేఫయె
యఱరఁగఁ బ్రాసము ఱకారమైన ఱకారం
బిఱఁదగును గాని రెండును
[1]బడిఁగలయఁగఁ జెప్పరాదు పావనివింటే! 521

[ల. సా. సం. 3-10]

సీ. సంస్కృతార్ణములఁ దత్సమమగు తెలుఁగుల
యందుఁ గ్రియాపదాంతాక్షరములఁ
బలుకుచో రేఫలు గలుగు వింతియకాని
కలుగదు బండి ఱకార మరయ
అద్వయి ఇద్వయి ఎద్వయి ఒ, ఓ లు
[1]క గ చ జ త ద ప బాక్షరములెన్న
వ మ ర వ స ల లిన్ని యమర విర్వదిరెండు
వీనిపై నారేఫ వితతు లొదవు
తే. వాని వర్గులచేఁ దేర్తు వరుసతోడఁ
గడమ యిరువది తొమ్మిదక్కరముల తుదఁ
గదిసి రేఫలు గలిగినఁ గలిగెఁగాని
మఱి ఱకారంబు లేదెందు మారుతసుత! 522

[లక్షణసారసంగ్రహము. 3-11]

---

521. [1]బడి. (ల. శ. వ్రాఁతప్రతి).

532. [1]క గ చ జ ద ప బాక్షరములెన్న. (ల. సా. సం. పా.)

వ. (ఇందు) సంస్కృత పదమ్ముల తత్సమమగు తెలుఁగు పదమ్ముల రేఫలు గలవు. ఱకారంబులు లేకుండుట సుప్రసిద్ధమగు. క్రియాపదాంతాక్షరములపై వచ్చు రేఫ వర్ణంబు లెట్టివనిన, 523

తాళ్లపాక [*తిరుమలయ్య]గారు. [రేఫ ఱకార నిర్ణయము. 3]

క. ఇచ్చిరి తెచ్చిరి యనియెడు
యచ్చ [1]తెనుంగులఁ గ్రియాపదాంతంబులపై
వచ్చినవి యెల్ల రేఫలు
రచ్చల చెదలవిత, ధలల రచనలు కృష్ణా! (?) 524

చిత్రకవి పెద్దనగారు. [లక్షణసారసంగ్రహము. 3-12]

క. వ్రాసిరి తెచ్చిరి యోపిరి
సేసిరి వచ్చిరి యనంగఁ జెన్నగుక్రియలం
దాసిన తెలుఁగులఁ గలయవి
భాసురముగ రేఫలయ్యెఁ బవనతనూజా! 525

[లక్షణసారసంగ్రహము. 3-13]

తే. రేఫక్రిందట ద్విత్వము రేఫలేదు
ఘనఱకారంబె ద్విత్వ ఱకార మగును
అఱ్ఱునను వఱ్ఱునొకయిఱ్ఱి మఱ్ఱిపీఁద
నఱ్ఱుగుఱ్ఱంబు గలవానికుఱ్ఱ వినుము. 526

వ. మఱియు పెద్దనగారు ఆకారాదులపై వచ్చు రేఫ ఱకారంబులు వర్గక్రమంబున (వివరించిరి). అందు అకారంబుపై వచ్చు రేఫలు ఎట్టివనిన సావధానంబుగా విన నవధరింపుము. 527

[లక్షణసారసంగ్రహము. 3-15]

---

524. *చిన్నన్నగారు. (ల. శి. వ్రాఁతప్రతి).

[1] తెనుంగులు క్రియాపదాంతాక్షరపై. (ల. శి. వ్రాఁతప్రతి).

సీ. అరిగొన నరదాన నరిగెను నరవాయి
గొనకరుదరగంటఁగవిమె నరయ
నరపి చల్లారఁ గన్నార నారెదు నన
నారంగ ధర్మంబు నారఁగూరె
నారఁగాఁగిన పాలు నారెకు లారాట
మారటం బారవియగ్గి యూరె
నారయ నట్లు పొంగారె నారంగ న
ద్వయిమీఁద రేఫ లిర్వదియు రెండు

తే. ఇరవు విరువురు విరువది యిరుగెలఁకులు
విరుము విరవార నొల్లఁబోయి రవపీరె
పీరి కలుపట్టె పీరేదు పీరెలుఁగనఁ
బదునొకొండ్రేఫ లిద్వయివయివి హనుమ! 528

మఱియు విఁక ఉకారంబుపై రేఫ లెట్టివనిన —

[లక్షణసారసంగ్రహము. 3-17]

సీ. ఉరవట యురవణిం చురిమెడి యురులఁద్రో
యుట దెందమురియాడ మరియు ననఁగ
నురుశింప నూరకయుండుట నూరార్చు
టూరట పుచ్చుట యూరనుండి
యన మద్వయంబుపై నొకరు రేఫలు పదు
నొండివి కృతులలో దండిమెఱయ
మఱవుగ రిపులపై నుఱుకుడు బలిముఱి
యుఱుముచు నుఱుకఱి నుఱుకచేతు

తే. లూఱుడిల మాఱు నవఁగను నూఱుగదవ
నూఱె నన మద్వయంబుపై నుప్పతిల్లు
బండితా లివి పదియయ్యెఁ బరఁగఁ దెలుఁగుఁ
గృతులఁ గవు లిఁకఁ బొలుపొందఁ గిశనాథ. 529

[లక్షణసారసంగ్రహము. 3-13]

సీ. ఎరగలి కెరువది యెరగాఁగ నెరియంగ
నెరికె యేరికెయన నెరవిడుమన
నేమీఁదిరేఫ లివేడగు రెండారు
లారు లోరపిలఁగ మిన్నొరయ నొరిమె
నోరల కోరిచి కోరి యవఁగ రేఫ
లెన్మిది యోమీఁద నెసఁగె నింక
నె(ఱ)కలు నెఱచియు నెఱు[1](కు)లు నెఱకయు
నెఱసంజ యెఱపును నెఱగు టెఱవు

తే. ఎఱుఁగుటనఁ దొమ్మిదేమీఁద నెనయుఱాలు
యెఱవ దొఱవుల నొఱగాలు నొఱిగెనవిన
నొఱపుగలకత్తి యొఱలోన నొఱలు టనఁగ
[2]ఏడుఱాలివి ఓమీఁద నెసయు హనుమ! 530

వ. ఇఁక కవర్గమీఁదఁగల రేఫ లెట్టివనిన, 531

[లక్షణసారసంగ్రహము. 3-19]

సీ. కారుక్రొమ్మొగులు తొల్కరిఁగర మొప్పంగఁ
గురియఁ గరిపెన మొక్కరుఁడు చేపి
కోరప్పనంబు చేకూర విడుకరణి
కూర కారాకులు కూరుటయును
గరకరఁ గాలంగఁ గరఁగి కరువుఁబోపి
కోరికి కూరిమి కోరఁజేపెఁ
గరవాలు కరువలి కారింప కూరుకు
కూరుకు కారాట కారనంగఁ

ఆ. గూరనాటినమ్ము కొరప్రాణ మవఁ గారి
యంబును గరి గోరునది కరకరి

---

530. [1]ఎఱుకలు. (అ. పా. సం.)

[2]సప్తసంఖ్య ఱాలోమీఁద జరగు సభవ. (అ. పా. సం.)

కారులు కెర లనఁగ కారాది రేఫలు
ముప్పదియును రెండు ముఖ్యచరిత. 632

ఇఁక కకారాదిపై ఱకారములు. [లక్షణసారసంగ్రహము. 3-20]

సీ. కుఱ్ఱఁగట కొఱమాలి కొఱఁతవడి కుఱచ
కఱవునఁ గొఱగాదు కొఱవి యనఁగఁ
గఱటిఁ దెల్పగరాదు కాఱియ కఱకంత
కొఱలి కొఱలువచ్చెఁ గెఱయ ననఁగ
గఱకులు కుఱుకొవి కాఱుదు కొఱపంబు
కొఱగట్టు కుఱుమాపు కుఱుకుఱయన
కాఱడల కొఱకు కాఱులక్కఱ
రవతికలపెను కఱపతి[1]

తే. కఱకల కలికి కఱదులు కఱకటిగొన
కొఱికి కఱకేకి కొఱగుట కఱకఱయన
గలకకారాది [2]బండి ఱకారసంఖ్య
తెన్ను ముప్పది నాల్గయ్యె వినఁబమంత్రి. 633

ఇఁక నందు గకారముమీఁదఁగల రేఫ లెట్టివనిన, [ల. సా. సంగ్రహము. 3-2.]

సీ. గురువులు పారఁగ గరుడాళ్వె మేఁగొర
గరువతనము గణఁగిరి గురువుగ
గురుసులు గురుగు రెగిరివడి గిరగిర
గురుసు పింగారము గరగ గరిత

---

633. [1]పాఠము సరిలేదు. పోల్చుకొనుటకు పాఠాంతరము ఉపలబ్ధము కాలేదు. లక్షణసారసంగ్రహమున 8 పాదములే కలవు, ఎత్తుగీతిలోఁ గడపటి రెండు పాదములు మాత్రము కలవు.

633. [2]పెద్ద ఱకారసంఖ్య. (ల. సా. సం. పాఠము) బండి రకారసంఖ్య. (ల. శే. వ్రాఁతప్రతి.)

గారాము వ్రగ్గిరి గరిసెఁడు బంగారు
గురుగులు గరువము గోరమవఁగ
విరువదియొక రేఫ లివి గకారముమీఁద
గఱపుట కొఱియల గఱచి పగఱ

తే. గుఱుతు, గీఱట గఱి గుఱి గొఱక గొఱిజ
గిఱక గఱగులు గుఱగుఱ గుఱుగు గఱిసె
గఱులు దగ్గఱి గిఱుమెట్లు గుఱుక గిఱికొ
నె నన నాలిరువది గోపరివి పవిలజ. 534

ఇఁక చకారముపై రేఫ లెట్టివనిన —

[లక్షణసారసంగ్రహము. 3-22]

సీ. చేరువ తెచ్చిరి చెచ్చెర చేరిరి
చెరుపుటచ్చెరువును జేరకయనఁగఁ
జేరవ యచ్చరలనఁ జూరెయచ్చరియము
చిరిమేనవచ్చిరి చెరిపిరి యనఁ
జిరుగవి చెరఁగుల చీరలు విచ్చిరి
యనరేఫలివి పదునెనిమి దయ్యెఁ
జిచ్చఱపిడుగును జిచ్చఱకును జేఱు
చిఱుకొట్టు చిఱిమి ముచ్చిఱితనంబు

తే. చూఱ విడుచుట క్రచ్చఱ చుఱచుఱ యనఁ
గఱులు చఱచుట చిఱుపులి గట్లచఱులు
చెఱలుడియు నేలచఱచుట చెఱవిడుటయుఁ
జెఱిసగము చుఱుపుచ్చుట చెఱిగొనుటయు. 535

వ. మఱియును, 536

[లక్షణసారసంగ్రహము. 3-23, 24]

ఉ. చెఱకు విల్లు చెఱపుసేయుట చెఱుచుట
చెఱువు చిఱునగవును జిఱుత యనఁగఁ

ఱాఁకు మట్టెనఁగ క్షోణి నిర్వేదియైన
దపరమైన ఱాలు శంభు తనయ. 537

వ. ఇఁక ఱకారంబుపై రేఫలు లేవు. 538

ఱకారము లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-25]

తే. ఱఱి ఱెఱిపోఁతు ఱఱఱఱ ఱాఱెననఁగ
ఱఱిగొఁవియె ఱాఱుపుచ్చుట ఱిఱిఱిఱియన
ఱొఱఱొఱ యనంగ [1ఱాంఱాఱు నెఱులనంగ]
తొమ్మిదివి ఱకారంబుపై దొడ్డఱాలు. 539

ఇఁక నందు తకారమ్ముపై రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-26]

సీ. తరిచాడె తరిమిడి తరువఁగాఁ దరచుట
తిరుగుట తిరియుట తిరము తెరువు
తెరలుట తరలఁగ తరఁగ తరతరము
నేర్తురు తోరమ్ము నెత్తురనఁగఁ
దెకతేర వత్తురు తేరా సుగంధంబు
తొరుగుట తరమించి తొరలిక యనఁ
దూరుపునాఁటను సేరంగనేర్తురు
తిరవికిన్కఁబల్ తెరఁగువనులు

తే. తెరలఁగాఁగాఁచు నెయ్యి కస్తురికి నమము
తిరుపైఁ జిత్తరువు బొమ్మ తారు గవిరి
తెరయుఁ దొరితొరి వాంత్రరుదెంతు రనఁగఁ
దపరరేఫ లీక్షణమరుద్బంధులు హరి! 540

ఇఁక తకారంబుపైఁ గల ఱకారంబు లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-27]

సీ. తెలివలు పాతెలల్ తెలచిరి యేత్తెలు
తెలఁగుగల్గుటయును దెలవు లనఁగ

---

539. 1 ఈ భాగము ముద్రిత లక్షణసారసంగ్రహమున లుప్తము.

దఱుగుట తక్కువ తఱుగుట వెల్తియుఁ
దఱుగుట ఛేదనార్థంబు నయ్యెఁ
దఱియగు నత్తఱిఁ దఱచగు తఱిగొని
తొఱఁగువడుటయును దుఱఁగలింపఁ
దఱముచుఁ దొఱఁగమిఁ దొఱఁగులు పోవుచుఁ
దొఱఁగిన తావియుఁ దొఱఁగె ననఁగఁ

తే. దటగు తుఱుమును దిఱియును దాఱటనఁగఁ
దూఱు తటముచుఁ దటలనఁ దేఱుదురనఁ
దేఱికనుఁగొనఁ దఱులనఁ దేటమి యనఁ
దఱియఁ జొఱుమనఁ దీటగఁ దఱికి ననఁగ. 541

వ. మఱియును, 542

[లక్షణసారసంగ్రహము. 3-28]

తే. తిఱుగఁజేయుఁడు తొఱలను దఱగదీర్చఁ
కన్ను తెఱచుట మఱితెఱగన్ననంగఁ
దఱిమి యనిపేసెఁ దెఱఁగొప్పఁ దఱిగొలుపనఁ
దపరములతాలు దృక్పముద్రము లవిలఱ. 543

ఇఁక దకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-29]

సీ. దురదుర జాదరి దొరలెల్లఁ గుదురుగ
దొరకోలు దురమాట దొరయఁదనుట
దురపిల్లు చెదురుట దొరకొల్పు దొరకొంట
దూరులు దరిద్రొక్కి దొరపి రనఁగ
దరికొనె ననఁ బంచదశ రేఫ లవియయ్యె
ముందటి కాలంబు ముందతేదురు
నం దొటలించెద రందఱు మిద్దఱు
మెందఱు వదఱుట కొందఱనఁగ

ఆ. నెద్దికా యనంగఁ బెద్దఱికం బన
[1]నంద తెన్నఁగాను నింద అనఁగ
బందికాలసంఖ్య పదుమూఁట నగునెన్న
దపరమునను గల్గి తరుచరాఢ్య. 544

ఇఁక నకారముపై రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-30]

సీ. నరములు నరలును నారులు నేరమి
పీరును వోరును నారనములు
నెరసులు విలునారి నేరుపులున్నారు
నేరేరనంగఁ గన్నార మనఁగ
నేరేళ్ల మరుగులు నెరయంగఁ జల్లుట
నేరక యన వివిన్నియు నవర్ణ
పరము న ప్తదశ రేఫలు నఱినొప్పుట
నఱయంగ నెఱిదప్పి నఱిగొనెనన

తే. నెఱియు నెఱసియు నెఱమంట నెఱఁకులనఁగ
మఱముగా మఱమాడెను నెఱసరి యన
నెఱవు నెఱకూరె మఱపాడె నెఱపె ననఁగ
పీఱపైఁ గవిసిన విప్పు మాఱు పదులు. 545

వ. మఱియును, 546

[లక్షణసారసంగ్రహము. 3-31]

తే. వాఱు విరుచుట నెఱిలేక నూఱటనఁగ
పీఱుగాఁజేయు నెమ్మెలు నెఱపకనుట
నెఱపుగను నెఱివెంద్రుకల్ నెఱమొగమన
నెఱబిరుదు నెఱవాదులు నెఱిచెడ కన. 547

వ. మఱియును, 548

544. [1]నందలు తెన్నంగ నిందలనఁగ. (ల. సా. సం. పాఠము. గణ భంగము.)

[లక్షణసారసంగ్రహము. 3-32]

తే. నెఱికెగట్టుట ఏఱుపేద నెఱవువిడిచి
నెఱికె నెఱనారసము వాఁడె నఱుజుపేను
అదిగో నెఱత్రోవ నుఱుమయ్యె నవ నవర్ణ
పరము తాలు [1]ముప్పదియాఱు పవనతనయ. 549

ఇఁక పకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-33]

సీ. పరఁగనఁ బరువడి పరికింపఁ బురుడిదు
పురుడు సూతక మగుఁ బొరక యనఁగ
బరిమార్చిరి యన దెప్పర మిప్పరుననఁగఁ
బొరిపొరి పరుననఁ బొరిగొవి రనఁ
బురపురఁ బొక్కంగఁ బొంపిరి పోరఁగాఁ
బెరిఁగె వర్ధిలె ననఁ బెరుఁ గనంగఁ
బరిచనుదెంచె నేర్పరి పెనుపరి పోరి
పోరితం బనఁగను బొరలితి మనఁ

తే. బరపుగలచోటఁ బరపులు పరుసములును
బేరునామంబు పరుసంబు పోరచి యనఁ
బెరడనఁగ దొడ్డి పరితేనె పెరయనంగ
బేరె నెయ్యనఁ బరిగొనె బేరుర మన. 550

వ. మఱియును, 551

[లక్షణసారసంగ్రహము. 3-34]

తే. పొరుగు చప్పరంబును బొరపొచ్చెము పురి
కొల్పుపోరామి పొరిగడుగు పిరిగొనుట
పొరయ పీపవర్ణోపరిఁ బొలుచు రేఫ
లెన్న నలువదిరెండయ్యె వినజమంత్రి. 552

549. [1]ముప్పదియేడు. (అ. శి. వ్రాఁతప్రతి. శా.)

ఇఁక ఱకారము లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-35]

సీ. పఱచెను వేగంబ పఱపెద పఱపితి
 పఱివోయెఁ బఱచిన పాట్లనంగఁ
బిఱికితనమున నంపఱ పఱియలనఁగఁ
 బఱిగొని పఱిమార్చెఁ బిఱుసని యనఁ
బఱివఱిగాఁ జేయఁ బిఱుఁదనఁ దొఱచ్చెను
 బెఱమూఁక పెఱచేతఁ బఱపనోపఁ
బిఱుఁదికిఁ బాఱెఁ జూపఱ పఱివోయెను
 బెఱిగినచందంబు పిఱుఁదు లనఁగఁ

తే. బఱవక పఱచు పాఱించుఁ బఱవుటనఁగఁ
బాఱుఁడన విప్రుఁడంబులు పాఱుటయును
బొఱకవురియలు తెప్పఱ పఱిపఱియలు
పెఱకెఁ గోఱలు పెంపఱ పొఱయనంగ. 553

వ. మఱియును, 554

[లక్షణసారసంగ్రహము. 3-36]

తే. పెఱిగె నట్లనఁ బిఱిపెడి పెఱికివచ్చెఁ
బఱపయినపట్ల బఱచిరి పఱవ వనఁగఁ
బఱిక గఱుపాఱెఁ జిక్కుఱపఱచి రనఁగ
ప¹పరములు ఱాలు గఱిగతుల్ పవనపుత్ర. 555

ఇఁక బకారంబుమీఁది రేఫ లెట్టివనిన [లక్షణసారసంగ్రహము. 3.37]

సీ. బూరుగుచెట్టగు బూరుగ వాద్యంబు
 బేరంబు ¹బిరదయు బేరజములు
బరిగట్టె బారెఁడు బరవసంబును బారు
 బారమ్ములేపిరి బారివడియె

555. ¹పపరమయిన ఱాల్పుగతిసతుల్ పవనతనయ (ల. సా. వ్రాఁతప్రతి.)

556. ¹బిరడయు. (ల. సా. సం)

ఱూరెలు ఱోరలు ఱోరగిలంబడె
ఱోరవి [2]ప్రమోపెను ఱూరటిల్లె
ఱురుజులు [3]గజ్జెలు ఱెరసెనుఱీరమ్ము
ఱరిమైవి ఱరులుబ్బె ఱరువు ఱరదు

తే. ఱిరుదు ఱురఱురఁ ఱొంగె విబ్బరము నబ్బ
రం బనఁగ నివి యీ ఱవర్ణంబుపైని
సప్తవింశతి రేఫలు జరుగునయ్య
[4]అనిలసుత ! సేవకవిధేయ ! అంజనేయ ! 556

ఇఁక ఱకారమ్ములు, [లక్షణసారసంగ్రహము. 3-33]

తే. ఱుసుముట్టించె ఱుసులు ఱులులెందు
ఱు [1]ఱు నెఱపిపైచె దబ్బఱు లనంగ
ఱుఱుఱన పీడ్చె ఱుపోయెఁదనియన నివి
ఱవరముల తాలుగిరి సంఖ్యఁబరఁగె హనుమ ! 557

ఇఁక మకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-39]

సీ. మురిసెను దొండ మామరదంతికిని నన
మొరపతాలుమ దేంట్లు మొరసె ననఁగ
మారట మూర్తులు మేరలు దప్పిరి
మారిమనఁగుటను మోర లనఁగ
మురియలు తునుకలు మరియాదక్రమ్మరి
మరిగించుకొమట వేమా రనంగ
మరలుట మది మేర మెరమెరవసమరె
మురిపెంబు తామరల్ మురమురయవ

---

556. [2]పోశను.

[3]గజ్జులు. (అ. శి. వ్రాఁతప్రతి పాఠములు]

[4]యాజిసుత సేవకవిధేయ యాంజనేయ. (ల. సా. సం.)

557. [1]ఱునఁద్రిప్పిపైచె. (ల. సా. సం.)

ఆ. మరులుదుపుట మొరదు మారేళ్ల మిరియంబు
సుమ్మర యనఁగ్గె సౌరిది మన్న
మవర రేఫలౌను మఱి యెంచి చూడంగ
విరువదియును నాల్గు హరకుమార! 558

మఱియు మకారముమీఁది ఱకారములు, [లక్షణసారసంగ్రహము. 3-40]

సీ. మఱి మేఘపుమెఱుఁగు మెఱచునౌకోయని
మఱతుఱు మెఱుఁగెక్కె మొఱపి యింక
మాఱట నోళ్లను మఱచి దిక్కులుసూచి
మఱతును నేనును మాఱడుగుట
మిఱిమొండె మనుటయు ముమ్మాఱు వేమాఱు
మెఱములు పైచెను మొఱయిడిరన
మొఱఁగుచు మఱచిన మఱువక మఱియును
మిఱుమిట్లు గొనియును మెఱయు మెఱపి
తే. మీఱు మీఱియు మెఱములు మెఱుఁగులనఁగ
మఱపు ముఱిముఱి చీఁకటి మఱుఁగు మఱఁది
మఱుఁ గ్రమ్మఱి పల్మఱు మాఱియనఁగ
మాఱుమొగమును మఱపు నేమఱియనంగ. 559

[లక్షణసారసంగ్రహము. 3-41]

తే. మాఱుపడుటయు పెరమఱి మఱఁదలనఁగ
మొఱకు మఱునాఁడు మిఱుచూపు మఱుఁపుకొనుట
మయిమఱువులను మఱలేక మఱుకు వనఁగ
మపరమున ఱాలు మువిగతుల్ మారుతసుత. 560

ఇఁక రేఫ రెట్టివవిన, [లక్షణసారసంగ్రహము. 3-42]

ఆ. రేయి రిచ్చ రిత్త రేయెండ రెండవ
రూడిరేకు రాదు రూపు రమణ
రమ్ము రార రోఁజ రాగిల్లి రాచూరి
రవ్వ రాయిడియును రాలటయును. 561

[లక్షణసారసంగ్రహము. 3-43]

తే. రారు రాయంచ రాయుచు రాయుటయును
రక్కసియు రోయు రూపింప రంకెలనఁగ
రూపెదను (రేపు) రాతిరి రుచియనంగ
*ముప్పదర్ణముల్ రేఫాది నొప్పు హనుమ. 562

ఇఁక ఱకారములు, [లక్షణసారసంగ్రహము. 3-44]

ఆ. ఱేఁడు ఱెప్ప ఱొదు ఱివ్వన ఱంపిల్లి
¹ఱిక్క ఱెక్క ఱేసు ఱేపు ఱేవు
ఱవిక ఱట్టు ఱంతు ఱాఁగ ఱంకించుట
యనఁ బదేను ఱాదులయ్యె హనుమ. 563

ఇఁక వకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-45]

సీ. వారించు వారికి వారకంబుగ విరుల్
వారక యిందు నెవ్వరికి నీకు
వరిపంట తలవరుల్ వరున వార్వురు గాచి
వేరంబు వెరవున వెరసు విడిరి
వరవళ్ విరవిర వారవిపేరల
విరియంగఁ జల్లిరి విరియుటయును
గాల్వురు విరువురు వల్వురు నెవ్వరు
వీరల వరిటంబు వారువములు

---

562. * "రూపెదను రాతిరి రుచియనంగ" అను ల. సా. సం. పాఠమును గ్రహించిన 29 పదములే వచ్చును. ల. శి. సవరింపఁబడిన "రూపెదను (రేపు) రాతిరి రుచియనంగ" అను పాఠమును గ్రహించిన ముప్పది పదములు వచ్చును.

5°3 ¹ఱెక్క ఱేక ఱేను ఱేవు ఱవిక
ఱట్టు ఱంకె ఱాఁగ ఱంకించు ఱొఱుఁగ. (ల. శి. వ్రాఁతప్రతి)

తే. వరుజా గట్టిరి యొవరి వారకులన
వీరలన దేవరన సాటి వేరియవఁగ
వరుసనంగను విన్ని వవర్ణపరము
రేఫ లివియయ్యె ముప్పదిరెండు హనుమ. 584

[లక్షణసారసంగ్రహము. 3-46]

తే. వఱలె ననఁగను వేడుక విఱిగె విల్లు
వెఱఁగుపడి యాఱి విఱఁగుట విఱిచెననఁగ
వెఱమృగంబులు వెఱవెఱ వెఱచఱవఁగ
వఱదు గూసెను వేఱొక వెఱగుకోఁడ. 585

తే. వఱుతఁ ద్రోవఁగ విఱివిది వెఱచి వఱలి
వఱద యనఁగను నెందిన వఱుగనంగ
నమరు విఱిగాలి విఱిపొల్లు ననవవర్ణ
పరము ఱాలివి యిరువదో పవనతనయ! 586

ఇఁక సకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-48]

తే. సరకు సెరబడి సైరణ సరులనంగ
సరుకు సేయక సురఁగిరి సొరిది యనఁగ
సురియ సోరనగండ్లును సూరెలనఁగ
సారెసారెన సొగటాల సారెలనఁగ 587

[లక్షణసారసంగ్రహము. 3-49]

తే. సిరియనంగను లక్ష్మియౌఁ జేసిరనఁగ
నేసరుల నెక్కి తనసరి నేసిరనఁగ
సప్తదశరేఫలయ్యె సాక్షరముమీఁద
జానకీ జాని చరణాబ్జ చంచరీక 588

[లక్షణసారసంగ్రహము, 3-50]

క. మును తన్నయభట్టాదులు
మునుకొని రేఫలు ఱకారములు కృతులం గా

ర్చిన పలుకులేర్పరించితి
మనలిఁక మఱి గలిగెనేని గైకొనఁగఁదగుఁగా. 569

అన్నారిఁక మదీయము —

తే. రేఫలు, ఱకారములు చెప్పలేక కాదు
చిత్రకవి పెద్దనార్యుండు చేసినట్టి
లక్షణమె యేను లక్ష్యంబు వ్రాసినాఁడ
మనల లక్షణములు వ్రాయఁ జనుటఁగృష్ణ! 570

మఱియు నీరేఫ ఱకారంబులకు నన్నలక్ష్మగారు ఆంధ్రకవిచింతామణి యందు శ్లోకము —

శ్లో. †లఘువళ్ళిః శైలాగ్నియోఽన్యేఁ గజదర్శిషః
లఘుర్నాస్తి ఱకారస్యా లఘుస్సస్య క్వచిత్ క్వచిత్. 571

శ్లో. *తత్సమగస్తద్భవగో దీర్ఘైకాక్షర గశ్చరేఫస్స్యాత్ ;
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్. 572

వ. టీక - శిఖిశైలాగ్ని = ౩౭౩ తేలిఁగున రేఫలున్ను, అగజ దర్శిషః = ౫౧౮ ఱకారములున్ను కలిగియుండును. ఱకార పరాన రేఫ లేదు. సకార పరాన బండీ ఱకారము లేదు. తద్భవ తత్సమ పదములతోనున్ను, దీర్ఘ ఏకాక్షర పరాననున్న బండి ఱకారము రాదు. రేఫ ఱకారములకు యతిప్రాసశ్లేష లకు విరుద్ధము అన్నారిది రేఫ ఱకారపద్ధతి. సమాప్తము.

శ్రీశ్రీశ్రీశ్రీ శ్రీఁజేయునూ. 573

571. †ఇది అథర్వణకారికావళిలోనిది. [సంజ్ఞ. 24]

572. *ఇది యార్యావృత్తపాదమేకాని ఆంధ్రశబ్దచింతామణి ముద్రితప్రతి యందుఁ గానరాదు. బాలసరస్వతి యాహోబలపండితీయములలో వ్యాఖ్యాతము గాదు. 'నాన్యేషాం' అనునది ఆం. శ. చిం. లోఁ గలదు. [సంజ్ఞ. శ్లో. 10]

ఱఁక నందు,

## విభక్తి పద్ధతి లక్షణము

క. వెలయు నిడఁ బులక లలకలు
పులకము లలకములు హంసములనఁ హంసం
బులు నా హంసలనఁ దరం
గలనఁ దరఁగములనఁ దరఁగలనఁ కృష్ణా! 574

పులకలన్నందుకు ప్రయోగము [1]ప్రబంధ పరమేశ్వరుఁడు, ఆరణ్యపర్వము గీతిపాదమున లక్ష్యము. [7-33]

ఆ. ఆ మనోజ్ఞరత్న మక్కునఁ గదియించి
పులక లెగయఁగొంత ప్రొద్దు విభుఁడు
జానకీకుచాగ్ర సంగమ సుఖుఁడై
నట్లయుండె ముకుళితాక్షుఁడగుచు. 575

'తరగల'న్నందుకు ప్రయోగము భాస్కరరామాయణము శార్దూల వృత్తము ౩-వ పాదమున లక్ష్యము, [యుద్ధ. ప. 142]

శా. జ్యా ఘోషంబు నిరంతరం బగుచు మ్రోయం బెల్లుదంభోళి ధా
రాఘోరాస్త్ర పరంపరల్ దరఁగలై రాజిల్ల నాపూరితా
మోఘావృత్తి(ఁదనర్చు రామధనురంభోరాశి దోర్విక్రమ
శ్లాఘాగాథము వేఁడు ముంచుఁబెలుచఁ లంకాపురీ ద్వీపముఁ.) 576

అందు హంస లన్నందుకు శబ్దశాసనుఁడు, ఆరణ్యపర్వము కందము ౩-వ పాదమున లక్ష్యము, [2-18]

క. దమయంతికి నలునకు సం,
గమ కారణదూతయైన కలహంస మనో
జ్ఞ మనుష్య వాక్యముల న
ద్దమయంతికి హర్షమెనఁగఁ దావిట్లనియెఁ. 5!7

---

5`5. [1]శబ్దశాసనుఁడు. (అ. తి. ప్రాఁతప్రతి)

'హంసలు' అన్నందుకు సోమయాజి కర్ణపర్వకందము ౪-వ పాదమున లక్ష్యము, [2-80]

క. బలశాలియైన హంసముఁ
బిలిచితి పురుడించి సారె బేలఁ దనమునన్
[1]గలవేయింతకుమును హం
సలతోఁ బురుడించు వాయసంబులు జగతిన్. 578

రామభద్రయ్యగారు, [కవిజనసంజీవని. 2-1]

తే. స్త్రీత్వము విసర్గలోపంబు వెలయుచోటఁ
జను మకారాంతశబ్దంబు తెనుఁగుసేయ
రఘు రఘువు బాహు బాహువు రాహు రాహు
వూరు వూరనమతి మేరు మేరువనఁగ. 579

అందు రఘువన్నందుకు ఆదిపర్వము శబ్దశాసనుఁడు మత్తేభము ౩-వ పాదమున లక్ష్యము, [2-221]

మ. రజనీనాథకులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ దయతోడ ధర్మచరితన్ బాలించుచున్ దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ బృథుగయున్ మాంధాతృరామున్ రఘున్
విజయున్ బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా. 580

'బహు' శబ్దమునకు ప్రయోగము సోమయాజి విరాటపర్వము గీతి ౨-వ పాదమునను లక్ష్యము, [2-7]

తే. వేల నాలుగు చెఱఁగుల నృపుల కొలువు
లందు నేను వర్తించితి భువనినాథ!
అగ్గలించి నాయెదుట బాహువ్వళించి
కడఁగఁ జాలిన మల్లులఁగాన నేను. 581

578. [1] కలడే. (అ. శి. ప్రాఁతప్రతి పాఠము)

'రాహు' శబ్దమునకు ప్రయోగము సోమయాజి (*శల్య)పర్వము శార్దూలము ౪-వ పాదమున లక్ష్యము, [2-240]

క. ఉర్వీచక్రము వడఁకెన్
దర్పము లేకయును రాహు, భానుని బట్టెన్
పర్వతములురిలెవరకుఱు
సర్వదిశలనలిచెనభము శర్కరలు గురిసెన్. 582

'ఊరు' అన్నందుకు ప్రయోగము సోమయాజి కర్ణపర్వము శార్దూలవృత్తము ౪-వ పాదాది లక్ష్యము, [3-210]

శా. లీలన్ గేల నమర్చు మత్తగజకేళీ సుందరోల్లాసమా
లీలత్వం బొనరంగఁ ద్రిప్పుఁ జదలన్ బృథ్వీస్థలిన్ వ్రేచు ముం
గాలన్ ద్రోయు మొగంబు ద్రేయు దిశలుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ
కాలూరుల్ పయిఁ గ్రమ్ము లేచు మెడ చిక్కన్ ద్రొక్కు నిల్చున్న గున్. 583

'మేరు' అన్నందుకు ప్రయోగము పాండురంగమహాత్త్వము శార్దూలము ౧-వ పాదమున లక్ష్యము [1-8]

శా. మీఁదం దారధరాధరంబుగల యా మేరున్నగంబాలి త
త్పాదృక్తుండ రుచిం దలిర్చు ఖగయూథస్వామి హేమ ప్రభా
ప్రాదుర్భావ శుభప్రభుండు మనుచున్ రామానుజామాత్యశ్రీ
వేదాద్రీశు విరూరి మందిరు జగద్విఖ్యాత [1]చారిత్రునిన్. 584

రామభద్రయ్యగారు లక్షణము [కవిజనసంజీవని. 2-15]

క. పరఁగున్ గొప్పిటఁ దీర్ఘ
స్వరమైన పదంబు పురుషపదవాచకమై
యురగులు సముద్రుఁడనఁగా
నరగములు సముద్రమనఁ బయోజదళాక్షా! 585

582. *కర్ణపర్వము అ. శ. వ్రాఁతప్రతి.

584. [1]కీర్తిశ్వరున్. (పాండు.రంగ)

